# మనుచరిత్రము.



వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

 [Rs. 5—0—0

# పీఠిక

ఉ. తల్లి సమస్తభాషలకు దైవతభాషయ; దేశభాషలం
పిల్లలలోన నాంధ్రి యనుపేరిటి దెంతయు ముద్దులాఁడి రా
ట్తల్లజు లాదరించినకతంబునఁ బల్కులఁ గుల్కుమీఱె య
ల్లల్లన దక్కు నక్కసెలియంద్రకు నెక్కుడుకీర్తి చేకొనెన్.

క. జిలిబిలిపలుకులఁబలుము
ద్దులు గులికెడు తెలుఁగుబాసతో సరి యగునే
తెలిసియుఁ దెలియక వీనుల
నలయించెడు వెట్టిమొట్టి యఱవుఱబాసల్.

సంస్కృత మనిపేర్కొనఁబడిన యార్యభాషయే తొలు దొలుత భరతఖండమునఁ బెంపొందినవాఙ్మయము. చాల వఱకు దానివలననే తర్వాతఁ బ్రాకృతములును దేశభాషలును బెంపొందినవి. దక్షిణహిందూదేశమునఁ గల దేశభాషలలో నాంధ్ర ద్రవిడ కర్ణాటభాషలు ప్రధానము లయినవి. ఇందు ద్రవిడ కర్ణాటభాష లాంధ్రమునకంటెఁ బ్రాచీనము లని యూహింపఁ బడుచున్నవి. ఆ రెండుభాషలలోను గ్రంథములు రచింపఁబడుచు వచ్చిన కొంతకాలమునకుఁగాని యాంధ్రభాషలో గ్రంథరచన ముపక్రమింపఁబడినట్లు చూపట్టదు. గ్రంథరచన ముపక్రమింపఁ బడుటకుఁబూర్వ మాంధ్రభాషస్థితి యెట్టిదో మన కించుకయుఁ దెలియరాదు. ఇటీవల నాంధ్రకవితకుఁ బుట్టినిల్లనఁ జెల్లిన వేంగి దేశమునం దానాఁడు జన్మించిననాగవర్మ కర్ణాటభాషకు ఛందోంబుధి యనుఛందశ్శాస్త్రగ్రంథమును రచించె; కాని యాంధ్రభాషయందుఁ బుస్తైన నెత్తఁ డయ్యె. నాఁటి కీభాషకుఁ దిన్ననిరూ

వేర్పడలేదు కావలయును. ఆకాలమున మనదేశమును జాళు క్యులు పాలించుచుండిరి. ఆర్యధర్మము నిర్వక్రముగా సాగింపఁ బడుచుండెను. జనులకుఁ బురాణాదిజిజ్ఞాసయుం దాదరము మెండుకొనియుండెను. వారు సంస్కృతభాషాగ్రథితములైన తత్తద్గ్రంథములను 'గాసటబీసటే' చదివి గాథలు ద్రవ్వు చుండిరి. రానురాను దేశభాషకును గొంత రూపేర్పడుచుండఁ బోలు. అక్కాలమున నత్తఱి దేశభాషాకవన మావశ్యక మయ్యెను. అయినను దానికిఁ దగినసామగ్రిని గూర్చి కవితను వెలయించు వా రవతరింప వలసియుండిరి. ఇట్లు సనఁ జన,

క. మును మార్గకవిత లోకం, బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్రవిషయమునఁ, జనసత్యాశ్రయుని దొట్టిచాళుక్యనృపుల్.
నన్నెచోడుని కుమారసంభవము.

దాదాపు నేఁటికి వేయిసం॥ లకు బూర్వము చాళుక్యా న్వయభూషణమును సత్యాశ్రయాదిబిరుదాంచితుఁడును రాజ మహేంద్రము రాజధానిగా వేంగీదేశమును బాలించినవాఁడును నగు రాజరాజనరేంద్రుని యాస్థానమునఁ గల సర్వజ్ఞుఁ డగు నన్నయభట్టారకుఁ డనుపండితకవియే మన యాంధ్రభాషలోఁ దొలుతఁ గవిత నవతరింపఁజేసినవాఁడని తలఁపబడుచున్నాఁడు. రాజరాజనరేంద్రుని ప్రేరణమున నీతఁడు పంచమవేద మగుభార తమును దెల్గున రచింప దొరఁకొని యరణ్యపర్వములోని కొంత భాగమువఱకును నెఱవేర్చెను. ఈతనికవనమున సంస్కృత మర్యాదలు మెండుకొనియుండును. నుడికారముగల తెలుఁగుఁ బలుకుబడులఁ గూర్చుటయం దీతఁడు తక్కువవాఁడు కాఁడు.

చ. బహుళవన పాదపాబ్ధికులపర్వతపూర సరస్సరస్వతీ
సహితమహామహీభర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి దు

స్వహితరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్య యైనయ
య్యహిపతిదుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

గీ. ఎల్లవారు నెఱుఁగ నొల్లనిధర్మువు, చేల! నీకుఁ జెప్పనేల వలనెఁ
జిఱుతవాని కింత తఱుసంటిపలుకులు, సన్నె వృద్ధజనము లున్నచోట.

పదపడి కవిబ్రహ్మ నాఁబడుతిక్కన విరాటపర్వము మొదలుగా ౧౫ పర్వముల భారతమును దెలుఁగుకావించెను. తెలుఁగుఁ బలుకుబళ్లను సుబాళింపఁజేయుటయం దీతని కీడు మఱి లేఁడు. ఈతనికవనమున రసపోషకములు కానిపదములు సాధారణముగాఁ జూపట్టవు.

ఉ. చిచ్చఱకన్ను మూసుకొని చేతిత్రిశూలము డాఁచి లీలమై
వచ్చినరుద్రుచందమున వ్రాలుదు వీ వనిలోన నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టియుగవారికి నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి నెవ్విధిం గెలువ వచ్చు మహాత్మ! యెఱుంగఁ జెప్పవే.

తర్వాత నీయిర్వురకుఁ దుల్యుఁ డనఁదగువాఁ డెఱ్ఱాప్రెగ్గడ. ఈతనికృతులం దరణ్యపర్వశేషపూరణ మొకటి.

చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనము ల్సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్.

ఈముువ్వురను గవిత్రయ మందురు. వీరివాక్కు లాంధ్రభాషకుఁ బరమప్రమాణములు. ఇట్లాంధ్రభారతము ముగియు నప్పటికి దాదాపు 300 సం॥ పట్టెను. ఈనడుమను గొందఱు మేటికవు లితర పురాణాదులను దెలిఁగించుచు వచ్చిరి. ఇట్లు రానురాను గ్రొత్తత్రోవలు త్రొక్కి కవనమున మార్పులు గలిగించినవాఁడు కవిసార్వభౌముఁడు నాఁబడు శ్రీనాథుఁడు.

ఈతఁడు తొంటివారివలెఁ జాలమట్టునకు సంస్కృతగ్రంథములనే తెలిఁగించినవాఁడయ్యెను గూర్పునందు మార్పు కలిగించి తర్వాతి ప్రబంధరచనకు మార్గదర్శకుఁడయ్యెను. *సీసపద్యములు రెుయ్యారపునడకలు మొదలగునవి యాతఁడు నెలకొల్పినవే. శ్రీనాథునితర్వాత నాతనిచరణముల నందుకొనక కవిత సెప్ప నేర్చినవారు లేరు. శ్రీనాథునికాలమునకుముందే యవనుల యలజడి కలుగుచు వచ్చుటచే వారియాచారవ్యవహారములును గొన్ని మనదేశమున నెలకొనఁ జొచ్చినవి. కావున నాకాలము నుండియుఁ గవులు తమకవనమునఁ గొన్నియన్యదేశ్యపదములు రుచివిశేషములంబట్టి యందందుఁ బొందుపఱుచుచు వచ్చిరి. మచ్చున కొకటి యుదాహరింపఁబడుచున్నది.

ఖుసిమీఆబ్ సురథాణి నిండుకొలు వై కూర్చున్నచోన్.

శ్రీనాథునిహరవిలాసము.

కొందఱు

సీ. వచ్చని హౌరుమంజి పని...సైంధవంబు. మను. ఆ. 4 ప. 28.

ఈ మొదలగు పద్యములలోఁ బెద్దనయే తొలుదొలుతఁ జొప్పింప మొదలిడె ననిరి.

పదపడి శ్రీనాథుఁడు చూపినత్రోవఁగొని సంస్కృతగ్రంథములఁ దెల్గించుటయ కాక పురాణకథలఁ గైకొని స్వకపోల కల్పనలఁ గూర్చి చతుర్దశవర్ణనలతో మిశ్రప్రబంధములను

---

* శ్లోకపద్యశబ్దములు సమానార్థకము లయ్యెనవి యాంధ్రభాషాసంస్కృతభాషాగ్రథితములకును నాంధ్రభాషాగ్రథితములకును వ్యవహరింపఁబడుచుండునట్లే ప్రబంధపదము భారతాదిసర్వగ్రంథవాచక మయ్యు కతిపయమిశ్రకావ్యాద్యన్యతరమగు నితివృత్తముతోఁ జతుర్దశవర్ణనలఁగూర్చి రచింపఁబడు కావ్యమునకుఁ బేరుగా వాడఁబడుచున్నది.

పర్వాతికవులు రచింపనారంభించిరి. ఆ కాలమున నుత్పాద్యమగు నితివృత్తముతోఁ గృతిసెప్పుట తప్పుగాఁ దలఁపఁబడుటచేఁ గావలయు నాంధ్రమున నేకవియు దానికి దొరఁకొనినవాఁడు కాఁడు. అట్లు శ్రీనాథునకుఁ దర్వాత మిశ్ర ప్రబంధములు రచించిన వారిలోఁ దొల్లిటివాఁ డనఁదగు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి యీవిషయము నిట్లు వాక్రుచ్చెను.

శా. ప్రఖ్యాతం బన మిశ్రబంధ మన నుత్పాద్యం బనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతం బగు వస్తు వందు మఱి యధ్యాహారముం జేయఁగాఁ
బ్రఖ్యాతం బితివృత్త మైనఁ గృతి సెప్పన్ వక్తకున్ శ్రోతకున్
విఖ్యాతిం గలిగించుఁ బుణ్యమహిమన్ విశ్వంభరామండలిన్.

ఈతఁడు భారతమందలి శకుంతలోపాఖ్యానకథను గైకొని దానికిఁ గాళిదాసుని యభిజ్ఞానశాకుంతలనాటకమును దోడుచేసికొని శృంగారశాకుంతల మను ప్రబంధమును రచించెను. శృంగారశాకుంతలము రచింపఁబడిన తర్వాత సర్వోత్కృష్టముగా వెల్వడినమహాప్రబంధము మన యీ

## మ ను చ రి త్ర ము.

దీనికిఁ బ్రధానముగా గ్రంథకర్తపేర్కొన్నపేరు స్వారోచిషమనుసంభవము. అయ్యును మనుచరిత్ర మనునామము కవిచే 'మనుచరిత్రం బందుకొనువేళ' అని యొకచోఁ బేర్కొనఁబడియున్నది, మఱియు లోకమున రూఢమై యున్నది. ఇది చతుర్దశవర్ణనలు గలిగిన యాఱాశ్వాసముల ప్రబంధరత్నము

దీనికిఁ గృతిభర్త కృష్ణదేవరాయలు.

ఈతఁడు బళ్లారిమండలములోని యానెగొందికిస మీపమున నుండిన విద్యానగర మనుపట్టణరాజము రాజధానిగా దక్షిణ

హిందూదేశమున కెల్ల నేకచ్ఛత్రాధిపత్యము నిర్వహించిన శూరాగ్రేసరుఁడగు నృపసార్వభౌముఁడు. ఈనృపాలరత్నము జనించినకాలము సరిగాఁ దెలిసినది కాదు: గాని ౧౫౦౯ సం॥ పట్టాభిషిక్తుఁడయినట్లు కనుఁగొనంబడినది. కృష్ణరాయలు బహువారములు దండయాత్రలు వెడలి నానారాజులను జయించి రాష్ట్రముల నాక్రమించుకొని తురుష్కులముష్కరకృత్యముల నడఁగించి మహారాజ్యవైభవము ననుభవించుటయేకాక సరసకవితావిలాసలాలసుఁడై పెద్దనాదిసుకవీంద్రులపల్కుఁదేనియలఁ జొక్కులఁగొని సంస్కృతాంధ్రములందు మేలయినకవనము చెప్ప నేర్చిన సుకవిరాజశిఖామణి. ఈతఁడు తెలుఁగున విష్ణుచిత్తీయ మను ప్రౌఢప్రబంధమును రచించెను. సంస్కృతమున మదాలసచరిత్ర, సత్యాశ్రీప్రీణనము, సకలకథాసారసంగ్రహము, జ్ఞానచింతామణి మొదలగుగ్రంథములను రచించి నట్లాముక్తమాల్యదలోఁ జెప్పికొనెను గాని యవి నామావశిష్టము లయినవి.*

కృష్ణరాయ లీమనుచరిత్రమునకే కాక ముక్కు తిమ్మన రచించిన పారిజాతాపహరణమునకును, గర్ణాటభాషలోఁ దిమ్మకార్యుఁ డనుకవి రచించిన భారతమునకుఁ గూడఁ గృతిపతి యయ్యెను. ఈతఁడు దండయాత్రలకు వెడలునపుడు వెంటఁ గవీంద్రులసయితము కొంపోయెడువాఁడు.

†ఈతనికిఁ జదరంగపుటాటయందు మిక్కిలి కుతూహల ముండినట్లు క్రింద నుదాహరింపఁబడిన ప్రాచ్యలిఖితపుస్తక

---

* అస్మన్మిత్రు లొకరు జాంబవతీపరిణయ మనుపేరినాటక మొకటి కృష్ణరాయవిరచితము నూత్నముగాఁ దమకుఁ జిక్కిన దని చెప్పుచున్నారు.

† ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమందలి చారిత్రకసంపుటములలో, "నృసింహదేవరాయల కుమారుండు శ్రీకృష్ణదేవమహారాయలు విజయనగర,

భాండాగారమందలి ప్రాచీన విలేఖనమువలనఁ దెలియుచున్నది. ఆంధ్రభాషను మహోచ్ఛదశనందించిన యీప్రభుసార్వభౌముఁడు ౧౫౩౦ సం॥ కీర్తిశేషుఁ డయ్యెను. ఆంధ్రభోజుఁడని ప్రసిద్ధిగన్న యీకృష్ణరాయలయాస్థానమునయర దష్టదిగ్గజములు నాఁబడు కవీశ్వరులలో నెల్ల వయసునందును గవితానైపుణియందును బెద్దవాఁడు మన యీ మనుచరిత్రమునకు

కృతికర్త పెద్దనామాత్యుఁడు.

ఈతఁడు నందవరీక బ్రాహ్మణుఁడు. ఇంటిపే గల్లపానివారు. తండ్రి పేరు చొక్కన. బళ్లారిప్రాంతమందలి దోపాడు పరగణాలోని దోరాలగ్రామ మీతనినివాసస్థలము. కృష్ణరాయలు మను

---

మందు వజ్రసింహాసనారూఢుఁడై పృథివీరాజ్యంబు చేయుచుండగాను పైవ్రాసిన (కోపోలు) గ్రామకరణాలు బొడ్డుచర్ల పెదతిమ్మన్న చినతిమ్మన్న అనే యిద్దఱు అన్నదమ్ములు. వీరిలో పెదతిమ్మన్న అనే ఆయన గ్రామంలో కరణీకం అనుభవిస్తూ వుండెను. చిన్నతిమ్మన్న అనే ఆయన కవీశ్వరసిద్ధుఁడని అనిపించుకుని కృష్ణరాయలవారివద్ద పోయి రాయలతో చదరంగం ఆడుతూ వుండేవాడున్నూ ఆట గెలిస్తే వెయ్యార్లుపరక పందెం చేసి గెలుస్తూ ఉండేవాడున్నూ. అప్పుడు శ్రీకృష్ణదేవమహారాయలు చాలాసంతోషించి కోపోలు గ్రామం సర్వాగ్రహారంగా ధారవోసి యిచ్చి కోపోలుకు ప్రతినామం కృష్ణరాయపురం అనినామం యేర్పరిచిరి. యీచిన్నతిమ్మన అనే కరణం కవీశ్వరుఁడు చెప్పినపద్యం"

క. శతసంఖ్య లొక్కటైనను, సతతము శ్రీకృష్ణరాయజగతీపతితోఁ
జతురంగ మాడి గెల్చును, ధృతిమంతుఁడు బొడ్డుచెర్ల తిమ్మన బళిరే.

ఉ. ధీరుఁడు బొడ్డుచర్ల చినతిమ్మనమంత్రికుమారుఁ డంచితా
కారుఁడు సత్కళావిదుఁడు కౌశికగోత్రుఁడు పద్మనేత్రసే
వారతబుద్ధి నందవరవంశ్యుఁడు సత్కవిలోకనాథుఁ డా
చారసమగ్రవర్తనుఁడు చారువచస్స్ఫురితి నొప్పువాఁ డొగిన్.

చరిత్రమును గృతినందుకొనునప్పు డూరేగించుటకై పెద్ద నార్యునిఁ బల్లకీ నెక్కించి తనచేతితో నద్దాని లేవనెత్తి యాతని యెడఁ గలయాదరాతిశయమును వెల్లడించెనఁట. కృష్ణరాయల యాస్థానమునఁ గల యాకవిపండితమండలిలో నాతనికే గౌరవ మెక్కువ. ఒకప్పుడు కృష్ణరాయలు పసిఁడిపళ్లెరమునఁ గవిగండ పెండేరమును గొనివచ్చి సభాస్థానమున నిడి సంస్కృతాంధ్రము లందు సమముగాఁ గవనము చెప్పనేర్చినవా రిద్దానిఁ గైకొన నర్హు లనఁగా సభ్యులు మిన్నకుండి రనియు దానిపైఁ గృష్ణ రాయలు,

ఉ. ముద్దుగ గండపెండియరమున్ గొనుఁ డంచు బహూకరింపఁగా
నొద్దిక నాకొసంగుమని యొక్కరుఁ గోరఁగ లేరు లేరొకో

అని సగముపద్యముఁ జదివె ననియుఁ బెద్దనామాత్యుఁ డంతట లేచి,

పెద్దనఁ బోలుపండితులు పృథ్విని లే రని నీ వెఱుంగవే
పెద్దన కీఁ దలంచినను బేరిమి నా కిడు కృష్ణరాణ్ణృపా.

అని పూరించి,

ఉ. పూఁతమెఱుంగులుం బసరుపూపబెడంగులుఁ జూపునట్టి వా
కైతలు జగ్గునిగ్గు లెన గావలె గమ్మనఁ గమ్మనన్వలెన్
రాతిరియుం బవల్ మఱపు రానిహొయల్ చెలిగూరజంపు ని
ద్దాతరితీపులంబలెను దారసిలన్వలె లోఁ దలంచినన్
బాఁతిగఁ గైకొనన్వలెను బైదలికుత్తుక లోనిపల్లటీ
కూఁత లనన్వలెన్ సొగసుకోర్కులు రావలె నాలకించినన్
జేతికొలందిఁ గౌఁగిటను జేర్చినఁ గన్నియచిన్నిపొన్ని మే
ల్మూఁతలచన్నుదోయివలె ముచ్చట గావలెఁ బుట్టిచూచినన్
డాతొడనున్న మిన్నులమిటారపుముద్దులగుమ్మ కమ్మనా
వాతెఱదొండపండువలె వాచవి గావలెఁ బంట నూఁదినన్

గాతలఁ దమ్మిమాలిదొరకైవసపుంజనరాగిసిబ్బెపు
న్నే తెలియుబ్బురంపుజిగినిబ్బరపుబ్బుగుబ్బిగుబ్బభాం
ఖుంభల నున్నతాయ సరిపోఁడిమి కిన్నర మెట్లబంతి సం
గాతపుసన్నబంతిబయకారపుఁ గన్నడగౌళసంతు కా
సాతత తానతానలపసం దిపుటాడెడు గోటమీటుబల్
ప్రోతలునుంబలెన్ హాయిపు మొల్లపు గావలె నచ్చతెన్గు లీ
రీతిగ, సంస్కృతంబు రచగించినపట్టున భారతీవధూ
టీతపనీయగర్భనికటీఘనదానసపర్వసాహితీ
ఖ్యాతికనాటకప్రకరభారతభారతసమ్మతప్రభా
పాతసుధాప్రపూరబహుధాగఘుమంఘుమఘుంఘుమార్భటీ
జాతనతాళగొమ్మలయుసంగతిదుంచువిపంచికామృదం
గాకతతేహితత్తహితహోధితదంధణంధాణంధింధిమి
వ్రాతనయానుకూలపదవారసహూహువ్వహూహోరికింకిణీ
నూతనఘల్లు లాచరణమాపురఘ్ఘాళఘుళీమరందసం
ఘాతవియద్ధునీచకచకద్వికచోత్పలసారసంగ్రహో
ద్యాతకుమారగంధవహహారిసుగంధవిలాససంక్తమై
చేతము చల్లఁజేయవలె జిల్లుఁ జల్లవలె స్సనోహర
ద్యోతకగోస్తనీఫలమధుద్రవగోఘృతపాయసప్రసా
రాతిరసప్రసారరుచిరప్రసరంబుగ సారసారెసన్.

అనుపద్యమాలిక నాశువుగా విరచించి చదివెనఁట! దానిపైఁ గృష్ణరాయలు తానై యాంకవిగండపెండేరము నాతని పాదమునఁ దొడిగెను. ఆశుకవిత్వమనఁగా నాలోచనము సల్పియు నెట్టిరసము కూర్ప నగునో యట్టే యాశువుగను జెప్పనేర్చినదిగాని చిత్తకూరుపు గానేరదు. మఱొకప్పు డేదో కృష్ణరాయ లాశువుగా విరచింపుమని కోరఁగా నాతఁడు,

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క
 ప్పురవిడె మాత్మ కింపయిన భోజన ముయ్యెలమంచ మొప్పు త
 ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్
 దొరికినఁగాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే.

అని నిరాకరించెనని చెప్పుదురు.

పెద్దనార్యున 'కాంధ్రకవితాపితామహుఁ' డని బిరుదనామము కలదు. ఈబిరుదము "పురాణకథను గొని స్వకపోలకల్పనలు గూర్చి తొలుదొలుత మనుచరిత్రమును బ్రబంధరూపమున రచించుటచేఁ గలిగిన" దని కొంద ఱందురుగాని యది సరికాదు.

ఇట్టిప్రబంధములఁగూర్చినవారిలోఁ బెద్దనార్యుఁడు తొలుదొలుతటివాఁ డనునది నిలువనేరనిమాట. అంతకుముందే యిట్టి రచనము కలదని తెలిపియున్నాఁడను. ఒకవేళ తొలుదొలుతటి దనియే యొప్పుకొన్నను నీబిరుద మీగ్రంథరచనమును బట్టి వచ్చినదనుట పొసఁగ నేరదు. మనుచరిత్రమును రచింపు మని కోరునప్పుడే కృష్ణరాయలచే,

క. హితుఁడవు... పేర్కొననీకున్. మను. పీఠిక. ప. 15.

అని పెద్దన పేర్కొనఁబడియున్నాఁడు.

కృష్ణరాయలు తనయాస్థానకవులలో నెల్ల వయసుచేతను గవితచేతను బెద్దవాఁ డగుటచేఁ బెద్దనామాత్యున కీ బిరుద మొసంగియుండును. ఈతఁడు మనుచరిత్రమును గాక హరికథాసార మనునే యొక ప్రబంధమును రచించి తనగురువగు శఠకోపయతికిఁ గృతినొసఁగెను. ఆ గ్రంథమునుండి యీ క్రింది పద్యములు రంగరాట్ఛందమున నుదాహరింపఁబడి యున్నవి.

క. అంబరము పగుల నార్చి ప్రలంబాసురుఁ డాగ్రహము వెలయఁగ దిసినచో
శం బలరాముఁడు చేముష్టింబున వానితల ద్రుంచె లావు మెఱయఁగన్.

క. ఆదేవోత్తముఁడు సుధాంభోధి నవై శాగ్రి వదళమున బాలుండై
చేదోయిచేత దక్షిణపాదము గొని నోటఁ జెప్పెఁ బకపక నగుచున్.

క. శతకోపయుతికి ఘనతరు, శతారకోపమమతికిని గురుతమవాక్పృ-
ర్ష రనిరతికిఁ జతురాగమ, పరనాయతనియతికి నజపాసంభృతికిన్.

గీ. అఖిలపారికాంక్షీ కాశ్రయకర్ణకా, లోపకంఠనునకు లోకకర్త
చేర నేఁగి యచటఁ బారవంబునఁ జిక్కి, యధిపసించియుండు నర్థిశోడ.

క. బాలరసాలకిసాలము, గ్రోలుచుఁ బలికెడిపికంబు కో యనఁ జాలం
జాలింబడి యానయమధు, రాలాపము లనియె సాదరణమున వినఁగన్.

ఇది గాక కృష్ణరాయలు స్వర్గస్థుఁడైనపిదపనాతని నిర్యాణమునుగూర్చి సీసపద్యశతక మొకటి రచించె ననియుఁ దామా పద్యశతకము నొకచోఁ జూచియుంటి మనియు మిత్రులొకరు నుడువుచున్నారు; కాని యది లభించినది కాదు.

సీ. ఎదురైన చోఁ దనమదకరీంద్రము నిల్పి కేలూఁత యొసఁగి యెక్కించుకొనియె
కోకటగ్రామాద్యనేకాగ్రహారంబు లడిగిన సీమలయందు నిచ్చె
మనుచరిత్రం బందుకొనువేళఁ బురమేఁగఁ బల్లకిఁ దనకేలఁ బట్టి యెత్తె
బిరుదైన కవిగండపెండేరమున కీవ తగుదని తానె పాదమునఁ దొడిగె

గీ. 'ఆంధ్రకవితాపితామహ అల్లసాని, పెద్దనకవీంద్ర' యనిననుఁ బిల్చునట్టి
కృష్ణరాయలతో దివి కేఁగలేక, బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబనగుచు.

అనుపద్య మొకటిమాత్రము వాడుకలోఁ గలదు. మఱియుఁ గృష్ణరాయనిర్యాణానంతరము కన్నడరాజ్యముపైకి గజపతి రాజు దండెత్తిరాఁగా,

సీ. రాయరాహుత గండ రాచయేనుఁగు వచ్చి యారట్టుకోట గోరాడునాఁడు
సంపెటనరపాలసార్వభౌముఁడు వచ్చి సింహాద్రి జయశిలఁ జేర్చునాఁడు

సిలుగోలుసింహంబు చేరి ధిక్కృతిఁ గంచుతల్పులఁ గరుల డీకొల్పువాఁడు
ఘనతరనిర్ఝరగండపెండెర మిచ్చి కూఁతు రాయల కొసఁగూర్చువాఁడు
గీ. నాఁడ తెఱుఁగవో చచ్చితో యుండ్రితేవొ, చేరఁజాలక తలచెడి జీర్ణమైతొ
కన్నడంబెట్టుసొచ్చెదు గజపతీంద్ర! తెఱచినిలుకుక్కసొచ్చిన తెఱఁగుదోఁప.

అను సీసపద్యమును బంపెననియు, దానిపై నాతఁడు సిగ్గిలి తిరిగిపోయె ననియుఁ దెలియుచున్నది. మును మనుమసిద్ధిరాజు ప్రతాపరుద్రునకుఁ దనరాజ్యము నోడిపోఁగాఁ దిక్కనామాత్యుఁడు తనకవితచేఁ బ్రతాపరుద్రుని మెప్పించి మరల నారాజ్య మాతని కిప్పించె నఁట!

వెలుగోటిరాజయిన మాదయలింగమనేఁ డల్లయ వేముని తల నఱికి తనతమ్మపడిగం బొదిగించి సందికంత పోతరాజను పేరి కఠారిఁ గైకొనఁగా శ్రీనాథకవిసార్వభౌముఁ డాతనిఁ జేర నరిగి, కవనముచే నాతనిఁ బొగడి మెప్పించి మరల నాకఠారిఁ గొని తెచ్చె నఁట! బళిరా కవిత్వమహాత్త్వము!

ఇంకను గృష్ణరాయనిచే రచింపఁబడినట్లుగల యాముక్తమాల్యదయుఁ బెద్దనచేతనే రచింపఁబడినదని యొకయైతిహ్యము బహుకాలమునుండి కలదు. రంగరాట్ఛందమునం దాముక్తమాల్యదలోని పద్యము లుదాహరింపఁబడునెడ 'పెద్దనగారి యాముక్తమాల్యదలో' నని నుడువఁబడియున్నది. మఱియు నాముక్తమాల్యదకుఁ బ్రాచీన వ్యాఖ్యాత యొకఁడు తన వ్యాఖ్యానావసానమునఁ 'బెద్దన రచించిన యాముక్తమాల్యద' యని పద్యరూపమున వ్రాసియున్నాఁడు. ఇంకను గొన్ని యెడలఁ బెద్దనకృతమని కలదు. మనుచరిత్ర మెట్టిహృదయంగమములగు భావములతో విలసిల్లుచున్నదో యాముక్తమాల్యదయు నట్లే చెలువు మీఱుచున్నది. కాని రెండిటికిని శైలి

యందుఁ గొండొకభేదము కలదు. ఇట్టిభేద మొక్కకవియే కాలభేదముచే రచించినకృతులందుఁ జూపట్టుచుండుట లేకపోలేదు. ఇయ్యెడ బాణుని కాదంబరీహర్షచరిత్రములు తార్కాణముగాఁ జూడనగును. 'కవితాప్రావీణ్యఫణీశ' మొదలగుపదములచే సంబోధింపఁబడిన కృష్ణరాయలుకవనము చేయలేక యితరుఁడు రచించినదానిని తనపేరఁ బ్రకటించుకొనె ననుటయుఁ బొసఁగుఁబాటు కలదిగాఁ దోఁచుట లేదు. ఈవిషయము సత్యమైనను నసత్యమైనను దాము రచించినగ్రంథములను దమ రాజులు రచించినట్లే వారిపేళ్లతోఁ బ్రకటించుసాచారము వెనుకటి కవులకు లేకపోలేదు. ఇవిగాక పెద్దనకృతములని వాడఁబడునవి కొన్ని చాటుపద్యములు గలవు.

తన దివ్యకవితావిలాసముచేఁ గృష్ణరాయల మెప్పించి యాతని కత్యంతగౌరవనీయుఁడై యీమనుచరిత్రము నాతనికే కృతిసేసి యనేకాగ్రహారములను గొని మహాభోగముల ననుభవించి యైహికేచ్ఛలఁ దనియుటయు కాక వైష్ణవాగ్రేసరుఁడై కోకటమను తనయగ్రహారమునకు శఠకోపపురమని యాత్మగురుఁ డగుశఠకోపయతిపేరు పెట్టి బ్రాహ్మణులకు సర్వాగ్రహారముగా నొసఁగి యింక ననేక దేవాలయములకు భూదానములు సేసి పారత్రికసౌఖ్యమును సమితమార్జించుకొనిన యీయాంధ్రకవితాపితామహుఁడు కృష్ణరాయనిర్యాణానంతరము సన్మానితము జీవించియుండి ౧౫౪౦ సం॥ ప్రాంతమున నశ్వరమగు భౌతికశరీరమును ద్యజించి శాశ్వత మగుకీర్తిమూర్తిని గైకొనెను. ఎంతవఱకీయాంధ్రభాష ప్రచారము గలదై సుస్థితిని వెలయుచుండునో యంతవఱకును పెద్దనార్యుని యశశ్శరీరమునకు భంగపాటు వాటిల్లనేరదు.

# గ్రంథవిమర్శము

## రచనాచాతుర్యము.

మార్కండేయపురాణమునం దీస్వారోచిషమనుజన్మ వృత్తాంతము సమగ్రముగాఁ గలదు. ఆపురాణమును మారన యాంధ్రీకరించెను. రెండొండుపట్టుల నౌచితీపోషణమునకై చిఱుమార్పులఁ గావించెఁ గాని పెద్దనామాత్యుఁ డీప్రబంధ రాజమును దుదముట్ట నామార్కండేయపురాణపుఁ ద్రోవనే పెంపొందించెను. మారనకవిత్వమున ౧౫౦ పద్యములలో ముగిసినకథ యీతనికవనమున ౬౦౦ పద్యములవఱకుఁ బెరిఁగినది. ఈ మనుచరిత్రము 'అల్లసానివానియల్లికజిగిబిగి' యను పలుకులు బ్రతిపదమునకు సార్థకపఱుచుచున్నది. పెద్దనామాత్యుఁ డీప్రబంధమును దీర్ఘకాలము పరిశ్రమచేసి తనసర్వతోముఖ పాండిత్యమును జతుర్విధకవితావిలాసమును వెలయించి నిబ్బరమైనశైలి నాహా పుట్టించునట్లు పోహళించెనుగాని యందదుకులుగా నెందును ముడిపెట్టలేదు. ఈగ్రంథమునందుఁ గూర్పునేర్పును భావవైచిత్ర్యమునుబిక్కటిల్లనిపద్యముగాని గద్యముగాని చూపట్టదు. ఎక్కడఁ బట్టిన నక్కడఁ గవీశ్వరుని లోకజ్ఞానమును భాషావైదుష్యమును. గల్పనాచాతుర్యమును వెల్లివిరియుచున్నవి. పెద్దనార్యుని పద్దెములు ముద్దులొలుకునిద్దంపుఁ బలుకుల నేర్చికూర్చితీర్చి దిద్ది చికిలిసేసి నునుమెఱుఁగు వెట్టి వెల్వరింపఁబడినవి. కావుటచే నెక్కడను నొక్కులువోయి కాన్పింపవు. మఱియు సంస్కృతాంధ్రములనందముగాఁగలయఁ గూర్చుకతన నితని కవనమున సంస్కృతప్రౌఢియుఁ దెలుఁగు నుడికారమును మిసమిసలు దేఱుచుఁ జెఱలాడు చున్నవి.

## శైలి.

శా. తావుల్ క్రేవలఁ జల్లు...గాఢడోత్కీర్ణముల్. మను. ఆ. 2 ప. 22

క. మృగమదసౌరభవిభవ...మారుతమొలసెన్. మను. ఆ. 2 ప. 24

ఈ పద్యప్రవాళ్లవచరణ మట్టిమారుతము నొలయించుచునే యున్నది.

శా. వాలాయంగొనగోష్ఠ...దేశాత్తికిన్. మను. ఆ. 3 ప. 57

చ. జిలుఁగులఁ బెట్టుచుం దొడలఁ...నిల్చనోయరన్. మను. ఆ. 5 ప. 68

## ఔచితీనిర్వాహము

క. అల్లద కంటే పానపాన,...వాలుమొకంబుల్. మను. ఆ. 4 ప. 16

క. తిమిరంపుగుబ్బచన్నుల,...మదమేమిటికిన్. మను. ఆ. 4 ప. 83

## కల్పనాచాతుర్యము

చ. మరున కొసంగఁ గాలము...సెత్తైరత్తటికిన్. మను. ఆ. 3 ప. 24

## భావప్రకాశనము

మ. మునుమున్ పుట్టెను...పద్మంబులన్. మను. ఆ. 2 ప. 30

## స్వభావపరిజ్ఞానము

చ. పలుకులు నేర్పువేళఁ...కీరశారికల్. మను. ఆ. 3 ప. 58

సీ. ఏవిహంగముఁ గన్న నెలుఁ...చక్రవాకి మను. ఆ. 3 ప. 16

ఈ సీసపద్యము పెద్దనార్యునిభాషాంతరీకరణ చాతుర్యమును వెల్లివిరియించుచున్నది. చూడుఁడు.

శ్లో. ఆయాతి యాతి పునరేవ జలం ప్రయాతి
పక్షాంకురాణి విచినోతి ధునోతి పక్షౌ,
ఉన్మత్తవద్భ్రమతి కూజతి మందమందం
కాంతావియోగవిధురో నిశి చక్రవాకః.

ఈశ్లోకమున కాపద్య మనువాదమయ్యు నెంతయేని మనోజ్ఞముగాఁ బెంపొందింపఁబడినది. మఱియుఁ బుంలింగమున కన్న కర్తృపద మత్యంత స్వారస్యాపాదక మగునట్లు స్త్రీలింగముగా మార్పఁబడినది. పెక్కుచోటుల నీతఁ డేదే నొకలోకోక్తినో, ప్రకృతిచిత్రమునో కైకొని దానికి వన్నెలు చిన్నెలు వచ్చునట్లు మే లయినకల్పనఁ గల్పించి పద్యమునఁ బెట్టి బాగుబా గనిపించును.

చ. మదకలకుంభికుంభ...పంక్తులు వోలె బోరుల౯. మను. పీఠిక. ప. 41

ఈపద్యమునందలికల్పన "వానిపుట్టి మునిఁగినది" యను లోకోక్తినిబట్టి పుట్టినది.

ఉ. క్రూరవనేభదంతహతకుడ్య...కట్టణంబుల౯. మను. పీఠిక. ప. 36

ఈపద్యము గిజిగాఁడులు మిడుఁగుఱుఁబుర్వులను దమ గూండ్లలో వెల్తురునకై చేర్చి యుంచుకొను నను ప్రకృతిచిత్రమునుబట్టి యందముగాఁ బొందుపఱుపఁబడినది. కృష్ణరాయని వంశాదివర్ణనమున నితఁడు చిత్రించిన ప్రతికల్పనయు ననుపమాన మై వెలయుచున్నది.

పెద్దన తనవెనుకటికవులు కూర్చినకూర్పులలోని మే లేర్చికొని పొదుపుగా నదుకుకొనుచు నొక్కొక్కయెడఁ దొంటికంటె సుతారము మీఱునట్లు హావళించును.

చ. ఉడిగి వడింగి పై మఱచి యున్నతఱిం గలఁపోనఁ జేర సొ
క్కడిమగవాఁడొకో! యనుచుఁ గందగఁ మేల్కనుచో నతండ యి
ప్పుడు మగఁ డంచుఁ గోరుటకుఁ బొందుగఁ జెప్పితి ముల్లు పుచ్చి కొ
ఱ్ఱడఁచినచంద మయ్యెఁ గమలానన యీవిరహానలంబునన్.

ఉత్తరహరివంశము, సోముఁడు.

చ. ఉడుపతిబాఁకి స్వాఱచి...జరింపఁజేటికి౯. మను. ఆ. 3 ప. 34

మ. అనుమానింపక యాతుధాంధసులు మాయాకల్పనావంచనం
బున వైశ్వానరునిన్ హరించిరి యహంబో యింతమాత్రంబులో
నన నారోగమహానుభావమునకున్ భంగంబు వాటిల్లునే ?
పనికల్గాఁచిన పెండ్లి మానునొకో దుశ్చారిత్రము ల్గంటిరే.

కాశీఖండము, శ్రీనాథుఁడు.

శా. తండ్రీ నాకు ననుగ్రహింపగదా...గష్టముప్పింపచా.

మను ఆ. 5 ప. 17

సీ. పులిమల్లఁ డడవిపోతులరాజు గరుడుండు గాలివేగంబు పంచేలపసిఁడి
విష్ణుప్రసాదంబు వెండిగుండులపరి పచ్చిమిర్యము పెట్టిపుచ్చకాయ
వేఁటమాణిక్యంబు విరవాది మెడబల్మి పెట్టుగాఁడు వకారిపిడుగుతునుక
జిగురుఁడు చిత్రాంగి శ్రీరామబాణంబు పులియుండు కస్తూరి బొడ్డుమల్లె
గీ. యనఁగ మఱియును బెక్కుతోయముల పేళ్ల
డారకులు చేరవచ్చె నుద్దండవృత్తి
వేఁటకుక్కలు మృగరాజవిగ్రహములు
పటుకసాధుని వాహ్యాళివాహనములు.

శృంగారశాకుంతలము, పినవీరభద్రకవి.

చ. పులియుఁడు బూచిగాఁ...గ్రహించి యుద్ధతిన్. మను. ఆ. 4 ప. 32

పెద్దనామాత్యుఁడు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శాకుంతలమునఁ గలవేఁటవర్ణనము మొదలగునది తిన్నగ నెత్తుకొని దాని కంటెఁ బెక్కుమడుఁగు లెక్కువ చక్కఁదనము గల్గునట్లు తాను సమకూర్చెను. మఱియు మారన మార్కండేయపురాణమును బట్టియే యాగ్రంథము పెంపొందింపఁబడినదగుటచే నందలిరచనలును గొన్ని యిందుఁ జొచ్చినవి. ఒండురెండు జక్కనపద్యములఁ బోలినపద్యములుఁ గలవు. ఇవిగాక గడుసుఁ బోకడలకు గనియు నుడికారములకు విడిదిపట్టును నగుకవిసార్వభౌముని కవితావిలాసమును బహువారములు తఱచితఱచి చదివి ముదంపడినవాఁడు కావుటచేఁ బ్రౌఢకవనమం దత్యంతాదరము

గల పెద్దనార్యుఁడు తనయాదరాతిశయమున నుద్ఘోషితముగాఁ గావలయు నాయారచనాచమత్కారములను మనుచరిత్రమునఁ జెక్కుచోటుల నెలకొల్పెను. "మిన్నులుపడ్డచోటు, కులము సాములు, వెన్నతోఁ బెట్టినవది, కడుపారఁగన్నతల్లి, మాటామాటనడలు, చన్నవిసిపిదుకఁ, బండికందెనచాయ" మొదలగు మే లయిన తెలుఁగుపలుకుఁబడులు పెక్కులు శ్రీనాథుని కవనమునుండి మనుచరిత్రమునకుఁ గొనితేఁబడినవి. పైగ్రంథములలోనిపద్యములు పరిమితముగాఁ బెద్దనార్యునిపద్దెములతోఁ బోల్చి చూపఁబడుచున్నవి.

సీ. అనియమ్మహాభాగుఁ డాచమన మొనర్చి నియతుండుశుచియునై నిలిచి గార్హ
పత్యాగ్నిఁ దనమది భావించి వందన మొనరించి యిట్లను ననిలమిత్ర
నీయంద యాహవనీయాగ్నియును దక్షిణాగ్నియుఁ బ్రభవించె నఖిలదేవ
తలకును దృప్తి నీవలన సిద్ధించును సకలలోకముల కాశ్రయము నీవ
గీ. నిత్యసత్యమూర్తి నీప్రసాదంబున, నినుఁడు గ్రుంకకుండ నిపుడ యింటి
కరుగువాఁడఁగాక యాగమోదితకర్మ, జాతనైష్ఠికుండ నైతి నేని.

మార్కండేయ పురాణము.

తే. ... ... ... ... ...
...వార్చిప్రవరుండు గార్హపత్య, వహ్నినిట్లని పొగడె భావమునఁదలఁచి.
మ. దివిషద్వర్గము...స్వాహావధూవల్లభా. మను. ఆ. 2 ప. 75
ఉ. దానజపాగ్నిహోత్ర...హవ్యవాహనా. మను. ఆ. 2 ప. 76
తే. అనఘ మందారవిద్యాధరాత్మజన్మ, నేవిభావసియనుదాన...మార్కం.
తే. అనఘ మందారవిద్యాధరాత్మభవను, ననువిభావసి...మను. ఆ. 6 ప. 17

ఇట్టులు మార్కండేయపురాణపుఁబోలికలు కొన్ని గలవు.

సీ. సంపూర్ణపూర్ణిమాసాంద్రచంద్రాతపవిలసితశశికాంతవేదికలను
మంజరీసంజాతమకరందనిష్యందమాకందమాధవీమండపముల
శృంగారవనమహాశృంగారమణిశృంగహాటకశైలశృంగాటకముల
సంఫుల్లహల్లకసహకారవాసనోజ్జ్వలదీర్ఘదీర్ఘికాసైకతముల

గీ. గగనగంగాతరంగిణీగంధవాహ, బంధురోదగ్రసౌధాగ్రభాగములను
నవనవోల్లాసరతికళానైపుణములఁ, బ్రతిదినంబురమించిరిసతియుఁబతియు.

జక్కనవిక్రమార్కచరిత్ర.

సీ. గంగాతరంగిణీరంగ...లేపసామగ్రిఁ జెంది. మను ఆ. 6 ప. 62

సీ. నలినసంభవువాహనమువారువంబులు కులముసాములుమాకుఁగువలయాక్షి
చదలేటిబంగారుజలరుహంబులతూండ్లు భోజనంబులు మాకుఁబువ్వుఁబోఁడి
సత్యలోకముదాఁక సకలలోకంబులు నాటపట్టులుమాకు నబ్జవదన
మనుకాతురము లైనయామాటలు వినంగ నమృతాంధసులు యోగ్యులనుచు
[మెచ్చి

గీ. భారతీదేవిముంజేతిపలుకుఁజిలుక, సనుదగజయాన సబ్రహ్మచారి మాకు
వేదశాస్త్రపురాణాదివిద్య లెల్లఁ, దరుణి నీయాన ఘంటాపథంబు మాకు.

శృంగారనైషధము.

సీ. చిన్ని వెన్నెలకందు...గోత్రామరేంద్ర. మను. ఆ. 2 ప. 43

సీ. గిరినికుంజములఁ గుంజరపుంజమనుశంకఁ గంఠీరవంబు లుత్కంఠ నెగయఁ
బల్వలంబుల గిరిప్రకరంబు లనుశంక సెలుకురాజులు విందులెక్కవెట్టఁ
గడలిమధ్యంబునఁ గానోల మనుశంక జలదేవతలు భీతి సంభ్రమింప
నదములఁ గువలకాననవాటి యనుశంక నిందిందిరశ్రేణు లెదురుకొనఁగ

గీ. రజతగిరియందుఁ దాండవారంభరభస, భంగిపతితపరశ్వధపాణివికట
కంధరారుద్ధగజకృత్తికంతశంక, ప్రమథులకుఁదోఁపనంధకారంబు ప్రబలె.

భీమఖండము- శ్రీనాథుఁడు

సీ. ఉరుదరీకుహరను...జరతారుణాతపములు. మను. ఆ. 3 ప. 11

సీ. పతి పాణిపల్లవచ్యుతనీవిబంధనవ్యగ్రబాలాహస్తవనరుహంబు
ధవకృతాధరబింబదశనక్షతవ్యథాభుగ్నలీలావతీభ్రూలతంబు...

శృంగారనైషధము.

సీ. సహాసానఖంపచ...శయ్యానికాక... మను. ఆ. 3 ప. 116

చ. కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చినభంగి నేడ్చె న
బ్బిసరుహనేత్ర కొండచఱిఁ బెద్దయెలుంగున వెక్కి వెక్కి వె
క్కస మగుమన్యువేగమునఁ గాటుకకన్నులనీరు సోనలై
యుసిరికకాయలంతలు పయోధరముల్ దిగువాఱ నట్టుగన్.

కాశీఖండము.

ఉ. పాటున కింతులోర్తురె...చిందువందగన్. మను. ఆ. 2 ప. 70

ఇట్లనేకముగాఁ జూపఁదగును. పై యేడ్పుపద్దెములఁ బట్టి పారిజాతాపహరణమునఁ దిమ్మనయు, వసుచరిత్రమున రామరాజభూషణుఁడును రెండుపద్యములఁ గూర్చిరి.

ఉ. ఈసునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదురన్ లలితాంగి పంకజ
శ్రీసఖ మైనమోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్.

పారిజాతాపహరణము.

శా. ఆజాబిల్లి వెలుంగు వెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖ మైనమోమునఁ బటాగ్రం బొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూరాజత్కరాంభోజకాం
భోజీమేళవిపంచికారవసుధాపూరంబు తోరంబుగన్. వసుచరిత్రము.

ఈపద్యములపైఁ దెనాలిరామలింగకవి, 'అల్లసాని పెద్దన అటునిటు నేడ్చెను. ముక్కుతిమ్మన ముద్దు ముద్దుగా నేడ్చెను. బట్టుమూర్తి బావు రని యేడ్చెను' యని యభిప్రాయ మిచ్చెనట.

పెద్దనామాత్యుని తర్వాత మనుచరిత్రమునకుఁ బ్రతిబింబములుగాఁ బ్రబంధములు కుప్ప తెప్ప లై యుప్పతిల్లినవి. మనుచరిత్రమునందలి పద్యముల పోలికపద్యములును గల్పనల పోలికకల్పనలును బెక్కులు పొడచూపినవి.

క. సురగరుడోరగ...నేర్తురె పీనిన్. మను. ఆ. 2 ప. 37

క. నర ఖేచర విద్యాధర, గరుడోరగసిద్ధసాధ్యగంధర్వతతిన్
నిరతముఁ గనుఁగొందున యీనరనాథునిఁ బోలఁ గలరె నమ్రనిరూఢిన్.

సకలకథాసారసంగ్రహము.

మ. అనిమేషస్థితి మాన్చె...జూపట్టెసానత్తతిన్. మను. ఆ. 2 ప. 33

మ. అనిమేషస్థితి మాన్చెఁ జంచలపుఁజూపస్వేదభావంబు గ్ర
ద్దన వారించె వినూత్నఘర్మజలవిస్తారప్రపూరంబుతో
డన దేవాంగన కయ్యెడన్ భ్రమరకీటన్యాయమై యొప్పి య
మ్మనుజేంద్రున్ భ్రమియించునంతనె రహిన్ మర్త్యత్వమున్ సంధిలెన్.

సకలకథాసారసంగ్రహము.

సీ. వదనప్రభూతలావణ్యంబు——మృదుపదములు మను. ఆ. 2 ప. 36

సీ. వదనసౌందర్యవిస్ఫారాంబుసంభూతకంజంబులగు వానికన్నుదోయి
మదనసామ్రాజ్యసమ్యక్స్థితిక యనంగ సరసమౌ వానివక్షస్స్థలంబు
కర్ణకుండలరత్నకాంతులఁ గొననిక్కు వగలుమీఱెడు వానియొగుభుజములు
అతులప్రవాళసంతతిరుచిసంపద నదలింపఁ జను వానిమృదుపదములు...

సకలకథాసారసంగ్రహము.

ఈసకలకథాసారసంగ్రహము నొనర్చిన యయ్యలరాజు రామభద్రకవి కృష్ణరాయల యాస్థానకవియే. ఈతఁడు పెద్దనకు శిష్యుఁడందురు. సమకాలముననే యిట్టిప్రతిపద్యము లేర్పడినవి. ఇట్టివి చూప దొరఁకొన్న నెన్నేనిఁ జూపనగును. పెద్దాడ నాగరాజామాత్యుఁడు రచించిన శకుంతలాపరిణయము మనుచరిత్రపుఁబ్రతిరూపమే. ఇట్లనేకులు కవులు మనుచరిత్రమునకుఁ బోలికగాఁ గవనము చెప్పఁబూనుటకు దానియందుఁగల గుణోత్కృష్టమే కారణము.

కథాసంవిధానము.

సంస్కృతభాషలో దృశ్యకావ్యములందుఁ దక్క శ్రవ్యకావ్యములందు వస్త్వైక్యము లేఱచు కన్పట్టదు. శాకుంతల

మృచ్ఛకటికాదు లగురూపకములలోనియితివృత్తము ప్రధాన పాత్రము లగునాయికానాయకులవృత్తాంతమున కనుబంధియై పెంపొంది తుద కానాయికానాయకులవృత్తాంతముతోడనే పర్యవసించుచున్నది. నాటకములం దితివృత్తమనుహారమునకు నాయికానాయకులు కొలికిముత్తెములుగా నుందురు. ఇయ్యది యత్యంత చమత్కారాపాదకమై యింపునింపుచుండును. ఇంక శ్రవ్యకావ్యములందుఁ గొన్నిట నట్లుకాక యెక్కడకక్కడ కితివృత్తము తెంపు చెందుచున్నది. దిలీపునివృత్తాంతముతో నారంభింపఁబడిన రఘువంశకావ్య మగ్నివర్ణునివృత్తాంతముతో ముగింపఁబడినది. ఎక్కడనో యారంభింపఁబడినకథ యెక్కడనో ముగింపఁబడుటచే వస్త్వైక్యము లేదు. ఇఁక మనయాంధ్ర భాషలోఁ బ్రాచీనకవులు దృశ్యకావ్యముల రచింపరైరి. మఱియు సంస్కృతమందలి దృశ్యకావ్యముల దెనిఁగించునెడ సంయుతము శ్రవ్యకావ్యములుగనే తెల్గించుచువచ్చిరి. యక్షగానములను కొండొకతెలుఁగు రూపకప్రతిరూపము లుప్పతిల్లినవిగాని వానిని దృశ్యకావ్యములక్రిందఁ బరిగణింపఁబోలదు. ఇటీవల మిశ్రోత్పాద్యాన్యతరమగు నితివృత్తముతోఁ గావింపఁబడుచు వచ్చిన పెక్కుశ్రవ్యకావ్యములందు సంస్కృతనాటకక్రమమునఁ గొంతవస్త్వైక్యము కానవచ్చుచున్నది. వీరభద్రునిశృంగార శాకుంతలము, తిమ్మన పారిజాతాపహరణము మొదలగునవి వస్త్వైక్యము గలవియే. కాని యట్టులు వస్త్వైక్యము కలిగితీర వలయు ననునిబంధ మీతెలుఁగుప్రబంధములపట్టున నున్నట్టు చూపట్టదు. దీనికి నిదర్శకముగా రఘువంశాదికావ్యములవలె మన మనుచరిత్రమును వస్త్వైక్యము లేకయున్నది. ఇందు రసోత్తరముగా రచింపఁబడిన వరూథినీప్రవరవృత్తాంతము మూఁ

డవ యాశ్వాసముతో ముగిసిపోవుచున్నది. నాలవయాశ్వాసమున నుపక్రమింపఁబడిన స్వారోచివృత్తాంత మాఱవయాశ్వాసములోఁ గొంతవఱకే కలదు. ఆవల స్వారోచిషమనువృత్తాంతముతోఁ బ్రబంధము ముగింపఁబడినది. ఇట్టి విచ్ఛేదము శ్రోతలకుఁ గొండొకపట్టుల నిరుత్సాహము గల్పించుచుండును. అందును నిందు సరిసగమువఱకు గ్రంథమునఁ బెంపొందిన ప్రవరవరూథినీవృత్తాంతము విచ్ఛిన్నమై వేఱొకకథలో సంక్రమించిపోవుట యెంతయుఁ బాఠకులయుత్సాహమును వెన్నడఁ జేయుచున్నది. కాని, లోకస్వభావమునకు సరిపోవుసంవిధానముతో నయ్యైపాత్రములనెలకొల్పి యౌచితి కెందునుభంగము రాకుండఁ దత్తద్రూపచేష్టాదుల నమర్చి యేపట్టునఁ జూచిన నాపట్టున నద్దిరా యనవలయు నట్టు లితివృత్తమును నడపించు నేర్పు పెద్దనకుఁ గుదిరినట్టు మఱియొకకవికిఁ గుదిరినది కాదు. నిగూఢములుగా నుండు మనోభావములను స్ఫుటపఱచి చప్పున విప్పి చెప్పునట్లు పదమున నీతఁడు నిరూపించును.

ప్రవరునిస్వరూపస్వభావాదులను వర్ణించుపట్టును సిద్ధునితోడి సంభాషణముఁ దెల్పెడిపట్టును జదివిన పదఁ పడిజ్ఞానదృష్టికిఁ బ్రవరుని శాంతరసస్ఫూర్తి లొలుకుస్వరూపము పొడకట్టకపోదు.

ఈ సందర్భమున నీచిన్నిపద్యమును స్మరించినఁ జాలును.

గీ. మానినాథ కుటుంబజంబాలపటల,... పెంకటిదక్కు. మను. ఆ. 1 ప. 64

పదంపడి ప్రవరవరూథినీసంభాషణమున నీతఁడు శాంతశృంగారరసములకు స్పర్ధ పెంచి నించిన హొయలు వర్ణనాతీతము. ఇచ్చో ఆంకుటాంద్ర జంకెనలును వలపులును దలఁపులును బసరు పిండినట్లుపిండి వడపోసి తేర్చి చూపించెను. మఱియు

బ్రహ్మవాదుల యైహికేచ్ఛావైముఖ్యమును, వైదికకర్మాదరమును, బ్రహ్మవర్చసప్రాభవమును, వెల్లివిరియించి యద్దిరా యనిపించెను.

ఉ. ఎన్నిభవంబులంగలుగు...జేర్చుభాగ్యముల్. మను. ఆ. 2 ప. 57

ఈపద్యము వెన్నవలెఁ గరఁగుచునే యున్నది.

శా. ఈపాండిత్యము నీకుఁ...మీసంప్రదాయార్థముల్. మను. ఆ. 2 ప. 64

ఓహో! వేదాదివిద్యాసంపన్నుఁ డగు ప్రవరుని భాషణ మెట్టికూర్పునఁ గూర్చి యౌచిత్యము నించెను.

ఇట్లౌచిత్యవిచారచర్చ గావించుట కెంతయేని నవకాశము కలదు కాని యిది యదను కాదు.

ఈ తెఱఁగున సరససంవిధానము గలయీ ప్రబంధరాజమునఁ గొంద ఱౌకయసందర్భమును జూపుచున్నారు. ప్రవరుని యింటికి సిద్ధుఁడు కుతపకాలమున నరుదెంచినట్లు కలదుగదా! కుతపమునఁగాఁ బగటి పదునెన్మిదిముహూర్తములలో నెనిమిదవ ముహూర్తము. అప్పు డాసిద్ధున కిష్టమృష్టాన్నకలనచే సంతుష్టిఁ గావించి యింకను దీర్ఘయాత్రావృత్తాంతప్రసంగము కొంతజరపి పదఁపడి యాతనియొద్దఁ బాదలేపముఁగొని ప్రవరుఁడు హిమవంతమునకు బయలుదేఱునప్పటికిఁ గొంత సమయము కడచియుండును. అవ్వల హిమవంతమున కరిగి యందుఁ గొంతతడవయ్యెడవిశేషములఁ బరికించి చూచినపదఁపడి ప్రవరుఁడు.

మ. నళినీబాంధవ...మధ్యాహ్నముల్ దెల్పెడిన్. మను ఆ. 2 ప. 12

అని యనుకొనుట యసంగతము. ఎంత లేదనిన నప్పటి కపరాహ్ణమునఁ జాలవఱకుఁ గడచని యుండును. ఇచ్చోఁ బ్రవరుఁ డాసిద్ధుఁడు చనుదెంచిననాఁడు హిమాలయమున కరుగకయుఱు

దినము ప్రొద్దుట నరిగె నని చెప్పి మఱికొంద ఱాయనుప పత్తిని నివారించుచున్నారు. ఈ సమర్థనము మార్కండేయ పురాణానురోధియే కాని పెద్దనమాత్ర మట్టి వ్యవధి నించుక యేని సూచించినవాఁడు కాఁడు, గర్హిత మనవలెను.

ఇదిగాక యొండు రెండు శబ్దదోషములును బొడకట్టు చున్నవి.

'పణినసూనుకణాదబాదరాయణసూత్రఫక్కి విద్వాంసు లుపన్యసింప'

ఇందుఁ బ్రయోగింపఁబడిన పణినసూనుపద మసాధువు. కవిసార్వభౌముఁడును దనశృంగారనైషధమున,

శా. 'ప్రాతఃకాలము వాయసంబు పణినాపత్యోక్తశాస్త్రంబులోన్'

అనెను. పెద్దన యాత్రోవనే త్రొక్కెను. అష్టాధ్యాయి మొదలగు గ్రంథముల రచించిన వ్యాకరణశాస్త్రప్రవర్తకపాణిని 'పాణిన' మునియొక్క సంతానము గాని, పణినముని సంతానముగాఁడు. "పణనం పణః, పణోఽస్యాస్తీతి పణీ," నకారాంతమగు నీ "పణిన్" శబ్దముపై గోత్రాపత్యార్థమున "అణ్" ప్రత్యయము రాఁగా "పాణిన" యనురూప మేర్పడినది. పదంపడి యువాపత్యార్థమున "ఇఞ్" ప్రత్యయము రాఁగా "పాణిని" యనురూప మేర్పడినది. ఎట్లయినను బాణిని పాణినసూనుఁ డగును కాని పణినసూనుఁడు గాఁడు. ఇది సమర్థింప వెరవు గానరాదు. మఱియుఁ గృత్యవతరణమున

'కొఱఁతం బడుగ్ గుకవి పృథ్వీధృత్సమీపస్థలిన్'

అనుచో న్యూనతయను నర్థముఁ "గొఱఁత" యను పదము సరియగుఁగాని, 'శూల' మను రెండవయర్థమున 'కొఱఁత' అనురూపము సరికాదు. కొఱుశబ్దమునుండి యట్టిరూప మేర్పడ నేరదు.

'కౌఁగిలది యెక్కడ హా విధి యేమి సేయందున్'

కౌఁగిలి అది, అనుచో నికారసంధి కావింపఁబడినది.

'అనాశ్వాసితదుఃఖితే మనసి సర్వ మసహ్యా మన న్నైఋంగవే'

ఇచ్చో "అనన్నైఋంగవే" యని పోతన్నగారు ప్రయోగించెడు తెఱఁగునఁ బ్రయోగింపఁబడినది. ఈసంధి సమంజసమైనది కాదు.

అమృతరసపూర మగు పెద్దన్నగారి సరసకవితాప్రసారమున నీ నలుసులు పరిగణనీయములుగావు. ఆనెఱఁగి యాంధ్రకవనము నీతఁడు కూర్పఁగల్గిన ట్లితీవల నెవ్వరును గూర్పనేరరైరి.

కొంటె కోణంగి యగు కవిచౌడప్పయును దన వెక్కిరింపు స్వభావమును మాని, ·

క. పెద్దనవలెఁ గృతి సెప్పినఁ, బెద్దనవలె నల్పకవినిఁ బెద్దనవలెనా?
ఎద్దనవలె మొద్దనవలెఁ, గ్రద్దనవలెఁ గుండవరపుఁ గవిచౌడప్పా!

అని పెద్దనార్యునిగూర్చి తనమెప్పును వెల్లడించెను. కృష్ణరాయలవంటి రాజచూడామణిని పెద్దనార్యునివంటి విద్వత్కవిరత్నమును గాంచుభాగ్య మాంధ్రదేశమున కిఁక నెన్నఁటికైనఁ గలుగఁగలదా!

ఉ. కూర్చినకూర్పులా! స్వరస
గుంభనముల్, కవితాప్రసారమా
తేర్చినతేనె! యంచు విను
తింపఁ బ్రబంధము సంతరించి లో
కార్చితుఁడైనపెద్దనమ
హాకవిసత్కవితావిలాసముం

గూర్చి విమర్శ సల్ప నోనఁ
గూడునె యొక్కని కల్పబుద్ధికిన్.

ఉ. ముద్దులు మూఁట గట్టునుడి
పొంకమునందును మేల్మికూరుపుం
బద్దెపుబింకమందు, రస
బంధమునందుఁ, గథాప్రకారముం
దిద్దెడుతీర్పునందు గడి
దేఱినమాకవితాపితామహుం
బెద్దన నాంధ్రపుంగయితఁ
బెద్ద ననారతముం దలంచెదన్.

వేటూరి ప్రభాకరశాస్త్రి.

# కథాసంగ్రహము.

ప్రవరుఁడు బ్రాహ్మణకులప్రదీపుఁడు; వేదవేదాంగములయందుఁ అనంతకౌశలము గడించిన కోవిదుఁడు; ధనికుఁడు, అయినను మత్తుఁడు గాఁడు; శమదమాభరణుఁడు; సచ్ఛీలుఁడు; మఱియుం వివిధాధ్వరనిర్మల ధర్మకర్మదీక్షాపరతంత్రుఁడు; ఇంతకును యౌవనకుఁడు; విశేషించి మకరాంక శశాంకమనోజ్ఞమూర్తి; అనుకూలనాయకుఁడు; కూరిమిసోమిదమ్మ సకల విధముల ననుకూలయై ఎపుడు నెడబాసియుండని పదదాసియై, సేవించుచుండ, తలిదండ్రు లింటిపెత్తనము దీర్చుచుండ శిష్యులకు విద్దెలఁ గఱపుచు స్వధర్మసేవ సేయుచని గృహమేధి: అరుణాస్పదపురనివాసి. ఆపురము వరణా నదీతీరమున వెలయు మహికంతహారనాయకమణి.

ప్రవరునకు అతిథిపూజ యనిన పరమానందము. ఆతని కూరిమిసోమిదమ్మ గూడ నట్టిదే. ఆమె ఎంతమంది వచ్చినను వండుటకు విసువదు. అతిథులు అర్ధరాత్రి వచ్చినను మహానందముతో నామె వారికి కావలసిన వెల్లఁ బెట్టును. గృహిణి సౌజన్యమువలన ప్రవరుని అతిథిపూజాభిలాష తరుగక ఆనందప్రదమై యుండెను. ఇట్లుండ నొకనాఁడు ఒకసిద్ధుఁడు వచ్చెను. ప్రవరుఁడు ఆతనికి సకలోపచారములును జేసి సంతోషింపఁజేసి విశ్రాంతి గైకొనిన పిదప చెంతఁజేరి "మహాత్మా! ఎక్కడనుండి ఎక్కడకు, బోవుచున్నారు? ఏయేదేశములందు వసించినారు? ఏయే పర్వతములను జూచినారు? ఏతీర్థములందుఁ గ్రుంకినారు? ఏయేద్వీపములు చూచినారు? మఱియు నింక నేయే స్థలములు సందర్శించినారు?" అని ప్రశ్నించెను. సిద్ధుఁడు అందులకు "నేను మెట్టని గుట్ట, నేను గ్రుంకని తీర్థము, నేను సేవింపనిక్షేత్రము, నేను చూడని స్థలమును లే"వని బదులు చెప్పెను; గాని ఈమాటలు వినుటవలన ప్రవరునకు ఆశ్చర్యము కలిగెను.

ఇంత తేఁబ్రాయమున ఇన్ని స్థలములు సందర్శించుట ఎట్లు? ప్రవరుని ఈయనుమానమును విని సిద్ధుఁడు మందహాసము గావించి "సదశరయె యోగాధారముగాఁ గలవారికిఁ ఇది పొసఁగనిదే; గాని నాకొక పాదలేపము తెలియును. దానివలన ఎంత దూరమైనను క్షణములోఁ బోఁగలను." అని చెప్పెను. ప్రవరునకుఁ దొలుత నాశ్చర్యము గలిగెను. పిదప నాశగలిగెను. సిద్ధుని ప్రసన్నునిఁజేసికొనిన సులభముగా సకలతీర్థములును సేవింపవచ్చును గదా! ఈయూహ నాతఁడు సిద్ధునకు ఎఱిఁగించి పొగడెను. సహజకోమల హృదయుఁడు అగుసిద్ధుఁడు పాత్రుఁడగు ప్రవరుని యభిలాషకు ఆనందించి తోడనే తన ప్రేఁపసజ్జయందలి పసరు తీసి ఇది యది యని చెప్పక ఆతని పాదములకుఁ బూసెను. ప్రవరుఁడు హిమగిరినిఁ జూడఁగోరెను. ఉత్తర క్షణమునందే ఆతఁడు హిమగిరిమీఁదికిఁ బోయి నిలిచెను.

హిమగిరిపై నాతఁడు అనేకరమ్యస్థలంబులం గాంచెను. అనేకదివ్యస్థలంబుల నరసెను. అన్నిటి మాహాత్మ్యమును ఎన్నుచు అటు నిటు తిరుగునప్పటికి పగలు రెండు జాములు అయ్యెను. "కర్మకలాపమునకు వేళ దాఁటిపోవుచున్నది. ఇప్పటికి ఇంటికిఁ బోయెదను. రేపు వచ్చి మఱలఁ జూడవచ్చును." అని యాతఁడు తలంచి ఎగురఁబోయెను, గాని ప్రయోజనము కలుగలేదు. చూడఁగా పాదములకుఁ బూయఁబడిన ఆకుఁబసరు మంచువలన కఱఁగిపోయి యుండెను. ఈస్థితిఁ జూచిన వెంటనే ప్రవరుని హృదయమున రాయిపడెను. "ఇఁక నిక్కడ నుండి విముక్తిలేదు. నాజీవితము ఇచ్చటనే క్షుద్రమార్గములయం దంతమగును." అని యాతఁడు అనేకవిధముల వగవసాగెను. కొంతతడవు ఇట్లు ఆతఁడు సకలమును మఱచి దుఃఖించి "హిమగిరి మునీంద్రులకు నిలయము. ఇందు నన్ను ఇలు సేర్పఁగల మహాత్ముఁడొకఁడును గాన్పింపఁడా! అని తలఁచి ముందునకు సాగఁగా నచ్చట నొకగానము వినఁబడెను. తోడనే ఆతని హృదయమున నొక యాశాజ్యోతి వెలిఁగెను. "ఇచ్చట నొక మున్యాశ్రమము మున్నది. నేను రక్షితుఁడ నగుదును" అని తలంచి యాతఁడు ముందునకుఁ బోఁగా నచ్చట ప్రౌఢు లిగురించునట్లు వీణవాయించు నొక గంధర్వరమణి కాన్పించెను. అతఁ డంతట

నేమియు ననుమానింపక ఆమె చెంగటి కేఁగి "కురంగనయనా! తోఁడులేక ఒంటిఁ జరించుచున్న నీ వెవ్వతెవు? నేను బ్రాహ్మణుఁడను. ప్రవరుఁడు నను వాఁడ. త్రోవ తప్పియున్నాను. నాపురము చేరు మార్గము చెప్పి పుణ్యము కట్టుకొమ్ము. నీకు శుభమగును" అని పలికెను. అంతకుఁ బూర్వమే ఆతనిపై మదిఁ దగిలియుండుటవలనను, ఈ అమాయికపుఁబలుకులు వినుటవలనను ఆమెకు చిఱునవ్వు వచ్చెను. అంత నామె "చేరెఁడేసి కన్నులుండఁ దెరువెవ్వరి నడిగెదవు? ఏకాంతమున నున్న జవరాండ్రను పల్కరించు నీదుండుడుకు దన మిఁకఁ జాలును. నీవు వచ్చిన త్రోవ ఇంతలోనే మఱచిపోయితివా? నా పేరు వరూథిని. ఘృతాచి, తిలోత్తమ, హరిణి, హేమ, రంభ మున్నగు రమణీశిరోమణులు నాకు ప్రాణసఖురాండ్రు. మేము రత్నకాంతులచే మిఱుమిట్లుగొను ఈ హిమవన్నగముమీఁద వసించియున్నవారము. భూసురా! కైతవకుసుమశరాసనా! మాయింటి బంధుగుఁడ వైతివి. మామణిభవన మున నేఁటికి నిలిచి విందుఁగైకొని మమ్మానందింపఁజేయుము. కుందనము వంటి నీమేను గాఢమగు మధ్యందినాతపముచే కందినది. ముద్దులొలుకు ముఖము వసివాడినది. బడలిక తీరిన తరువాతఁ బోవచ్చును. తొందరవలదు." అని బదులు చెప్పెను. వరూథిని తన భావమంతయు ఈమాటలయందు వెల్లడించితి ననుకొనెను. రెండవమదనుండనం జెల్లు ఈ భూసురుఁడు ఆభావ మును గ్రహించి తన్ను ఆదరించు ననుకొనెను; గాని ఆవైదిక బ్రాహ్మణు నకు ఈయర్థమే తోఁపదయ్యెను. ఆతఁడు "పాపము ఈపడుచు మర్యాద నెఱింగినది. బ్రాహ్మణభక్తిగల ఆస్తికురాలు." అని భావించెను.

ఆతని హృదయదర్పణము అమూల్యము. నిరుపమానము; గాని దాని మీఁద నగిషీపనులు లేవు. అది ఉన్నరూపమును ఉన్నట్టే గ్రహించును; గాని ఆరూపమునకుఁ జిన్నెలు వన్నెలు పెట్టఁజాలదు. వరూథిని, తత్తరపడి లేచుట, నునుసోఁగ బోదియఁ జేరి, విలోకనప్రభావీచికలను వెల్లిగొల్పుట మున్నగునవి లజ్జాకార్యములుగనే ఆహృదయదర్పణమునఁ బ్రతిఫలించెను. సందర్భములు ఇట్లుండుటం జేసి యావైదికశిఖామణి "రమణీ! నీవు చూపిన యాదరము చాలును. అదియే నాకు బ్రహ్మానందమును గూర్చినది. ఇక్కడే

నుండుటకు వీలులేదు. మీయింట నుండిన నొకటియుం నుండకున్న మఱి యొకటియుంనా? భక్తియే చాలును. అగ్నిహోత్రాదికములు అగు కర్మకాండము కొలిపేర్పవలసియున్నది, మానినీ! మీమాహాత్మ్యములు ఆశ్చర్యకరములు. మీకెందు నసాధ్యము లేదు. నన్ను నావారితోఁ జేర్పుము" అని బతిమాలెను. ఈ ఛాందసపుఁబల్కులకు ఆమెకు చిఱునవ్వు వచ్చెను. "బ్రాహ్మణుఁడా! ఊరో'యని పలువరించెదవు. ఎక్కడియూరు? నీకాలు ఒకచో నిలువదా? ఇంతలో నీయిల్లెక్కడకుఁ బోవును? ఈరత్నకందరములు, ఈచందనచందనోత్కరము, ఈగాంగసైకతములు, ఈలవలీనికుంజములు, ఇవన్నియుం మీపర్ణకుటీరమునకు సరిరాకపోయెనా? కుమారధరణీసురా, ఇఁక చల్లకై వచ్చి ముంత దాఁపనేల? మనసుఁడు నన్ను నీకు కన్యాదానము చేసినాఁడు. ఇఁక నీవు మాఱువల్కిన నేను బ్రదుకఁ జాలను. నన్ను బాల ముంచినను నీట ముంచినను నీదే భారము" అని యావరూథిని ప్రత్యుత్తర మిచ్చెను.

ప్రవరుని మది ఝల్లు మనియెను. ఇది యొక్కడి కర్మము? అని తలఁచి యతఁడు "కాంతా! నీవు వెఱ్ఱిదానవు, వ్రతిసై కర్మకాండమున దినములు గడపు నన్ను ఏమని కామించితివి? సంగతిసందర్భములు ఆలోచింపవలదా? నాకిట్టివి ఏమియుఁ దెలియవు. అగ్నిహోత్రములకును దేవతార్చనమునకును బ్రాహ్మణార్చనమునకును వేళ యతిక్రమించినది. భుక్తికాలము దాఁటిపోయినది. నా తల్లిదండ్రులు కడువృద్ధులు. వారు ఆఁకట నకనకలాడుచు నాకొఱకు ఎదురుచూచుచుందురు. వేయేల? నేఁడు ఇలు సేరకుండిన సమస్తధర్మములును చెడిపోవును. ఇఁక నాయెదుట నిట్టి మాటలాడకుము" అని నిశ్చయము తెలిపివేసెను. ఇది వినుటతోడనే వరూథిని హృదయము జల్లు మనియెను. ఇంతవఱకును గల ధైర్యము తొలఁగిపోయెను. అంతట ఎట్లో తేఱికొని ఆమె "మదనమోహనా, నీకిది తగునా? ఇట్టి ఎలప్రాయము చాలును మూలములేని వైదికకర్మలలోఁ గడుపఁ జెల్లునా? ఇఁక సుఖించుట ఎన్నఁడు? మీయజ్ఞములకు అన్నిటికిని ఫలము స్వర్గముఁ గిల్ల సుఖించుటకే గదా? ఇట సమస్తమును కలదు. ననుగూడి ఇంపు సుఖింపు

ప్రము. ఎంతపుణ్యము చేసికొనిన మానవునకు గంధర్వాంగనల పొందు లభించును! స్వర్గఫలం బెల్ల ఎదుట సాక్షాత్కరించి ప్రార్థించుచుండ దేహశోషణములగు వ్రతములకొఱకు ఇంకను బ్రాకులాడెదవేల!" అని యాతని నొడఁబఱుపఁ జూచెను; గాని వీనివలన బ్రవరుని మదికి చలనము కలుగలేదు. "అతివా! నీవు చెప్పినది ఎల్ల కాముకులసంగతి. కామదూరులకు ఇది ఎట్లు సందర్భించును? నాతో నిఁక వేఱొండుమాట లాడకుము. ఎఱిఁగితివేని అరుణాస్పదనగరమార్గమును దెలిపి పుణ్యము గట్టుకొనుము. లేకున్న నూరకుండుము" అని యాతఁడు ఇఁక మొగమోట విడిచి పలికెను; గాని ఇంతమాత్రమున వరూథినికి ఆశ్చర్యము గలుగలేదు. "బ్రాహ్మణుఁడా! ఏల చెడెదవు? హృదయ మెందు లగ్నమై ఏకాగ్రమై యుండునో, ఇంద్రియములు ఎందు లగ్నములై వఱలకుండునో, అట్టి అదియే పరబ్రహ్మము. 'ఆనందో బ్రహ్మ' యను ప్రాఁబలుకు నూహింపుము" అని యామె మఁదలకించి "ఇఁక నీతఁడు దీనికిఁ బ్రత్యుత్తరము చెప్పలేఁడు. స్వాధీనము అగును" అని గర్వించెను; గాని అతఁడు అందులకు ఒడంబడలేదు. అతఁడు మందహాసము గావించి పెదవి విఱిచి ఇట్లు చెప్పెను. "తరుణీ! ఇట్టి యద్భుతపాండిత్యము నీకుఁదక్క మఱియేరికిని లేదు. కామశాస్త్రోపాధ్యాయినికిఁ దగినట్లు పలుకుచున్నావు. త్రయీధర్మములు పాపములు. రతియే పుణ్యము అను నీవాదము కంటె మఱియొక వింతయేమి యున్నది? మోక్షప్రాప్తికి ఇంతకన్న మార్గము లేదని నీవు చెప్పవలసినదే. ప్రాతస్సాయంకాలములయందు హవ్యములచే దృప్తుఁడగు అగ్నిదేవుఁడు అనుగ్రహించు సౌఖ్యములను వివరింప నాకుఁ దరముగాదు. నాకు అరణులు, దర్భలు, అగ్నులు ప్రియములైనట్లు ఇతరములు ఇష్టములు గావు. దేహములు శాశ్వతములు గావు. మీసాలమీఁది తేనియలవంటి ఇట్టి తుచ్ఛసుఖములను గుఱించి ఇక నాచెంతఁ జెప్పకుము."

ఈమాటలు వినునప్పటికి వరూథినికి మాటలేకపోయెను. కన్నుల నీరు గిఱ్ఱునఁ దిరిగెను. కంఠమునందు గద్గదిక తోఁచెను. అంత నామె ఎట్లో తెఱచేసికొని "నన్నింక బాధపెట్టకుము" అని దీనయై మీఁద వ్రాలి కౌఁగి

లించి అధరము నొక్కఁజూచెను. అంతట బ్రాహ్మణుఁడు ఓరమోమిడి ఆమె ప్రయత్నమును గొనసాగనీయక "ఫో" అని త్రోసివేసెను. అటు అతఁడు త్రోయఁగా ఆమె పరాభవమువలన సిగ్గును ఆవెంటనే అధికతరదుఃఖమును గదలుకొనఁగా చుఱచుఱఁ జూచుచు నింకను కొంచెము ఆసతో కొప్పు సవరించుకొనుచు "కృపారహితుఁడా! నీవు గెంటిన ఇంతులు తాళఁగలరా? నీగోరు ఇచ్చట గీచుకొనిపోయెఁ జూడుము." అని కొంతపడి వేదనపెంపున కలస్వనంబుతో నేడ్చి "యాగములు చేసితి నంటివి. తపము చేసితి నంటివి. నిర్దయుఁడు ఎన్ని చేసిన నేమిఫలము? భూతదయగలవానికి అనేక సత్కార్యములు చేసినవానికిఁ గలుగు పుణ్యములు గలుగును. ఈమాత్రము తెలియలేనివాని నీచదువేమి ప్రయోజనము? పరాశరుఁడు దాశకన్యతోఁ గ్రీడించెను. విశ్వామిత్రుఁడు మేనకతో రమించెను. మాండకర్ణి అచ్చరలతో భోగించెను. ఇంద్రుఁడు అహల్యతో సుఖించెను. వారికేమైన వన్నె తరిగెనా? నీవు అంతకంటెను ఘనుఁడవా? ఇనుపకచ్చడాలు కట్టుకొనిన మునిముచ్చు లందఱును తామరసనేత్రలఇండ్ల బందాలు కారా?" అని మఱల మూదలకించెను.

ప్రవరుఁడు ఆమాటలు ఏమియును వినిపించుకొనక ఆమె పైఁబడినపుడు అంటిన జవ్వాది కడిగికొని వార్చి గార్హపత్యవహ్నినిఁ బొగడి తదనుగ్రహమున స్వస్థలముఁ జేరుకొనెను.

ప్రవరుని కాఠిన్యమునకు ఆమె కుందుచుండఁగా నామె చెలికత్తెలు వచ్చి ఊరడింపఁ బూనిరి; గాని ప్రయోజనము లేకపోయెను. ఆమెకు విచారము పొంగిపొంగి యుబుకసాగెను.

అట్టి స్థితియందే సఖులు ఆమెను పూదోఁటకుఁ గొనిపోయిరి. అంతకుఁ బూర్వము గంధర్వుఁ డొకఁడు ఆమెను మోహించి తిరస్కృతుఁడయ్యె "జవరాండ్ర చిత్తములు చంచలములు. ఓపికపట్టి సమయ మెఱిఁగి ప్రవర్తించిన నేఁడు తిరస్కరించినవనితలు రేపు గౌరవించి చేకొందురు" అని తలఁచి అందే డాఁగియుండెను. అదృష్టవశమున ప్రవరుని వరూథిని మోహిం

చుటయు, ఆతఁడు తిరస్కరించి పోవుటయుం గంధర్వుని కంటఁబడెను. అంతట నాతఁడు "నేను అదృష్టవంతుఁడను" అని తలంచికొని సఖులతో వరూథిని పూలదోఁటకు వచ్చునప్పటికి అచ్చటను బ్రవరునిరూపము ధరించి ఆవనమున నొకచో దేవతార్చనకుఁ బోలె పూలు గోయుచుండెను. పరిభ్రమణవశమున వరూథిని ఆతనిం జూచెను. తోడనే యామె మహోత్కంఠతో నాతనిచెంతకుఁ బోయి అతిదీనముగఁ బ్రార్థించెను. తన యభిలాష నెఱవేఱినందులకు గంధర్వుఁడు హృదయమునఁ బరమానందభరితుఁ డై కరుణార్ద్రహృదయునిబోలె నటించుచు "అబలా! నీవు సంగతిసందర్భములు ఆలోచించుట లేదు. అరుణాస్పదనగరవాసినగు నేను ఎక్కడ? హిమగిరివాసిని వగు నీవు ఎక్కడ? ఇంట నాతల్లిదండ్రులును, ఇల్లాలును నాకొఱకు దుఃఖించుచుండఁగా కర్మకాండమెల్ల బూడిఁ గలియుచుండఁగా ఏమియుం దెలియఁగనివానివోలె నేను నీతో భోగించుచు నిచ్చట నెట్లుండఁగలను? నీతోఁ గలిసిమెలసి యుండుట కన్న, ఇంద్రభోగము వేఱు లేదని నాకుఁ దెలియనిది గాదు. అయినను దుఃఖితుఁడనగు నాకు సర్వము నసహ్యముగ నున్నది. అయినను నిన్నటినుండియుం నీవు అనుభవించుచున్న పరితాపమును జూడఁజాలకున్నాను. వ్రతముకంటె పరోపకారమే ఘనము గదా! అయినను ఒక్క సంగతి కలదు. సంభోగసమయమున స్త్రీపురుషులు ఒండొరులు చూచుకొనఁగూడదు. కన్నులు మూసికొనవలెను. ఇది మాదేశమునఁ గల సదాచారము. ఈ యాచారమునకు విరుద్ధముగ నేను ప్రవర్తింపఁజాలను. ఇందులకు నీకిష్టమేని చెప్పుము. లేకున్న ఇంక నేనెట్లు ఇంటికిఁ బోలేనుగదా? ఈమందాకినీతీరమున ఈహిమగిరిపై ఈవనములో ఈమునుల నడుమ విధికి అబ్రహ్మణ్యముఁ బెట్టుచుఁ దపము ఆచరింతును. మఱియుం నీకు నొక్కటిగూడ వినుము. తొలుత మొగమోటపడిన పిదప దుఃఖింపవలసివచ్చును. అంత్యనిష్ఠురత్వముకంటె ఆదినిష్ఠురత్వము మంచిది. వ్రతము చెడినను ఫలము దక్కవలయునుగదా? నేను నిన్ను సమ్మతింపఁజేసి పోవుదనుక నీవు నన్ను విడువఁగూడదు. దీనికి నీపూర్ణాంగీకారమును దెలుపుము. ఇంతయేల నందువా? నేను విదేశీయుఁడను. నీకొఱకు నేను వ్రత

భ్రష్టుఁడ నగుచున్నాను. నాజీవితమును నీపాదనికటమున నర్పింపఁబోవుచున్నాను. నీతో చిరకాలము సుఖింపనైన సుఖింపవలెను. లేకున్న తపమైన నాచరింపవలెను గాన ఉభయభ్రష్టత్వమున కంగీకరింపఁజాలను గదా!" అని యూరకుండెను.

ఉన్నట్లుండఁగా వరూథిని హృదయమున ఈ అనుకూలవచనము వినుటవలన ఆనంద మొక్కమాఱుగ విజృంభించుటవలన ఉక్కిరిబిక్కిరియై కొంతదడవు మాట్లాడఁజాలక గద్గదికతో "నీచెప్పుచేఁతల మెలంగుదాన" నని బాస చేసెను. ఇది విని ఆమె చెలికత్తె లెల్లరును కొంతపడి మేలమాడి పిదప వారిని ఒక మణిమండితాలయము సేర్చి వెడలిపోయిరి.

పిదప వారు చిరకాలము అనంగసుఖసాగరమునఁ దేలినపిదప వరూథిని గర్భవతి యయ్యెను. అదితెలిసి గంధర్వుఁడు "ఇఁక నిక్కడ నుండవలసినపని తీఱిపోయినది. చెప్పకయే పోయిన వియోగమును దాళఁజాలక మృతిఁజెంది నాకు స్త్రీహత్యాపాతకము నంటఁగట్టవచ్చును. ఇచ్చట నేయున్న మోసము బయల్పడుటయుఁ అందులకుఁ గినిసి యామె శపించుటయుఁ సంభవింపవచ్చు"నని తలంచి ఒప్పించిపోవు చనువాఁడై ఒకనాఁడు ప్రేమతోఁ జేరఁదీసి "ప్రియా! నాకుఁ బాదలేప మొసంగినసిద్ధుఁడు తీర్థయాత్రావశంబున నిచ్చటకు వచ్చి నాకుఁ గాన్పించెను. అతనివలన నాసంసారపుస్థితిగతులు అన్నియుఁ దెలియవచ్చెను. ఇంతీ! ఏమిచెప్పుదును ! నాయసాన్నిధ్యమువలన కుండువంటి నాసంసారము అంతయుఁ బాడై పోయినది. నాతలిదండ్రులు మంచములఁ బట్టి నాయందె ప్రాణములు నిలుపుకొని యున్నారు. ఇంక నా యిల్లాలి సంగతి చెప్పనక్కఱలేదు. శిష్యులు చెల్లాచెదరై పోయినారు. పొలములు అన్నియుం బీడులు అయిపోయినవి. ఇవి విన్న నామనసున కెట్లుండునో యోచింపుము. కావున ఒకమాఱు పోయి అందఱ నూఱడించి సంసారమంతయుం చక్కఁ జేసికొని మఱల వచ్చెదను; గావున అనుగ్రహించి నాకు సెలవు దయచేయుము." అని పలికెను.

ఇది వినిన తోడనే వరూథిని కన్నులనుండి బాష్పధారలు దొరలసాగెను. అంతట గంధర్వుఁడు ఆమెను జేరఁదీసి కౌఁగిలించుకొని "ధీరురాలవు.

ప్రియా! నీవు ఇట్లు వగవఁదగునా? దివ్యవనితవై యుండియు సంగతి సందర్భములు యోచింపక ఇట్లు విచారింతువా? యోగము, వియోగము శాశ్వతములా? రాకపోకలు కట్టుపడిపోవు సందర్భములు ఇప్పుడేమి తటస్థించినవి. ఆసిద్ధుఁడు నాకు ఆ మహావిద్యను మూలముట్టుగ నేర్పించెను. ఇఁక నాకిచ్చటకు మఱల వచ్చుచుఁ బోవుచునుండుట విలాసమాత్రము." అని యామె నెట్లో యూరడించి తనమార్గమునఁ బరమానందముతోఁ బోయెను.

పిదప వరూథిని నవమాసములును నిండుచు నొక శుభముహూర్తమున చక్కని కుమారునిఁ గనెను. మునులు అతనికిఁ జాతకర్మ నిర్వర్తించి సూర్యచంద్రులువోలె వెలయుచుండుటఁ గాంచి స్వరోచి యను నామం బిడిరి. యుక్తసమయమున అక్షరాభ్యాసముఁ జేసి సకలవిద్యల నుపదేశించిరి. స్వరోచి అద్వితీయవీరుఁడై మందరగిరిమీఁద విశ్వకర్మచే నిర్మితంబైన నగరమును ఆటవికులు ఎల్లరును భయభక్తులతోఁ గొలుచుచుండ రాజ్యపాలనము ప్రారంభించెను.

ఇట్లుండ నొకనాఁడు అతఁడు పరిజనులచేఁ బ్రోత్సహింపఁబడి యొక మహారణ్యమునకు వేఁటకుఁ బోయెను. అచ్చట నాతఁడు తనివితీఱునట్లు దుష్ట మృగములను సంహరించి వినోదించుచుండఁగా కొన్ని యపశకునములు అయ్యెను. అవి చూచి శాకునికుఁడు ఒకఁడు లేచి "దేవా! అనిమిత్తములం పొడచూపుచున్నవి. మన పొలము దాఁటి చాల దవ్వు వచ్చితిమి. ఇఁక మఱలుదము" అనియెను. అది విని స్వరోచి గుఱ్ఱమెక్కెను. ఆ వెంటనే మఱికొన్ని శుభశకునములు అయ్యెను. స్వరోచి "తొలుత నేదో మహా యుద్ధము అపాయకరమైనది జరిగినపిదప జయమబ్బు"నని తలంచుచుండఁగా చెంగట "హా, హా, అబలను, ఆర్తను, అనాథను, ఎవరును రక్షించువారు లేరా?' అని ధ్వని వినవచ్చెను. "ఎవరో దుర్మార్గు లొక అనాథరమణిని బాధించుచున్నారు. రక్షించెద" నని స్వరోచి, ధ్వని వచ్చిన దిక్కునకు ఊఱక నంకించుచుండఁగా ఒక జవరాలు తడఁబడుచు వచ్చి "రాజా! నేటి

మూఁడుదినములనుండి ఒకరాక్షసుఁడు నన్ను వెంబడించుచున్నాఁడు. నేను ఇందీవరాక్షుఁడు అను గంధర్వరాజునకు మరుదశ్వని కుమార్తెయందుఁ బొడమిన మనోరమ యనుదానను. నాతలిదండ్రులు నన్ను మిగుల గారాబముతోఁ బెంచుకొనుచుండిరి; గాని ఆసుద్దులు అన్నియుం ఇప్పుడు ఏటికి? నాకు కళావతి విభావసి అను ఇరువురు చెలికత్తెలు కలరు. ఒకనాఁడు మేము మూవురమును వెండికొండకుఁ బుష్పములకొఱకు అరిగి అందు తృణాచ్ఛాదితముఖంబగు ఒక గుహాయందు ఒక వృద్ధమునిని గాంచితిమి. అతఁడు బూదివలె నుండుటచే 'ఇతని నోరెద్ది? ఇతని నేత్రములు ఎవ్వి? ఇతని చెవులు ఎవ్వి' అని బాల్యచాపలమున మొగముపట్టికొని ఊఁపితిని. అంతట నాముని సమాధిభ్రష్టుఁడై 'పడుచుఁదనపు మదముచే ఒడలెఱుఁగక వృద్ధుఁడ నగు నన్నిట్లు అవమానించితివి; గావున నీవు రాక్షసునిచేతంబడి శ్రమపడెదవుగాక' అని శపించెను. మఱియుం నాతఁడు గొడ్డును బాదినట్లు తన చేతి నాగబెత్తముతో నన్ను చావఁగొట్టెను. అంతట నాచెలికత్తెలు తెగఁబడి ఆతనిని 'నీవు మానవజన్మ మెత్తలేదా? ఆఁడుతోడునఁ బుట్టలేదా? నీతపస్సు ఇందులకేనా? ఈకుసుమకోమలి నిట్లు చావఁగొట్టుటకు చేతులును, శపించుటకు నోరును ఎట్లు వచ్చెన?' వని దూఱఁగా నాతఁడు వారిమీఁద మఱింతకోపపడి క్షయరోగముచే మీరు పీడితులగుదురుగాక యని శపించెను. ఆదారుణరోగము వారి నప్పుడే ఆశ్రయించెను. పిదప నన్ను ఒక ఘోర రాక్షసుఁడు మూఁడుదినములనుండి వెంబడించుచున్నాఁడు. రాజా! నీకు నేను అస్త్రహృదయము అనువిద్య నిచ్చెదను. దానిని తొలుత ఈశ్వరునిచే స్వాయంభువమనువును, ఆతనివలన వసిష్ఠుఁడును, ఆతనివలన చిత్రాశ్వుఁడు అను నామాతామహుఁడును, క్రమముగ బొందిరి. ఆతఁడు మాతండ్రికి అరణము ఇచ్చెను. మాతండ్రి నాకు ఇచ్చెను. దానిని నీకు ఇపుడు ఒసంగెదను. దానిసాయంబున నీవు నన్ను వెంబడించుచున్న రాక్షసునిఁ దునుమాడి నన్ను రక్షింపుము, ఒకానొక స్త్రీవలన విద్యఁ బడయుటకు సందేహింపకుము" అని పలికెను. స్వరోచి ఆమాటలకు సంతసించి శుచియై నిలిచెను. తోడనే మనోరమ ఆవిద్యను సరహస్యముగ నాతని కుపదేశించెను.

ఇంతలో రాక్షసుఁడు మండిపడుచు వచ్చి స్వరోచిని దాఁకెను. అంతట పోరు ప్రారంభమయ్యెను. రాక్షసుఁడు ఎంతకును తగ్గకుండుటఁ జూచి స్వరోచి ఆగ్నేయాస్త్రమును బ్రయోగించెను. ఆయేటుతో రాక్షసుఁడు నేలఁ గూలెను. తోడనే ఆఘోరదేహమునుండి ఒకానొక దివ్యతేజస్సు మింటికెగసి గంధర్వరూపము గొనెను. ఉత్తరక్షణమునందే గంధర్వుఁడు క్రిందికి వచ్చి స్వరోచిని ప్రేమతో కౌఁగిలించుకొని "వత్సా! నీవు క్షేమముగా నున్నావా? నీ ప్రజలకు అందఱును క్షేమమా? నేను ఇందీవరాక్షుఁడు అను గంధర్వుఁడను. ఈమనోరమ నాముద్దులకుమార్తె. ఒకముని ఆయుర్వేదమును శిష్యులకు ఉపదేశించుచుండుటఁ జూచి దానియందు ఆసగొని చెంతకుఁ బోయి అభివందనము చేసి ఆయుర్వేదము ఉపదేశింప ననేకవిధములఁ బ్రార్థించినను ముని తిరస్కరించెను. అంతట నేను ప్రచ్ఛన్నుఁడనై అదియంతయుం నెనిమిదిమాసములలో గ్రహించి సంపూర్ణమైన తరువాత నిజరూపముతో నెదుటకుఁ బోయి 'ఓయీ! చదువు చెప్పుమనిన గొణుగుకొంటివి. ఆసక్తియున్నవానికి విద్య రాకపోవునా?' అని చేసినది అంతయుఁ జెప్పితిని. అందులకు ముని కోపించి 'ఘోరరాక్షసుఁడవు కమ్ము' అని శపించెను. అందులకుఁ జింతించి శరణుఁ బొందఁగా కనికరించి యాతఁడు 'కొన్నిదినములకు కొమార్తెను మ్రింగఁబోయి కడకొక ధన్వుని శరముల వాతఁబడి శాపముక్తుఁడ వయ్యెదవు' అని యానతిచ్చెను.

పిదపఁ గొలఁదిదినములకే నాకు రాక్షసత్వము ప్రాప్తించెను. పౌరుల నందఱను మ్రింగితిని. ఇరుగుపొరుగు పట్టణములనుగూడ నాశము చేసితిని. తుదకు వీరును గాన్పింపకపోవుటచే కొమార్తెను వెంబడించితిని. పిదప జరిగినదంతయుం నీకుఁ దెల్లమే" యని యాతఁడు సర్వము నాలింగించి "నీవు నాకు చేసిన మహోపకారమునకు నీకు ఏమి చేసినను తీఱదు. అయినను ఆయుర్వేదమును రమణీమణి యగు నాగారాబుకూఁతురు మనోరమను నీకు అర్పించెదను. గైకొమ్ము" అని చెప్పెను. స్వరోచి ఆనందముతో నంగీకరించెను. వారు అందఱును నాఁటిరేయి అక్కడనే గడపిరి. తెల్లవాఱినపు

టికి ఇందీవరాక్షుని మంత్రిసామంతాదులు అందఱును వచ్చి ప్రభువునకు స్వాగతమిచ్చిరి. పిదప ఇందీవరాక్షుఁడు స్వరోచితోడను మనోరమతోడను మహావైభవము నెలంగ స్వపురమునకుఁ బోయి ఒక శుభముహూర్తమున మహావైభవముతో మనోరమను స్వరోచికిఁ బెండ్లిచేసెను. మఱియు నల్లునకు అనేకామూల్యవస్తువులు కానుకగా నిచ్చెను.

పెద్దలు మనోరమాస్వరోచులకు పునస్సంధానము చేయించిరి. నాఁటిరాత్రి మనోరమ వదనము వాడియుండెను. స్వరోచి అందులకేమి కారణమని యడుగఁగా నామె నాచెలికత్తెలు ఇద్దఱు ఘోరకాంతారమున క్రూరవ్యాధిచే బాధపడుచుండఁగా నాకెక్కుడి యానందమని పలికెను. తోడనే స్వరోచి మనోరమ దారిచూపఁగా నరణ్యమునకుఁ బోయి తనకు ఆయుర్వేదము కరతలామలకమై యున్నది గావున చికిత్స చేసి వారికి పూర్వసౌందర్యము నొడఁగూర్చెను. అంతట వారిరువురును తాము నేర్చిన విద్యల నాతనికిచ్చి తమ్ము పెండ్లియాడవలసినదని ప్రార్థించిరి. స్వరోచి మనోరమ యనుజ్ఞను బొంది యట్లే కావించె.

పిదప వారు మువ్వురతోడను అతఁడు చాలకాలము సుఖించెను. ఒకనాఁడు అతఁడు వేఁటకమి నడవికిఁ బోయెను. అచ్చట ననేకజంతువులను సంహరించిన పిదప నాతఁ డొక పందిని సంహరింపఁబోఁగా నొక యాఁడు లేడి ఎదుటకు వచ్చి "రాజా! దానినిం జంపకుము. దానివలన నీకేమియుం బ్రయోజనము లేదు. నన్నుఁ జంపుము" అనియెను. అందులకు రాజు ఆశ్చర్యచకితుఁడై నిన్నేల చంపవలయు నని యడుగఁగా నది ఇట్లు అనియెను. "ఇతరాంగనలతోఁ గ్రీడించు వానిని గోరుటకన్నఁ జచ్చుటమేలు" ఇది విని రాజు "నీవెవ్వనిని మోహించితివి?" అని యడుగఁగా లేడి నిన్నే యనెను. రాజు అందులకు విభ్రాంతుఁడై మాఱుపలుకఁ జాలకయుండఁగా నది "నన్ను కౌఁగిలించుకొనుము. అంతే చాలు" ననియెను. రాజు అట్లే చేసెను. తోడనే లేడి ఒక అద్వితీయసుందరి యై అతనికౌఁగిట నిలిచెను.

ఇది చూచి రాజు ఆశ్చర్యచకితుఁడై నీచరిత్ర చెప్పుమని యడుగఁగా "నేను ఈవనదేవతను. సమస్తదేవతలును నీవలన మనువును బడయం

టకు నన్ను ప్రార్థింపఁగా వచ్చితిని. రాజా! నీవు అదృష్టవంతుఁడవు. నన్ను అంగీకరింపుము" అని యామె బదులు చెప్పెను. రాజు ఆనందించి ఆమెను స్వీకరించెను.

కొన్నిదినములకు ఆమె గర్భిణియై నవమాసములు నిండినతరువాత నొక చక్కని కుమారునిఁ గనియెను. స్వారోచిషుఁ డను పేరుగల యా బాలకుఁడు యుక్తసమయమున శ్రీహరిని గూర్చి తపంబాచరించెను. శ్రీహరి ప్రసన్నుఁ డయ్యెను. స్వారోచిషుఁడు అనేకవిధముల శ్రీహరినిఁ ప్రార్థించి "దేవా! నేనీప్రపంచమున నుండఁజాలను. నన్ను నీలోఁ గలుపుకొనుము" అని వేఁడెను. అందులకు శ్రీహరి "నీకోరినయట్లే ఇచ్చెదను; కాని కొన్నిదినములు నీవు భూలోకమున ధర్మమును రక్షింపవలసియున్నది. కావున రెండవ మనువవై పాలింపుము." అని యాజ్ఞాపించి తిరోహితుఁ డయ్యెను. స్వారోచిషుఁడును శ్రీహరియానతి చొప్పున చాలఁగాలము ప్రజలను పాలించి తుది శ్రీమహావిష్ణువులో నైక్యమయ్యెను.

# పెద్దననుగూర్చిన కొన్ని అంశములు

## పెద్దన-ఆంధ్రకవితాపితామహ బిరుదము

పెద్దనగారికన్న ముందీబిరుదమును నిరువురు కవులు ధరించిరి. మొదటివాఁడు శివదేవయ్య. ఇతఁడు "సంస్కృతాంధ్రకవుల కెల్ల పితామహుఁడు"గా నాతని వంశీయుఁడగు ఘట్టూరి శరభరాజ కవీంద్రునిచేఁ బ్రస్తుతిఁ గన్నవాఁడు. (చూడుఁడు అధ్యాత్మ రామాయణావతారిక - శరభరాజకవి.) తరువాతివాఁడు కొలని సత్యనారాయణకవి. ఇతనికి సత్తెనారన యని వ్యావహారికనామము. ఇతఁ డాంధ్రకవితాపితామహుఁ డని యీతని తమ్ముని కొడుకు కొలని గోపరాజకవి "సింహాసన ద్వాత్రింశిక"లోఁ జెప్పినాఁడు. కావున పెద్దనగారు మూఁడవవారు. పెద్దన వెనుక నీ బిరుదమును నీ క్రిందివారు ధరించిరి. కాలక్రమము సరిగా తెలియుటకు నొక పట్టిగా నిచ్చుచున్నాను.

| | | |
|---|---|---|
| 1. శివదేవయ్య | క్రీ. శ. 1260 | ఆంధ్రకవితాపితామహుఁడు |
| 2. కొలని సత్తెనారన | 1400 | ,, |
| 3. అల్లసాని పెద్దన | 1530 | ,, |
| 4. [1]ఉప్పు గుండూరి వేంకటకవి | 1600 | ,, |
| 5. [2]ఎనమండ లక్ష్మీనృసింహకవి. (ఆంధ్రకౌముది) | 1680 | ,, |
| 6. మండపాక పార్వతీశ్వరకవి | (1833-1897) | అభినవాంధ్రకవితా పితామహుఁడు. |

1. చూడుఁడు కకుత్స్థ విజయము అవతారిక. 2. ఆంధ్రకౌముదిగద్య. పార్థివ - ఫాల్గునము భారతి - ప్రథమాంధ్రకవితాపితామహుఁడు: శివదేవయ్య,

ని. వేంకటరావు.

## పెద్దన్నగారిచాటువు - నిరుపహతిస్థలంబు

శ్రీకృష్ణదేవరాయలు కృతి రచింపు మని కోరఁగా, పెద్దన్నగా రీ క్రింది చాటువును చెప్పినట్లు సర్వాంధ్రలోక విదితమై యున్నది.

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడెమాత్మ కింపయిన భోజన మూయ్యెలమంచ మొప్పుత
ప్పరయుఁ రసజ్ఞులూహఁ దెలియంగలలేఖక పాఠకోత్తముల్
దొరకినఁగాని యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే.

కాని పైపద్యము పెద్దనగారు స్వయముగా రచియింప లేదనియు నీ క్రింది కన్నడ పద్యమున కది యనువాద మనియుఁ దెలియ వచ్చుచున్నది.

చ. నిరుపహతిస్థలం మృదుతరాసన మెల్లణిసింపుదంబులం
నరపిన పుస్తకప్రతతి లేఖకవాచక సంగ్రహం నిరం
తర గృహనిశ్చితస్థితి విచారక సంగతి సత్కళత్ర సా
దరతయినుళ్ల సత్కవియుం మాసువదాగదె కావ్యవార్ధియం.

ఇందు చివరపాదమున భావము మాఱినను ఎత్తుగడ, పదబంధము తెనుగుపద్యమునకు కన్నడపద్యము మూల మని పట్టి యిచ్చుచున్నది. చారిత్రకముగ నీ పద్యము పెద్దనగారి కాలమునకు మూఁడువందల యేండ్లు ముందుగ వెలసి యున్నది. క్రీ. శ. 1240 లో కన్నడ భాషలో సంకలన రూపమున వెలసిన సూక్తిసుధార్ణవము అను కన్నడ గ్రంథమున నిది గలదు. కావున పెద్దనగా రీ కన్నడ పద్యము స్ఫురణకు రాఁగా తెనుఁగుపద్యము చెప్పి యుందురు. కృష్ణదేవరాయలు కన్నడ రాయఁడును తెనుఁగు రాయఁడును కాఁబట్టి యానాఁడు తెనుఁగుకన్నడ కవులకు రాయల యాస్థానమున స్థానము లుండెను. ఈ పద్యమునకు కన్నడము మూల మనునంతమాత్రమున పెద్దన గారి కీర్తికి లోటురాదు. ఆ పైఁగా పెద్దన్నగారికి కన్నడభాషాపరిచయము కూడ కలదని యిది రుజువు చేయుచున్నది. పద్యవివరణమును బట్టి యిదియే నిశ్చిత మగుచున్నది.

తెనుఁగునఁగల యతి నియమమునుబట్టి కన్నడ పద్యములోని భావములలో మార్పు వచ్చినది.

| కన్నడపద్యము. | తెనుఁగుపద్యము. |
| --- | --- |
| నిరుపమాతిస్థలంబు | నిరుపమాతిస్థలంబు |
| మృదుతరాసనము | ఉయ్యాలమంచము |
| ఒళ్ళణిసి | ఇంపయిన భోజనము |
| ఇంపుదంబులం | కప్పురవిడెము |
| పుస్తకప్రతతి | లేదు |
| లేఖకవాచక సంగ్రహం | లేఖక పాఠకోత్తముల్ |
| నిరంతర గృహానిశ్చింతస్థితి | రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చుట |
| సత్కళత్రసాదరత | అను వాక్యమున గర్భితము ఒప్పు తప్పు |
| విచారకసంగతి | రసజ్ఞులు. ఊరక కృతుల్ రచియింపు |
| కావ్యవారిధి గడచుట | మటన్న శక్యమే అను భావముగా మారి |
| | నది. |

ఇట్లే నన్నయాదుల కవనంబులందును కన్నడ పద్యముల ఎత్తుగడలు కనపట్టు చున్నవి.

భారతి — మార్చి 1949 సం. 26. సం. 3.

పూర్వసాహిత్యవీధులు. ని. వేంకటరావు. పుటలు. 134-139.

శ్రీ ర స్తు

# మనుచరిత్రము.

సటీకము

---

## పీఠిక.

శ్రీ వక్షోజకురంగనాభ మెదపైఁ
జెన్నొంద విశ్వంభరా
దేవిన్ దత్కమలాసమీపమునఁ బ్రీ
తిన్ నిల్పినాఁడో యనం
గా వందారుసనందనాదినిజభ
క్తశ్రేణికిన్ దోఁచురా
జీవాక్షుండు కృతార్థుఁ జేయు శుభదృ
ష్టిన్ గృష్ణరాయాధిపున్. 1

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే, సద్యః పర నిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే." అనునాలంకారికప్రామాణ్యం

బున నాంధ్రకవితాపితామహుఁడు శ్రేయస్సాధనం బగుకావ్యము రచింపఁ బూని "ఆశీర్నమస్క్రియావస్తునిర్దేశో వాపి తన్ముఖమ్" అను మంగళవిధములలో నాశీర్వాదరూప మగుమంగళమును గావ్యారంభమున నిటు లొనరించెను.

టీక. శ్రీవక్షోజకురంగనాభము- శ్రీ=లక్ష్మియొక్క, వక్షోజ=కుచములయందలి, కురంగనాభము=కస్తూరి, ఎదపైన్ = ఱొమ్ముమీఁద, చెన్నొందన్, విశ్వంభరాదేవిన్ = భూదేవిని, తత్కుచభాగసమీపమునన్ = ఆలక్ష్మిచెంతను, ప్రీతిన్, నిల్పినాఁడో, అనంగాన్. వందారు...శ్రేణికిన్ - వందారు = నమస్కరించు, సనందనాది = సనందనుఁడు మొదలగు, నిజ = తన, భక్త శ్రేణికిన్ = భక్తసంఘమునకు, తోఁచు, రాజీవాక్షుండు = కమలములఁ బోలుకన్నులు గలవిష్ణుఁడు, శుభదృష్టిన్ = శుభకరమైన చూపున, కృష్ణరాయాధిపున్, కృతార్థున్ = నెఱవేర్పఁబడిన ప్రయోజనము గలవానినిఁగా చేయుంన్.

తాత్పర్యము. లక్ష్మీదేవిని కౌఁగిలించుకొన్నప్పు డామె పాలిండ్లమీఁది కస్తూరి తనఱొమ్మున నంటుకొనఁగాఁ, దత్కాలమున సేవింప నరుదెంచిన సనందనాదులకు, లక్ష్మితోపాటు భూదేవినిసయితము ఱొమ్ముపై నిల్పికొన్నా నా యనుతలంపుఁ గలుగఁజేయుంవిష్ణుమూర్తి కృష్ణరాయప్రభునిఁ గృతార్థునిఁ జేయుఁగాత.

లక్ష్మీదేవికుచములయొత్తిడివలనఁ గలిగినకస్తూరిమచ్చను నిత్యబ్రహ్మచర్యపరు లగుసనందనాదులు గ్రహింపకపోవుట సముచితముగా నున్నది. మఱియుఁ గృష్ణరాయలకు రాజ్యలక్ష్మీసమృద్ధి నాశాసించుచు విష్ణుని లక్ష్మీభూములఱొమ్మున నిల్పుకొనువానిఁగా వర్ణించుట యుక్తరూపము.

కావ్యాదియందు మగణము శుభదాయక మనుటకు—"శ్లో. మో భూమిస్త్రిగురుశ్శ్రియం వితనుతే"; మఱియుం, అప్పకవి,—

తే. "భువనముల కెల్ల నాధారభూతమైన
జగతి యధిదైవతంబుగాఁ జను మగణము
తనకుఁ గారణ మగుటచే దానిఁ గూడి
ధన మొసఁగు నీఁడునని పల్కెఁ దాతనొజ్జ."

కావ్యాదిని శ్రీకారము శుభదాయక మనుటకు——

క. "వదపడి శ్రీకారము కృతి, మొదల నిలిచి దోషపుంజము నడంచి శుభం
బొదవించుఁ బరుస మినుమును, గదిసి సువర్ణంబు సేయుంకరణిన్ ధరణిన్."
(అప్పకవి)

లక్ష్మీస్తనకస్తూరి భూదేవి యని మునులకుఁ దోఁచుట గంధర్వుఁడు వరూథినికిఁ బ్రవరునివలెఁ దోఁచుటకు సూచనముగాన నిది కావ్యార్థసూచనము.

ఈపద్యమున భ్రాంతిమదలంకారోజ్జీవిత మగు నుత్ప్రేక్షాలంకారము.

ఉ. ఉల్లమునందు నక్కటిక మూనుట మీకులమందుఁ గంటిమం
చల్లన మేల మాడునచలాత్మజమాటకు లేఁతనవ్వు సం
ధిల్లఁ గిరీటిఁ బాశుపతదివ్యశరాఢ్యునిఁ జేయు శాంబరీ
భిల్లుఁడు కృష్ణరాయల కభీష్టశుభప్రతిపాది గావుతన్. 2

టీ. ఉల్లమునందున్ = మనస్సున, అక్కటికము=జాలి, ఊనుటన్, మీకులమందున్=మీజాతియందు, కంటిమి, అంచున్, అల్లనన్=మెల్లఁగా, మేలము = పరియాచకము, ఆడు అచలాత్మజమాటకున్ = పలుకు పార్వతి పల్కునకు, లేఁతనవ్వు, సంధిల్లన్, కిరీటిన్=అర్జునుని, పాశు...ఢ్యునిన్ — పాశుపత=పాశుపత (శివునిసంబంధమైనది) మనెడు, దివ్యశర = దివ్యాస్త్రముతో, ఆఢ్యునిన్ = సంపన్నుని, చేయు, శాంబరీభిల్లుఁడు = మాయా కిరాతుఁడు, కృష్ణరాయలకున్, అభి...తిపాది-అభీష్టశుభ = ఇష్టములైన శుభములను, ప్రతిపాది=కూర్చువాఁడు, కావుతన్.

తా. అరణ్యవాసకాలమున నర్జునుఁడు పాశుపతాస్త్రమునకై కావించినతపస్సునకు మెచ్చి కిరాతవేషమున నరుదెంచి పోలగాఁ బోరి యాతని

కోడుట నభినయింపఁగాఁ బార్వతి చూచి "మీకులమున కెన్నఁడును లేనిజాలి కాన్పించెనే" యని భావించు పరియాచకమునకుఁ జిఱునవ్వు నవ్వుచుఁ బాశుపతాస్త్రము నాతనికి దయసేయఁ శివుఁడు కృష్ణరాయల కభీష్ట శుభముల నమకూర్చుఁగాత.

పార్వతి యచలాత్మజగాన యోగ్యురాలు. కానసే యుత్తముఁడగు తనప్రాణేశ్వరుని నల్లన మేలమాడినది. భావవేదిగాన శంకరుఁడు చిఱునగవు దాల్చెను. కిరీటికి పాశుపతము నొసంగుతఱిగానఁ బార్వతి సువ్యక్తముగఁ బరిహాసమాడుటకుఁగాని శివుఁడు హాసరూపమున సంతసము వెలిబుచ్చుటకుఁ గాని వీలుగాకపోయినది. చిఱునవ్వు ఉత్తమలక్షణమనుటకు.——

శ్లో. "శ్రేష్ఠానాం స్మితహసితే మధ్యానాం విహసితావహసితే చ,
నీచానామపహసితం తథాతిహసితం చ షడ్భేదాః.
ఈషద్వికాసి నయనం స్మితం స్యాత్స్పందితాధరమ్. (సాహిత్యదర్పణము)

అర్జునునకు శత్రుజయార్థము దివ్యాస్త్రము నొసఁగినశివుఁడు కృష్ణరాయలకుఁ దత్తత్సాధనములఁ జేకూర్చునట్లాశాసించుట యొప్పిదము.

కిరాతవేషము ధరించియు దయాశాలియయ్యెఁ గిరీటిని బరీక్షింప నెంచి వచ్చియు నస్త్రదానధురంధరుఁ డయ్యె దయౌదార్యముల కునికిపట్టైన పరమేశ్వరుఁడు రాయలను దయతోఁ జూచుటయు నభీష్టసిద్ధిఁ జేకూర్చుటయు సహజవిశేషములే.

కిరాతునియందు దయారసోత్పన్న మను విషమకార్యోత్పత్తి చెప్పఁబడుటచే నలంకారము విషమము.

ఉ. నాలుగుమోములన్ నిగమనాదము లుప్పతిలన్ బ్రచండవా
తూలహతిన్ జనించురొదతోడిగుహావళి నొప్పుమేరువున్
బోలి పయోజపీఠి మునిముఖ్యులు గొల్వఁగ వాణిఁగూడి పే
రోలగమున్న ధాతవిభవోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్.

టీ. నాలుగుమోములన్, నిగమనాదములు = వేదధ్వనులు, ఉప్పతిలన్ = ఉద్భవిల్లఁగా, ప్రచండవాతూలహతిన్ = తీవ్రములైన గాడ్పుల తాఁకుడుచే, జనించు, రొదతోడిగుహావళిన్ = ధ్వనితోఁగూడిన గుహలతో, ఒప్పు మేరువున్ బోలి, పయోజపీఠిన్ = పద్మాసనపీఠమున, మునిముఖ్యులు, కొల్వఁగన్, వాణిన్, కూడి, పేరోలగము = పెద్దకొలువు, ఉన్న, ధాత = బ్రహ్మదేవుఁడు, కృష్ణరాయనిన్, విభవోజ్జ్వలున్ = సంపదతో నొప్పారువానిఁగా, చేయుంతన్.

తా. నాల్గుముఖములందును వేదపాఠధ్వనులు వెలువడుచుండఁగాఁ బెద్దగాడ్పులు తాఁకి రొదసేయుగుహలు గలమేరువువోలెఁ బొల్చుచు మునిశ్రేష్ఠులు సేవింప సరస్వతితోఁ దమ్మిగద్దియపైఁ గొలువుండు బ్రహ్మ కృష్ణరాయల కైశ్వర్యాభివృద్ధి గలిగించుఁగాత.

బ్రహ్మ మేరువుగను వాతూలధ్వని గలగుహలు వేదధ్వనిగల ముఖములుగను జెప్పఁబడుటచే నలంకారము పూర్ణోపమము. నిగమపఠనమున నాదిపురుషత్వము. మేరు వనుటచే సర్వాతిశాయి కాంత్యతిశయము, వాణిఁ గూడి యనుటచే భాషాధిపత్యము సూచితము. మునిముఖ్యులచే సేవలఁ గొనుటయుఁ బేరోలగ మొనరించుటయు బ్రహ్మకుఁ గల నిగ్రహానుగ్రహశక్తిఁ బ్రాభవాధిక్యమునకుఁ దార్కాణములు. ఇట్టి యుత్తమగుణవిశిష్టుఁడు మునిసేవ్యుఁడు నగు బ్రహ్మ సుధీజనసేవ్యుఁ డగు రాయల విభవశాలిని జేయుట మిగుల సులభ మని భావము.

ఉ. అంకముఁ జేరి శైలతనయాస్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలిచన్ కబళింపఁబోయి యా
వంకఁ గుచంబుఁ గాన కహివల్లభహారముఁ గాంచి వే మృణా
ళాంకురశంక నంటెడుగజాస్యునిఁ గొల్తు నభీష్టసిద్ధికిన్. 4

టీ. అంకమున్ = ఒడియందు, చేరి, శైలతనయాస్తనదుగ్ధములు =

పార్వతిచనుఁబాలను, అనువేళన్ = త్రాగునప్పుడు, బాల్యాంకవిచేష్టన్ = పిల్లతనపుఁజేష్టముచే, తొండమునన్, అవ్వలిచన్ = అవలికుచమును, కబళింపఁబోయి = కుడుపఁబోయి (పట్టుకోఁబోయి), అవంకన్ = ఆప్రక్కను, కుచంబున్, కానక, అహివల్లభహారమున్ = సర్పహారమును, కాంచి, వే = శీఘ్రముగా, మృణాళాంకురశంకన్ = లేఁతతామరకాఁడ యనుసంశయమున, అంటెడుగజాస్యుకిన్ = తాఁకెడుగజాననుని, అభీష్టసిద్ధికిన్ = కోరికనెఱవేయుటకొఱకు, కొల్తున్.

తా. అర్ధనారీశ్వరమూర్తిభేదమున నున్నప్పుడు తల్లియొడిఁ జేరి చనుఁ ద్రావుచు బిడ్డఁయలవాటుచొప్పున రెండవకుచమును దొండమునఁ గైకొనఁ బోఁగా నాప్రక్క శివదేహ మగుటచేఁ గుచము కానక సర్పహారముఁ గాంచి తాను గజవదనుఁడు గావున దానిని దామరతూఁ డనుకొని పట్టుకొనఁ బోవువిఘ్నేశ్వరుని నభీష్టసిద్ధికై సేవింతును. భ్రాంతిమదలంకారము.

తొడపైఁ జేరి గౌరిస్తన్యము గ్రోలుచుండె ననుటవలనఁ బార్వతికి మిగులఁ బ్రేమపాత్రుఁడగు పుత్రుఁడని భావము. అవలిచన్ను గానరాకపోయి నపుడు వెదకి కనుఁగొనయత్నింపక హారముగనున్న పామునందుకొని తామర తూఁడని గ్రహింపఁబోవుట గజాస్యమునఁ గలిగిన సహజ బాల్యాంకవిచేష్ట.

తామరతూండ్లకుఁ బాములకుఁ బోల్కి గలదు.

సీ. "శేషపుచ్ఛచ్ఛాయఁ జెలువొందు బిసములు" (శృంగారనైషధము).

సీ. చేర్చుక్కగా నిడ్డచిన్నిజాబిల్లి చే
సిందూరతిలకంబు చెమ్మగిల్ల
నవతంసకుసుమంబునం దున్నరోలదేఁటి
రుతి కించిదంచితశ్రుతుల సీన
ఘన మైనరారాపుచనుదోయి రాయిడిఁ
దుంబీఫలంబు తుందుడుకుఁ జెందఁ

దరుణాంగుళిచ్ఛాయ దంతపుసరకట్టు
    లింగిలీకపువింతరంగు లీన
తే. సుపనిపత్త్రులు బోటులై యోలగింపఁ
  బుండరీకాసనమునఁ గూర్చుండి మదికి
  నింపువేడుక వీణ వాయించుచెలువ
  సలువరాణి మదాత్మలో వెలయుఁగాత. 5

టీ. చేర్చుక్కగాన్ = పాపటబొట్టుగా, ఇడ్డచిన్నిజాబిల్లిచేన్ = తాల్చిన్నలేఁతచందురునిచే, సిందూరతిలకంబు = చెందిరపుబొట్టు, చెమ్మగిల్లన్ = ద్రవింపఁగా, చేర్చుక్కయన స్త్రీలలంకారార్థముగాఁ బాపటకుముందు ధరించు నొకభూషావిశేషము. సరస్వతి చంద్రునిఁ బాపటబొట్టుగా ధరించెను. చంద్రుఁడు శిశిరకరుఁడుగానఁ గరస్పర్శచేఁ దిలకము చెమ్మగిల్లెను. అవతంస కుసుమంబునందున్ = కర్ణాభరణముగాఁ దాల్చినపూవునందు, ఉన్న, యెలదేఁటిరుతి = కొదమతుమ్మెదఝుంకారము, కించిదంచితశ్రుతులన్ = ఇంచుక యొప్పిదములగు (స్థాయినిదెలుపు) ధ్వనులను, ఈనన్ = కలిగింపఁగా, ఎలదేటి యనుటచే ఝుంకారాతిశయము సూచితము. సరస్వతికంఠధ్వని కంచితమగు శ్రుతి వీణె. కించిదంచితశ్రుతి ఎలఁదేఁటియుఁ లివు. ఘనము, ఐన, రారాపుచను దోయి రాయిడిన్ = ఒత్తిడి గలచనుఁగవయొక్క యొరపిడిచే, తుంబీఫలంబు = వీణసొరకాయ, తుందుడుకున్ = ఎక్కువయదరుఁబాటును, చెందన్, చను దోయిరారాపు యౌవనాతిశయము సూచించును. ఉత్తుంగస్తనఘట్టనమున వీణసొరకాయ గదలుటచే వీణయుఁ గదలుచుండె నని తెలియనగును. కదలు వీణెపై శ్రుతిగూర్చుటచే సరస్వతీసంగీతమహిమాతిశయ మిట సూచింపఁబడి నది. తరుణాంగుళిచ్ఛాయన్ = నునుస్రేళ్ళ కాంతిచే, దంతపుసరకట్టులు=దంతముతోఁ గట్టినవీణెమెట్లు, ఇంగిలీకపువింతరంగులు, ఈనన్, దంతపుసరకట్టులపై గట్టిని వ్రేళ్ళు సోఁకినపుడును నఖములకాంతి ప్రసరించినపుడును గట్టిని

తెల్లని ప్రకాశముగలసి సరకట్టు లింగిలీకపువింతరంగు లీనె నని భావము. ఉపనిషత్తులు, బోటులై = చెలికత్తెలై, ఓలగింపన్ = సభదీరఁగా, పుండరీకాసనమునకు = తెల్లతామరగద్దియపై, కూర్చుండి, మదికిన్, ఇంచువేడుకన్ వీణన్, వాయించుచెలువ, నలువరాణి = సరస్వతి, మదాత్మలోన్ = నామనస్సున, వెలయుఁగాతన్.

దేవకాంతలను శిరమాదిగ వర్ణించుట కవినియమముగాను దొలుత భూషణసంబంధముచే ముఖము, అవతంసవశమునఁ గర్ణములు, దుంబీఫలవశమున స్తనములు, సరకట్టులకతన వ్రేళ్లు, పీఠసంగతిచేఁ బాదము లిం దభి వర్ణితములు.

తా. చేరుచుక్కగాఁ దాల్చుకొన్న బాలచంద్రునివలనఁ జెందిరపుబొట్టు చెమరుక్రమ్మఁగా, కర్ణాభరణమువం దున్న కొదమతుమ్మెదధ్వని శ్రుతిఁ గూర్పఁగా, బింకపుగుబ్బలయొరపున వీణసొరకాయ యదరఁగా, ఎఱ్ఱని వ్రేళ్లకాంతిచేఁ దెల్లనివీణమెట్లు ఇంగిలీకపుఁగాంతులను వెలయింపఁగా నుపనిషత్కాంతలు సభదీరఁగాఁ దెల్లదమ్మిగద్దియపైఁ గూర్చుండి వీణవాయించు సరస్వతి నాడెందమున నిల్చుఁగాత. అతిశయోక్తి తద్గుణాలంకారములు.

క. కొలుతున్ మద్గురు విద్యా
నిలయున్ గరుణాకటాక్షనిబిడజ్యోత్స్నా
దళితాశ్రితజనదురిత
చ్ఛలగాఢధ్వాంతసమితి శఠకోపయతిన్. 6

టీ. విద్యానిలయున్, కరుణా...సమితిన్-కరుణాకటాక్ష = దయగలకడకంటిచూపు లనెడు, నిబిడజ్యోత్స్నా = దట్టపువెన్నెలచే, దళిత = పోఁగొట్టఁబడిన, ఆశ్రితజన = ఆశ్రయించినజనులయొక్క, దురిత = పాపమనెడి, ఛల=మిషచేత, గాఢధ్వాంతసమితిన్ = గాఢాంధకారపుంజముగల, శఠకోపయతిన్, మద్గురున్, కొలుతున్.

తా. చదువుల కునికిపట్టగువాఁడును, గడకంటిచూపులచేతనే శిష్యుల యజ్ఞానమును బోఁగొట్టు ప్రభావము గలవాఁడును, గురుఁడు నగుశశశోవ యతికి నమస్కరించెదను.

కటాక్షములందుఁ జాంద్రికాత్వము ఆరోపించుటచే నలంకారము రూపకము. దురితమునకు అసత్యముగా ధ్వాంతారోపణము చేయుటచే నలంకార మపహ్నుతి.

మ. వనజాక్షోపము వామలూరుతనయున్ ద్వైపాయనున్ భట్టబా
ణుని భాసున్ భవభూతి భారవి సుబంధున్ బిల్హణున్ గాళిదా
సుని మాఘున్ శివభద్రు మల్హణకవిం జోరున్ మురారిన్ మయూ
రుని సౌమిల్లిని దండిఁ బ్రస్తుతులఁ జేర్కొందున్ వచశ్శుద్ధికిన్. 7

టీ. వనజాక్షోపమున్ = విష్ణుతుల్యుఁడయిన, వామలూరుతనయున్ = వాల్మీకిని, ద్వైపాయనున్ = వ్యాసుని, భట్టబాణునిన్, భాసున్, భవభూతిని, భారవిన్, సుబంధున్, బిల్హణున్, కాళిదాసునిన్, మాఘున్, శివభద్రున్, మల్హణకవిన్, చోరున్, మురారిన్, మయూరునిన్, సౌమిల్లినిన్, దండిన్, వచశ్శుద్ధికిన్ = మాటలపారిశుద్ధ్యమునకు, ప్రస్తుతులన్ = స్తుతులచేత, చేర్కొందున్ = సంస్మరించెదను.

పైని చేర్కొనఁబడిన కవులందఱు సంస్కృతకవులు. పుట్టలో జనించుటచే వాల్మీకిని వామలూరుతనయుఁ డని కృష్ణద్వీప మునికిఁగాఁ గలవాఁడగుటచే వ్యాసుని ద్వైపాయనుఁ డని యందురు.

ఆ. వ్యాసరచితభారతామ్నాయ మాంధ్రభా
షఁగ నొనర్చి జగతిఁ బొగడు గనిన
నన్నపార్యుఁ దిక్కనను గృతక్రతు శంభు
దాసు నెఱ్ఱసుకవిఁ దలఁతు భక్తి. 8

టీ. వ్యాసరచితభారతామ్నాయము=వ్యాసునిచే రచింపఁబడిన భారత వేదమును, 'భారతః పంచమో వేదః' అనుటవలన భారతమునకు వేదత్వము. ఆంధ్రీభావగన్, ఒనర్చి, జగతిన్, పొగడు=పొగడ్త, కనిన, నన్నపార్యున్, కృతక్రతున్ = చేయఁబడిన యజ్ఞము గలవాఁడగు. (యజ్ఞ మొనరించిన) తిక్కనన్=తిక్కనసోమయాజిని, శంభుదాసున్ = శంభుదాసుఁ డనుమాఱు పేరు గల, ఎఱ్ఱసుకవిన్, భక్తిన్, తలఁతున్.

మ. భరమైతోఁచుకుటుంబరక్షణకుఁగాఁ బ్రాల్మాలి చింతన్ నిరం
తరతాళీదళసంపుటప్రకరకాంతారంబునం దర్థపున్
దెరువాటుల్ దెగి కొట్టి తజ్జ్ఞపరిషద్విజ్ఞాతచౌర్యక్రియా
విరసుండై కొఱఁతన్ బడుం గుకవి పృథ్వీభృత్సమీక్షస్థితిన్. 9

శ్లేషచేఁ గుకవియందుఁ జోరునిలక్షణముల నారోపించి కవి యుభయులయం దభేదారోప మీక్రిందివిధముగాఁ జేసియున్నాఁడు.

టీ. భరమై = బరువై, తోఁచుకుటుంబరక్షణకుఁగాన్, ప్రాల్మాలి = శక్తిలేక, చింతన్, నిరం...కాంతారంబునందున్. నిరంతర = దట్టమయిన, తాళీదళసంపుటప్రకర = తాటియాకుపుస్తకపుఁగట్టలగుంపనెడి, కాంతారంబునందున్ = అడవిలో, అర్థపుందెరువాటుల్ = (ఇతరుల) పదార్థములనెడు ధనములత్రోవలను, తెగి కొట్టి = తెగబాఱిదోఁచికొని, కుకవి కేవలకుటుంబభరణమునకే కవితఁ జెప్పఁబూనినవాఁ డగుటచే నసంఖ్యాకములుగా నున్న తాళపత్రగ్రంథములనుండి పదార్థాదికము గ్రహింపసాహసించును. తజ్జ్ఞ...సుండై తత్ జ్ఞ=దాని(పద్యార్థములను-సొమ్మును) నెఱిఁగిన, పరిషత్=సభ్యులచే, విజ్ఞాత= ఎఱుఁగబడిన, చౌర్యక్రియా = దొంగతనముచే, విరసుండై = మర్యాదలేనివాఁడై, పృథ్వీభృత్సమీక్షస్థితిన్ = రాజసన్నిధానమున, (కొండదగ్గఱ) కుకవి దుష్కవి, కొఱఁతన్ = హైన్యమును, (కొఱ్ఱున) బడున్. చౌర్యమునకు శిక్షవిధించువారు తజ్జ్ఞపరిషత్సభ్యులు. శిక్షాస్థానము పృథ్వీభృత్సమీక్ష

భూమి. కుకవి తాను మహాకవి నని చెప్పుకొని సంపాదించుకొన్న గౌరవము కోలుపోవును. చోరుఁడు శిక్షార్థము కొట్టున దిగఁబడును.

తా. కుకవి (దొంగ) ఆలుబిడ్డలను పోషించుకొను వెరవుఁ గానక కడుపు కక్కుర్తిచే దాటియాకుపుస్తకపుఁగట్టలోని యితరకవుల కావ్యార్థములను (సొమ్ములను) దొంగిలి తనవిగాఁ బెట్టుకొని వానితత్త్వమెఱిఁగినవా రవి వెల్లడించినంత మర్యాదఁగోల్పోయి రాజసాన్నిధ్యమున (పర్వతసన్నిధిని) హైన్యమున (కొట్టున) బడును. కొట్టు అనునర్థమున 'కొఱఁతక్' అనుట విచారణీయము. కొట్టుశబ్దమున కొకవిభక్తికము 'కొఱఁత' యన నగును. కుకవి యర్థమున నమర్యాదార్థమున కొఱఁత యనవచ్చును గాన నిట సాధుత్వము నకు మార్గము గానరాదు.

కుకవి చోరుఁడు కటుంబరక్షణమునకుఁ బ్రాలుమాలి చేయుచేతల భేదారోపముగాఁ జెప్పఁబడుటచే నలంకారము సావయవరూపకము. కుకవికిఁ జోరత్వము గమ్యమగుటచే ఏకదేశవివర్తిశ్లేషచే శ్లేషానుప్రాణితమును.

క. అని యిష్టదేవతావం
దనసుకవిస్తుతులుఁ గుకవితతినిక్కృతియుఁ జే
సి నవీనకావ్యరచనకు
ననుకూలకథల్ దలంచునాసమయమునన్. 10

టీ. అని, ఇష్టదేవతా...సుకవిస్తుతులు = ఆభీష్టదాయకులగు వేలుపుల యొక్కయు సత్కవులయొక్కయు స్తోత్రము, కుకవితతి నిక్కృతియుఁన్ = దుష్కవి సమూహము యొక్క నిరాకృతియు, చేసి, నవీనకావ్యరచనకున్ = నూతన కావ్యనిర్మాణమునకు, అనుకూలకథల్ = యోగ్యములగు గాథలు, తలంచునా సమయమునన్ = ఆలోచించు కాలమందు-వైపద్యముతో నన్వయము.

సీ. ఉదయాచలేంద్రము మొదల నెవ్వనికుమ్మా
రతకుఁ గ్రౌంచాచలరాజ మయ్యె

నావాడపతిశకంధరసింధురాధ్యక్షుఁ
లరిఁగాపు లెవ్వానిఖరతరాసి
కాపంచగౌడధాత్రీపదం బెవ్వాని
కసివాలుగా నేఁగునట్టిబయలు
సకలయాచకజనాశాపూర్తి కెవ్వాని
ఘనభుజాదండంబు కల్పశాఖ
తే. ప్రబల రాజాధిరాజవీరప్రతాప
రాజపరమేశబిరుదవిభ్రాజి యెవ్వఁ
డట్టిశ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁ
డొక్కనాఁడు కుతూహలం బుప్పతిల్ల. 11

టీ. ఎవ్వని, కుమారతకున్ = బాల్యమునకు (కుమారస్వామిభావమునకు), మొదలన్, ఉదయాచలేంద్రము = ఉదయగిరిదుర్గము, క్రౌంచాచలరాజము=క్రౌంచమనుపర్వతశ్రేష్ఠము, అయ్యెన్. (కుమారస్వామి క్రౌంచపర్వతమును భేదించెను.) కృష్ణదేవరాయలు కుమారస్వామి క్రౌంచాచలము భేదించినటుల నుదయగిరిదుర్గమును దొలుదొలుత భేదించె నని భావము. ఎవ్వాని, ఖరతరాసికిన్ = మిగుల వాఁడి యైనకత్తికి, నావాడపతిశకంధరసింధురాధ్యక్షులు=నావాడదేశపురాజులును, శకంధరదేశపురాజులును; (కళింగపు) గజపతి రాజును, అరిఁగాఁపులు=పన్నుచెల్లించువారో? శకంధరుఁడనువాఁడు గుజరాతు దేశమును బరిపాలించు శికిందర్ అనువాఁడని చరిత్రకారులయూహ. రాయల కాలమున గుజరాతు నీపేరినవాఁడు పాలించుటచే నీయూహ తగియున్నది. ఆపంచగౌడధాత్రీపదంబు = పంచగౌడదేశముల పర్యంతము గలభూభాగము (గౌడులు, కాన్యకుబ్జులు, సారస్వతులు, ఉత్కలులు, మైథిలులు అని గౌడు లైదుతెగలవారు). ఆసివాలుగాన్ = స్వారిగా, ఏఁగునట్టిబయలు, అనఁగా గౌడదేశముతుదనుకఁగలదేశ మంతయుఁ గృష్ణరాయనికి వాహ్యాళివెడలు

దేశముగా నయ్యో ననుట. ఆపంచగౌడధాత్రీ పదములోని అజ్ కు "ఆఙ్ మర్యాదాభివిధ్యోః" అను పాణినిసూత్రానుసారముగా గౌడదేశమువఱకు నని చెప్ప నగును. గుజరాతుదేశము గౌడదేశమునకుఁ దగిలియున్నదిగాన ఆపంచగౌడయనుచో గుజరాతుదేశమంతయుం ననుట సమంజసము. ఇది రాయలయుత్తర దిగ్విజయయాత్రాసూచనము. ఎవ్వాని, ఘనభుజాదండంబు=దండము వంటిభుజము, సకలయాచకజనాశాపూర్తికిన్=సమస్తయాచకులయొక్కయుఁ గోరికలను నించుటకు, కల్పశాఖి=కల్పవృక్షమో, ఎవ్వఁడు, ప్రబల...విభ్రాజి- ప్రబల=అధికమైన, రాజాధిరాజ; వీరప్రతాప; రాజపరమేశ (అను) బిరుద (ములచే), విభ్రాజి = ప్రకాశించువాఁడో, అట్టి శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁడు, ఒక్కనాఁడు, కుతూహలంబు=వేడుక, ఉప్పతిల్లన్.

ఈపద్యమునందు రాయల దుర్గభేదననైపుణ్యము పరరాజ్యాకర్షణప్రతిభాతిశయము విజయయాత్రాసంరంభాదికము దాతృతాతిశయము క్రమముగా వర్ణింపఁబడినవి.

శకంధరపదము శికందర్ అను పారశీకపదమునకు సంస్కృతరూపమైయుండును గాన గుజరాతునవాబగుశికందరు అనికొందఱర్థముచెప్పుచున్నారు.

తా. కృష్ణదేవరాయలు మొట్టమొదటఁ గుమారస్వామి క్రౌంచపర్వతమును భేదించినట్లు ఉదయగిరిదుర్గమును సాధించి పిమ్మట నావాడపతి మొదలయినరాజులను దనకుఁ గప్పము కట్టునట్లుగా నొప్పించి హిందూస్థానపర్యంతమైన పంచగౌడదేశముల స్వారి తిరుగుభూములవఱకె నిష్కంటకముగా నేలి కల్పవృక్షమునువలె యాచకులు కోరినవానినెల్లఁ దనివితీర నిచ్చి రాజాధిరాజాదిబిరుదములు చెలఁగఁగా రాజ్యము నేలుచుండి యొకనాఁడు వేడుక పుట్టఁగా. అలంకారము: రూపకము, అతిశయోక్తి.

సీ. ఇందీవరంబుల నీసుగ్రాల్గన్నుల
శరదిందుముఖులు చామరము లిడఁగఁ

పణినసూనుకణాదబాదరాయణసూత్ర
  ఫక్కి విద్వాంసు లుపన్యసింపఁ
బార్వభూమి నభీరుభటకదంబకరాళ
  హేతిచ్ఛటాచ్ఛాయ నిరులుకొనఁగ
సామంతమండనోద్దామమాణిక్యాంశు
  మండలం బొలసి యీరెండ గాయ
తే. మూరురాయరగండపెండారమణిమ
రీచిరింఛోళిఁ గలయ నావృతములగుచు
నంకపాళి నటద్దుకూలాంచలములు
చిత్రమాంజిష్ఠవిభ్రమశ్రీ వహింప. 12

టీ. ఇందీవరంబులక్=నల్లగలువలను, ఈనుక్రొల్గన్నుల = కురియుచుఁ బ్రకాశించుకన్నులు గల, శరదిందుముఖులు = శరచ్చంద్రునిఁ బోలు ముఖములుగలస్త్రీలు, పణి...ఫక్కిక్=పాణినియొక్కయుఁ,గణాదునియొక్కయు, బాదరాయణునియొక్కయు సూత్రములపద్ధతిని (వ్యాకరణతర్కవేదాంతముల త్రోవలను), అభీరు...చాయ - అభీరు = భయములేని, భటకదంబముయొక్క, కరాళ=భయంకరమయిన, హేతి = కత్తులయొక్క, ఛటా = సమూహముయొక్క, ఛాయక్ = కాంతిచే, ఇరులుకొనఁగక్ = చీకట్లు క్రమ్మఁగా, సామంత...మండలంబు - సామంత = స్వతంత్రులగు ప్రక్క రాజులయొక్క, మండన=భూషలయందలి, ఉద్దామ=ఎక్కువయిన (మాణిక్యములయొక్క), అంశుమండలంబు = కాంతిపుంజము, ఒలసి = చుట్టుకొని, ఈరెండ=లేఁతయెండ, కాయక్, మూరు...రింఛోళిక్ - మూరురాయర= ముగ్గురు (అశ్వపతి-గజపతి-నరపతులను) రాజులకు, గండపెండార=నాయకుఁడని తెలుపుపాదాభరణమునందలి, మణిమరీచి = రత్నకాంతులయొక్క, రింఛోళిక్=సమూహముచే, కలయక్=అంతటను, అంకపాళిక్ = ఒడియందు, నటద్దుకూలాంచలములు = చలించు తెలిపట్టువలువలచెఱఁగులు, చిత్ర...

శ్రీ - చిత్ర = చిత్రవర్ణము గలిగిన, మాంజిష్ఠ = ఎఱుపు మాణిక్యపద్మరాగము యొక్క, విభ్రమశ్రీ = విలాసమును.

తా. కలువకంటులు చామరములు వీవఁగా విద్వాంసులు వ్యాకరణాదిశాస్త్రవ్యాఖ్యానముల నుపన్యసింపఁగా సామంతరాజులు కొలిచియుండఁగాఁ గాలియున్న మూరురాయరగండపెండారమునందలి రత్నకాంతులు ప్రసరించుటచేఁ దాల్చిన తెల్లపట్టువలువ చిత్రవర్ణము నొందఁగా. (వైపరీత్యముతో నన్వయము.)

ఈ పద్యమునందు 'పణినసూనుఁ' డనుపదమునకు సాధుత్వము విచారణీయము. పాణినునపత్యము పాణినియనువ్యుత్పత్తికలదుగాని పణినుని యపత్యమని చూపట్టదు. శ్రీనాథకవియును 'పణినాపత్యోక్తశాస్త్రంబులో' అని ప్రయోగించెను. 'ప్రాగ్దీవ్యతోఽణ్, గాథివిదథికేశిగణిపణినశ్చ' ఈసూత్ర వృత్తులచే "పణనం పణః... సోఽస్యాస్తీతి పణీ-తస్య గోత్రాపత్యం పాణినః తతో యూన్యపత్యే ఇఞ్ పాణినిః." అని పాణినిశబ్దనిరూపణము కౌముది యందుఁగలదు. రామభద్రయజ్వయును నిటులె పణికొడుకు పణినుఁడనియు నతని మనుమఁడు పాణినుఁడనియుఁ బాణినునికొడుకు పాణినియని పతంజలిచరిత్రమునందుఁ జెప్పెను. గాని పణినసూనుపదము సాధుత్వము పణినః+నప్తా అనుచోట నప్తాయనుపదమునుండి "నామైకదేశగ్రహణే నామమాత్రగ్రహణం" అనున్యాయముచే నప్తాపదాదినకారము గ్రహించి పణినసూను అని యాంధ్రకవితాపితామహుఁడు ప్రయోగించియుండును. ఇటులె భారవియందు "తవాభిధానాత్" అనుచో త. యన తార్క్ష్యుఁడని. వ. యన వాసుకియని మల్లినాథుఁడు వ్యాఖ్యఁ జెప్పెగాన "స్థితశ్చ గతిశ్చింతనీయా" యనుధర్మముచేఁ బైవిధముగాఁ బణినసూనుశబ్దమును సాధువుగా భావింప నగును. ఇట్టి సమర్థనమె శ్రీనాథుని పణినాపత్య అనుచో నైషధవ్యాఖ్యాతలు వ్యాఖ్యలో వ్రాసియున్నారు.

శా. "ప్రాతఃకాలమునందుఁ గాక పణిసాహతిన్ సూక్ష్మశాస్త్రంబులో" ...

(శృంగారనైషధము.)

అలం. తద్గుణము.

క. భువనవిజయాఖ్యసంస
ద్భువనస్థితభద్రపీఠిఁ బ్రాజ్ఞులగోష్ఠిన్
గవితామధురిమ డెందము
దవులన్ గొలువుండి సదయతన్ ననుఁ బల్కెన్. 13

టీ. భువన...పీఠిన్-భువనవిజయాఖ్య = భువనవిజయ మను పేరుగల సంసద్భువన = సభాగృహమున, స్థిత=ఉన్న, భద్రపీఠిన్ = సింహాసనమందు (సువర్ణ పీఠమునందు), ప్రాజ్ఞులగోష్ఠిన్ = పండితుల ప్రసంగమువలన, కవితామధురిమ = కవితయొక్క మాధుర్యము, డెందము = మనస్సు, తవులన్=ఆకర్షింపఁగా, కొలువుండి=కొలువుతీఱి కూర్చుండి, సదయతన్ = దయాసహితభావముతో, ననున్ = నన్నుఁగూర్చి, పల్కెన్ = (ముందుఁ జెప్పఁబోవువిధముగా) పలికెను.

తే. సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచి
ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతియ కానఁ
గృతి రచింపుము మాకు శిరీషకుసుమ
పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య. 14

టీ. సప్తసంతానములలోన్ = తటాకము, ధననిక్షేపము, అగ్రహారము, శివాలయము, ఆరామము, కృతి, పుత్త్రుఁడు అనువానిలో, ప్రశస్తిన్ = ప్రసిద్ధిని, కాంచి, ఖిలము గాక = చెడక, శిరీ...క్తులన్ - శిరీషకుసుమ = దిరిసెనపుఁబువ్వువలె, పేశల = మృదువులై, సుధామయ = అమృతతుల్యములైన, ఉక్తులన్=పలుకులతో, మాకున్=మాకంకితముగా, కృతి రచింపుము = నూతనకావ్యము నొనరింపుము.

సప్తసంతానములు కాలవశమున నన్నియుం నశించునవె. ప్రపంచము నందు వ్యాప్తిగలది గాన కృతి కట్టినాశనము లేదు. అందుచేఁ గృతి మిగులఁ బ్రశస్త మైనది. సప్తసంతానములలోఁ గృతి ప్రశస్త మనుటకు:—

క. "ఇల సప్తసంతతులలోఁ,బలుఁ గావ్యము దక్క దేవభవనవనాదుల్
ఖిలములగు కొన్నివర్షం,బుల కని, చంపువు రచించె భోజుం డెఱుకన్."

సప్తసంతానములు—

క. "తనయుఁడు చెఱువును గావ్యం,బు నిధానము గుడి వనంబు భూదేవప్రస్థా
పనమును ననునియ్యేడును, జను శాస్త్రములందు సప్తసంతతు లనఁగన్."

(అప్పకవీయము.)

అలం. ఉపమాలంకారము.

క. హితుఁడవు చతురవచోనిధి
వతులపురాణాగమేతిహాసకథార్థ
స్మృతియుతుఁడ వాంధ్రకవితా
పితామహుఁడ వెవ్వ రీడు పేర్కొన నీకున్. 15

టీ. చతురవచోనిధివి=నేర్పుగలపలుకులకు గనివంటివాఁడవు. అతుల ...యుతుఁడవు-అతుల = అసమానము లయిన, పురాణ (బ్రహ్మపురాణాదికము) ఆగమ (పాంచరాత్రాదికము) ఇతిహాస (భారతాదికము) ములయందలి, కథార్థ = కథాసందర్భములయొక్క, స్మృతియుతుఁడవు = జ్ఞప్తి కలవాఁడవు, ఆంధ్రకవితాపితామహుఁడవు=తెల్గుకవనమునకు బ్రహ్మవు, ఈడు = సాటి, నీకున్ పేర్కొనన్ = ఎన్నుటకు, ఎవరు = ఎవరు కలరు ?

క. మనువులలో స్వారోచిష
మనుసంభవ మరయ రసనముంచితకథలన్
విన నింపు కలిధ్వంసక
మనఘ భవచ్చతురరచన కనుకూలంబున్. 16

టీ. అనఘా = పాపరహితుఁడవగు పెద్దనార్యా! మనువులలోన్ = స్వాయంభువుఁడు మొదలుగాఁగల పదునలుగురు మనువులలో, స్వారోచిష మనుసంభవము=స్వారోచికుమారుఁ డయిన రెండవమనువుపుట్టువు, రససమంచిత కథలన్ = శృంగారాదిరసములతో నొప్పిదములగుకథలతో, వినన్, ఇంపు = ఇష్టమైనది, కలిధ్వంసకము = పాపమును నశింపఁజేయునది, భవచ్చతుర రచనకున్ = ఇంపైననీకూర్పునకు, అనుకూలము = తగినది.

వ. కావున మార్కండేయపురాణోక్తప్రకారంబునం జెప్పు మని కర్పూరతాంబూలంబు పెట్టినన్ బట్టి మహాప్రసాదం బని మోదంబున నమ్మహాప్రబంధనిబంధనంబునకుఁ బ్రారంభించితి నేతత్కథానాయకరత్నం బగునమ్మహీనాథువంశావతారం బెట్టి దనిన. 17

టీ. కావునన్, మార్కండేయ పురాణోక్త ప్రకారంబునన్ = మార్కండేయ పురాణమునందుఁ జెప్పఁబడిన రీతిగ, చెప్పు మని=ప్రబంధము రచింపు మని, కర్పూరతాంబూలంబు = పచ్చకప్పురములోనగు సుగంధ వస్తు మిశ్రతాంబూలంబును, పెట్టినన్=ఈయఁగా, మోదంబునన్=సంతసముతో, మహాప్రసాదం బని=గొప్పయనుగ్రహ మని, పట్టి = పరిగ్రహించి, అమ్మహా ప్రబంధ నిబంధనంబునకున్ = ఆమహాకావ్యరచనమునకు, ప్రారంభించితిన్= పూనుకొంటిని, ఏతత్కథా నాయకరత్నం బగు=ఈకృతికిఁ బతి యగు, అమ్మహీ నాథు వంశావతారము = ఆకృష్ణదేవరాయల వంగడపుఁ బుట్టుక, ఎట్టి దనినన్.

మహాకావ్యలక్షణము ఇరువదిరెండు వర్ణనములు.—

సీ. "పురమును ఋతుషట్కమును బ్రహాణంబును
శైలంబు వేఁటయుం సాగరంబు
మునీంద్రపుణ్యాశ్రమంబును మంత్రంబు
ద్యూతంబు పిదప సద్భృతరణంబు

విజయంబు మద్యపానజవికారంబును
వనవిహారంబును వారికేళి
కన్యాంగసౌందర్యకథనంబు హిమకరా
భ్యుదయంబు విప్రలంభోదితంబు
తే. పద్మమిత్రోదయంబును బరిణయంబు
సురతమును దౌహృదంబును సుతజననము
ననఁగ నిరువదిరెండువర్ణనలం గూర్చి
చెప్పవలయుఁ బ్రబంధము శ్రీనివాస." (అప్పకవీయము.)

సీ. కలశపాథోరాశిగర్భవీచిమతల్లి
కడుపార నెవ్వానిఁ గన్నతల్లి
యనలాక్షుఘనజటావనవాటి కెవ్వాఁడు
వన్నె వెట్టునవార్తవంపుఁబువ్వు
సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వాఁడు
పుట్టు గానని మేనిమెట్టపంట
కటికచీకటితిండికరములగిలిగింత
నెవ్వాఁడు దోఁగకన్నె నవ్వఁ జేయు
తే. నతఁడు వొగడొందు మధుకైటభారిమఱఁది
కళలనెల వగువాఁడు చుక్కలకు ఱేఁడు
మిసిమిపరసీమ వలరాజు మేనమామ
వేవెలుంగులదొరజోడు రేవెలుంగు. 18

టీ. కలశ...మతల్లి - కలశపాథోరాశి = పాలసముద్రముయొక్క, గర్భవీచిమతల్లి = నడిమి దగు మేల్మితరఁగ (పాలసముద్రమునఁ బుట్టినవాఁడనుట), అనలా...టికిఁ = అనలాక్షు = శివునియొక్క, ఘనజటా = పెంజడలను, వనవాటికిఁ = తోఁటపట్టునకు, వన్నెవెట్టు = అలంకారము నొసఁగు,

అనార్తవంపుఁబువ్వు = ఋతుసంబంధములేని పువ్వో (ఆయాఋతువు లందుఁ గలుగునదిగాక సర్వకాలము నుండునది యనుట). సకల...ర్తికిన్ - సకలదైవత = ఎల్లదేవతలయొక్క, బుభుక్షా = ఆఁకలియొక్క, పూర్తికిన్ = తీఱుటకు, పుట్టు=మొలక, కాసని, మేనిమెట్టపంట = దేహారూపమగుమెరక పంటయో (మెట్టపంట వర్షాద్యావశ్యకము లేమిచే నెప్పుడును పండునది) చంద్రుఁడు దేవతల కాహారము, కటికి...గిలిగింత - కటికిచీకటి = గాఢాంధకారము, తిండి = భోజనముగాఁ గల (చీకటిని మ్రింగివేసెడు), కరముల = కిరణముల (చేతుల), గిలిగింతన్ = చక్కిలిగిలిచే, తొగకన్నెన్ = కలువ యను జవ్వనిని, మధుకైటభారిమఱఁది = విష్ణునకుఁ బెండ్లముతోఁబుట్టువు, కళలనెలవు = పదునాఱుకళలకుఁదావు, మిసిమిపరసీమ=కాంతికిఁ బరమావధి, వలరాజు = మన్మథునకు, మేనమామ, వేవెలుంగులదొరజోడు = సూర్యునకు జతకాఁడు, రేవెలుంగు = రాతిరిఁ బ్రకాశించువాఁడు, చంద్రుఁడు.

విశ్వకర్మ యబ్ధియందు జనించినయమృతమును బోసియుంచుట కొక కలశమును సృజించెను. ఆకలశమునకు సంబంధించినదిగాన పాలకడలిని గలశపాథోరాశి యందురు.

శ్లో. "సాగరే మథ్యమానే తు పీయూషార్థం సురాసురైః
పీయూషధారణార్థాయ నిర్మితా విశ్వకర్మణా
కలాకలాస్తు దేవానా మసితాస్తాః పృథక్ పృథక్
యతః కృతాస్తు కలశా స్తత స్తే సంప్రకీర్తితాః." (కాళికాపురాణము.)

చీకటిపదమును సార్థబిందుకముగా నిప్పటివారు వ్యవహరించుచున్నారు. గాని ప్రయోగములందు అరసున్న జాడపట్టదు. చూడుఁడు.

కం. "...ఏకతమయజినరత్నము, చీకటినొకనాఁడు దెచ్చి." (ఆ-౬, ప-౯౯)

ఉ. "మీకృపఁగోరి భూరుహసమీపముఁ జేరితి...
చీకటిరాత్రి నాగ హరిసింధుర..." (ఆ-౭, ప-౪)
(దశకుమారచరిత్రము.)

తా. పాలసముద్రమునందుఁ బుట్టినవాఁడును, శివునిజటాజూటమునకుఁ బుష్పాలంకారమైనవాఁడును, దేవతలకుఁ దనకిరణముల నాహారముగా నిచ్చువాఁడును, గలువలను వికసింపఁ జేయువాఁడును, లక్ష్మీదేవికిఁ దోడఁ బుట్టినవాఁడును, బదియాఱుకళలకుఁ జోటయినవాఁడును, నశ్విన్యాదినక్షత్రములకు భర్తయుఁ, గాంతికి నిధియు, సూర్యునికి జతకాఁడు నయిన చంద్రుఁడు బాగఁ జొందును. అలం. పర్యాయోక్తి రూపకాతిశయోక్తులు.

తే. ఆసుధాధాముని భవమహాంబురాశి
కుబ్బుమీఱంగ నందనుఁ డుదయమయ్యె
వేదవేదాంగశాస్త్రార్థవిశదవాస
నాత్తధిషణాధురంధరుం డైనబుధుఁడు. 19

టీ. ఆసు...శికిన్ - ఆసుధాధాము = ఆచంద్రునియొక్క, విభవ = సంపద యనెడు, మహాంబురాశికిన్ = గొప్పసంద్రమునకు, ఉబ్బు = అతిశయము, వేద...ధరుండు - వేద = నాల్గు (ఋగ్యజుస్సామాధర్వములను) వేదములయొక్కయు, వేదాంగ = ఆఱు (శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము నను) వేదాంగములయొక్కయు, శాస్త్ర = మీమాంసాది శాస్త్రములయొక్కయు, అర్థ = అభిప్రాయమునందలి, (అర్థములయొక్క), విశద = విస్పష్టమయిన, వాసనా=ఎఱుకచే, ఆత్త = పొందఁబడిన, ధిషణా=బుద్ధియందు, ధురంధరుండు=బరువుమోసినవాఁడు, ప్రవీణుఁ డనుట. ఐనబుధుఁడు=అయియొప్పునట్టి బుధుఁడను వాఁడు, ఉదయమయ్యెన్ = జనించెను. (బుధనామ మిట సన్వర్థ నామధేయముగా గ్రహింప నగును.)

తా. ఆచంద్రునకు వేదవేదాంగాదివిద్యలనేర్చిన బుధుఁడను కుమారుఁ డయ్యె.

క. వానికిఁ బురూరవుఁడు ప్ర
జ్ఞానిధి యుదయించె సింహాసనస్థుఁడు తద్భూ

జానికి నాయువు తనయుం
డై నెగడె నతండు గనె యయాతినరేంద్రున్. 20

టీ. వానికిన్ = ఆబుధునకు, ప్రజ్ఞానిధి = బుద్ధికి గనివంటివాఁడును, సింహసదృశుఁడు=(పరాక్రమమునందు) సింహముతో సమానుఁ డగు, పురూరవుఁడు, ఉదయించెన్=జనించెను. తద్భూజానికిన్ = ఆరాజునకు, ఆయువను వాఁడు, తనయుండై=కొమారుఁడై, నెగడెన్ = అతిశయించెను. అతఁడు = ఆయువు, యయాతినరేంద్రున్=యయాతిమహారాజును, కనెన్=కనియెను.

వ్యాకరణము—భూజానియన్నపుడు భూమియే జాయగాఁ (భార్యగాఁ) గలవాఁడని యర్థము. బహువ్రీహిని జాయాశబ్దంబు జానియగు (బాలవ్యా.)

తా. బుధునకుఁ బురూరవుఁడు నాతనికి నాయువు నాతనికి యయాతి యనియుం జనించిరి.

క. అతనికి యదుతుర్వసు లను
సుతు లుద్భవ మొంది రహితసూదనులు గళా
న్వితమతులు వారిలో వి
శ్రుతకీర్తి వహించెఁ దుర్వసుఁడు గుణనిధియై. 21

టీ. అతనికిన్, అహితసూదనులు=వైరులను బరిమార్చువారు, కళాన్వితమతులు = విద్యలతోఁ గూడినచిత్తము కలవారు, అయిన, యదుతుర్వసులు=యదుఁడు తుర్వసుఁడు, అను సుతులు=అనుకొమారులు, ఉద్భవమొందిరి=పుట్టిరి. వారిలోన్, తుర్వసుఁడు, గుణనిధియై = మంచిగొనముల కునికిపట్టయి, విశ్రుతకీర్తిన్ = ప్రఖ్యాతయశమును, వహించెన్ = పొందెను.

తే. వానివంశంబు తుళువాన్వవాయ మయ్యె
నందుఁ బెక్కండ్రునృపు లుదయంబునొంది
నిఖిలభువనప్రపూర్ణనిర్ణిద్రకీర్తి
నధికు లైరి తదీయాన్వయమునఁ బుట్టి. 22

టీ. వానివంశము=ఆతుర్వసునివంశము, తుళువాన్వవాయము = తుళువ వంశము, అయ్యెన్ = ఆయెను, అందున్, పెక్కండ్రునృపులు = పెక్కుమంది రాజులు, ఉదయమొంది = జన్మించి, నిఖి...కీర్తిన్ - నిఖిలభువన = ఎల్ల లోకము లందును, ప్రపూర్ణ = నిండిన, నిర్ణిద్ర = విజృంభించు, కీర్తిన్ = కీర్తిచే, తదీయాన్వయమునన్ = ఆతుళువరాజులవంశమున, అధికులైరి = గొప్పవారైరి. తదీయాన్వయమునన్ = ఆతుళువరాజసంబంధ మగు వంశమునందు, పుట్టి = జన్మించి, ఈపద్యమునకుఁ గర్త ముందుపద్యమునందలి తిమ్మక్షితీశాగ్రణి.

తా. తుర్వసుని వంశమునే తుళువవంశ మని వ్యవహరింపసాగిరి. ఆ వంశమునందు జనియించి యసంఖ్యాకులగు రాజులు నిరుపమానయశముచే సుప్రసిద్ధిఁ గాంచిరి. ఆ వంశమునందు,

వ్యా.—కీర్తిన్ అనుచో ద్వితీయకుఁ దృతీయార్థము. జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు. (బాలవ్యాకరణము.)

మహాస్రగ్ధర. ఘనుఁడై తిమ్మక్షితీశాగ్రణి శఠకమఠగ్రావసం
  ఘాతవాతాశనరాడాశాంతదంతిస్థిరకిరులజంజాటముల్
  మాన్పి యిమ్మేదిని దోర్దండైకపీఠిన్ దిరముపఱిచి కీర్తి
  ద్యుతుల్ రోదసిన్ బర్వ నరాతుల్ నమ్రులై పార్శ్వ
  ములఁ గొలువఁ దీవ్రప్రతాపంబు సూపెన్. 23

టీ. తిమ్మక్షితీశాగ్రణి = తిమ్మరాజశ్రేష్ఠుఁడు, శఠ...జాటముల్ - శఠ = కపట మగు, కమఠ = తాఁబేటియొక్కయు (కూర్మావతారపు విష్ణుని యొక్క), గ్రావసంఘాత = కొండల గుంపులయొక్కయు, వాతాశన, రాట్ = ఆదిశేషునియొక్కయు, ఆశాంతదంతి = దిగ్గజములయొక్కయు, స్థవిరకిరుల = ఆదివరాహముయొక్కయు, జంజాటముల్ = తగులములు, దోర్దండైకపీఠిన్ = భుజదండ మను ప్రధానపీఠమున, తిరముపఱిచి = స్థిర

పఱచి, కీర్తిద్యుతుల్ = యశఃకాంతులు, రోదసిన్ = పృథివ్యాకాశము లందు, అరాతుల్=శత్రులు, నమ్రులై = వంగినవారై, పార్శ్వములన్ = ప్రక్కలను, తీవ్రప్రతాపంబు = వాఁడియైనపరాక్రమములు, చూపెన్ = కనఁబఱచెను.

కూర్మము, గ్రావసంఘము, ఆదిశేషువు, కిరులు మోయఁజాలనిభూభారము మోయుటయుం నందు దోర్దండపీఠిని భరించుటయుఁ దదతిశయప్రజ్ఞాశాలియనుట. కీర్తిద్యుతులు లోకమంతయుం వ్యాపించినమాత్రన విరోధులు లొంగరు. వారిని లొంగఁదీయుటకుఁ బ్రతాపంబుఁ జూపెను. నిగ్రహానుగ్రహసమర్థుఁ డనిభావము.

తా. తిమ్మరాజు కూర్మాదులయెడ తెగని తగులపుబాఁదఱను మాన్పి భూమిని దనబాహుపీఠమునందే నిల్పుకొని భరించుచుఁ దనకీర్తి లోకమెల్ల నిండారఁగా, విరోధిరాజులు ప్రక్కల నడఁగి యుండఁగా మిక్కిలి పరాక్రమమున నెగడెను. అలం. అతిశయోక్తి.

క. వితరణఖని యాతిమ్మ
క్షితిపగ్రామణికి దేవకీదేవికి నం
చితమూర్తి యీశ్వరప్రభుఁ
డతిపుణ్యుఁడు పుట్టె సజ్జనావనపరుఁడై. 24

టీ. వితరణఖని=దానమునకు గని యయిన, ఆతిమ్మ క్షితిపగ్రామణికిన్= ఆతిమ్మరాజశ్రేష్ఠునకు, దేవకీదేవికిన్ = దేవకి యను పేరు గలరాణికి, అంచితమూర్తి=ఒప్పిదమగు నాకారము గలవాఁడు, సజ్జనావనపరుఁడై = సత్పురుషుల రక్షించుటయం దాసక్తిగలవాఁడై, ఈశ్వరప్రభుఁడు = ఈశ్వరరాజు, పుట్టెన్=జనించెను. ఉపమాలంకారము.

చ. బలమదమత్తదుష్టపురభంజనుఁడై పరిపాలితాఢ్యుఁడై, యిల
పయిఁ దొంటి యీశ్వరుఁడె యీశ్వరుఁడై జనియింప నుమాపతిన్

జలరుహనేత్రలన్ దొఱఁగి శైలవనంబుల భీతచిత్తులై
మెలఁగెను శత్రుభూపతుల మేనులదాల్చిన మన్మథాంకముల్.

టీ. బల...భంజనుఁడై-బల = చతురంగబలముయొక్క (మదముచే) మత్త = మదము గొన్న, దుష్ట = చెడ్డరాజులయొక్క (చెడ్డరక్కసుల యొక్క) పుర=పట్టణములను (త్రిపురములను), భంజనుఁడై = నాశము చేసినవాఁడై, పరిపాలితార్యుఁడై=పాలింపఁబడిన పెద్దలుగలవాఁడై (పాలింపఁబడిన పార్వతిగలవాఁడై), తొంటియీశ్వరుఁడె = మునుపటి శివుఁడే, ఇలపయిన్, ఈశ్వరుఁడై=ఈశ్వరరాజయి, జనియింపన్ =పుట్టఁగా, పరిపాలితార్యుఁ డనునపుడు పరిపాలింపఁబడిన యార్యులుగలవాఁడు గాన నార్యులను బాలించువాఁ డని యీశ్వరరాజు పరముగాను, పాలింపఁబడిన యార్య = పార్వతిగలవాఁడుగానఁ బార్వతీపతియగు శంకరుఁ డని యీశ్వరుని పరముగను నర్థము సాధించునది. జలరుహనేత్రలన్=తామరలవంటికన్నులు గలస్త్రీలను, తొఱఁగి=త్యజించి, శైల వనంబులన్ = పర్వతములందును, అడవులందును, భీతచిత్తులై = భయంపడినహృదయముగలవారై, మన్మథాంకముల్=మన్మథ చిహ్నములు-కామవికారములు, రూపఱెన్ = నశించెను.

ఈశ్వరుఁడు తనకంటిమంటచే మన్మథునిఁ గాల్చి భస్మముచేసినవాఁడు గావున నీశ్వరజననముచే మన్మథాంకములు నశించుట సహజమె యని భావము.

తా. దుష్టులగు రక్కసులయొక్క పురములు మూటిని బరిమార్చి యార్యను బరిపాలించిన వెనుకటి యా యీశ్వరుఁడే, మరల నిప్పు డీశ్వరరాజై జనియించి శత్రురాజులపట్టణములను ధ్వంసపఱిచి యార్యులను బరిపాలించుచుండఁగా నాలుబిడ్డలను వదలి కొండలను నడవులను బీతుగొని తిరుగాడుచుండు శత్రురాజులదేహములందు మన్మథవికారములు నశించెను.

అలం. రూపకము.

సీ. నిజభుజాశ్రితధారుణీవజ్రకవచంబు
దుష్టభుజంగాహితుండికుండు
వనజేక్షణామనోధనపశ్యతోహరుం
డరిహంససంసదభ్రాగమంబు
మార్గణగణపికమధుమాసదివసంబు
గుణరత్నరోహణక్షోణిధరము
బాంధవసందోహపద్మవనీహేళి
కారుణ్యరసనిమ్నగాకళత్రుఁ
తే. డని జగంబుల మిగులఁ బ్రఖ్యాతిఁ గాంచె
ధరణిధవదత్తవివిధోపదావిధాస
మార్జితశ్రీవినిర్జితనిర్జరాల
యేశ్వరుఁడు తిమ్మభూపతియీశ్వరుండు. 26

టీ. ధరణి...శ్వరుండు - ధరణిధవ=రాజులచే, దత్త = ఈయఁబడిన, వివిధ(ములగు) ఉపదా = కానికలయొక్క, విధా=రీతిచే, సమార్జిత = సంపాదింపఁబడిన, శ్రీ=సంపదచే, వినిర్జిత = జయింపఁబడిన, నిర్జరాలయేశ్వరుఁడు = ఇంద్రుఁడు గలవాఁడు (నానారాజులచేఁ గానికలుగా సమర్పింపఁబడు సంపదలభోగముచే నింద్రుని మించినవాఁడనుట. తిమ్మభూపాలుఁడు సమస్త దిక్కులను జయించి రాజుల నందఱ సామంతులను జేసికొనుటచే వారివలన సమస్తసత్కృతు లొందఁగలిగెను. ఇందుచేఁ దిమ్మభూపాలుని భాగ్యాతిశయముపరాక్రమము సువ్యక్తమగును.)నిజ...చంబు-నిజ=తనయొక్క, భుజ=భుజమును, ఆశ్రిత=ఆశ్రయించిన ధారుణీ=భూమికి, వజ్రకవచంబు=వజ్రమణిరచితమైనయంగరక్ష యగువాఁడును, (వజ్రకవచము భేదింపరానిది) తాను రాజుగా నున్నంతకాలము పరరాజు లెవరును రాజ్యాపేక్షచేఁ దలయెత్తఁజాలరై రని భావము. దుష్ట...కుండు - దుష్ట = దుర్మార్గ లగువారు,

భుజంగ=పాములకు అహితుండికుండు = పాములవాఁ డగువాఁడును, వన...
హారుండు-వనజేక్షణా=తమ్మికంటియొక్క, మనోధన = చిత్త మను సొమ్ము
నను, వశ్యతోహారుండు=చూచుచుండఁగనే దొంగిలించుగడిదొంగ, అరి...
మంబు - అరి=శత్రువు లనెడు, హంస=అంచలయొక్క, సంసత్=సముదాయ
మునకు, అభ్రాగమంబు=వానకాలమును, (వర్షాకాలమున నంచలు క్రౌంచనగ
గుహామార్గమును నాధారముఁ జేసికొని మానససరోవరమున కేఁగుననిచెప్పుదురు.
అందుచే వర్షర్తు వంచలకు వినాశనకరము.) మార్గణ...దివసంబు - మార్గణ
గణ=యాచకసమూహము నెడు, పిక=కోకిలలకు, మధుమాసదివసంబు = వసంత
కాలపుదిన మైనవాఁడును, గుణ...రము-గుణ = సద్గుణము లనెడు, (రత్నము
లకు), రోహణక్షోణిధరము = రోహణపర్వత మగువాఁడును, (రోహణాచల
మున రత్నములు మెండుగా జనించును.) బాంధవసందోహ = చుట్టముల
ప్రోవనెడు, పద్మవనీ=తామరతోఁపునకు, హేళి = సూర్యుఁడగువాఁడును,
కారు...త్రుఁడు-కారుణ్యరస = దయారసమునకు, నిమ్నగాకళత్రుఁడు =
సముద్ర మగువాఁడును, అనన్ = అనునట్లు, జగంబులన్ = లోకములందు,
మిగులన్ = అధికముగా, ప్రఖ్యాతిన్ = ప్రసిద్ధిని, కాంచెన్=పొందెను.

అలం. రూపకోల్లేఖములు.

క. ఆయీశ్వరనృపతికిఁ బు
ణ్యాయతమతి యైనబుక్కమాంబకుఁ దేజ
స్తోయజహితు లుదయించిరి
ధీయుతు లగునారసింహ తిమ్మనరేంద్రుల్. 27

టీ. ఆయీశ్వర నృపతికిన్, పుణ్యాయతమతి = పుణ్యములచే నతి
శయించిన బుద్ధిగలది, ఐన బుక్కమాంబకున్, తేజః+తోయజహితులు =
ప్రతాపమునందు సూర్యులును, ధీయుతులు=బుద్ధిశాలురును నగు, నారసింహ

తిమ్మనరేంద్రుల్ = నరసింహభూపాలుఁడు, తిమ్మభూపాలుఁడును, ఉదయిం
చిరి = జనించిరి.

క. అందు నరసప్రభుఁడు హరి
చందనమందారకుందచంద్రాంశునిభా
స్పందయశస్తుందిలది
క్కుందరుఁడై ధాత్రి యేలెఁ గలుషము లడఁగన్. 23

టీ. అందున్ = వారిలో, నరసప్రభుఁడు, హరిచందన...కుందరుఁడై-హరిచందన = శ్రీగంధముతోడను, మందార = కల్పవృక్షముతోడను, కుంద = మల్లెపూవులతోడను, చంద్రాంశు = వెన్నెలతోడను, నిభ = సమాన మగు, అస్పంద = కదలికలేని, యశః = కీర్తిచే, తుందిల = నిండారిన, దిక్కుందరుఁడై = దిక్కు లనెడుగుహాలు గలవాఁడై, కలుషములు = పాపములు, అడఁగన్ = నశించునట్లు, ధాత్రి యేలెన్ = భూమిని పాలించెను.

ఉపమాతిశయోక్తు లలంకారములు.

ఉ. శ్రీరుచిరత్వభూతిమతిజిత్వరతాకృతిశక్తికాంతులన్
ధీరతఁ సారభోగముల ధీనిధి యీశ్వరనారసింహుఁ డా
వారిజనాభశంకరుల, వారికుమారుల, వారితమ్ములన్
వారియనుంగుమామలను వారివిరోధులఁ బోలు నిమ్మహిన్.

టీ. ధీనిధి = బుద్ధికి గని యగు, ఈశ్వరనారసింహుఁడు = ఈశ్వరరాజు కుమారుఁడైననరసింహరాయలు, శ్రీరుచిరత్వ...తులన్ - శ్రీరుచిరత్వ = లక్ష్మిచే భాసిల్లుటచేతను, భూతి = ఐశ్వర్యముచేతను, మతిజిత్వరతా = బుద్ధిచే జయించుస్వభావముచేతను, ఆకృతి = ఆకారముచేతను, శక్తి = సామర్థ్యముచేతను, కాంతులన్ = చక్కఁదనముచేతను, ధీరతన్ = ధైర్యముచేతను, సారభోగములన్ = బలముచేతను, అనుభవముచేతను, వారిజనాభశంకరులన్ = విష్ణువును, శివుని, వారికుమారులన్ = బ్రహ్మను, కుమారస్వామిని, వారి

తమ్ములక్ = మన్మథుని, వీరభద్రుని, వారియనుంగుమామలను = చంద్రుని, మైనాకుని, వారివిరోధులక్ = రాహువును నింద్రుని, పోలుక్.

ఈశ్వరనారసింహుఁడు గాన నతఁడు సర్వవిధముల శివలక్షణములు విష్ణులక్షణములు గలవాఁడై యుండెను. కావనే శివవిష్ణువుల మహాశక్తులె గాక వారిసంబంధులయు విరోధులయు శక్తిసామర్థ్యములుగూడఁ గలిగి యుండెను ఇందీశ్వరనారసింహుని లక్ష్మీసమృద్ధ్యాదు లభివర్ణితములు.

తా. నరసరాజు లక్ష్మీసంపన్నతచే విష్ణుమూర్తిని, ఐశ్వర్యముచే శివుని, బుద్ధిచే బ్రహ్మదేవుని, జయించుస్వభావమునఁ గుమారస్వామిని, ఆకారమున మన్మథుని, శక్తిచే వీరభద్రుని, గాంతిచేఁ జంద్రుని, స్థైర్యమున మైనాక పర్వతమును, చేవచేత రాహువును, భోగములచే దేవేంద్రునిఁ బోలును.

అలం. ఉపమ. యథాసంఖ్యము.

సీ. అంభోధివసనవిశ్వంభరావలయంబుఁ
దనబాహుపురిమరతకముఁ జేసె
నశ్రాంతవిశ్రాణనాసారలక్ష్మికిఁ
గవికదంబముఁ జాతకములఁ జేసెఁ
గకుబంతనిఖిలరాణ్ణికరంబుఁ జరణము
జీరంబుసాలభంజికలఁ జేసె
మహనీయనిజవినిర్మలయశస్సరసికి
గగనంబుఁ గలహంసకంబుఁ జేసె
తే. నతిశితకృపాణకృత్తమత్తారివీర
ముండలేశసకుండలమకుటనూత్న
ముక్తమాల్యపరంపరామండనార్చి
తేశ్వరుం డగునారసింహేశ్వరుండు. 30

టీ. అతిశిత...శ్వరుండు-అతిశిత=మిగుల వాఁడి యగు, కృపాణ = కత్తిచే, కృత్త=తెగ నఱకఁబడిన, మత్త = మదించిన, అరివీర = శత్రువీరు

లైన, మండలేశ = రాజులయొక్క, సకుండల = కుండలములతోఁ గూడిన, మకుట=కిరీటములు గల, నూత్న=క్రొత్త వయిన, మస్తమాల్య = శిరోమాలికలయొక్క పరంపరా = సమూహము, మండన = అలంకారములచే, అర్చిత = పూజింపఁబడిన, ఈశ్వరుండు = శివుఁడు గలవాఁడు, శంకరుఁడు తలపుత్తెంబు దండగాఁ గలవాఁడు. అవియును మిగులఁ బ్రాఁతవిగాన ఈశ్వర నారసింహుఁడు విరోధిరాజులఁ జంపి వారికుండలాలంకృతశిరస్సులు క్రొత్త మాలికలుగా శివుని కంఠమున నలంకరించి పూజించె ననుట. అంభోధి...యుంబు- అంభోధి=సముద్రమే, వసన = వస్త్రముగాఁ గల, విశ్వంభరావలయంబున్ = భూమండలమును, తనబాహుపురిమరతకమున్ = తనభుజకీర్తులను మరకతమణిగా, చేసెన్=ఒనరించెను. భుజకీర్తులందు మణినిభరించుట యెంతచులకనయో నరసరాజునకు భూభారము అంత తేలికగనుండెను. అశ్రాంత...లక్ష్మికిన్-అశ్రాంత =ఎడతెగని, విశ్రాణన=దానమనెడు, ఆసార = ఎడతెగక కురియుధారా వర్షముయొక్క, లక్ష్మికిన్=కల్మికి, కవికదంబమున్ = కవిసముదాయమును, చాతకములన్=చాతకపక్షులను, (చాతకములు మేఘదత్తమగు నుదకమునకై కాచికొని యుండును. దానిఁ దక్క నితరజలము నని త్రాగవు. అటులె కవులుగూడ నరసరాజొసంగు దానములచేఁ దృప్తినొంది యాచ్ఞావృత్తిని మొదలంట మానిరని భావము. కకుబం...రంబు-కకుబంత=దిగంతములందలి, నిఖిలరాట్=ఎల్లరాజులయొక్క, నికరంబున్=సమూహమును, చరణ...లను- చరణమంజీరంబు=కాలియందెను (జెక్కఁబడిన) సాలభంజికలను=బొమ్మలను, (తనకు నోడిన నానాదేశపురాజులను దన కాలిగండపెండేరమునఁ జెక్కించె ననుట) రాజులు బలవద్విరోధుల వధించినపుడు క్రోధము చల్లారక వారి బొమ్మలు చెక్కించి కాలికడియములందుఁ దాల్చుటకలదు. ఇందులకుఁ బ్రమాణములు.—

సీ. “డా కాలిగండపెండారంబునందున బొమ్మలై వైరిభూభుజులు వ్రేల”

సీ. జేజేలమొకిమీలఁ జెక్కినగండపెండారంబు పదమున న్గంమమీఱ”

(దశావతారచరిత్రము)

మహనీయ...సితిన్-మహనీయ=పూజార్హమైన, నిజ=తనయొక్క, వినిర్మల=స్వచ్ఛమగు, యశః=కీర్తియను, సరసితిన్=కొలనికి, గగనంబున్ = ఆకసమును, కలహంసకంబున్ = రాజహంసనుగా, చేసెన్ = ఒనరించెను.

తా. నరసరాజు విలాసముగా భూమిని ధరించి పాలించె ననియుఁ గవుల నెడ తెగక మనిచె ననియుఁ దనకోడినరాజులను గాలియందెయందు బొమ్మలఁగాఁ జెక్కించె ననియుం, ఎల్లలోకములను దనయశము నించె ననియుఁ దెగ నఱికిన విరోధిరాజుల తలలచేఁ గపాలమాలాధారి యగు పరమేశ్వరు నర్చించె ననియుఁ దాత్పర్యము. అలం. రూపకము. అతిశయోక్తి.

తే. ఆనృసింహప్రభుండు తిప్పాంబవలన
నాగమాంబికవలన నందనులఁ గాంచె
వీరనరసింహరాయభూవిభుని నచ్యు
తాంశసంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు. 31

టీ. ఆనృసింహప్రభుండు = ఆ నరసరాజు, తిప్పాంబవలనన్, వీర నరసింహరాయ భూవిభునిన్, నాగమాంబిక వలనన్, అచ్యుతాంశసంభవున్=విష్ణుఅంశవలన జనించిన, కృష్ణరాయక్షితీంద్రున్ = శ్రీకృష్ణదేవరాయలు, అను, నందనులన్ = కుమారులను, కాంచెన్=కనియెను.

తా. ఆనరసరాజు తిప్పాంబ నాగమాంబ యనునిర్వురు భార్యల యందు వీరనరసింహరాయఁడు కృష్ణరాయఁడు ననునిర్వురు కొమరులఁ బడసెను. అందుఁ గృష్ణరాయలు విష్ణ్వంశ సంభూతుండు.

క. వీరనృసింహాఖ్యుఁడు నిజభుజ
దారుణకరవాల పరుషధారాహతవీ
రారి యగుచు నేకాతప
వారణముగ నేలె ధర నవారణమహిమన్. 32

టీ. నిజ...రారి-నిజ=తనయొక్క, భుజ=బాహువునందున్న, దారుణ=తీక్ష్ణమైన, కరవాల=కత్తియొక్క, పరుష = తీవ్రమైన, ధారా = వాయిచేత

హత = చంపఁబడిన, వీరారి = శూరు లగు శత్రువులు గలవాఁడు, అవారణ మహిమన్ = ఆటంకము లేని ప్రతాపముచే, ఏకాతపవారణముగన్ = ఏకచ్ఛత్రాధిపత్యముగా, వీరనృసింహుఁడు = వీరనరసింహరాయలు, ధరన్ = భూభాగమును, ఏలెన్ = పరిపాలించెను.

తా. వీరనరసింహరాయలు కరవాలముచే విరోధులనందఱను ఖండించి ఏకచ్ఛత్రాధిపత్యముగ నిఖిలభూమండలము నిరాటంకముగాఁ బాలించెను.

క. ఆవిభుననంతరంబ ధ
 రావలయముఁ దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా
 దేవియు శుభమతి తిరుమల
 దేవియునున్ దనకుఁ గూర్చుదేవేరులు గాన్. 33

టీ. ఆ విభునసంతరంబ = ఆవీరనరసింహరాయల పిమ్మట, కృష్ణరాయఁడు, చిన్నాదేవియున్, శుభమతి = యోగ్యమగు బుద్ధిగలది యగు, తిరుమల దేవియున్, తనకున్, కూర్చుదేవేరులుగాన్ = ప్రియమైన పట్టపురాణులై యుండ, ధరావలయమున్ = భూచక్రమును, తాల్చెన్ = ధరించెను.

తా. వీరనరసింహరాయల యనంతరము కృష్ణదేవరాయలు చిన్నాదేవియుం దిరుమలదేవియుఁ బట్టపురాణులై యుండ రాజ్యభారము వహించెను.

సీ. తొలఁగెను ధూమకేతుక్షోభ జనులకు
 నతివృష్టిదోషభయంబు వాసెఁ
 గంటకాగమభీతి గడచె నుద్ధతభూమి
 భృత్కటకం బెల్ల నెత్తువడియె
 మాసె నఘస్ఫూర్తి మరుభూములందును
 నెలమూఁడువానలు నిండఁ గురిసె

నాబాలగోపాల మఖిలసద్ద్విజమును
నానందమున మన్కి నతిశయిల్లెఁ
తే. ప్రజలకెల్లను గడు రామరాజ్య మయ్యెఁ
చారుసత్త్వాఢ్యుఁ డీశ్వరనారసింహ
భూవిభునికృష్ణరాయఁ డభ్యుదయ మొంది
పెంపు మీఱఁగ ధాత్రిఁ బాలింపుచుండ. 34

టీ. చారుసత్త్వాఢ్యుఁడు = ఒప్పిద మగుబలముగల, ఈశ్వరనారసింహభూవిభునికృష్ణరాయఁడు = ఈశ్వరరాజుకొడుకగునారసింహరాయని పుత్త్రుఁడు కృష్ణరాయఁడు, అభ్యుదయము = ఉచ్చస్థితిని, పెంపు=అభివృద్ధి, మీఱంగన్ =అతిశయింపఁగా, ధూమకేతుక్షోభ=తోఁకచుక్కలవలనియాపద, (తోఁకచుక్కలరాక యుపద్రవకర మని కలదు). అతివృష్టిదోషభయంబు = అధికవర్షములవలనిదిగులు, కంటకాగమభీతి = క్షుద్రవిరోధులరాకవలని భయము, (దోఁపిడిగాండ్రవలనిభయము), ఉద్ధత...కటకంబు - ఉద్ధత = అతిశయించిన, భూమిభృత్ = రాజులయొక్క, కటకంబు=రాజధాని, ఎత్తువడియెన్ = బీదవడెను. అఘస్ఫూర్తి = పాపపుహెచ్చు, మరుభూములందును=నిర్జలప్రదేశములందును, (నెలకు మూఁడేసివానలు కురియుటచే దేశమున క్షేమమును సుభిక్షమును గల్గు నని కలదు.) ఆబాలగోపాలము = పిల్లలు గొల్లలు మొదలుకొని, అఖిలసద్ద్విజమును = సమస్తసత్పురుషులసమూహమును, ఆనందమునన్ = సంతోషముతో, మన్కిన్ = బ్రదుకుటచే, రామరాజ్యము=రామునిరాజ్యమును బోలురాజ్యము (రామరాజ్యమున దేశమున కెట్టియసౌఖ్యములు కలుగ నుండెను. కృష్ణరాయనికాలమునను రాజ్య మట్టి దయ్యె ననుట.) అయ్యెన్ = అయెను.

ధూమకేతువు లనిష్టసూచకము లనుటకు:—
"ఉక్తవిపరీతరూపో న శుభకరో ధూమకేతురుత్పన్నః,

ఇంద్రాయుధానుకారీ విశేషతో ద్విత్రిచూళో వా.”

ఈ మొదలగు ప్రమాణములచేఁ దోఁకచుక్కలు అనిష్టసూచకములనుట స్పష్టము.

తా. కృష్ణదేవరాయలు భూమండలమును పాలించునపుడు ప్రజ లందఱు సుఖించిరి. సకాలమునందు వానలు గురియుటచే భూమి సస్యసమృద్ధిచే రాణించెను. ప్రజలజీవితము సౌఖ్యవంత మయ్యెను. ఇంతయేల రాయలరాజ్యకాలమునందుఁ బ్రజలు రామరాజ్యమునందువలె సుఖించిరి.

మ. అలపోత్రిప్రభుదంష్ట్ర భోగివరభోగాగ్రాళిఱా లుద్భటా
చలకూటోపలకోటి రూపుచెడ నిచ్చల్ రాయఁగా నైన మొ
క్కలు భూకాంతకు నున్నవయ్యె నరసక్ష్మాపాలు శ్రీకృష్ణరా
యల బాహామృగనాభిసంకుమదసాంద్రాలేపపంకంబునన్. 35

టీ. భూకాంతకున్ = భూదేవికి, అల...దంష్ట్ర=ఆ యాదివరాహమూర్తియొక్క కోఱయును, భోగి...ఱాలు-భోగివర=ఆదిశేషుని, భోగాగ్ర=పడగమీఁద నున్న, ఱాలు=ఱాళ్లును (మణులును), ఉద్భ...కోటి-ఉద్భట = అతిశయించిన, అచల=పర్వతములయొక్క, కూట = శిఖరములందలి, ఉపల=ఱాళ్లయొక్క, కోటి=సమూహమును, రూపుచెడన్ = అందము చెడునట్లు, నిచ్చల్=ఎప్పుడును, రాయఁగాన్ = ఒరయఁగా, ఐనమొక్కలు = ఏర్పడిన గంట్లు, నరస...బునన్ = నరసక్ష్మాపాలునికొమరుఁడైన శ్రీకృష్ణరాయలయొక్క, బాహా=భుజమందలి, మృగనాభి=కస్తూరిచేతను, సంకుమద=జవాజిచేతను, సాంద్ర = చిక్కనయిన, ఆలేప=పూఁతయొక్క, పంకంబునన్=బురదచే, నున్నవయ్యెన్ = నునుపయ్యెను.

పందికోఱ పదనైనది. ఱాలు కఠినమైనవి. శిలాకోటికూడఁ గఠినములే. వీనియొఱయిక యసామాన్యమైనదిగాన భూకాంత కందము చెడి గంట్లుపడెను. సంకుమదము కస్తూరి కలిపిన బురదవలె నగును. భూమిపైఁగల

గండ్లు మట్టితోఁ బూడ్చుచున్నటుల భూకాంతగంట్లు కస్తూరికాద్యాలేపము లతో రాయలు నివారించెనని భావము. రాయల మైపూఁత సాంద్రము, పంకమువంటిదిగాన నే భూకాంత మేను నున్న నయ్యెను.

తా. అంతవఱకును ఎడ తెగక ధరించుచున్న యాదివరాహమూర్తి యొక్క కోఱ, ఆదిశేషునిపడగలమీఁదిఱాళ్లు, కులపర్వతశిఖరములమీఁదిశిలలు, ఒరసిగంట్లేర్పడి రూపు చెడి యున్న భూదేవి, నాకృష్ణరాయఁడు తన భుజము ననే తాల్చుటచే నచటఁబూయఁబడిన సుగంధిచందనము చిక్కఁగ నంటి గంట్లుపూడి యాభూదేవి నవర నయ్యెను. భూమి నాతఁడు నిర్బాధముగాఁ బరిపాలించె ననుట. అలం. అతిశయోక్తి.

ఉ. క్రూరవనేభదంతహతకుడ్యపరిచ్యుతవజ్రపంక్తిఁ బో
   ల్పారుమిడుంగుఱుంబురువులంచు వెసన్ గొనిపోయిపాంతశృం
   గారవనద్రుమాళి గిజిగాఁడులు గూఁడులఁ జేర్చు దీపికల్
   గా రహిఁ గృష్ణరాయమహికాంతునిశాత్రవపట్టణంబులన్.

టీ. కృష్ణ...ణంబులన్ - కృష్ణరాయఁ (డనెడు), మహికాంతుని = రాజుయొక్క, శాత్రవపట్టణంబులన్=శత్రుపురములందు, క్రూర...పంక్తిన్ = క్రూర = కఠినములయిన, వనేభదంత = అడవియేనుఁగులకొమ్ములచే, హత = కొట్టఁబడిన, కుడ్య=గోడలనుండి, పరిచ్యుత=రాలిన, వజ్రపంక్తిన్=వజ్రముల ప్రోవును, పోల్పారు=ఒప్పునట్టి, మిడుంగుఱుంబురువులు = మిణుఁగుఱుఁ బురుగులు, వెసన్=శీఘ్రముగా, శృంగారవనద్రుమాళిన్ = ఉద్యానవనములందలి చెట్లయందు, గిజిగాఁడులు = బంగారుపిచ్చుకలు, దీపికల్ గాన్=దీపములుగా, రహిన్=ఆసక్తితో, చేర్చున్=పెట్టును. (గిజిగాండ్లు గూండ్లలో వెలుతురుం టకు మెఱుఁగుడుపుర్వులఁ గొనిపోయి పెట్టుకొను ననుట ప్రసిద్ధము.)

రాజులు భోగపురుషులుగాన గోడలకు రత్నములు చెక్కిరి. మిగుల దృఢమైనవైనను దుష్టములగువనగజముల కోఱపోటున కవి రాలినవి. శాత్రవ

పట్టణములఁ బాడువడుటచే నేనుఁగులు గోడల గోరాడుటకు రత్నములఁ బత్తు లేరుటకు నవకాశము చిక్కెను. (రత్నములు దీపికలు. ఇవి రక్తవర్ణ వస్తుగణము లోనివి.)

తా. కృష్ణరాయనివిరోధిరాజులపట్టణములు పాడ్వడి కాఱడవులు కాఁగా నందు వసించు నడవియేనుఁగు లచ్చటఁ జెడియున్న మేడలగోడలను దంతములతోఁ బడఁగొట్టుటచే వానినుండి రాలినవజ్రములను బంగారు పిచ్చుకలు మిణుఁగుఱుఁబురుగు లనుకొని కొనిపోయి రాత్రులందు వెలుతురుకై తమ గూఁడ్లలో నునిచికొనును. అతిశయోక్తి, భ్రాంతిమంతము, అలంకారము.

సీ. తొలుదొల్త నుదయాద్రిశిలఁ దాఁకి తీండ్రించు
నసిలోహమున వెచ్చనై జనించె
మఱి కొండవీ డెక్కి మార్కొని నలియైన
యల కసవాపాత్రు నంటి కాఁకె
నట సాఁగి జమ్మిలోయఁ బడి వేగ దహించెఁ
గోన బిట్టేర్చెఁ గొట్టానఁ దగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁ గరఁచె గౌతమిఁ గ్రాఁచె
నవుల నాపొట్నూర రవులుకొనియె
తే. మాడెములు ప్రేల్చె నొడ్డాది మసి యొనర్చెఁ
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగి పఱవఁ
దోఁకచిచ్చన నౌర యుద్ధురతఁ గృష్ణ
రాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని. 37

టీ. కృష్ణరాయ...మహాగ్ని-కృష్ణరాయ(లయొక్క), బాహుప్రతాప = భుజపరాక్రమ మను, జాగ్రత్ = ప్రజ్వలించు, మహాగ్ని, ఉద్ధురతన్ = ఎగసేఁగుటచే, తోఁకచిచ్చనన్ = ఒకటివెంట నొకటిగాఁ గ్రుచ్చినపిడుకల కంటించిన నిప్పువలెన్, అలం. ఉత్ప్రేక్ష. తొలుదొల్తన్ = మున్ముందు, ఉదయాద్రి

దిలన్ = ఉదయగిరియను (చెకుముకి) ఱాతిని, తాఁకి=తగిలి, తీండ్రించునని లోహమునన్ = వేఁడిగొన్న ఖడ్గ మను నుక్కువలన, వెచ్చనఁగు = వేఁడియై, జనించెన్ = పుట్టెను. చెకుముకివలనఁ బూర్వము అగ్నిని జనింపఁజేయువారు. ఇటఁ జెకుముకిఱాయి యుదయగిరి. దానిపైఁగొట్టు నుక్కుతునుక రాయల ఖడ్గము. పరాక్రమమనువహ్ని తొలుత నుదయగిరియందు జనించెను. మొదట నుదయగిరి ముట్టడించి గెలిచెనని భావము. (రూపకము) కొండవీడు (అనుపుర మును) (కొండప్రదేశమును) ఎక్కి, మార్కొని=ఎదుర్కొని, నలిరైన = వలఁగియున్న, (పిడుక మొదలగువాని నలిరైన), అల, కసవాపాత్రున్ = కసవాపాత్రుఁ డనురాజును, (చెకుముకిఱాతఁ బొడమిననిప్పు పిడుకనలిమీఁదఁ బడి రాఁజును) అంటి, రాఁజెన్ = రగులుకొనెను. రవ్వ నలియందుఁగాని రాఁజదు. ఇట నలి కసవాపాత్రుఁడు. రవ్వ ఉదయగిరి విజయమునందుఁ గడించిన బలసాహసాతిశయము. అలం-రూపకము. అట=అప్పల, సాఁగి = వెడలి, జమ్మిలోయన్=జమ్మిలోయ యనుమన్నెమున (జమ్మున), వేగన్=శీఘ్రముగా, (పాఠాంతరము. వేఁగిన్=వేఁగిదేశమును) కోనన్ = కోన యనుమన్నెమును (మోటప్రదేశమును), విట్టేర్చెన్=అంటఁ గాల్చెను. కొట్టానన్ = కొట్టమను దేశమున (గోష్ఠమున), తగిలెన్ = అంటుకొనెను. రాఁజినయగ్నిహోత్రము జమ్మిలోయ, కోన, కొట్టము. ఇవి సులభముగా సాధ్యమయ్యెను. రాయల ప్రతాపాగ్ని యింట మండెను, పరాక్రమవిజృంభణము సూచితము. (రూపకము) కనకగిరిస్ఫూర్తిన్=కనకగిరి (బంగారుకొండ) యను దుర్గము యొక్క యతిశయమును, కరచెన్=కరఁగించెను. గౌతమున్ = గోదావరిని, క్రాఁచెన్ = క్రాఁగఁ జేసెను. అవులన్=పిదప, ఆపొట్నూరన్=పొట్నూరనుపట్టణమునందు, రవులుకొనియెన్=ప్రజ్వలించెను. మాడెములు (అను మన్నెములను) ప్రేల్చెన్ = ప్రేలఁజేసెను. ఒడ్డాదిన్=ఒడ్డాదియనుపట్టణమును, మసిరొనర్చెన్ = భస్మముగఁజేసెను. గజరాజు=గజపతిరాజు = (ఏనుఁగు), కలఁగి=కలఁతనొంది; పఱవన్=పరువిడునట్లు, కటకపురిన్ = కటకమనుపట్టణమును, కాల్చెన్ = మసి

యొనర్చెను. ఇటఁ బరాక్రమవహ్ని కాల్చుట, రవుల్కొనుట చెప్పఁబడెను. ఇంతతో సీదిగ్జైత్రయాత్ర సమాప్తమయ్యెను.

తా. ఈపద్యమునఁ గృష్ణరాయని ప్రతాప మగ్నిగా రూపింపఁబడినది. మఱియు నయ్యది యొకటనుండి మఱియొకటికిఁ బ్రాఁకుటచేఁ దోఁకచిచ్చుగా నుత్ప్రేక్షింపఁబడెను. ఆయగ్నికిఁ జెకుముకిఱాతికిని నుక్కునకును నొరయికచే జనించుట (పిడుక) నలిలోఁ రాఁజుట జమ్ము వహించుట మొదలగుధర్మములతోఁ గొన్ని శ్లేషమర్యాదచే సమర్థింపఁబడినవి. అలం. రూపకోత్ప్రేక్షలకు సంకరము.

మ. ధరకెంధూళులు కృష్ణరాయలచమూధాటీగతిన్ వింధ్యగ
హ్వరముల్ దూఱఁగఁ జూచి తారచటఁ గాఁపై యుండుటన్
జాల న,చ్చెరువై యెఱ్ఱనివింతచీకటులు వచ్చెన్ జూడరే
యంచు వే, సొరిదిన్ జూతురు వీరరుద్రగజరాట్ శుద్ధాంత
ముగ్ధాంగనల్. 38

టీ. వీరరు...గనల్-వీరరుద్ర గజరాట్ = వీరరుద్రగజపతిరాజుల యొక్క, శుద్ధాంత = అంతఃపురమందలి, ముగ్ధాంగనల్ = లోకమెఱుఁగని స్త్రీలు, కృష్ణ...గతిన్-కృష్ణ రాయల(యొక్క), చమూ=సేనయొక్క, ధాటీగతిన్ = దాడినడచుటచే, ధరకెంధూళులు = భూమిమీఁది యెఱ్ఱనిదుమారములు, వింధ్యగహ్వరముల్=వింధ్యపర్వతపుగుహలందు, దూఱఁగన్=చొరఁగా, తారు=తాము, కాఁపై=కాఁపురమయి, అచ్చెరువై = ఆశ్చర్యముకలిగి, ఎఱ్ఱని వింతచీకటులు = ఎఱ్ఱరంగు గలచిత్రపుఁజీకట్లు, చూడరే = చూడుఁడు, వే=వేగముగా, సొరిదిన్=సరిగా, చూతురు=వీక్షింతురు.

కెంధూళి యనుచో విభాగము కెంపు+ధూళి యని. కెంపు ప్రాఁతాదులలోనిదిగాన సమాసమునందు మీఁదివాల్లునకు లోపము ద్రుతాదేశముచే బిందుసిద్ధియుం నొప్పి కెంధూళి యైనది.

ఒకరు చీకటు లెఱ్ఱగానుంటఁ బ్రకృతివిరుద్ధమనిరి. ఇది ముగ్ధాజన భ్రాంతి. కాన వింతచీకటు లనఁగొనిరి. ఇంతియగాక సమీపమునందున్న

భూవర్ణమునుబట్టి రేణుప్రసరణ ముండును. వింధ్యప్రాంతభూములు రక్తధూళీవృతములని కవి యెఱ్ఱనిదుమ్మును వర్ణించెను. దుమ్ము నెఱ్ఱగాఁ జెప్పుటయుఁ గలదు.

"తురగఖురహత స్తథా హి రేణుః...పతతి పరిణతారుణప్రకాశః."
(అభిజ్ఞానశాకుంతలము.)

తా. కృష్ణరాయలవలని భయముచే స్వరాష్ట్రమునువీడి వింధ్యపర్వతపు గుహాలలో వసించు వీరరుద్రగజపతియొక్క లోక మెఱుఁగని యంతఃపురస్త్రీ లాకృష్ణరాయలసేనలు దండువెడలుటచే రేఁగినయెఱ్ఱధూళి తమ వసించుగుహాలను దట్టముగాఁ జుట్టుకొనఁగా నిదియేమో యెఱ్ఱచీకటి క్రమ్ముకొనె నని యొక రొకరు చెప్పికొనుచుఁ జూచుచుందురు. సంబంధాతిశయోక్తి. పరికరము. భ్రాంతిమంతము. చపలాతిశయోక్తి. వీనిలోఁ బరికర భ్రాంతిమంతములకు నంగాంగిభావసంకరము.

చ. అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్నూరికడ నిల్పినకంబము సింహభూధర
ప్రభుతిరునాళ్లకున్ దిగుసురప్రకరంబు కళింగమేదినీ
విభునపకీర్తికజ్జలము వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్. 39

టీ. అభిరతిన్=ఆసక్తితో, జయాంకములన్ = విజయచిహ్నములను, లిఖియించి = వ్రాసి, తాళసన్నిభముగన్ = తాటిచెట్టుతో సమానముగా, పొట్నూరికడన్ = పొట్నూరను గ్రామముచెంత, నిల్పిన = ప్రతిష్ఠించిన, కంబమున్ = శాసనస్తంభమును, సింహభూధరప్రభుతిరునాళ్లకున్ = సింహాచలస్వామియైన నరసింహస్వామియొక్క యుత్సవములకు, దిగుసురప్రకరంబు= చనుదెంచు దేవతలగుంపు, కళింగమేదినీవిభునపకీర్తికజ్జలము = కళింగరాజుయొక్క యపయశ మనుమసిని, నిచ్చలున్=ఎప్పుడును.

తా. కృష్ణరాయలు తనవిజయవార్తలను జెక్కించి పొట్నూరియొద్ద నిల్పిన పొడవైన జయధ్వజరూపమగు శాసనశిలను, సింహాచలనరసింహ

స్వామియుత్సవములను గాంచుటకు స్వర్గమునుండి వచ్చుదేవత లెప్పుడును జేరువఁ గాంచి కళింగరాజునపకీర్తి యనుమసి రాసి చదువుచుందురు.

అపకీర్తిని నలుపుగను గీర్తిని దెలుపుగను గవులు వర్ణించుట ప్రసిద్ధము. శాసనశిలలకు మసిరాసి చదువుదురు. గజపతియపకీర్తియే శాసనపఠనమున కనువగుమసి. శాసనశిలాస్తంభము తాళసన్నిభ మగుటచేఁ బఠనము భూమికి దిగుదేవతలకె సుసాధ్య మగుచున్నది.

మహాస్రగ్ధర. ఎకరాలన్ మందువాసాహిణములఁ గలభద్రేభ
సందోహవాహ, ప్రకరంబుల్ గొంచుఁ దత్తత్ప్రభువులు
పనుపన్ రాయబారుల్ విలోకో, త్సుకులై నిత్యంబు శ్రీ
కృష్ణునియవసరముల్ చూతు రందంద కొల్వం, దక యా
ప్రత్యూష మాసంధ్యము పనివడి తన్మందిరాళిందభూమిన్.

టీ. తత్తత్ప్రభువులు = ఆయారాజులు, పనుపన్ = పంపఁగా, ఎకరాలన్ = మొగసాలలయందును, మందువాసాహిణములన్ = ఎత్తుగాఁగట్టఁబడిన గుఱ్ఱపుశాలలందును, కల, భద్రే... ప్రకరంబుల్ - భద్రేభ = భద్రజాతియేనుఁగుల యొక్కయు, వాహ = గుఱ్ఱములయొక్కయు, ప్రకరంబుల్ = సమూహమును, కొంచున్ = తోకొని, నిత్యంబున్ = ఎప్పుడును, రాయబారుల్ = రాయబారము నడపువారు, కొల్వందక = దర్శనము దొరకక, ఆప్రత్యూషము = తెల్లవాఱినది మొదలు, ఆసంధ్యము = ప్రొద్దు క్రుంకువఱకును, పనివడి = ప్రయత్నపడి, తన్మందిరాళిందభూమిన్ = ఆకృష్ణరాయల మందిరపుముంగిట, విలోకోత్సుకులై = చూడ నాస కలవారై, అందంద = ఎడనెడ, శ్రీకృష్ణుని యవసరముల్ = శ్రీకృష్ణరాయల (శ్రీకృష్ణమూర్తియొక్క) సమయములను, చూతురు = ప్రతీక్షింతురు.

గజజాతులు మూఁడు భద్రము, మందము, మృగము అని. ఉత్తమమైనది భద్రజాతిగజము. మందువాయన దూలములనఱియెత్తున స్తంభముల మీఁదికి వచ్చిన గుఱ్ఱపుశాలలని బ్రౌనుగారి ప్రతియం దర్థము గలదు.

తా. ఆయారాజులు పంపినరాయబారులు కానికగాఁ గొనివచ్చిన భద్రగజములను, ఉన్నతాశ్వములను దోడ నుంచుకొని శ్రీకృష్ణరాయలదర్శనము దొరకమిచే నగరివాఁకిట ప్రొద్దుననుండి సాయంకాలమువఱకు ననుదినమును దర్శనమునకు సమయము వేచికొనియుందురు. స్వభావోక్త్యలంకారము.

చ. మదకలకుంభికుంభనవమౌక్తికముల్ గనుపట్టు దట్టమై
వదలక కృష్ణరాయకరవాలమునన్ దగుధారనీట న
భ్యుదయము వొంది శాత్రవులపుట్టిమునుంగఁగ ఫేనపంక్తితోఁ
బొదిగొని పైపయిన్ వెడలుబుద్బుదపంక్తులువోలెఁ బోరులన్.

టీ. పోరులన్ = యుద్ధములందు, కృష్ణరాయ (లయొక్క) కరవాలమునన్ = కత్తియందు, తగుధారనీటన్ = పిప్పువట్టినవాయి యనెడు నీటియందు, శాత్రవులపుట్టి మునుంగఁగన్ = శత్రురాజులపుట్టి, (పుట్టియన సంగడియనుట ప్రమాదము. ప్రవాహమునందు మనుష్యులు దాఁటుటకు బద్దలతోఁ బెద్దబుట్ట యల్లి యందు నీరు నిగకుండుటకై చుట్టును జర్మముతో మూయుందురు. ఇందు మనుష్యులనుంచి యేఱు దాటింతురు. చుట్టు బరువు సమానముగ లేనిచో నిది మున్గును) మునిఁగిపోఁగా, (దశతూలిపోఁగా) కార్యములు చెడి యాపదలు క్రమ్ముకట్టున నీలోకోక్తి యుపయోగింపఁబడును. అభ్యుదయమున్, ఒంది = అభివృద్ధిచెంది, ఫేనపంక్తితోన్, = నురువుతెట్టలతో, పొదిగొని = కలిసి, పైపయిన్ = మీఁదమీఁద, వెడలుబుద్బుదపంక్తులువోలెన్ = ఉప్పతిల్లు నీటిబుగ్గలప్రోవువలె, మదకలకుంభికుంభనవమౌక్తికముల్ = మదముగొన్న యేనుఁగుల కుంభస్థలములందలి క్రొమ్ముత్తెములు, కనుపట్టున్.

ముత్యములు ఏనుఁగులకుంభస్థలములందుఁగూడ జనించును.

"కరీంద్ర జీమూత వరాహ శంఖ మత్స్యాహి శుక్త్యుద్భవ వేణుజాని,
ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాంతు శుక్త్యుద్భవమేవ భూరి."

(బృహత్సంహిత.)

తా. పోరులందుఁ గృష్ణరాయలచే నఱకఁబడిన యేన్గులకుంభస్థలముల నుండి వెల్వడు క్రొమ్ముత్తెము లాతనిఖడ్గధార యను ప్రవాహమున శత్రువుల పుట్టి మున్గఁగా (ప్రయత్నము లంతరింపఁగా) నురువుపిండుతో వెడలునీటి బుగ్గలువోలెఁ గానిపించును. నీటిలో నొకవస్తువు మున్గినప్పుడు నురువును బుడగలును వెడలుట స్వాభావికము. అలం. ఉత్ప్రేక్ష, రూపకము, అతిశయోక్తి వీని కంగాంగిభావసంకరము.

సీ. వేదండభయదశుండాదండనిర్వాంత
వమథువుల్ పైఁ జిల్కువారి గాఁగఁ
దత్కర్ణవిస్తీర్ణతాళవృంతోద్ధూత
ధూళి చేటలఁ జల్లు దుమ్ము గాఁగ
శ్రమబుర్బురత్తురంగమనాసికాగళ
త్పంకంబు పైచుకర్దమము గాఁగఁ
గుపితయోధాక్షిప్తకుంతకాంతారభే
లనములు దండఘట్టనలు గాఁగఁ

తే. జెనఁటిపగఱప్రతాపంబుచిచ్చు లార్చు
కరణి గడిదేశములు చొచ్చి కలఁచి యలఁచు
మూరురాయరగండాంకవీరకృష్ణ
రాయభూభృద్భయంకర ప్రబలధాఁటి. 42

టీ. మూరు...ధాటి-మూరురాయరగండ = గజపతి, అశ్వపతి, నరపతులనుమువ్వురురాజులను బరిమార్చినవాఁ డను, అంక = బిరుదనామముగల వీర=వీరుఁడగు, కృష్ణరాయభూభృత్ = కృష్ణరాయప్రభువుయొక్క, భయంకర=వెఱపుఁగూర్చు, ప్రబల=ఉత్కటమయిన, ధాటి = దాడి, వేదండ... వమథువుల్ - వేదండ=ఏన్గులయొక్క, భయద=భయమునిచ్చు, శుండాదండ= దండములవంటి తుండములనుండి, నిర్వాంత=వెలికిఁ జిమ్మఁబడిన, వమథువుల్ = తుంపురులు, పైక్=మీఁద, చిల్కువారి = చల్లునట్టినీరు. తత్కర్ణ...

ధూళీ-తత్=వానియొక్క, కర్ణ=చెవులనెడి,విస్తీర్ణ=పెద్దవియగు,తాలవృంత= విసనకఱ్ఱలచేత, ఉద్ధూత = ఎగురఁగొట్టఁబడిన, ధూళీ=పరాగము, శ్రమ... పంకంబు-శ్రమ=అలసటచే, ఖుర్పురత్=ఖురఖురమను, తురంగమ=గుఱ్ఱముల యొక్క, నాసికా=ముక్కులనుండి, గళత్ = తొలఁగు, పంకంబు=మలము, కర్దమము=బురుద, కుపిత...లనములు - కుపిత=కోపించిన, యోధ=వీరులచే, ఆక్షిప్త=చిమ్మఁబడిన, కుంతకాంతార=వెదురుపొదలవంటి యీఁటెలయొక్క, ఖేలనములు=విహారములు, దండఘట్టనలు=కఱ్ఱలదెబ్బలు, చెనఁటి...చిచ్చులు- చెనఁటి=దుర్గార్గులైన, పగఱ=శత్రులయొక్క, ప్రతాపంబు చిచ్చులు=పరాక్రమమనునిప్పులను, ఆర్పుకరణిక్ = చల్లార్చునట్లు, గడిదేశములక్ = సరిహద్దుదేశములను, అలఁచుక్ = కలఁతపెట్టును.

గడియన సరిహద్దనుటకు—

క. "పరగును సీమావాహిని, విరజయనఁగ నచట నొకటి విమలామృతని ర్ఝరపూరయగుచు నది గడి, పరమపదమునకు భవప్రపంచంబునకున్."

(పరమయోగివిలాసము. ఆ ౧.)

కృష్ణదేవరాయలధాటి ప్రబలము భయంకరముగానఁ జెనఁటిపగతుర ప్రతాపవహ్ని నార్చుటయుం భయంకరక్రియగాఁ జెప్పఁబడెను. రాయలు విజయయాత్రలందు గజసైన్యము అశ్వికసైన్యము కాల్బంట్లు విజయార్థమై పాటుపడుచుండిరని భావము.

తా. శ్రీకృష్ణరాయలు దాడి వెడలినప్పు డేన్గులు తుండములతోఁ జిమ్ము తుంపురులును, నవి చెవుల వీచుకొనుటచే రేఁగెడు దుమ్మును, గుఱ్ఱముల ముక్కులనుండి జాఱుమలమును, భటులు ప్రయోగించు నీఁటెలదెబ్బలును, నాతనిశత్రురాజులప్రతాపాగ్నిని జల్లార్చుటకుఁ బైఁజల్లునీరుగను, జేటలతో గుప్పుమన్నగను, పైఁగప్పు బురుదగను, నప్పల ఘట్టించుకఱ్ఱదెబ్బలుగను నయ్యెను. అలం. ఉత్ప్రేక్ష, రూపకము.

## షష్ఠ్యంతములు

క. ఏవంవిధగుణవంతున, కావల్గత్తురగబహువిధారోహకళా
రేవంతునకతిశాంతున, కావిష్కృతకీర్తిధవళితాశాంతునకున్.

టీ. ఏవంవిధగుణవంతునకున్ = ఇట్టిగుణములుకలవానికిని, ఆవల్గ... వంతునకున్-ఆవల్గత్ = అంతటను దుముకాడు, తురగ=గుఱ్ఱములయొక్క, బహువిధ=పెక్కుతెఱఁగులైన, ఆరోహకళా=ఎక్కుడుమెలఁకువలందు, రేవంతునకున్ = అశ్వశిక్షకుఁడగువానికిని, ఆవిష్కృ...తునకున్ - ఆవిష్కృత = వ్యాపింపఁజేయఁబడిన, కీర్తి(చే), ధవళిత=తెల్లనిదిగాఁజేయఁబడిన, ఆశాంతునకున్ = దిగంతములుగలవానికిని, పైనాల్గవపద్యమువఱకును నేకాన్వయము. నాల్గుకంటె నెక్కువపద్యముల కేకాన్వయ మున్నఁ గుళక మందురు.

కృష్ణదేవరాయ లశ్వవిద్యయందు మిగులఁ గుశలుఁ డనియుఁ మిక్కిలి కీర్తిశాలి యనియుఁ భావము.

క. పుంఖానుపుంఖసైంధవ, రింఖాసంఘాతజాతరేణూగ్రతమో
రింఖద్రిపునృపదహార, ప్రేంఖదసుగ్రసనజఠరభృత్యసిఫణికిన్.

టీ. పుంఖా...ఫణికిన్-పుంఖానుపుంఖ = ఎడతెగని, సైంధవ=గుఱ్ఱములయొక్క, రింఖా=గిట్టలయొక్క, సంఘాత = గట్టితాఁకుడులవలన, జాత= పుట్టిన, రేణు=దుమ్మనెడు, ఉగ్ర=భయంకరమైన, తమః = చీకటియందు, రింఖత్=తబ్బిబ్బగుచున్న, రిపునృప = శత్రురాజులయొక్క, దహార=హృదయములందు, ప్రేంఖత్=చలించుచున్న, అసు=ప్రాణములయొక్క, గ్రసన= మ్రింగుటచే, జఠర=పొట్టయొక్క, భృతి=నిండించుకొనుటగల, అసి = కత్తి యనెడు, ఫణికిన్ = పాముగలవానికిని.

పుంఖానుపుంఖ మన బాణమువిడిచెంట బాణముపడి పోవునటులనంగరమున బాణములు వేయుట - ఎడతెగక యనునర్థమున దీనిని ధారాళముగ వాడుచున్నారు.

తా. ఎడతెగక గుంపులుగుంపులుగాఁ దోతెంచు గుఱ్ఱములగిట్టల త్రొక్కుడులచే రేఁగినధూళి యను చీకటిలోఁ దబ్బిబ్బులు పడుశత్రురాజుల ప్రాణముల సాతనిఖడ్గమనుపాము మ్రింగి పొట్టనించుకొనును. గుఱ్ఱపుసేనలతో దండెత్తి శత్రురాజులఁ జంపినాఁ డనుట. అలం. రూపకము.

క. అవిరళవితరణవిద్యా
నవరాధేయునకు సజ్జనవిధేయునకున్
గవితాస్త్రీలోలునకున్
ఖవిటంకనటద్యశోబ్ధికల్లోలునకున్. 45

టీ. అవిర...యునకు-అవిరళ = ఎడతెగని, వితరణవిద్యా = దానవిద్య యందు, నవరాధేయునకున్ = అభినవకర్ణునకును, సజ్జనవిధేయునకున్=పండితులయెడ నడఁకువగలవానికిని, కవితా స్త్రీలోలునకున్ = కవిత యనెడు నెలఁతయం దాసక్తిగలవానికి, ఖవి...లునకున్—ఖవిటంక = ఆకాశాగ్ర భాగమునందు, నటత్=చరించు, యశోబ్ధి=కీర్తి సముద్రముయొక్క, కల్లోలునకున్=తరంగములుగలవానికి, ఆకాశమెల్లను వ్యాపించిన కీర్తిగలవాఁ డనుట.

ఆకాలమునఁ గర్ణుఁడౌదార్యమునం దెంత పేరెన్నికఁ గాంచెనో యాకాలమున రాయ లంత పేరెన్నికఁ గాంచెను. కాన కృష్ణరాయలు నవరాధేయుండు "సన్నత్సత్రే విద్యమానే పండితే" అను నిఘం టూక్తిచే "సజ్జన" అనుచో పండితులని చెప్పుటమే సమంజసము.

క. దిగధీశాసహ్యాధగ, ద్ధగితేద్ధరుచిప్రతాపతపనస్ఫురణ
స్థగితద్యుమణికినిమిషా, గ్రగృహీతకళింగరాజతనయాగ్రణికిన్.

టీ. దిగధీ...మణికి-దిగధీశ = దిక్పాలురకు, అసహ్యా = సహింపరాని ధగద్ధగిత = ధగధగాయమానమైన, ఇద్ధ = ఒప్పిదమగు, రుచి = కాంతిగల, ప్రతాపతపన=పరాక్రమ మనుసూర్యునియొక్క, స్ఫురణ = ప్రకాశముచే, స్థగిత=మాటుచేయఁబడిన, ద్యుమణికిన్ = సూర్యుఁడు గలవానికి. నిమి...

గ్రణికిన్ — నిమిషార్ధ=అరనిముసములో, గృహీత = పట్టుకొనఁబడిన, కళింగ (రాజుయొక్క) తనయాగ్రణికిన్ = శ్రేష్ఠుఁడగుకుమారుఁడు కలవానికిని, ప్రతాపము తీవ్రతయందు సూర్యునిమించినది కాన సూర్యబింబమును మాటు పడుటఁ గలిగెను. అరనిముసములోఁ గళింగరాజును బట్టుకొనుట రాయల విక్రమసాహస బలవీర్యాదులను వెల్లడించును.

క. కరుణాకర వేంకటవిభు, చరణస్మరణ ప్రసంగసంగతమతి కీ
  శ్వరనరసింహమహీభృ,ద్వరనందనకృష్ణరాయధరణీపతికిన్.

టీ. కరుణాకర-కరుణా=దయకు, ఆకర=గనియయిన, వేంకటవిభు = వేంకటేశ్వరస్వామియొక్క, చరణ = పాదములయొక్క, స్మరణప్రసంగ = స్మరించుటగల సంభాషణమందు, సంగత = అంటిన, మతికిన్ = బుద్ధి గలవానికి, ఈశ్వరనరసింహమహీభృత్ = ఈశ్వరరాజుకుమారుఁడైన నరసింహరాయనికి, వరనందన=పుత్త్రశ్రేష్ఠుఁడైన, కృష్ణరాయధరణీపతికిన్.

కృష్ణదేవరాయలు తిరుపతి వేంకటేశ్వరుల సేవకుఁడనియుం భక్తుఁడనియుం నాతనితిరుపతి శాసనములవలనఁ దెలియుచున్నది. రాయలకుఁ దిరుపతి వేంకటేశ్వరుఁ డిష్టదైవ మని భావము.

# ప్రథమాశ్వాసము

## కథాప్రారంభము

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పఁ బూనినస్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన జైమినిముని స్వాయంభువమనుకథాశ్రవణానంతరంబున మీఁద నెవ్వండు మను వయ్యె నెఱింగింపు మనవుడుఁ బక్షులు మార్కండేయుండు క్రోష్టుకికిఁ జెప్పినప్రకారంబున నిట్లని చెప్పఁ దొడంగె. 48

టీ. అభ్యుదయపరంపరాభివృద్ధిగాన్ = శ్రేయః పరంపర కభివృద్ధియగునట్లు, నాయొనర్పఁ బూనిన = నేను రచింపఁదొడఁగిన, మహాప్రబంధమునకున్ = సమస్తవర్ణనావృతమగు మహాకావ్యమునకు, కథాక్రమము = కథయొక్క వరుస, ఎట్టిదనినన్ = ఏవిధముగా నుండుననఁ, జైమినిముని = జైమినియను ఋషీశ్వరుఁడు, స్వాయంభువ...రంబు - స్వాయంభువ మను(వుయొక్క) కథా = కథయొక్క, శ్రవణానంతరంబునన్ = వినుట యైనపిదప, ఎవ్వండు మను వయ్యెన్ = ఏమహామహుఁడు మనువయ్యెనో, ఎఱిఁగింపుము. అనవుడు = అనియడుగఁగా, పక్షులు = ధర్మపక్షులు, మార్కండేయమహాముని, చెప్పిన ప్రకారంబునన్, ఇట్లని, చెప్పందొడంగెన్ = చెప్పుటకు మొదలు పెట్టెను.

మ. వరణాద్వీపవతీతటాంచలమునన్ వప్రస్థలీచుంబితాం, బర
మై సౌధసుధాప్రభాధవళితప్రాలేయరుఙ్మండలీ, హరిణంబై
యరుణాస్పదం బనఁగ నార్యావర్తదేశంబునన్, బుర మొప్పున్
మహీకంఠహారతరళస్ఫూర్తిన్ విడంబింపుచున్. 49

టీ. ఆర్యావర్త దేశంబునన్=ఆర్యావర్త(వింధ్యపర్వత హిమవత్పర్వతములనడిమిదేశము) మనుదేశమునందు, వరణాద్వీపవతీతటాంచలమునన్ = వరణానదియొడ్డుదగ్గఱ, వప్ర...ఆరమై-వప్రస్థలీ = ప్రాకారప్రదేశముచే, చుంబిత = =తాఁకఁబడిన, అంబరమై = ఆకాశముగలదై, సౌధ...ణంబై - సౌధ=మేడలమీఁది, సుధా = సున్నముచే, ధవళిత = తెల్లఁగాఁజేయఁబడిన, ప్రాలేయరుక్=చంద్రునియొక్క, మండలీ=మండలమందలి, హరిణంబై=జింకగలదై, మహీకంఠహారతరళస్ఫూర్తిన్-మహీ = భూమియొక్క, కంఠ=మెడయందలి, హార(మునందలి), తరళ=నడిమిపెద్దమణియొక్క, స్ఫూర్తిన్=ప్రకాశమును, విడంబింపుచున్=సరిపోలుచు, అరుణాస్పదంబనఁగన్ = అరుణాస్పదమను పేరుతో, పురము=పట్టణము, ఒప్పున్=ఒప్పిదముగా నుండును.

నదీతటమున నుంటచే నివాసయోగ్య మనియుం వప్రస్థలీచుంబితాంబరమనుటచే వైరిదుర్భేద మనియుం గ్రాహ్యము. ప్రాలేయరుఙ్మండల మనుటచే సంపూర్ణచంద్రుఁ డనుట. కానచే యందు హరిణలాంఛనము బాగుగాఁ గనిపించును. హరిణాంకమును దెల్లఁగాఁ జేయుటచే మేడలధావళ్యము ఔన్నత్యము సూచితము. తరళస్ఫూర్తి యనుటచే భూమండలమునందలి సమస్తనగరములను మించియుండె ననుట.

తా. ఆర్యావర్తదేశమున వరణానదియొడ్డున నాకాశము నంటుకోటగోడయును, చంద్రమండలమును రాయునంత యెత్తును, నందలి జింకను నయితము తెల్లఁగాఁజేయఁజాలు తెల్లనిపాలగచ్చునిగనిగయును గలమేడలును గలిగి భూదేవి తాల్చినహారమునడిమిపతకమో యనున ట్లరుణాస్పదమనుపుర మొకటి కలదు. అలం. అతిశయోక్తి, ఉత్ప్రేక్ష, ఉపమ.

సీ. అచటివిప్రులు మెచ్చ రఖిలవిద్యాప్రౌఢి
మదిమదిదప్పిన మొదటివేల్పు

నచటిరాజులు బంటు నంపి భార్గవు నైన
బింకానఁ బిలిపింతు రంకమునకు
నచటిమేటికిరాటు లలకాధిపతి నైన
మును పంచి మొదలిచ్చి మనుప దక్షు
లచటినాలవజాతి హాలముఖాత్తవిభూతి
నాదిభిక్షువుభైక్ష మైనమాన్పు
తే. నచటివెలయాండ్రు రంభాదు లైన నోరయఁ
గానెకొంగున వారించి కడపఁ గలరు
నాట్యరేఖాకళాధురంధరనిరూఢి
నచటఁ బుట్టినచిగురుఁగొమ్మైనఁ జేవ. 50

టీ. అఖిలవిద్యాప్రౌఢిన్ = ఎల్లవిద్యలయందలి నేర్పుచే, ముదిమది తప్పినమొదటివేల్పున్ = ముసలితనముచే మతిమఱ్ఱిన బ్రహ్మదేవుని, అచటి విప్రులు=అనగరమునందలి బ్రాహ్మణులు, మెచ్చరు = మెచ్చుకొనరు, (అనగరమునందలి బ్రాహ్మణులు సమస్తవిద్యలు నేర్చినవారగుటచే బ్రహ్మనుగూడఁ జిత్తవిభ్రమముగల ముదుసలివాఁ డని సరకుచేయరు) అచటిరాజులు=అనగరమందలి క్షత్రియులు, బంటునంపి = భటుని బంపి, భార్గవునైనన్ = పరశురాముసైనను, బింకానన్ = గర్వముతో, అంకమునకున్ = చేరువకు (సర్వక్షత్రియవినాశకుఁడైన పరశురాముని నయితము బంటును బంపి దగ్గఱకుఁ బిలిపించుకొనఁగల సామర్థ్యము గలవా రనుట,) కిరాటులు = కోమటులు, అలకాధిపతినైనన్=కుబేరునైనను, మును=ముందుగా, పంచి మొదలు=మూలధనము, ఇచ్చి, మనుపన్=రక్షించుటకు, దక్షులు=నేర్పరులు (ధనవంతులలోఁ గుబేరుఁడే యగ్రగణ్యుఁడు. అతనిని పంచిమొన లొసఁగి బ్రదికింపఁగల్గుట పురివైశ్యులన పదలిశ్యమును దెలియఁజేయుచు) నాలవజాతి = శూద్రజాతి, హాలముఖాత్తవిభూతిన్ = నాఁగేటిమొనచే సార్జింపఁబడిన సంపదచే, ఆదిభిక్షువు భైక్షమైనన్ = మొదటిబిచ్చమెత్తువాఁడగు శివునియొక్క బిచ్చ

మెత్తుటనైనను, మాన్పన్ = నివారింపఁజేయుటను, (శూద్రులు పంటఁ బండించి భాగ్యముల గడించి సత్పాత్రదానము గావించుటలో సుప్రసిద్ధులని భావము,) వెలయాండ్రు = వేశ్యలు, నాట్యరేఖా...నిరూఢిన్ - నాట్యరేఖా=నృత్యచాతురియను, కళా = విద్యయందు, ధురంధర = బరువు మోసిన (సంపూర్ణముగా నలవడిన) నిరూఢిన్=నేర్పుచే, రంభాదులైనన్ = రంభ మొదలగు నప్సరస్త్రీలయినను, ఒరయన్ = ఎదుర్కొనునెడ, కాని కొంగునన్=వెన్కకు దోఁపుకొను చీరచెంగుచేత, కడపఁగలరు=తిరుగఁగొట్టఁగలరు. చిగురుఁగొమ్మైనన్ = లేఁతకొమ్మ యయినను, చేవ=గట్టితనముగలది. అలం. అతిశయోక్తి.

దత్తమండలమునందుఁ జిపురుచెట్టను నొకజాతిచెట్టు గలదు. ఎంత ముదిరినను దానఁ జేవయుండదు. గాన నచటఁ బుట్టినఁజిపురుకొమ్మైన చేవ యనుచో నాపురమునఁబుట్టిన చిపురుచెట్టున బుట్టినకొమ్మయుఁ జేవతో నుండు ననుభావము సమంజసము.

రామాభ్యుదయములోని, చిగురుకొమ్మయుం చేవల్, వసుచరిత్రములోని చిగురుగొమ్మ చేవయుం నిట్టిది.

ఉ. ఆపురిఁ బాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీ
క్షాపరతంత్రుఁ డంబురుహగర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁడై.

టీ. మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి = మన్మథునివలెను చంద్రుని వలెను మనోహరమైన యాకారముగలవాఁడు, భాషావరశేషభోగి = వాక్కునందు రెండవయాదిశేషుఁ డగువాఁడు, వివి...తంత్రుఁడు-వివిధ = పలు తెఱఁగులైన, అధ్వర = యజ్ఞములయొక్కయు, నిర్మలకర్మ=పుణ్యకర్మముల యొక్కయు, దీక్షా=నియమములకు, పరతంత్రుఁడు = అధీనుఁడగువాఁడును,

అంబురుహగర్భకులాభరణాయు = బ్రాహ్మణకులమునకు అలంకారమగువాఁడును, అనా...రుండు - అనారత=ఎల్లప్పుడును, అధ్యాపన = వేదాధ్యయనము చేయించుటయందు, తత్పరుండు=ఆసక్తిగలవాఁడు, ప్రవరాఖ్యుఁడు = ప్రవరుఁడను పేరుగలవాఁడు, ఆలేఖ్యతరూపవిలాసుఁడై = (చిత్తరువులందు) వ్రాయనలవిగాని శరీరసౌందర్యముగలవాఁడై, పాయక = విడువక, అపురికి, ఉండును. అలం. ఉపమ. రూపకము.

ఆకారవిద్యానిష్ఠాభిజాత్యములయం దసమానుఁడు. అంబురుహగర్భకులాభరణ మనుటవలనఁ బూర్వోక్త సుగుణాతిశయముచే నెట్టిదోషము లేకనుండెననుట.

ఆ. వానిచక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్ష సేయుజారకామినులకు
భోగబాహ్యమయ్యెఁ బూచినసంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁ బోలె.

టీ. వైరాగ్యమునఁ జేసి = విరక్తభావమువలన, కాంక్ష సేయు = కోరునట్టి, జారకామినులకున్ = కులటాండ్రకు, పూచినసంపెంగపొలుపు = వికసించినసంపెంగపూవుయొక్క బాగు, మధుకరాంగనలకుఁ బోలెన్ = తుమ్మెదలకువలె, భోగబాహ్యము=అనుభవమునకుఁ దక్కనిది, అయ్యెన్.

సంపెంగఁదావిని తుమ్మెద లొల్లకపోవుట ప్రసిద్ధము. ఇటఁ బ్రవరుఁడు సంపెంగపూవు. పరపురుషులయందాసక్తి తిరుగుజారకామినులు తుమ్మెదజవరాండ్రు. సంపెఁగను దుమ్మెద లొల్లమికి—

శా. "నానాసూనవితానవాసనల నానందించు సారంగమే
లా నన్నొల్ల దటంచుగంధఫలి..." (వసు.)

శ్లో. "చరస్వనాంతే నవమంజరీషు, న షట్పదో గంధఫలీం న జిఘ్రతి
సా కిం న రమ్యా స చ కిం న రంతా, బలీయసీ కేవలమీశ్వరాజ్ఞా."

తా. వికసించిన సంపెంగపూవు వికాసము, ఆఁడుతుమ్మెదల యనుభవముఁనకుఁ దక్కనట్లు విషయేచ్ఛ లేనివాఁ డగుటచే నాప్రవరునిచక్కఁదనము జారకామిను లెంత యపేక్షించినను ననుభవింప నలవిగాని దయ్యెను. అలం. ఉపమ.

ఉ. యౌవనమందు యజ్వయు ధనాఢ్యుఁడు నై కమనీయకౌతుక
శ్రీవిధిఁ గూఁకటుల్ గొలిచి చేసినకూరిమిసోమిదమ్మ సౌ
ఖ్యావహయై భజింప సుఖులై తలిదండ్రులుఁగూడి దేవియుఁ
దేవరవోలె నుండి యిలు దీర్పఁగఁ గాఁపుర మొప్పు వానికిన్.

టీ. యజ్వయు౯ = యజ్ఞము చేసినవాఁడును, ధనాఢ్యుఁడును = ధనవంతుఁడును, కమనీ...విధి౯ - కమనీయ=కోరఁదగిన, కౌతుకశ్రీ = కుతూహలపుసంపదయొక్క, విధి౯ = రీతితో, కూఁకటుల్ = పిల్లజుట్లను, కొలిచి = కొల్తపెట్టి (ఇరువురివయస్సు ఇంచుమించుగా సమాన మని నిశ్చయించికొని) చేసిన = (పెండ్లి) చేసిన, కూరిమిసోమిదమ్మ = ప్రేమపుసోమిదేవి, సోమిదమ్మ. ఇది సోమిదేవియొక్క వికృతిరూపము. సౌఖ్యావహయై = సుఖమును గూర్చునదియై, భజింప౯ = సేవచేయుచుండఁగా, సుఖులై = సుఖవంతులై, కూడి = కలసి, దేవియు౯ దేవరవోలె౯ = పార్వతీపరమేశ్వరులవలె, ఇలుదీర్పఁగ౯ = ఇంటిపనులను చక్కఁబెట్టుచుండఁగా, కాఁపురము = సంసారము, వానికి౯ = ఆప్రవరునకు, ఒప్పు౯.

పార్వతీపరమేశ్వరు లనాదిదంపతులు మిగులవృద్ధులగు ప్రవరాఖ్యుని జననీజనకులు పార్వతీపరమేశ్వరులవలె నీడుజోడుగ మహామహిమతో నుండి రనుట.

తా. ఆప్రవరుఁడు చిన్ననాఁటనే యజ్ఞము చేసి ధనవంతుఁడై యీడుజోడుగా నున్న తనప్రియభార్య సుఖపెట్టుచు సేవించుచుండఁగాఁ బార్వతీపరమేశ్వరులవలెఁ దల్లిదండ్రులు తేజమున నుండి గృహకృత్యము చక్కఁబెట్టుచుండఁగా సౌఖ్యమునఁ గాఁపురము చేయుచుండెను.

సీ. వరణాతరంగిణీదరవికస్వరనూత్న
కమలకషాయగంధము వహించిఁ
ప్రత్యూషపవనాంకురములు పైకొను వేళ
వామనస్తుతిపరత్వమున లేచి
సచ్ఛాత్త్రుఁ డగుచు నిచ్చలు నేఁగి యయ్యేట
నఘమర్షణస్నాన మాచరించి
సాంధ్యకృత్యముఁ దీర్చి సావిత్రి జపియించి
సైకతస్థలిఁ గర్మసాక్షి కెఱఁగి
తే. ఫలసమిత్కుశకుసుమాదిబహుపదార్థ
తతియు నుదికినమడుఁగుదోవతులుఁ గొంచు
బ్రహ్మచారులు వెంట రా బ్రాహ్మణుండు
వచ్చునింటికిఁ బ్రజ దన్ను మెచ్చి చూడ. 54

టీ. వర...ధము-వరణాతరంగిణీ = వరణానదియందలి, దరవికస్వర = ఇంచుకవిడఁబాఱిన, నూత్న = క్రొత్తవగు, కమల = తామరపూలయొక్క, కషాయ=ఒగరైన, గంధమున్ = వాసనను, వహించి = ధరించి, నదులయందుఁ దామరపూవులున్నటులుఁ జెప్పుట కవిసమయము. నూత్నకమలములన నానాఁడె విచ్చనారంభించినతామరపూలు. అవి కొంచెము విచ్చినవిగాన తావి ముప్పిరముగ నుంటచే మంచితావితోఁగూడ నొప్పుచున్నవనుట. కషాయమన సుగంధమనుటకు—"కషాయో రసభేదేఽపి నిర్యాసేచ విలేపనే, అంగరాగేచ నస్త్రీ స్యాత్ సురభౌ లోహితే త్రిషు. మేదిని." ప్రత్యూషపవనాంకురములు = వేకువవేళయందలిలేగాలులు, పైకొనువేళన్ = మేసుతాఁకు సమయమున, వామనస్తుతిపరత్వమునన్ = వామనమూర్తియొక్క ధ్యానమునందలి యాసక్తిచేత, లేచి=శయ్యను విడిచిలేచి, ప్రాతఃకాలమున నిదుర సెజ్జనుండి లేచునపుడు విష్ణుమూర్తిని స్మరించుచుండునని భావము. సచ్ఛాత్త్రుఁడు = శిష్యులతోఁ గూడుకొన్నవాఁడు, నిచ్చలున్ = ఎప్పుడును ఏఁగి=పోయి, అయ్యేటన్ =

ఆవరణానదియందు, అఘమర్షణస్నానము = పాపములఁబోఁగొట్టు (అఘమర్షణ మంత్రములజపించుచుఁజేయు) స్నానమును, సాంధ్యకృత్యము=సంధ్యావందనమును, సావిత్రిన్=గాయత్రిని, సైకతస్థలిన్=ఇసుకతిన్నెపై,కర్మసాక్షిన్= సూర్యునకు, ఫల...తతియున్-ఫల=పండ్లు, సమిత్=సమిధలు, కుశ=దర్భలు, కుసుమ=పూవులు, ఆది=మొదలగు, బహుపదార్థతతియున్ = పెక్కువస్తువుల సమూహమును, మడుఁగుదోవతులు = మడివస్త్రములు, గొంచున్ = తీసికొని, బ్రహ్మచారులు = వడుగులగు విద్యార్థులు, వెంటరాన్=వెంబడివచ్చుచుండ బ్రాహ్మణుండు=ప్రవరాఖ్యుఁడు, ప్రజ=జనులు, తన్నున్, మెచ్చిచూడన్= మెచ్చుకొనిసందర్శించుచుండ, ఇంటికిన్ వచ్చును = ఇంటికరుదెంచును.

శా. శీలంబుం గులముం శమంబు దమముం జెల్వంబు లేఁబ్రా
యముం, బోలం జూచి యతండె పాత్రుఁడని యేభూపాలుఁ
డీవచ్చినన్, సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మాన్యక్షే
త్రముల్ పెక్కుచం,దాలం బండు నొకప్పుడుం దఱుఁగ
దింటం బాఁడియుం బంటయున్. 55

టీ. శీలంబున్ = సద్వర్తనమును, కులమున్=సద్వంశమును, శమంబున్=బాహ్యేంద్రియనిగ్రహమును, దమమున్ = అంతరింద్రియనిగ్రహమును, చెల్వంబున్=సొగసుఁదనము, లేఁబ్రాయమున్ = చిఱుతవయస్సును, పోలన్=కూడియుండఁగా, చూచి=పరికించి, (దానపరిగ్రహణమునకుఁ దగిన సమస్తయోగ్యత లీతనియెడఁగలవుగాన నితనికొసంగుట యుంభయతారకమని) అతండె = ఆప్రవరాఖ్యుఁడె, పాత్రుఁడు=అర్హుఁడు, అని=అనిభావించి, ఏ భూపాలుఁడు=ఏరాజైనను, ఈవచ్చినన్=ఇచ్చుటకువచ్చిన యెడల (తమకై తాము రాజులు దానమొసంగ నింటికి వచ్చిన) సాలగ్రామము మున్నుగాన్ = సాలగ్రామము మొదల్కొనియు, కొనఁడు = పరిగ్రహింపఁడు. మాన్యక్షేత్రముల్ = మాన్యపుభూములు, (రాజులు మొదలగువారు గౌరవించి యిన్న

లేకుండ నిచ్చినభూమిని మాన్య మందురు.) పెక్కుచందాలన్ = పలుతెఱంగులుగా, పండున్ = ఫలించును. పాఁడియుంన్, పంటయుంన్, ఇంటన్ = గృహమునందు, ఒకప్పుడున్, తఱుఁగదు=కొఱఁతపడదు.

చందములు (రూ) చందాలు. బా. సూ. లులనలు పరంబగునపుడు ముంవర్ణలోపంబును పూర్వస్వరదీర్ఘంబును విభాష నగు.

తా. ప్రవరుని యోగ్యతను జూచి రాజులు నానావిధములయిన దానముల నీయవత్తురు. అతఁడు ప్రతిగ్రహము పాపము గలిగించు నని నిర్దోషమైన సాలగ్రామదానము నయితము తీసికొనకుండును. అయినను మాన్యపు భూములు తప్పక పండుచుండును గావున నతనియింటఁ బాఁడిపంటలు కొఱఁతలేక యుండును.

తే. వండ నలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్ది యానాతనిగృహిణి
నతిథు లేతేర * నడికి రే యైనఁ బెట్టు
వలయుభోజ్యంబు లింట నవ్వారి గాఁగ. 56

టీ. అన్నపూర్ణకున్ = అన్నపూర్ణాదేవికి, ఉద్ది = సాటి, ఆనాతని గృహిణి=అగునట్టి యాతనిభార్య, వేవురు = వేయిమంది, వండన్ = వండి పెట్టుటకు, అలయదు=విసువదు. అతిథులు=మార్గస్థులు, ఏతేరన్ = రాఁగా, నడికిరేయైనన్=అర్ధరాత్రమున, భోజ్యంబులు = భోజనపదార్థములు, అవ్వారి గాఁగన్ = కొదవలేకుండ, పెట్టున్ = వడ్డించును.

తా. ప్రవరునిభార్య అతిథులకుఁ బెట్టిపోయుటలో నన్నపూర్ణాదేవికి సమానురాలు. అర్ధరాత్రమునం దతిథులు వచ్చినను వారివారి కిచ్చ యగు పదార్థముల నలయక పక్వమొనరించి పెట్టును.

---

* నడురేయియైన - బ్రౌనుదొరవారిపాఠము.

సీ. తీర్థసంవాసు లేతెంచినా రని విన్న
నెదురుగా నేఁగు దవ్వెంత యైన
నేఁగి తత్పదముల కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ
దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులఁగాఁ జేయుఁ
జేసి కూర్చున్నచోఁ జేర వచ్చు
వచ్చి యిద్ధరఁ గల్గు వనధిపర్వతసరి
త్తీర్థమాహాత్మ్యముల్ దెలియ నడుగు
తే. నడిగి యోజనపరిమాణ మరయు నరసి
పోవలయుఁ జూడ ననుచు నూర్పులు నిగుడ్చు
ననుదినము తీర్థసందర్శనాభిలాష
మాత్మ నుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి.

టీ. అత్తరుణాగ్నిహోత్రి = ఆలేఁబ్రాయపుయజ్వ, అగ్నిహోత్రియన యజ్ఞానంతరము విధి ననుసరించి నియతితో నగ్నిహోత్రమున వేల్చుచుండు వాఁడు. తీర్థసంవాసులు = పుణ్యతీర్థనివాసులు, ఏతెంచినారు = వచ్చినారు, అని, విన్నన్ = ఆలకించినయెడల, దవ్వు = దూరము, ఎంతయైనన్, ఎదురుగా నేఁగన్, తీర్థవాసము పుణ్యప్రదముగాన నటనుండి వచ్చువారు, యోగ్యులని ప్రవరుని భావన. ఏఁగి = ఆవిధముగా నెదురేఁగి, తత్పదములకున్ = వారియడుగులకు. ఎఱఁగి = నమస్కరించి, సద్భక్తిన్ = తిన్ననిభక్తితో, ఆతిథ్యము = అతిథిసత్కారమును, ఇచ్చున్ = ఒసంగును. ఇచ్చి = ఇటులాతిథ్యమొసంగి, ఇష్టాన్నసంతృప్తులన్ = హితమైనభోజనమునముచేఁ దృప్తిచెందినవారినిగా, చేయున్ = ఒనరించును, చేసి, కూర్చున్నచోన్ = విశ్రాంతిగాఁగూర్చున్నపుడు, చేరవచ్చున్ = దగ్గఱ కరుగును. ఇద్ధరన్ = ఈభూమిని, వన...త్మ్యముల్-వనధి = సముద్రములయొక్కయు, పర్వత = కొండలయొక్కయు, సరిత్ = నదులయొక్కయు

మాహాత్మ్యముల్ = ప్రభావములను, తెలియన్ = తెలిసికొనుటకు, అడుగున్ = ప్రశ్నించును. అడిగి = ప్రశ్నించి, యోజనపరిమాణము = ఆమడలపరిమితిని; ఆతీర్థక్షేత్రములకుఁ దానున్నచోటునకుఁగల దూరమును, అరయుచున్ = విచారించును. అరసి = అవిధమునంతయుం విచారించి, చూడన్ = తాను దెలిసికొన్న పుణ్యప్రదేశములు సందర్శించుటకు, పోవలయుంన్, అచున్, ఊర్పులు = నిట్టూర్పులు, నిగుడ్చున్ = విడుచును. నిట్టూర్పులు నిగిడించుట యసాధ్య మగు క్షేత్రసందర్శనము నెటులేని గావించి కృతార్థుఁడఁ గావలయుం నని.

క. ఈవిధమున నభ్యాగత
సేవాపరతంత్ర సకలజీవనుఁడై భూ
దేవకుమారకుఁ డుండం
గా విను మొకనాఁడు కుతపకాలమునందున్. 58

టీ. ఈవిధమునన్ = పైనిజెప్పఁబడినటుల, అభ్యా...వనుఁడు-అభ్యాగత = ఆగంతుకులయొక్క, సేవా = శుశ్రూషకు, పరతంత్ర = అధీనమైన, సకలజీవనుఁడై = ఎల్లఁ బ్రదుకుఁదెరువుగలవాఁడై, భూదేవకుమారకుఁడు = విప్రపుత్త్రుఁడు, ఉండంగాన్, వినుము. ఒకనాఁడు = ఒకానొకదినమునందు, కుతపకాలమునందున్ = మధ్యాహ్నానంతరమున (పగునాలుగవనేడుగడియల కాలమున)

సీ. ముడిచినయొంటికెంజడ మూయ మువ్వన్నె
మెగముతోలు కిరీటముగ ధరించి
కకపాల కేదారకటకముద్రితపాణిఁ
గుఱుచలాతాముతోఁ గూర్చి పట్టి
యైణేయ మైనయొడ్డాణంబులవణిచే
నక్కళించినపొట్ట మక్కళించి

యారకూటచ్ఛాయ నవఘళింపఁగఁ జాలు
బడుగుదేహంబున భస్మ మలఁది
తే. మిట్టయురమున నిడుయోగపట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్షపోఁగులు చవుకళింపఁ
గావికుబుసంబు జలకుండికయును బూని
చేరెఁ దద్గేహ మౌషధసిద్ధుఁ డొకఁడు.

టీ. ముడిచి...జడ-ముడిచిన=చుట్టచుట్టిన, ఒంటికెంజడ = ఒక్కటియగునెఱ్ఱనిజట, మూయన్=ఆవరించునట్లు, పువ్వన్నె మెకముతోలు=పులితోలు, కిరీటమునగన్ = కుల్లాయిఁగ, ధరించి=తాల్చి, జడగానఁగాకుండఁ బులితోలుతోఁజేసిన కుళ్లాయి పెట్టుకొనెనని భావము. కకపాల=కక్షపాలను, సన్యాసులు చంకనుదగిలించుకొను భూతిమొదలగు వస్తువులను దాఁచియుంచుకొను కంచి, కేదార...పాణిన్-కేదారకటక = పంచలోహములతోఁ జేసినకడియముచే, ముద్రిత=చిహ్నితమైన-పాణిన్=హస్తమున, కుఱుచలాతాముతోన్=పొట్టిదగుయోగదండముతో, కూర్చి = జతపఱచుకొని, పట్టి=పట్టుకొని (కక్షపాలను తనచేతికఱ్ఱకుఁ దగిలించుకొనెను) ఐణేయము=లేడిచర్మముతోఁ జేయఁబడినది, ఒడ్డాణంబులవణిచేన్ = నడుముకట్టుయొక్క బిగిచే, అక్కళించిన పొట్టన్ = లోని కణఁచుకొన్న కడుపును, మక్కళించి = ఉబికించి, ఆరకూటచ్ఛాయన్ = ఇత్తడిరంగును, అవఘళింపఁగన్ = మించుటకు, చాలు=తగిన, బడుగుదేహమునన్ = బక్కచిక్కినశరీరమున, భస్మము, భూతి, అలఁది = పూసికొని, మిట్టయురమునన్ = ఎత్తైనఱొమ్మునందు, నిడుయోగపట్టె=పొడువైన (పట్టుతోఁజేయఁబడి జందెమువాఱగా మెడ నుంచుకొనఁబడు) యోగాభ్యాసవ్యంజక మగుపట్టము, మెఱయన్=ప్రకాశింపుచుండ, చెవులన్=కర్ణములందు, రుద్రాక్షపోఁగులు = రుద్రాక్షలుగ్రుచ్చినచెవిపోఁగులు, చవుకళింపన్= కదలుచుఁజెలువొందఁగా, కావికుబుసంబున్ = కావిరంగుగల చొక్కాయు

యును, జలకుండికయును = నీళ్లుగలకమండలువును, పూని, ఔషధసిద్ధుఁడు= ఓషధులసిద్ధిఁ బొందినవాఁడు (యోగి), తద్గేహము = ఆ ప్రవరునిగృహమును, చేరన్ = ప్రవేశించెను.

తా. పులితోలుతోఁ జేయఁబడినకుళ్లాయియుఁ, బంచలోహములు చేర్చిచేసినకడియమును, గక్షపాలయును, యోగదండమును, ఆఁడుజింక తోలుతోఁజేసిన నడికట్టుపట్టెయు, యోగపట్టమును ధరించి, పసుపువన్నెగల దేహమునందు విభూతిపూసికొని, రుద్రాక్షపోఁగులు పెట్టుకొని, కావి చొక్కాయ తొడిగి నీళ్లతోడికమండులువును జేతఁబట్టినవాఁ డయి యొకసిద్ధ పురుషుఁడు ప్రవరునియింటికి వచ్చెను. అలం. స్వభావోక్తి.

తే. ఇట్లు చనుదెంచుపరమయోగీంద్రుఁ గాంచి
భక్తిసంయుక్తి నెదురేఁగి ప్రణతుఁ డగుచు
నర్ఘ్యపాద్యాదిపూజనం బాచరించి
యిష్టమృష్టాన్నకలన సంతుష్టుఁ జేసి. 60

టీ. ఇట్లు = ఈవిధముగా, చనుదెంచు = వచ్చుచున్న, పరమయోగీంద్రున్ =ఉత్తముఁడగు యోగీశ్వరుని, కాంచి = ప్రవరుఁడు చూచి, భక్తిసంయుక్తిన్ =భక్తియుప్పతిల్లుటచే, ఎదురేఁగి, ప్రణతుఁడు = నమస్కరించినవాఁడు, అగుచున్, చూచినంతన యెదురేఁగి ప్రణతుఁ డగుటచే నాగంతుకునియెడలఁ గల భక్త్యతిశయము తేటపడును. అర్ఘ్యపాద్యాదిపూజనంబు = అర్ఘ్యము పాద్యము మొదలైనవానితోఁ జేయఁబడుపూజను, కాళ్లుచేతులు కడుగుకొనుటకు నీరిచ్చి పూవులతోఁ బూజచేసి, (అర్ఘ్యమన హస్తోదకము, పాద్య మనఁ బాదోదకము.) ఇష్టమృష్టాన్నకలనన్ = ఇష్టమగునట్టియుఁ బరిశుద్ధమైనట్టియు నన్నము నొసఁగుటచే, సంతుష్టున్ = సంతోషించినవానిఁగా, చేసి=ఒనరించి, యోగి కెట్టియాహారము అభిమతమో యట్టిసాత్త్వికాహారము నొసంగె ననుట.

క. ఎందుండి యెందుఁ బోవుచు
నిందుల కేతెంచినార లిప్పుడు విద్వ
ద్వందిత నేఁడు గదా మ
న్మందిరము పవిత్ర మయ్యె మాన్యుఁడ నైతిన్. 61

టీ. విద్వద్వందిత=పండితులచే నమస్కరింపఁబడినవాఁడా! (తాము) ఎందుండి = ఏప్రదేశమునుండి, ఎందున్ పోవుచున్ = ఎక్కడికి కరుగుచు, ఇప్పుడు=ఈసమయమునందు, ఇందులకున్ = ఈప్రదేశమునకు, ఏతెంచినారలు=వచ్చినారు. నేఁడుగదా=ఈదినమునందె, మత్+మందిరము=నాయిల్లు, పవిత్రము=పరిశుద్ధము, అయ్యెన్=ఆయెను. మాన్యుఁడను = పూజనీయుండను (యోగ్యుల కాతిథ్య మీఁగలుగుట సుకృతాతిశయము) ఐతిన్.

మహాపురుషుల యాగమనముచే గృహము పవిత్రమగు ననుట ప్రసిద్ధము. "శ్లో. యస్మిన్నిక్షిపదాంభోజరజఃకణపవిత్రితం, తదేవ భవనం."

తా. ఓయోగీంద్రుఁడా! మీ రెచటనుండి యెచటికిఁ బోవుచు నిచటికి వచ్చినారు? పెద్దలైన మీరాకచేత మాయిల్లు పరిశుద్ధ మాయెను. మీదర్శనముచేత నేను బూజ్యతను వహించితిని.

క. మీమాటలు మంత్రంబులు
మీ మెట్టినయెడ ప్రయాగ మీపాదపవి
త్రామలతోయము లలఘు
ద్యోమార్గఝురాంబుపౌనరుక్త్యము లుర్విన్. 62

టీ. ఉర్విన్ = భూమియందు, మీమాటలు=మీరుపలుకువచనములు, మంత్రములు=మంత్రములవలెఁ బావనములైనవి. మీ మెట్టినయెడ = మీరు త్రొక్కినచోటు, ప్రయాగ=సుప్రసిద్ధమగు ప్రయాగక్షేత్రమువంటిది. మీ పాదపవిత్రామలతోయములు=మీయడుగులు తగిలి పవిత్రమగునిర్మలజలములు, అలఘు...రుక్త్యములు-అలఘు = ఎక్కువగు, ద్యోమార్గఝుర = ఆకాశగంగ

యొక్క, అంబు=ఉదకములకు, పౌనరుక్త్యములు=అవియే ఇవి (కావుటచే వీనిని వేఱుగాఁ జెప్పుట పునరుక్తి.) అవియే యని మఱలఁ జెప్పుట. ఒకమాఱు చెప్పినదానిని మఱలఁ జెప్పుట పునరుక్తి. నీపాదోదకము ఆకాశగంగవలె మిగులఁ బవిత్రమైన దని భావము.

ఉ. వానిది భాగ్యవైభవము వానికి పుణ్యవిశేష మెన్మెయిన్
వాని దవంధ్యజీవనము వానిది జన్మము వేఱు సేయ కె
వ్వానిగృహాంతరంబున భవాదృశయోగిజనంబు పావన
స్నానవిధాన్న పానముల సంతసమందుచుఁబోవు నిచ్చలున్.

టీ. భవాదృశయోగిజనంబు = మీవంటియోగులు, ఎవ్వానిగృహాంతరంబునన్=ఎవనియింటిలో, వేఱుసేయక=భేదమునెంచక, పావనస్నానవిధాన్నపానములన్ = పవిత్రమైన స్నానవిధిచేతను, అన్నపానముల (గైకొనుట) చేతను, నిచ్చలున్=ఎప్పుడును, సంతసము = సంతోషమును, అందుచున్ = పొందుచు, పోవున్=వెళ్లునో, వానిది=అవ్వానిదె, భాగ్యవైభవము = అదృష్టదశ, వానిది = అవ్వానిదె, ఎన్మెయిన్=ఎన్నివిధములను, అవంధ్యజీవనము = సార్థకమైనబ్రదుకు, వానిది=ఆగృహస్థునిదె, జన్మము = పుట్టుక, ఉత్తములగు యోగులకుఁ బరిచర్యచేయఁగలవాఁడె సార్థకజన్ముఁ డనుట.

తా. ఓయోగీశ్వరా! మీవంటిపెద్ద లెవనియింట భేదములేక స్వబంధువులవలెనే స్నానభోజనపానములుచేసి తృప్తినొంది పోవుచుందురో యాగృహస్థుఁడు భాగ్యవంతుఁడును బుణ్యవంతుఁడు నగును. అటువంటి గృహస్థునిదే సార్థకజీవనమును సార్థకజన్మము నగును.

తే. మౌనినాథ కుటుంబజంబాలపటల
మగ్నమాదృశగృహమేధిమండలంబు
సద్ధరింపంగ నౌషధ మొకఁడు గలదె
యుష్మదంఘ్రిజలేశ మొకటి దక్క. 64

టీ. మౌనినాథ=మునిశ్రేష్ఠుఁడా! కుటుం...లంబున్=కుటుంబ=సంసారము, జంబాలపటల=రొంపిప్రోవులో, మగ్న=మునిఁగి యున్న, మాదృశ = మావంటి, గృహమేధిమండలంబున్ = సంసారులసమూహమును, ఉద్ధరింపఁగన్=లేవనెత్తుటకు, యుష్మదంఘ్రిరజోలేశము = మీ పాదముమీఁదిధూళి రేణువు, ఒండు = ఒకటి, తక్కన్=కాక, ఔషధము = మందు, కలదే = ఉన్నదా? లే దని భావము. కుటుంబము ఆధ్యాత్మికచింతగలవారలకుఁ బురదయె కాదు. బురదప్రోవు. కాననే గృహమేధిమండల ముందు మగ్నులం కాఁగలిగిరి. పాదధూళియె యుద్ధరింపఁగలిగినపుడు స్వయముగ మౌనినాథుఁ డెంతేని తోడుసూపఁగలఁడు.

ఔషధము పదరజము అనుదానిచే ప్రవరునికౌషధప్రాప్తి దూరక్షేత్ర సందర్శనసిద్ధి ద్యోతక మగుచున్నది. రూపకాలంకారము.

తా. ఓమునీంద్రా! బురదయందువలెనే పెట్టినకా లూఁడదీసికొన శక్యముకాని సంసారమునందు మునిఁగియున్న మావంటివారి నుద్ధరింపఁజాలినది మీపాదధూళి యొకటే కాని మఱియేదియుఁ గాదు. (మీపాదధూళి సోఁకినమాత్రమున సంసారబంధము వీడిపోవు నని భావము.)

క. నా విని ముని యిట్లను వ
త్సా విను మావంటితైర్థికావళి కెల్లన్
మీవంటి గృహస్థులసుఖ
జీవనమునఁ గాదె తీర్థసేవయుఁ దలఁపన్. 64

టీ. నాన్=అనఁగా, విని=ఆలకించి, ముని=మునీశ్వరుఁడు, ఇట్లనున్= ఈవిధముగాఁ బ్రత్యుత్తరమిచ్చెను. వత్సా = కుఱ్ఱా! విను = ఆలకించుము, మావంటి=(సన్యాసులై దేశాటనముఁ జేయుచు) మమ్ముఁబోలిన, తైర్థికావళికిన్= తీర్థయాత్రాపరులసమూహమునకు, ఎల్లన్ = అందఱకు, సుఖజీవనమునన్ = సుఖముగా జీవించుటచేత, తీర్థసేవయున్ = పుణ్యప్రదములగు తీర్థములు

క్షేత్రములను సేవించుటయుం గూడ, తలఁపఁగ = విచారింపఁగా, మీవంటి గృహస్థుల సుఖజీవనమునఁ గాదె = మీబోఁటియతిథిసేవాపరాయణులగు గేస్తులు సుఖముగా జీవింపఁగలుగుటచేతనే కదా!

తా. ముని యిట్లు చెప్పుచున్నాఁడు.—వత్సా! మీవంటిగృహస్థులు సుఖజీవనులై యుండినచే కదా, మాబోఁటితైర్థికులు తీర్థయాత్రలు చేయఁ జూడఁ గలుగుట.

సీ. కెలఁకుల నున్నతంగేటిజున్ను గృహమేధి
యజమానుఁ డంకస్థితార్థపేటి
పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు
దొడ్డిబెట్టిన వేల్పుగిడ్డి కాఁపు
కడ లేనియమృతంపునడబావి సంసారి
సవిధ మేరునగంబు భవనభర్త
మరుదేశపథమధ్యమప్రప కులపతి
యాఁకటి కొదవుసస్యము కుటుంబి
తే. బధిరపంగ్వంధభిక్షుక బ్రహ్మచారి
జటిపరివ్రాజకాతిథిక్షపణకావ
ధూతకాపాలి కాద్యనాథులకుఁ గాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె. 66

టీ. బధిర...థులకున్—బధిర = చెవిటివాండ్రు, పంగు = కుంటివాండ్రు, అంధ = గ్రుడ్డివాండ్రు, భిక్షుక = బిచ్చగాండ్రు, బ్రహ్మచారి = వటువులు, జటి = వానప్రస్థులు, పరివ్రాజక = సన్న్యాసులు, అతిథి = ఆగంతుకులు, క్షపణక = బౌద్ధభిక్షుకులు, అవధూత = దిగంబరులు, కాపాలిక = కాపాలికమతస్థులు, ఆది = మొదలగు, అనాథులకున్ = దిక్కులేనివారలకు, గృహమేధి = గృహస్థుఁడు, కెలఁకులన్ = ప్రక్కలను, ఉన్న, తంగేటిజున్ను = తంగేటి

చెట్టునకుఁ బెట్టఁబడిన తేనెతుట్టె (వంటివాఁడు), యజమానుఁడు = గృహస్థుఁడు (వాస్తవ్యుఁడు, కాఁపు, సంసారి, భవనభర్త, కులపతి, కుటుంబి, ఈపదము లన్నియుం గృహస్థుఁ డనునర్థము కలవియే) యజమానుఁడు = గృహస్థుఁడు; అంకస్థితార్థపేటి = తొడపైనున్న ధనపుఁబెట్టె (వంటివాఁడు) వాస్తవ్యుఁడు= గృహస్థుఁడు, పెరటికల్పకము=దొడ్డిలోనికల్పవృక్షము (వంటివాఁడు) కాఁపు= గృహస్థుఁడు, దొడ్డిన్ = పెరటియందు, పెట్టిన=ఉంచిన, వేల్పుగిడ్డి=కామధేనువు (వంటివాఁడు) సంసారి=గృహస్థుఁడు, కడ=పారము, లేని=లేకుండు, నడబావి=దిగుబావి (వంటివాఁడు), భవనభర్త = గృహస్థుఁడు, సవిధమేరునగంబు=సమీపమున నున్న మేరుపర్వతము (వంటివాఁడు) కులపతి = గృహస్థుఁడు, మరుదేశ... ప్రప - మరుదేశ=నీరులేని ప్రదేశమందలి, పథ = త్రోవయొక్క, మధ్యమ=నడుమనుండు, ప్రప=చలిపందిరి (వంటివాఁడు), కుటుంబి= గృహస్థుఁడు, ఆఁకటికిన్ = ఆఁకలివేళకు, ఒదవు సస్యము = ఉపయోగపడు పైరు, కానన్=కాఁబట్టి, భూసురోత్తమ=బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! గార్హస్థ్యమునకున్ = గృహస్థత్వమునకు, సరియె=ఇతరాశ్రమములు సమానములా? కావునట. సమీపమున నున్న తంగేటిజున్ను, తొడపైనున్నధనపుఁబెట్టె మొదలగునవి సర్వదా యెటుల సుసాధ్యములో యటులె గృహస్థాశ్రమము తదితరులకు సహాయకర మని భావము. రూపకశ్లేషములు అలంకారములు.

తా. చెవిటి, కుంటి, గ్రుడ్డి మొదలయిన దిక్కుమాలినవారి కెల్లను గృహస్థుఁడే రక్షకుఁడు. కాఁబట్టి గృహస్థాశ్రమమువంటియాశ్రమము లేదు.

క. నావుడుఁ బ్రవరుం డిట్లను
దేవా దేవర సమస్తతీర్థాటనముం
గావింపుదు రిలపై నటు
గావున విభజించి యడుగఁ గౌతుక మయ్యెన్. 67

టీ. నావుడున్=అనఁగా, (మునివరుఁడు వాకొనినంతన) ప్రవరుఁడు= ప్రవరాఖ్యుఁడు, ఇట్లు అనున్=ఈవిధముగాఁ బ్రత్యుత్తరము నొసంగెను.

దేవా = మహానుభావా! మీరు, ఇలపైన్ = భూమియందు, సమస్తతీర్థాటనమున్ = ఎల్లతీర్థములందు సంచారమును, కావింతురు = చేయుదురు, విభజించి యడుగన్ = ఒక్కొక్కయంశమును వేఱుపఱచియడుగుటకు, కౌతుకము = కుతూహలము, అయ్యెన్.

తా. సిద్ధుఁడు గృహస్థాశ్రమమును బ్రశంసింపఁగాఁ బ్రవరుఁడు విని మునీంద్రా! తాము సమస్తపుణ్యతీర్థములను సందర్శించుచుందురుగదా! కావున నాయాతావులఁగల విశేషముల నెఱుఁగ మనసయ్యెను.

శా. ఏయే దేశములన్ వసించితిరి మీ రేయేగిరుల్ చూచినా
రేయేతీర్థములందుఁ గ్రుంకిడితి రేయేద్వీపముల్ మెట్టినా
రేయేపుణ్యవనాళిఁ ద్రిమ్మరితి రేయేతోయధుల్ డాసినా
రాయాచోటులఁ గల్గువింతలు మహాత్మా నా కెఱిఁగింపవే.

టీ. మహాత్మా = మహానుభావా, మీరు, ఏయేదేశములన్ = ఏయేదేశములయందు, వసించితిరి = ఉంటిరి. పా. చరించితిరి = తిరిగితిరి, ఏయేగిరుల్ = ఏయేపర్వతములు, చూచినారు = సందర్శించితిరి, ఏయేతీర్థములందున్ = ఏయేపుణ్యజలములయందు, క్రుంకిడితిరి = స్నానము కావించితిరి. ఏయేద్వీపముల్ = ఏయేదీవులను, మెట్టినారు = త్రొక్కితిరి, పుణ్యవనాళిన్ = పవిత్రములైన అరణ్యములందు, త్రిమ్మరితిరి = తిరిగితిరి, తోయధుల్ = సముద్రములను, డాసినారు = చేర నరిగినారు.

తా. ఓమహానుభావా! మీరున్న దేశములను, మీరాడిన తీర్థములను, జూచిన కొండలను, జొచ్చిన దీవులను, విహరించిన పుణ్యారణ్యములను, స్నానార్థము పోయిన సముద్రములను, వానివానియందుఁగల వింతలను నాకు విశదముగా నానతీయవలయును.

తే. పోయి సేవింప లేకున్నఁ బుణ్యతీర్థ
మహిమ వినుటయు నఖిలకల్మషహరంబ

కాన వేఁడెద ననిన నమ్మౌనివర్యుఁ
డాదరాయత్తచిత్తుఁడై యతని కనియె. 69

టీ. పోయి=ఆయాదివ్యక్షేత్రముల కేఁగి, సేవింపలేకున్నన్ = ఆపుణ్య తీర్థముల సేవ చేయఁజాలకున్నను, పుణ్యతీర్థమహిమ = పుణ్యప్రదములగు తీర్థముల ప్రభావము, వినుట=ఆలకించుట, అఖిలకల్మషహారంబ = సమస్తపాపములను పోఁగొట్టఁజాలినదే, కానన్=కావున, వేఁడెదన్ = ప్రార్థించెదను, అనినన్=అని వేఁడఁగా, అమ్మౌనివర్యుండు=ఆసిద్ధుఁడు ఆదరాయత్తచిత్తుఁడు ఐ= ఆదరమునకు స్వాధీనమయిన మనస్సుగలవాఁడై, అతనికిన్ = ఆప్రవరునకు, అనియెన్.

ఉ. ఓచతురాస్యవంశకలశోదధిపూర్ణశశాంక తీర్థయా
త్రాచణశీలినై జనపదంబులు పుణ్యనదీనదంబులున్
జూచితినందునందుఁ గలచోద్యములున్ గనుఁగొంటి నాపటీ
రాచలపశ్చిమాచలహిమాచలపూర్వదిశాచలంబుగన్. 70

టీ. చతు...శాంక-చతురాస్య = బ్రహ్మయొక్క, వంశ=కులమనెడు, కలశోదధి=పాలసముద్రమునకు, పూర్ణశశాంక=పూర్ణచంద్రుఁడా! తీర్థయాత్రాచణశీలినై = తీర్థయాత్రలుచేయుటయందుఁ బ్రఖ్యాత మగుస్వభావము గలవాఁడనై, జనపదంబులు = దేశములును, పుణ్యనదీనదంబులున్=పవిత్రములైన నదులను నదములను (తూర్పునకుఁ బ్రవహించునవి నదులు, పడమరకుఁ బ్రవహించునవి నదములు), ఆపటీరాచ...చలంబుగన్-ఆపటీరాచల=మలయపర్వతము మొదలుకొని, పశ్చిమాచల=అస్తాచలము, హిమాచల=హిమవత్పర్వతము, పూర్వదిశాచలంబుగన్ = ఉదయపర్వతమువఱకు గలుగునట్లు (ఈ నాల్గు పర్వతములు చుట్టివచ్చునట్టి దేశము ననుట.) (దిశాచలంబులన్ అని పా.) చూచితిన్=కాంచితిని, అందునందుఁగలచోద్యములన్=ఆయా తావుల యందుఁ గలవింతలను, కనుఁగొంటిన్ = కాంచితిని.

చతు...శశాంక అనుటచేఁ బ్రవరుని యాభిజాత్య సౌశీల్య పాండిత్యాదులు సిద్ధుండు గ్రహించె ననుట. నాలుగు దిక్కులు చుట్టి వచ్చితి ననుటచేఁ బ్రపంచమునందలి వింత లన్నింటిని దర్శించెనని భావము.

శా. కేదారేశు భజించితిన్ శిరమునన్ గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్ ప్రయాగనిలయుం బద్మాక్షు సేవించితిన్
యాదోనాథసుతాకళత్రు బదరీనారాయణున్ గంటి నీ
యాదేశం బన నేల చూచితి సమస్తాశావకాశంబులన్. 71

టీ. కేదారేశున్ = కేదారేశ్వరుని, భజించితిన్ = సేవించితిని, హింగుళాపాదాంభోరుహముల్ = హింగుళాదేవియొక్క పాదపద్మములను, శిరమునన్ = తలయందు, కీలించితిన్ = తాల్చితిని, సాష్టాంగనమస్కారము గావించెననుట, ప్రయాగనిలయున్ = ప్రయాగమందువసించు, పద్మాక్షున్ = మాధవుని, సేవించితిన్ = భజించితిని, యాదోనాథసుతాకళత్రున్ = లక్ష్మీప్రియుం డగు, (సముద్రునిపుత్రి యగు లక్ష్మి భార్యగాఁగలవాఁ డగు) బదరీనారాయణున్ = బదరికాశ్రమమున నెలకొను నారాయణుని, కంటిన్ = చూచితిని, ఈయాదేశం బన నేల = ఈ ప్రదేశము ఆప్రదేశ మని పేరుపెట్టి వాకొన నేల, సమస్త+ఆశా+అవకాశంబులన్ = సర్వదిక్కులయొక్క మధ్యప్రదేశములను (ప్రపంచమునంతయు) చూచితిన్ = నేను కాంచితిని.

వ. అది యట్లుండె వినుము గృహస్థరత్నంబ! లంబమానరవిరథతురంగ శృంగారచారుచామరచ్ఛటాప్రేక్షణాక్షణోద్గ్రీవచమరసముదయం బగు నుదయంబునం గలవిశేషంబులు శేషఫణికి నైన లెక్కింప శక్యంబె, యంధకరిపుకంధరావాసవాసుకి వియోగభవదుర్వ్యథాభోగ భోగినీభోగభాగ పరివేష్టితపటీరవిటపివాటికావేల్ల దేలాలతావలయం బగు మలయంబునం గలచలువకు విలువ యెయ్యది, యకటకట

వికటకూటకోటివిటంక శృంగాటకాఢౌకమాన జరదిందు
బింబగళ దమృతబిందుదుర్ది సార్ద్రీకృతసల్లకీపల్లవప్రభంజన
పరాంజనహస్తిహస్తం బగునస్తంబునం గలమణిప్రస్తరం
బుల విశ్రాంతిఁ జింతించిన మేనం బులకలిప్పుడుం బొడమెడు,
స్వస్వప్రవర్ధిత వర్ధిష్ణుధరణీరుహసందోహ దోహదప్రథా
నాసమానఖేల ద్బైలబిలవిలాసినీవిలాస వాచాలతులాకోటి
కలకలాహూయమానమానసమదాలసమరాళం బగురజత
శైలంబునోలంబులం గాలగళువిహారప్రదేశంబులం గన్న
సంసృతిక్లేశంబులు వాయవే సతతమదజలస్రవణపరాయ
ణైరావణవిషాణకోటి సముట్టంకితకటకపరిస్ఫురత్కురువింద
కందళవ్రాతజాతాలాతశంకాపసర్పదభ్రముభ్రమీ విభ్రమ
ధురంధరం బగుమేరుధరాధరంబు శిఖరంబుల సోయ
గంబులు గలయం గనుంగొనుట బహుజన్మకృతసుకృతపరి
పాకంబునం గాక యేల చేకూఱునేర్చు నేనిట్టిమహాద్భుతంబు
లీశ్వరానుగ్రహంబున నల్పకాలంబునం గనుంగొంటి నను
టయు నీషదంకురితహాసగ్రసిష్ణుగండయుగళుం డగుచుఁ
బ్రవరుం డతని కిట్లనియె. 72

టీ. అట్టుండెన్ = అటుండనిమ్ము, గృహస్థరత్నంబ = గృహస్థులలో శ్రేష్ఠుఁడ! లంబమాన...సముదయంబు-లంబమాన = వ్రేలాడుచున్న, రవిరథ=సూర్యునిరథము యొక్క, తురంగ = అశ్వములకు, శృంగార = అలంకారమయిన, చారు = సుందరమగు, చామరచ్ఛటా = చామరపుగుచ్ఛములయొక్క, ప్రేక్షణ=చూచుటయందలి, క్షణ=ఉత్సవముచే, ఉద్గ్రీవ = మెడలు పైకెత్తుకొనియున్న,చమరసముదయంబు=చమరమృగములసమూహముకలది (సూర్యా

శ్వముల కలంకారముగా నుంపఁబడిన చామరములఁ గాంచి యీపర్వతము మీఁది చమరీమృగము లా యశ్వములను మోరలు పై కెత్తుకొని చూచు చునుట.) ఉదయంబునన్ = ఉదయపర్వతమునందు, కలవి శేషంబులు=కలిగిన యతిశయములు, శేషఫణికైనన్ = ఆదిశేషున కైనను, లెక్కింపన్ = ఇన్ని యని లెక్కపెట్టుటకు, శక్యంబె=శరమా? శేషుఁడేని గణింపఁ జాలఁ డనుట. (చామరము లలంకారముగ నుంటచే సజాతీయచమరీమృగము లని యితర చమరీమృగములు తలయెత్తి చూచుచుండెనని భావము) గుఱ్ఱములకుఁ జామ రము లలంకరింతురనుటకు శ్లో. "ముక్తేషు రశ్మిషు నిరాయతపూర్వకాయా, నిష్కంపచామరశిఖా నిభృతోర్ధ్వకర్ణాః, ఆత్మోత్థితైరపి రజోభి రలంఘ నీయా, ధావంత్యమీ మృగజవాక్షమయేవరథ్యాః." (అభిజ్ఞానశాకుంతలము). అం. భ్రాంతిమంతము. అంధక...లతావలయంబు-అంధకరిపు=శివునియొక్క, కంధరా=కంఠము, ఆవాస=నివాసముగాఁగల వాసుకి (యొక్క), వియోగ = ఎడబాటుచే, భవ=పుట్టిన, దుర్వ్యథా = చెడ్డవెతయొక్క, ఆభోగ=పరిపూర్ణత గల, భోగినీ=సర్పాంగనలయొక్క, భోగభాగ=శరీరభాగములచే, పరివేష్టిత = చుట్టుకోఁబడిన, పటీరవిటపి=గందపుఁజెట్టుయొక్క, వాటికా = వీథులయందు, వేల్లత్ =అల్లుకొనుచున్న, ఏలాలతావలయంబు=ఏలకితీవలప్రోవులుగలది,(భర్త యగు వాసుకి శివునికంఠమున వసించుటచే వియోగమును సైఁపఁజాలకపరితాప పడు సర్పాంగనలు చుట్టుకొన్న గందపుఁజెట్లయందు నేలకితీగ లల్లుకొన్న వనుట, మలయంబునన్ = మలయపర్వతమునందు, కలచలువకున్ = ఉన్న చలువఁదనమునకు, విలువ=వెల, ఎయ్యది=ఏది, లేదనుట. విరహతాపమునకుఁ జందన ముపశమనౌషధము. సర్పాంగనలు భర్తవలని యెడబాటుసైఁపనోపక తాప మాపుకొనుటకుగందపుమ్రాఁకులఁ గౌఁగిలించికొనిరి. అలం. ఉత్ప్రేక్ష— అకటకట=ఆహాహా, ఇది ప్రశంసార్థకము. వికట...హస్తంబు-వికట=పెచ్చు తగ్గయిన, కూటకోటి = శిఖరసమూహములయొక్క, విటంక = గూండ్లవంటి

ముంజూరుసెలియలయొక్క, శృంగాటక=కూడలిపట్టులందు, ఆఘూకమాన = దుముకుచున్న, జరదిందుబింబ = అస్తమించుచంద్రబింబమునుండి, గళత్ = తొరఁగు, అమృతబిందు = అమృతబిందువులచేఁ గలిగిన, దుర్దిన = జడివాన దినమున, ఆర్ద్రీకృత=తడిసినవిగాఁ జేయఁబడిన, సల్లకీ = అందుగుఁజెట్లయందలి, పల్లవ=చివుళ్లయొక్క, ప్రభంజన=నాశముచేయుటయందు, పర=ఆసక్తమయిన అంజనహస్తి=అంజన మను పడమటిదిక్కునఁగల యేనుఁగుయొక్క, హస్తంబు = తుండముగలది, అగు అస్తంబునన్ = అస్తాచలమునందు, కల మణిప్రస్తరంబుల విశ్రాంతిన్=ఉన్న మణిమయములగు చఱియలపై విశ్రమించుటను, చింతించినన్ = తలంచుకొన్నను, మేనన్ = దేహమునందు, పులకలు=గగుర్పాటులు, ఇప్పుడున్ = ఇపుడుగూడ, పొడమెడున్ = పొటమరించుచున్నవి. అందుగుఁజివుళ్లు ఏనుఁగులకు మిగుల యిష్టమనుట కిందే సీ. "తుండముల్ సాచి యందుగుచివుళ్లకు నిక్క కరులదంతచ్ఛాయ గడలుకొనఁగ" యని గలదు. స్వస్వ...మరాళంబు - స్వస్వ=తమతమచే, ప్రవర్ధిత=వృద్ధి పొందింపఁబడిన, వర్ధిష్ణు=వృద్ధిపొందఁదగు, ధరణీరుహసందోహ = చెట్లసమూహముయొక్క, దోహద=అసమయమునఁ బుష్పాదులు కలుగునట్లు చేయు కర్మమే, ప్రధాన=ముఖ్యముగా, అసమాన = సాటిలేనట్టుగా, ఖేలత్=విహరించుచున్న, ఐలబిలవిలాసినీ = కుబేరుని స్త్రీలయొక్క, విలాస=విలాసమును గల్గించునట్టి, వాచాల=ధ్వనించుచున్న, తులాకోటి=అందెలయొక్క, కలకల (ధ్వనిచే), ఆహూయమాన = పిల్వఁబడుచున్న, మానస=మానస మను సరస్సునందలి, మదాలస=మదముచేఁ జొక్కిన, మరాళంబు=అంచలు గలది. (కుబేరుని జవరాండ్రు తమచేఁ బెంపఁబడిన వృక్షములకు దోహదక్రియలుచేయుటకై సంచరించు నప్పుడు కలకలమని మ్రోఁగు తమ యందెల మ్రోఁతకు, తమ జాతి పక్షుల కూఁత లనుకొని యంచలు చేరవచ్చుననుట.) అగు రజతశైలంబు సోలంబులన్ = ఐన వెండికొండమాటు చోటులను, కాలగతి

విహార ప్రదేశంబులన్ = శివుని విహరించు తావులను, కన్న = చూచిన యెడల, సంసృతిక్లేశంబులు = సాంసారికష్టములు, పాయవే=పోవా? అంచల యడుగులు అందెల మ్రోఁతలు సమముగా నుండు ననుటకు శ్లో. "ఏతాశ్చలద్వలయసంహతిమేఖలోత్థ, ఝంకారనూపురపరాజితరాజహంస్యః." (భర్తృహరి) సతత...ధురంధరంబు-సతత=ఎడతెగక, మదజల=మదోదకముయొక్క, స్రవణ=స్రవించుటయందు, పరాయణ = సంసక్తమయిన, ఐరావణ = ఐరావతముయొక్క, విషాణకోటీ=దంతాగ్రములచే, సముట్టంకిత = పొడువఁబడిన, కటక=కొండ నడిమి ప్రదేశమందు, పరిస్ఫురత్ = ప్రకాశించు, కురువింద = కెంపులయొక్క, కందళవ్రాత = మొలకలగుంపు వలన, జాత=కలిగిన, అలాత శంకా = కొఱవు లనెడి సంశయముచే, అపసర్పత్ = తప్పించుకొనిపోవు, అభ్రము=ఆఁడయేనుఁగుయొక్క, భ్రమీ = చుట్టుదిరుగుటయొక్క, విభ్రమధురంధరంబు=విలాసము ఎక్కువగాఁ గలది అగు, మేరు...సోయగంబు - మేరుధరాధరంబు = మేరుపర్వతముయొక్క, శిఖరంబుల (యొక్క), సోయగంబు=సొగసు, కలయన్=అంతటను, కనుంగొనుట = చూచుట, (బాగుగాఁ దృష్టిదీర సందర్శించుట) బహు...పాకంబునన్-బహుజన్మ=అనేక జన్మములందు, కృత=చేయఁబడిన, సుకృత = పుణ్యముయొక్క, పరిపాకంబునన్ = పండుటచే, కాక=కాని, ఏల=ఎందులకు, చేకూఱునేర్చున్ = కలుగనేర్చును. ఇట అలంకారము భ్రాంతిమంతము. కురువిందములు మదకోకిలముల కంటి కాంతివలె ఎఱ్ఱగా నుండునని రత్నశాస్త్రమునందుఁ జెప్పఁబడెను. అగ్ని రక్తకణములోని దనుటకు "నవకిసలయతల్పం పుంజితాంగారకల్పం" అని పుష్పబాణవిలాసము. కురువింద యెఱ్ఱగా నుండుటకు దృష్టాంతము సీ. "సలలితమత్తకోకిలలోచనద్యుతి నలరారు కురువింద మాణిక్యకెంపు" (రత్నపరీక్ష) మహాద్భుతంబులు=మిక్కిలి నాశ్చర్యము కలిగించునవి, ఈశ్వరానుగ్రహంబునన్ = దేవునియనుగ్రహముచే, అల్పకాలంబునన్ = త్వరగనే, కనుం

గాంటిన్ = చూచితిని, అనుటయుఁన్ = అని సిద్ధుఁడు చెప్పఁగా, ఈషదం...
ళుండు-ఈషత్ = కొంచెముగా, అంకురిత = పొడమిన, హాసన = నగవును, గ్రసిష్ణు=మ్రింగు, గండయుగళుండు = రెండు చెక్కిళ్లుగలవాఁడు. (ఇంచుక మొలకెత్తు నవ్వును జెక్కిళ్లతో మాటినవాఁడై) ప్రవరుండు, అతనికిన్ = మునికి, ఇట్లు అనియెన్.

చ. వెఱవక మీ కొనర్తు నొక విన్నప మిట్టివి యెల్లఁ జూచి రా
నెఱకలు గట్టుకొన్న మఱి యేండ్లును బూండ్లును బట్టుఁ
బ్రాయపుం, జిఱుతతనంబు మీ మొగము సెప్పక చెప్పెడు
నద్దిరయ్య మా, కెఱుఁగఁ దరంబె మీమహిమలీర యెఱుం
గుదు రేమి చెప్పుదున్. 73

టీ. వెఱవక=జంకు చెందక, ఒకవిన్నపము = ఒకమనవి, మీకున్ = తమకు, ఒనర్తున్ = చేయుదును, మి మ్మొకవిషయము ప్రశ్నించెదను. ఇట్టివి యెల్లన్ = ఇట్టివిచిత్రములన్నియును, చూచిరాన్ = చూచివచ్చుటకు, ఎఱకలు=ఱెక్కలు, కట్టుకొన్నన్ = కట్టికొనినను (ఱెక్కలతోఁ బోయి వ్రాలినను), మఱి=ఇంకను, ఏండ్లును బూండ్లును = పెక్కు సంవత్సరములకాలము, పట్టున్=సరిపోవు, మీ మొగము = మీముఖము, ప్రాయపుంజిఱుతతనంబు = వయస్సునఁ జిన్నతనమును, చెప్పకచెప్పెడున్ = నోటితోఁ జెప్పనక్కఱ లేకయే చెప్పుచున్నది, అద్దిరయ్య = ఆహా! ఈర=మీరే, మీమహిమలు = మీ ప్రభావములు, మాకున్ = మాబోంట్లకు, ఎఱుఁగన్ = తెలిసికొనుటకు, తరంబె = శక్యమా! ఈర = మీరలే, ఎఱుంగుదురు = గుర్తెఱుంగుదురు. అనన్యసాధ్యమగు మీమహిమ మాబోంట్లెఱుంగఁ జాలరు, ఏమిచెప్పుదున్ = ఇఁక నేమి చెప్పఁగలను?

తా. జంకు గొనక మీతో నొకటి మనవి చేసికొనుచున్నాను. మీరు చూచితి మన్నయీవిచిత్రముల నెల్లఁ జూచివచ్చుటకు ఱెక్కలు గట్టుకొని

పోయినవి యెన్నిసంవత్సరము లైనఁ బట్టును. మీరు మిక్కిలి చిన్నవయసు గలవారని మీముఖము చెప్పకయే చెప్పుచున్నది. ఇంత చిన్నవయస్సున నవియెల్ల నెట్లు చూడఁగల్గితిరో, అహా! మీమహత్త్వములు మీకుఁ దెలియ వలయుఁగాని మాకుఁ దెలియఁ దరమా!

తే. అనినఁ బరదేశి గృహపతి
కనియెన్ సందియముఁ దెలియ నడుగుట తప్పా
వినవయ్య జరయు రుజయును
జెనకంగా వెఱచు మమ్ము సిద్ధుల మగుటన్. 74

టీ. అనినన్=ప్రవరుఁడనఁగా, పరదేశి=ఇతరదేశపువాఁడు(సిద్ధుఁడు), గృహపతికిన్ = ఇంటియజమానునకుఁ (ప్రవరునకు) అనియెన్ = ఇటులఁ బ్రత్యుత్తర మొసంగెను. సందియము = సందేహమును తెలియన్ = తెలిసికొనుటకు, అడుగుట = ప్రశ్నించుట, తప్పా=దోసమా? వినవయ్యా = ఆలకింపుము. సిద్ధులము = ఔషధసిద్ధి గలవారము, అగుటన్ = అవుటచేత, మమ్మున్, జరయున్ = ముదుసలితనమును, రుజయును = రోగమును, చెనకంగాన్=అంటుటకు, వెఱచున్=భయపడును.

తా. ప్రవరునితో సిద్ధుఁ డనియెను. వెఱవ నేల? సంశయము వారించు కొనుట కడుగుట తప్పుకాదు. మేము సిద్ధులము గావున ముదిమియుం రోగమును మమ్ము ముట్ట నేరవు.

మ. పరమంబై నరహస్యమైనయది దాఁపన్ జెప్పెదన్ భూమిని
ర్జరవంశోత్తమ పాదలేప మనుపేరన్ గల్గుదివ్యౌషధం
బరసం బీశ్వరసత్కృపన్ గలిగెఁ దద్వ్యాపారప్రభావంబునన్
జరియింతున్ బవమానమానసతిరస్కారిత్వరాహంకృతిన్.

టీ. భూమినిర్జరవంశోత్తమ=బ్రాహ్మణవంశమున శ్రేష్ఠుఁడగువాఁడా! (ప్రవరుఁడా) పరమంబు = గొప్పది, రహస్యము = దాఁచిపుచ్చ వలసినది,

దాఁటక్ = దాఁటియుంచను, పాదలేప మను పేరన్ = పాదలేప (అడుగు పూఁత) మను పేరితో, దివ్యౌషధంపురసంబు = ఉత్తమమగు నోషధిసంబంధమగు రసము, ఈశ్వరసత్కృపన్ = దైవానుగ్రహముచే, కల్గెన్ = నాకు లభించెను. తద్భూరి ప్రభావంబునన్ = దానియొక్క గొప్పమహత్త్వముచేత, పవమా...హంకృతిన్ - పవమాన = వాయువును, మానస = మనస్సును, తిరస్కారి=వంచించునట్టి, త్వరా—వేగముయొక్క, అహంకృతిన్ = అహంకారముచే, చరియింతున్ = తిరుగుదును.

పరమరహస్యముగానఁ జెప్పరాదు. నీవు భూదేవులం దుత్తముఁడవు. కాన నెఱింగించుచున్నాఁడ ననుటచే రహస్యప్రకటనమువలనఁ గలుగు దోసఁగుకంటెఁ దెలుపుటయే ఫలప్రదమని భావము. దివ్యౌషధముగాన నే యది భూరిప్రభావముగలది. ఈశ్వరసత్కృపాలబ్ధముగావున నది సామాన్యులకు లభించునది కాదనుట.

తా. విప్రోత్తమా! మిక్కిలి గోప్య మగువిషయమైనను నీకు దాఁపక చెప్పుచున్నాను. దైవానుగ్రహమువలన నాకుఁ బాదలేప మనునొకయోషధీరసము సంభవించినది. దానిసామర్థ్యమున వాయువేగమును మనోవేగమును మించినవేగముతోఁ దిరుగుదును.

క. దివి బిసరుహబాంధవసైం
ధవసంఘం బెంతదవ్వు దగ లేకరుగున్
భువి నంతదవ్వు నేమును
తవతవ లేకరుగుదుము హాటాహుటి నడలన్. 76

టీ. దివిన్ = ఆకసమున, బిస...సంఘంబు-బిసరుహ = పద్మములకు, బాంధవ=చుట్ట మగుసూర్యునియొక్క, సైంధవసంఘంబు = గుఱ్ఱముల సమూహము, ఎంతదవ్వు=ఎంతదూరము, దగలేక—దప్పిలేకఁ (శ్రమలేక) అరుగున్= పోవునో, భువిన్ = భూమిని, అంతదవ్వున్ = అంతదూరమును, దగయున

దప్పియనుటకంటె అలసటయనుటయే యొప్పిదము. ప్రయాణముచేఁగలుగునది యలసట. దగపదమును అలసట యనునర్థమునఁ బెద్దనార్యుఁడు నాలుగవ యాశ్వాసమున నిండె సీ. "వెనుదవ్వు దగ దొట్టఁ జని రెట్టవడఁ గొట్టె నుడు వీథి బెళగువ్వ నొక్క-యఱజు." అని కలదు. నేమును=మేమును, తవతవ లేక=అయాసములేక, హుటాహుటినడలన్=చకచకగల నడకలతో, అరుగుదుము=పోవుదుము.

తా. ఆకాశమున సూర్యాశ్వము లెంతదూర మనాయాసముగా నరుగునో భూమిపై మేమును నంతదూరము చకచకనడకలతో శ్రమలేక తిరుగుదుము.

మ. అనినన్ విప్రవరుండు కౌతుకభరవ్యగ్రాంతరంగుండు భ
క్తినిబద్ధాంజలిబంధురుండు నయి మీదివ్యప్రభావం బెఱుం
గనినాప్రల్లదముల్ సహించి మునిలోకగ్రామణీ సత్కృపన్
నను మీశిష్యుని దీర్థయాత్రవలనన్ ధన్యాత్ముఁగాఁ జేయరే.

టీ. విప్రవరుండు = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు (ప్రవరుఁడు), కౌతుక... రంగుండు - కౌతుకభర = కుతూహలాతిశయముచే, వ్యగ్ర = తొందరపడు, అంతరంగుండు = మనస్సుగలవాఁడు, భక్తి...బంధురుండు - భక్తి (చేత), నిబద్ధ=కూర్పఁబడిన, అంజలిబంధురుండున్ = దోసిలిచేత నొప్పువాఁడునుఁ ఆయి, మీదివ్యప్రభావంబు=మీగొప్పసామర్థ్యమును, ఎఱుంగని=గ్రహింపఁజాలని, నాప్రల్లదముల్=నావదరుపలుకులను, సహించి = ఓర్చి, మునిలోకగ్రామణీ=మునిజనులలోశ్రేష్ఠుఁడా, సత్కృపన్ = మంచికరుణతో, మీశిష్యునిన్=మీశిష్యుఁడనయిన, ననున్ = నన్ను, సామాన్య మానవునిగాఁ దలంచి యెటులఁ బోయి ప్రపంచమంతయుఁ దర్శింపఁగలిగితిరనుట ప్రల్లదము. తన ప్రమాదము సిద్ధుని ప్రశస్తి గ్రహించినంతనె ప్రవరుఁడు కౌతుకముతో దలఁచెను.

బంధము దాల్చెను, తీర్థయాత్రవలనన్ = తీర్థములకు యాత్రలు చేయుటచే, ధన్యాత్ముఁగాన్=కృతార్థమయిన యాత్మగలవానిఁగా, చేయరే=చేయుఁడీ.

తా. అనునప్పటికిఁ బ్రవరుఁడు అతికుతూహలముచే మనస్సు తొట్రు పడఁగా దోసిలియొగ్గి, మునివర్యా! మీ మాహాత్మ్యమును తెలిసికొనలేక నేను పల్కిన ప్రల్లదపుఁబలుకులను మన్నించి కరుణతో శిష్యుఁడ నగునన్ను తీర్థయాత్రలఁ జేయించి కృతార్థునిఁ జేయ వేఁడెద ననెను.

క. అనుటయు రసలింగము నిడు
తనవట్రువప్రేఁపసజ్జ దంతపుబరణిన్
నినిచినయొకపస రిది యది
యని చెప్పక పూసెఁ దత్పదాంబుజయుగళిన్. 78

టీ. అనుటయున్ = అనఁగా, రసలింగమున్ = రసముతోఁగావించిన కణికెను, తన=తనయొక్క, వట్రువప్రేఁపసజ్జన్ = గుండ్రనిప్రేఁపబుట్టలోని, నినిచిన = నిండించిన, ఒకపసరు = ఒకానొకపచ్చనిద్రవము, ఇదియది యని చెప్పక=ఎట్టిదనియుఁ దెలుపక, తత్పదాంబుజయుగళిన్=అతనితామరలవంటి రెండడుగులందును, పూసెన్=రాచెను.

తా. పరమరహస్యముగానఁ బ్రవరుఁ డాపసరు పే రడుగలేదు. ఈశ్వరలబ్ధము పరమగోప్యముగాన మునియుఁ బేరుచెప్పక పసరు రాచెను.

క. ఆమం దిడి యతఁ డరిగిన
భూమీసురుఁ డరిగెఁ దుహినభూధరశృంగ
శ్యామలకోమలకానన
హేమాఢ్యదరీఝరీనిరీక్షాపేక్షన్. 79

టీ. ఆమందున్=ఆపాదలేపనమును, ఇడి=పూసి, అరిగినన్=పోవఁగా, భూమీసురుఁడు = బ్రాహ్మణుఁడు (ప్రవరుఁడు), తుహిన...పేక్షన్ = తుహినభూధర=మంచుకొండయొక్క, శృంగ=శిఖరములందలి, శ్యామల =

పసరుమీఱినసలుపుగల, కోమల=నవనవలాడు, కానన=అడవులయొక్కయుం, హేమ = బంగారుతో, అఢ్య = ఒప్పిన, దరీ=గుహలయొక్కయుం, ఝరీ = సెలయేళ్లయొక్కయుం, నిరీక్షా = చూచుటయందలి, అపేక్షన్ = కోరికచే, అరిగెన్=పోయెను.

దరీశబ్దమునకుఁ గొండఱు లోయ యని యర్థము చెప్పిరి.

పచ్చగా నున్నచెట్లను నలుపుగాఁ జెప్పుట కవిసమయము.

వ. అనిన విని యమ్మహీసురవరుఁ డట్లరిగి యెట్లు ప్రవర్తించె
నతని పుణ్యవర్తనశ్రవణంబు మనంబునకు హర్షోత్కర్షంబుఁ
గల్పించెఁ దర్వాతివృత్తాంతంబుఁ గృపాయత్తచిత్తంబున
నానతీయవలయు నని యడుగుటయును. 80

టీ. అనినన్=(ఇట్లు పక్షులు) పలుకఁగా, (జైమిని) విని, మహీసురవరుండు = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు (ప్రవరుఁడు), ఎట్లు = ఏవిధముగా, ప్రవర్తించెన్=నడచుకొనెను. అతని=ఆప్రవరాఖ్యుని, పుణ్యవర్తనశ్రవణంబు = పవిత్రమయిన నడువడియొక్క వినుట, హర్షోత్కర్షంబున్=సంతోషాతిశయమును, కల్పించెన్ = కలుగఁజేసెను. తర్వాతివృత్తాంతంబు = మంచుకొండకేఁగినది మొదలుజరిగినకథ, కృపాయత్తచిత్తంబునన్ = దయకునధీనమయిన మనస్సుతో, ఆనతీయవలయున్=సెలవీయవలెను. అని యడుగుటయున్ = అని జైమినిమహాముని యడుగఁగా, దీనికి రెండవయాశ్వాసమునందలి యవధరింపు మను క్రియతో నన్వయము.

శా. గంగాస్వచ్ఛతరంగభంగికయశోగాఢచ్ఛవిచ్ఛన్నపా
రంగాంకాంక నిరంకుశప్రతికళాపాథోధిప్రియంభావుకా
గాంగేయాచలచాపనూపురవచోగాంభీర్యలీలాస్పదా
బంగాళాంగకళింగభూపసుభటాభ్రశ్రేణిఝంఝానిలా. 81

టీ. గంగా...కాంక-గంగా (నదియొక్క), స్వచ్ఛ = నిర్మలమయిన,

తరంగ = తరఁగలయొక్క, భంగిక = రీతిగల, యశః = కీర్తియొక్క, గాఢ = అధికమయిన, ఛవి=కాంతిచే, ఛన్న = కప్పఁబడిన, సారంగాంక = చంద్రునియొక్క, అంక = కళంకముగలవాఁడా! (గంగాతరంగములవలె స్వచ్ఛమయినకీర్తియొక్క కాంతిచేఁ జంద్రునిలోని కళంకమును గప్పిపుచ్చిన వాఁడనుట.) నిరంకుశ...భావుకా - నిరంకుశ = నిరాఘాటకమయిన, ప్రతికళా = ప్రతివిద్యయందలి, ప్రౌఢి = సామర్థ్యమువలన, ప్రియంభావుకా = ఇష్టుఁడగువాఁడా! గాంగే...స్పదా - గాంగేయాచల = మేరుపర్వతము, చాప = విల్లుగాఁగల = శివునియొక్క, నూపుర = అందియయగు నాదిశేషునియొక్క, వచః=వాక్కులవంటి వాక్కులయొక్క, గాంభీర్య = ప్రౌఢిమయొక్క, లీలా = విలాసమునకు, ఆస్పదా = స్థానమగువాఁడా! బంగా...నిలా - బంగా, ళాంగ, కళింగ (ములను దేశములయొక్క) భూప = రాజులయొక్క, సుభట=మంచిబంటు లను, అభ్రశ్రేణి = మేఘపంక్తికి, ఝుంఝూనిలా=పెద్దగాలియగువాఁడా! (ఈ విశేషణము లన్నియుఁ గృతిపతి యగు కృష్ణరాయనికిఁ జెందుచున్నవి.) రూపకము.

గంగాజలము స్వచ్ఛతాసాంద్రముగాన కీర్తితో నుపమింపఁబడెను. ఇటులె శ్రీనాథుఁడును గొండొకచో "సాటిచవలేటిసీటికిహాటకగర్భునివధూటికి...విశదయశంబుల్" అని చెప్పెను. శేషుఁడు సహస్రముఖుఁడుగాన నాతనివచోగాంభీర్య మసమాన మైనది. రాయలంతటి వచోగాంభీర్యము గలవాఁడనుటకు నిరంకుశప్రతికళాప్రౌఢిప్రియంభావుకత్వము సాధనము.

తా. చంద్రమండలమువఱకు వ్యాపించిన గంగయందలి యలలవలెఁ దెల్లనైనకీర్తిగలవాఁడవును, ఎల్లవిద్యలందునుగల మిక్కుటమయిన పాండిత్యముచే మేలొందినవాఁడవును, ఆదిశేషునివాగ్వైఖరివంటివాగ్వైఖరి గలవాఁడవును, అంగకళింగబంగాళదేశముల రాజుల సేనలను గెలిచినవాఁడవునైన కృష్ణదేవరాయా! అలం. ఉపమాతిశయోక్తి నిదర్శనారూపకములు.

క. మండలికతపనశోభిత, కుండలిపతిశయనకర్ణకుండలితఃసా

ఖండకవికావ్య దిగ్వే, దండశ్రుతిదళనకలహతాడితపటహా.

టీ. మండ...భిత-మండలికతపన = (సామంతరాజులకు సూర్యుఁడు) అను బిరుదముచే, శోభిత = ప్రకాశించువాఁడా! కుండలి...కావ్య-కుండలిపతి=ఆదిశేషుఁడు, శయన = సెజ్జగాఁగల విష్ణువి, కర్ణ=చెవులకు, కుండలిత = కుండలములుగాఁ జేయఁబడిన, రసాఖండ=శృంగారాది రసములతో చెడ తెగని, కవి=కవులయొక్క, కావ్య=కావ్యములుగలవాఁడా! దిగ్వేదండ...పటహా = దిగ్వేదండ = దిగ్గజములయొక్క, శ్రుతి=చెవులను, దళన = పగులగొట్టునట్టి, కలహతాడిత = యుద్ధములందు మ్రోయింపఁబడిన, పటహా = తప్పెటలుగల వాఁడా!

మండలికుఁ డనఁగా వింశతియోజనముల (ఇరువదియామడల) విశాలమైనభూమిని బరిపాలించువాఁడు, తనకంకితముగాఁ గాక వేంకటేశ్వరాంకితముగాఁ బెక్కుకావ్యములు కవులఁ బ్రోత్సహించి రచింపఁజేసినవాఁడనుభావము "కుండలిపతి...కవికావ్య" సమాసమునుండి గ్రహింప నగును.

తా. మండలికతపనుఁ డనుబిరుదము గలవాఁడా! విష్ణునకు శ్రవణానంద మగునట్లు కవులచే రసవంతము లగుకావ్యములఁ జెప్పించినవాఁడా! యుద్ధములందు దిగ్గజముల చెవు లదరునట్లు పటహముల మ్రోయించువాఁడా!

ఉత్సాహ. కుకురుకాశకురుకరూశకోసలాంధ్రసింధుబా
హ్లికశకాంగవంగసింహళేశకన్యకామణి
ప్రకరపాణిఘటితరత్నపాదుకాకలాంచికా
ముకురవీటికాకరండముఖ్యరాజలాంఛనా. 93

తా. కుకురు, కాశ, కురు, కరూశ, కోసల, ఆంధ్ర, సింధు, బాహ్లిక, శక, అంగ, వంగ, సింహళ (దేశములను), ఈశ = ప్రభువులయొక్క, కన్యకామణి = కన్యారత్నములయొక్క, ప్రకర = సమూహముయొక్క, పాణి = హస్తములందు, ఘటిత = తాల్పఁబడిన, రత్నపాదుకా = మణిమయపాదిగిన

పావకోష్ఠ, కలాచికా = తమ్మపడిగము, ముకుర = అద్దము, పీటికాకరండ = తాంబూలపుఁ బెట్టె, ముఖ్య = మొదలగు. రాజలాంఛనా = రాజచిహ్నములు గలవాఁడా!

తా. కుకురుకాశాదిదేశములరాజుల నోడించి, కొనివచ్చినవారి కన్నెలం తమ్మపడిగము పావకోష్ఠ మొదలగువానిని దాల్పఁగా రాజలాంఛనములతోఁ నొప్పారువాఁడా!

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస శఠకోపతాపసప్రసాదాసాదితచతుర్విధకవితామతల్లికాల్లసానిచొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్యప్రణీతంబైన స్వారోచిషమనుసంభవం బను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము. 84

టీ. శ్రీమ...ప్రణీతంబు - శ్రీమత్ = విద్వత్త్వసంపదగల, ఆంధ్రకవితాపితామహ = ఆంధ్రకవిత్వమునకు బ్రహ్మయును, సర్వతోముఖ = అంతట వ్యాప్తిగల, అంక=బిరుదుగల్గినట్టియును, పంకజాక్ష = విష్ణునియొక్క, పాదాంబుజ=పాదపద్మములకు, అధీన=వశమైన, మానసేందిందిర = మనస్సనెడు తుమ్మెద గలట్టియును, నందవరపురవంశోత్తంస = నందవర మనెడి యూరివారివంశమున (నందవరీకకులమున) శ్రేష్ఠుఁ డగునట్టియుం, శఠకోపతాపస = శఠకోపయతియొక్క, ప్రసాద=కృపచే, ఆసాదిత = పొందఁబడిన, చతుర్విధ=నాల్గువిధములగు (బంధ, చిత్ర, గర్భ, ఆశు కవనములు), కవితామతల్లిక = శ్రేష్ఠకవిత్వముగలట్టియుం, అల్లసానిచొక్కయామాత్యపుత్త్ర = అల్లసానిచొక్కయమంత్రికిఁ గుమారుఁ డగునట్టియుం, పెద్దనార్య = పెద్దనార్యునిచే, ప్రణీతంబు = రచియింపఁబడినది. మహాప్రబంధంబునందుక్ = మహాకావ్యమందు, ప్రథమాశ్వాసము.

ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనాసమాసాదితాఖండసాహితీధురీణుండు నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్లవంశపయోరాశిరాకాసుధాకరుండు నగురామస్వామిశాస్త్రిచేత ననేకపూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులం బర్యాలోచించి రచింపఁబడిన రుచిసమాఖ్యానం బగువ్యాఖ్యానంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీరస్తు

# మనుచరిత్రము.

## సటీకము

---

### ద్వితీయాశ్వాసము

శ్రీఖండశీతనగమ
ధ్యాఖండక్షోణిమండలాఖండల వి
ద్యాఖేలనభోజ సుధీ
లేఖద్రుమ కృష్ణరాయ లీలామదనా. 1

టీ. శ్రీఖండ...ఖండల-శ్రీఖండశీతనగ=మలయపర్వతముయొక్కయు, హిమవత్పర్వతముయొక్కయు, మధ్య=నడుమనుండు, అఖండ = వేఱులేని క్షోణిమండల = భూమండలమునకు, ఆఖండల = ఇంద్రుఁడవగు వాఁడా! విద్యా...భోజ-విద్యా = విద్యలయందు, ఖేలన = విహరించుటలో, భోజ = భోజుఁడవగు వాఁడా! సుధీలేఖద్రుమ = పండితులకుఁ గల్పవృక్షమగు వాఁడా! లీలామదనా=విలాసములందు మన్మథుఁడవగు వాఁడా! ఇది కృతిపతికి సంబోధనము. అవధరింపు మను పైవచనముతో నన్వయము.

తా. మలయపర్వతమునకును హిమాలయమునకును మధ్యగల భూభాగమంతయుఁ బాలించువాఁడును విద్యావినోదములయందు భోజునివంటివాఁడును బండితులకుఁ గల్పవృక్షమువంటివాఁడును, జక్కఁదనమునను మన్మథుని వంటివాఁడు నగు కృష్ణదేవరాయా!

వ. అవధరింపుము జైమినిమునీంద్రునకుం బ్రజ్ఞాసాంద్రంబులగు
పక్షీంద్రంబు లవ్వలికథ యిట్లని చెప్పం దొడంగె. 2

టీ. అవధరింపుము=వినుము. జైమినిమునీంద్రునకున్ = జైమినియను శ్రేష్ఠునితో, ప్రజ్ఞాసాంద్రంబులు = బుద్ధిచే నతిశయించినవి, అగుపక్షీంద్రంబులు = అగునట్టి ధర్మపక్షిశ్రేష్ఠములు, అవ్వలికథన్ = ఆవలికథను, ఇట్లని = ఈరీతిగా చెప్పినవిధముగా, చెప్పదొడంగెన్ = చెప్పనారంభించెను.

చ. అటఁ జని కాంచె భూమిసుతుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్స్వన
స్ఫుటనటనానుకూలపరిఫుల్లకలాపకలాపిజాలమున్
గటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్. 3

టీ. భూమిసుతుఁడు = ప్రవరుఁడు, చని=సిద్ధపాదుకలవలనఁ బావలేపము చేఁబోయి, అటన్=అక్కడ, అంబర...జాలమున్-అంబర = ఆకాశమును, చుంబి=తాఁకుచున్న, శిరః = కొనలనుండి, సరత్ = ప్రవహించుచున్న, ఝరీపటల=సెలయేళ్ల మొత్తమునందు, ముహుర్ముహుః=మాటిమాటికి, లుఠత్ = దొరలుచున్న, అభంగ=అడ్డులేని, తరంగ = తరఁగలనెడి, మృదంగ=మద్దెలల యొక్క, నిస్స్వన=ధ్వనిచే, స్ఫుట=వెల్లడియగుచున్న, నటన = నాట్యమునకు, అనుకూల=తగినట్లుగా, పరిఫుల్ల = విచ్చఁబాఱిన, కలాప = పింఛములుగల, కలాపిజాలమున్=నెమిళ్లసమూహముగలదానిని, కటక...సాలమున్-కటక = పర్వతమధ్యదేశమున, చరత్=సంచరించు, కరేణు = ఆఁడుఏనుఁగులయొక్క, కర=తుండములచే, కంపిత = కదల్పఁబడిన, సాలమున్ = చెట్లుగలదానిని, శీతశైలమున్=హిమవత్పర్వతమును, కాంచెన్=చూచెను.

సెలయేళ్లప్రోత మిక్కుటముగా నుంట ఆకాశము నంటు శిఖరముల నుండి దొరలుటవలన, పింఛములు విప్పినటించుచున్నవి గాన కలాపివద్రమో
గము సరసతరము. నెమిళ్లనటనము తాళముల కనుకూలముగా నుండును. ఏనేవి

మ్రోఁత వినవచ్చినంతన యది మేఘధ్వని యని నెమిళ్లు నృత్యము చేయును. నెమిళ్లయాట తాళానుకూల మనుటకు—

శ్లో. "తాళైశ్శింజావలయసుభగైర్నర్తితః కాన్తయా మే
యామధ్యాస్తే దివసవిగమే నీలకణ్ఠః సుహృద్వః." ఉ. మేఘసందేశము.

శ్లో. "భ్రమిషు కృతపుటాన్తర్మణ్డలావృత్తిచక్షుః
ప్రచలితచతురభ్రూతాణ్డవైర్మణ్డయన్త్యా
కరకిసలయతాళైః కాన్తయా నర్త్యమానం
సుతమివ మనసా త్వాం వత్సలేన స్మరామి." ఉత్తరరామచరిత్రము.

తా. అట్లు ప్రవరాఖ్యుఁడు పోయి హిమవత్పర్వతమును జూచెను. అం దాకాశము నంటుశిఖరాగ్రములనుండి ప్రవహించు సెలయేర్లయలల చప్పుళ్లు మద్దెళ్ల మ్రోఁతలవలె వినఁబడఁగాఁ బింఛములను విచ్చుకొని యా ధ్వనికిఁ దగినట్లు నెమిళ్లాడుచున్నవి. దానినడిమిప్రదేశములందు గజములు తొండములతోఁ జెట్లను బట్టి యూఁగులాడించుచున్నవి. రూపకాలంకారము.

వ. కాంచి యంతరంగంబునఁ దరంగితంబగు హర్షోత్కర్షంబున. 4

టీ. కాంచి=చూచి, అంతరంగంబునన్=మనస్సునందు, తరంగితంబు=పొరలుచున్న, హర్షోత్కర్షంబునన్ = సంతోషాతిశయముచే.

క. నరనారాయణచరణాం
బురుహద్వయభద్రచిహ్నముద్రితబదరీ
తరుషండమండలాంతర
సరణిన్ ధరణీసురుండు సనఁ జన నెదుటన్. 5

టీ. ధరణీసురుండు=బ్రాహ్మణుఁ డగు ప్రవరాఖ్యుఁడు, నరనా...సరణిన్-నరనారాయణ = నరుఁడు నారాయణుఁడు ననుఋషులయొక్క, చరణాంబురుహ=పాదపద్మములందలి, భద్రచిహ్న = శుభచిహ్నలచే, హల కులిశాంకుశాదిరేఖలు మిగుల శుభమైనవిగాన నిట్టిరేఖలగుర్తులచే ననుట.

ముద్రిత=గుఱుతులుగలవిగాఁ జేయఁబడిన, బదరీతరు = రేఁగుచెట్లయొక్క, షండ=సమూహముయొక్క, మండల=ఆవరణరూప ప్రదేశముయొక్క, సరణిన్=మార్గమున, చనఁజనన్ = పోఁగాఁబోఁగా, (వైపద్యముతో నన్వయము.) ఎదుటన్=ముందుభాగమున.

తా. ఆ ప్రవరుఁడు నరనారాయణు లనుమహర్షులు తపస్సు చేసిన బదరీవనము గాంచి దానినడిమి త్రోవను బోఁగాఁబోఁగా.

క. ఉల్లలదలకాజలకణ
పల్లవితకదంబముకుళపరిమళలహరీ
హల్లోహలమదబంభర
మల్లధ్వను లెసఁగ విసరె మరుదంకురముల్. 6

టీ. ఉల్లల...మల్లధ్వనులు-ఉల్లలత్=మీఁదికి లేఁగుచున్న, అలకా = అలక యనునదియొక్క, జలకణ = నీటిబిందువులచే, పల్లవిత = చిగిర్చిన, కదంబ = కడిమిచెట్లయొక్క, ముకుళ = మొగ్గలయొక్క, పరిమళలహరీ = సౌరభప్రవాహమునందు, ఈహాత్=అభిలాషగల వగుచున్నట్టియు, లోహాల= అవ్యక్తధ్వనులుగల, అలకానదియొడ్డున నున్న కడిమిచెట్టుల పూఁదేనె గ్రోలి కోడెతుమ్మెదలు పైపైన నవ్యక్తమధురముగా ధ్వనులు చేయుచుండెను. మద బంభరమల్ల=మదించిన గండు తుమ్మెదలయొక్క, ధ్వనులు, ఎసఁగన్ = మీఱఁగా, మరుదంకురముల్ = చిఱుదెమ్మెరలు, విసరెన్=వీచెను.

కదంబము నీటికడఁ బెఱుగునది. కావుననే యేటియొడ్డునఁ గడిమి చెట్లున్నటులఁ జెప్పఁబడును.

శ్లో. "జంబూవేతసవానీరకదంబోదుంబరార్జునాః
బీజపూరకమృద్వీకా లకుచాశ్చ సదాడిమాః
వంజులో నక్తమాలశ్చ తిలకః పనసస్తథా
తిమిరో మ్రాతకశ్చైవ షోడశానూపజాః స్మృతాః." బృహత్సంహిత.

వానచినుకులకుఁ గడిమి పూఁతఁ బూయును.

శ్లో. "నీపం దృష్ట్వా హరితకపిశం కేసరై రర్ధరూఢై
రావిర్భూతప్రథమముకుళాః కన్దళీశ్చానుకచ్ఛం
... ... ...
సారంగాస్తే జలలవముచః సూచయిష్యంతి మార్గమ్." మేఘసందేశము.

"నీపకుసుమాదికం దృశ్యతే తత్రతత్ర త్వయా (మేఘేన) వృష్ట మిత్యనుమీయత." వ్యాఖ్య.

వానచినుకులకుఁ బూచునట్లు అలకాజలకణములచేఁ గడిమిచెట్లు పూచె నని భావము.

తా. అలకానదినీటితుంపురులు పైపైఁ బడుచుండుటచేఁ జిగిర్చిపూచిన కడిమిపూలమకరందమును ద్రావి పొగరు రేఁగినతుమ్మెదలఝుంకారములతో మెల్ల మెల్లఁగాఁ జల్లగాలి వీచెను.

సీ. తొండముల్సాఁచి యందుగుఁజిగుళ్లకు నిక్కి
కరులదంతచ్ఛాయ గడలుకొనఁగ
సెలవుల వనదంశములు మూఁగి నెఱవెట్టఁ
గ్రోల్పులుల్ పొదరిండ్ల గుఱక లిడఁగ
సెలయేటియిసుకలంకల వరాహంబులు
మొత్తంబులై త్రవ్వి ముస్తె లెత్త
నడ్డంబు నిడుపు నాఁబడ్డలగతి మనుఁ
బిల్లు డొంకలనుండి క్రేళ్లు దాఁటఁ

తే. బ్రబలభల్లూకనఖభల్లభయదమథన
శిథిలమధుకోశవిసరవిశీర్ణమక్షి
కాంతరాంతరదంతురితాతపమునఁ
బుడమి తిలతండులన్యాయమున వెలుఁగ, 7

టీ. తొండముల్ = తొండములను, చాఁచి = సాగించి, అందుఁగుఁజిగుళ్లకున్ = అందుగు చెట్లయొక్క లేఁతచూఁటలకొఱకు, నిక్కి = సాగఁబాఱి, మునికాళ్లతోనుండి నిలుచుండినట్టి, కరులదంతచ్ఛాయ = ఏనుగులదంతముల కాంతి, కడలుకొనఁగన్ = విస్తరించఁగా, ఏనుఁగుతుండము వ్రాలియున్నంత వఱకు దంతకాంతులు క్రిందిగాఁ బ్రసరింపవీలుండదు. సాఁచి చిగుళ్లకు నిక్కినప్పుడు దంతములకాంతి ప్రసరించును. (అందుగు చిగుళ్ల నందుకొనుటకై నిక్కి తొండములు సాఁచుగజములదంతములకాంతి నలువైపుల వ్యాపించుచున్న దనుట.) సెలవ్రేన్ = పెదవ్రేకొనలందు, వనదంశములు = అడవి యీఁగలు, మూఁగి సెలవెట్టన్ = సందు చేయఁగా, క్రొల్పులుల్ = పెద్దపులులు, పొదరిండ్లన్ = తీఁగెల్లుకొని యుండ్లవైనందు పొదలయందు (నికుంజములందు), గుఱక లిడఁగన్ = గురకపెట్టి నిదురఁబోవుచుండ, (సెలవులు పొలసుకంపులయుటచే తీఁగలు మూఁగి తొలుచుచుండెను. నిద్రామాంద్యముగాన నొడలెఱుంగవయ్యెను.) అడవియీఁగలు మూఁగి సెలవులకడఁ దొలుచుచుండఁగాఁ బెద్దపులులుమాంసము దిని మత్తెక్కి పొదరిండ్లలో గుఱకలు పెట్టుచున్నవనుట.) సెలయేటియిసుక లంకలన్ = సెలయేళ్లలోని యిసుకదిబ్బలందు, వరాహంబులు = అడవిపందులు మొత్తంబులై = గుంపులై, త్రవ్వి = నేలయంతము ముట్టెతోఁ బెకలించి, ముస్తెలు = తుంగగడ్డలు, ఎత్తన్ = కోరతోఁ బైకెత్తుచుండ, (ఏటిలంకలలో నడవిపందులు గుంపులు గుంపులుగాఁ గూడి తుంగముస్తెలను పెల్లగించుచున్న వనుట.) అడ్డంబు, నిడుపును (గల), ఆఁబడ్డలగతిన్ = ఆవుపెయ్యలవలె, మనుఁబిళ్లు = ఆఁడుమన్నులు (ఒకవిధమైన మృగములు) డొంకలనుండి = నడచుటచేఁ బల్లముగామాఱిన త్రోవలనుండి, క్రేళ్లుదాఁటన్ = దుముకులాడఁగా, (మనుఁబిళ్లు అన నాఁడుమన్నులు; అవియే డొంకల దుముకుచుండ నీశ మగవానిని గూర్చి చెప్పఁబనిలేదు. ఆఁడుదే యావుపడ్డయంతయుండ మగదెంతయుండునో చెప్పం దరముగాదు) ప్రబల...కపములన్ - ప్రబల = పొగరురేఁగిన, (మిగులబలముగల) భల్లూక = ఎలుఁగుగొడ్డయొక్క. నఖభిల్ల = బల్లెములవంటి

గోళ్లయొక్క, భయద = భయముకలిగించునట్టి, మథన = చిదుముటలచే, (త్రచ్చుటచేత) శిథిల = తునిఁగిన, మధుకోశవిసర = తేనెతుట్టెలసమూహము నుండి, విశీర్ణ = రేఁగిన, మక్షికా = ఈఁగలయొక్క, అంతరాంతర = నడుమ నడుమ, దంతురిత = దట్టమైన, ఆతపమునన్ = ఎండచేత, పుడమి = భూమి, తిల తండులన్యాయమునన్ = నువ్వులు బియ్యము కలసినవిధమున (ఎలుఁగుగొడ్డు తమగోళ్లతోఁ దేనెతుట్టెలను జిదుమఁగొట్టఁగా నీఁగలు రేఁగి తిరుగుచుండుటచే నెండలో వానినీడ లేర్పడి నూవులు బియ్యము కలియఁబోసినట్లు నేల యుండె నని భావము.) వెలుఁగన్ = ప్రకాశించుచుండ, మీఁదిపద్యము లోని పరికించున్ అను క్రియతో నన్వయము.

అందుగుచివుళ్లు ఏనుఁగులకుఁ బ్రియ మగునాహారము,

శ్లో. "సీతాదేవ్యాస్స్వకరకలితైస్సల్లకీపల్లవాగ్రై
రగ్రే లోలః కరికలభకో యః పురా పోషితోఽభూత్."
ఉత్తరరామచరిత్రము, అం. 3. సల్లకీపల్లవ మన యందుగు చివురు.

ఎలుగుబంటిగోళ్లు బలమైనవియుఁ బల్లెములవలె వాఁడియుఁ బొడవును గలవి గావున నవి తేనెతెట్టెల పట్టి యొరయుట భయంకరముగ నుండె ననుట. తేనెటీఁగలకుఁ దేనెపెర కోశము (ధనరాశి), అది విరోధిస్వాధీనమగుటచే సురక్షితముగ బయటపడి వనమునంతటను దుమ్మెదలు గలయ నల్లుకొనెను. వానినీడ వెలుఁగు గలసి తిలతండులన్యాయమును భూమికిఁ జేకూర్చెను.

తా. ఏనుఁగు లందుగుచిగుళ్లకై నిక్కి తొండములు చాఁచునప్పుడు వాని దంతముల కాంతు లతిశయించుచుండె ననియు, పెద్దపులులు నిద్రపోవుచుండఁగా వాని పెదవులమూలలఁ గాఱెడిజొల్లునకు నడవియీఁగలు ముసురుకొనుచుండె ననియు, పందులు సెలయేళ్లలోని యిసుకదిబ్బలు త్రవ్వి తుంగగడ్డలు పెల్లగించి తినుచుండె ననియు, ఋశ్యమృగములు బలిసిన యావుపెయ్యలవలె డొంకలయందు దుముకులాడుచు మెలఁగె ననియు, ఎలుఁగుగొడ్డు పుట్టలను గోళ్లతోఁ బెల్లగింపఁగా వానిలోఁ జెట్టెలు పెట్టియున్న తేనెటీఁగలు రేఁగి

యాడుచుండె ననియు, వానినీడలు నల్లగాను వాని నడుమనడుమ వ్యాపించు నట్టి యొండపొడలు తెల్లగాను గనఁబడుటచే నువ్వులు బియ్యము వెదచల్లిన ట్లుండె ననియు భావము.

క. పరికించుచు డెందంబునఁ
బరికొనుకౌతుకముతోడ భూమీసురుఁ డ
గ్గిరికటకతటనిరంతర
తరుగహనగుహావిహారతత్పరమతి యై. 8

టీ. పరికించుచున్=చూచుచు, డెందంబునన్ = మనస్సునందు, పురికొనుకౌతుకముతోడన్=అతిశయించు కుతూహలముతో, భూమీసురుఁడు = బ్రాహ్మణుఁడు (ప్రవరుఁడు), అగ్గిరి...మతియై-అగ్గిరి = ఆపర్వతముయొక్క, కటకతట=నడిమిప్రదేశమందును ప్రక్కలందును, నిరంతర = సాంద్రము లైన, తరు=వృక్షములుగల, గహన = అడవులయందును, గుహా = గుహాలయందును, విహార=విహరించుటయందును, తత్పర=ఆసక్తిగల, మతియై = బుద్ధిగలవాఁడై, శైలమధ్యభాగమునందు చెట్లు మిగుల దట్టముగా నుండెను. గుహాలు దర్శనీయములుగా నుండెను. కాన విహారకుతుక మతిశయించెను. తరువులు నిరంతరములుగా నుంటచే గుహాలు కటకప్రదేశమున కేఁగినఁగాని కనుపట్టకున్నవనిభావము.

సీ. నిడుదపెన్నెఱిగుంపు జడగట్ట సగరుము
మ్మనుమండు తపము గైకొనినచోటు
జరఠకచ్ఛపకులేశ్వరువెన్ను గానరా
జగతికి మిన్నేఱు డిగినచోటు
పుచ్చడీకతనంబు పోఁబెట్టి గిరికన్య
పతిఁ గొల్వ నాయాసపడినచోటు
వలరాచరాచవాఁ డలికాక్షుకనువెచ్చఁ
గరఁగిన యలకనికరపుఁజోటు

తే. తపసియిల్లాండ్ర చెలువంబు దలఁచి తలఁచి
మున్ను ముచ్చిచ్చును విరాళిఁగొన్నచోటు
కనుపపులు వేల్పుఁబడ వాలుఁ గన్నచోటు
హర్షమునఁ జూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన. ౯

టీ. ప్రవరాఖ్యుఁడు = ప్రవరుఁడను పేరుగల బ్రాహ్మణుఁడు (కర్త), నిడుదవెన్నెలగుంపు=నిడుపయి నిగనిగలుగలతెలవెండ్రుకల ప్రోవు, జడగట్టన్ = పెనఁచుకొనిపోవునట్లు, సగరుమనుమండు = భగీరథుండు, తపము = తపస్సును, కైకొనినచోటు=పూనిన ప్రదేశము, జరఠ...వెన్ను-జరఠ = ముదివాఁడగు, కచ్ఛపకులేశ్వరు = తాఁబేటిదొర (ఆదికూర్మము) యొక్క, వెన్ను = వీఁపు, కానరాన్ = అగపడునట్లు, గంగ హిమగిరినుండి పడుటచే ధారాపాతమున భూమి విచ్చి భూమివహించిన యాదికూర్మము మూఁపు కనిపించెననుట. మిన్నేఱు = ఆకాశగంగ (ప్రవాహముపడునరపడికి భూమి యంతపలుమఁ జెగిరె ననుట). డిగినచోటు = అవతరించిన ప్రదేశము. పుచ్చడీకతనంబు = స్నిగ్ధరికతనమును, పోఁజెట్టి = తొలఁగఁద్రోసి, గిరికన్య = పార్వతి, పతిన్ = భర్తను (శివుని), కొల్వన్ = సేవించుటకు, ఆయాసపడినచోటు=శ్రమపడిన ప్రదేశమును, పలరాచరాచవాఁడు = మన్మథుఁడను క్షత్రియుఁడు, అలికాక్షుకనుపెచ్చున్ = ఫాలనేత్రుని (శివుని) కంటిమంటచే, కరఁగిన = క్రగ్గిపోయిన, ఆలకనికరపుఁ జోటు=అజాలిగలిగించుతావు, తపసియిల్లాండ్ర చెలువంబున్=సప్తర్షిస్త్రీలచక్కందనము, తలఁచితలఁచి=స్మరించి స్మరించి, (మునిపత్నులఁ గామించుట యయుక్తమని యూహించి యెట్టకేలకు సాహసించి) ముచ్చిచ్చును, (గార్హపత్య, ఆహవనీయ, దక్షిణాగ్నులు అను) మూఁడగ్నులను, విరాళి=మోహము, కొన్నచోటు = పొందినయట్టి ప్రదేశము, కనుపపులు=రెల్లుగడ్డి, వేల్పుఁబడవాలున్ = దేవతల సేనాధిపతిని (కుమారస్వామిని), కన్నచోటు = ప్రసవించిన ప్రదేశమును, హర్షమునన్ =

సంతసముతో, చూచి=సందర్శించి, ఆత్మలోనన్ = తనమనస్సునందు, మీఁది పద్యముతో నన్వయము.

తా. భగీరథుఁడు తపస్సు చేసినచోటును, ఆకాశగంగ భూమి కవతరించినప్రదేశమును, పార్వతి శివునకు శుశ్రూష సల్పినప్రదేశమును, మన్మథుఁడు శివునికంటిమంటచే నీఱైనట్టి జాలి గల్పించుప్రదేశమును, అగ్నిదేవుఁడు సప్తర్షులకాంతలపై మోహముఁ జెందినప్రదేశమును, కుమారస్వామి జననము చెందినపెల్లుదుబ్బులను జూచి సంతోషించి ప్రవరుఁడు తనలో.

చ. విలయకృశానుకీలములవేఁడిమిఁ బోఁడిమిమాలి వెల్మిడిన్
గలసినభూతధాత్రి మఱి క్రమ్మఱ రూపయి నిల్చి యోషధుల్, మొలవఁగఁ జేయునట్టినయముల్ ప్రతికల్పము నెట్లు గాంచునీ, చలిమలపల్ల నుల్లసిలుచల్లఁదనంబును నూనకుండినన్.

టీ. విలయ...వేఁడిమిన్ - విలయ = ప్రళయకాలపు, కృశానుకీలముల = అగ్నిజ్వాలలయొక్క, వేఁడిమిన్ = వేఁడిచే, పోఁడిమిమాలి=రూపుమాసి, వెల్మిడిన్=భస్మమున, కలసిన = కలసిపోయిన, భూతధాత్రి=భూమి, క్రమ్మఱన్=తిరిగి, రూపయి = ఆకారమేర్పడి, నిల్చి=ఎప్పటివలె నిలువఁబడి, ఓషధులు=వృక్షలతాదిమూలికలు, మొలవఁగన్ = మొలచునట్లుగా, చేయునట్టి=చేయఁగాఁగల, నయముల్=మంచిని, ప్రతికల్పమున్=ఒక్కొక సృష్టిప్రారంభకాలమునను, ఈచలిమలపల్లన్ = ఈహిమవత్పర్వతమువలన, ఉల్లసిలుచల్లఁదనంబును=ఉప్పతిలునట్టిశైత్యమును, ఊనకుండినన్=పొందకుండినచో, ఎట్లు=ఏవిధముగా, కాంచున్ = పొందును. వెలి+మిడుఁగు=వెలిమిడి, దీని ప్రాస్వరూపము వెల్మిడి. వెల్మిడియన బూదియనుటకు.—

సీ. “తగనాధునకును నద్దంబు చూపినయట్లు
వెలిమిడిలో నెయ్యి వేల్చినట్లు” పంచతంత్రము.

తా. ప్రళయకాలమున మహాగ్నిజ్వాలలచేఁ గాలి భస్మమైపోయిన భూమి యాహిమవత్పర్వతపుఁజలువఁ గొనక యుండినచో, మరల రూపుచెంది తరుగుల్మలతాదులను మొలిపించుకొనఁజాలదు. కావ్యలింగము.

సీ. పసుపునిగ్గులు దేఱుపాఁపజన్నిద మొప్పఁ
ప్రమథాధిపతి యింటిపట్టెఱింగె
శచి కేఁతగఱపుచుఁ జదలేట సురరాజు
జలకేళిసవరించు చెలువెఱింగె
సదనుతోఁ జేఁపి ఛన్నవిసి యోషధుల మ
న్నాదవు కొండల కెల్లఁ బిదుక నెఱిఁగె
వేల్పుటింతులలోన విఱ్ఱవీఁగుచు మేన
నవరత్నరచనలరవణ మెఱిఁగెఁ
తే. బరిపరివిధంపుఁజన్నంపుబరికరంపు
సొంపుసంపద నిఖిలనిలింపసభయు
నప్పటప్పటికిని జిహ్వాత్రుప్పి దుల్ల
నామెత లెఱింగె నీతుషారాద్రికతన. 11

టీ. ఈతుషారాద్రికతనన్ = ఈమంచుకొండమూలమున, ప్రమథాధిపతి = శివుఁడు, పసుపునిగ్గులు = పసుపుకాంతులు, తేఱుపాఁపజన్నిదము = తేటగాఁగన్పడుసర్పయజ్ఞోపవీతము, ఒప్పన్ = ఒప్పునట్లు, బ్రహ్మచర్యాశ్రమధర్మమును నిర్వర్తించుచు ననుట, ప్రమథాధిపతి = ప్రమథులగణమున కధిపతియగు శంకరుఁడు, ఇంటిపట్టు=గృహస్థధర్మము, ఎఱిఁగెన్=తెలిసికొనెను. (హిమవంతుఁడు కూఁతు నిచ్చుటచే, శివునకుఁ దనసర్పయజ్ఞోపవీతమునకుఁ బసుపంటుకొని పచ్చనకాఁగా గృహస్థత్వ మలవడెననుట.) (పా. పసుపునిగ్గులు మీఱు=పసుపుకాంతు లతిశయించు) సురరాజు=ఇంద్రుఁడు, శచికిన్ = శచీదేవికి, ఈఁతగఱపుచున్=ఈఁతనేర్పుచు, చదలేటన్ = ఆకాశగంగలో, జల

కేళి=జలవిహారములు, సవరించుచెలువు = కావించుపొల్పును, ఎఱింగెన్ = పొందెను. (ఆకాశగంగ హిమవత్పర్వతమునఁ బ్రవహించుటచే నందు శచితో నింద్రునకు జలక్రీడగావింప వసతిపడియె ననుట.) మన్మోదవు=గోరూపిణియగు భూదేవి, అదనుతోన్ = సమయమున, చేఁపి, చన్నవిసి = మొనవిరియించి, అంటినంతనస్రవించునటుల, కొండలకెల్లన్, ఓషధులన్=లతాగుల్మాదులను, పిదుకనెఱిఁగెన్ = పిండుట తెలిసికొనెను. ఈయంశము కుమారసంభవములోని ప్రథమసర్గమునం దీక్రిందిశ్లోకమునందుఁ జెప్పఁబడెను. విష్ణుపురాణభాగవతాదులం దీకథాంశము సుప్రసిద్ధము. శ్లో. "యం సర్వశైలాః పరికల్ప్య వత్సం మేరౌ స్థితే దోగ్ధరి దోహదక్షే, భాస్వంతి రత్నాని మహౌషధీశ్చ పృథూపదిష్టాం దుదుహుర్ధరిత్రీం." (భూమి గోరూపమును దాల్చినప్పుడు హిమవంతుఁడు దూడయై చేఁపు తెప్పించుటచేతనే యోషధులనెల్ల కొండలకుఁ బిదుకనయ్యెననుట.) మేన=మేనకయనునచ్చర, వేల్పుటింతులలోనన్=దేవతాస్త్రీలలో, బిట్టుమీఁగుచున్=మిగులనిక్కుచు, నవరత్న=(వజ్ర, వైడూర్య, నీల, గోమేధిక, మరకత, మాణిక్య, పుష్పరాగ, మౌక్తిక, ప్రవాళములను) తొమ్మిది తెఱఁగుల మణులయొక్క, రచనలరవణములు=చెక్కడములుగలనగలను, ఎఱిఁగెన్ (మేనక హిమవంతునిభార్య గావున ననేక రత్నములగనులు గలహిమవంతుఁడు తనభార్యకు రత్నాభరణముల నించుటచే నామె దేవతాస్త్రీలలో బిట్టుమీఁగుచున్నదనుట.) నిఖిలనిలింపసభయున్ = ఎల్లదేవతాసమూహమును, పరి...సంపదన్-పరిపరివిధంపు = నానావిధములైన, జన్నంపు = యజ్ఞములయొక్క, పరికరంపు=సాధనములయొక్క, సొంపుసంపదన్ = మేలిమికలుగుటచే, అప్పటప్పటికిన్=అప్పుడప్పుడు, జిహ్వాత్రుప్పు = నాలుకకుఁ గల్గినరోఁత (పా. జిహ్వాతుప్పటెల్లన్ = నాలుకయరుచిచెడఁగా) దుల్లన్=తొలఁగిపోవునట్లు, ఆమెతలు=విందుకుడుపులు, (ఎడనెడ ననేకులు హిమవంతమునఁ బలువిధములైనయజ్ఞములు చేయుటచే దేవతలకు మంచిమంచి హవిర్భాగములు చెంద నయ్యె ననుట.) ఎఱిఁగెన్. అలం. రూపకము నుదాత్తము.

హిమవంతము రత్నములకు నెల వనుట సుప్రసిద్ధము.

శ్లో. "అనంతరత్నప్రభవస్య యస్య హిమం న సౌభాగ్యవిలోపి జాతమ్."

మ. తలమే బ్రహ్మకు నైన నీనగమహత్త్వం బెన్న నే నియ్యెడన్
గలచోద్యంబులు చెప్ప గన్గొనియెదం గాకేమి నేఁడేఁగెదన్
నలినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం, దళచూ
త్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నమున్ దెల్పెడిన్.

టీ. ఈనగమహత్త్వంబు = ఈహిమవంతముయొక్క ప్రభావము, ఎన్నన్=ప్రశంసించుటకు, బ్రహ్మకునైనన్ = బ్రహ్మకునేని (నలుమోములవేలుపగు బ్రహ్మయే చేరఁడేని మనుష్యునిచేఁ గాదనుట.) తలమే = శక్యమా? ఇయ్యెడన్ = ఈహిమవంతునియందు, కలచోద్యంబులు = ఉన్నచిత్రములు, నేను, చెప్పు, కన్గొనియెదంగాకేమి=చూచెదఁగాక, నేఁడు, ఏఁగెదన్=పోవు దను. నలినీ...పరంపరల్ - నలినీబాంధవ=సూర్యునియొక్క, భాను = కిరణములచే, తప్త = తపింపఁజేయఁబడిన, రవికాంత = సూర్యకాంతమణులపైకి, స్యంది=తొరఁగుచున్న, నీహారకందళ = మంచుబొట్లవలని, చూత్కార = చూఁచూఁ అనుధ్వనియొక్క, పరంపరల్=వరుసలు, పయిపయిన్ = క్రమక్రమముగా, మధ్యాహ్నమున్=పట్టపగలగుటను, తెల్పెడిన్=తెలియఁజేయుచున్నవి.

శృంగములయెత్తుచే సూర్యబింబము కానరాదయ్యెను. మధ్యాహ్నమగుట నెండకు మంచు కరఁగుట యది ప్రజ్వరిల్లు సూర్యకాంతములపైఁబడి ధ్వనియగుట మధ్యాహ్నము గుర్తింపఁజేసెను. సూర్యస్పర్శచే సూర్యకాంతములు వేఁడిగొను ననుటకు

తే. "అర్కకాంత మచేతనంబయ్యుసవితృ, పాదములుసోఁకినంతస ప్రజ్వరిల్లు"

భర్తృహరి.

తా. ఈపర్వతముయొక్క మాహాత్మ్యమును గణింప బ్రహ్మకైనఁ దరముకాదు. సూర్యకిరణములు తాఁకి ఆవేఁడి యెక్కినసూర్యకాంతమణుల చఱియలపై మంచుబొట్టు పడి చుఁయిచుఁయి మనుట మధ్యాహ్నమగుటను దెల్పుచున్నది. నేఁటి కింటికరిగెదను. రేపు మరల వచ్చి చూడరాదా?

తే. అనుచుఁ గ్రమ్మఱువేళ నీహారవారి
బెరసి తత్పాదలేపంబు గరఁగి పోయెఁ
గరఁగిపోవుట యెఱుఁగఁ డద్ధరణిసురుఁడు
దైవకృతమున కిల నసాధ్యంబు గలదె. 13

టీ. అనుచున్=ఇటులఁ దలపోయుచు, క్రమ్మఱువేళన్ = మరలు సమయమున, నీహారవారి = మంచునీరు, బెరసి=అంటి, తత్పాదలేపంబు = అతనిపాదములకుఁ బూయఁబడినపసరుపూఁత, కరఁగిపోయెన్ = ద్రవమై యంటుకొనిపోయెను. కరఁగిపోవుటన్ = ఆవిధముగా నీరైపోవుటను, అద్ధరణిసురుఁడు=ఆబ్రాహ్మణుఁడు (ప్రవరుఁడు), ఎఱుఁగఁడు = గ్రహించినవాఁడు కాఁడు. (కాఁబట్టి), ఇలన్ = భూమిపై, దైవకృతమునకున్ = దైవము చేయుయత్నమునకు, అసాధ్యంబు = సాధింపరానిది. కలదె=కలదా? దైవము తలఁచినది యయి తీరును గాని తప్పిపోదనుట. అర్థాంతరన్యాసాలంకారము.

మ. అతఁ డట్లౌషధహీనుఁడై నిజపురీయాత్రామిళత్కౌతుకో
ద్ధతిఁ బోవన్ సపదిస్ఫుటార్తిఁ జరణద్వంద్వంబు రాకుండినన్
మతిఁ జింతించుచు నవ్విధం బెఱిఁగి హా నన్నిట్లు దైవంబ తె
చ్చితె యీఘోరవనప్రదేశమునకున్ సిద్ధాపదేశంబునన్.

టీ. అతఁడు = ఆప్రవరాఖ్యుఁడు, అట్లు=ఆవిధముగా, ఔషధహీనుఁడై=పాదలేపము లేనివాఁడై, నిజ...ద్ధతిన్ - నిజపురీ = తనపట్టణమును గూర్చి, యాత్రా=ప్రయాణమగుటయందు, మిళత్=కూడుచున్న, కౌతుకోద్ధతిన్=కుతూహలాతిశయముచే, పోవన్=ఎగిరిపోవుటకు, చరణద్వంద్వంబు =

అడుగుదోయి, సపదిస్ఫుటార్తిన్ = అప్పుడే స్పష్టమగు దుఃఖముచేఁ (సపరిస్ఫూర్తిన్ = చక్కఁగాఁదోఁచుచున్నదుఃఖముచేఁ గూడుకొనుటచేత. పా.) మతిన్=మనస్సునందు, చింతించుచున్=విచారము చెందుచు, అవ్విధంబు = అట్లెగిరిపోలేకపోవుటకుఁ గలకారణమును, హా = అక్కటా, సిద్ధాపదేశంబునన్=సిద్ధునిమిషచేత, (సిద్ధోపదేశంబునన్=సిద్ధునియుపదేశముచేత, పా.) దైవంబ=దైవమా! నన్నున్, ఇట్లు = ఈవిధముగా, ఈఘోరవనప్రదేశమునకున్ = ఈభయంకరమైన యడవినేలకు, తెచ్చితె=తీసికొనివచ్చితివా?

తొలుత దైవకృతమున కసాధ్యము లేదని నిశ్చయించుకొనెను. కావున ఘోరప్రదేశమునఁ దానుచిక్కుపడుటకు సిద్ధుఁడు నిమిత్తమాత్రుఁడు. దైవ మాపదలఁ గూర్చునెడ నొకనిని నిమిత్తమాత్రునిఁగఁ గల్పించును.

తా. ఆవిధముగాఁ బాదలేపము పోయినయాప్రవరుఁడు తన యూరికిఁ బోవుటకు నెగురలేకపోవుటచేఁ బాదలేపము కరఁగిపోయిన దని తెలిసికొని "యయ్యో! దైవమా! సిద్ధుఁడనుమిష కల్పించి నన్నీఘోరారణ్య ప్రదేశమునకుఁ గొనివచ్చితివా!" యని దుఃఖించెను. కావ్యలింగము.

క. ఎక్కడియరుణాస్పదపుర
మెక్కడితుహినాద్రి క్రొవ్వి యే రాఁ దగునే
యక్కట మును సనుదెంచిన
దిక్కిది యని యెఱుఁగ వెడలుతెరు వెయ్యదియో. 15

టీ. ఎక్కడి అరుణాస్పదపురము = అరుణాస్పదపుర మెక్కడ నున్నది, ఎక్కడితుహినాద్రి=మంచుకొండ యెక్కడ నున్నది! (దీనికి దానికి మిక్కిలి దూరముగదా!) క్రొవ్వి=మదించి, ఏన్=నేను, రాన్=వచ్చుట, తగునే = తగునా? అక్కట=అయ్యో! మును=మునుపు, చనుదెంచిన దిక్కు = ఇక్కడకువచ్చినదిశ, ఇది=ఇట్టిది, అని యెఱుఁగన్=అని తెలిసికొనఁజాలను, వెడలు తెరువు = ఇటనుండిపోయెడిత్రోవ (పా. వెడలు తెఱఁగు = బయలువెడలు విధము,) ఎయ్యదియో = ఏదోగదా!

తా. అరుణాస్పదపుర మెక్కడ ? మంచుగొండ యెక్కడ ? పొగరున నేను రాఁదగునా ? అయ్యో ! వెనుకవచ్చినవై పిది యని యెఱుఁగను. ఇంక బయలువెడలువిధ మెట్లో !

మ. అకలంకౌషధసత్త్వముం దెలియమాయాద్వారకావంతికా
శికురుక్షేత్రగయాప్రయాగములు నే సేవింప కుద్దండగం
డకవేదండవరాహవాహరిపుఖడ్గ వ్యాఘ్ర మిమ్మంచుఁగొం
డకు రాఁజెల్లునెబుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్.

టీ. అకలంకౌషధసత్త్వమున్ = నిష్కల్మషమయిన యౌషధపు సామర్థ్యమును, తెలియన్ = తెలిసికొనుటకు, మాయా...ప్రయాగములు-మాయా=మాయానగరము-హరిద్వారము, ద్వారకా = ద్వారావతీనగరము, అవంతి=ఉజ్జయినీపట్టణము, కాశి=వారణాసి, కురుక్షేత్ర = కురుక్షేత్రము, గయా=గయాక్షేత్రము, ప్రయాగ = ప్రయాగక్షేత్రము (వీనిని) నే సేవింపక = నేను సందర్శించుటకుఁ బోవక, ఉద్దండ...వ్యాఘ్రము - ఉద్దండ = భయంకరములైన, గండక = గండమృగములు, వేదండ=ఏన్గులు, వరాహ = అడవిపందులు, వాహరిపు=అడవిదున్నలు, ఖడ్గ=ఖడ్గమృగములు, వ్యాఘ్రము= పెద్దపులులు కలది (ఖడ్గగండకశబ్దము లేకార్థవాచకము లయ్యు నిందు వేఱుగాఁ బ్రయోగింపఁబడుట కాధారము కానము.) ఇమ్మంచుఁగొండకున్ = ఈ హిమవత్పర్వతమునకు, రాఁ జెల్లునె = వచ్చుట తగునా ? శ్రోత్రియుల్ = వేదము చదివి కర్మముల నాచరించువారు, బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా = బుద్ధిమాంద్యముచేఁ గల్పింపఁబడిన వెఱ్ఱితనము గలవారు గదా ! అర్థాంతరన్యాసాలంకృతి.

వేదము పఠించినవారికి బుద్ధివికాస ముండదు. కాళిదాసు విక్రమోర్వశీయమున "వేదాభ్యాసజడః" అనెను. కేవలపఠనము ప్రతిభాదాయకము

కాదనుట. గండక = అనుచో స్వార్థమందు కప్రత్యయమనియుం గండయన స్థూలశిలలుగాన ఉద్దండగండక=భయంకరములగు శిలలపై నున్న అని చెప్పుచున్నారు. సమర్థకములగు గండకఖడ్గముల కేకార్థముచెప్పుటకంటె నిదియే సముచితము.

ఖడ్గవ్యాఘ్రము...ఇమ్మంచుకొండకు

అనుచో బాలవ్యాకరణమునందలి కారకపరిచ్ఛేదములోని "ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాషనగు" ననుసూత్రము చూడునది. ఇందుల కాధారములు.

ఆ. "భేద్యభేదకముల భేదంబుజెల్లదు, పరవిభక్తిలింగవచనములకు
నొందుభేదకముల కుండును బ్రథమయుం, జయమురక్షకుండు శౌరికనఁగ."

—కవిలోకచింతామణి.

క. "ప్రథితముగఁ గృతులషష్ఠికిఁ బ్రథమవిశేషణము జెల్లుఁ బరిపంథిమదో
న్మథనుఁడు రాముని కెనయే, పృథివిం జెలువొందరలనంగ వృషపతిగమనా."

—సర్వలక్షణసారసంగ్రహము.

క. "అపరాహ్ణసమయమున నిట్లుపమాతీతాతిఘోరయుద్ధం బయ్యెన్
రిపుభయదభుజుఁడు భీమున, కపరిమితబలుండు కౌరవాధీశునకున్."

భార. భీష్మ. ఆ. 2.

శా. "విద్యారాజీవభవుండు మారయకుఁ, బుణ్యాచారభీమాంబకున్

—శృంగారనైషధము.

క. "మీపనుపున రాజ్యముపా, లీ పాండుకనూభవులకు నీకున్న భుజా
టోపభయంకరుఁ డర్జును, కోపానల మడరి ముట్టికొనదే వారిన్."

—భారత. ఉద్యో. ఆ. 1.

తా. నేను సిద్ధుఁడిచ్చిన మందుమహిమ తెలియవలె నన్నమాయ ద్వారక యవంతి కాశి కురుక్షేత్రము గయ ప్రయాగము మొదలైన పుణ్యక్షేత్రములకుఁ బోయి వానిని సేవింపక గండకము లేనుఁగు లడవిదున్నలు కాదు

దున్నలు పెద్దపులులు మొదలుగాఁగల క్రూరమృగములు విశేషముగా నుండెడి యీమంచుగొండకు రావచ్చునా? కేవలవైదికు లయిన నావంటివారు బుద్ధిమాంద్యమువలని చిత్తభ్రమము గలవారై యుందురు. కాఁబట్టి నేను నట్టి చిత్తభ్రమముచేత నీరానిచోటికి వచ్చితిని. అలం. అర్థాంతరన్యాసము.

సీ. నను నిముసంబు గానక యున్న నూ రెల్ల
నరయుమజ్జనకుఁ డెం తడలునొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలు వెళ్లనీక న
న్నోమెడుతల్లి యెం తొఱలునొక్కొ
యనుకూలవతి నామనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందునొక్కొ
కెలఁకఁ దోడునీడలై క్రీడించుపుత్త్రు
లింతకు నెంత చింతింతురొక్కొ
తే. యతిథిసంతర్పణంబు లే మయ్యెనొక్కొ
యగ్ను లేమయ్యెనొక్కొ నిత్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబ కిటుక నిట్లు
పాఱవైచితె మిన్నులు పడ్డచోట. 17

టీ. ననుఁ, నిముసంబు = నిమిషము, కానక యున్నఁ = చూడకున్నచో, ఊరెల్లఁ = గ్రామమంతయు, అరయుమజ్జనకుఁడు = వెదకునట్టి నాతండ్రి, ఎంతడలునొక్కొ=ఎంత విచారపడునో! నన్నుఁ, ఎపుడుఁ = ఎల్లప్పుడు, సంధ్యలయందుఁ = త్రిసంధ్యలయందు, (ఉదయమధ్యాహ్న సాయంతనసంధ్యలందు) ఇలువెళ్లనీక = ఇల్లుదాఁటనీక, ఓమెడుతల్లి = కాపాడెడుతల్లి, ఎంతొఱలునొక్కొ = ఎంతదుఃఖపడునో, అనుకూలవతి = అడఁకువగలది, నామనసులోఁ = నామనసునకులోఁబడి, వర్తించుకుల కాంత = నడుచుకులాంగన (భార్య), ఎంత కుందునొక్కొ=ఎంతగా వెత పడునో, కెలఁకఁ = దగ్గఱ, తోడునీడలై = సహాయులై, క్రీడించు=ఆట

లాడుకొను (విహరించు) సచ్ఛాత్రులు = మంచిశిష్యులు, ఇంతకున్ = ఇంతటియీయెడబాటునకు, ఎంత చింతింతు రొక్కొ=ఎంతవిచారము నొందుదురో గదా! అతిథిసంతర్పణంబులు = అన్నార్థులై వచ్చినవారి సమారాధనములు, ఏమయ్యెనొక్కొ=ఏమైపోయినవో గదా! అగ్నులు = గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని అను నగ్నిహోత్రములు, ఏమయ్యెనొక్కొ = ఏమైపోయినవోగదా! నిత్యంబులైనకృత్యములన్=నిత్యము చేయవలసినకర్మములను, పాపి=తప్పించి, మిన్నులు పడ్డచోటన్ = ఆకాశము ఒఱిగిన ప్రదేశమున (బహుదూర ప్రదేశమున), పాఱవైచితె = మిగులదూర దేశమునందుఁ బడవైచితివా? మిగుల దూరమున బంధువులకును నిత్యకృత్యములకు దూరము చేసి కూలఁద్రోచితివా యనుట. అలం. సందేహము.

శ్రీనాథకవియుఁ "బోకాలేద మిన్నులుపడ్డచోటికిన్" అని కాశీఖండమునఁ జెప్పినాఁడు. మిన్నులు పడ్డచోటు, కానని క్రంతలు ఇవి జాతీయములు. మిన్ను విఱిగి నేలఁ బడిన యీభయంకరదూరభూములలోఁ బడవేసితివా యని దేవుని నిష్ఠురము లాడుట.

క. నను నిలు సేరనుపాయం
బొనరింపఁగఁ జాలుసుకృతి యొకఁ డొదవఁ డొకో
యనుచున్ జింతాసాగర
మున మునిఁగి భయంబు గదురఁ బోవుచు నెదురన్. 18

టీ. ననున్ = నన్ను, ఇలు సేరనుపాయంబు = ఇంటికిఁబోవు తెఱఁగు, ఒనరింపఁగన్=చేయుటకు, చాలుసుకృతి=చాలిన పుణ్యాత్ముఁడు, ఒకఁడు = ఎవఁడైన నొక్కఁడు, ఒదవఁడొకో = కలుగఁడా యేమి? అనుచున్=అనుకొనుచు, చింతాసాగరమునన్ = విచార మను సముద్రమునందు, మునిఁగి = మునిఁగినవాఁడై, పోవుచున్, ఎదురన్ = ముందుభాగమునందు, వైపద్యముతో నన్వయము.

నిర్మానుష్యప్రదేశము. వచ్చినత్రోవ యెఱుంగఁడు కాన చింతాసాగరమున మునింగెను. మునింగినవాఁడు తరంగవేగమునఁ గొట్టుకొనిపోవునటుల విచారాతిశయమునఁ బ్రవరుఁడు మతిదప్పిపోవుచుండెను. అలం. రూపకము. సందేహము.

సీ. కులిశధారాహతిపాలుపునఁ బైనుండి
యడుగు మోవఁగ జేగు రైనతటులఁ
గనుపట్టులోయ గంగానిర్ఝరము వాఱఁ
జలువ యానయ్యేటికెలఁకులందు
నిసుకవెట్టిననేల నేచి యర్కాంశులఁ
జొరనీక దట్టమై యురులు గవియు
క్రముకపున్నాగనారంగరంభానాళి
కేరాదివిటపికాంతారవీథిఁ
తే. గిరలుపికశారికాకీరకేకిభృంగ
సారసధ్వనిఁ దనలోనిచంద్రకాంత
దరులు ప్రతిశబ్ద మీన గంధర్వయక్ష
గానఘూర్ణిత మగునొక్కకోనఁ గనియె. 19

టీ. కులిశధారాహతిపాలుపునన్ = వజ్రాయుధపువాయిచేతినఱకుడు (గన్ను) విధమున, పైనుండి = మీఁదినుండి, అడుగు మోవఁగన్ = అడుగంటునట్లు, జేగుఱు = కావిరంగుగలది, ఐన, తటులన్ = ప్రక్కలతో, కనుపట్టులోయన్ = అగపడుపల్లపుఁ బ్రదేశమున, వజ్రధారచేఁ గొండలు భిన్నములగుట ప్రసిద్ధము. మంచుకొండయందలి లోయలు పైనుండి క్రిందివఱకు ఏకశిలలతో వజ్రభేదితములవలె నుండెను. సూర్యకిరణప్రసారము చాలినంత లేమిచే నచటి శిలలయందు జేగుఱుపట్టెను. గంగానిర్ఝరము = గంగాప్రవాహము, పాఱన్ = ప్రవహించుటచే, చలువ = చల్లన, ఆనయ్యేటికెలఁకులందున్ = అగునట్టి

యాగంగానదియిరుప్రక్కలను, ఇసుకపెట్టిననేఁకన్ = ఇసుకదిబ్బపెట్టినలంక నేలను, ఏచి=ఎదిగి, అర్కాంశులన్ = సూర్యకిరణములను, చొరనీక=ప్రవేశింపనీయక, దట్టమై=చిక్కనై, ఇరులుగవియు=చీకట్లు క్రమ్ము, క్రముక... వీథిన్-క్రముక=పోఁక, పున్నాగ = పొన్న, నారంగ=నారింజ, రంభా = అరఁటి, నాళికేర = కొబ్బరి, ఆది= మొదలగు, విటపి = చెట్లయొక్క, శాంతారవీథిన్=తోఁపులవరుసను, కెరలుపిక...ధ్వనిన్ - కెరలు=కూయుచున్న, పిక = కోయిలలయొక్కయు, శారికా = గోరువంకలయొక్కయు, కీర = చిల్కలయొక్కయు, కేకి = నెమిళ్లయొక్కయు, భృంగ = తుమ్మెదల యొక్కయు, సారస=బెగ్గురుపక్షులయొక్కయు, ధ్వనిన్ = చప్పుడుచే, తన లోని చంద్రకాంతదరుల=తనలోపలి చంద్రకాంతమణిమయమైనగుహలు, ప్రతిశబ్దము=ప్రతిధ్వనిని, ఈనన్ = జనింపఁజేయఁగా, గంధర్వ...ఘూర్ణితమై-గంధర్వ=గంధర్వులయొక్కయు, యక్ష=యక్షులయొక్కయు, గాన = గానముచే, ఘూర్ణితమై=తిరుగుడుపడుచున్నది, అగు, ఒక్కకోనన్=ఒకానొక లోయను, కనియెన్ = చూచెను.

కోయిలలు పల్లవితచూతాదివృక్షములందును, చిలుకలు నారంగాది ఫలవృక్షములందును, గోరువంక లందునిందును నుండెను. నెమిళ్లు చెట్లు క్రిక్కిరిసి చీకటులాలయుటచే నదియ మేఘమని నృత్య మొనరించుచుండెను. తుమ్మెదలు రొదలుచేయుచున్న వనుటచే నచటిలతలు పూచి మకరందభరితములై యుండె ననియు బెగ్గురుపక్షులు అఱచుచున్నవనుటచే నచటిజలాశయములు విహారయోగ్యములుగా నున్న వనియు భావము.

ఇరులు నిత్యబహువచనాంతము. దృష్టాంతము:—

క. "కీ లేకవచన మరయఁగఁ, బాలను దిమ్మెరలు సహజ బహువచనంబుల్"

కావ్యాలంకారచూడామణి. (ఆ. ౮)

తా. ఇంద్రుని వజ్రాయుధపు నఱకులు తనునట్లు మీఁదినుండి యుడుగుపఱుతును నెల్లసెగయొడ్డలు గాఁకొండచరికినడుమఁ గన్పడులోయలోఁ

ప్రవహించు గంగాప్రవాహమున కిరుప్రక్కలఁ బెట్టినయిసుకలంకలమీఁదఁ బెరిఁగి సూర్యకిరణములను జొరనీయక చిక్కనై చీకటిగ్రమ్ము పోఁక, పొన్న, నారింజ, అరఁటి మొదలగు వృక్షజాతులతోఁపులలోఁ గూత పెట్టు కోయిలలు, గోర్వంకలు మొదలగు పక్షులధ్వనులును వానికిఁ బ్రతిశబ్దములిచ్చు సెలజాలగువాలును గలిగి గంధర్వుల యొక్కయు, యక్షుల యొక్కయు, సంగీతములచే నొప్పారుకోన నొకదానిఁ బ్రవరుఁడు కాంచెను. ఉత్ప్రేక్ష.

క. కనుఁగొని యిది మునియాశ్రమ
మనుతహతహ వొడమి యిచటి కరిగిన నాకున్
గనఁగు నొక తెఱువ యని
మనమునఁ గలదిగులు కొంత మట్టుపడంగన్. 20

టీ. కనుఁగొని=ఆలోయనుగాంచి, ఇది, మునియాశ్రమము=మునులు తపస్సుచేయుచోటు, అనుతహతహ = అనునట్టి భ్రాంతి, పొడమి = కలిగి, ఇచటికిన్ = ఈయాశ్రమమునకు, అరిగినన్=పోయినచో, నాకున్, ఒక తెఱువ = ఒకయుపాయము, కననగున్ దొరకవచ్చును, అని, మనమునన్=మనస్సునందు, కలదిగులు = కలిగినచింత, కొంత=కొంచెము, మట్టుపడంగన్=మరుగుపడఁగా, (తగ్గఁగా) పైపద్యముతో నన్వయము.

చ. నికటమహీధరాగ్రతటనిర్గతనిర్ఝరధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలఁకలై దిగుకాలువ వెంటఁ బూచుమ
ల్లిక లవలంబనంబుగ నలిప్రకరధ్వని చిమ్మిరేఁగ లో
నికి మణిపట్టభంగసరణిన్ ధరణీసురుఁ డేఁగి చెంగటన్. 21

టీ. ధరణీసురుఁడు=బ్రాహ్మణుఁడు (ప్రవరుఁడు), నికట...ధారన్ - నికట=సమీపమందలి, మహీధరాగ్ర = కొండకొనయొక్క, తట=ప్రదేశమునుండి, నిర్గత=వెల్వడిన, నిర్ఝరధారన్ = సెలయేటిజాలును, పాసి = విడచి (వేఱయి), తలక్రిందుగా = ఎత్తునుండిపల్లమునకు, మలఁకలై = మెలికలు

చెంది, దిగుకాలువవెంటన్, పూచు, మల్లికలు = మల్లెతీవెలు, అవలంబనం బుగన్=చేయూతగాఁగా, అళిప్రకరధ్వని = తుమ్మెదగుంపులఝుంకారము, చిమ్మిరేఁగన్=చెలరేఁగఁగా, మణిపట్టభంగసరణిన్ = మణులతో నిర్మించిన మెట్లదారిని, ఏగి=పోయి, చెంగటన్=దగ్గఱ.

కొండకోననుండి సెలయేరు తలక్రిందుగాఁ బాఱుచున్నదిగానఁ బాత వేగమునఁ జీలికలయ్యెను. మల్లెలను జేయూతఁగొన్నంతన తుమ్మెదలు చెలరేఁగుచుండె ననుటచేఁ బూచే మల్లెలలరుచుండె ననియుఁ, బ్రదేశము పుకిలముగానుండుటచేఁ గేలూఁతగొనెననియుం భావము. అవలంబనముగను నెన్నియొ మల్లెతీవియలఁ గైకొనుటచేఁ దుమ్మెదలగుంపు చిమ్మిరేఁగెను. 25 వ పద్యమునం దచ్చోటు జనాన్వితమనుకొనుటకు మణులమెట్లు భవనము మేని తావి సాధకము లయ్యెను.

తా. చేరువ నున్న కొండకోననుండి వెడలిన సెలయేటినుండి చీలి తల క్రిందుగా బాహ్యోద్యానికి మెలికలు వాఱిపోవు కాలువప్రక్కలను బుష్పించినమల్లెతీగలు చేపట్టుగాఁ జేసికొని తుమ్మెదలఝుంకారము చెలరేఁగఁగా మణులతోఁ గట్టిన మెట్లత్రోవను లోనికేఁగి చేరువను (పైపద్యముతో నన్వయము.)

శా. తావుల్ క్రేవలఁ జల్లుచెంగలువకేదారంబుతీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొను కాంతారంబునం దైందవ
గ్రావాకల్పిత కాయమానజటిలద్రాక్షాగుళుచ్ఛంబులన్
బూవుందీవెలనొప్పునొక్కభవనంబున్ గాంచెఁ దోత్కీర్ణమున్.

టీ. తావుల్=పరిమళములను, క్రేవలన్ = ప్రక్కలందు, చల్లు... తీరంబునన్-చల్లు=విదిర్చునట్టి, చెంగలువకేదారంబు=ఎఱ్ఱకల్వలుగల వరిమడి యొక్క, తీరంబునన్=దగ్గఱ, ఎఱ్ఱకలువ తావు లొలయుచు నా సమీపమునం దనుట, మావుల్=మామిళ్లను, క్రోవులు=గోరంటలు, అల్లిబిల్లిగొను కాంతారంబునందున్=పెనఁగొను తోఁపునందు, కాంతారంబునన్ = అడవియందు

ఐంద...గుళుచ్ఛంబులన్ - ఐందవగ్రావ=నెలకాల (కంబముల) చేత, ఆకల్పిత=కూర్పఁబడిన, కాయమాన=మేల్కట్టు పందిటియందు, జటిల = అల్లుకొన్న, ద్రాక్షా=ద్రాక్షతీఁగలయందలి, గుళుచ్ఛంబులన్ = పండ్లగుత్తులచేతను, పూవుందీవెలన్=పూఁదీగలచేతను, ఒప్పు=ఒప్పుచున్న, భవనంబున్=ఇంటిని, గారుడోత్కీర్ణమున్=గరుడపచ్చలచే పొదుగఁబడినదానిని, (దీనికిఁ బైక్రియతో నన్వయము.)

పూవుందీవెల అనుచో బిందుసిద్ధికి సూత్రము "సమాసంబుల నుదంతంబు లగు స్త్రీసమంబులకుం బరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమం బగు" ఇటులే, చిగురుంబైదువు, పూవుంబోఁడి.

తా. దిక్కులఁ బరిమళమును విదిర్చు చెంగలువలుగల పరిమడిదగ్గఱ, మామిళ్లు గోరంటలు పెనఁగొన్నతోఁపును నెలకాలికంబములతోఁ గట్టిన పందిలిపై దట్టముగాఁ బ్రాఁకి గెలలు వేసిన ద్రాక్షతీగలును బూవుదీగలును గల్గి యింపై గరుడపచ్చలు పొదుగఁబడిన యొక యిల్లును.

క. కాంచి తదీయవిచిత్రో
దంచితసౌభాగ్యగరిమ కచ్చెరువడి య
క్కాంచనగర్భాన్వయమణి
యించుక దఱియంగ నచటి కేఁగెడువేళన్. 23

టీ. కాంచి=ఆ దివ్యభవనమును జూచి, తదీయ...గరిమకున్-తదీయ=దానియొక్క, విచిత్ర=వింతయైన, ఉదంచిత = మిగుల బాగైన, సౌభాగ్యగరిమకున్=చక్కఁదనపుఁ బెంపునకు, అచ్చెరువడి = ఆశ్చర్యపడి, అక్కాంచనగర్భాన్వయమణి = ఆ బ్రాహ్మణవంశశ్రేష్ఠుఁడు (ప్రవరుఁడు), ఇంచుక = కొంచెము, దఱియంగన్ = సమీపింపఁగా, అచటికిన్=ఆతావునకు, ఏఁగెడువేళన్=పోవునప్పుడు, పైపద్యముతో నన్వయము. తొలుత సాశ్రమముగా నెంచెను. చక్కఁదనపుఁబెం పచ్చెరువుగూర్చి యాశ్రమము గాదేమొ యను శంకను బలపఱచెను. చేయఁదోఁచక యించుక సమీపించెను.

క. మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువపొలుపుఁ దెలుపునొక్కమారుత మొలసెన్. 24

టీ. మృగమద...పరిమళమై - మృగమద = కస్తూరియొక్క, సౌరభవిభవ=పరిమళపుఁ బెంపుచే, ద్విగుణిత=రెట్టింపుగాఁ జేయఁబడిన, ఘనసార=పచ్చకప్పురముచే, సాంద్ర=నిండిన, వీటీ=తాంబూలముయొక్క, గంధ=సువాసనచే, స్థగిత = కప్పఁబడిన, ఇతరపరిమళమై = ఇతర వస్తువుల సౌరభము గలదై, మగువపొలుపున్=జవరాలిజాడను, తెలుపు=తెలియఁజేయు, ఒక్క=ఒకానొక, మారుతము=గాలి, ఒలసెన్=వీచెను.

కస్తూరి యనక మృగమద మనుటచే సద్యోవినిర్భిన్నమనుట, పచ్చకప్పురము తావి పెంపు గలది. కస్తూరిచే దానితావి యిబ్బడియైనది. ఈ సుగంధాతిశయ మితరపుష్పగంధములఁ గప్పెను. ఇది వీటికాగంధము గాన మగువపొలుపు తెలియుచున్నది.

తా. కస్తూరి, పచ్చకప్పురము మొదలగు పరిమళద్రవ్యములు కలిసిన తమ్మవాసన యితర పరిమళములను గప్పివేయఁగా జవరాలిజాడఁ దెలుపునొక గాలి యల్లన వీచెను. అలం. కావ్యలింగము.

మ. అతఁ డావాతపరంపరాపరిమళవ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్త్రేక్షణఁ జంచరీకచికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొకమరున్నారీశిరోరత్నమున్. 25

టీ. అతఁడు = ఆప్రవరాఖ్యుఁడు, ఆ, వాతపరంపరా...లీలన్-వాతపరంపరా=గాలిజాలునందు, పరిమళ=సుగంధముయొక్క, వ్యాపారలీలన్ = ప్రవర్తనవిలాసముచేత, ఇచ్చోటు=ఈ ప్రదేశము, జనాన్వితము = జనులు

గలది, అని = అనుకొని, చేరఁబోయి=సమీపించి, విద్యుల్లతావిగ్రహన్ = మెఱుపుఁ దీగవంటి మేనుగలదానిని, శతపత్త్రేక్షణన్ = కమలములవంటి కన్నులు గలదానిని, చంచరీకచికురన్ = తుమ్మెదలవంటి కురులుగలదానిని, చంద్రాస్యన్ = చంద్రునిఁబోలు మోముగలదానిని, చక్రస్తనిన్ = చక్రవాకములవంటి చన్నులుగలదానిని, నతనాభిన్ = లోఁతైన బొడ్డుగలదానిని, ఒకానొక, మరున్నారీశిరోరత్నమున్ = దేవతాస్త్రీలలో మిన్నయగు, నవలాన్ = జవరాలిని, కనియెన్.

వీచినది వాతము గాదు. వాతపరంపర. కావునే జనసమన్విత మని గ్రహింపఁ గలుగుట. వరూథిని వేల్పుచెలువ గాన ముఖాదిగాఁ గవి వర్ణించెను. పొక్కిలి లోఁతుగా నుండుటచే నుత్తమజాతి స్త్రీ యని సాముద్రికము. దేవకాంతామణి కావున నాకారము శుభలక్షణలక్షితమై యున్న దనుట.

నవలాపదము దీర్ఘాంతమగు దేశ్యము. నవలయను హ్రస్వాంతరూపము గూడఁ గలదు. హ్రస్వాంతము గల దనుటకు, క. "అన్నవలముద్దుమోమును"

(విక్రమార్కచరిత్రము.)

తా. ఆ ప్రవరుఁ డాగాలిజాలునుబట్టి యిచ్చోట జనులు గల రని తెలిసికొని చేర నరిగి మెఱుపుఁదీఁగవంటి మేను, కమలములవంటి కన్నులుఁ, దుమ్మెదలవంటి కురులును, జందురునివంటి నెమ్మోమును, జక్కవలవంటి చన్నులును, లోఁతైనబొడ్డును గలయొకానొక వేల్పుజవరాలిని గన్గొనెను.

తే. అమలమణిమయనిజమందిరాంగణస్థ
తరుణసహకారమూలవితర్దిమీఁద
శీతలానిల మొలయ నాసీన యైన
యన్నిలింపాబ్జముఖియు నయ్యవసరమున. 26

టీ. అమల...మీఁదన్-అమలమణిమయ=నిర్మలములైన మణులతోఁ గూర్పఁబడిన, నిజ = తనయొక్క, మందిర = ఇంటియొక్క, అంగణస్థ = ముంగిట నున్న, తరుణసహకార=లేఁతమావిగున్నయొక్క, మూల = మొదటి

నున్న, వితర్దిమీఁదన్=తిన్నెపై, శీతలానిలము=చల్లగాలి, ఒలయన్=వీవఁగా, ఆసీన = కూరుచున్నది. అన్నిలింపాబ్జముఖియుం = ఆవేలుపువెలఁదియును, అయ్యవసరమున్ = అసమయమునందు (పైపద్యముతో నన్వయము.)

సీ. తతనితంబాభోగధవళాంశుకములోని
యంగదట్టపుఁగావిరంగువలన
శశికాంతమణిపీఠి జాలువాఱఁగఁ గాయ
లుత్తుంగకుచపాళి నత్తమిల్లఁ
జరణాంగుళీధూతతంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కియరమోడ్పుఁగనుదోయి
రతిపారవశ్యవిభ్రమముఁ దెలుపఁ
తే. బ్రౌఢిఁ బలికించుగీత ప్రబంధములకుఁ
గమ్రకరపంకరుహరత్నకటకఝణఝ
ణధ్వనిస్ఫూర్తితాళమానములు గొలుప
నింపు దళుకొత్త వీణవాయింపుచుండి 27

టీ. తత...రంగువలనన్-తత=విరివియైన, నితంబ=పిఱుఁదులయొక్క, ఆభోగ = పరిపూర్ణతగల, ధవళాంశుకములోని = తెల్లసెల్లాలోని, అంగదట్టపు=పావడయొక్క, కావిరంగువలనన్ = ఎఱుపురంగువలన, శశికాంతమణిపీఠి = చంద్రకాంతమణులుపొదిగినపీఠము, జాలువాఱఁగన్ = ఎఱుపుసోఁకఁగా, (లోనియంగదట్టపుఁగావిరంగు పైనున్నపలుచనిసెల్లానుండి మణిపీఠిక మీఁదికిఁ బ్రసరించుచున్నదనుట.) కాయలు = వీణసొఱకాయలు, ఉత్తుంగకుచపాళిన్ = ఉన్నతమైన స్తనప్రదేశమున, అత్తమిల్లన్ = ఒత్తుకొనఁగా, పిఱుఁదులు వ్రేఁగుగా నుండుటచేఁ గావివల్వ విశాలమైనదని యూహ్యము. శశికాంతము స్వచ్ఛశిల గావున వలువకావిరంగందుఁ బ్రతిబింబించెనని భావము. గుబ్బలుబ్బుగా నున్నగుబ్బెతలు వీణగొని వాయించుకఱి వీణసొరకాయలు

పాలిండ్లనొరయుట సాజము. దీనిచే గుబ్బలవ్రేగు ఉబ్బుని_స్సృతి సూచితము. "శ్లో. సమున్నతఘన_స్తన_స్తబకచుంబితుంబీఫలక్వణన్మధురవీణయావిబుధలోకలోలభ్రువా త్వదీయముపగీయతే." చూ. ప్ర. 5. ప. ప్రసన్నరాఘవము. తరుణా...స్వనంబుతోఁ - తరుణాంగుళీ=లేఁతవ్రేళ్లచేత, ధూత = కదల్పఁబడిన, తంత్రీ=తంతులయొక్క, స్వనంబుతోఁ = ధ్వనితో, జిలిబిలిపాట=సన్ననిపాట, ముద్దులు = పొలుపును, నటింపఁ=కలిగింపఁగా, ఆలాపగతిఁ = రాగముసాలపించురీతిచే, అరమోడ్పుఁగనుదోయి = సగముమూఁతపడుటగలకన్నులు, రతిపారవశ్యవిభ్రమము = సురతమునందలి మైమఱుపాటు పొల్పును, తెలుపఁ=ఎఱుఁగఁజేయఁగా, ప్రౌఢిఁ = నేర్పుతో, పలికించుగీతప్రబంధములకుఁ = (వీణపైఁ) బలుకఁజేయు సంగీతరచనలకు, క్రమ... స్ఫూర్తి-క్రమ=మనోహరమైన, కరపంకరుహ = హ_స్తపద్మములందలి, రత్నకటక=రతనములు తాఁపినకడియములయొక్క, ఝణఝణధ్వనిస్ఫూర్తి = ఝణఝణ మనుధ్వనికలుగుట, తాళమానములు = తాళముయొక్కనియమనములను, కొలుపఁ = కలిగించు-చుండఁగాను, ఇంపు=హాయలు, తళుకొత్తఁ = మీఱఁగా, వీణవాయింపుచుండి (వైపద్యమతో నన్వయము.)

రతి పారవశ్యమునందుఁ గన్ను లఱమోడ్పుగొను ననుటకు దృష్టాంతము.

క. "గాత్రంబు పరవశంబగు, నేత్రంబులుమూయుఁ జెమటనించినయూర్పుల్
చిత్రగతిఁబొలయు."

—కళాశాస్త్రము.

పాళి యనఁ బ్రదేశ మనుటకు:—

"పాళిః కర్ణలతాగ్రే చ ప్రదేశాంకాశ్రిపంక్తిషు
_త్సరుచ్ఛదేచయూకాయాం సంజాతశ్మశ్రుయోషితి."

—నానార్థరత్నమాల.

కృదికారాద_క్తినః-అనుసూత్రముచేఁ బాళిశబ్దమునకు దీర్ఘము గూడ వచ్చును.

సంగీతశాస్త్రమునందుఁ ప్రబంధలక్షణము.

శ్లో. "చతుర్భిర్ధాతుభిష్షడ్భిశ్చాంగైర్యస్మాత్ప్రబధ్యతే,
తస్మాత్ ప్రబంధః కథితః." —సంగీతచూడామణి.

తా. చందిరకావిపావడఁ దొడిగి విరివి యైరవిఱుఁదుల నిండాయునట్లు పలుచని తెల్లసెల్లా చుట్టి పైఁటగాఁ బొదిగిన దళుకుచే లోనిపావడరంగు సెల్లా పైకిఁ దోఁచుచుఁ జంద్రకాంతమణులు తాఁపినపీఁటపైత మెఱుపుదేఱుచుండెను. వీణకు సమర్చినసోరకాయలు, ఎత్తయురచనుపట్టున నొఱగియుండెను. సునువ్రేళ్లతోఁ గదల్పఁబడుతీఁగలధ్వనితో సన్నని తనగాత్రపుఁబాట ముద్దులు గొలుపుచుండెను. రాగము నాలపించునప్పు డరమొగిడి కన్నుదోయి సురతము నందలి మైమఱుపును దెలుపుచుండెను. వీణపైఁ బలికించుకృతులకుఁ దనకర కంకణములచప్పుడు తాళము లిడుచున్నట్లుండెను. ఈవిధమున హొయలు మెఱయ వీణ వాయించుచు. అలం. తద్గుణనిదర్శనారూపకములు.

ఉ. అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గాంతి వె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁజన్గవ గగుర్పొడువన్ మదిలోనఁ గోరికల్
గుబ్బతిలంగఁ జూచె నలకూబరసన్నిభు నద్ధరామరున్. 23

టీ. అబ్బురపాటుతోడన్=అబ్బురపడుటతో, నయనాంబుజముల్ = కన్నుదమ్ములు, వికసింపన్ = విరఁబాఱఁగా, కాంతి=ప్రకాశము, వెల్లుబ్బి = మిక్కిలిమెండై, కనీనికల్=కంటిలోని నల్లని గ్రుడ్లు, వికసితోత్పలపంక్తులన్= విచ్చినకలువపూదండలను, క్రుమ్మరింపఁగాన్ = ఉప్పతిలఁజేయఁగా, గుబ్బ... గవ-గుబ్బ=గుండ్రనై, మెఱుంగు = మిసమిసలుగల, చన్గవ = స్తనద్వయము, గగుర్పొడువన్ = పులకింపఁగా, మదిలోనన్ = మనస్సున, కోరికల్, గుబ్బతిలంగన్=వెల్లువిరాఱఁగా, నలకూబరసన్నిభున్ = నలకూబరునితో సమానుఁడగు, అద్ధరామరున్ = ఆ బ్రాహ్మణుని, చూచెన్ = కాంచెను.

కనీనికలు కోడెతనంపుఁబడుచులకు నల్లకలువలకాంతితో నలరారు చుండును. ఈభావముతోనే కనులు నల్లకలువలని కవులువాడుట సుప్రసిద్ధము.

రోమాంచము సాత్త్వికభావము. హర్షాతిశయముచే రోమాంచమయ్యెను. శ్లో. "రోమాంచో విస్మయోత్సాహహర్షాద్యైః" అని యాలంకారికమతము. హృదయానందవశమునఁ గనులు వికసించుటయుఁ బులకరించుటయు సహజము. ఇటు లనుటకుఁ బ్రమాణము.

శ్లో. "మనోరథస్య లాభేన సిద్ధ్యా యోగ్యస్య వస్తునః
ప్రియసంగమదేవాదిప్రసాదాదేశ్చ కల్పితః,
మనః ప్రసాదో హర్షః స్యాత్తత్ర నేత్రస్య ఫుల్లతా
ప్రియభాషణమాశ్లేషః పులకానాం ప్రరోహణమ్."

పైనిఁజెప్పఁబడిన నేత్రఫుల్లతయే నయనాంబుజవికసనము. మనోభావమును బయలుపఱచుభావముల ననుభావము లందురు. రోమాంచము అనుభావవిశేష మగు సాత్త్వికభావము. ఇది వరూథినివలపు నెఱిఁగించును.

తా. అట్లు వీణ వాయించుచున్న యా వేల్పులేమ కన్నుదమ్ములను విరియఁజేసి కలువదండలను గురియుచూపులతో గుబ్బచన్నులు వీఁకఁ గగుర్పొడిచి మిసమిసలాడఁగా లోలోఁ గోరికలు రేఁగఁగా నలకూబరునిఁ బోలిన యాప్రవరునిఁ జూచెను. అలం. పరిణామము.

ఉ. చూచి ఝళంఝళత్కటకసూచితవేగపదారవిందయై
లేచి కుచంబులుం దుఱుము లేనడుముల్లలనాడ నయ్యెడన్
బూచినయొక్క పోఁకనునుబోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలన్ దదీయపదవీకలశాంబుధి వెల్లిగొల్పుచున్. 29

టీ. ఝుళంఝుళ...వివిందరయై - ఝుళంఝుళత్ =ఝుళంఝుళ మను, కటక=అందెలచే, సూచిత=సూచింపఁబడిన, వేగ(ముగల), పదారవిందరయై = పాదపద్మములుగలదై, లేచి, కుచంబులున్ = స్తనములును, తుఱుము=కొప్పును, లేనడుము = నకనకలాడు నడుమును, అల్లలనాడఁగ = తూగాడఁగా, అయ్యెడన్ = అక్కడ, 'పూఁచిన, ఒక్క, పోఁకనునుబోదియన్ = పోఁక చెట్టుయొక్క నున్ననైన యాలవాలమును, చేరి, విలోకనప్రభావీచికలన్-విలోకన=చూపులయొక్క, ప్రభావీచికలన్ = కాంతితరంగములచే, తదీయ పదవీకలశాంబుధిన్ = అతఁడు వచ్చు మార్గ మను పాలసముద్రమును, వెల్లి గొల్పుచున్=పొంగి పొరలఁజేయుచు (అయ్యువిద తెలిచూపులను దొంతర దొంతరలుగా ప్రసరింపుచుండుటచే నాతని మార్గము పాలసముద్రము వలెనయి దొరలిదొరలివచ్చు పైపై చూపులకు వెల్లిగొన్నట్లయ్యెనని భావము.) పరిణామాలంకారము.

పూలంరాలుటచేఁ బెన్నెఱిముడి వీడె ననుట. చూపులఁగాంతులుప్రస రించుట, తురుమువీడుట, జనులు నడుము అల్లలనాడించుట కామేంగితములు.

శ్లో. "ఓష్ఠః ప్రస్ఫుర తీక్షణే విచలతః కూపోదకే మత్స్యవత్
ధమ్మిల్లః కుసుమాంచితో విగళతి ప్రాప్తోఽపి బంధం పునః,
ప్రచ్ఛన్నౌ వ్రజత స్తనౌ ప్రకటతాం శ్రోణీతటం దృశ్యతే
నీవీ చ స్ఖలతి స్థితాఽపి సుదృఢం కామేంగితం యోషితామ్."

—రతిరహస్యము.

తా. ఆ దేవతాస్త్రీ యావ్రవరునిఁ జూచి యందెలు గలుగలుమని. త్వరయాఁగా లేచి కుచములును కొప్పును సన్ననడుమును నల్లల నాడఁగాఁ జేరువ నున్న యొకపోఁకమానుచాటున కేఁగి యాతనిమార్గమున కెసి తెలి చూపులు దొంతర దొంతరలుగాఁ బుచ్చెను. పరిణామాలంకారము.

మ. మునుమున్ పుట్టెడుశంక లౌల్యము నిడన్ మోదంబు వి
స్తీర్ణతన్, జొనుపన్ గోర్కులు గ్రేళ్లుద్రిప్ప మదిమెచ్చుల్
చెప్ప లల్లార్పన,త్యనుషంగస్థితి ఱిచ్చపాటొసఁగ నొయ్యా
రంబునన్ జంద్రికల్, దనుకన్ జూచె లతాంగి భూసురుఁ
బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్. 30

టీ. లతాంగి=ఆస్త్రీ, మునుమున్ = ముందుముందు, పుట్టెడుశంక = జనించెడు సంశయము, లౌల్యము = చాపల్యమును, ఇడన్ = ఒసఁగఁగా, మోదంబు=సంతోషము, విస్తీర్ణతన్=వైశాల్యమును, చొనుపన్ = చెందింపఁగా, కోర్కులు=కోరికలు, క్రేళ్లుద్రిప్పన్ = దుసికిల్లాడింపఁగా, కన్నులు శంకచేతను గోర్కులచేతను జంచలము లయ్యెను. మదిమెచ్చుల్ = మనసు నందలి మెప్పులు, ఱెప్ప లల్లార్పన్=కనుఱెప్పలను ద్రిప్పఁ జేయఁగా, అత్యను షంగస్థితి=ఎంతయుఁ జేరికగలది యగునునికి, ఱిచ్చపాటు = నిశ్చేష్టత్వమును, చంద్రికల్=వెన్నెలలు, తనుకన్=కాయఁగా, ప్రఫుల్ల నేత్రపద్మంబులన్= విరియఁబాఱుచున్న కనుదమ్ములతో (తామరపూవులవలె నిండారవిచ్చినవియుం ననురాగప్రకటనము చేయునవియుం నగు చూపులతో) భూసురున్=బ్రాహ్మణుని, చూచెన్ = కాంచెను.

చూపులు, శ్వేతముగా వర్ణించుట కలదు.

మ. "జగతీనాథునిముందటన్ నిలిచె సాక్షాత్కారముం బొంది యా
జగదేకస్తవనీయ శారద శరచ్చంద్రాతపాలోకమున్"

శృంగారనైషధము. ఆ. ౪

తా. ఆతనిఁజూచినతోడనే కలిగినశంక బెసకును కల్గింపఁగా సంతోషము వైశాల్యముఁ జెందింపఁగా నుప్పతిల్లు కోరికలచే తుసికింతలాడి లోని మెప్పులు ఱెప్పలల్లార్పింపఁగా నదివఱ కెఱుక లేనిచేరిక నిశ్చేష్టత్వమును గూర్పఁగా విరఁబాఱుకన్నుదమ్ములతో నాయింతి యొయ్యారముగా వెన్నెలలు నిగుడునట్లు ప్రవరునిఁ జూచెను. పరిణామాలంకారము.

క. పంకజముఖి కప్పుడు మై
నంకురితము లయ్యెఁ బులక లావిష్కృతమీ
నాంకానలసూచకధూ
మాంకురములుఁబోలె మఱియు నతనిఁ జూడన్. 31

టీ. పంకజముఖికిన్=తామరపూవంటిముఖముగలయాస్త్రీకి, మైన్= శరీరమున, ఆవిష్కృత...మాంకురములుఁ బోలెన్-ఆవిష్కృత=వెల్వరింపఁ బడిన, మీనాంకానల = మదనాగ్నిని, సూచక = తెలియఁజేయునవి యయిన, ధూమాంకురములుఁబోలెన్ = పొగల యంకురములువలె, పులకలు, అంకురితములయ్యెన్=మొలచెను. ఉత్ప్రేక్షాలంకారము. (హఠాత్సందర్శనము వలన వలపు లోలోన జనించి గుబ్బలు గగుర్పొడిచెను. తృప్తిదీఱ చూచిన కతన మేనినిండ పులకలు జనించెను. ధూమము కృష్ణవర్ణగణము.)

తా. మఱియు నాతనిఁ జూచునప్పటి కాయువిదకు రవుల్కొను మన్మథాగ్నిని దోఁపించుపొగరేకలట్లు మయినిండఁ బులకలు పొటమరించెను.

ఉ. తొంగలిఱెప్పలన్ దొలఁగఁద్రోయుచుఁ బైపయి విస్తరిల్లుక
న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రు నటంచుఁ బోవ
నీకంగజుఁడానపెట్టి కదియన్ గుఱి వ్రాసె ననంగ జాఱె సా
రంగమదంబు లేఁ జెమటఁ గ్రమ్మె లలాటము డిగ్గి చెక్కులన్.

టీ. తొంగలి ఱెప్పలన్ = వాలు ఱెప్పలను, తొలఁగఁ ద్రోయుచున్=తప్పఁద్రోయుచు, పైపయిన్ = మీఁది మీఁదికి, విస్తరిల్లు కన్నుంగవ=వ్యాపించుకనుదోయి, నేత్రఫుల్లత మోహాతిశయమును సూచించును. కనులు ముఖము నంతయు నాక్రమించుకొను నేమో యనునటులఁబూర్తిగా వికసించె ననుట. ముఖచంద్రున్=చంద్రునిఁబోలు ముఖమును, ఆక్రమించు కొనునో=ఆవరించుకొనునో, అటంచున్=అని తలంచి, పోవనీక = అవలకు

సాగిపోవనీయక, అంగజుఁడు=మన్మథుఁడు, ఆనవెట్టి=హద్దుపెట్టి, కదియన్ = అంటునట్లు, గుఱి=గుఱుతు, వ్రాసెననంగ, సారంగమదంబు=(నొసటి) కస్తూరి, లేఁజెమటన్ = చిఱుచెమటచే, జాఱి, లలాటమున్ = ఫాలమును, డిగ్గి=దిగి, చెక్కులన్, క్రమ్మెన్ = అల్లుకొనెను.

స్వేదోద్గమము సాత్త్వికలక్షణము, ఇట్లనుటను

శ్లో. "స్తమ్భః ప్రళయరోమాంచౌ స్వేదో వైవర్ణ్యవేపథూ
అశ్రువైస్వర్యమిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః."

తా. వాలుఁజెప్పలను బైపయి కెగసనఁ ద్రోయుచున్న యీ కన్నుగవ యింక ముఖమునయితము నాక్రమించుకొనునేమో యని మన్మథుఁడానవెట్టి గీచిన గీతయనునట్లు చిఱుచెమ్మట గ్రమ్మి కస్తూరిబొట్టు కరఁగి చెక్కుల జాఱెను. ఉత్ప్రేక్షాలంకారము.

మ. అనిమేషస్థితి మాన్పి చిత్తరపుఁజూపస్వేదతావృత్తి మా
న్పి నవస్వేదసమృద్ధిబోధకళ మాన్పెన్ మోహవిభ్రాంతి తో
డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయ మొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వము మెయిన్ జూపట్టెనా నత్తఱిన్.

టీ. గీర్వాణవధూటికిన్ = దేవతాస్త్రీకి, అత్తఱిన్=అప్పుడు, భ్రమరకీటన్యాయము = పురుగు తుమ్మెద యగున్యాయము (పురుగును దెచ్చి తుమ్మెద తనగూటి నుంచి రొంచఁగాఁ బురుగు తుమ్మెదనే మనసున నుంచుకొని కొంతకాలమునకుఁ దుమ్మెదగా మారును) ఒప్పన్=ఒప్పునట్లు, మనుష్యునిన్= మానవుఁడగు ప్రవరాఖ్యుని, భావించుటన్ = తలంచుటచేత, తోడనె = వెంటనే, మానుషత్వము = మనుష్యత్వము, మెయిన్ = శరీరమున, చూపట్టెనాన్=కనఁబడెనా యనునట్లు, చిత్తరపుఁజూపు = బెదరుఁజూపు, అనిమేషస్థితిన్=ఱెప్పపాటులేనియునికిని, మాన్పెన్, నవస్వేదసమృద్ధి = క్రొంజెమరు నిండుట, అస్వేదతావృత్తిన్ = చెమ్మటలేనితనమును, మాన్పెన్, మోహ

విభ్రాంతి = అనురాగమువలనిమరపు, బోధకళన్ = జాగ్రత్తను, మాన్పెన్ = పోఁగొట్టెను.

తా. మనుష్యుని భావించుటచే నాదేవతాస్త్రీకి భ్రమరకీటన్యాయమున మనుష్యత్వము సంభవించెనా యనునట్లు దేవతాధర్మములగు, అనిమేషస్థితి, అస్వేదతావృత్తి, బోధకళ, మాఱిబిత్తరపుఁజూపు నవస్వేదసమృద్ధి మోహావిభ్రాంతి యను మనుష్యధర్మములు వాటిల్లెను. అలం. ఉత్ప్రేక్ష. తద్గుణము.

వ. ఇట్లతనిరూపరేఖావిలాసంబులకుం జొక్కి యక్కమలపత్రేక్షణ యాత్మగతంబున. 34

టీ. ఇట్లు=ఈవిధముగా, అతని=ఆప్రవరాఖ్యుని, రూపరేఖావిలాసంబులకున్ = సౌందర్యక్రమమునకును, విలాసమునకును, చొక్కి = మోహముఁగొని, (పరవశయై) అక్కమలపత్రేక్షణ = తమ్మిఱేకులఁబోలుకన్నులుగల యాయింతి, ఆత్మగతంబునన్ = తనలో, (పైపద్యముతో నన్వయము.)

ఉ. ఎక్కడివాఁడొ యక్షతనయేందుజయంతవసంతకంతులన్
జక్కఁదనంబునన్ గెలువఁజాలెడువాఁడు మహీసురాన్వయం
బెక్కడ యీతనూవిభవ మెక్కడ య్యేలనిబంటుగామరున్
డక్కఁగొనంగరాదె యకటా నను వీఁడు పరిగ్రహించినన్.

టీ. (ఈబ్రాహ్మణుఁడు) యక్షత...కంతులన్ - యక్షతనయ = నలకూబరుని, ఇందు = చంద్రుని, జయంత = ఇంద్రునికొడుకైన జయంతుని, వసంత=వసంతఋతుపురుషుని, కంతులన్ = మన్మథుని, చక్కఁదనంబునన్ = సౌందర్యముచేత, గెలువన్ = జయించుటకు, చాలెడువాఁడు = సమర్థుఁడగువాఁడు, ఎక్కడివాఁడో=ఎక్కడనుండి వచ్చినవాఁడో, మహీసురాన్వయంబు= బ్రాహ్మణులకులము, ఎక్కడ, ఈ, తనూవిభవము = శరీరసంపత్తి, ఎక్కడ, (దేవతాంశమునఁ బుట్టినవారికె యపూర్వసౌందర్యాతిశయ ముండును. సామాన్యముగ బ్రాహ్మణజాతిలో సౌందర్యమరుదు. ఇతని సౌందర్యము వేల్పు

లలో సౌందర్యవంతుల నతిశయించియున్నది.) అకటా=అయ్యో, వీఁడు = ఈ బ్రాహ్మణుఁడు, నను౯=నన్ను, పరిగ్రహించిన౯=కైకొనినచో, మరు౯=మన్మథుని, ఏలనిబంటుగా౯ = తనంతఁదానైన సేవకునిఁగా, (జీతముబత్తెము లీయక యుచితముగా దానిసేవనముచేయు బంటువానిఁగా), డక్కఁగొనంగఁ రాదె = లోఁబఱుచుకోరాదా ?

దక్కపదము డక్కయనుటకు—

తే. "దంభ డిండీర డోలికాడాడిమాది
శబ్దముల కాదివర్ణముల్ సంస్కృతమున
సుపరివర్గ తృతీయమై యొప్పునట్లు
దెనుఁగున దకారము డవర్ణ మొదరుచుండు.

తే. దాఁక దగ్గఱ దిగ్గియ దాయఁ బోయి
దాపలను దిగ్గుమను వైకృతముల మొదల
డాఁక డగ్గఱ డిగ్గియ డాయఁబోయి
డాపలను డిగ్గు మని డా కడంగి నిల్చు." (అప్పకవీయము.)

తా. నలకూబరజయంతవసంతాదులను చక్కఁదనమున జయింపఁ జాలునీతఁ డెక్కడివాఁడో గావలయు. ఈచక్కఁదన మెక్కడ? బ్రాహ్మణుల మెక్కడ? వహ్వా! ఈతఁడు నన్ను, గైకొన్నచో మన్మథసుఖముల నిరాటంకముగా ననుభవింపఁ దగును గదా! విషమాలంకారము.

సీ. వదనప్రభూతలావణ్యాంబుసంభూత
కమలంబు లన వీనికన్ను లమరు
నిక్కి వీనులతోడ నెక్కసక్కెము లాడు
కరణి నున్నవి వీనిఘనభుజములు
సంకల్పసంభవాస్థానపీఠికవోలె
వెడఁద యై కనుపట్టు వీనియురము

ప్రతిఘటించుచిగుళ్ళపై నెఱ్ఱవాఱిన
రీతి నున్నవి వీనిమృదుపదములు
తే. నేరెటేటియిసుకల్ దెచ్చి నీరజాప్తు
సానఁబట్టినరాపొడి చల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁ గాకున్నఁ గలదె యీమేనికాంతి. 36

టీ. (ఈపద్యమునందుఁ బ్రవరునిసౌందర్య మభివర్ణితము) వీనికన్నులు = ఈపురుషునినయనములు, వదన...కమలంబులనఁ - వదన = ముఖము యొక్క, ప్రభూత = అధికమైన, లావణ్య = మెఱు పసెదు (ముత్తెములనిగనిగఁబోలిన యంగకములనిగారమునకు లావణ్యమని పేరు.) అంబు = ఉదకమున, సంభూత = పుట్టిన, కమలంబులు = తామరలు, అనఁ = అనునట్లు, అమరుఁ = ఒప్పును, వీనిఘనభుజములు = ఈబ్రాహ్మణుని గొప్పభుజములు (ఎగుబుజములు), నిక్కి = ఎగుపుచెంది, వీనులతోడఁ = చెవులతో, ఎక్కసక్కెములు = వేళాకోళములు. ఆడుకరణిఁ, ఉన్నవి. సంకల్ప...పీఠికవోలెఁ - సంకల్పసంభవ = మన్మథునియొక్క, ఆస్థానపీఠికవోలెఁ = కొలువుగద్దియవలె, వెడఁదయై = విశాలమై, వీనియురము = ఈతనివక్షస్స్థలము, కనుపట్టుఁ = కనవచ్చుచుండును, ప్రతిఘటించు = ఎదిరించునట్టి, చిగుళ్లపైఁ = చివుళులపై, ఎఱ్ఱవాఱినరీతిఁ = కనలి యెఱ్ఱవాఱినవిధమున, మృదుపదములు = మెత్తనిపాదములు, ఉన్నవి = ఎఱ్ఱగా నలరారుచున్నవి, పద్మభవుఁడు = బ్రహ్మదేవుఁడు, నేరెటేటియిసుకల్ = జంబూనదియందలిఇసుకల, తెచ్చి (జంబూనదిలోనియిసుక బంగారని చెప్పఁబడును), నీరజాప్తుఁ = సూర్యుని, సానఁబట్టిన రాపొడి = సానఁబట్టి బింబమును దేర్చునప్పుడు దరిగి రాలిన రజము, చల్లి, మెదిపి = కలయఁగలిపి, పదను = (ముద్దపాకమునకుఁ గావలసిన) తడిని, సుధఁ = అమృతమున, ఇడి, చేసెనో = సృష్టించె

నేమో, కాకున్నన్ = లేనిచో, ఈమేనికాంతి = ఈశరీరలావణ్యము, కలదె = కలుగునా?

ఛాయాదేవి తనభర్తయగు సూర్యునివేఁడికి సైఁపఁజాలక పోవుటచే నామెతండ్రి యగు త్వష్టప్రజాపతి సూర్యునివేఁడిమి తగ్గింప నెంచి సాన యందఱగఁదీసె ననుపురాణకథ యిట ననుసంధింపఁదగినది. లావణ్యలక్షణము 61 వచనమునఁ జూడనగును.

తా. ఈయందగానికన్నులు ముఖకాంతి యనెడి నీటఁ బుట్టినకమల ములవలె నున్నవి. ఎగుబుజములు నిక్కి చెవులతో నెకసక్కెములాడుచున్న ట్లున్నవి. ఱొమ్ము మన్మథునికొలువుకొట్టిడివోలె విశాలమై కన్పట్టుచున్నది. పాదములు చిగుళ్లను ధిక్కరించుచు నెట్టివాఱిన ట్లున్నవి. బ్రహ్మదేవుఁడు నేరటేటిలోని బంగారపుటడుసును దెచ్చి సూర్యుని సానఁబట్టిన రాపాడి చల్లి కలిపి యమృతము పదనుగాఁ జేసికొని నిర్మించెనో యేమో? లేనిచో నీచక్కఁదనము కలుగునా? ఉత్ప్రేక్షాలంకారము.

క. సురగరుడోరగనరఖే
చరకిన్నరసిద్ధసాధ్యచారణవిద్యా
ధరగంధర్వకుమారుల
నిరతము గనుఁగొనమె పోలనేర్తురె వీనిన్. 37

టీ. సుర, గరుడ, ఉరగ, నర, ఖేచర, కిన్నర, సిద్ధ, సాధ్య, చారణ, విద్యాధర, గంధర్వ (వీరిలో) కుమారులన్ = పిన్నవయసువారిని, నిరతము = ఎప్పుడును, కనుఁగొనమె = చూడమా! వీనిన్ = ఇతనిని, పోలనేర్తురే = సరి పోలఁగలుగుదురా!

మ. అని చింతించుచు మీనకేతనధనుర్జ్యాముక్తనారాచదు
ర్దినసమ్మూర్ఛితమానసాంబురుహ యై దీపించు పెందత్తఱం
బునఁ దేలె త్తినలజ్జ నంఘ్రికటకంబుల్ మ్రోయ నడ్డంబు ని

ల్చిన నయ్యచ్చరఁ జూచి చేరఁజని పల్కెన్ వాఁడు విభ్రాం
తుఁ డై. 38

టీ. అని = ఇటులని, చింతించుచున్ = తలంచుచు, మీన...రుహాఢ్యై- మీనకేతన = మన్మథునియొక్క, ధనుర్జ్యా = వింటినారినుండి, ముక్త = విడువఁబడిన, నారాచ = బాణములచేఁ గలిగిన (ఇట నారాచములను వర్షధారలుగా రూపించుకొనునది), దుర్దిన = జడివానతో (సూర్యదర్శనము లేనిదినమున,) సమ్మూర్ఛిత = మూర్ఛనొందింపఁబడిన, మానసాంబురుహా = మనమనెడుపద్మము కలది, దీపించు పెన్దత్తరంబునన్ = పెంపొందు పెద్దతత్తఱపాటుచే, పేటెత్తిన లజ్జన్ = బీటవాఱినసిగ్గుతో (సిగ్గుతో ఉడిగియనుట). అంఘ్రికటకంబుల్ = కాలియందెలు, మ్రోయన్, అడ్డంబునిల్చినన్ = అడ్డమునిల్వఁగా, అయ్యచ్చరన్ = ఆయప్సరస్త్రీని, చూచి = కాంచి, చేరన్ చని = సమీపించి, వాఁడు = ఆప్రవరాఖ్యుఁడు, విభ్రాంతుడై = భ్రమనొందినవాఁడై, పల్కెన్ = ఈవిధముగా భాషించెను.

సామాన్యబాణము లనక నారాచములనుటచేఁ బాతవేదనాతిశయము సూచించుట. నారాచలక్షణమునందు అది తెల్లుపుల్ల లేక యంతయు నినుముతోఁ జేయఁబడుబాణ మని చెప్పఁబడెను. అది మహావీరునకె సిద్ధించును. కాన మన్మథుఁడు మహావీరుఁడు.

శ్లో. "సర్వలోహాస్తు యే బాణా స్తే నారాచాః ప్రకీర్తితాః,
పంచభిః పృథులైర్గ పక్షైర్యుక్తాః సిద్ధ్యంతి కస్యచిత్.
ఏకైకస్య శరస్యైవ చతుష్పక్షాణి యోజయేత్
షాణ్మాసాత్ సిద్ధ్యతే ముష్టిః శరాః సంవత్సరేణ చ,
నారాచా స్తస్య సిద్ధ్యంతి యస్య తుష్టో మహేశ్వరః."

తా. ఈవిధముగాఁ జింతించుచు మదనవేదనకు లోఁగి తత్తఱపాటు చెంది సిగ్గునక్కి కాలియందెలు మ్రోయఁగా, నాదేవతాస్త్రీ పోఁకబోది

యను వీడి ప్రవరునిత్రోవ కడ్డము నిల్చెను. అది చూచి ప్రవరుఁడు, విభ్రాంతుఁడై చేరఁబోయి పలికెను. రూపకాలంకారము.

ఉ. ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోట లే
కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవతప్పితిం
ద్రొవ్వన నిన్నగాగ్రమునకుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగదవే! తెరువెద్ది శుభంబు నీకగున్.

టీ. భీతహరిణేక్షణ = భయపడిన జింకచూపులఁబోలుచూపులు గల దానా! ఈవు, ఎవ్వతెవు? ఓటలేక=భయములేక, ఇవ్వనభూమిన్ = ఈ యడవిప్రదేశమున, ఒంటిఁజరించెదు=ఒంటరిగాఁ దిరుగుచున్నావు, ఏన్=నేను, ప్రవరాఖ్యుఁడన్ = ప్రవరుఁ డనువాఁడను, భూసురుఁడను = బ్రాహ్మణుఁ డను, త్రొవ్వనన్=మదముచే, ఇన్నగాగ్రమునకున్ = ఈకొండకొమ్మునకు, చనుదెంచి = అరుగుదెంచి, త్రోవతప్పితిన్ = మార్గము తొలంగినవాఁడ నైతిని. ఇంకన్ = ఇఁకమీఁద, పురంబు=అరుణాస్పదపురము, చేరన్=చేరుటకు, ఎవ్విధిన్=ఏవిధమున, కాంతున్ = (ఉపాయమును) గనుగొందును. తెరువు=నేఁబోవలసిన మార్గము, ఎద్ది=ఏది, తెల్పఁగదవే, నీకున్, శుభంబు = మేలు, అగున్ = కలుగును.

త్రొవ్వన వచ్చితి ననుట తన ప్రమాదాతిశయము సూచించును. భీత హరిణేక్షణ యనుసంబుద్ధి ప్రవరునివంటి నిష్కాముకోట రాఁదగ దని కొంద అందురు. సంబోధనౌచిత్యము తెనుఁగుకవులు దృష్టిలో నుంచిరనఁ జాలము.

"కదవె ప్రార్థనంబునం దప్రాశ్యయాంత క్రియలమీఁదఁ గదకదవు పూర్వకంబులన్నాదు లనుప్రయుక్తంబు లగు." ప్రౌ. వ్యా. క్రి. 9. ఉదా. "ణిసిధాశ్వర్థ మనుగ్రహింపఁగదవే నీరేజపత్రేక్షణా." (శృం. నై. ఆ. ౮)

తా. ఓయువతీ! నీ వెవ్వతెవు? భీతిలేక యొక్కతెవె యీయరణ్య ప్రదేశమునఁ దిరుగుచున్నావు. నేను బ్రాహ్మణుఁడను, పేరు ప్రవరుఁడు.

త్రోవ్వెక్కి యీకొండకువచ్చి త్రోవదప్పితిని. ఏవిధమున నేను బురము చేరఁ గలుగుదును ? తెల్పుమా నీకుఁ బుణ్య మగును.

క. అని తనకథ నెఱిఁగించినఁ
దనకనుఁగవ మెఱుఁగు లుబ్బ తాటంకములం
జనుఁగవయు నడుము వడఁకఁగ
వనిత నెలవివాఱ నవ్వి వానికి ననియెన్. 40

టీ. అని, తనకథన్, ఎఱిఁగించినన్, వనిత, తనకనుఁగవ మెఱుఁగులు = తనకన్నులయొక్క తళతళలు, ఉబ్బన్ = ఉబుకఁగా, తాటంకములున్ = కమ్మలును, చనుఁగవయుం, నడుమున్, వడఁకఁగన్, నెలవివాఱన్ = పెదవి మూలలు వెడలునట్లు, నవ్వి, వానికిన్ = ఆతనికి, అనియెన్ = ఈవిధముగాఁ జెప్పెను.

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపం బిడి పల్కరించు లా
గింతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చిన త్రోవ చొప్పు నీ
కింతభయంబు లేక కడుఁగ నెల్లిద మైతి మొ మాటలేటికిన్. 41

టీ. భూసురేంద్ర = బ్రాహ్మణశ్రేష్ఠుఁడా, ఇంతలు = (చేరఁజూపుచు) ఇంతవిశాలమయిన, కన్నులు, ఉండన్, తెరువు = మార్గము, ఎవ్వరిన్ వేఁడెదు=ఎవరిని యాచించెదవు ? నెపంబిడి=(ఈయడుగుటయను) మిషపెట్టుకొని, ఏకాంతమునందున్ = రహఃప్రదేశమున, ఉన్న, జవరాండ్రన్ = వయసుఁగత్తెలను, పల్కరించులాగు = మాటాడించు విధము, ఇంతియకాక = అంతేకాని, మును=ఈవఱకు, వచ్చినత్రోవచొప్పు = ఏతెంచినత్రోవజాడ, ఎఱుఁగవే, ఇంతభయంబులేక, అడుగన్, ఎల్లిదమైతిమి ఏ= తేలికయితిమా, మాటలు, ఏటికిన్. ఇంతలు కన్ను లనుటచేఁ బ్రవరుని నయనవైశాల్యమునకు మెచ్చె నని భావము. నెప మనుటచే నీవు రసికుఁడవు రసికతాప్రకటన కిది.

యొక త్రోవ గానోపు ననుట. ఏకాంత మనుట యథేచ్ఛావిహారభోగోచిత ప్రదేశ మనియును జవరాల నని చెప్పుకొనుట సంభోగోచిత యౌవనవిభవ ననియును సూచించుట.

తా. ఓవిప్రుఁడా? చేరఁదేసి కన్నులు పెట్టుకొని యితరులను త్రోవ యడిగెద వేమి? ఒంటరిపాటున నున్న వయసుఁగత్తెలను పల్కరించు విధమేకాని యీవలకు వచ్చిన త్రోవ నీ వెఱుఁగవేమి? పలుమాట లేల? ఇంత భయము లేకుండ నమ్మనుగుటను మేము నీకుఁ జులుకనగా నగపడితిమి గాఁబోలు. అపహ్నవాలంకారము.

వ. అని నర్మగర్భంబుగాఁ బలికి క్రమ్మఱ నమ్ముగుద యమ్మహీసురున కిట్లనియె. 42

టీ. అని = ఈవిధముగా నని, నర్మగర్భంబుగాన్ = పరిహాస గర్భితముగా, (తన యభిప్రాయమును మరుగుపఱచి యెదటివానికి సరసముగాఁ దోఁచునటుల మాటలాడుట) పలికి = మాటలాడి, క్రమ్మఱన్ = మరల, అమ్ముగుద = ఆస్త్రీ, అమ్మహీసురునకున్ = ఆబ్రాహ్మణునకు, ఇట్లనియెన్ = ఈవిధముగా బదులు చెప్పెను.

సీ. చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమినచెలువ తోఁబుట్టు మాకు
రహి పుట్ట జంత్రగాత్రముల ఠాల్ గరఁగించు
విమలగాంధర్వంబు విద్య మాకు
ననవిల్తుశాస్త్రంపుమినుకు లావర్తించు
పని వెన్నతోఁడఁ బెట్టినది మాకు
వాయునైషధ రాజపూయము లనఁ బేర్పడ్డ
సవసతంత్రంబు లుంకువలు మాకుఁ

తే. కనకనగసీమఁ గల్పవృక్షములనీడఁ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవవైకుంఠభర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర. 43

టీ. గోత్రామరేంద్ర=బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! చిన్ని వెన్నెలకందున్ = ముద్దుల లేఁజందురుని, వెన్నుదన్ని=వెన్నాఁడి (వెంటనే యనుట,) సుధాబ్ధిన్ = పాలసముద్రమున, పొడమిన చెలువ=పుట్టినస్త్రీ, (లక్ష్మీదేవి యనుట) మాకున్, తోఁబుట్టు = కూడఁబుట్టినది, రహి=రక్తి, పుట్టన్=పుట్టునట్లు, జంత్రగాత్రములన్=వీణాగానముచేతను కంఠగానముచేతను, జాల్=జాల్గను, కరఁగించు విమల గాంధర్వంబు = కరఁగఁజేయు చక్కని సంగీతము, మాకున్, విద్య=చదువు, ననవిల్తుశాస్త్రంపుమినుకులు = కామశాస్త్రపు వాక్యములు, ఆవర్తించుపని=వల్లెవేయుపని, మాకున్, వెన్నతోఁబెట్టినది=చిన్ననాఁటినుండి యభ్యస్తమైనది, (పసితనమున వెన్నదినుట యలవాటు చేసినటుల మిగులఁ జిన్నతనముననే యభ్యసించిన దనుట) హయమేధ రాజసూయములు=అశ్వమేధము రాజసూయము, అనన్=అని, పేర్వడ్డసవనతంత్రంబులు = ప్రసిద్ధికెక్కిన యజ్ఞ తంత్రములు, మాకున్, ఉంకువలు=(పెండ్లికిముందు కన్నెయింటివారికి నిచ్చెడుసొమ్ము) ఓలిధనము, కనకనగసీమన్ = మేరుపర్వతప్రదేశమున, కల్పవృక్షములనీడన్, పచ్చరాచట్టుగమి=గారుత్మతమణివికారములైనపఱపుటాళ్ల సమూహము, రచ్చపట్టు=సభాస్థానము, పద్మసంభవవైకుంఠ భర్గసభలు= బ్రహ్మ విష్ణు మహేశ్వరుల సభలు, మాకున్, సాముగరిడీలు = సామునేర్చుకొను కూటములు.

రాయిశబ్దము సమాసములందుఁ దుదివర్ణము లోపించును. కాన రాయి+చట్టు, రాచట్టు అయినది, ఇది రేయి ప్రభృతులలోనిది.

తా. (దేవతాస్త్రీ ప్రవరునితో ననుచున్నది) ఓ భూసురోత్తమా! పాలసంద్రమునందు బాలచంద్రునివెనుకఁ బుట్టిన లక్ష్మి మాకుఁ దోఁబుట్టువు.

వీణాగానముచేతను, కంఠగానముచేతను, తాళ్లనుసైతము కరఁగించు నట్టిరక్తి గలసంగీతము మా నేర్చినవిద్య. కామశాస్త్రసిద్ధాంతములను బఠించుట మాకుఁ జిన్ననాఁటనుండియు నలవాటయినది. అశ్వమేధ రాజసూయాదియజ్ఞములు చేయువారి కేము దక్కుదుము. మేరుపర్వతమునఁ గల్పవృక్షములనీడలను బచ్చతాళ్లచరియలపై మేము కూటము దీర్తుము. బ్రహ్మవిష్ణు మహేశ్వరుల సభలు మాకు నాట్యశాలలు. (మేము అచ్చరల మనుట.)

క. పేరు వరూథిని విప్రకు
మార! ఘృతాచీతిలోత్తమాహరిణీహే
మారంభాశశిరేఖ లు
దారగుణాఢ్యలు మదీయ లగుప్రాణసఖుల్. 44

టీ. విప్రకుమార=ఓబ్రాహ్మణయువకుఁడా! పేరువరూథిని=నానామధేయము వరూథినియని, ఉదారగుణాఢ్యలు = గొప్పగుణములుగల ఘృతాచీ, తిలోత్తమా, హరిణీ, హేమా, రంభా, శశిరేఖలు, మదీయలు = నాకిష్టరాండ్రయిన, ప్రాణసఖుల్ = ప్రాణపదములగు చెలిమికత్తెలు.

విప్రకుమార యనుసంబోధనము సాభిప్రాయము. ఉదారాతిశయులగు తిలోత్తమాదులు నాప్రాణసఖులుగాన నాయోగ్యత నీవ గమనింపఁగలవు. నేను వరూథినిని. నన్ను నీ వెఱుంగవేని సుప్రసిద్ధలగు తిలోత్తమాదులనైన నెఱింగియుందువుగాన వారినిబట్టి నాయోగ్యతాదికములు గ్రహింపు మని భావము.

మ. బహురత్నద్యుతిమేదురోదరదరీభాగంబులన్ బొల్చు ని
మ్నహిమాహార్యమునన్ జరింతు మెపుడుం బ్రేమన్ నభోవా
హినీ, లహరీశీతలగంధవాహపరిఖేలన్మంజరీసౌరభ,గ్రహ
ణోందిందిరతుందిలంబు లివి మత్కాంతారసంతానముల్. 45

టీ. బహు...భాగంబులన్ - బహురత్న = అనేకరత్నములయొక్క, ద్యుతి=కాంతితో, మేదుర = సాంద్రమయిన, ఉదర = మధ్యదేశములుగల,

దరీభాగంబులన్ = గుహాప్రదేశములతో, పొల్చునిమ్మిహికాహార్యమునన్ = ఒప్పునట్టియీహిమవత్పర్వతమున, ఎపుడున్ = ఎల్లప్పుడును, ప్రేమన్ = అనురాగాతిశయముతో, చరింతుము = సంచరించెదము. నభోవా...తుందిలంబులు_ నభోవాహినీ = ఆకాశగంగయొక్క, లహరీ = ప్రవాహమువలన, శీతల = చల్లనైన, గంధవాహ = వాయువులతో, పరిఖేలత్ = కలయఁ దిరుగుచున్న, మంజరీసౌరభ = పూగుత్తుల పరిమళముయొక్క, గ్రహణ = గ్రహించుటగల, ఇందిందిర = తుమ్మెదలచే, తుందిలంబులు = నిండినవి (అగు) ఇవి, మత్కాంతార సంతానముల్ = మాయుద్యానసమూహములు.

తుమ్మెదలు మకరందము గ్రోలుటచేఁ బూవులసొంపు చెడును. కాననే కాళిదాసుఁడు శిరీషముల "ఈషత్ చుంబితాని భ్రమరైః" అని చెప్పెను. ఆకాశగంగనుండి వలిగాలి వీచినంత దీవెలు కదులును. ఆకదలికచేఁ బొడమిన తావిచేఁ దుమ్మెదలు కలిసియున్నవి. దీనిచేఁ బ్రసవసమృద్ధియు నుద్యానసౌభాగ్యాతిశయము నీవె గుర్తింపు మనుట.

తా. అనేకకాంతులతో నిండినగుహాలు గలయీహిమవంతమున నెప్పుడును జరించుచుందుము. గంగాతరంగములమీఁదినుండి వచ్చుటచేఁ జల్లనయిన గాలిచేఁ గలయఁ బ్రాఁకుపూగుత్తులపరిమళము నసపట్టి చరించుతుమ్మెదలతో నిండినయీప్రదేశములు మా యుద్యానములు.

క. భూసుర కైతవకుసుమశ
రాసన! మాయింటివిందవైతివి గైకొ
మ్మా సముదంచన్మణిభవ
నాసీనత సేద దేఱి యాతిథ్యంబున్. 46

టీ. భూసురకైతవకుసుమశరాసన = బ్రాహ్మణమిషమున నున్న మన్మథుఁడా! (లేక) కైతవకుసుమశరాసన = కపటమన్మథుఁడవగు, భూసుర = బ్రాహ్మణుఁడా! మాయింటివిందవు = బందుగుఁడవు, ఐతివి, సముదంచన్మణి

భవనాసీనతన్ = ఒప్పారునట్టి మణిగృహమునందుఁ గూర్చుంటచే, సేదదేఱి = శ్రమతీఱి, ఆతిథ్యంబున్ = అతిథిసత్కారమును, కైకొమ్మా = కొనుమా.

తా. ఓ బ్రాహ్మణోత్తమా! నేఁడు మాకుఁ జుట్టమవైతివి. ఇదిగో, మణినిర్మితగృహము. ఇం దలసట వాయునట్టు విశ్రమించి మేము చేయు నతిథిపూజల గ్రహింపుము.

తే. కుందనమువంటి మేను మధ్యందినాత
పోష్మహతిఁ గందె వడ దాఁకె నొప్పులొలుకు
వదన మస్మద్గృహంబు పావనము నేసి
బడలికలు వాసి చను మన్న బ్రాహ్మణుండ. 47

టీ. కుందనమువంటి మేను = మేలిమిబంగారువంటిశరీరము, మధ్యందినాతపోష్మహతిన్ = మిట్టమధ్యాహ్నపు టెండవేఁడిమి తాఁకుటచే, కందెన్, ఒప్పులు = సొగసులు, ఒలుకువదనము = స్ఫురించుముఖము, వడదాఁకెన్, అస్మద్గృహంబు = మాయిల్లు, పావనము చేసి = పవిత్రము చేసి, బడలికలు వాసి = శ్రమము తీఱి, చను మన్నన్ = పొమ్మనఁగా, బ్రాహ్మణుండు. ఇటఁ బలికె నను క్రియ యధ్యాహార్యము.

పట్టపగటియెండచేఁ గంది బడలిపోయినాఁడవు గాన విశ్రమించుట యవసరము. విశ్రమింపఁ దావులు లేక కాదు. నీ వుత్తముఁడవు గాన నీరాకచే నాగృహము పావనము గాఁగలదు గాన మాయింటికి రమ్మనిభావము. కైతవకుసుమశరాసన యను సంబుద్ధిచే వరూథినిభావము సువ్యక్తము.

ఉ. అండజయాన నీ వొసఁగునట్టిసపర్యలు మాకు వచ్చె నిం
దుండఁగ రాదు పోవలయు నూరికి నింటికి నిప్పు డేను రా
కుండ నొకండువచ్చి మఱియొండు నెభక్తియుఁ జాలు సత్క్రియా
కాండముఁ దీర్ప వేగసనఁగావలయున్ గరుణింపు నాపయిన్.

టీ. అండజయాన = అంచనడలుగలదానా! నీవు, ఒసఁగునట్టిసపర్యలు=కావించునట్టి యతిథిసత్కారములు, మాకున్ వచ్చెన్=మాకుఁ జేరెను. ఇందున్=ఈప్రదేశమునందు, ఉండఁగరాదు=వసింపఁదగదు పోవలయున్ = మాపురమున కేఁగవలయును. (వరూథినికామేంగితప్రకటనమునందుఁ గల యనిష్టత నిం దుండఁగరా దనుటచే వ్యక్తమగుచున్నది.) ఇంటికిన్=మీయింటికి, ఇప్పుడు, ఏను=నేను, రాకుండన్ ఒకండు=రాకున్న నొకటి, వచ్చిమఱికొందున్ ఏ=వచ్చినమఱియొకటియునా? భక్తియ=(నీకుఁగల) ఈభక్తియే చాలును. సత్క్రియాకాండము = పవిత్రమైనకర్మకాండమును, తీర్పన్ = తీర్చుకొనుటకు, వేగ=త్వరగా, చనఁగావలయున్=పోవలయును. నాపయిన్, కరుణింపుము = దయదలంపుము.

అతిథిపూజనము భక్తిప్రకటనము. ఆభక్తియె సుకృతము గలుగఁజేయుచుండ నతిథివచ్చినంత రాకపోయినంత నెట్టిలాభాలాభములు కలుగ వనుట. సత్క్రియాసమూహము కాలాతీతమునకుఁ దగినదికాదు. కాన కరుణించుట త్రోవచెప్పి పంపుట.

తా. ఓచిన్నదానా! నీవు చేయునట్టి మర్యాదలన్నియుఁ జేసినట్టే యనుకొనుము. ఇప్పు డిక్కడ నిలుచుటకు వల్లపడదు. మీయింటికి నేను వచ్చిన నొకటి రాకున్న నొకటి కాదు. ప్రీతియే చాలును. నేను శీఘ్రముగా మాయూరికిఁ బోవలయు. దయచేసి త్రోవచూపి నన్నుఁ బంపుము.

ఉ. ఏనిఁక నిల్లుసేరుటకునెద్దియుపాయము మీమహత్త్వముల్
మానిని దివ్యముల్ మదిఁ దలంచిననెందునుమీకసాధ్యముల్
గానము గానఁ దల్లి ప్రజలన్ ననుఁ గూర్పు మటన్న లేఁతన
వ్వాననసీమఁ దోఁప ధవళాయతలోచన వానికిట్లనున్. 49

టీ. ఏన్=నేను, ఇఁకన్ = ఇఁకముందు, ఇల్లు సేరుటకున్ = గృహమునకు (స్వపురమునకు)ఁ బోవుటకు, ఎద్ది యుపాయము = ఏది తెరువు,

మానిని=ఓయువతీ, మీమహత్త్వముల్ = మీప్రభావములు, దివ్యముల్ = అమానుషములైనవి. మదిన్ = మనస్సునందు, తలంచినన్ = విచారింపఁగా, మీకున్, అసాధ్యముల్ = సాధింపరానివి, ఎందున్ = ఏప్రదేశమునందును, కానము=చూడఁబోము, కానన్ = కావున, తల్లి=అమ్మా! ప్రజలన్=సావారైనజనులను, ననుఁగూర్పుము = నన్నుఁబ్రజలలోఁబడవేయుము. అటన్నన్= అనఁగా, లేఁతనవ్వు=చిఱునవ్వు, ఆననసీమన్=ముఖప్రదేశమున, తోఁపన్= పొడమఁగా, ధవళాయతలోచన = తెల్లనివిశాలములైన కన్నులుగల యా వరూథిని, వానికిన్ = ఆప్రవరాఖ్యునకు, ఇట్లు=ఈవిధముగా, అనున్ = పలికెను.

చూపులను దెల్లఁగను గనులను జెల్లఁగను జెప్పుట కవిసమయము. కనులలోఁ బాపగలభాగముకంటెఁ దెల్లనిభాగ మెక్కువగుటచేఁ బ్రాయికముగఁ దెలికన్ను లనుట గలదు.

సీ. 'తెలికన్నుఁగవకు సెచ్చెలియైనలేఁతన వ్వొలయంగ సరసంపుఁబలుకుపలికి.'

విరాటపర్వము.

తా. తల్లీ! నే నింక నిల్లు చేరుట కుపాయము తెలుపుము. మీమాహాత్మ్యము లద్భుతము లైనవి. మీ కసాధ్యము లెందును లేవు. నన్నుఁ బ్రజలలోఁ బడవేయుము. అని ప్రవరుఁడు ప్రార్థింపఁగాఁ జిఱునవ్వు నవ్వుచు నా వరూథిని యతని కిట్లనియె.

ఉ. ఎక్కడియూరు కాల్ నిలువకింటికిఁ బోయెద నంచుఁ బల్కెదీ
వక్కట మీకుటీరనిలయంబులకున్ సరిరాక పోయెనే
యిక్కడిరత్నకందరము లిక్కడినందనచందనోత్కరం
బిక్కడిగాంగసైకతము లిక్కడియాలవలీనికుంజముల్. 50

టీ. ఎక్కడియూరు = (ఊరుఊరనిపలవరించెద వేమి యూరయ్యా అది?) కాల్నిలువక=అడుగునిల్వక, ఇంటికి పోయెద నంచున్ = స్వగృహమునకుఁ బోవలయు ననుచు, పల్కెదు=చెప్పెదవు, అక్కట=అయ్యో! మీకుటీర

నిలయంబులకున్ = మీగడిసెకొంపలకు, రత్నకందరములు = మణిమయము లగుగుహలు, నందనచందనోత్కరంబు = ఉద్యానములందలి మంచిగంధపు మ్రాఁకులు, ఇక్కడి, గాంగసైకతములు=గంగానదిలోని యిసుకదిన్నెలును, లవలీనికుంజములన్=వెన్నెలతీగల పొదరిండ్లును, సరిరాకపోయెనే=సమానము కాకపోయెనా ?

రత్నకందరము లుపభోగయోగ్యములు. లవలీనికుంజములుగూడ నట్టివి. శైలవిహారసమయమున గుహలందును వనవిహారమున బొదరిండ్లను గ్రీడింప వచ్చు ననుట. నందనోద్యానభూమియుం గాంగసైకతము ఉపభోగోచితము లనుటకు—

సీ. "నందనోద్యానమందారకచ్ఛాయల విశ్రమింపఁగ నీకు వేడ్కగాదె,
మందాకినీ పాండుమహితసైకతములఁ గ్రీడసల్పఁగ నీకుఁ బ్రియముగాదె."

శృం. నై. ఆ. 3.

లవలీనికుంజములందుఁ బ్రసవసుగంధము వెల్లివిరియుచుంటచేఁ గామోద్దీపకము. లవలీనికుంజములు సుగంధబంధురము' లనుటకు —

"... ... ... ఒక్కచో వినూ
తన లవలీలతావళుల తావులఁ దావలమైన తావులన్."

వసు. ద్వి. 28.

తా. కాలాఁగక యూరూ రనుచుఁ బలవరించెద వేమి యూరయ్యా అది ? ఇక్కడి యీమణికందరములు, గంధపుమ్రాఁకుదోఁటలు, ఇక్కడి గంగానదీసైకతములు, ఇక్కడి వెన్నెలతీవపొదరిండ్లు మీగడిసె కొంపలకు సాటి రాలేదా ?

ఉ. నిక్కము దాఁప నేల ధరణీసురనందన యింక నీపయిన్
జిక్కె మనంబు నాకు ననుఁ జిత్తజుబారికి నప్పగించెదో
చొక్కిమరందమద్యములచూఱలఁబాటలువాడుతేంట్లసొం
పెక్కినయట్టిపూవుఁబొదరిండ్లను గౌఁగిట గారవించెదో. 51

టీ. ధరణీసురనందన=చిఱుతపాఱుఁడా, ఇంకన్=ఇంకను, నిక్కము=నిజముగ, దాఁప నేల = దాఁచిపెట్ట నేల.(ఇంతవఱకు వచ్చినపిదప దాఁచుట యెందులకు) నాకున్, నీపయిన్=నీమీఁద, మనంబు చిక్కెన్=మనస్సు తగిలెను. (నిన్ను వలచితిని) ననున్=నన్ను, చిత్తజుబారికిన్ = మదనావస్థకు, అప్పగించెదో=లోఁబఱచెదవో, మరందమద్యముల = పుష్పరసమను సారాయి యొక్క, చూఱలన్=కొల్లలచేత (కొల్లగాఁ ద్రావుటచేఁ గైపెక్కి) పాటలు పాడు=ఝుంకారమునొనర్చు, తేంట్లన్ = తుమ్మెదలచే, సొంపెక్కినయట్టి = సొగసుమీఱినట్టి పూవుఁబొదరిండ్లను = పూలనిండారిన పొదరిండ్లలో, కౌఁగిటన్=కౌఁగిలింతలయందు, గారవించెదో = సమ్మానించెదవో. వైపద్యముతో నన్వయము.

మద్యపానమువలన గాత్రస్వారస్య మతిశయించును, పొదరిండ్లు తేటులపాటులచే నలరుటకతన మణితాదికములు ఇతరులు వినఁజాల రనియుఁ బూవుఁబొదరిండ్లు గాన మిగులఁ బెనఁగొనియుంటచే నితరులకుఁ గానరాకుండ నుండనగు ననియుం భావము.

తుమ్మెదలకుఁ దేనె ద్రావుటచే గాత్రమాధుర్య మతిశయించు ననుటకు—
"రతిపతిప్రహితేన కృతక్రుధః ప్రియతమేషు వధూరనునాయితాః,
వకుళపుష్పరసాసవపేశలధ్వనిరగాన్నిరగాన్మధుపాళినః.
మధురయా మధుబోధితమాధవీ మధుసమృద్ధిసమేధితమేధయా,
మధుకరాంగనయా ముహురున్మదధ్వనిభృతా నిభృతాక్షరముజ్జగే."

మాఘకావ్యము.

తా. ఓ విప్రకుమారా! నిజ మింక నేల దాఁచవలయుం? నామనము నీపైఁ జిక్కినది. ఇంక నన్ను మన్మథ బాధలకుఁ బాల్పఱిచెదవో తేనియల డగఁ ద్రావి రొద సేయుతుమ్మెదలు గలపూఁబొదరిండ్లలోఁ గౌఁగిటఁ జేర్చి గారవింతువో?

క. అనుటయుఁ బ్రవరుం డిట్లను
వనజేక్షణ యిట్లు వలుక వరుసయె వ్రతులై
దినములు గడపెడువిప్రులఁ
జనునే కామింప మది విచారము వలదే. 52

టీ. అనుటయు=వరూథిని యిటు లనఁగా, ప్రవరుఁడు, ఇట్లనున్ = ఇటులఁ బ్రత్యుత్తర మిచ్చెను, వనజేక్షణ = తామరఱేకులవంటి కనులు గల చెలువా! ఇట్లు, పలుకన్ = మాటలాడుట, వరుసయె=క్రమమా? వ్రతులై = ఉపవాసాది వ్రతములొనరించువారై, దినములు=కాలము, కడపెడువిప్రులన్, కామింపన్ = కవయఁగోరుట, చనునే=తగునా? మదిన్ = మనస్సునందు, విచారము=యుక్తాయుక్తనిర్ణయమేని, వలదా=ఉండరాదా?

ఉ. వేలిమియున్ సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కె భుక్తి కిన్, వేళ యతిక్రమించె జననీజనకుల్ కడువృద్ధు లాఁకటన్, సోలుచుఁ జింతతో నెదురు సూచుచు నుండుదు రాహితాగ్ని నేఁ, దూలు సమస్తధర్మములుఁ దొయ్యలి నేఁ డిలు సేరకుండినన్. 53

టీ. తొయ్యలి=ఉవిదా! వేలిమియున్ = అగ్నికార్యమును, సురార్చనయున్ = దేవతార్చనమును, విప్రసపర్యయున్ = బ్రాహ్మణసేవయును, చిక్కెన్=మిగిలియుండెను. భుక్తికిన్=భోజనమునకు, వేళ, అతిక్రమించెన్, జననీజనకుల్ = తలిదండ్రులు, కడున్, వృద్ధులు, ఆఁకటన్ = ఆఁకలిచే, సోలుచున్=ఉసురసురనుచు, చింతతోన్=విచారముతో, ఎదురుచూచుచున్ ఉందురు. నేన్=నేను, ఆహితాగ్నిని = నిత్యముగా నగ్నినుంచుకొని కర్మములఁ గావించువాఁడను, నేఁడు=ఈదినమున, ఇలు=గృహము, చేరకుండినన్= చేరఁబోవక యున్నయెడల, సమస్తధర్మములున్=సర్వశాస్త్రవిహితములగు నాచారములును, తూలున్=చెడును. కావున గృహమునకుఁ బోయిరావలయునని భావము.

తా. అగ్నికార్యమును దేవతార్చనమును మిగిలి యున్నవి. భోజనశాల నతిక్రమించెను. తల్లిదండ్రులు మిగుల ముదుసల్లు. ఆఁకలితో నను రుసు రసుచు నాకై యెదురుచూచుచుందురు. నే నాహితాగ్నిని. నేఁ డిల్లు చేరకుండినచో సర్వధర్మములుఁ జెడును.

ఉ. నావుడు విన్నఁబాటు వదనంబున నించుక దోఁపఁ బల్కెనో
భావజరూప యిట్టియెలప్రాయము వైదికకర్మనిష్ఠలన్
బోవఁగనింకభోగములఁబొందుట యెన్నఁడు యజ్ఞకోటులం
బావను లౌటకున్ ఫలము మాకవుఁగిళ్లసుఖించుటే కదా.

టీ. నావుడున్=అనఁగా, వదనంబునన్ = ముఖమున, ఇంచుక=కొంచెము, విన్నఁబాటు=విన్నపోవుట, తోఁపన్ = ఎఱుకపడఁగా, (వరూథిని) పల్కెన్, ఓభావజరూప = మన్మథునిరూపువంటిరూపుగలవాఁడా! ఇట్టి యెలప్రాయము = ఇటువంటి చిఱుతవయసు, వైదికకర్మనిష్ఠలన్ = వేదప్రతిపాదితములగుకర్మముల ననుష్ఠించుటలందు, పోవఁగన్ = గడచిపోవుచున్నయెడల, ఇంకన్=ఇఁకన్, భోగములన్ = సుఖములను, పొందుట = అనుభవించుట, ఎన్నఁడు=ఎప్పుడు? వయస్సు తీఱినపిదప నీసుఖములు బడయ నగునా? యజ్ఞకోటులన్ = యజ్ఞసమూహములచే, పావను లౌటకున్ = పవిత్రు లగుటకు, ఫలము=ప్రయోజనము, మాకవుఁగిళ్లన్ = మా యాలింగనములయందు, సుఖించుటేకదా = సౌఖ్యముల నొందుటయేగదా! (పా. సుఖింపనేగదా = సుఖించుటకేకదా.)

నిష్ఠాపరులు యజ్ఞములు గావించుచున్నారు. యజ్ఞఫలము అప్సరః కాంతాసమాగమము. అప్రయత్నముగా నెలప్రాయమున వేల్పుచెలువ సిద్ధించుచుండ నిరాకరించుట ప్రమాద మనుట.

తా. అనఁగా వరూథిని కొంచెము ముఖము చిన్నపుచ్చుకొని యిట్లనియెను. ఓమదనసుందరమూర్తీ! ఇట్టి లేఁబ్రాయము వైదికకర్మానుష్ఠానము

లందుఁ గడపినచో నింక విషయసుఖముల ననుభవించుట యెన్నఁడు? అనేక యజ్ఞములం జేసి పవిత్రు లగుటకు ఫలము మాకవుఁగిలింతలఁ జిక్కి సౌఖ్యము నందుటయే గదా! (యజ్ఞములు చేసినవారు స్వర్గమున నప్సరస్సంగతిఁ జెందుదురని శ్రుతులు.)

సీ. సద్యోవినిర్భిన్నసారంగనాభికా
        హృతమై పిసాళించుమృగమదంబు
    కసటువో బీటెండఁ గరఁగి కట్టుల నంటి
        గమగమ వలచుచొక్కపుజవాజి
    పొరలెత్తి ఘనసారతరువులఁ దనుఁదాన
        తొరఁగినపచ్చకప్పురపుసిరము
    గొజ్జంగిపూఁబొదల్ గురియంగఁ బటికంపు
        దొనల నిండినయట్టితుహినజలము
తే. వివిధకుసుమకదంబంబు దివిజతరుజ
    మృదులవసనఫలాసవామేయరత్న
    భూషణంబులు గల వింటు భోగపరుఁడ
    వయి రమింపుము ననుఁ గూడి యనుదినంబు. 55

టీ. ఇందుఁ = ఇక్కడ (ఈప్రదేశమగు మంచుమలయందు). సద్యో...హృతమై-సద్యః = అప్పుడే, వినిర్భిన్న=చిట్లిన, సారంగనాభికా = కస్తూరిమృగముయొక్క బొడ్డునుండి, హృతమై=కైకొనఁబడినదై, (హరింపఁబడినదై) పిసాళించు మృగమదంబు = పరిమళించుకస్తూరియును, కసటు = మాలిన్యము, పోన్=పోవునట్లు, బీటెండన్ = తీవ్రమైన యెండచే, కరఁగి = నీరుగా ద్రవించి, కట్టులన్ = కట్టెపుల్లలందు, అంటి = అంటుకొని, గమగమ వలచు చొక్కపుజవాజి = గమగమసువాసనకొట్టు నిద్దపుజవ్వాజియును పొరలెత్తి = పొరలూడి, ఘనసారతరువులన్ = కర్పూరపుటనఁటిచెట్లనుండి,

తనుఁదాన=తనయంతటతాను (ఇతరుల ప్రయత్నములు లేకయే) తొరఁగిన=క్రిందికి రాలిన, పచ్చకప్పురపు = పచ్చకర్పూరముయొక్క, సిరము = పొడియును, గొజ్జంగిపూఁబొదల్ = గులాబీపూలపొదలు, కురియంగన్ = చినుకఁగా, పటికంపుదొనలన్ = స్ఫటికశిలాస్థలములందలి దొనలలో నింపినయట్టి, తుహినజలము = పన్నీరును, వివిధకుసుమకదంబంబు = పలు తెఱఁగులైన పూలప్రోవులును, దివిజతరుజ...భూషణంబులు-దివిజతరుజ = కల్పవృక్షములవలనఁగల్గిన, మృదుల=మెత్తనైన, వసన=వస్త్రములును, ఫల = పండ్లును, ఆసవ=మద్యములును, అమేయ=కొలఁదియిడరాని, రత్నభూషణంబులు = రత్నములును నగలును, ఇందున్ కలవు=ఉన్నవి. భోగపరుఁడవై = భోగాసక్తుఁడవై, ననుఁ గూడి=నాతోఁ గలసిమెలసి, అనుదినంబున్ = నిత్యమును, రమియింపుము = భోగింపుము. ఉదాత్తాలంకారము.

సారంగనాభికావ్యాప్తమగు కస్తూరి సద్యోవినిర్భిన్న మగుటచే సుగంధాతిశయము సూచితము. జవ్వాజి కఱ్ఱలనంటినది ప్రశస్తమైనచో నెండకకరఁగును.

సీ. "కట్టెండవేఁడిఁ గాఁకఁగరంగి ప్రవహించు జవ్వాది డిగ్గియచాలలోయ"

చంద్రికాపరిణయము ద్వి. ౨౦.

గొజ్జంగిపొదరిండ్ల మంచు గురిసి యది పూలకు సోఁకి క్రిందరాలి దొనలోఁ జేరినఁ బన్నీ రగును. ఇట్లగుటకు

చ. "కొలకులపజ్జసజ్జకపుఁగొజ్జఁగిపూఁబొదరిండ్లజోరునన్
జిలుకుహిమాంబుపూరములు శీతకరోపలపట్టికాతటం
బులదుముకంబుటం బెగయుం భూరితుషారకణంబు." వసు. ద్వి.

తా. ఓ బ్రాహ్మణుఁడా! భోగవస్తువులయిన కస్తూరి జవ్వాజి పచ్చకర్పూరము పన్నీరు పువ్వులు పండ్లు మృదుతరములయిన వస్త్రములు రత్నపుసొమ్ములు త్రాఁగఁదగిన మద్యములు ఇవన్నియుం మిక్కిలి శ్రేష్ఠతరములైనవి యిక్కడ సమృద్ధిగా నున్నవి. వానివలని భోగములనెల్ల ననుభవించుచు

సాతోఁ గూడి యిక్కడ ప్రతిదినమును సంభోగించుచుందుము. అలం. ఉదాత్తము.

క. అంధునకుఁ గోఁ అయె వెన్నెల
గంధర్వాంగనలపొందు గాదని సంసా
రాంధువునఁ బడియె దకట ది
వాంధము వెలుఁగు గని గొంది నడఁగినభంగిన్. 56

టీ. అంధునకున్ = గ్రుడ్డివానికి, వెన్నెల, కోఁ అయె = అవశ్యకమా! అకట=అయ్యో, గంధర్వాంగనలపొందు = గంధర్వస్త్రీలకూటమి, కాదని = సరిపడదని, సంసారాంధువునన్ = సంసారకూపమున, పడియెదు, దివాంధము=గ్రుడ్లగూబ, వెలుఁగు=వెల్తురును, కని, గొందిన్ = చీకటిక్రింతలో, అడఁగినభంగిన్=అణఁగియుండువిధముగా, అలం. ప్రతివస్తూపమ. ఉపమ.

గంధర్వాంగనలు పలువిధముల హృదయమును రంజింపఁగలవారు. అట్టి ముగుద తనంత దొరకఁగా నొల్లమి సిరిరా మోఁకా లడ్డుటవలె నున్నది. అకట యనుటచే నీయవివేకస్థితి నాకె సంతాపము కలుగఁజేయుచున్నదనుట.

తా. గ్రుడ్డివానికి వెన్నెల పనికిరానియట్లు మావలని సంభోగసుఖ మెఱుఁగని నీకు నామాటలు పనికిరానివయ్యెను. నీవు వెలుతురు చూడనొల్లక గ్రుడ్లగూబ చీకటికమ్ముకొన్న యిఱుకుమూలలోఁ దాగునట్లు గంధర్వస్త్రీల మయిన మాకూటమి యొల్లక సంసార మనెడి నూతిలోఁ బడియుండఁ గోరు చున్నావే యయ్యో యిది తగునా యని యడిగెను. అలం. ప్రతివస్తూపమ, ఉపమయుఁ.

ఉ. ఎన్నిభవంబులన్ గలుగు నిక్కుశరాసనసాయకవ్యథా
ఖిన్నత వాడి వత్తలయి కేలఁ గపోలము లూఁది చూపులన్
విన్నఁదనంబు దోఁపఁ గనువేఁదుఱునన్ బయిగాలి సోఁకినన్
వెన్నవలెన్ గరంగునలివేణులఁ గౌఁగిటఁ జేర్పుభాగ్యముల్.

టీ. ఇక్షు...ఖిన్నతన్-ఇక్షుశరాసన=మన్మథునియొక్క, సాయక = బాణములయొక్క, వ్యథా=బాధవలని, ఖిన్నతన్ = వ్యాకులతచేత, వాడి = నవకము చెడి, (ఇది వ్యథాతిశయము దెలుపును.) వత్తులయి=కృశించి, కేలన్=చేతులందు, కపోలములు = చెక్కిళ్లు, ఊఁది = చేర్చి, చూపులన్, విన్నఁదనంబు=దైన్యము, తోఁపన్=కనిపింపఁగా, కనువేఁదుఱునన్=కంటిపిచ్చిచేత, ఇది చక్షుఃప్రీతి యను ననంగదశావిశేషము. పరస్పరానురాగమున కదియే ప్రథమావలంబము. పైగాలి=(ప్రియుని) మీఁదిగాలి, సోఁకినన్ = తాఁకినను, వెన్నవలెన్=(వేఁడితాఁకిన) వెన్నవలె, ఏప్రయత్నములేకయే విరహముచేఁ గృశించి తమకుఁ దామగా వచ్చి ప్రార్థించి యనుట. కరఁగునవివేణులన్ = మనసుకరఁగు నువిదలను, కౌఁగిటన్ = కౌఁగిలియందు, చేర్చుభాగ్యముల్ = చేర్చుకొనునట్టి యదృష్టములు, ఎన్నిభవంబులన్ కలుగున్ = ఎన్నిజన్మము లెత్తి ప్రయత్నముచేసిన సంభవించును? తమంతఁ దామ వలచి వలపుప్రేగుచేఁ గృశించి కన్నంతమాత్రనఁ గరఁగిపోవు చెలువలు పురుషునికి వేయిజన్మములకు లభించుట యరిదిః అట్టి లోకోత్తరభాగ్యమును గూడఁ దోలంగఁ ద్రోచికొనుచున్నాఁడవనుట.

తా. తమ్ముఁ జూచి వలచి పూవిల్తునితూపులపోటులకుఁ జిక్కి వాడి కృశించి చెక్కిళ్లు చేతులఁ జేర్చి దీనచూపులతోఁ జూపువాసికిని వెల్లడించుచుం దమగాలి సోఁకినను మనసు కరఁగి మెత్తఁబడుజవరాండ్రను గౌఁగిటఁ జేర్చుకొనుభాగ్య మెన్నిజన్మములకును సంభవింపదు.

క. కుశలతయే వ్రతముల నగు
 నశనాయాపీడ నింద్రియనిరోధమునన్
 గృశుఁడవయి యాత్మ నలఁచుట
 సశరీరస్వర్గసుఖము సమకొని యుండన్. 53

టీ. సశరీరస్వర్గసుఖము = ఈశరీరముతోనే (లభ్యముగా) స్వర్గలోకసౌఖ్యము, సమకొని యుండన్ = సంభవించియుండఁగా, వ్రతములన్=నేవ

ాసాదినియమములచే, అగుచశనాయా పీడక్ = అగునట్టి క్షుద్బాధచే, (అశ
ాయాసముచన్ = అగునట్టి ఆహార(వర్జన) శ్రమచేత నని. పా.) ఇంద్రియ
రోధమునన్=విషయములందుఁ బ్రవర్తింపనీక పంచేంద్రియములను బిగ్గఁ
ట్టుటచే, కృశుఁడవు = చిక్కినవాఁడవు, అయి, ఆత్మన్ = జీవాత్మను,
లఁచుట = హింసఁజేయుట, కుశలతయే = మంచిదా? నేర్పరితనమా?
రీరానంతరస్వర్గసుఖ మప్సరోంగనాభోగము. సుఖమెఱుంగఁదగినది దేహము.
దిలేని పారలౌకికసౌఖ్యముకంటె నీచశరీరసుఖము గొప్ప దనుట.

తా. ఇప్పటిపుణ్యకర్మములకు ఫలముగా శరీరము విడిచినపిదప లభింపఁ
ీవు స్వర్గసౌఖ్య మిప్పు డీశరీరముతోనే లభించుచుండఁగా నింక నుపవాసా
ంలుచేసి శరీరమును గృశింపఁజేసికొని జీవాత్మను హింసపెట్టుట మంచిదా?
ావ్యలింగాలంకారము.

కే. అనినఁ బ్రవరుండు నీ వన్న యర్థ మెల్ల
నిజము కాముకుఁ డైనవానికి నకాముఁ
డిది గణించునె జలజాక్షి యెఱిఁగిలేని
నగరమార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొమ్ము. 59

టీ. అనినన్=ఇట్లులఁ బ్రవరునితో వరూథిని యనఁగా, ప్రవరుఁడు,
ిలజాక్షి=ఓచిన్నదానా! నీవు+అన్న యర్థము=నీచెప్పినవిషయము, ఎల్లన్ =
ంతయుం, కాముకుఁడు = విషయాపేక్షగలవాఁడు, ఐనవానికిన్ = అయినట్టి
రుంషునకు, నిజము = (అపేక్షితమగుట) సత్యము. అకాముఁడు=విషయా
పేక్షలేనివాఁడు, ఇది=ఈయంశమును, గణించునె=లెక్కచేయునా? కాము
ఁడు కానివాని కీసౌఖ్యము వర్జనీయ మనుట. ఎఱిఁగిలేని=నీ వెఱింగియున్న
ితిమున, నగరమార్గంబున్ = పట్టణమునకుఁ బోవుత్రోవను, చూపి =
మాపించి, పుణ్యమునఁబొమ్ము=పుణ్యము కట్టుకొనుము. ప్రవరాఖ్యుఁడు కడకు
నికి నీమాటలు కాముకులనుగూర్చినవి. నావి కావు. త్రోవయే నిన్నడుగునది
ను నెను.

తా. ఓజలజాక్షీ! నీవు చెప్పినసంగతి విషయేచ్ఛలు గలవానికిఁ జెల్లును గాని నిష్కాములమై మోక్షము నపేక్షించు మాబోంట్లకుఁ జెల్లదు. కావున నీమాటలు వలదు. ఎఱిఁగియుంటివా యూరికిఁ జేరుతెరువు తెలిసి పుణ్యము కట్టికొనుము.

క. బ్రాహ్మణుఁ డింద్రియవశగతి
జిహ్మాచరణైకనిపుణచిత్తజనిశితా
జిహ్మగములపాలై చెడు
బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుఁడై 60

టీ. బ్రాహ్మణుఁడు = బ్రహ్మజ్ఞానసంపన్నుఁడగువాఁడు, ఇంద్రియవశగతిన్ = ఇంద్రియములకు లోఁబడిన నడువడిగలుగుటచే, జిహ్మా...జిహ్మగముల పాలై - జిహ్మాచరణ = వంకరలు కలిగించుటలో, ఏక = ముఖ్యముగా, నిపుణ = నేర్పరి యగు, చిత్తజ = మదనునియొక్క, నిశిత = వాఁడియైన, అజిహ్మగముల పాలు ఐ = ములుకులపరమై, బ్రహ్మ...చ్యుతుఁడై - బ్రహ్మానంద = పరమాత్మానుభవమువలనఁ గలిగిన సంతోషముయొక్క, అధిరాజ్య = అధిష్ఠించిన ప్రభుత్వముయొక్క, పదవీ = మార్గమునుండి, చ్యుతుఁడై = జాఱినవాఁడై, (తొలంగి) చెడున్ = నశించును.

తా. బ్రాహ్మణుఁడగువాని కింద్రియనిగ్రహము ముఖ్యముగా నుండఁదగినది. ఇంద్రియనిగ్రహములేనివాఁడు మోక్షాదు లొందఁజాలఁడు. అలం. కావ్యలింగము.

వ. అనిన నత్తెఱవ యక్కఱకఱిపలుకుల కులికి గఱిగఱిం గఱవఁ గరకరిం జెఱకువిలుకాఁడు పరగించువిరిదమ్మిగొరకలు నెఱఁ కులఁ జాఱుకుచుఱుక్కనం గాఁడినఁ గడుం గెరలి పరిణతవివిధవిబుధతరుజనితమధురమధురసం బానుమదంబు నదటునం జిదిమిన నెఱుంగక మదనహరు నైనఁ జదురునం

గదియ గమకించుతిమురునం గొమిరెప్రాయంపుమదంబునను నవనవ్యకశ్యాసామాన్యలావణ్యరేఖామదంబునను నొంటిపాటునం గంటికిం బ్రియుండై తంగేటిజంటిచందంబునం గొంటుఁదనం జెలుంగక కుఱంగట నున్న యమ్మహీసురవర కుమారుతారుణ్య మాధుర్యంబులం జేసి తనవైదగ్ధ్యంబు మెఱయఁగలిగె నని పల్లవించునుల్లంబునుల్లాసంబునం గదురు మదంబున నోసరించక చంచలదృగంచలప్రభ లతనిముఖాంబుజంబునం బొలయ వలయమణిగణచ్ఛాయాకలాపంబు లుప్పరం బెగయఁ గొప్పు చక్కంజెక్కుచు జక్కవగిబ్బలుం బోని గబ్బిగుబ్బలం బొబ్బిల్లుకుంకుమరసంబునం బాకిలంబు లగుహారముక్తాతారకంబుల నఖకోరకంబులం గీఱి తీరుపడం జేయుచుం బతితవనతరుకుసుమకేసరంబులు రాల్చు నెపంబునం బయ్యెద విదల్చి చక్క సవరించుచు నంతంతం బొలయు చెలులం దలచూపక యుండఁ దత్తఱంబునం జేసి బొమముడిపాటుతో మిగిడిమిగిడి చూచుచుం జిడిముడిపాటు చూపుల నంకురించుజంకెనల వారించుచుం జేరి యిట్లనియె.

టీ. అత్తెఱవ = ఆస్త్రీ, అక్కఱకరిపలుకులన్ = ఆ (ప్రవరుని) కఠినపుమాటలకు, ఉలికి, చెఱకువిలుకాఁడు = మన్మథుఁడు, గఱిగఱిన్ = ఒక్కతో నొక్క, కఱవన్ = అంటుకట్టు (ఎడతెఱపిలేక) కరకరిన్ = క్రౌర్యముతో, పరగించు విరిదమ్మిగోరకలు = ప్రయోగించు విచ్చినతమ్మిపూ మొల్కలు, నెఱకులన్ = ఆయంపుకట్టులను, చుఱుకుచుఱుక్కనన్ = చుఱుకుచుఱుక్కుమని, కాఁడినన్ = గ్రుచ్చుకొనఁగా, కనుక్, కెరలి = అతిశయించి, ఒక్కతో నొక్క యొకయంతటు లచట పుంఖానుపుంఖ

ముగా ననుట. బాణములు మిగుల వేగముగా లక్ష్యము దూలంగక పోవుటకు వానికి ఈఁకలు కట్టుసాచారము గలదు. కాన నాయువుపట్టుల గుఱి తప్పక గాటముగా నాటుచున్న వని భావము. పరిణత...రసంబు - పరిణత = పండిన, వివిధ=నానావిధములగు, విబుధతరు = కల్పవృక్షములవలన, జనిత= పుట్టిన, మధుర=తీయని, మధురసంబు = మద్యమును, అనుమదంబు = త్రావు మత్తుయొక్క, అదటునన్=ఉద్రేకముచే, చిదిమినన్ = నొక్కినను, ఎఱుం గక, మదనహారు నైనన్=శివు నైనను, చదురునన్=నైపుణ్యముచే, కదియన్= కలియుటకు, గమకించుతిమురునన్=యత్నించుపొగరుచేతను, ప్రౌఢవయసీ మదముచేఁ గన్నెఱుంగనీయనిది అందు మద్యమద మున్న నొడలెఱుంగుట కష్టము. ఈ మధురస మట్టిదికాదు. విబుధతరుజన్యము గాన మఱియుఁ గైపు గలిగించు నని భావము. కొమిరెప్రాయంపు మదంబునను=కన్నెప్రాయపు మదముచేతను, అనన్య...మదంబునను-అనన్యకన్యాసామాన్య = ఇతరకన్యలకు లేని, లావణ్యరేఖా = మేనిమిసమిసతీరువలని, మదంబునను = మదముచేతను, ఒంటిపాటునన్, కంటికిన్, ప్రియుండై = ప్రియముగలుగఁ జేయువాఁడై, లావణ్య మన సౌందర్యాతిశయముగల వెలఁదులదేహకాంతి. తల్లక్షణము.— శ్లో. "ముక్తాఫలేషుచ్ఛాయాయా స్తరలత్వమివాంతరా, ప్రతిభాతి యదంగేషు లావణ్యం తదిహోచ్యతే." తంగేటిజుంటిచందంబునన్ = తంగేడుచెట్టునకుఁ బట్టిన తేనెతుట్టెవలె, గొంటుఁదనంబు = దుడుఁకుఁదనమును, ఎఱుంగక, కుఱం గటన్ = చెంగట, ఉన్నయమ్మహీ...మార్గ్యంబులం జేసి-ఉన్నయమ్మహీసుర వరకుమారు=ఉన్నట్టియాలేఁ బ్రాయపుబ్రాహ్మణశ్రేష్ఠుని, తారుణ్యమార్గ్యం బులం జేసి=వయసుచేతను చక్కఁదనముచేతను, తన వైదగ్ధ్యంబు = తననేర్పు, మెఱయన్=ప్రకాశింప, కర్గెనని, పల్లవించు నుల్లంబు నుల్లాసంబునన్ = చిగిరించు మనస్సుయొక్క సంతోషముచే, కదురు మదంబునన్ = కలుగు మదముచేతను, ఓసరించక = తొలఁగక, చంచల...ప్రభలు-చంచల = బెళు కెడు, దృగంచల = కనుఁగొలఁకులయొక్క, ప్రభలు = కాంతులు, అతని

ముఖాంబుజంబునన్ = అతనిముఖపద్మమున, పొలయన్ = ప్రసరింపఁగా, వలయ. . .కలాపంబులు-వలయ=కంకణములయొక్క, మణిగణ=రత్నసమూహములయొక్క, ఛాయా=కాంతులయొక్క, కలాపంబులు = సమూహములు, ఉప్పరంబు = ఆకాశమునకు, ఎగయన్ = వ్యాపింపఁగా, కంకణకాంతులు మింటికి వ్యాపించుట పెన్నెరి సవరించి కొనుటకుఁ గే లెత్తుటచేత. దానఁ జన్నులబిగియుం సువ్యక్త మయ్యెను. కొప్పు, చక్కన్ = చక్కఁగా, చెక్కుచున్ = కుదుర్చుచు, జక్కవ గిబ్బలుంబోని = ప్రాయపుఁజక్రవాకపక్షులంబోలు, గబ్బిగుబ్బలన్ = బిగిచన్నులనుండి, జొబ్బిల్లు కుంకుమ రసంబునన్ = స్రవించు కుంకుమపువ్వు రసముచే, పంకిలంబులు = బురదయంటినవానిఁబోలినవి, అగు, హారముక్తాతారకంబులన్ = ముత్యాల హారమందలి నక్షత్రములఁబోలినముత్యములను, నఖకోరకంబులన్ = మొగ్గలఁబోలు గోళ్లను, గీఱి, తీరువడం జేయుచున్=చక్కఁజేయుచు, పతిత వనతరుకుసుమకేసరంబులు = రాలిన యుద్యానవనములందలి పూలకింజల్కములను రాల్చు నెపంబునన్ = తొలఁగఁద్రోయుమిషతో, పయ్యెద = పైఁట, విదిల్చి, చక్కసవరించుచున్, అంతంతన్ = అంతటంతట, పొలయుం జెలులన్=వర్తిల్లు చెలికత్తెలను, తలచూపక యుండన్=తలకనఁబడకుండు నట్లు, తత్తఱంబునం జేసి = తొందరచేత, బోమముడిపాటుతోన్, మగిడి మగిడి=తిరిగి తిరిగి, చూచుచున్, చిడిముడిపాటుచూపులన్ = చెరచెరను చూపులందు,అంకురించుజంకెనలన్ = మొలచు బెదరింపులచేత, వారించుచున్ = ఆటంకపఱచుచు, చేరి=ప్రవరాఖ్యుని సమీపించి, ఇట్లనియెన్ = ఈవిధముగాఁ బలికెను.

శా. ఎందే డెందము కందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్
జెందున్ గుంభగతప్రదీపకళికాశ్రీ దోఁప నెం దెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుఁ గనునా యింపే పరబ్రహ్మ 'మా
నందో బ్రహ్మ' యటన్న ప్రాఁజడుపునంతర్బుద్ధి నూహింపుమా.

టీ. ఎందేన్=ఏవిషయమున, డెందము=మనస్సు, రహిచేన్=ప్రీతిచే, కందళించున్=వికాసముచెందునో, (చిగిరించునో) ఎందున్ = ఏవిషయమున, కుంభ...స్త్రీ - కుంభగత = గాజుకుప్పెలోనున్న, ప్రదీపకళికా = దీపపు మొగ్గయొక్క, శ్రీ=శోభ, తోఁపన్ = తోఁచునట్లు, ఏకాగ్రతన్ = దాని యందే నిలిచి, (కలకఁబాఱనితనముచే నిశ్చలత్వ మొంది) నిర్వృతిన్=సౌఖ్యమును, చెందున్=చెందునో, (దీనికిఁ గర్త డెందము) ఎందేన్ = ఏవిషయమున, ఇంద్రియములు = పంచేంద్రియములు, (త్వక్కు కనులు లోనగు నైదింద్రియము లనుట) ఎందున్ పోక = ఇతరములయొడకుఁ జలింపక, సుఖంబున్=సౌఖ్యమును, కనున్ = పొందునో, అయ్యంపే = అపాలుపే, పరబ్రహ్మము=పరతత్త్వము, ఆనందః బ్రహ్మ=ఆనందమే బ్రహ్మము, అటన్న ప్రాఁజదువున్= అన్న వేదవాక్యమును, అంతర్బుద్ధిన్=మనస్సులో, ఊహింపుమా = విచారింపుమా.

ఆనందాతిశయమె పరతత్త్వము. గాజుకుప్పెలోని దీపమువలె మనసు నొందు నిల్పినను నందుఁ గలుగు నానందమె పరబ్రహ్మము. ప్రాఁజదువు: సమాసములందుఁ బ్రాఁతాదులకు మీఁది వర్ణలోపంబును బరుషములు పరములైన ద్రుతాదేశంబును గలుగును.

తా. ఏవిషయమున మనస్సు వికాసముచెంది తన్మయమై నిర్వాణము చెందునో, ఇంద్రియము లన్నియుం నేవిషయమున లయించి సుఖ మందునో అట్టివిషయమువలని యానందమే బ్రహ్మానందము. 'ఆనందో బ్రహ్మ' యను వేదవాక్యమున కర్థమును యోజింపుము.

తే. అనుచుఁ ద న్నొడఁబఱచు నయ్యసురకాంత
త త్తఱముఁ జూచి యాత్మ నతండు దనకు
సిగ్గు వెగటును బొడమ నిస్పృహతఁ దెలుపు
నొక్కచిఱునవ్వు నవ్వి యయ్యువిద కనియె. 63

టీ. అనుచున్ = ఇటు లనిచెప్పుచు, ఒడఁబఱుచు నయ్యమరకాంత కత్తఱిన్=అంగీకరింపఁజేయు నాయప్సరస్త్రీయాత్రమును, చూచి = కాంచి, అతండు=ఆప్రవరాఖ్యుఁడు, ఆత్మన్ = మనస్సునందు, తనకున్, సిగ్గున్ = లజ్జయు, వెగటున్=విరసత్వమును, ఏవయు, పొడమన్=జనింపఁగా, నిస్పృహతన్=నైరాశ్యమును, విరాగమును, తెలుపునొక్కచిఱునవ్వు = తెలియఁజేయునట్టియొక్క దరహాసమును, నవ్వి, అయ్యువిదకున్ = ఆవరూథినితో, అనియెన్=ఇటులఁ బలికెను.

తా. ఆవిధముగాఁ దన్నంగీకరింపఁజేయు నాయచ్చరవేగిరపాటును జూచి తనలో సిగ్గును నేవయుఁ గలుగఁగా నైరాశ్యమును దెలుపున ట్లొక చిఱునవ్వు నవ్వి ప్రవరుఁడు ఇ ట్లనియెను.

శా. ఈపాండిత్యము నీకుఁ దక్క మఱెయెందేఁ గంటిమే కామ
శా, స్త్రోపాధ్యాయివి నా వచించెదవు మే లోహో త్ర
యీధర్మముల్, పాపంబుల్ రతిపుణ్య మంచు నిఁక నేలా
తర్కముల్ మోక్షలక్ష్మీపథ్యాగమసూత్రపంక్తి కివె పో
మీాసంప్రదాయార్థముల్. 64

టీ. ఈపాండిత్యము = ఈవేత్తృత్వము, నీకుఁ దక్కన్ = నీకుఁగాక, మఱియెందేన్=ఇఁక నెక్కడనైనను, కంటిమే = చూచితిమా. కామశాస్త్రోపాధ్యాయివినాన్ = కామశాస్త్రమున గురుత్వము చేయుదానివలె, కామశాస్త్రము చదివించుదానవు, నాన్ = అనునట్లు, త్రయీధర్మముల్=వైదిక ధర్మములు, పాపంబుల్=పాపమును గలుగఁజేయునవి, రతి = సురతము, పుణ్యము=సుకృతము, అంచున్=అనుచు, (అని సిద్ధాంత మొనరించి) వచించెదవు=చెప్పుచున్నావు. మేలు=మంచిది, ఓహో=సెబాసు, తర్కముల్ = చర్చలు, ఏలా=ఎందునకు? మోక్ష...పంక్తికిన్ — మోక్షలక్ష్మీ=ముక్తిసంపదలకు, పథి=మార్గమైన, మోక్షధర్మము గ్రహింప ననువగు, ఆగమసూత్రపంక్తి

కిన్ =(వేదాంత) శాస్త్రసూత్రములపంక్తులకు, మీసంప్రదాయార్థముల్ = పరంపరగా మీలోఁ జెప్పుకొనఁబడు నర్థములు, ఇవె పో=ఇవేయెకో !

త్రయి పాప మనుట, రతి పుణ్య మనుట కామశాస్త్రోపాధ్యాయుని చెప్పఁదగినది. కాన నిటు లర్థముచెప్పుటకాముకసంప్రదాయార్థమే! కావున్న నెందేని యిట్టియర్థ మెఱుంగ కుందుమా ?

తా. ఈపాండిత్యము నీకుఁ గాక మఱి యెవ్వరికిని లేదు. "వేదప్రతిపాదితము లగుధర్మములు పాపములు! సంభోగము పుణ్యము!" అనుచు కామశాస్త్రమున నుపాధ్యాయురాలవువలెఁ జెప్పుచున్నావు. బాగుబాగు! వేదాంతసూత్రములకుఁ బరంపరగా మీలోఁ జెప్పుకొనునర్థము లివియే కాఁబోలు. వ్యాజస్తుత్యలంకారము.

మ. తరుణీ రేపును మాపు హవ్యములచేతన్ దృప్తుఁ డౌవహ్ని
సత్కరుణాదృష్టి నొసంగుసౌఖ్యము లెఱుంగన్ శక్యమే
నీకు నా, కరణుల్ దర్భలు నగ్నులున్ బ్రియము లైన
ట్లన్యముల్ గా వొడల్, తిరమే చెప్పకు మిట్టితుచ్ఛసుఖ
ముల్ మీసాలపైఁ దేనియల్. 65

టీ. తరుణీ=ఓ ప్రోయాలా, వరూథినీ ! రేపుమాపు=ఉదయాస్తమయకాలములందు, హవ్యములచేతన్ = హోమద్రవ్యములచే, తృప్తుఁడు=పరితోషము చెందినవాఁడు, ఔవహ్ని = అగునట్టి యగ్నిదేవుఁడు, సత్కరుణాదృష్టిన్ = మంచిదయాదృష్టితో, ఒసంగుసౌఖ్యములు = ఇచ్చుసుఖములు, నీకున్ = కేవలకామాంధురాలవగు నీకు, ఎఱుంగన్=గ్రహించుటకు, తెలిసికొనుటకు, శక్యమే=తరమా ? (ఇంత యేల?) నాకున్, అరణుల్ = (అగ్నిపొడముటకు నొకదానిపైనొకటిపెట్టి మథించు) కొయ్యలు, దర్భలున్=కుశలు, అగ్నులున్=అగ్నిహోత్రములు, ప్రియములు = ఇష్టములైనవి, ఐనట్లు = అయినరీతిగా, అన్యములు = ఇతరములు, కావు=ఇష్టములు కావు, ఒడల్ =

శరీరము, తిరమే=స్థిరమా, ఇట్టి తుచ్ఛసుఖముల్ = ఇటువంటి నీచసౌఖ్యములు, చెప్పకు=(శ్రేష్ఠము లని నాకు) తెలుపకుము, మీసాలపైన్ తేనియల్=మీసములమీఁద నిలిచిన తేనెబిందువులఁ బోలినవి. మీసములకంటిన తేనె నాలుకకు సోఁకినప్పుడించుక మధురముగా నుండునుగాని సంపూర్ణముగ మాధుర్యమనుభవించుటకు వీలు కాదు. అటులె పరకాంతారతియుఁ దాత్కాలిక సౌఖ్యము. దాని కేల యపేక్షింపరాదన్నచో అది తుచ్ఛసుఖము. మీసాలమీఁది తేనె మీసములఁ దెల్లఁజేయునటుల నీతుచ్ఛసుఖము ఇహపరములకు భంగకరము.

తా. ఓవిదా ! ప్రాతస్సాయంసమయములందు హోమద్రవ్యములచేఁ బరితృప్తి చెందునగ్నిదేవుఁడు కలిగించుసౌఖ్యములు, నీ వేమెఱుఁగుదువు ? నాకు నగ్నులు దర్భలు మొదలగునవి ప్రియము పుట్టించునవి కావు. శరీరము నశించి పోవునది. నీ వెప్పు నీచసౌఖ్యములు మీసాలపై నిలిచిన తేనెబొట్టు బోలునవి. (అనఁగా, స్వప్నములు నంతలోఁదీరిపోవునవియు నని భావము.) అలం. వ్యతిరేకము. ప్రతివస్తూపమ.

చ. అనుటయు మాటలేక హృదయాబ్జము జల్లన మోము వెల్లనై
కనలుచు నీరు దేఱు తెలికన్నుల నాతనిఁ బుల్కుపుల్కునం
గనుఁగొని మాటలుం బొదువుగద్గదికం దల యూఁచి యక్కటా
వనిత తనంతఁ దా వలచి వచ్చినఁ జుల్కన గాదె యేరికిన్. 66

టీ. అనుటయున్ = ప్రవరాఖ్యుఁడిటు లనఁగానే, హృదయాబ్జము= హృదయపద్మము, జల్లనన్ = జల్లు మనఁగా, మోము=ముఖము, వెల్లనై = వెలవెలాడఁగా, కనలుచున్ = కంటగించుచు, నీరుదేఱు తెలికన్నులన్=కన్నీరు గ్రమ్ము తెల్లకన్నులతో, ఆతనిన్, పుల్కుపుల్కునన్ = నీరాఁచుకొనియాఁచుకొనిచూచు చూపులతో, కనుఁగొని = చూచి, మాటలన్ = నుడువులయందు, పొదువుగద్గదికన్ = కప్పునట్టి గద్గదికతో, తలయూఁచి = తలకదలించి, అక్కటా=అయ్యో ! వనిత=స్త్రీ, తనంతన్ తాన్ = తనకుఁదానై, వలచి=

మోహించి, వచ్చినన్ = వచ్చినపక్షమున, ఏరికిన్ = ఎవ్వరికైనను (ఎంత యసమర్థునకైనను) చుల్కనకాదె=లాఘవముకాదా! మిగుల చులకనయగు నని భావము.

తా. ప్రవరుఁ డిట్లు పలుకఁగా మఱుమాటాడలేక గుండె జల్లు మనఁగాఁ దిక్కుమొగము వైచి కంటగించుచు జాఱుకన్నీరు నాఁచుకొనుచు నాతనిఁ జూచి, అక్కటా! ఎవరికైనను స్త్రీ తనంతఁ దానై వలచి వచ్చు నేని చుల్కనగును గదా! అర్థాంతరన్యాసాలంకారము.

మ. వెతలన్ బెట్టకు మింక నన్ననుచు నీవీబంధ మూడన్ రయో
ద్ధతి నూర్పుల్ నిగుడన్ వడిన్ విరులు చిందన్ గొప్పు
వీడన్ దనూ, లత తోడ్తోఁ బులకింపఁగా ననునయాలా
పాతిదీనాస్యయై, రతిసంరంభము మీఱ నిర్జరవధూరత్నంబు
పై పాటునన్. 67

టీ. నిర్జరవధూరత్నంబు = వేల్పుగత్తెమిన్న, ఇంకన్ =(ఈవిధముగా వలచియుండఁ) ఈమీఁద, వెతలం బెట్టకుము = విచారములపాలు చేయకుము, నన్నున్, అనుచున్ = అరివాకొనుచు, నీవీబంధము = పోకముడి, ఊడన్, రయోద్ధతిన్ = ఎక్కువవడిచే, ఊర్పుల్ = నిట్టూర్పులు, నిగుడన్ = అతిశయింపఁగా, వడిన్ = వేగముగా, విరులు = పూవులు, చిందన్ = రాలఁగా, కొప్పు = వేణీబంధము, వీడన్ = ఊడిపోవఁగా, తనూలత = తీఁగఁబోని మేను, తోడ్తోన్ = వెనువెంటనే, పులకింపఁగాన్, అను...స్యయై - అనునయాలాప = బతిమాలుకొనుమాటలచే, అతిదీనాస్యయై = మిక్కిలి దిక్కుమొగము గలదై, రతిసంరంభము = సంభోగమందలియాత్రము, మీఱన్, పై పాటునన్ = మీఁదపడుటతో, స్వభావోక్త్యలంకారము. కామాతిశయముచేఁ బరితప్త లగు చెలులకుఁ బ్రియునిసందర్శించినంతన నీవి తనంతనవీడునని పూర్వకవులు చెప్పియున్నారు.

"స్రస్తా నీవీ న ఖలు సహసా సా స్వయం ముక్తబంధా" బిల్హణీయము.
"కాన్తే తల్పముపాగతే విగళితా నీవీ స్వయం" అమరుకము.

శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగార
బై, యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప
'హా! శ్రీహరీ', యంచున్ బ్రాహ్మణుఁ డోరమో మిడి
తదీయాంసద్వయం బంటి పో, మ్మంచున్ ద్రోచెఁ గలంచునే
సతులమాయల్ ధీరచిత్తంబులన్. 68

టీ. ప్రాంచ...రుచితోన్ - ప్రాంచత్ = మిక్కిలి యింపగుచున్న, భూషణ=నగలుగల, బాహుమూల=చంకలయొక్క, రుచితోన్ = కాంతితో, పాలిండ్లు = కుచములు, పొంగారన్ = ఉబుకఁగా, పైయంచుల్ = చనుమొనలు, మోవఁగన్ = అనునట్లు, కౌఁగిలించి, అధరంబు = మోవిని, ఆసింపన్=ఇచ్చగింపఁగా, "హా! శ్రీహరీ" అంచున్=పాపపరిహారార్థముగా శ్రీహరిని స్మరణము చేయుచు, బ్రాహ్మణుఁడు=ప్రవరాఖ్యుఁడు, ఓరమోము= పెడమొగము, ఇడి, తదీయాంసద్వయంబు = దాని రెండుభుజశిరస్సులను, అంటి=తాఁకి (దూరక కేలు తాకించి యనుట) పొమ్ము+అంచున్ = అవలకుఁ బొమ్ము అని, త్రోచెన్=త్రోసివేసెను, సతులమాయల్ = స్త్రీలకపటకృత్యములు, ధీరచిత్తంబులన్ = పండితులమనస్సులను(దిట్టతనముగలవారి మనస్సులను) కలంచునే=కలఁతపెట్టునా! అర్థాంతరన్యాసాలంకారము.

క. త్రోపువడి నిలిచి ఘనల
జ్జాపరవశ యగుచుఁ గొప్పు సవరించి యొడల్
దీపింప నతనిఁ జూఱుచుఁ
గోపమునన్ జూచి క్రేఁటుగొనుచున్ బలికెన్. 69

టీ. త్రోపు+పడి = తొలఁగఁ ద్రోయఁబడుటఁ బొంది (ప్రవరునిచేఁ ద్రోసివేయఁబడి) నిలిచి =నిలిచియుండి, ఘనలజ్జాపరవశ = మెండగుసిగ్గుచే

వశస్వాధీనురాలు, అగుచున్, కొప్పు నవరించి, ఒడల్ = మేను, దీపింపన్ = ప్రకాశింపఁగా, (అవయవముల నన్నింటిని బ్రవరునకు స్పష్టముగాఁ గనవచ్చు నటులఁ జేసి) అతనిన్=ఆబ్రాహ్మణుని, చుఱచుఱన్=చుఱచుఱమనుచు, కోపమునన్=ఆగ్రహముతో, (పా-కోపన=కోపవతియగు నాయాఁడుది. ఇదికర్తృపదము) చూచి=వీక్షించి, (పా. వీక్షించి) క్రేఁటుకొనుచున్=గొంతుచక్కఁ జేసికొనుచు, పలికెన్.

తా. అట్లు ప్రవరాఖ్యుఁడు తొలఁగఁద్రోయఁగాఁ దొలఁగి నిలువంబడి యవమానమువలని సిగ్గు హెచ్చఁగా దేహమంతయుం నతనికిఁ గానవచ్చునట్లు పైఁటచెఱఁగు తొలఁగించి వీడినకొప్పు చక్కఁగా ముడుఁచుకొనుచుఁ గోపముతోడి వేఁడిచూపులతో నతనిఁ జూచుచు, డగ్గుత్తికపడినగొంతు సవరించుకొనుచు నీవిధముగాఁ బలికెను.

ఉ. పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక నీవు త్రోవ
ని,చ్చోటభవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొను మంచుఁ
జూపి య,ప్పాటలగంధి వేదననెపం బిడి యేడ్చెఁ గలస్వ
నంబుతో, మీటిన విచ్చుగుబ్బచనుమిట్టల నశ్రులు చిందు
వందఁగన్. 70

టీ. కృపారహితాత్మక = దయలేనిగుండెగలవాఁడా, పాటునకున్ = దెబ్బకు, త్రోయఁబడుటకు, ఇంతులు=స్త్రీలు, ఓర్తురె=సహింతురా? సుకుమారములగు స్త్రీలదేహము లీకఠినకార్యమును సహింపవనుట. నీవు త్రోవన్ = త్రోయుఁగా (కుచదేశము కన్పఱచుచు), ఇచ్చోటన్ = ఇక్కడ, భవన్నఖాంకురము = నీగోనగోరు, సోఁకెన్=తగిలెను. కనుంగొనుము = చూడుము, అంచున్ = అని, చూపి = కుచప్రదేశముపైఁ గలగంటును జూపించి, అప్పాటలగంధి = పాటలపుష్పముల తావివంటి తావి గలయాస్త్రీ, వేదన నెపంబు=(గోటిగీల్గుటవలని) బాధయనుమిషు, ఇడి=కల్పించుకొని, మీటిన్ =

గోరఁజిమ్మినను, ఎచ్చు=రగలుగట్టి, గబ్బ=గుండ్రని, చనుమిట్టలన్ = గబ్బి గుబ్బలపై, అశ్రులు=కన్నీరు, చిందువడఁగన్=చిందులుచిందఁగా, కలస్వనంబుతోన్=అవ్యక్తమధురమగుధ్వనితో, ఏడ్చెన్.

కృపారహితాత్మక యనుటచే నీవొనరించు సత్కృతులన్నియు నిష్ఫలములని సూచన. ఏడ్పు కలస్వనమగుటచేఁ జెలికత్తె లాలింపఁబోయిరి. వేదన నిజమైనదికాదు సుమా. చనుమిట్టలను సోఁకి కన్నీరు చిందె ననుటచే గుబ్బల యుబ్బు బింకము సూచితము.

తా. ఓకటికగుండెవాఁడా, స్త్రీలు పాటునకుఁ దాళుదురా? నీవు త్రోయఁగా నిక్కడ నీగోరు తాఁకెను, చూడు మనుచుఁ (ఒక్కట్టుపైఁ) జూపి నొచ్చి యన మిష పెట్టుకొని యున్నతస్తనములపైఁ గన్నీరు చిందఁగా నవ్యక్తమధురధ్వనితో నేడ్చెను.

క. ఈవిధమున నతికరుణము
గా వనరుహనేత్ర కన్నుఁగవధవళరుచుల్
కావిగొన నేడ్చి వెండియు
నావిప్రకుమారుఁ జూచి యలమటఁ బల్కెన్. 71

టీ. వనరుహనేత్ర = (తామరరేకులవంటి కనులుగల) అవరూథిని, అతికరుణముగాన్ = మిక్కిలి జాలికలుగునట్లు, ఈవిధమునన్ = ఈరీతిగా, కన్నుఁగవధవళరుచుల్ = రెండుకన్నులయొక్కయుఁ దెలికాంతులు, కావి గొనన్=ఎఱ్ఱవాఱఁగా, ఏడ్చి, వెండియున్=తిరిగియు, ఆవిప్రకుమారున్ = ఆప్రవరాఖ్యుని, చూచి=తిలకించి, అలమటన్ = విచారముతో, పలికెన్ = ఇటుల వాకొనెను.

కరుణ మనశ్శోకాతిరేకము. ఈయర్థముననే భవభూతి ఉత్తరరామచరిత్రమునందు "పుటపాకప్రతీకాశో రామస్య కరుణో రసః" అనియు, "కరుణస్య మూర్తిరథవా శరీరిణీ విరహవ్యథేవ వనమేతి జానకీ" అనియు

ప్రయోగములు గలవు. కరుణము. కరుణ చేఁత. కరుణ పరదుఃఖప్రహరణేచ్ఛ కాన కరుణ మనుచోఁ గొందఱు కరుణ యని యర్థము వ్రాసిరిగాని యది పొసఁగదు.

కనులఁ దెలుపుగా వర్ణించుట కవిసమయము. కనులందుఁ బాపగల భాగము తక్కువయుఁ దెలిభాగ మెక్కువగాన నిట్టుల వర్ణించుచుందురు. దృష్టాంతము.

చ. "కలువలనుం జకోరములఁ గారుమెఱుంగుల గండుమీల వె
న్నెలలను దమ్మిఱేకులను నిర్మలమౌక్తికరత్నశుక్తులన్
దలఁచి పయోజగర్భుఁడు సుధారసధారలు రెంటిలో విసం
బులు చిలికించి చేసెనొకొ పొల్పెసలారఁగ దీనినేత్రముల్."

శృంగారనై—౩ ఆ. 166. ప.

ఉ. చేసితి జన్నముల్ తపము చేసితి నంటి దయావిహీనతన్
జేసినపుణ్యముల్ ఫలముచెందునె పుణ్యము లెన్నియేనియున్
జేసినవానిసద్గతియె చేకుఱు భూతదయార్ద్రబుద్ధికిన్
భూసురవర్య యింత దలపోయవు నీచదు వేల చెప్పుమా ?

టీ. ఓభూసురవర్య=ఓబ్రాహ్మణశ్రేష్ఠుఁడా! జన్నముల్=యజ్ఞములు, చేసితిన్, తపము, చేసితిన్, అంటి = అంటివి. దయావిహీనతన్ = దయ లేక, చేసినపుణ్యముల్, ఫలముచెందునె = ఫలముకల వగునా? పుణ్యములు, ఎన్నియేనియున్ = ఎన్నియైనను, చేసినవానిసద్గతియె = చేసినపురుషునికిఁ గలుగుమంచిగతియె, భూతదయార్ద్రబుద్ధికిన్ = ప్రాణులయందు దయారసముతో నిండినబుద్ధిగలవానికి, చేకుఱున్, ఇంత తలపోయవు=ఇంతమాత్రము చింతింపవు. ఈవిషయస్వభావ మిట్టిదని యిపుడేని యోచింపవు. నీచదువు = నీవు చదువుకొన్న యీవిద్య (స్వధర్మమునం దుపయోగింపని నీవిద్య) ఏల = ఎందులకు, ఏమియుపయోగము, చెప్పుమా=నీవె చెప్పుము.

తా. ఓభూసురోత్తమా! యజ్ఞములు చేసితిని, తపములు చేసితిని, అంటివి. దయాస్వభావము లేనియప్పు డెన్నిపుణ్యములు చేసిన నేమిఫలము? ఎన్నియేనిపుణ్యములు చేసినవారు పొందుసద్గతినే యొక్క-భూతదయగల వాఁడు పొందఁగలఁడు. ఇంతమాత్రము చింతింప లేవైతివి. నీచదు వెందు లకు? చెప్పు. కావ్యలింగ మలంకారము.

సీ. వెలిపెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి
దాశకన్యాకేళిఁ దప్పుసేసి
కులములో వన్నె తక్కు-వ యయ్యెనే గాధి
పట్టికి మేనకచుట్టఱికము
ననుపు కాఁడై వేల్పునాగవాసముఁ గూడి
మహిమ గోల్పడియెనే మాందకర్ణి
స్వారాజ్య మేలంగనీరైరె సుర లహ
ల్యాజారుఁ డైనజంభాసురారి
తే. వారికంటెను నీమహత్త్వంబు ఘనమె
పవనపర్ణాంబుభక్షులై నవసి యిచుప
కచ్చడాల్ గట్టుకొనుమునిముచ్చులెల్ల
తామరసనేత్రలిండ్ల బందాలుగారె. 73

టీ. బాడబులు=బ్రాహ్మణులు, దాశకన్యాకేళిన్ = దాశరాజుకూఁతు రైన మత్స్యగంధియొక్క- కలయికను, తప్పుచేసి=తప్పుగాఁగొని, పరాశరున్= పరాశరమహామునిని, పట్టి = పట్టుకొని, వెలిపెట్టిరే = బహిష్కరించిరా? గాధిపట్టికిన్=విశ్వామిత్రునకు, మేనకచుట్టఱికము = మేనకతోడిసంబంధము, కులములోన్, వన్నెతక్కు-వ=మర్యాదతక్కు-వైనది, అయ్యెనే? ననుపుకాఁడై= అంటుకాఁడై, వేల్పునాగవాసమున్=అచ్చరగుంపును, కూడి=కలసి, (పలువురు వేశ్యలను గవసినను) మాందకర్ణి, మహిమ=మహత్త్వమును, కోల్పడియెనే =

కోలుపోయెనా? సురలు = దేవతలు, అహల్యాజారుఁడు = అహల్యకొఱకు విటుఁడు, అయిన, జంభాసురారిన్=ఇంద్రుని, స్వారాజ్యము=స్వర్గరాజ్యమును, ఏలంగనీరైరే=ఏలనీయకపోయిరా? పవన...త్తులు-పవన=గాలిని, పర్ణ=ఆకులను, అంబు=నీటిని, భక్షులై = భక్షించువారై, నవసి=చిక్కి, ఇసుపకచ్ఛడాల్=ఇనుపగోఁచులను, కట్టుకొను, మునిముచ్చులు=దొంగవేషపుమునులు, తామరసనేత్రలిండ్లన్ = ఆఁడగత్తెల యిండ్లలో, బందాలు = బంధింపఁబడువారు (పడియుండువారు) కారె? తపస్సుచేసి స్వర్గమునకుఁబోయినపిదప నెంతటి మహానుభావులైనను వేల్పుముగుదలకూటమితోఁ దృప్తినొందువారె. అర్థాంతరన్యాసాలంకారము.

నేత్రలయిండ్లు అనువ్యర్థమునందు నేత్రలిండ్లు అనుటకుఁ బ్రమాణములు:—

గీ. "పాండవజ్యేష్ఠునకుఁ బ్రీతిఁ బరమయావ
రాజ్య మిచ్చితి కురువృద్ధరాజులొద్ద"

భార. ఆది. అ. 6

ఉ. "...పెద్దమ్మ సురారులమ్మ కడుపారడిఁ
బుచ్చినయమ్మ ... ..."

భాగవతము.

తే. అనిన నేమియు ననక యవ్వనజగంధి
మేనిజవ్వాదిపస కదంబించునొడలు
గడిగికొని వార్చి ప్రవరుండు గార్హపత్య
వహ్ని నిట్లని పొగడె భావమునఁ దలఁచి. 74

టీ. అనినన్=వరూథిని యిటు లనఁగా, ప్రవరుఁడు=ప్రవరాఖ్యుఁడు, ఏమియుం ననక=ప్రత్యుత్తరము నేమియుఁ జెప్పక, అవ్వన...పస-అవ్వనజగంధి=ఆచక్కనియింతియొక్క, మేనిజవ్వాదిపస = శరీరమందలి ని(ద్ద)పు జవ్వాజి

సౌరము, కదంబించునొడలు = అంటియున్న శరీరము, కడిగికొని=తావి పోవునట్టులఁ గడిగివైచి, వార్చి=ఆచమించి, గార్హపత్యవహ్నిన్ = నిత్యముగాఁ దా నారాధించు గార్హపత్య మను పేరుగల యగ్నిని. భావమునన్=మనస్సున, తలఁచి=తలఁచుకొని, ధ్యానించి, కట్టని = మీఁదఁజెప్పఁబోవురీతిగా, పొగడెను=స్తుతించెను.

మొదట పీటీగంధపరిమళము, తరువాత పాటలగంధి యనుట జవ్వాది కస్తూరి కదంబించునొడ లనుటచే వరూథిని మేనంగరాగాదికములచే సుగంధబంధురముగ నున్నట్టులఁ గవి పలుతావుల సూచించెను.

ఉ. దివిషద్వర్గము నీముఖంబునన తృప్తిం గాంచు నిన్నీశుఁగా
స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్తజగదంతర్యామివిన్ నీవ
యాహవనీయంబును దక్షిణాగ్నియును నీయం దుద్భవిం
చుం గ్రతూత్సవసంధాయక నన్నుఁ గావఁగదవే స్వాహా
వధూవల్లభా. 75

టీ. క్రతూత్సవసంధాయక = యజ్ఞరూప మగునుత్సవమును సమకూర్చువాఁడా! (యజ్ఞకార్యసాధనభూతుఁ డనుట) స్వాహావధూవల్లభా = స్వాహాదేవికిఁ బ్రియుఁడా! దివిషద్వర్గము=దేవతాసమూహము, నీముఖంబునన = నీముఖముననే, తృప్తిన్ = తనివిని, కాంచున్=పొందును. (అగ్నియందు వేల్చు యాగభాగములగు హవిస్సులు వేల్పులు గ్రహింతురు. దేవత లగ్నిముఖు లని శ్రుతులు) శ్రుతులు=వేదములు, నిన్నున్ = తేజోమూర్తి వగు నిన్ను, ఈశుఁగాన్=ఈశ్వరునిగా, స్తవముల్=స్తోత్రములను, చేయును; వేదము లగ్నినీశ్వరుఁ డనుచున్న వనుట. సమస్తజగదంతర్యామివిన్=సకలలోకములకు నంతరాత్మవు, నీవ = నీవే, ఆహవనీయంబును, దక్షిణాగ్నియును, (ఈరెండగ్నులును గ్రమముగా వైశ్వదేవాదికర్మములందు హోమముచేయుంటకును, వేదికి దక్షిణముగాఁ బ్రాయశ్చిత్తాదులందు హోమములకును నిల్పుకొనఁ

బడును) నీయందున్=నీయందె, ఉద్భవించున్=పుట్టును, (కాన), నన్నున్= నీయెడభక్తిశ్రద్ధలు గలనన్ను, కావవే=ఆపదనుండి కాపాడవయ్యా !

గార్హపత్యాగ్నిలోనుండి వైశ్వదేవాదిక్రియ లొనరించుటకుఁ గైకొని క్రియాపరిసమాప్తివఱకు హోమము చేయునగ్నిని ఆహవనీయ మనియు, ప్రాయశ్చిత్తాదికార్యములకొఱకు వేదికకు దక్షిణభాగమునం దుంచుకొనునగ్నిని దక్షిణాగ్ని యనియు నందురు.

ఉ. దానజపాగ్నిహోత్రపరతంత్రుఁడ నేని భవత్పదాంబుజ
ధ్యానరతుండ నేనిఁ బరదారధనాదులఁ గోర నేని స
న్మానముతోడ నన్ను సదనంబున నిల్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయమున్న రయంబున హవ్యవాహనా.

టీ. హవ్యవాహనా=వహ్నిదేవుఁడా ! (హవ్యములను వహించువాఁడు అని వ్యుత్పత్తి) దాన...తంత్రుఁడనేనిన్ = దాన, జప, అగ్నిహోత్ర (ములకు), పరతంత్రుఁడనేనిన్=అధీనుఁడ నగుదునేని, భవ...రతుండనేనిన్ - భవత్=నీయొక్క, పదాంబుజ = పాదపద్మములయొక్క, ధ్యాన(మునందు) రతుండనేనిన్=ఆసక్తిగలవాఁడ నగుదునేని, పర...దులన్-పర = ఇతరుల యొక్క, దారధనాదులన్=భార్య ధనము మొదలగువానిని, కోరనేనిన్ సన్మానముతోడన్=గౌరవముతో, సదనంబునన్ = ఇంట, ఇనుండు=సూర్యుఁడు, పశ్చిమాంభోనిధిలోన్ = పడమటిసంద్రమున, క్రుంకకయ మున్న=మునుఁగకమునుపే, నిల్పుము = చేర్పుము.

సన్మానముతో నిల్లుచేర్పుమనుటచే వరూథినిచే నగౌరవము కాకుండ నిల్లుచేర్పుమనిభావము. ప్రొద్దుగ్రుంకకముందె పోవలయు ననుట అగ్నిహోత్రాదిక్రియలు నిర్వర్తించుటకు, రయము వరూథినివలని భయాతిశయమును సూచించును.

వ. అని సంస్తుతించిన నగ్నిదేవుం డమ్మహీదేవుదేహంబున సన్ని
హితుం డగుటయు నమ్మహాభాగుండు గండుమీఱి పొడు
పుఁగొండ నఖండసంధ్యారాగప్రభామండలాంతర్గతుం డగు
పుండరీకవనబంధుండునుంబోలె నుత్తప్తకనకద్రవధారాగౌ
రం బగుతనుచ్ఛాయాపూరంబున నక్కాన వెలింగించుచు
నిజగమనవిరోధిని యగునవ్వరూథినిహృదయకంజంబున రం
జిల్లునమందానురాగరసమకరందంబు నందంద పొంగం జేయు
చుఁ బావకప్రసాదలబ్ధం బగుపవనజవంబున నిజమందిరం
బున కరిగి నిత్యకృత్యసత్కర్మకలాపంబులు నిర్వర్తించె నని
మార్కండేయుండు క్రోష్టికిం జెప్పె నని చెప్పిన. 77

టీ. అని, సంస్తుతించినన్ = స్తోత్రము చేయఁగా, అగ్నిదేవుండు = అగ్ని హోత్రుఁడు, అమ్మహీదేవుదేహంబునన్ = ఆబ్రాహ్మణునిశరీరమున, సన్నిహితుండు = ఆసన్నుఁడు, అగుటయున్ = కాఁగా, అమ్మహాభాగుండు = పూజ్యుఁడగు నా ప్రవరుఁడు, గండుమీఱి = బలుపుచెంది, పొడుపుఁగొండన్ = ఉదయపర్వతమున, అఖండ...అంతర్గతుండు-అఖండ = ఎడతెగని, సంధ్యారాగ = సంజవేళ యందలి యెఱ్ఱఁదనముయొక్క, ప్రభామండల = కాంతిసమూహముయొక్క, అంతర్గతుండు = లోనున్నవాఁడు, అగు, పుండరీకవనబంధుండునుంబోలెన్ = సూర్యునివలె, ఉత్తప్త...గౌరంబు-ఉత్తప్త = పుటపాకము చేయఁబడిన, కనకద్రవ = కరఁగినీరైయున్న బంగారుయొక్క, ధారాగౌరంబు = ధారయొక్క పసిమివంటి పసిమిగలది, అగుతనుచ్ఛాయాపూరంబునన్ = శరీరకాంతి ప్రవాహముచేత, అక్కానన్ = ఆయడవిని, నిజగమనవిరోధిని = తనప్రయాణమునకు నడ్డుచేయునది అగు, అవ్వరూథిని (యొక్క) హృదయకంజంబునన్ = హృదయపద్మమున, రంజిల్లు...మకరందంబున్-రంజిల్లు = ఒప్పునట్టి, అమంద = అల్పముకాని, అనురాగరసమకరందంబున్ = ప్రేమరసమను

మకరందమును, అందంద=ఎడనెడ, పొంగంజేయుచున్=పైకుబుకఁజేయుచు, (పొంచుచు) పావకప్రసాదలబ్ధంబు = అగ్నిదేవునిదయవలనఁ బొందఁబడినది అగు, పవనజవంబునన్ =వాయువేగముతో, నిజమందిరంబునకున్ = తన గృహమునకు, అరిగి=పోయి, నిత్య...పంబులు-నిత్యకృత్య=అనుదినముఁజేయఁ దగిన, సత్కర్మ=పుణ్యకర్మములయొక్క, కలాపంబులు=సమూహములు, నిర్వర్తించెను=నెఱవేర్చెను. అని=ఇటులని, మార్కండేయుండు=మార్కండేయ మహాముని, క్రోష్టికిన్=క్రోష్టియనుమునితో, చెప్పెన్, అని, చెప్పినన్ = పక్షులు జైమినిమునితోఁ జెప్పఁగా-దీనికిఁ బైపద్యముతో నన్వయము.

తా. ప్రవరుఁ డిటుల నగ్నిని స్తుతింప నగ్నిదేవుఁడు ప్రవరునిదేహమునం దావేశించి యమితతేజోబలములఁ గలిగించెను. అంతఁ బ్రవరుఁడు వరూథినిని దొలంగి దానియనురాగము నభివృద్ధిఁజేయుచు వాయువేగముతో గృహముచేరి నిత్యకర్మములు సక్రమముగా నిర్వర్తించుకొనెను. ఉత్ప్రేక్షా రూపకాలంకారములు.

క. జైమిని యాదివ్యఖగ
గ్రామణులన్ జూచి వేడ్క గడలుకొనంగా
నామీఁద వరూథినివిధ
మేమయ్యె నెఱుంగఁ జెప్పరే నా కనుడున్. 78

టీ. జైమిని=జైమినియనుమహాముని, ఆదివ్యఖగగ్రామణులన్ = దేవ సంబంధములయిన యాపక్షిశ్రేష్ఠములను, వేడ్క=వేడుక. (కథలు వినుటయందాసక్తి) కడలుకొనంగాన్=ఎక్కువకాఁగా, ఆమీఁదన్=అటమీఁదట, వరూథినివిధము=వరూథినీప్రకారము, ఏమయ్యెన్ = ఏమిగా జరిగెను. నాకున్, ఎఱుంగన్ = విశదమగునట్లు, చెప్పరే = మీరు చెప్పుఁడు, అనుడున్=అని యడుగఁగా, దీనికి తైయాశ్వాసమునందలి యుపథరింపు మనుక్రియతో నన్వయము.

శా. నిస్తంద్రప్రతిభా సుధీనుత దిశోన్మీలద్యశశ్శ్రీవధూ
హస్తాగ్రామలకాయమానమహనీయాంభోజగర్భాండ సై
న్యస్తోమోత్థరజోవ్రజస్థగితకృష్ణా గౌతమీమధ్యభూ
మ్యస్తోకోత్కలరాట్పురీహరణలీలావార్యశౌర్యోదయా. 79

టీ. నిస్త...ప్రతిభా—నిస్తంద్ర=మాంద్యములేని, ప్రతిభా=అప్పటికి వికాసమునందుబుద్ధివిశేషముగలవాఁడా, సుధీనుత=పండితులచేఁ బొగడఁబడిన వాఁడా, దిశో...గర్భాండ—దిశా = దిక్కులయందు, ఉన్మీలత్ = వర్తించుచున్న, యశశ్శ్రీః=కీర్తిసంపద యను, వధూ=స్త్రీయొక్క, హస్తాగ్ర=అఱచేతిలోని, ఆమలకాయమాన = ఉసిరికకాయయగుచున్న, మహనీయ = గొప్పదగు, అంభోజగర్భాండ=బ్రహ్మాండముగలవాఁడా ! సమస్తదిగంతరములయందు వ్యాప్తమైన బ్రహ్మాండము తనచేతిలోని యుసిరికకాయవలెఁ దోఁపఁజేయుకీర్తిసంపదగలవాఁడాయనుట. సైన్య...దయా—సైన్యస్తోమ = సేనాసమూహములవలన, ఉత్థ=పుట్టిన, రజోవ్రజ=పరాగసమూహముచే, స్థగిత=పొదుగఁబడిన, కృష్ణా=కృష్ణవేణినదియొక్కయు, గౌతమీ=గోదావరినదియొక్కయు, మధ్యభూమి=నడిమిప్రదేశమందలి, అస్తోక=అల్పముకాని, (ఇది పట్టణమునకు విశేషణము) ఉత్కలరాట్ = ఉత్కలదేశపురాజుయొక్క, పురీ = పట్టణము యొక్క, హరణ=హరించుటయను, లీలా=విలాసమున, అవార్య=నివారింపరాని, శౌర్యోదయా=శౌర్యాతిశయముగలవాఁడా, సులభముగాఁ గృష్ణాగౌతమలమధ్య సురక్షితముగా నున్న యుత్కలరాజులరాజధానిని గైకొన్నవాఁడా యని భావము. రూపకము నతిశయోక్తియు నలంకారములు.

తా. హెచ్చరికతోడిబుద్ధివిశేషమును బండితులవినుతియు బ్రహ్మాండము నావరించి వెలుఁగుచున్నకీర్తియుఁ గలిగి కృష్ణాగోదావరీనదులమధ్య భాగమునందుఁ గలదేశమంతయు నాక్రమించి యుత్కలపురాజుదైనపట్ట

ణము ననాయాసముగ వశపఱచుకొని యడ్డములేని శౌర్యాతిశయమును వహించినవాఁడా! అలం. రూపకము, అతిశయోక్తియుం.

బిసరుహనయనా నవవిధ
కుసుమాయుధ యవధికుధరకూటాంచలభూ
విస్ఫురత్తేజశ్చంపక
భసలదసత్కీర్తిమలినపరిపంథినృపా. 80

టీ. బిస...కుసుమాయుధ - బిసరుహనయనా = పద్మనేత్రలగు స్త్రీలకు, నవవిధ = క్రొత్తరీతిగల, కుసుమాయుధ = మన్మథుఁడగువాఁడా, అవధి...పరిపంథినృపా-అవధికుధర = చక్రవాళపర్వతముయొక్క, కూటాంచల = శిఖరాగ్రములందలి, భూ=ప్రదేశమందు, విస్ఫురత్ = వ్యాపించిన, తేజః=ప్రతాప ముచు, చంపక = సంపెఁగపూలకు, భసలత్ = తుమ్మెద యగు చున్న, అసత్కీర్తి = అపకీర్తిచే, మలిన = మలినులైన, పరిపంథినృపా=శత్రు రాజులుగలవాఁడా! రూపకాలంకారము.

సంపాగిపూవును తుమ్మెద దరియఁజాలదు. అటులె ప్రపంచవ్యాప్తి గల కృష్ణరాయలప్రతాప మనుసంపంగిపూవును రాజులయపకీర్తి యంటఁజాల కున్న దని భావము. సంపెంగను రక్తవర్ణముగా వర్ణించుట గలదు.

తే. "వెలఁది యిచ్చట సంపెంగవిరులు గహన
దేవతలయిండ్ల నెత్తినదీపశిఖలు"

ఇందే. ఆ. 3-౭౬.

తా. చక్కఁదనముచేత మన్మథునివలె స్త్రీలను మోహింపఁజేయువాఁడవును, చక్రవాళపర్వతము శిఖరములవఱకు వ్యాపించిన ప్రతాపముచేత శత్రురాజులను దఱుమఁగొట్టినవాఁడవు నైనవాఁడా! అలం. రూపకము.

కవిరాజవిరాజితము—

నలనృగరంతిభగీరథభారతనందనకల్ప యనల్పయశః
శ్చులుకితలోక విలోకివధూజనసూనశరాసన మానఖనీ
ప్రళయఘనాఘనఘోషజయానకభాంకృతిభీమచపేటలుఠ
త్కలబరిగీకటకక్షితిరక్షక కన్నడరాజ్యరమారమణా. 82

టీ. నల...కల్ప=నల, నృగ, రంతి, భగీరథ, భారతనందనకల్ప = భరతవంశజులగు, నలచక్రవర్తి, రంతిదేవుఁడు, భగీరథుఁడు, భరతవంశజులగు ధర్మరాజాదులను బోలినవాఁడా! అన...లోక-అనల్ప = ఎక్కువయిన, యశఃకీర్తిచే, చులుకిత = పుడిసిటఁగొనఁబడిన, లోక = లోకములుగలవాఁడా, విలోకి......సూనశరాసన—విలోకి=చూచెడు, వధూజన=స్త్రీజనమునకు, మానశరాసన = మన్మథుఁడగువాఁడా, మానఖనీ = మనస్సు గొప్పదనమునకు గనియగువాఁడా, "మానశ్చిత్తసమున్నతిః" అని యమరము. ప్రళయ...రక్షక = ప్రళయ (కాలమందలి), ఘనాఘన = వర్షించు మేఘముల యొక్క, ఘోష=మ్రోఁతవంటి మ్రోఁతఁగల, జయానక = జయభేరీయొక్క, భాంకృతి = భాంకార మను, భీమ=భయంకరమగు, చపేట = చెంపదెబ్బచే, లుఠత్=దొరలుచున్న, కలబరిగీకటక = కలబరిగి యను రాజధానియొక్క, క్షితిరక్షక=రాజుగలవాఁడా, కన్నడరాజ్యమారమణా = కన్నడరాజ్యలక్ష్మికిఁ బ్రియుఁడా?

ప్రథమాశ్వాసమునందలి సీ. "సనకాది" అనుపద్యములోని కల్బరిగె నగరము, ఈ పద్యమునందలి కలబరిగీకటకము గుల్బర్గా యనఁబడు బహమనరాజధాని యని చరిత్రకారులతలంపు. రాయలు గుల్బర్గానగరమును ముట్టడించుటకుఁ దిరుపతికియాత్రార్థ మేఁగినపు డచటనుండి యేఁగె నని రాయవాచకమునందుఁ గలదు. గుల్బర్గానగరము నిజామురాష్ట్రమునం దున్నది.

తా. నలుఁడు నృగుఁడు రంతిదేవుఁడు భగీరథుఁడు ధర్మరాజు మొదలుగాఁ గల పూర్వరాజులతో సరిపోల్పఁదగిన సచ్చరిత్రము గలవాఁడవును

లోకాతీత మయినకీర్తి గలవాఁడవును స్త్రీలచూపునకు మన్మథునివలెఁ దోఁచు నట్టి చక్కఁదనము గలవాఁడవును మానమునకు నునికిపట్టయినవాఁడవును జయభేరీధ్వని విన్నమాత్రముననే కలబరిగిరాజును బెదరి నేలఁబడి పొరలాడు నట్లు చేసినవాఁడవును కర్ణాటదేశము నేలువాఁడవు నైన కృష్ణదేవరాయా!

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంక
పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశో
త్తంసశఠకోపతాపసప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లి
కాల్లసాని చొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్యప్రణీతంబైన
స్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధంబునందు ద్వితీ
యాశ్వాసము. 82

టీ. శ్రీమ... ప్రణీతంబు-శ్రీమత్ - విద్వత్తాసంపదగల, ఆంధ్రకవితా పితామహ = ఆంధ్రకవిత్వమునకు బ్రహ్మయను, సర్వతోముఖ = అంతట వ్యాప్తిగల, అంక=బిరుదుగల్గినట్టియును, పంకజాక్ష=విష్ణునియొక్క, పాదాంబుజ = పాదపద్మములకు, అధీన=వశమైన, మానసేందిందిర = మనస్సనెడు తుమ్మెదగలట్టియును, నందవరపురవంశోత్తంస=నందవర మనెడి యూరివారి వంశమున (నందవరీకకులమున) శ్రేష్ఠుఁ డగునట్టియు, శఠకోపతాపస=శఠకోపయతియొక్క, ప్రసాద=కృపచే, ఆసాదిత = పొందఁబడిన, చతుర్విధ = నాల్గువిధములగు (బంధ, చిత్ర, గర్భ, ఆశు, కవనములు), కవితామతల్లిక = శ్రేష్ఠకవిత్వముగలట్టియు, అల్లసానిచొక్కయామాత్యపుత్త్ర = అల్లసాని చొక్కయమంత్రికిఁ గుమారుఁ డగునట్టియు, పెద్దనార్య = పెద్దనార్యునిచే, ప్రణీతంబు=రచియింపఁబడినది, మహాప్రబంధంబునందుఁ=మహాకావ్యమున, ద్వితీయాశ్వాసము.

ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనాసమాసాదితాఖండసాహితీధురీణుండు నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్లవంశపయోరాశిరాకాసుధాకరుండు నగురామస్వామిశాస్త్రిచేత ననేకపూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచింపఁబడిన రుచిసమాఖ్యానం బగువ్యాఖ్యానంబునఁ ద్వితీయాశ్వాసము.

శ్రీ ర స్తు

# మనుచరిత్రము.

## స టీ క ము

---

## తృ తీ యా శ్వా స ము

శ్రీవేంకటేశపద
ద్మావేశితసదయహృదయ హరనిటలనట
త్పావకపరిభావిమహః
ప్రావృతనిఖిలాశ కృష్ణరాయమహీశా. 1

టీ. శ్రీ...హృదయ - శ్రీ = లక్ష్మితోఁగూడిన, వేంకటేశ = వేంకటేశ్వరస్వామియొక్క, పదపద్మ = పాదపద్మములందు, ఆవేశిత = ఉంపఁబడినట్టియు, సదయ=దయతోఁగూడినట్టియు, హృదయ = డెందముగలవాఁడా, హర...నిఖిలాశ-హర = శివునియొక్క, నిటల=నొసట, నటత్ = వర్తించు, పావక=అగ్నిని, పరిభావి=తిరస్కరించు, మహః=ప్రతాపముచే, ప్రావృత = ఆవరింపఁబడిన, నిఖిలాశ = ఎల్లదిక్కులుగలవాఁడా, కృష్ణరాయమహీశా = కృష్ణరాయప్రభూ.

ఇందుఁ బరాక్రమము అగ్నిగా నుపమింపఁబడెను. అగ్ని రక్తగణములోఁ జేరినది. పరాక్రమమును ఎఱ్ఱగను గీర్తిని తెల్లగను కవులు వర్ణించుట కవిసమయము. దృష్టాంతము.

శ్లో. "శుక్లత్వం కీర్తిహాసాదౌ కార్ష్ణ్యం దుష్కీర్త్యఘాదిషు,
ప్రతాపే రక్తతోష్ణత్వే రక్తత్వం క్రోధరాగయోః." కావ్యకల్పలత.

తా. శ్రీవేంకటేశ్వరస్వామిపాదకమలమందు మనసు గలవాఁడా! దయాస్వభావము గలవాఁడా! శివునిచిచ్చుఱకంటిమంటకంటె వేఁడిమి గల ప్రతాపము గలవాఁడా! కృష్ణరాయనరనాథా! ఉపమాలంకారము.

వ. అవధరింపు మమ్మహాత్మునకుం బక్షు లిట్లనియె. 3

టీ. అవధరింపుము = చిత్తగింపుము. అమ్మహాత్మునకున్ = ఆమహానుభావుఁడగు జైమినిమునితో, పక్షులు=కథఁ జెప్పెడిపక్షులు, ఇట్లనియెన్ = ఈవిధముగాఁ జెప్పెను.

శా. ఆభూదేవకుమారుఁ డేఁగినఁ దదీయానూనరమ్యాకృతిన్
దా భావంబున నిల్పి యంగభవకోదండోగ్రమౌర్వీరవ
క్షోభాకంపితధైర్యయై యలఁత నచ్చో నిల్వ కచ్చేల్వ త
ద్భూభృన్మేఖలవెంటఁ * గానలబడిన్ దుఃఖాబ్ధినిర్మగ్నయై.

టీ. ఆభూదేవకుమారుఁడు = ఆకొమరుఁబ్రాయపు బ్రాహ్మణుఁడు, ఏఁగినన్=వెడలిపోఁగా, అచ్చేల్వ=ఆవరూథిని, తాన్=తాను, తదీ...కృతిన్-తదీయ=ఆతనిదైన, అనూన=కొఱఁతలేని, రమ్య=చక్కఁదనపు, ఆకృతిన్= ఆకారమును, భావంబునన్ = మనస్సునందు, నిల్పి=నిలుపుకొన్నదై (ఎల్లప్పుడాయాకారమునే తలంచికొనుచు ననుట), అంగ...ధైర్యయై-అంగభవ = మదనునియొక్క, కోదండ=ధనుస్సునందలి, ఉగ్ర=క్రూరమైన, మౌర్వీ=నారియొక్క, రవ=ధ్వనివలని, క్షోభ=పీడచే, ఆకంపిత=కదల్పఁబడిన, ధైర్యయై=ధైర్యముగలదై, అలఁతన్=శ్రమచే, అచ్చోన్=అయ్యెడ, నిల్వక=నిలువఁజాలక (ఆప్రవరుఁడు లేమిచే నాప్రదేశము నివాసయోగ్యముగా భావింపక)

* 'కానలఁబడెన్' వెనుకటిపాఠమున కన్వయసారళ్యమును, ఈపాఠమున నర్థసారస్యమును గలదు.

దుఃఖాబ్ధినిర్మగ్నరైయై=దుఃఖసముద్రమునమున్గినదై, తద్భూ...వెంటన్-తత్= ఆ, భూభృత్ = కొండయొక్క, మేఖలవెంటన్ = నడిప్రదేశమువెంబడి, కానలబడిన్=అడవులత్రోవను, వైపద్యముతో నన్వయము. (పా. కానలఁ బడెన్ అనుపాఠము స్వీకరింతుమేని తిరుగుచున్ అనుక్రియతో నన్వయింపదు గాన నీ పాఠము గ్రాహ్యము కాదు.)

ప్రవరునియాకారము చిత్తమున నిలుపుకొన్నంతన వలపు జనించెను. మన్మథునినారి తుమ్మెదలు. వానిమ్రోఁత వలపురేఁగుచే సుందువరూథినికి క్షోభ గూర్చెను. మన్మథునినారి తుమ్మెద చాలనుటకు—

శ్లో. "ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచవిశిఖాః
వసంతః సామంతో మలయమరుదాయోధనరథః." సౌందర్యలహరి.

తా. ఆవిప్రుఁ డట్లు తన్నుఁ ద్రోసిపుచ్చి యరుగఁగా నావరూథిని యతనిచక్కఁదనమును దలఁచితలఁచి మన్మథబాణములతాఁకులచే ధైర్యము దక్కి దుఃఖమున మునిఁగి యచ్చట నిల్వలేక యాకొండనడితావులందలి యడవులత్రోవలఁబడి.

క. తిరుగుచు ధరణీసురవరుఁ
డరిగినచో ప్పరసి యరసి యట కానక యా
హరిణాంకముఖి సఖీజన
పరివృత్తయై మగిడివచ్చి భావములోనన్. 4

టీ. తిరుగుచున్ = సంచరించుచు, ధరణీసురవరుఁడు = బ్రాహ్మణశ్రేష్ఠుఁడు, అరిగినచొప్పు=పోయినవిధము, అరసిఅరసి=విచారించి విచారించి, అట=అక్కడ, ఆహరిణాంకముఖి=చంద్రునిఁబోలు ముఖముగలయాయింతి, సఖీజనపరివృతయై = చెలికత్తెలచే వెనుదవులఁబడినదై, చెలిమికత్తెలచే నావరింపఁబడినదై (తన్ను వెదుకవచ్చి కలసికొన్నచెలులతోఁగూడి), మగిడివచ్చి= తిరిగివచ్చి, భావములోనన్=మనస్సులో, (పా. మరలివచ్చి) వైపద్యముతో నన్వయము.

తా. అట్లు వరూధిని యడవులఁబడి తిరుగుచుఁ బ్రవరుఁ డరిగిన జాడ వెదకి వెదకి కానలేక యంతలోఁ దన్ను వెదకవచ్చిన చెలికత్తెలతోఁ దిరిగివచ్చి మనస్సులో.

ఉ. అక్కట వాఁడు నాతగుల మాఱడి సేసి దయావిహీనుఁడై
చిక్కక త్రోఁచి పోయె దరిఁ జేరఁగ రాని వియోగసాగరం
బెక్కడ నీఁదుదాన నిఁక నీకొఱనోములు నోఁచినట్టి నే
నెక్కడ వానికౌఁగి లది యెక్కడ హా విధి యేమి సేయుదున్.

టీ. అక్కట=అయ్యో, వాఁడు = ఆబ్రాహ్మణుఁడు, నాతగులము = నావలపును, మాఱడిచేసి = రట్టుచేసి, వ్యర్థముచేసి (రట్టు అన నల్లరి. తాను మనుష్యుని వలపింపలేకపోయెనే వేలుపుమగువయై వ్యర్థురాలయ్యెనని తోడి వారొనరించు నల్లరి.) దయావిహీనుఁడై=కరుణ లేనివాఁడై, చిక్కక=అందక, త్రోచిపోయెన్=(కౌఁగిలించుకొనఁ బోయినప్పుడు) తొలఁగఁద్రోసి యరిగెను. దరిన్=గట్టును, చేరఁగన్ = చేరుటకు, రానివియోగసాగరంబు = అలవికాని విరహసముద్రము, ఎక్కడన్=ఎంతవఱకని, ఈఁదుదానన్ = ఈఁదఁగలను ? ఇఁకన్, ఈకొఱనోములు నోఁచినట్టినేను = తక్కువనోములునోఁచిన యీ నేను, ఎక్కడ ? వానికౌఁగిలి అది=వానియావిధమగు కౌఁగిలింత, ఎక్కడ ? (ఆ సుందరాకారుని కౌఁగిలి నావంటికొఱనోములు నోఁచిన నిర్భాగ్యురాలి కెటుల లభించు ననుట) హా విధి=అయ్యో దైవమా! ఏమిసేయుదున్=విరహ మెటులఁ దొలఁగించుకొందును ? (పా. విధి నేమి చేయుదున్=నాకిట్టి దుర్వి చారము కలుగఁజేసిన బ్రహ్మ నేమిచేసి పగతీర్చుకొందును.)

వేల్పుచెలువ తనంత వలచిరాఁగా మానవుఁడు తొలంగిపోవుట వేల్పుచెలువ నోఁచినకొఱనోముల ఫలముగాని వేఱుగాదు.

తా. అయ్యో ! అతఁడు నాయంత నేనై వలచినను, నావలపును రట్టు చేసి చేఁజిక్కక త్రోపు త్రోసిపోయెను. దరిగానని యీవిరహసముద్రము

నెట్టేఁదఁగలను? తపస్సనోములు నోఁచినట్టి యీ నే నెక్కడ? వానికౌఁగి లెక్కడ? హా దైవమా! యేమి చేయుఁదును? అలం. పరిణామము. విషమము.

ఉ. కమ్మనికుందనంబు కసుగందని మే నెలదేఁటిదాఁటులన్
బమ్మెరవోవఁ దోలుఁ దెగబారెఁడు వెండ్రుక లిందుబింబమున్
గిమ్మనసీదు మోము గిరిక్రేవులు మూఁపులు కౌను గానరా
దమ్మకచెల్ల! వానివికచాంబకముల్ శతపత్త్రజైత్రముల్. 6

టీ. అమ్మకచెల్ల=ఔరా! వాని=ఆప్రవరుని, కసుగందని మేను = ఇంచుకంతయును వాడుదేఱని (వాని) శరీరము, కమ్మని కుందనంబు=పరిమళించు మేలిమి బంగారము, తెగబారెఁడు వెండ్రుకలు = బారకొలఁదినిమించిన (వాని) తల వెండ్రుకలు, ఎలదేఁటిదాఁటులన్=కొదమతుమ్మెదబారులను, బమ్మెరవోవన్ = అదరిపోవునట్లు, తోలున్=పాఱదోలును, మోము = అతనిముఖము, ఇందు బింబమున్=చంద్రబింబమును, కిమ్మనసీదు = ఏమి యని వాయెత్తి మాటలాడ నీయదు. తిరస్కరించును. మూఁపులు = భుజశిరస్సులు, గిరిక్రేవులు = పర్వత శిఖరములు, మిగుల నున్నతములుగా నున్న వనిభావము. కౌను=నడుము, కాన రాదు=అగపడదు. వాని వికచఅంబకముల్=విరఁబాఱియుండు వానికన్నులు, శతపత్త్రజైత్రముల్ = పద్మములను జయించునవి.

శైలశిఖరములవలె భుజము లున్నతములుగా నుంట సౌందర్యాతిశయము. విజయవిలాసంబునం దిటులె "ఎగుభుజంబులవాఁడు" అనియు, ఇందే ద్వితీయాశ్వాసమున "నిక్కి వీనులతోడ నెక్కసక్కెము లాడుకరణి నున్నవి పీనఘనభుజములు" అనియుఁ జెప్పఁబడెను.

తా. ఆహా! ఏమని వర్ణింతును! ఇంతైన వాడుదేఱని వానిశరీరము పరిమళము కలమేలిమి బంగారము. బారతో బారెఁడు నిడుపుగల వానివెండ్రుకలు తుమ్మెదలబారును మీఱు నెఱులు గలిగి యున్నవి. ముఖమా చంద్రబింబమును మించి యున్నది. భుజశిరస్సులు పర్వతాగ్రములవలె నున్నత

ములై యున్నవి. వహ్వా! వానికన్నులు విశాలములై కమలములను లెక్క గొనక యున్నవి. అలం. ఉత్ప్రేక్ష, ఉపమ, రూపకము, అతిశయోక్తి.

ఉ. చొక్కపుఁ బ్రాయముఖ్ మిగుల సోయగముఖ్ గలప్రాణనా
యకుం, డెక్కుడు వశ్యతఖ్ రతుల నేఁకటఁదీర్చి సమేళ మొప్పఁ
గా, నక్కున గారవించి ప్రియమందఁగ నోఁచనియింతి నైన
యా, చక్కఁదనం బదేమిటికి జవ్వన మేటికిఁ బ్రాణ మేటికిన్?

టీ. చొక్కపుఁబ్రాయముఖ్=తేటినయావనమును, మిగులఖ్, సోయగముఖ్ = చక్కఁదనమును, కలప్రాణనాయకుఁడు=కలిగిన ప్రియవల్లభుఁడు, ఎక్కుడు వశ్యతఖ్ = ఎక్కువయధీనతతో, రతులఖ్=సంభోగములయందలి, ఏఁకటఖ్=అత్యాపేక్షను, తీర్చి=నవరించి, సమేళము=ఐక్యము, (ఒకటిగాఁగలిసి యుండుట) ఒప్పఁగాఖ్=చెలఁగునట్లు, అక్కునఖ్=ఱొమ్మున, గారవించి=గారవింపఁగా, ప్రియము=ప్రేమమును, అందఁగఖ్=పొందుటకు, నోఁచనియింతిది=నోఁచుకొనని దురదృష్టవంతురాలగు స్త్రీది, ఐనయాచక్కఁదనంబు అది=అట్టి సౌందర్యము, ఏమిటికిఖ్=ఎందులకు? జవ్వనము = యౌవనము, ఏటికిఖ్ = ఎందులకు? ప్రాణము = ఉసురు, ఏటికిఖ్=ఎందులకు? ఇన్నియుం వ్యర్థ మని భావము.

రతులఁ దృప్తిదీర్చుట, సమేళ మొప్ప నక్కునగారవించుటఅనువానిచేఁ బురుషాయితభోగ మూహ్యము. ఇదియే రతికిఁ బరమావధి. అట్టిభాగ్యమునకు నోఁచనైతి ననుట. అక్కున గారవింపఁబడుటయే పురుషాయితధర్మ మనుటకు

శ్లో. "ఉరసి నిపతితానాం స్రస్తధమ్మిల్లకానాం
ముకుళితనయనానాం కించిదున్మీలితానాం
ఉపరిసురతఖేదస్విన్నగండస్థలానా
మధరమధు వధూనాం భాగ్యవంతః పిబంతి." భర్తృహరి. శృం. శ.

తా. తేటిసయావనమును నిండారు చక్కఁదనమును గల్గియునట్టి

ప్రియుండు మిక్కిలి స్వాధీనుఁడై సంభోగకాంక్షలఁ దీర్చుచు బోమ్మునఁ జేర్చుకొనుచుండ సౌఖ్య మందుటకు నోఁచుకొననియాఁడుదానిచక్కఁదనము యౌవనము ప్రాణము నిష్ప్రయోజనములు. అప్రస్తుతప్రశంసాలంకారము.

ఉ. ఎంతతపంబు సేసి జనియించినవారొకొ మర్త్యభామినుల్
కాంతుఁ డవజ్ఞ సేసినను గాయము వాయుదు రే నమర్త్యనై
చింతల వంతలం జివికి సిగ్గఱితిన్ మృతి లేనినాదుచె
ల్వింతయు శూన్యగేహమున కెత్తినదీపిక యయ్యె నక్కటా!

టీ. మర్త్యభామినుల్=మనుష్యస్త్రీలు, ఎంతతపంబు చేసి = ఎంత పెద్ద తపస్సును గావించి, జనియించినవారొకొ=పుట్టిరో? కాంతుఁడు = ప్రియుఁడు, అవజ్ఞ=అవమానము, చేసినన్=చేసిన పక్షమున, కాయము = శరీరమును, వాయుదురు=వీడుదురు, ఏన్=నేను, అమర్త్యనై=(చావులేని) దేవతాస్త్రీనై, చింతలన్ వంతలన్=దుఃఖములతోను అవస్థలతోను, చివికి=చీకుచెంది, సిగ్గఱితిన్=సిగ్గుమాలితిని,మృతిలేనినాదుచెల్వు ఇంతయున్=చావులేనినాచక్కఁదనమంతయుం, శూన్యగేహమునకున్=పాడుకొంపకు, ఎత్తినదీపిక = పెట్టిన దీపము, అయ్యెన్=ఆయెను. అక్కటా=అయ్యో!

"మ్రియత ఇతి మర్త్యః" అను వ్యుత్పత్తిచేత మనుష్యజన్మము చావు గల దని, తద్వ్యతిరేక మగుటచే నమర్త్యులు చావు లేనివా రని భావము.

తా. మనుష్యస్త్రీ లెంతయేని పుణ్యము చేసినవారు. ప్రియులు వారి యెడ నవజ్ఞను జూపునపుడు దేహము వీడి దుఃఖముఁ దీర్చుకొందురు. దేవతాస్త్రీ నగుటచేఁ జింతలను వంతలను జీకుచెంది సిగ్గుమాలవలసినదే కాని చావఁ దరముగాదు గదా! చావులేని నా యీచక్కఁదన మంతయుఁబాడుకొంపకుఁ బెట్టినదీపమువలె నయినది. అలం. ఉత్ప్రేక్ష, పరికరాంకురము, నిదర్శన.

వ. అని వితర్కించుచుం గ్రించుఁదనంబునన్ బునగపునగపరిభవ
కారి యై కాఱియంబెట్టుసిరిపట్టి బెట్టేయన్ గాఁడి చనునల

రంపకట్టియల గుట్టు చెడి వెచ్చవెచ్చనై హెచ్చి విచ్చల
విడిం గాయునుద్దామవిరహదవదహనదాహంబున దేహంబు
తల్లడిల్ల మల్లడిగొని వెల్లడరునిట్టూర్పుగాడ్పు విసరులంగస
రెత్తి యంతకంత కంతరంగంబున నింతం తెనరాక పొంగి
చింతాసాగరంబు వేగిరంబ వెల్లివాఱిచె ననఁ దుడిచిన నడం
గక సారెకుం దారకల నీరికలెత్తుపొగ రన నిగనిగ లీనుమ
డిగ నిగుడ మిగులువగల బుగులుబుగులున నెగసి యొగసి
యొప్పులకుప్ప లగుతెప్పలం జిప్పిలు కాటుక లప్పళించి కరంచి
దరదళదరుణకమలదళశోణంబు లగుదృక్కోణంబులం దిగు
వాఱుకన్నీరు చెన్నారుకర్ణద్వయీగోళంబులు నిండి తను
తాపతప్తం బగుహాటకతాటంకయుగళంబునం బడి క్రొం
బొగ లెగయింప బిసకిసలయసగంధం బగు మణిబంధం
బునఁ జికురబంధంబుఁ జేర్చుకొని పొరలం దుఱిమిన
విరు లురుల నరవిరిసి కవిసి యిరులుకొనుగరగరని
నెఱికురులు గుఱి గడవఁ బెరిఁగిన వగుటం జేసి తాళివడి
మెయి మూసికొని గ్రహగణంబులం జెన్నగుమిన్ను విఱిగి
పయిం బడినవడువున బెడంగువడఁ గలయం దలకొనుపులక
మొలకపయిరునకుం బాఱు దుర్వార వారిపూరంబనం గ్రమ
క్రమంబున నంగంబులం గ్రమ్ము చెమ్మటలమిన్నేటి పెన్నీటి
వఱ్ఱున ముణుంగకుండ సవరించినమించుకుంభప్లవం బనం
బరిభ్రష్టోత్తరీయం బై బయలువడి యుబ్బురంపుగుబ్బచను
దోయి నిబ్బరంపు మెఱుంగు లీనం గుపితహరనయనశిఖిశిఖా
భస్మీకృతస్మరవిరహశోకంబునం బడి చందురునిం బట్టుకొని
యడలురతిరమణిచందంబునం గుసుమితలతాంతనిశాంతశశి

కాంతవేదికాంతరంబున మేను సేర్చి వివిధదశాంతరంబుల
వేఁగుచుండె నంత. 9

టీ. వితర్కించుచున్=చింతసేయుచు, క్రించుఁదనంబునన్=నైచ్యముచే, పునఃపునఃపరిభవకారిణియై = మాటిమాటికి నవమానము చేయువాఁడై, తిరస్కార మని కొందఱు వ్రాసిరిగాని పరాభవ మనుటయే తగియున్నది. కాఱియంబెట్టు సిరిపట్టి=బాధపెట్టుమన్మథుఁడు, బెట్టు=మిక్కిలి, ఏయన్ = వ్రేయఁగా, కాఁడిఁ గ్రుచ్చుకొని, చనుఁబలరుఅంపకట్టియలన్=(దూసి) పోవు శ్యామలుకలచే, గుట్టుచెడి=మర్మముచెడి, వెచ్చవెచ్చనై = ఇంచుక వేఁడియై, హెచ్చి, విచ్చలవిడిన్=అడ్డులేక, కాయు = కాయుచున్న అలం. పరిణామము. ఉద్దామ...దాహంబునన్ - ఉద్దామ=మితిమీఱిన, విరహ=వియోగ వ్యథ యను, దవదహన=దవాగ్నియొక్క, దాహంబునన్=తాపముచే, దేహంబు=శరీరము, తల్లడిల్లన్=అదురుకొనఁగా, మల్లడిగొని=దట్టమయిన, పెల్లు = మిక్కిలి, అడరునిట్టూర్పుగాడ్పువిసరులన్ = అతిశయించు దీర్ఘశ్వాసపుగాలియొక్కవీచుటచే, కసరెత్తి=తుపానుగల్గి, అంతకంతకున్ = అప్పటప్పటికి, అంతరంగంబునన్=హృదయమున, ఇంత అంత అనన్ రాక = పరిమాణము చెప్పఁదరముగాక, పొంగి, చింతాసాగరంబు=దుఃఖసముద్రము, వేగిరంబ = శీఘ్రముగా, వెల్లివొడిచెనన్=పొర్లి ప్రవహించెనో యనునట్లు. అలం. రూపకోత్ప్రేక్షలు రెండును. తుడిచినన్=వస్త్రపుకొంగుతోఁదుడుచుకొన్నను, అడంగక=మానక, సారెకున్=మాటికిని, తారకలన్=నల్లగ్రుడ్లనుండి, ఈరికలు = మొలకలు, ఎత్తు ఎత్తునట్టి, పొగరు=నల్లనయో (నల్లనివర్ణమేమో), అనన్ = అనునటుల, నిగనిగలు=నిగనిగనికాంతులు, ఇనుమడిగన్=రెట్టింపుగా, నిగుడన్ = వ్యాప్తిచెందఁగా, మిగులువగలన్=హెచ్చైనదుఃఖముచే, బుగులుబుగులునన్ =బుగులుబుగులు మనునట్లు, ఎగసియెగసి=ఉప్పతిల్లియుప్పతిల్లి, ఒప్పులకుప్పలు= చక్కఁదనాలప్రోవులు, అగుచెప్పెన్=ఐన కనుఱెప్పలపఱనుండి, చిప్పిలు కాటుకలు = ఉబికెడు కాటుకలను, అప్పళించి=ఆక్రమించి, కరంచి=కరఁగఁ

చేసి, దర...శోణంబులు - దరదళత్=కొంచెము విచ్చు, అరుణకమల = ఎఱ్ఱ
దామరలయొక్క, దళ=రేకులవలె, శోణంబులు=ఎఱ్ఱనివి. అలం. ఉపమ. అగు
దృక్కోణంబులన్=అగునట్టి నేత్రాంతములనుండి, దిగువాఱు = స్రవించునట్టి,
కన్నీరు, చెన్నారు కర్ణద్వయీగోళంబులు = ఒప్పునట్టి చెవిదోయియొక్క
రంధ్రములను, నిండి, తనుతాపతప్తంబు = శరీరపు వేఁడిమిచేఁ గాఁచబడినది,
అగు హాటకతాటంకయుగళంబునన్ = అగునట్టి బంగారు కమ్మలజతపై,
పడి=పడినదై, క్రొంబొగలు=క్రొత్తపొగలను, ఎగయింపన్=రేఁపఁగా, అలం.
అతిశయోక్తి. బిసకిసలయసగంధంబు = తమ్మిబిగురుఁబోలినది, అగుమణిబంధం
బునన్=అగునట్టి మణికట్టున, అలం-ఉపమ. చికురబంధంబున్ = వెండ్రుకల
ముడిని, చేర్చుకొని=పెట్టుకొని (నిలుపుకొని) పొరలన్=దొరలుకట్టుగ, తుఱి
మినవిరులు=చెరివినపూలు, ఉరులన్ = తొఱఁగునట్లు, అరవిరిసి=సగమువిచ్చి,
కవిసి=క్రమ్మి, ఇరులుకొను...కురులు = ఇరులుకొను=చీకట్టుకమ్ము, గరగరని
నెఱికురులు = అందముగల్గి నొక్కులుదీఱిన వెండ్రుకలు, గుఱి=హద్దు, కడ
వన్=కడచునట్లు, పెరిగినవి=వృద్ధినొందినవి, అగుటం జేసి=కాఁబట్టి, (వెండ్రు
కల నల్లదనమును జీకటితోఁ బోల్చుటయు నొక్కులుగా నున్న వెండ్రుకలు
చీకటులఁబోలి మనోహరముగా నుండుటయుం సాజము. ఇందులకు సీ. "మొలక
చీకటి జలజలరాల్పఁగా రాదె నెరులుమించిన పిరికురులయందు"—పాండు.
రంగమాహాత్మ్యము. రాశిపడి=ప్రోవై, మెయిన్ = శరీరమును, మూసికొని =
ఆవరించుకొని, గ్రహగణంబులన్=గ్రహసమూహములచే, చెన్నగుమిన్ను =
ఒప్పగునాకాశము, విఱిగి=తునిఁగి, పయిన్=తనమీఁద, పడినవడువునన్ =
పడినవిధమున, బెడంగుపడన్=అందమగుచుండఁగా, కలయన్ = అంతటను,
తలకొను...పయిరునకున్-తలకొను = సంభవించు, పులక=రోమోద్గమమను,
మొలకపయిరునకున్ = మొక్కపైరునకు, అలం. రూపకము. పాఱు...
పూరంబు-పాఱు=ప్రవహించు, దుర్వార = అడ్డగింపరాని, వారిపూరంబు =
జలప్రవాహము, అనన్=అనునట్లు, అలం-ఉత్ప్రేక్ష. క్రమక్రమంబునన్,

అంగంబులన్ = అవయవములందు, క్రమ్ము...వట్టురన్-క్రమ్ము=వ్యాపించు, చెమ్మటల=చెమటచేనైన, మిన్నేటి=గంగయొక్క, వెన్నీటివట్టునన్ = పెద్ద నీటివఱదయందు, మునుంగకుండన్=మునిఁగిపోకుండునటుల, నవరించినన్ = సరిచేయఁగా, మించుకుంభద్వయంబునన్ = అతిశయించునట్టి కుండల బోరగిలఁ బెట్టి కట్టిన తెప్పయో యనునట్లు. అలం-ఉత్ప్రేక్ష. పరిభ్రష్టోత్తరీయంబై = జాఱిన పైఁటగలదై, బయలుపడి, అబ్బురంపుగుబ్బ చనుదోయి=అపురూపమైన వట్రువగల కుచద్వయము, నిబ్బరంపుమెఱుంగులు=నిద్దపుకాంతులను, ఈనన్= కలిగించుచుండఁగా, వలువ తొలంగుటచే: గనిపించు గబ్బిగుబ్బలు చెమ్మట మిన్నేరు దాటుటకుఁ గట్టిన కుండల బోరగిలవైచి కట్టిన తెప్పకైవడి యున్న దనుట. వట్రువయు బిగియుఁ గలచన్నులకాంతి కందళించుచు. ఇట్లనుటకు-ఉ. "క్రిక్కిఱిచన్నుదోయి యిరుక్రేవల కాంతియుఁ బంచబాణుఁ గ్రొవ్వెక్కఁగఁజేయు"-శృంగార నై. అ-7. కుపిత...శోకంబులన్-కుపిత = కోపించిన, హర=శివునియొక్క, నయనశిఖి = నేత్రాగ్నియొక్క, శిఖా = జ్వాలలచే, భస్మీకృత = బూదిగాఁజేయఁబడిన, స్మర = మన్మథునియొక్క, విరహ=ఎడఁబాటువలని, శోకంబునన్=దుఃఖమునందు, పడి=పడినదై, చందురునిన్=చంద్రుని, పట్టుకొని, అడలు...చందంబునన్ - అడలు=దుఃఖించు, రతిరమణిచందంబునన్ = రతీదేవివిధమున, అలం-ఉపమ. కుసుమిత... తరంబునన్—కుసుమిత = పూచిన, లతానికాంత=లతాగృహమువలి, శశికాంతవేదికాంతరంబునన్ = చంద్రకాంతమణిమయ మగు తిన్నియపై, మేనుసేర్చి=శరీర ముంచి, చంద్రకాంతశిలపై వరూథిని పరుండుట భర్తృమరణమునకుఁ బరితపించుచు రతీదేవి చంద్రుని బట్టుకొని విచారపడునటులున్న దనుట, వివిధ దశాంతరంబులన్ = పలుతెఱఁగులగు నవస్థాభేదములు, వేఁగుచుండెన్ = బాధపడుచుండెను. (మన్మథావస్థలు పది.—చక్షుఃప్రీతి, మనస్సంగము, సంకల్పము, జాగరము, కృశత, అరతి, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మరణము.)

పూర్వానురాగరూప మగు విప్రలంభమునందుఁ బదియవస్థలు, కొందఱి మతమునఁ బండ్రెండవస్థ లని చెప్పఁబడినవి. పైని చెప్పఁబడిన దశావస్థల నిటు లాలంకారికులు నిర్వచించిరి—

శ్లో. "చక్షుఃప్రీతిః ప్రథమం చింతాసంగ స్తతోఽథ సంకల్పః
నిద్రాచ్ఛేద స్తనుతా విషయనివృత్తి స్త్రపానాశః
ఉన్మాదో మూర్ఛా మృతి రిత్యేతే స్మరదశా దశైవ స్యుః."

ఈ పదియవస్థలు విరహజన్యములు. కొందఱు ద్వాదశావస్థలు చెప్పిరి. ప్రతాపరుద్రీయమునందు శ్లో. "అవస్థా ద్వాదశ మతాః కామశాస్త్రానుసారతః" అనుదానికి అలంకారశాస్త్రమునుబట్టి యవస్థలు పదియే యని వ్యాఖ్యాత యనెను. "దశావస్థాసు తత్రాదౌ" అని దశరూపకమునందును, "దశావస్థా స్సమాసతః" అని సింగభూపాలీయకమునందును అవస్థాదశకమే చెప్పఁబడియున్నది. ద్వాదశావస్థలు కామశాస్త్రానుసారముగ నై యుండును.

తా. ఈవిధముగా వరూథిని వితర్కించుచు మన్మథతాపమునకు దేహము తల్లడిల్లఁగా, నిట్టూర్పుగాడ్పు లనుతుపాను గొట్టి పొంగి పొర్లు నంతరంగమందలి చింతాసాగరపు వెల్లువ యనునట్లు తుడిచినను దగ్గక ఱెప్పలకాటుకను గలసి నల్లగ్రుడ్లకాంతులో యన నిగనిగలాడుచు నెత్తి దామరఱేకులవంటి కన్నులకొనలనుండి దిగజాఱుకన్నీరు బంగరుకమ్మ లపైఁ బడి క్రొత్తకాంతులఁ గల్పింపఁగా, తమ్మిచివురుం బోలుమణికట్టుపయిఁ వెండ్రుకలముడి నేర్చికొనుటచే సగమువీడి నిండుగాఁ దుఱిమినపూలు జారలుచుండఁ జీకట్లు క్రమ్ము పొడవయిన నెఱికురులు రాశిపడి శరీరము నిండ మూసికొని నక్షత్రగ్రహములతో నొప్పెడునాకసము విఱిగి మీఁదఁ బడిన విధమునఁ గాఁగా, అంతటను మొలకలెత్తిన పులకలకుఁ బాఱు జలప్రవాహ మనున ట్టున్న చెమ్మటవఱదలో మునిఁగిపోకుండఁ బెట్టిన (రెండు కుండలతోఁ గట్టిన) తెప్ప యనునట్లు పైఁట జాఱిన గబ్బిచనుదోయి మెఱుఁగులు కురియఁగా, మన్మథుఁడు శివునికంటిమంటచే నీఱు,

చేయఁబడఁగా నాతని విరహమునకుఁ దాళలేక చంద్రునిఁ బట్టుకొని యేఁచు రతీదేవివిధమున, పూచిన లతాగృహమునందు చంద్రకాంతశిలాతలమున శరీరము చేర్చి బహుదశాభేదములతో బాధపడుచుండెను.

చ. తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గముసేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణిదాల్చెఁగషాయదీధితిన్.

టీ. తరుణిన్=వయసుదానిని, అనన్యకాంతన్ = మఱొకప్రియుఁడు లేనిదానిని, అతి...శాంగిన్ - అతిదారుణ=మిగులఁ గ్రూరమయిన, పుష్పశిలీముఖ=పూవిల్తునివలని, వ్యథాభర=అధికబాధచే, వివశ=పరవశమగు, అంగిన్=శరీరముగలదానిని, వరూథినిని, అంగభవుబారికిన్ = మదనావస్థకున్=అగ్గము చేసి=పాల్పఱిచి, క్రూరుఁడై=కఠినుఁడై, దయాశూన్యుఁడై యనుట. మహీసురాధముఁడు=అధమ బ్రాహ్మణుఁడు, అహంకృతితోన్=అహంకారముతో, అరిగెన్ = పోయెను, అని=అనుకొని, రోషభీషణ స్ఫురణన్ = కోపముచే భయంకరమగు తేజమును, వహించెనో = తాల్చెనేమో, అనన్=అనునటుల, నభోమణి = సూర్యుఁడు, కషాయదీధితిన్ = ఎఱ్ఱనికాంతిని, తాల్చెన్ = ధరించెను.

కోపము రక్తవర్ణగణములోనిది. (మూఁడవ ఆశ్వాసములోని మొదటి పద్యవ్యాఖ్య చూడుము.) అస్తమించుతఱి సూర్యుఁ డెఱ్ఱనగుట సాజము.

కషాయమన ఎఱుపురం గనుటకు—
'కషాయో రసభేదేఽపి నిర్యాసే చ విలేపనే,
అంగరాగే చ న స్త్రీ స్యాత్ సురభౌ లోహితే త్రిషు.' మేదిని.

తా. చిన్నారి వయసుది ఇతరు నెవ్వనిఁ బ్రేమింపనిది తన్నువలచినది యగువరూథినిని ప్రేమింపక మన్మథావస్థలపాలుచేసి ప్రవరుఁడు క్రూరుఁడై

త్రోసి చనిరొ నని కోపము దాల్చి యెఱ్ఱవాఁడెనో యనునట్లు సూర్యుఁడెఱ్ఱని కాంతి గలవాఁ డయ్యెను. అలం. పరికరము, ఉత్ప్రేక్ష, కావ్యలింగము.

సీ. ఉరుదరీకుహరసుప్తోత్థశార్దూలముల్
  ఝరవారి శోణితశంకఁ ద్రావ
వనకుంజమధ్యశాద్వలచరన్మృగపంక్తి
  దావపావకభీతిఁ దల్లడిల్ల
నాశ్రమాంతరభూరుహాగ్రముల్ మునికోటి
  బద్ధకాషాయవిభ్రాంతిఁ జూడ
ఘనసానుశృంగశృంగాటకంబులఁ గాంచి
  యమరులు హేమాద్రి యనుచు వ్రాలఁ
తే. గానఁ జెలరుచిఁ గింశుకప్రవాళ
ఘుసృణకిసలయకంకేళికుసుమగుచ్ఛ
బంధుజీవజపారాగబాంధవంబు
లన్నగంబున జరఠారుణాతపములు. 11

టీ. ఉరు...శార్దూలముల్ - ఉరు=గొప్పవగు, దరీకుహర = గుహల కలుగులలో, సుప్తోత్థ=నిద్రించి లేచిన, శార్దూలముల్ = పెద్దపులులు, ఝర వారి = సెలయేళ్లలోని నీటిని, శోణితశంకన్ = రక్త మనునూహతో, త్రావన్ = త్రాఁగఁగా, (గుహలలో నిద్రించుచుండి అప్పుడే లేచి వచ్చిన పెద్దపులఁలు సెలయేళ్లలోనినీటిని రక్త మని త్రాఁగఁగా ననుట), వన...మృగ పంక్తి—వన = అడవియందలి, కుంజ=పొదరిండ్లయొక్క, మధ్య = నడిమి, శాద్వల = పచ్చికపట్టులందు, చరత్ = చరించు, మృగపంక్తి = జింకల గుంపు, దావపావకభీతిన్ = దావాగ్ని యనెడు భయముచే, తల్లడిల్లన్ (పొదరిండ్ల నడిమి పచ్చికనేలలందు మేఁత మేయుచుజింకలు పొదరిం డ్లెఱ్ఱగాఁ గాన్పించుటచేఁ గాఱుచిచ్చని జడియఁగా ననుట), ఆశ్రమాం...గ్రముల్

ఆశ్రమాంతర = మునిపల్లెలలో నున్న, భూరుహాగ్రముల్ = వృక్షాగ్రములను, మునికోటి = మునిసమూహము, బద్ధకాషాయవిభ్రాంతిన్ = అరఁగట్టిన కావివస్త్రము లను భ్రమతో, చూడన్, (మునిపల్లెలలో నున్నవృక్షములకొనలను జూచి మునులు తమకావివస్త్రముల నెండఁగట్టినట్టు భ్రాంతి చెందఁగా ననుట), ఘన...శృంగాటకంబులన్-ఘన = గొప్పవైన, సాను = చఱియలను, శృంగ=శిఖరములను, శృంగాటకంబులన్ = నాల్గుత్రోవలు కలియుచోట్లను, కాంచి, అమరులు = దేవతలు, హేమాద్రి యనుచున్ = మేరుపర్వత మని, వ్రాలన్ (విమానము లెక్కి యాకసమునఁ దిరుగుదేవత లెఱ్ఱనిచఱియలను శిఖరములను జదుకములను గాంచి మేరుపర్వతమే యనుకొని దిగి రాఁగా ననుట), హిమవంతము సాంధ్యరాగముచే నెఱ్ఱపడెను. సువర్ణము రక్తగణములోనిది గాన నెఱ్ఱగా నున్న మంచుకొండను వేల్పులు మేరుగిరిగా భ్రమించిరి. అన్నగంబునన్=ఆ కొండపై, కింశుక...బాంధవంబులు - కింశుక = మోదుగుపూవులయొక్కయు, ప్రవాళ = పవడములయొక్కయు, ఘుసృణ=కుంకుమపూవుయొక్కయు, కిసలయ=చిగురుటాకులయొక్కయు, కంకేళి కుసుమగుచ్ఛ = రక్తాశోకపుఁ బూగుత్తులయొక్కయు, బంధుజీవ=మంకెనపూలయొక్కయు, జపా = జపాకుసుమములయొక్కయు, రాగ=ఎఱుపునకు, బాంధవంబులు=చుట్టాలు (అగు) జరఠారుణాతపములు = ముదిరినయెఱ్ఱయెండలు (సంజయెండలు), పేశలరుచిన్ = మృదుకాంతితో, కాసెన్, అలం. భ్రాంతిమంతము సుకవమయం,

సాయంసమయమునందు ఎండ ఎఱ్ఱగానుండి సమస్తవస్తువులను రక్తవర్ణముతో నలరారఁ జేయుచు నలుగడల వ్యాపించి వేఁడిలేక యొప్పె నని భావము.

శా. శ్రేణుల్ గట్టి నభోంతరాళమునఁ బాఱెన్ బక్షు లుష్ణాం
శుపా, షాణవ్రాతము కోష్ణ మయ్యె మృగతృష్ణావార్ధు లిం

శో జపాశోణం బయ్యెఁ బతంగబింబము దిశాస్తోమంబు
శోభాదరిద్రాణం బయ్యె సరోజషండములు నిద్రాణంబు
లయ్యెన్ గడున్. 12

టీ. పక్షులు = పులుఁగులు, నభః+అంతరాళంబునన్ = ఆకాశము మధ్యభాగమునందు, శ్రేణుల్ కట్టి=బారులుదీరి, పాఱెన్=పఱచెను (పరుగెత్తె ననుట), ఉష్ణాంశుపాషాణవ్రాతము=సూర్యకాంతపురాళ్ళసమూహము, కోష్ణము = నులివేఁడిగలది, అయ్యెన్ = ఆయెను. కోష్ణ మన నులివేఁడి యనుటకు—"కోష్ణం కవోష్ణం మందోష్ణం కదుష్ణం" అమరము. మృగతృష్ణావార్ధులు=ఎండమావు లనుసముద్రములు—సముద్రములవలె నంతులేక కానఁబడు నెండమావులు, ఇంకెన్=ఇంకిపోయెను. పతంగబింబము=సూర్యమండలము, జపాశోణంబు=జపాకుసుమము (దాసాని)వలె నెఱ్ఱనిది, అయ్యెన్, దిశాస్తోమంబు = దిక్కులసమూహము, శోభాదరిద్రాణంబు = కాంతిచేఁ బేదఱికము చెందినది. (కాంతిమాలినది), అయ్యెన్ = ఆయెను, సరోజషండములు = పద్మసమూహములు, నిద్రాణంబులు=ముకుళించినవి, ఆయెన్.

తా. పక్షులు మేఁతకుఁ బోయినతావులనుండి తమతమ యునికితావులకు బారులుదీరి పఱవఁగా నెండ సోఁకి యుండుచున్న సూర్యకాంతపురాళ్లు చల్లఁదనము నొందుచుండఁగా నెండమావు లణఁగిపోఁగా దిక్కులకాంతి తఱుఁగఁగాఁ గమలములు ముడుఁగఁగా సూర్యమండల మెఱ్ఱవాఱెను. అనఁగాఁ బ్రొద్దు గ్రుంకుసమయ మయ్యె నని తా. అలం. స్వభావోక్తి, పరిణామము, ఉపమయును.

క. తరణి యదె క్రుంకుచున్నాఁ
డరుదె మ్మని చంద్రుఁ బిల్వ నరిగెడు రజనీ
తరుణీమణిదూతిక లన
నరిగెన్ దూర్పునకు నీడ లతిదీర్ఘము లై 13

టీ. తరణి = సూర్యుఁడు, ఇదె = ఇదిగో, క్రుంకుచున్నాఁడు = అస్తమించుచున్నాఁడు. అరుదెమ్ము = ఏతెమ్ము, నీవు త్వరగా రమ్ము, అని, చంద్రున్=చందమామను, పిల్వన్ = పిల్చుటకు, అరిగెడు...దూతికలు - అరిగెడు=వెళ్లునట్టి, రజనీతరుణీమణి = రాత్రియను స్త్రీయొక్క, దూతికలు = తార్పుకత్తెలు, అనన్ = అనునటుల, నీడలు = (వస్తువుల) ఛాయలు, అతిదీర్ఘములై = మిగుల నిడుపులై, తూర్పునకున్ = తూర్పుదిక్కునకుఁగూర్చి, అరిగెన్ = పోయెను. ఉత్ప్రేక్షాలంకారము.

రాత్రి యనుచెలువకుఁ జంద్రుఁడు ప్రియుఁడు. ప్రతాపశాలియగు తరణి యున్నంతవఱకుఁ గలయిక పొసఁగదు. తూర్పునకుఁ బొడవుసాగిననీడ లుదయింపఁబోవు చంద్రుని బిలుచుదూతిక లని భావము.

తా. ప్రతాపవంతుఁ డయినసూర్యుఁ డనువైరికి వెఱచి చంద్రుఁడు డాఁగియుండఁగా నాతఁ డస్తమించుచున్నాఁ డింక నీవు రమ్మని పిల్చుకొని వచ్చుటకై పోవు రాత్రి యను స్త్రీయొక్కదూతికలో యనునట్లు వృక్షాదుల నీడలు దూర్పునకుఁ బొడవుగాఁ బోవుచుండెను.

క. క్రుంకె నపరాంబురాశిం
బంకజబంధుఁడు తదీయబడబాముఖవీ
క్షాంకురితకుతుకరథ్యని
రంకుశవేగాపహృతశతాంగుఁడువోలెన్. 14

టీ. పంకజబంధుఁడు=సూర్యుఁడు, అపరాంబురాశిన్=పడమటి సముద్రమున, తదీయ...శతాంగుఁడువోలెన్-తదీయ=ఆపడమటిసంద్రపు సంబంధమగు, ఆపడమటి సముద్రమునం దుండెడు, బడబా = ఆఁడుగుఱ్ఱముయొక్క, ముఖ=ముఖముయొక్క, వీక్షా=చూచుటచే, అంకురిత=అంకురించిన, కుతుక=కుతూహలముగల, రథ్య=రథాశ్వములయొక్క, నిరంకుశ=అడ్డులేని, వేగ = వేగముచే, అపహృత = ఈడ్చుకొని పోఁబడిన, శతాంగుఁడువోలెన్ =

రథముగలవాఁడువలె, (సంజవేళ సూర్యునిగమన మతివేగముగల్గినట్లు కన్పడుట ప్రసిద్ధము.) గ్రుంకెన్ = అస్తమించెను.

సూర్యునియశ్వములను ఏడని కొందఱు ఒకటియని కొందఱు చెప్పుదురు. సప్తాశ్వనామముచే నేడనుట ప్రసిద్ధము. (ఒకటియనుపక్షమును పెద్దన స్వీకరించునటులఁ దోఁచును. సముద్రమునం దాఁడుగుఱ్ఱము గలదనియుం దాని కడుపున బడబాగ్ని యుండి యది వాననీరు గ్రోలు నని పురాణకథ.) కొందఱు సూర్యునిరథాశ్వము సప్త+అను నశ్వముకాననే సప్తాశ్వుఁ డయ్యెనందురు. సూర్యునియం దేడురంగులు గలవు. వానిచే సప్తాశ్వముగాఁ జెప్పి రని ప్రకృతిజ్ఞులందురు. గురుబాలప్రబోధికలో "సప్త అశ్వాః యస్య సః సప్తాశ్వః" అనియుం; "సప్తనామకః అశ్వః యస్యేతి వా సప్తాశ్వః" అనియుం నుభయ పక్షముల కనుకూలము లగు వ్యుత్పత్తులు గలవు.

తా. సూర్యరథము పడమటిసముద్రముఁ జేరఁ బోవునపు డందు బడబాగ్నిని వహించి యుండెడు నాఁడుగుఱ్ఱపుమోర కన్పడఁగానే దానిని కలయుంతమకముతో నతివేగమున సూర్యాశ్వములు రథము నీడ్చుకొని పోయెనో యనున ట్లాంతలో సూర్యుఁ డస్తమించెను. ఉత్ప్రేక్షాలంకారము.

వ. ఆసమయంబున. 15

సీ. ఏవిహంగముఁ గన్న నెలుఁ గిచ్చుచును సారె
కును సైకతంబులఁ గూడఁ దారుఁ
దారి కన్గొని యది తనజోడు గా కున్న
మెడ యెత్తి కలయంగ మింట నరయు
నరసి కన్నీటితో మరలి తామర యొక్క
వదన మొండఁగ సరోవారి నద్దు
నద్ది త్రావఁగ నైఁప కట్టిట్టు గన్గొని
ప్రతిబింబ మీక్షించి భ్రమసి యుఱుకు

తే. నుఱికి యెఱకలు దడియ వే ఱొక్కతమ్మి
కరుగు నరిగి రవంబుతోఁ దిరుగు తేంట్లఁ
బొడుచు ముక్కున మఱియును బోవు వెదకి
సంజఁ బ్రియుఁ బాసి వగ నొక్కచక్రవాకి. 16

టీ. ఒక్కచక్రవాకి=ఒక యాఁడు జక్కవ, సంజన్=సంధ్యాకాలమున, ప్రియున్=మగజక్కవను, పాసి = ఎడబాసి, వగన్=విచారముతో, సైకతంబులన్=ఇసుకతిన్నెలపై, ఏవిహంగమున్ = ఏపక్షిని, కన్నన్ = చూచినను, ఎలుఁగు ఇచ్చుచున్=కూఁతనొసఁగుచు (అది తన్ను గుఱుతించుటకు), సారెకున్=మాటికిని, కూడన్ = (దానిని) కలయుటకు, తారున్ = వెన్నాడును. తా నెవతెయో కంఠస్వరంబుతోఁ దెలుపుకొనుచుఁ బ్రియుఁడేమో యని యితరపక్షిని సమీపించును. తారి=అట్లు వెన్నాడి, కన్గొని=చూచి, అది, తనజోడు=తనజంటది, కాకున్నన్=కాకపోఁగా, మెడయెత్తి = (తన జంటపులుఁ గెటు పోవుచున్నదో యెచట వాలునో యని చూచుటకు) మెడ సాచి, కలయంగన్=అంతటను, మింటన్=ఆకసమున, అరయున్=చూచును. అరసి=చూచి, కన్నీటితోన్=కన్నుల నీరు రాఁగా, (ప్రియుఁడు కనిపింపఁడాయెనే యని కన్నీరు గార్చుచు), మరలి=వెనుకకుఁ దిరిగి, తామర = తామరపూవును, ఎక్కి, వదనము=ముఖము, ఎండఁగన్=ఎండిపోవుచుండఁగా, (అఱచి యఱచి నోటి తడి యాఱిపోవఁగా) సరః+వారిన్ = సరస్సునందలి నీటిని, అద్దన్=అనును, అద్ది=అని, త్రావఁగన్=త్రాగుటకు, సైఁపక=చవికాక, అట్టిట్టు=అటునిటు, కన్గొని=చూచి, ప్రతిబింబము = (నీటిలోఁ దోఁచు) తన మాఱురూపును, ఈక్షించి=కాంచి, భ్రమసి=భ్రమించి, (తన ప్రియుఁడో యని), ఉఱుకున్=దుముకును. ఉఱికి, ఎఱకలు=ఱెక్కలు, తడియన్, వేఱొక్క తమ్మికిన్=మఱొకపద్మమునకు, అరుగున్=పోవును, అరిగి, రవంబుతోన్ = ధ్వనితో, తిరుగు తేంట్లన్=తిరిగెడు తుమ్మెదలను, ముక్కునన్=ముక్కుతో, (తాను జింకతో నున్నపు డుల్లాసముగాఁ జెలరేగి కూయుచున్నవే యని)

పొడుచుచున్ = పొడుచుచును, మఱియును = మరల, వెదకన్ = (ప్రియుని) వెదకుటకు, పోవున్ = (వేఱొకదిక్కునకు) పోవును.

చక్రవాకమును జెప్పక చక్రవాకిని జెప్పుట వరూథిని యవస్థ సూచించుట. చక్రవాకములకు వియోగమునఁ గన్నీరు గారు ననుటకు

సీ. "చక్రవాకములలోచనయుగ్మకముల నె
ట్టులబ్బెనో విరహబాష్పోదకములు."

(శృం. నై. ఆ-8.)

తా. సాయంకాలమున జతఁబాసి యొక యాఁడుజక్కవ తన ప్రియునిఁ గానఁజాలక యిసుకతిన్నెలపై నేపక్షిని జూచినను నాతఁ డని యెంచుచుఁ దన ప్రియుఁడే యనుకొని కదియ వెనుదవులును. అట్లు వెనుదవిలి చూచి యది తన జోడు కాకపోఁగాఁ దాను జూచినది యాకసమున కెగరెనేమో యని మెడ పైకెత్తి మింట నంతటను జూచును. చూచి యట కానక కన్నుల నీరు గ్రుక్కుకొనుచుఁ దిరిగివచ్చి కొలనిలోఁ దామరపూవెక్కి నోరెండి యారుటచే నీట నోరద్దును. అద్ది త్రావ రుచింపక యిటు నటుఁ జూచుచు నీటిలోఁ దన ప్రతిబింబ మగపడఁగాఁ బ్రియుఁ డని భ్రమసి దుముకును. అంత ఱెక్కలు దడియఁగా వేఱొక్క తామరపూవుఁ జేరును. చేరి యిక్కడ ఝుంకారము సేయుచుఁ దిరుగు తుమ్మెదలఁ జూచి సైఁపరాక ముక్కునఁ బొడుచును. అంత మఱియుం వెదకఁ బోవును. (జక్కవలకు రేల కనులు కానరావు. కావున నవి ప్రొద్దు గ్రుంకినచోఁ గలసికొనలేక విరహవేదన పడుట ప్రసిద్ధము. పక్షికే యింత విరహవేదన కల్గునప్పుడు వరూథినివంటిదాని కెంత కల్గునో యనునది దీనిచే నెఱుఁగదగినది.) స్వభావోక్తి భ్రాంతిమంతము లలంకారములు.

సీ. రవిబింబపతనదీర్ణపయోధిగర్భని
ర్గతశేషఫణిఫణారత్నరుచియొ

దివసావసానసందీప్తాస్తగిరిశిఖా
జ్యోతిర్లతాప్రతానాతపంబొ
తపనధూర్దండనిర్దళితదిక్తటస్ఫుటశ్వే
తముల జాండకటాహకనకఘృణియొ
చండీశతాండవోత్సవసంభృతక్షపా
హస్తాగ్రదీపగభస్తిచయమొ
తే. ద్రాగ్విదాహచ్ఛిదావినిద్రాణమవన
దంజనాలానమూలశయ్యావిధాన
వారుణాధోరణాకల్పితోరుశోణ
మృత్తికారాశియో యన మెఱసె సంధ్య. 17

టీ. సంధ్య=సంజ కెంపు, రవి...రుచియొ-రవిబింబ = సూర్యబింబము యొక్క, పతన = పడుటచే, దీర్ణ = నెఱెవిచ్చిన, పయోధి = సముద్రము యొక్క, గర్భ = లోపలిభాగమునుండి, నిర్గత = బయలువెడలిన, శేష ఫణి=(నాగలోకమందుండు) ఆదిశేషునియొక్క, ఫణా = పడగలయందలి, రత్న=మణులయొక్క, రుచియొ = కాంతియొ, దివసా...తపంబొ—దివసా వసాన = సాయంకాలమున, సందీప్త = ప్రజ్వలించు, అస్తగిరి = అస్తాద్రి యొక్క, శిఖా = శిఖరములందలి, జ్యోతిర్లతా = మెఱుఁగుఁదీగెల, ప్రతాన=సమూహముయొక్క, ఆతపంబొ=వెలుఁగో, జ్యోతిర్లతయన తీగెల వలె వెలుఁగుచుండు జ్యోతులని కొందఱు చెప్పుదురుగాని యంత సరసముగాదు. అడవులందుఁ గొండలందు జ్యోతిర్లతలు చీకటిరాత్రులయందుఁ బ్రకాశించును. దృష్టాం—శ్లో. "వనేచరాణాం వనితాసఖానాం దరీగృహోత్సంగ నిషక్తభాసః, భవంతి యత్రౌషధయో రజన్యామతైలపూరాస్సురతప్రదీపాః." కుమారసంభవము. తపన...ఘృణియొ-తపన = సూర్యునియొక్క, ధూర్దండ= రథపునొగచే, నిర్దళిత = పగులఁగొట్టఁబడిన, దిక్తట = దిక్ప్రదేశములందు,

దృశ్య=తోఁచునట్టి, కమలజాండ = బ్రహ్మాండ మను, కటాహ=గంగాళము యొక్క, కనకఘృణియొ = బంగారుకాంతియో, చండీశ...చయమొ - చండీశ=శివునియొక్క, తాండవోత్సవ = నాట్యోత్సవమందు, సంభృత = పట్టుకోఁబడిన, క్షపా=రాత్రియను స్త్రీయొక్క, హస్తాగ్ర=చేతికొన నున్న, దీప=దివటీయొక్క, గభస్తి=కాంతులయొక్క, చయమొ = సమూహమో, ద్రాక్...రాశియో-ద్రాక్ = త్వరగా, విదాహ=అతిదాహమును, ఛిదా=పోఁగొట్టుటయందు, వినిద్రాణ = మేలుకొనుటతో నున్న, మదవత్ = మదముగల, అంజన = అంజన మనెడు పడమటిదెసయేనుఁగుయొక్క, ఆలాన = కట్టుఁగొయ్యయొక్క, మూల=మొదట, శయ్యావిధాన=పడక నేర్పఱచుకొఱకు, వారుణ=వరుణునిసంబంధి యగు, ఆధోరణ=మావటివానిచే, ఆకల్పిత=కల్పింపఁబడిన, ఉరు=పెద్ద, శోణమృత్తికా = ఎఱ్ఱమట్టియొక్క, రాశియో=ప్రోవో, అనక్ =అనునటుల, మెఱసెక్ = ప్రకాశించెను.

(మద మెక్కినయైన యేనుఁగులకు దప్పిక యతిశయించును. ఆదప్పిక యెఱ్ఱమట్టిపైఁ బరున్నచో మానును గాన నట్టియేనుఁగుల శయనస్థలమున నెఱ్ఱ మన్ను వోయవలె నని గజశాస్త్రమునందుఁ గలదు.)

తా. సూర్యుఁడు పడు నెడఁ బాయ విచ్చిన పడమటిసముద్రమునుండి మీఁదికి కానిపించిన శేషునిపడగలమీఁది రత్నముల కాంతియో? (శేషుఁడు వేయిపడగలు గలవాఁడు గావునను సూర్యుఁడు సహస్రకిరణుఁడు గావునను కిరణకాంతులు రత్నకాంతులతో యున నుండె ననుట యత్యంతసముచితము.) అస్తాద్రిశిఖరములందు సూర్యు డస్తమింపఁగానే ప్రజ్వలించు మెఱుఁగుపుఁ దీఁగలవెల్లువో? సూర్యునిరథపునొగ తాకి దిక్ప్రదేశము బ్రద్దలయి లోనికి ప్రసరించిన బ్రహ్మాండ మను బంగారుగంగాళముయొక్క కాంతియో? శివుఁడు తాండవమాడుతఱి రాత్రి యనుస్త్రీ తాల్చిన దివటీవెలుఁగో? పశ్చిమ దిగ్గజమునకు మద మెక్కి విదాహము కలుగఁగా దానిని దగ్గించుటకై వరుణునిసంబంధి యగుమావటివాఁ డాదిగ్గజపుఁగట్టుఁగంబముదగ్గఱఁ బఱచిన

ఎఱ్ఱమట్టిప్రోవో యనునట్లు సాయంసంధ్యారాగము ప్రకాశించెను. ఉత్ప్రేక్షాలంకారము.

క. బహుళజలప్లవమాన
ద్రుహిణాండము చెమ్మ యుఱికి రూక్షార్కవిభా
రహితతఁ గాటుకపట్టెను
రహి చెడి యన నంధతమసరాసులు పెరసెన్. 18

టీ. బహుళ...డము-బహుళ = విస్తారమయిన, జల=నీటియందు, ప్లవమాన=తేలుచున్న, ద్రుహిణాండము=బ్రహ్మాండము, చెమ్మ యుఱికి = చెమ్మదిగి, రూక్షా...రహితతన్-రూక్ష = తీక్ష్ణమైన, అర్కవిభా = సూర్యకాంతి యొక్క, రహితతన్ = లేకపోవుటచే, రహి చెడి=సొగసుదక్కి, కాటుక పట్టెన్ = బుగులుకొని నల్లని బూజుపట్టెను. అనన్=అనునట్టుల, అంధతమస రాసులు=కటికి చీకటిప్రోవులు, పెరసెన్=వ్యాపించెను.

తా. అధికమైన యావరణజలమునఁ దేలియాడు బ్రహ్మాండము చెమ్మగిల్లి తీక్ష్ణమైనయెండ తాఁకమిచే బుగులుకొని నల్లనిబూజు పట్టెనో యనునట్లు కటికిచీకట్లు క్రమ్ముకొనెను. అలం. ఉత్ప్రేక్ష.

సీ. మృగనాభిపంకంబు మెయినిండ నలఁదిన
మాయాకిరాతుమైచాయఁ దెగడి
నవపింఛమయభూష లవధరించి నటించు
పంకజాతునిచెల్వు సుంక మడిగి
కాదంబనికురుంబకలిత యై ప్రవహించు
కాళిందిగర్వంబుఁ గాకు సేసి
తాపింఛవిటపికాంతారసంవృత మైన
యంజనాచలరేఖ నవఘళించి

తే. కవిసె మఱియును గాకోల కాలకంఠ
కంఠకలకంఠకరిఘటాఖంజరీట
ఘనఘనాఘనసంకాశ గాఢ కాంతిఁ
గటికచీకటిరోదసీగహ్వరమున. 19

టీ. కటికచీకటి=గాఢాంధకారము, (ఇది కర్తృపదము) మృగనాభి పంకంబు = కస్తూరీరసమును, మెయినిండన్ = శరీరమంతటను, అలఁదిన... చాయన్ - అలఁదిన = పూసిన, మాయాకిరాతు = కపటపుబోయనియొక్క (శివునియొక్క), (పా. కిరాతి = బోయెత, కాళి) మైచాయన్ = శరీరకాంతిని, తెగడి = తిరస్కరించి, నవ...భూషలు-నవ = క్రొత్తవైన, పింఛమయ=నెమలిపురితోఁ జేయఁబడిన, భూషలు=అలంకారములు, అవధరించి = తాల్చి, నటించు...చెల్వు-నటించు=నాట్యముజేయు, పంకజాక్షుని=కృష్ణుని యొక్క, చెల్వు=అందమును, సుంకము అడిగి = పన్ను అడిగి (తన్నుంబోలి యుండుటచేఁ దనకు పన్ను తెమ్మని), కాదంబ...కలిత-కాదంబ నికురుంబ= నల్లనిహంసలసమూహముతో, నల్లనిముక్కు తెల్లనికాళ్లు గల హంసలను కాదంబము లందురు. కలిత ఐ=కూడినదై, ప్రవహించు, కాళింది = యమున యొక్క, గర్వంబున్, కాకుచేసి = వ్యర్థముచేసి, తాపింఛ...సంవృతము - తాపింఛవిటపి=చీకటిమ్రాఁకులయొక్క, కాంతార=అడవులచే, సంవృతము = ఆవరింపఁబడినది, ఐన, అంజనాచల రేఖన్ = కాటుకకొండయొక్క రీతిని, అవఘళించి=మించి, మఱియును, కాకోల...కాంతిన్ - కాకోల = మాల కాకులతోను, కాలకంఠకంఠ=నెమిళ్లమెడలతోను, కలకంఠ=కోకిలలతోను, కరిఘటా=ఏనుఁగుమందతోను, ఖంజరీట = కాటుకపిట్టలతోను, ఘనఘనాఘన=వర్షించుకాఱుమబ్బులతోను, సంకాశ=పోలెడు, గాఢకాంతిన్ = దట్టమయిన ప్రకాశముతో, రోదసీగహ్వరమునన్ = భూమ్యాకాశముల నడిమి ప్రదేశమున, కవిసెన్ = క్రమ్ముకొనెను.

ఇందు నలుపున కతిశయత్వము గల్పించుటకై సహజముగా నల్లని వస్తువులకుఁగల యాయానీలవిశేషములను జెప్పెను. కిరాతుఁడు, కృష్ణుఁడు, కాళింది, అంజనాచలము ఇవి స్వయముగా నల్లనివి. వీనికిఁగల కస్తూరిపూఁత నెమిలియీఁకలు, నల్లనిహంసలు, చీకటిచెట్టులతోడి సంబంధము నలుపునకుఁ గల యతిశయత్వము దెలుపును. కారుచీకటులు గవిసె నని భావము.

తా. మాయాకిరాతుఁ డయి మేనెల్లఁ గస్తూరి యలఁదికొన్న శివుఁడు, నెమిలిపింఛెము నలంకరించుకొన్న కృష్ణుఁడు, నల్లహంసల గల్గిన యమున, చీకటిచెట్లతోఁపులు గలకాటుకకొండ, మాలకాకి, నెమిలిగొంతు, కోకిల, పీస్తుమంద, కాటుకపిట్ట, కాఱుమబ్బు—వీనియొక్క కాఱునలుపును మించిన నలుపుతోఁ గటికిచీకటి జగమెల్లఁ గ్రమ్ముకొనెను. నిదర్శనాలంకారము.

క. అంతటఁ బ్రాచి నిశాపతి
యంతికగతుఁ డౌట విని ముఖాలంబితమగ
కుంతలములు దీర్పఁగఁ గొను
దంతపుదువ్వెన యనంగ ధవళిమ దోఁచెన్. 20

టీ. అంతన్ = ఈవిధముగాఁ జీఁకటియావరింపఁగా, ప్రాచి = తూర్పుదెస యనుస్త్రీ, నిశాపతి = (రాతిరికిఁ బెన్మిటి యగు) చంద్రుఁడు, అంతికగతుఁడు = దగ్గఱకువచ్చినవాఁడు, ఔటన్=అగుటను, విని=ఆలకించి, ముఖా...కుంతలములు-ముఖ = ముందఱిభాగమనుమాఖమునందు, ఆలంబి = వ్రేలాడు, తమఃకుంతలములు = చీకటియనువెండ్రుకలు, తీర్పఁగన్ = చక్కదిద్దుటకు, కైకొను=తీసికొను, దంతపుదువ్వెన = ఏనుఁగుదంతముతోఁ జేసినదువ్వెనయేమో, అనంగన్ = అనునటుల, ధవళిమ= తెలుపు, తోఁచెన్= కానవచ్చెను. చంద్రోదయమునకు ముందుఁ దెలుపురంగుతో మిన్ను గానవచ్చె నని భావము.

తా. ఆపైఁ దూర్పుదెసస్త్రీ చంద్రుఁడు చేరువకు వచ్చుచున్నాఁ

డని విని మోమున వ్రాలియున్న చీకట్లను వెంద్రుకలను జక్కఁజేసికొనుటకెత్తికొన్న దంతపుదువ్వెనయో యనునట్లు తూర్పునఁ దెలుపు చూపట్టెను.
అలం. ఉత్ప్రేక్ష, రూపకము.

చ. మరున కొసంగఁ గాలము తమశ్ఛట గాటుక గా నవోదయ
స్ఫురదరుణప్రభాపథికశోణితసిక్తసితోడుభక్తముల్
హరిహయదిఙ్నభస్స్థలమునన్ బలిచల్లి వటాంకముల్ వసూ
త్కరభరితంబునై వెలుఁగఁ గాంచి సుధానిధి నెత్తె నత్తఱిన్.

టీ. అత్తఱిన్ = అసమయమున, కాలము=కాల మను పురుషుఁడు, మరునకున్=మన్మథునకు, ఒసంగన్ = ఇచ్చుటకు, తమః ఛట=చీకటిరాశి, కాటుక = (నిధులనుగుర్తించుట సాధన మగు) అంజనము, కాన్ = కాఁగా, నవో...భక్తముల్-నవోదయ=క్రొత్తగానుదయించుకాలమునందుఁ బొడమి, స్ఫురత్ = ప్రకాశించు, అరుణప్రభా = ఎఱ్ఱనికాంతియును, పథిక = వియోగులయొక్క, శోణిత = రక్తముచే, సిక్త=తడుపఁబడిన, సిత=తెల్లని, ఉడు=నక్షత్రము లనెడు, భక్తముల్=అన్నమును. (నెత్తురుచేఁ దడుపఁబడిన యెఱ్ఱనియన్నమును) హరి...స్థలమునన్ - హరిహయదిక్ = తూరుపుదెస యందలి, నభస్స్థలమునన్ = ఆకాశమున, బలి = భూతబలిని, చల్లి, వటాంకముల్ = మఱ్ఱిచెట్టుగుర్తుగలదియుఁ, వసూత్కరభరితంబును = కిరణసమూహ మను ధనసమూహముతో నిండినదియుం, ఐ, వెలుఁగన్=ప్రకాశించుగా, కాంచి, సుధానిధిన్=అమృతమునకు నిధి యగు చంద్రుని—చంద్రుఁ డనెడునిధిని, ఎత్తెన్=పైకిఁ దీసెను. చంద్రునిలోని కళంకమును మఱ్ఱిగా వర్ణించుటయుఁ గలదు. సీ. "అమృతాంశుమండలం బాలవాలముగాఁగ మొలచె నొక్కటి జగన్మోహనముగ, మఱ్ఱిమాత్రంబ." జైమినీభారతము. ఆశ్వా. ౧.

తా. లోకమున నిధుల నెత్తువారు నిధిసాధకమగుకాటుకను కన్నులకుఁ బెట్టుకొని చూచి యానిధులఁ గాచియుండిన పిశాచాదులవలనిబాధ తొలఁగ

టకై నెత్తుటికూడును దూర్పుదిక్కున బలివైచి దానికిఁ జెట్టునో పుట్టనో గుఱుతుంచుకొని త్రవ్వి యెత్తుదురు. ఆవిధముననే ప్రకృతము కాలపురుషుఁడు చీకటి యనుకాటుకను బెట్టుకొని చూచి చంద్రునియందయమునఁ దూర్పునఁ దోఁతెంచురక్తిమ యనురక్తము కలిపి నక్షత్రము లనునన్నమును దూర్పుదిక్కున భూతబలిగాఁ జల్లి మఱ్ఱి గుఱుతుగల (చంద్రునిలోనికళంకమును మఱ్ఱిసిగా వర్ణించుట కలదు.) చంద్రుఁ డనునిధిని మన్మథున కిచ్చుటకై త్రవ్వి యెత్తెను. రూపకాలంకారము.

మ. జలజాగారపరంపరల్ మఘవదాశాభిత్తిఁ దీండ్రించుచున్
దళమై వెన్నెలచిచ్చు లంటిన మిళద్బాహ్యచ్ఛదశ్యామికా
చ్ఛలసంగంది ముడుంగుచోఁ సిమసిమచ్ఛబ్దంబుతోఁ బుట్టున
గ్గలపుం గ్రొంబొగలో యనంగ వెడలెన్గర్భస్వనద్భృంగముల్.

టీ. జలజాగారపరంపరల్ - జలజ=పద్మములను, అగార=ఇండ్లయొక్క, పరంపరల్ = వరుసలు, మఘవత్ ఆశా భిత్తిన్ = తూర్పుదిక్కనెడు గోడనుండి, తీండ్రించుచున్ = ప్రజ్వలించుచు, వెన్నెలచిచ్చులు = వెన్నెలయనునిప్పులు, దళమై=మెండై, అంటినన్=తాఁకఁగా, మిళ...చ్ఛలనన్ - మిళత్=కలసికొను, బాహ్యచ్ఛద = పైఱేకులయొక్క, శ్యామికా = నలుపను, ఛలనన్ = మిషచే, కంది=కమలి, ముడుంగుచోన్ = ముడుఁగుకొనునప్పుడు, సిమసిమచ్ఛబ్దంబుతోన్=సిమసిమయనుధ్వనితో, పుట్టు...బొగలో- పుట్టు, అగ్గలపు=అధికమగు, క్రొంబొగలో = క్రొత్తపొగలో, అనంగన్ = అనఁగా, గర్భస్వనద్భృంగముల్ = లోపలిభాగమునుండి ధ్వనిచేయుంతుమ్మెదలు, వెడలెన్=బయలుదేఱెను.

రాత్రులందుఁ దమ్ములు ముకుళించును. అందుచే ముకుళములందు నిర్బంధము గలుగునేమో యని తుమ్మెదలు ముందుగనె వెడలుట సహజము. తుమ్మెదలు నల్లగా నుండును గాన పొగ వెడలినటుల బయట వచ్చుచున్న వని

చెప్పఁబడెను. పొగ కృష్ణగణములోనిది. తమ్ములనుండివచ్చు తుమ్మెదలరాకడ పొగవలె నున్నదనుటకు.—

ఉ. "అంబుజినీపురంధ్రి హృదయాధిపుఁ గానక స్రుక్కి యబ్జప
త్రంబునఁ దేఁటియూర్పుపొగల్ వెడలంగను నిద్రవోవఁ గో
కంబది హేళికిం దెలుపఁగాదె ప్రియప్రమదావియోగశో
కంబు గరుణింపకేఁగె నిజకార్యము లెంతురె మిత్రతత్పరుల్." (వసు.ఆ.౪)

తా. చంద్రోదయము కాఁగానే తూర్పుదిక్కనెడు గోడనుండి వెన్నెల యనునగ్నిజ్వాలలు పడి పద్మము లనునిండ్లవరుస ముడుఁగుచున్న పైకప్పుటేకుల నలుపను నెపముచేఁ గమిరి క్రుంగుచో సిమసిమ యనుధ్వనితోఁ బైకిరేఁగు తొలిపొగలో యనునట్లు ఝంకారము చేయుచు తుమ్మెదలా పద్మములను పుట్టలలోనుండి పైకి వెడలెను. చంద్రుఁ డుదయించెను. వెన్నెల నిండారెను. పద్మములు ముడుచుకొనిపోవుచుండ వానిలోనితుమ్మెదలు రొదసేయుచుఁ బైకి వెడలెను. అలం. రూపకము, అపహ్నుతి, ఉత్ప్రేక్ష.

సీ. ప్రిదిలి కైరవదళశ్రేణి నొక్కులు దీరె
శశికాంతపంక్తుల జలము లూరెఁ
గోరి కాంతులతోఁ జకోరికల్ రతిఁ గేరె
వారాశిగర్వంబు మేర మీఱెఁ
ద్రోపడి యిరులు పటాపంచలై పాఱె
దిఙ్ముఖంబుల వింతతెలివి సేరెఁ
జక్రవాకంబు లబ్జకుడుంగములు దూఱెఁ
గామినీకాంతులకలఁక దేఱె

తే. మదనుఁ డమ్ముల నూఱె హిమంబు పేరె
జడిసి విరహిణి వగఁ గూరె జారచోర
దర్పములు జాఱె రవికరతాప మాఱెఁ
జూడఁ జూడంగఁ దారకస్ఫురణ దాఱె.

టీ. కైరవదళశ్రేణి = కలువఱేకులవరుస, ప్రిదిలి = విరఁబాఱి, (పా. శిథిలకైరవదళశ్రేణి, శిథిల = చందముదక్కిన), నొక్కులు దీరెన్ = గొగ్గులు మాసెను. శశికాంతపంక్తులన్ = చంద్రకాంతపురాళ్లవరుసల, జలములు=నీరు, ఊరెన్ = స్రవించెను, కోరి=అభిలషించి, కాంతులతోన్ = ప్రియులతో, చకోరికల్ = వెన్నెలపులుఁగులు, రతిన్ = సురతమున, కేరెన్=వెలరేఁగెను, వారాశిగర్వంబు=సముద్రపుఁబొగరు, మేరమీఱెన్ = హద్దు దాఁటెను. (పొటుపొడిచె ననుట.) త్రోపడి = తొలఁగఁద్రోయఁబడి (వెన్నెలచే), ఇరులు=చీకటి, పటాపంచలై = ఎక్కడి దక్కడనే రూపుచెడి, పాఱెన్=పర్వెత్తెను, దిఙ్ముఖంబులన్ = దిక్కుల మొగళ్లందు, వింత తెలివి=క్రొత్తతేట, చేరెన్=ప్రవేశించెను. చక్రవాకంబులు = జక్కవలు, అబ్జకుడుంగములు=తామరపొదలు, తూఱెన్ = చొచ్చెను, కామినీకాంతుల కలఁక=దంపతుల ప్రణయకలహము, తేటెన్ = తేటదనము చెందెను. మదనుఁడు=మన్మథుఁడు, అమ్ములన్ = బాణములను, నూఱెన్ = పదనుబెట్టెను, హిమంబు=మంచు, పేరెన్ = పేరుకొనెను, విరహిణి = విరహమునొందిన యంగనాజనము, వగన్=విచారమును, కూరెన్ = పొందెను, జారచోరదర్పములు = జారులయొక్కయుఁ జోరులయొక్కయుఁ బొగరులు, జాఱెన్ = తొలంగెను, రవికరతాపము = సూర్యకిరణముల వేఁడిమి, ఆఱెన్ = చల్లాఱెను, చూడన్ చూడన్ కన్ = అంతటంతట, తారకస్ఫురణ = నక్షత్రములవెలుఁగు, తాఱెన్ = మాసెను, (కోరి కాంతలతోఁ జకోరముల్ అని పా.) అన్నియుం బహువచనాంతములుగాఁ జెప్పి విరహిణి యనునేకవచనాంతపదముఁ జెప్పుటచే వరూథిని వెన్నెలకు వెఱచి శ్రమల నొందె ననునర్థ మూహింప నగును. కామినీకాంతులు. చెలువలు కామించిన వారు. పురుషులు వారికి మనోహరముగా నుండువారు. వెన్నెల గాయుటచే వలపు చెలరేఁగఁ బ్రణయకోపము తగ్గె నని భావము.

తా. చంద్రోదయముకాఁగానే కలువలు వికసించెను, చంద్రకాంతశిలలు కరఁగెను. చకోరపక్షులు సంభోగసుఖము ననుభవించెను. సముద్రముప్పొంగెను. చీకట్లు తొలఁగెను. దిక్కులన్నియుఁ దెల్లఁగాఁ గనఁబడెను. చక్రవాకపక్షులు తామరతీఁగెజొంపములలో ముడుఁగుకొనెను. స్త్రీపురుషులు ప్రణయకలహములు మాని క్రీడించిరి. మన్మథుఁడు విరహులను వేధింపసాగెను. మంచుహెచ్చెను. విరహిణీస్త్రీలు చంద్రునిచే విరహవేదన పెరుఁగఁగా విచారపడసాగిరి. జారచోరులసంచారము నిలిచిపోయెను. పగటివేళఁ గాసిన యెండవలని వేండ్రపుఁదాపము వెన్నెలచే నుపశమిల్లెను. నక్షత్రములు క్రమక్రమముగా మఱుఁగిపోయెను. (ఇందు విరహిణి యను పదము ఏకవచనాంతముగాఁ బ్రయోగింపఁబడుటచే వరూథిని చంద్రప్రకాశమునకు వెఱచి దుఃఖమునొందె ననునర్థ మూహింపఁ దగియున్నది.) అలం. స్వభావోక్తి.

మ. స్ఫుటసౌగంధికరాగరక్తరుచి మైఁ బూనెన్ జపాసన్నిధి
స్ఫటికంబట్లుదయాద్రిగైరికశిరస్స్థానస్థితిన్ జంద్రుఁ డ
చ్ఛోటువాయన్ శుచియయ్యెనౌఁ బ్రకృతినచ్ఛుండైనసన్మార్గియు
న్నెటికింగూటమివంకవచ్చువికృతిన్ మగ్నుండు గా నేర్చునే.

టీ. చంద్రుఁడు, ఉదయా...స్థితిన్ - ఉదయాద్రి = ఉదయపర్వతముయొక్క, గైరిక = మనశ్శిలాదిగైరిక ధాతువులతోఁ గూడిన, శిరస్స్థానస్థితిన్ = శిఖరప్రదేశమందుండుటచేత, జపాసన్నిధిస్ఫటికంబట్లు - జపా = దాసానిపువ్వుయొక్క, సన్నిధి = సమీపమునం దున్న, స్ఫటికంబట్లు=పటికపుఱాతివలె, స్ఫుట...రుచిన్-స్ఫుట=విచ్చిన, సౌగంధిక = ఎఱ్ఱగల్వయొక్క, రాగ = ఎఱుపువంటి, రక్త = ఎఱ్ఱని, రుచిన్ = కాంతిని, మైన్=శరీరమునందు, పూనెన్=ధరించెను. అచ్ఛోటు=ఆప్రదేశము, పాయన్=విడువఁగా, శుచి= పరిశుద్ధుఁడు, (తెల్లనివాఁడు), అయ్యెన్, ఔన్ = అగును. ఇదియుక్తమే.

ప్రకృతిన్=స్వభావముచే, అచ్ఛుండు = నిర్మలుఁడు (తెల్లనివాఁడు), ఐన సన్మార్గి = అగునట్టి మంచి నడవడికలవాఁడు (నక్షత్రమార్గముకలవాఁడు), ఎన్నఁటికిన్=ఎప్పటికైనను, కూటమివంకన్ = సహవాసమువలన, వచ్చు వికృతిన్=వచ్చెడువికారమున, మగ్నుండు = మునిఁగినవాఁడు, కానేర్చునే ? కాజాలఁ డనుట.

ఉదయించుతఱిఁ జంద్రుఁడు ఎఱ్ఱగా నుండి యావల ధవళకాంతితో నలరు ననుట యిందుఁ జెప్పఁబడెను. చంద్రుఁడు సహజస్వచ్ఛుఁడు. స్వచ్ఛమగు స్ఫటికముదగ్గఱ దాసానిపువ్వు నుంచిన స్ఫటిక మెఱ్ఱగా నుండును. ఉదయాచలము గైరికాదిధాతువులచే నెఱ్ఱగ నుండునది. దానిచెంత నుంటచేతనే చంద్రుఁ డెఱ్ఱగా నుండెను. ఉదయచంద్రుఁ డెఱ్ఱగా నుండు ననుటకు.—

తే. "లలితకాశ్మీరఘనసమాలంభకర్మ
పాటలంబైన నీముఖాబ్జంబుతోడ
నొరయఁ గాన భవత్కేళిసౌభాగ్యమైన
పొడుపుగుబ్బలిఁ బొడతెంచు పూర్ణవిధుఁడు." (శృంగారనైషధము ఆ.౫)

తే. "ప్రాచి తెలిచాయ యనుమంచు ప్రబలభాస్వ
దంశుకవిహీనగానఁ దా నందుకోర్వఁ
జాల కూర్చిన నవకీలిచక్ర మనఁగ
నపుడు తొలికెంపుతో సారసారి పోల్చె." (చంద్రికాపరిణయము. ౪.)

తా. చంద్రుఁ డుదయించుచోఁ దూర్పుఁగొండశిఖరమునందలి ధాతురాగము సోఁకుటచే జపాకుసుమముదగ్గఱ నున్నస్ఫటికమువోలె నెఱ్ఱగాఁ బొడకట్టెను అవ్వల నటనుండి తొలఁగి పైకి రాఁగా స్వచ్ఛరూపుఁ డయ్యెను. స్వభావముచే నిర్మలుఁ డైనవాఁడు సహవాసదోషముచే నొకవికారము తనకు వాటిల్లినను వెంటనే తప్పించుకొనును గాని యందే మునిఁగియుండఁడు గదా ! అలం. అర్థాంతరన్యాసోపమలు.

శా. ఆరూఢస్థితిఁ జంద్రికాధవళితాజాండంబులోఁ జంద్రుఁడొ
ప్పారెన్ గాలభిషగ్వరుం డవిరతం బై కాముకశ్రేణికిన్
మారోత్సాహము నిల్వఁ బాదరసముం బంధించి గ్రాసార్థమై
క్షీరస్థాలికఁ బెట్టినట్టి గుటికా సిద్ధౌషధంబో యనన్. 25

టీ. చంద్రుఁడు, ఆరూఢస్థితిన్ = ఆకసమున కెక్కియున్న యునికియందు, చంద్రి...డంబులోన్-చంద్రికా=వెన్నెలచే, ధవళిత = తెల్లఁగాఁ జేయఁబడిన, అజాండంబులోన్ = బ్రహ్మాండమున, కాలభిషగ్వరుండు=కాల మను వైద్యవర్యుఁడు, కాముకశ్రేణికిన్ = కాముకుల సమూహమునకు, మారోత్సాహము=మన్మథోత్సాహము, అవిరతంబై=ఎడతెగనిదై, నిల్వన్ = నిల్చుటకు, పాదరసమున్=పాదరస మను రసద్రవ్యమును, బంధించి=వస్త్వంతరప్రయోగమున గడ్డకట్టునట్టు చేసి, (పా. మర్దించి = మూలికలతోఁ జేర్చి గడ్డకట్టునటులనూరి) గ్రాసార్థమై=మ్రింగుటకై, క్షీరస్థాలికన్=పాలకుండలో, పెట్టినట్టి, గుటికా సిద్ధౌషధంబో - గుటికా = గుళికయగునట్టు, సిద్ధ = సిద్ధులచేత సాధింపఁబడిన, ఔషధంబో = మందేమో, అనన్ = అనునట్లు, ఒప్పారెన్ = ఒప్పెను.

చంద్రికాధవళితాజాండము క్షీరస్థాలికగను, చంద్రుఁడు పాదరస గుళికగను, రూపింపఁబడెను. రసగుళికవలనఁ బుంస్త్వ మతిశయించును గానఁ జంద్రికాప్రసాదముచేఁ బ్రపంచము ధవళముగా నుండఁ గాముకులు యథేచ్ఛముగాఁ గ్రీడించిరని భావము.

గుండ్రముగా నుండువాని గుటికగా వర్ణించుట గలదు.

సీ. "హరిహరబ్రహ్మ మహానుభావంబు లొక్కటిగాఁ గరంగిన గుటిక యనఁగ
భానుబింబము పూర్వాద్రిపై వెలింగెన్." (భారతము. విరాట.)

"...చిగురువిందుల నీలిగయాళికిన్ హాలా,
హాలగుళికాభసుర్మదఘుసా
శికి నాళికి లోఁగి యాత్మలోన్" (వసు. ఆ. 3.)

తుష్మిదలు గుండ్రముగ నుండుఁ గాన వినపుగుండ్లుగాఁ జెప్పఁబడెనని తెలియుచున్నది.

తా. కాల మను వైద్యుఁడు కాముకుల కెడతెగక కామోద్రేకము నిల్చియుండుటకై పాదరసమును మూలికలతోఁ గలిపి గడ్డకట్టునట్లు చేసి మ్రింగుటకై క్షీరపాత్రమున నుంపఁబడిన ఘుటికాసిద్ధులు సాధించిన యౌష ధమో యనునట్లు వెన్నెల నిండారి యున్న బ్రహ్మాండమునఁ జంద్రుఁడు వెలఁగుచుండెను. అలం. ఉత్ప్రేక్షా రూపకములు.

తే. రాజు తేజస్వియై గ్రహరాజుమీఁద
  నలిగి దాడిగ వెంటాడ నిలువ కతఁడు
  బెగడువడి పాఱుచోఁ జెఱఁ దగిలినట్టి
  ఛాయ యిది యన నీలలాంఛనము మెఱసె. 26

టీ. రాజు=చంద్రుఁడను రాజు, తేజస్వియై=ప్రభగలవాఁడై, గ్రహ రాజుమీఁదన్=సూర్యుఁ డను వేఱొక రాజుపై, అలిగి=కోపించి, దాడిగన్= దండయాత్రగా, వెంటాడన్ = వెంబడింపఁగా, అతఁడు = ఆసూర్యుఁ డను రాజు, బెగడుపడి=భయపడి, పాఱుచోన్ = పర్వెత్తునపుడు, చెఱన్=చెఱ సాలకు, తగిలినట్టి = చిక్కినట్టి, ఛాయ = (అతనిభార్యయగు) ఛాయాదేవి, ఇది=ఈకానఁబడునది, అనన్=అనునట్లు, నీలలాంఛనము = చంద్రునిలోని (నల్లనిగుర్తు) కళంకము, మెఱసెన్ = ప్రకాశించెను.

కళంకము లాంఛనము సమార్థకము లనుటకు శ్లో. "కళంకాంకౌ లాంఛనం చ" అమరము. విరోధి బలవంతుఁడై వెనుదగిలినపుడు ప్రాణభయ ముచేఁ బిఱికిరాజులు సర్వస్వము వదలి పాఱిపోవుదురు: అపుడు రాజ పత్నుల బంధించుటగాఁ గళంక ముత్ప్రేక్షింపఁబడెను.

తా. చంద్రుఁడనురాజు ప్రతాపశాలియై సూర్యుఁ డనుపగరాజుపై దాడివెడలి వెంబడింపగా నాతఁడు భయపడి పాఱిపోవుచోఁ జెఱకుఁ జిక్కిన యాతనిభార్య ఛాయాదేవి యనునట్లు చంద్రునిలోని కళంక మొప్పారెను. ఉత్ప్రేక్షాలంకారము.

తే. కలయ జగమునఁ గలయట్టినలుపు లెల్లఁ
దెలుపులుగఁ జేసి నీడలు దెలుపు సేయఁ
గా వశము గామిఁ బొడముదుఃఖమునఁ బోలె
సాంద్రచంద్రిక తుహినబాష్పములు గురిసె 27

టీ. సాంద్రచంద్రిక = దట్టమైనవెన్నెల, జగమునన్ = లోకమున, కలయన్=అంతటను, కలయట్టినలుపులెల్లన్ = ఉన్న నల్లనివస్తువుల నన్నింటిని, తెలుపులుగన్ = తెల్లనివస్తువులుగా, చేసి = చేసియుఁ, నీడలు=చెట్లులు మొదలగువాని నీడలు, తెలుపు=తెల్లనివిగా, చేయఁగాన్ = చేయుటకు, వశము గామిన్ = శక్యము కాక పోవుటచే, పొడముదుఃఖమునన్ పోలెన్ = పుట్టుదుఃఖము చేతనువలె, తుహినబాష్పములు = మంచుబిందులను, కురిసెన్= కురియించెను. వెన్నెలనుండి మంచుగురియు ననుట ప్రసిద్ధము.

సీ. "చంద్రాతపమున నేచందాన గురిసెనో ధారాళ మగుచు నీహారవృష్టి"
(శృంగారనైషధము. ఆ-8.)

తుహినమన మంచుఅనుటకు—"అవశ్యాయస్తు నీహారస్తుషారస్తుహినం హిమం"
(అమరము.)

తా. వెన్నెల తాను జగమునందలి నల్లని పదార్థములఁ దెల్లఁగాఁ జేసియు నీడలను దెలుపు చేయుటకు శక్యము కాకపోవుటచే జనించిన దుఃఖముచేతనో యన మంచుబిందులను గురిసెను. అలం-ఉత్ప్రేక్ష.

వ. మఱియు వికసితకైరవంబు లగుసరోవరంబుల నిజధవళధాళ ధళ్యంబున నాక్రమించి యందు నానందించునరవిందమును దిరకుం బుట్టినింటిసొబగు చూపి, చూపఱకు నిందుబింబం బిది గ్రహాంబు లివి యనునంతరంబు లేకుండ నేకవర్ణంబు గావించి, సేవించుచకోరకదంబములపుక్కిళ్లకు వెక్కసంబై ముక్కులకు నెక్కి చిక్కంబడి, యొండొండ బొందు

మల్లియలదండడిం దొరఁగుపుప్పొళ్లఁ నుప్పతిల్లునెత్తావులకు
వెకలు లై యాడు మొకరితుమ్మెదలు రొదలుఁ గలమెఱుఁగు
డుంబురువులట్లు మిసమిసని మెఱవ సనిమెఱుంగుమొత్తం
బుల నుమిసి యుమిసి, యందంద ప్రవహించునిందూపల
స్యందంబులకు విందు లగునిందీవరమరందంబులబెండడింబడి
బందన గొనుపలిమించు క్రొమ్మంచుటౌదు లీఁదియీఁది వడి
సడలి సుడివడుచు నోడ లోమునోమరిగాలియలవోకనోఁ
కులం గదలీకదల వనం గదలునుపవన కదళీ కేతకీ తాల
హింతాల నారికేళపూగావళికోమలపలాశద్రోణికల నునుపు
గలపొరలపొరల శరధితరఁగలమీఁదనుంబోలె గిఱికొని,
యొల్లవల్లికలుం బూవక పూచిన ట్లుల్లసిల్ల తె ల్లుల్లసిల్లిన
చందంబునం దెల్ల తెల్లనై, మొల్లమిగ నంతకంతకు దిగం
తంబులు దంతంబులు దీరిచినయిడ్డుపులుంబోలెఁ దీండ్రింప
రేయెండ దానగుటం జేసి యొండమావులం బుట్టించె ననం
బట్టు గలపటికంపురాచట్టునేలల నెట్టుకొని, వెండియుం జిట్టి
కంబులకుం బెడమొగంబు వెట్టుకొని, పట్టఁబట్టం బోవుప్రాణ
భర్తలవెంటం బడి నూపురంబులు మొరయ వేనలులు
విరియఁ గ్రమంబున బుట్టునిట్టూర్పుపవనంబు జవంబునం
బైఁటకొంగెడలింప నందనికౌఁగిటం బొదివి ప్రియఁబుచిలుకం
బలికి ముద్దాడుజవరాండ్రదంతచంద్రికలసాంద్రతం బంతంబు
మెఱసి, మంతనంపువేళల మాటతబ్బిబ్బునం బుట్టుపొలయలు
కలం దలలు వంచి రొద లేనినాలియేడ్పు లేడ్చుప్రియల
ననునయింప నీఁపునం జవు మెఱసి చెక్కుటద్దంబులు
నొక్కి మొగం బెగయనెత్తి ముత్తియంపుముంగఱరంగున

గడలుకొనుబుడిబుడికన్నీటం బ్రతిఫలించి తుఱంగలించు తనదు నిగనిగలు గనుంగొని నగెనగె ననుచుం జొంబనం బడం బోయి కెంగేల నదరంట వాటువడు కాముకుల వెలవెల పాటుపాటువం గోటికిం బడగ లెత్తి, పిండిచల్లినగతిం గాయ డాయ లజ్జించి బుజ్జవంబునం బొదరిండ్లకుం జార్చి కాంతులం గవయు వంగవాచులగు నంగనలయంగంబులపస ముంగిటం బండ జలితకిసలయాంతరాళంబులం దూఱితూఱి యుసులు విరియించి పతులప్రార్థనంబులం బుంభావసురతాడంబరంబు నకుం దోడుసూపి దూపటిలి యంగరాగంబులు గరంగం జెమర్చి చంచలాక్షులనిద్దంపుం బదనూలతలం బుట్టి దట్టంబు లగుచియుఁ జెమటబొట్టులం బొడకట్టి తెలుపారు మలయ జంపు జిటులు గంధంబులయందంబు లొసంగి, సంజకడం దారు నొడివినసంకేతంబుల నుండక తెరువు గట్టి పొరువుం దరువులనీడల నడంగి నవ్వ్యటాలకు వెనుకపాటునం గదిసి ముసుంగు లెడలింప బెగడి కళవళంపుం జూపుల వల్లభులం జూచి యల్లన నగునభిసారికల వెడందకన్నులచెన్ను నన్ను కొని, పొదలుమదనోన్మాదంబునకుం బ్రోదిగా మోదంబునం గాదంబరి గండూషించి విటకదంబంబునకు నొసంగునంబు రుహాముఖుల యొప్పులకుప్ప లగు నిప్పపూమొగ్గలం బోని బుగ్గలం దగ్గలిక సూపుకమ్మపంజులవజ్రపుంజకచకల నకనకలు వీడుకొని, కలికితనంబులం గలసి మెలసి రతాంతంబునం బరిశ్రాంతి యడంగ నంగణంబుల నిలిచి యొండొరులకురులు దువ్వుచు విహరించుసమయంబునం బల్లవులు కేళి కల్లవ్వా డన్నతమఘాటులు దలంపించిన నదరిపడి మందస్మితంబు లంకు

రించుహాళంకృతుల జంకించి కంకణంబులరత్నంపుఁదళుకులు
సెదర నుంకించి వైచుచేమంతిపూబంతులం బుటపుటనై,
మిటమిటం గాయుదట్టంపుఁబండువెన్నెలమెండున బెండుపడి
డెందంబు గంది తాలిమి చిందువండై కెందలిరుపాన్పునం
దనువొందక లేచి కూర్చుండి కన్నీరు గోట మీటుచు
బోఁటితో వరూథిని యిట్లనియె. 28

టీ. మఱియుఁన్, వికసితకైరవంబులు = విచ్చినకలువలుగలవి, అగు సరోవరంబులన్ =అయినట్టిమేఁటికొలఁకులందు, నిజధవళధాళధళ్యంబునన్ = తనతెలుపుయొక్క ధళధళయను కాంతిచే, ఆక్రమించి=ఆవరించి, అందున్ = ఆకొలనియందు, ఆనందించు నరవిందమందిరకున్ = సంతోషించుఁలక్ష్మికి, పుట్టినింటిసొబగు = పాలసముద్రముయొక్క సొగసును, చూపి=చూపించి (సరోవరములు వెన్నెలచేఁ దెల్లనై పాలసముద్రమువలె లక్ష్మికిఁదోఁచునటులఁజేసి యనుట) పా. పోలికచూపి. అలంకారము. ఉపమ. చూపఱకున్ = చూచువారికి, ఇది, ఇందుబింబంబు = చంద్రబింబము, ఇవి, గ్రహంబులు=అంగారకాది గ్రహములు, ఇట నక్షత్రములుకూడ గ్రాహ్యములు. అనునంతరంబు = అను భేదము, లేకుండన్ = లేకుండనుండునటుల, ఏకవర్ణంబు=ఒకటే (తెలుపు) రంగు, కావించి, అలం-మీలనము. సేవించు...పుక్కిళ్లకున్ = సేవించు = (వెన్నెలను) అనుభవించు, చకోరకదంబంబుల = వెన్నెలపులుఁగుల మొత్తములయొక్క, పుక్కిళ్లకున్ = బుగ్గలలోపలిభాగములకు - నోళ్లకు, వెక్కసంబై=ఎక్కువై, ముక్కులకున్ = ముక్కులలోనికి, ఎక్కి=ఎగదట్టి, అలం-అతిశయోక్తి. వెన్నెలలను చకోరములు తృప్తి దీర నారగించు ననుటకు.—

సీ. "విరహులపైసోఁకి వేఁడియౌ వెన్నెల వచ్చివెన్నెల నులివెచ్చఁజేసి
కలువపువ్వాళ్లచేఁ గసటైనవెన్నెలవలిపెవెన్నెలలోన వడియఁదేర్చి

చంద్రకాంతపునీటఁ జాలైనవెన్నెల మఁదురువెన్నెల జొట్టుబదనుజేసి
సతులమైఁపూఁత పిసాళించువెన్నెలఁ దనుపువెన్నెల రసాయనముగూర్చి

తే. చిగురువిలుకానిజాతరఁ జేయఁబూని, కొలముసాములనందఱఁ గూడబెట్టి
వంతుగలయంగబువ్వంపుబంతివిందు, పెట్టి రెలమిచకోరంపుఁజేరటాంద్రు."

(పారిజాతాపహరణము.)

చిక్కంబడి = చిక్కనై, అలంకారము.—ఉత్ప్రేక్ష. (వెన్నెలపులుఁగుల పుక్కిళ్లు నిండి యెక్కువై మిక్కిన వచ్చె ననుట.) ఒండొండ=ఒకొక్కటొక్క టిగా, బొండుమల్లియలన్ = బొండుమల్లెలనుండి, దండడిన్ = తఱుచుగా, తొరఁగుపుప్పొళ్లన్ = రాలుపుప్పపరాగముచే, ఉప్పతిల్లునెత్తావులకున్ = పుట్టునిండుకువాసనలకు, వెకలులై = ఆశపడునవై, అదు మొకరి తుమ్మెదలు= (మీఁదఁ) తిరుగునట్టి ఝుంకరించు తుమ్మెదలు, రొదలుగల మెఱుఁగుదుంబురుపు లట్లు=ధ్వనులుగల మిడుఁగుఱుఁబుర్వులవలె, మిసమిసనిమెఱవన్ = మిసమిస లాడుచుఁ బ్రకాశింపఁగా, ససిమెఱుఁగు. మొత్తంబులన్=నిగ్గయిన వెలుఁగు ప్రోవులను, ఉమిసి యుమిసి=వెళ్లఁగ్రక్కిక్రక్కి, (బొండుమల్లెపూల పరి మళమునకై ఝుంకరించుచుఁ దిరుగాడు తుమ్మెదలు వెన్నెలపైఁబడఁగా మిస మిసలాడుచు మిడుఁగుఱుబుర్వులవలెఁ బ్రకాశించె ననుట) అలం-ఉత్ప్రేక్ష. అందంద = అటనట, ప్రవహించు...స్యందంబులకున్ - ప్రవహించు = పాఱుచున్న, ఇందూపల=చంద్రకాంతపుఱాళ్లయొక్క, స్యందంబులకున్=నీటి ఊటలకు, ఇందులు=చుట్టాలు, అగు...బెండడిన్-అగు, ఇందీవర=నల్లకల్వల, మరందంబుల = తేనెలయొక్క, బెండడిన్=అొచ్చునందు, పడి, బందన గొను...టొదులు - బందనగొను = జిగటగొను, వలిమించు = చలిమీఱిన, క్రొమ్మించు టొదులు = క్రొత్తమంచునీటి కాల్వలు, ఈఁదియాఁది, వడి పదలి=తగ్గి, సుడివడుచున్=సుడివడుచు, ఒడలు=దేహమును, ఓము...సోఁకు లన్-ఓము=కాపాడు, సోమరిగాలి = మందానిలముయొక్క, అలవోకసోఁకు లన్=విలాసపుఁదాఁకులచే, కదలీకదలవు = కదలియును గదలలేదు, అన్ =

అనునట్లు, కదలీకదలక వ్యాకరణదుష్టమని యిటీవల ముద్రణములలోఁ గదలెంగదలవు అని మార్పఁబడెను. కదలీకదలక లోనగుచోటులఁ గ్వార్థక యిత్తులకు దీర్ఘముగూడఁ బ్రాచీనప్రయోగములందుఁ గలదు. కాన నిది గ్రాహ్యమని మాతలంపు. ప్రాచీనగ్రంథములం దిట్టి ప్రయోగములు గలవు.

క. "నమ్మమిమృత్యువు పెద్దయుం, నమ్ముటయమృత్యువగుట నరపతి నమ్మీ
నమ్మకపనులనుగొనని,త్యమ్మునుసూక్ష్మమతి దాని నరయఁగవలయున్."
(భారతము, శాంతి. ద్వి. అ. 351 ప.)

నూతన ముద్రణమునందు "నరపతిమిత్రుక్, నమ్మిపనులుగొనునది" అని మార్పఁబడినది. ఇది సాహసము. "కూడీకూడని చిన్నకూకటులతో గోపార్శ్వక శ్రేణితో" దేవకీనందనశతకము. కదలు...ద్రోణికలన్ - కదలు, ఉపవన= ఉద్యానములందలి, కదలీ = అరఁటిచెట్లయొక్కయు, కేతకీ = మొగిలిచెట్ల యొక్కయు, హింతాళ=హింతాళవృక్షములయొక్కయు, నారికేళ = కొబ్బరి చెట్లయొక్కయు, పూగ = పోఁకచెట్లయొక్కయు, ఆవళి=వరుసలయొక్క, కోమల=మృదువులైన, పలాశద్రోణికలన్ = ఆకు దొన్నెలయందు, నునుపు = నున్నన, కలధౌతలయోరలన్ = కలిగినయావరణల ప్రక్కలందు, శరధితరఁగలమీఁదనుంబోలె=సముద్రపు తరంగములమీఁదనువలె, గిఱికొని=వ్యాపించి (మందమారుతముసోఁక కదలీకదలనట్లున్న యవృక్షములకొన యాకుల పైఁ బడుచో సముద్రతరంగముల పైఁ బడినట్లుండెననుట.) అలం—ఉపమ. ఎల్లవల్లికలున్ = అన్నితీవలును, పూవక = పుష్పింపకయే, పూచినట్లు, ఉల్లసిల్లన్ = రంజిల్లఁగా, జెల్లు = జెల్లుగడ్డి, ఉల్లసిల్లిన చందంబునన్ = విరియఁబూచిన విధమున, తెల్లతెల్లనై, మొల్లమిగన్=దట్టముగా, అంత కంతకున్, దిగంతంబులు=దిక్కులకొనలు, దంతంబులు = ఏనుగుదంతములును, తీరిచినయిడుపులుంబోలెన్ = తీర్చిన పార్శ్వభాగములవలె, తీండ్రింపన్ = ప్రకాశింపఁగా, రేయొంద=రాత్రివేళయొంద (రేయొందపదమునకు వెన్నెల యనునర్థము నింతకుఁ బ్రాచీనకావ్యములందు మృగ్యము. రేయొంద,

ఈరెండు, సమానార్థకములుగాఁ జూపట్టెను) రాత్రివేళకాయుంనట్టి యెండ యని యొకరుచెప్పిరికాని యంతసరసముగా లేదు. పూవులు శ్వేతగణములో నివిగాన నన్ని తెగలపూవులను జెప్పునపుడు తెల్లవిగానె చెప్పుదురు. ఇట్లను టకు శ్లో. "శుభ్రాణిభారతీధర్మశేషేశవరుణోదవః, ముక్తాకుసుమనక్షత్రదన్త స్వేదాంబుబిందవః"—కావ్యకల్పలత. తాన్ =తాను, అపటంజేసి, ఎండమా పులన్ = ఎండవేళబయళ్లలో నీటిప్రవాహమువలెఁ బొడకట్టువానిని, పుట్టిం చెను. అనన్, పట్టుగల=అవకాశమున్న, పటికంపురాచట్టునేలలన్=స్ఫటికపు రాతిచట్టుగలనేలలందు, పెట్టుకొని=ఒత్తుకొని, (తాను రాత్రియెండవేళనుండు నెండమావులఁ బుట్టించెనో యనునట్లు స్ఫటికపుచట్టునేలలపై దట్టముగాఁ బ్రసరించె ననుట.) అలం-ఉత్ప్రేక్ష. పెండియరున్ = మఱియుం, చిట్టకంబుల కున్=ఏకసక్కెములకు, పెడమొగంబువెట్టుకొని = మారుమొగముపెట్టుకొని, పట్టఁబట్టన్=అందుకొనిపట్టుకొనుటకై, పోవు=తప్పుకొనిపోవు, ప్రాణభర్తల = మిగుల ప్రియముగలమగలయొక్క, వెంటంబడి=వెంబడిదగిలి, నూపురంబులు= కాలియందెలు, మొరయన్=ధ్వనిసేయఁగా, పూర్వకాలమున నొకవిధముగు గజ్జెలయందియలు స్త్రీలు ధరింప వానిమ్రోఁత మిగుల మనోహరముగ నుండె డిది. అందియలు మ్రోగు ననుటకు—

"ఏతాశ్చలద్వలయసంహతి మేఖలోత్థఝంకారనూపురపరాజితరాజహంస్యః
కుర్వంతికస్యనమనో వివశంతరుణ్యోవిత్రస్తముగ్ధహరిణీసదృశైఃకటాక్షైః"
(భర్తృ-శృంగా.)

"కింకిణీ, నూతనఘుల్ ఘుళాచరణ నూపురఝాళఝుళీమరంద సంజాత ........" —పెద్దనార్యునిచాటువు. వేసలులు = వెంద్రుకములు, విరియన్ = విడఁగా, క్రమంబునన్ = వరుసతో, పుట్టు నిట్టూర్పుపవ నంబు = నిడుద యూర్పులఁగాలి, జవంబునన్ = వేగముచే, పైకొను, ఎడలింపన్ = తొలఁగింపఁగా, అందనికౌఁగిటన్ = అమరనికౌఁగిటిలో, పొదివి = కుదుర్చుకొని, ప్రియంబుచిలుకన్ = ప్రేమ తొలఁకగా, పలికి

ముద్దాడు...సాంద్రతన్ = ముద్దాడు = ముద్దుపెట్టుకొను, జవరాండ్ర = యువతులయొక్క, దంతచంద్రికల = దంతకాంతులయొక్క, సాంద్రతన్ = చిక్కఁదనముచే, పంతంబు మెఱసి = పట్టుదలమీఱి, మంతనంపువేళలన్ = ఏకాంతపువేళలందు, మాటకబ్బిబ్బునన్ = మాటలతడఁబాటుచే, పుట్టుబాల యలుకలన్=కలుగు ప్రణయకలహములచే, తలలు వంచి, రొద = చప్పుడు, లేని, నాలియేడ్పులు = వగయేడ్పులు, ఏడ్చు, ప్రియలన్ = ప్రియురాండ్రను, అనునయింపన్=ఓదార్చుటకు, ఇంపునన్, చనవు = స్వాతంత్ర్యము మెఱసి = మెఱయించి, తెక్కుటద్దంబులు = అద్దములఁబోలు చెక్కిళ్లను, సొక్కు, మొగంబు, ఎగయెత్తి = పైకెత్తి, ముత్తియంపు ముంగఱంగునన్ = ముత్తెముగట్టిన ముక్కరవిధమున, కదలుకొనుబుడిబుడికన్నీటన్ = వెల్వడు-చినుకు-చినుకుకన్నీటిలో, ప్రతిఫలించి = ప్రతిబింబించి, తుఱంగలించుతనదునిగనిగలు = ప్రకాశించు తనయొక్క నిగనిగమనుకాంతులను, కనుంగొని=చూచి, నగెనగెన్ = నవ్వెనవ్వె, అనుచున్, చుంబనంబు = ముద్దు, ఇడఁబోయి, జవరాలేడ్చుటఁ గని విటుఁడు బుజ్జగింప నెంచి మొగము నెత్తఁ జెక్కులఁజిందు కన్నీట వెన్నెల ప్రతిబింబించెను. ప్రియురాలు నవ్వచుండె నని మోహనొక్క మఱింతకోపము గల్గించె నని భావము. కెంగేలన్ = ఎఱ్ఱనిహస్తముతో, అదరంటన్ = చుఱుకంటఁగా, వటు...కూటువన్ = వాటువడు = దెబ్బపడునట్టి, కాముకుల (యొక్క), వెలవెలపాటు = తెల్లపోవుటయొక్క, కూటువన్ = కలయికచే, కోటికెంబడగలెత్తె = మహోన్నతసంపదపొందె, (అమితమైన తెల్పుచెందె యనుట.) అలం - ఉత్ప్రేక్ష. పిండిచల్లినగతిన్, కాయన్ = (వెన్నెల) కాయఁగా, డాయన్=దగ్గఱుటకు. లజ్జించి=సిగ్గిలి, బుజ్జవంబునన్ = లాలనముచే, పొదరిండ్లకున్, లతాగృహములకు, పొదరిండ్లు భోగయోగ్యములు. పుష్పరజము పూషలు సెజ్జవలె నుండును. కరులుగుత్తించునటుల పొదరిల్లు దట్టముగా నుండుఁగాన గాముకులు

పాదరిండ్లను గోరుదురు. తార్చి = చేర్చుకొని, కాంతుల౯ = ప్రియులను, కవయ నంగనాచులు = కూడ ధూర్తురాండ్రు, అగునంగనలయంగంబులపస = అగునట్టి స్త్రీయొక్క యవయవముల మేలిమి, ముంగిటంబడ౯ = బయలు పడునట్లు, చలితకిసలయాంతరాళంబుల౯ = కదలియాడు చిగురుటాకుల సందులలో, తూఱితూఱి = ప్రవేశించి ప్రవేశించి, ఇరులు = చీకట్లను, విరియించి=విడఁగొట్టి, పాదరిండ్లు దట్టముగా నుండుటచేఁ జెలువల యవయవ సౌందర్యముల నరయ వీలుకాదయ్యెను, చలితకిసలయము లనుటచేఁ జిఱుగాలి వీచి వారి కానందకరముగ నుండె ననియుం నాకులు గదలుటచే సందులనుండి వెన్నెల ప్రసరించి చెలువలయవయవదర్శనమున కనుకూలముఁ జేసె నని భావము. అలం - ఉత్ప్రేక్ష. పతులప్రార్థనంబుల౯ = ప్రియులవేఁడుకొనుటచే, పుంభావసురతాడంబరంబునకు౯ = పురుషాయితమందలి విజృంభణమునకు, తోడు చూపి = సాహాయ్యమును చూపఁగా, దూపటిలి = దస్సి, అంగరాగంబులు = మైపూఁతలు, కరంగ౯ = కరఁగునట్లు, చెమర్చిన...లకల౯ చెమర్చిన = చెమటపట్టిన, చంచలాక్షుల = స్త్రీలయొక్క, నిద్దంపు = నునుపైన, తనూలతల౯ = తీఁగలవంటి శరీరములందు, పుట్టి, దట్టంబులు, అగు, చిఱుచెమటబొట్టుల౯ = చిన్నచిన్న చెమటబొట్టులందు, పొడకట్టి = ప్రతిఫలించి, కన్పడి, పురుషాయితము నందు నాయికకై బడలిక యెక్కువ. అలయికచేఁ జెమట మేన జనించుటయుం మైపూఁతలు కరఁగుటయుం సాజము. స్త్రీలబడలికయే యెక్కు డనుటకు—

శ్లో. “ఉరసి నిపతితానాం స్రస్తధమ్మిల్లకానాం
ముకులితనయనానాం కించిదున్మీలితానాం
ఉపరిసురతఖేదస్విన్నగండస్థలానా
మధరమధు వధూనాం భాగ్యవంతః పిబంతి. (భర్తృహరి.)

స్రగ్ధర... పతులఁబదరి పైఁ బ్రాఢివాటించి నిట్టూ
ర్పుకదొట్ట౯ దస్సి పీరాయితమరి మఱితాకట్టో మున్నట్టయానా,

యికలం గందర్పుఁ డోటం బెత్తిఁగిత రిమిపేఁచెను.” (ఆముక్తమాల్యద.)

తెలుపారు...అందంబులు- తెలుపారు=తెల్లనైన, మలయజాపు = మంచిగంధముయొక్క, చిటులు=చిట్టిన, గందంబుల=గంధపుఁబూఁతలయొక్క, అందంబులు=చక్కనలు, ఒసంగి=యిచ్చి, అలం-విదర్శనము. సంజకడన్=సంజవేళ, తారు=తమరు, నొడివినసంకేతంబులన్ = చెప్పినరహస్యస్థలములందు ఉండక, తెరవుగట్టి=దారికాచి, పొరువుఁదరువులనీడలన్ = ప్రక్కలయుండు చెట్లనీడయందు, అడంగి=దాఁగి, నవ్వుటాలకున్ = వేళాకోళమునకు, వెనుక పాటునన్ = వెనుకపడుటచేత, కదిసి = చేరవచ్చి, ముసుంగులు = (ఎఱుక పడకుండుటకు వేసికొన్న) ముసుంగులను, ఎడలింపన్ = తొలఁగింపఁగా, బెగడి = భయపడి, కళవళంపుఁజూపులన్ = బెదరుపాటుగలచూపులతో, వల్లభులన్ = ప్రియులను, చూచి, అల్లనన్ = మెల్లఁగా, నగు...చెన్నునన్-నగు=నవ్వునట్టి, అభిసారికల = ఱంకుటాండ్రయొక్క, వెడందకన్నుల చెన్నునన్ = విశాలనేత్రములయందముచే, అన్నుకొని = మదముగొని (అతిశయించి యనుట), అలం-ఉత్ప్రేక్ష. పొదలుసువనోన్మాదంబునకున్ = కలుగు మన్మథోద్రేకమునకు, ప్రోదిగాన్ = తోడ్పాటుగా, మోదంబునన్=సంతోషముతో, కాదంబరి = కల్లును, గండూషించి = పుక్కిలించి, విటకదంబంబునకున్ = జారులసమూహమునకు, ఒసఁగు...బుగ్గలందున్ - ఒసఁగు = ఇచ్చునట్టి, అంబురుహముఖుల = పద్మములవంటిముఖము గలస్త్రీలయొక్క, ఒప్పులకుప్పలు = చక్కఁదనాలరాసులు, అగునిప్పపూమొగ్గలంబోని = అగునట్టి యిప్పపూవుల మొగ్గలంబోలు, (కల్లుగ్రోలినవారిబుగ్గలు కొంచెము ఎఱుపు గలిసిన తెలుపుతో నుండును గాన నిట నిప్పపూవులతోఁ బోల్పఁబడె నని గ్రహించునది) బుగ్గలందున్, అగ్గలిక = హెచ్చుచు, చూపు...చకచకల - చూపు, కమ్మపుంజాల=పుంజాలవలెఁ దేజరిల్లుకమ్మలయందలి, వజ్రపుంజకచకల = వజ్రకాంతులచే, నకనకలు = సన్నఁదనములు, వీడుకొని = వదలి, అలం - ఉపమ. కలికితనంబులన్ = మెలపులతో, కలిసిమెలసి, రతాంతంబునన్ =

సురతావసానమున, పరిశ్రాంతి = బడలిక, అడఁగన్ = శాంతింప, అంగణంబులన్ = ముంగిళ్లయందు, నిలిచి, ఒండొరులకురులు = (ఆలుమగలు) ఒకరొకరివెండ్రుకలు, దువ్వుచున్ = చిక్కుదీర్చుచు, విహరించుసమయంబునన్, పల్లవులు=విటులు, కేళికిన్ = రతికి, అల్లప్పుడు=ఆసమయమున, అన్నతమమాటలు, తలఁపించినన్ = తలఁపుఁజేయఁగా, ఉదరిపడి = సిగ్గుపడి, మందస్మితంబులు=చిఱునవ్వులు, అంకురించుహుంకృతులన్=పొడమునదలింపులచే, జంకించి = బెదరించి, కంకణంబుల...తళుకులు - కంకణంబుల (యొక్క) రత్నంపుఁదళుకులు=రత్నములకాంతులు, చెదరన్ = వ్యాపింపఁగా, ఉంకించి= ఊఁచి, వైచుచేమంతిపూఁబంతులన్ = వేయునట్టిసేవంతిపూలచెండ్లచేత, పుటపుటనై = పిక్కటిల్లి, మిటమిటన్ = మిటమిట యనుకాంతి, కాయు... మెండునన్-కాయం = ప్రకాశించు, దట్టంపు = చిక్కనైన, పండువెన్నెల= ముదురు వెన్నెలయొక్క, మెండునన్ = అతిశయముచే, బెండువడి = తేలికపడి, డెందంబు = హృదయము, కంది = కమలి (తాపము నొంది), తాలిమి= ధైర్యము, చిందువందరై = కకావికలై, కెందలిరుపాన్పునన్ = ఎఱ్ఱనిచివుళ్లు పఱచినప్రక్కపై, తనువు = శరీరము, ఒందక = కుదురుపడక, పరుండియుండ నించుకేనియుం ననువుపడక, లేచి = పానుపునుండి లేచి, కూర్చుండి= (విచారముతోఁ) గూర్చుండి, కన్నీరు = కంటినీరు (బాష్పములు) గోటన్ = గోటితో, మీటుచున్ = ఎగజిమ్ముచు (గోటితోఁ జిందఁగొట్టుచు) పరూథిని ఇట్లనియెన్ = ఈవిధముగాఁ బలికెను. (తన చెలికత్తెతో వక్ష్యమాణవిధముగా వాకొనెను.)

ఉ. నోములు నోఁచినమ్మలు మనోరథముల్ దఱియవాఱ నిత్తఱిన్
దామరతంపరై ప్రియులఁ దారు విహారము సల్ప వీరిలో
నీమొఱ దుఃఖశీల నగు నే వసియింపఁ దరంబె పోద మా
రామముఁ జూడ నందు సుకరం బగు సర్వము నంబుజాననా.

టీ. అంబుజాననా = పద్మమువంటి మోముగలదానా! చెలీ! నోములు నోఁచినమ్మలు = (వెనుక) మంచి వ్రతములు చేసిన పుణ్యశాలినులు, మనోరథములన్ = కోరికలు, దయివాఱన్ = నెఱవేఱఁగా, ఇత్తఱిన్ = ఈ వెన్నెలరాత్రియందు, తామరతంపరై = పెంపుచెంది, ఇష్టమువచ్చినవిధముగా, ప్రియులున్ = ప్రాణనాయకులును, తారున్ = తామును, విహారము = వేడుకగా సంచారము చేయుట, సల్పన్ = చేయుచుండఁగ, వీరిలోన్ = ఇట్టి సౌఖ్యము ననుభవించుచున్న యాస్త్రీలలో, ఈమెయిన్ = ఈవిధమున, దుఃఖశీలను = దుఃఖపడుస్వభావముగలదానను, అగు నేన్, వసియింపన్ = ఉండుటకు, తరంబె = శక్యమా! ఆరామము మాడన్ = ఉద్యానవనమును జూచుటకు పోదము = పోవుదము, అందున్ = ఆతోఁటయందు, సర్వమున్ = సమస్తము, సుకరంబు = సుఖముగాఁ జేయఁదగినది, అగున్ = కాఁగలదు. ధన్యురాండ్రగు స్త్రీలకుఁ బూర్వవ్రతఫలమున నిష్టప్రియసంయోగభాగ్యము సిద్ధించినది. నే గొఱనోముల నోఁచి దుఃఖశీలనై తిని. కాననే నేను వసింప తరముగా దని వరూథిని యనెను. విరహిణులకుఁ జంద్రికానిశలు ప్రియాసహచరులసందర్శనము మిగుల వ్యథాకరములు.

తామరతంపరయనం దామరలగుంపువలెఁ బెరవేసికొనియుండుట. ఇది కలసిమెలసి, అభివృద్ధినొంది యనునర్థమున వాడఁబడును. కలసిమెలసి యనుటకు.—

"తామరతంపరైన చెలులు చుట్టలు కలిసి" (భార. ఉద్యో. ఆ. 3.)

తా. చెలీ! పూర్వజన్మమున మంచినోములునోఁచుకొన్న పుణ్యవతులు కోరికలు నెఱవేఱఁగా ప్రియులుం దామును దామరతంపరగా సౌఖ్యము ననుభవించుచుండఁగా వీరిలో నొక్కరితనై ప్రియసమాగమము దొరకక దుఃఖపడునేను నిల్వఁగల్గుదునా? శృంగారవనమునకుఁ బోవుదము. సర్వము నక్కడ చక్కఁబడఁగలదు. కావ్యలింగాలంకారము.

క. అని పలికి పాన్పు డిగి కా
మిని చంద్రాతపమువేఁడిమికిఁ బైటచెఱం
గున ముసుఁగిడి నిజకేళీ
వనిఁ జొచ్చి వియోగవహ్ని వడఁబడి తెగువన్. 30

టీ. అని. పలికి = తనచెలికత్తెతో నిటులఁ జెప్పి, పాన్పు=పఱపు, డిగి = దిగి, కామిని = ప్రియసంగమవాంఛతోఁ బరితప్తురా లగువరూథిని, చంద్రాతపమువేఁడిమికిన్ = వెన్నెలవేఁడికి, పైఁటచెఱంగునన్ = పయ్యెద చెంగుతో, ముసుఁగిడి = ముసుఁగు వేసికొని (సమస్తావయవములకు వెన్నెలసోఁక కుండఁ జేసికొని) నిజకేళీవనిన్ = తనవిహారవనమును, చొచ్చి = ప్రవేశించి, వియోగవహ్నిన్ = విరహాగ్ని చే, వడఁబడి=సొక్కి, తెగువన్ = సాహసముతో, (వైపర్యముతో నన్వయము.)

దిగియనుశబ్దమునందలి దకారమునకు డకారము వచ్చుటకు—.

తే. "డాఁక దగ్గఱి దిగ్గియ దాయఁబోయి
దాపలను ధిగ్గుమనువైకృతముల మొదల
డాఁక డగ్గఱి డిగ్గియ డాయఁబోయి
డాపలను డిగ్గుమని డా కడంగి నిల్చు." (అప్పకవీయము.)

విరహిణులకుఁ జంద్రాతపము సహింపరానియంత వేఁడిగా నుండును. కానఁ బయ్యెంటచెఱంగుతోఁ గప్పుకొందురు. ఇటు లనుటకు—

శ్లో. "స్తనోత్తరీయేణ కరోద్ధృతేన
నివారయంతీ శశినో మయూఖాన్." (భర్తృహరి. శృం.)

సీ. చనుఁగప్పు దొలఁగ వాసనగాలి కెను రేఁగుఁ
బను వొప్పు నలుఁగులఁ బాఱుకరణి
నిడుదవేనలినూనెముడి వీడఁ జిగురాకుఁ
బొదఁ దూఱుఁ గార్చిచ్చుఁ గదియుకరణిఁ

బసిఁడిగాజులు పైకి వెసఁ ద్రోచి సునుఁదీగఁ
దెమలించు నురిత్రాఁడు నెమకుకరణి
మొలనూలు బిగియించి వెలఁది వెన్నెలఁ జొచ్చుఁ
బిలుదీయ కేటిలో నులుకుకరణి

తే. జడియ దళులకుఁ గురియుపుష్పాడుల మునుఁగు
మావికడ నిల్చు విరులనెత్తావిఁ గ్రోలు
విషమసాయకునేఁపుల విసివి విసివి
తనువుఁ దొఱఁగంగఁ దలఁచి యవ్వనరుహాక్షి. 31

టీ. అవ్వనరుహాక్షి = ఆవరూథిని, విషమసాయకునేఁపులన్ = మన్మథ బాధలచేత, (పా-విషమసాయకు తూపులన్ = మన్మథునిబాణములచే) విసివివిసివి = మిగుల విసువుచెంది, తనువు = శరీరమును, తొఱఁగంగన్ = విడుచుటకు, తలఁచి=నిశ్చయించి, పరువు = పరుగు, ఒప్పన్ = ఒప్పునట్లు, అలుఁగులన్ = బాణములందు, పాఱుకరణిన్ = పర్వెత్తురీతిని (బాణములు తనపైకివచ్చుచుండ వానికెదురు పరుగిడువిధమున ననుట) చనుఁగవ్వ=చనులకుఁ బైనున్నపయ్యెద, తొలఁగన్ = తొలఁగిపోవ, వాసనగాలికిన్ = పరిమళముగల వాయువునకు, ఎదురేఁగున్ = ఎదురుగాఁబోవును. (అలుఁగులన్=కత్తులమీఁద నని కొందఱు వ్యాఖ్యాతలు) కార్చిచ్చున్ = దావాగ్నిని, కదియం గరణిన్ = చేరఁబోవువిధమున, నిద్దుద...ముడి = నిద్దుద=పొడవైన, వేనలి=సిగయొక్క, నూనెముడి = దూముడి (నూనియ రాచి వేసినముడి యూరక వీడును) వీడన్ = వదలఁగా, చిగురాకుఁ బొదన్ = చిగురాకులుగలపొదలో, తూఱున్ = ప్రవేశించును. విరహిణి మలి చలనముచే మరణింప నెంచి చిగురుటాకులరాశి యగ్నికుండమని దూఱు ననుటకు—

శ్లో. "అధివసతి వసంతే మర్తుకామా దురంతే
నవకిసలయతల్పం ఫుంజితాంగారకల్పం,

విరహామసహామానా చక్రవాకీసమానా
చకితవనకురంగీలోచనా కోమలాంగీ." (పుష్పబాణ.)

ఉరిత్రాడు = ఉరిత్రాటిని, సెమకుకరణిన్ = వెదకువిధమున, పసిఁడి గాజులు = బంగారు గాజులు, పైకి, వెసన్ = వేగ, త్రోఁచి = ఎగఁద్రోఁచి, నునుఁదీగెన్=నునుపైనతీవను, తెమలించున్=లాగును. ఏటిలోన్ = సముద్రమున, (ఏఱనసముద్ర మర్థమనుటకు "పాలేటివేత్రచ్ఛుచో" నని ప్రయోగము.) ఉఱుకుకరణిన్ = దుముకునట్లు, మొలనూలు = మొలత్రాటిని, బిగియించి=బిగియదీసి, వెలఁదివెన్నెలన్ = తేటవెన్నెలను, చొచ్చున్ = చొరఁబడును, అళులకున్ = తుమ్మెదలకు, జడియదు, కురియుంపుప్పొడులన్ = రాలుపుష్పపరాగమున, మునుఁగున్, మావికడన్ = మామిడిచెట్టునొద్ద, నిల్చున్, విరుల నెత్తావిన్=పూవులనిండుపరిమళమును, క్రోలున్, ఉత్ప్రేక్షాలంకారము.

ఇది మృతి యను చివరి మన్మథావస్థ. ఇందు మరణప్రయత్న మభివర్ణింపఁబడినది.

శ్లో. "స్మరార్త్యా మరణోద్యోగో మృతి రిత్యభిధీయతే" ఇవి యంతయుఁ దాప మను నాఱవ మన్మథావస్థ లక్షణములు. తాపలక్షణములు:—

"చక్షుఃప్రీతి శ్చిన్తా సంకల్పో గుణమతిః క్రియాద్వేషః
తాపో లజ్జాత్యాగో మూర్ఛా మృతిర్దశావస్థాః.
తత్ప్రాప్తేఃప్రకర్షేణ తాపః స్యాత్ కామజో జ్వరః
వైవర్ణ్యమశ్రు నైరస్యం శయనే పరిలుంఠనం
నిశ్వాసముఖశోషాద్యా అనుభావా స్తదుద్భవాః."

(సాహిత్యచింతామణి.)

వెలఁదివెన్నెల యన ధవళ మగువెన్నెల. వెలఁది యన ధవళ మనుటకు:—.

గీ. "ఈ వెలందిరొయొడల్ పైడిలోవెలంది" (విజయవిలాసము.)

సీ. "ఓలి నన్నింటి సద్యోఘృతంబుల నించి వెలఁదిపట్టున వర్తు లలవరించి"

(భోజరాజీయము. ఆ. ౨.)

క. అట్టియెడ నమ్మృగేక్షణఁ
బట్టి సఖీజనము వెడఁగుఁబట్టీ తగవే
యిట్టితెగు వనుచుఁ జెక్కులఁ
దొట్టినకన్నీరు వోవఁ దుడుచుచుఁ బలికెన్. 32

టీ. అట్టియెడన్=ఆ సమయమున, అమ్మృగేక్షణన్ = జింక చూపుల వంటి చూపులుగల యావరూథినిని, సఖీజనము = చెలికత్తెల సమూహము, పట్టి=చుట్టుకుట్టి. వెడఁగుఁబట్టీ = పిచ్చిబిడ్డా! ఇట్టితెగువ = ఇట్టిసాహసము, తగవే=తగునా, అనుచున్, చెక్కులన్=చెక్కిళ్లయందు, తొట్టినకన్నీరు = కాఱినకన్నీటిని, పోవన్=పోవునట్లు, తుడుచుచున్ = వస్త్రముతో నొత్తుచు, పలికెన్ = వాకొనెను.

ఉ. పూఁతపసిండివంటివలపున్ బచరించుకులంబునీతికిన్
లేఁత గదమ్మ యిత్తెఱఁగు లేరు సురాంగన లెల్ల నిట్టినీ
చేఁతను మెత్తురమ్మ దయసేయక తిన్ననిమేను వెన్నెలన్
వేఁతురఁటమ్మ యింత కనువేఁదుఱు సెల్లునఁటమ్మ యింతికిన్.

టీ. లేఁత = చిన్నదానా! పూఁతపసిండివంటివలపున్ = నీరూఁదిన బంగారువలెఁ బైపైఁదోఁచెడు మోహమును, హృదయమునందు లేకున్నను బయటికి కన్నట్లు వర్తించుట సహజము. అట్టికృత్రిమ మగువలపును, పచ...నీతికిన్—పచరించు = నటించు, కులంబు = వంగడముయొక్క, నీతికిన్=న్యాయమునకు, వేశ్యాజాతి మర్యాదకు, ఇత్తెఱఁగు = ఈవిధము, ఈ విధముగా నిక్కమగు వలపునఁబడి పరితాపమునొంది విరహాగ్ని మగ్న పగుట, లేఁత = చుల్కన, కదమ్మ, సురాంగనలెల్లన్ = దేవతా స్త్రీలందఱును, ఇట్టి నీచేఁతకున్ = ఇటువంటి నీవ్యాపారమునకు, మెత్తురమ్మ = మెచ్చుదురఁటమ్మా? దయసేయక = ప్రేమింపక, తిన్ననిమేను = చక్కని శరీరము, వెన్నెలన్, వేఁతురఁటమ్మ = తపింపఁజేయుదురా! ఇంతికిన్ = స్త్రీకి, ఇంతకనువేఁదుఱు=ఇంతచూపువిచ్చి, చెల్లునఁటమ్మ.

బంగారు ఒకనికి మోహము గలిగించును గాని తా నొకనిని మోహింపదను మనసుల బట్టిరి. అట్టికులమునఁ బొడమియుం గనువేఁదురుచే నిటుల మెలఁగు నిన్నుఁ జూచిన చెల్వు చెలులు సహింపకపోరు. ఈ మనోహరాకారము నెడఁ గనికరము లేమి తగ దనియు "శరీరమాద్యం ఖలు ధర్మసాధన" మన్న టులఁ గామధర్మసాధనభూత మగు దేహము నెడఁ గనికరింప నగు నని చెలులు వరూథినికిఁ దెలిపిరి.

తా. నీవూఁదిన బంగారమువలె పైపై వలపులు చూపవలసిన భోగము కులమునుమర్యాద లేక యిట్లు నిక్కపుమోహము నిల్పి తాపపడుట తగదు. నీకులమువారెందు లెవ్వరును నీనడవడికి మెచ్చుకొనరు. కాపాడుకొనక యీ చక్కఁదనాల శరీరమును వెన్నెలలో వేఁచుట తగదు. ఆఁడువాండ్రకింత చూపుపిచ్చి కూడదు.

చ. ఉడుపతిబారికిన్ వెఱచి యోరటయౌ నని పేరుటామనిన్
ముడివడుకంతుసేనలకు ముయ్యేలగు ట్టయినట్టి యిందు రా
నడఁగునె తాపవహ్ని మనమై హరిణేక్షణ ముల్లు పుచ్చి కొ
ఱ్ఱడఁచినచందమయ్యెఁ బదమా యెలదోఁటఁ జరింప కింటికిన్!

టీ. హరిణేక్షణ=జింకచూపులు గలవరూథినీ! ఉడుపతిబారికిన్ = చంద్రునివలనిహింసకు, వెఱచి, ఓరటయౌ = కొంతశాంతియగును, అని = అనుకొని, పేరుటామనిన్ = నిండారినవసంతకాలమున, ముడివడుకంతుసేనలకున్=సమకూడు మదనదండునకు, ముయ్యేలగుట్ట = కూడలిపట్టు, అయినట్టి=అయి యొప్పుచున్నటువంటి, ఇందున్ = ఈతోఁటకు, (మన్మథుని పరివారమున కునికిపట్టగు నీ యుద్యానవనము మీఁదు మిక్కిలి తాపకరము గాని వేఱుగాదు గాన) రాన్ = వచ్చినయెడ, తాపవహ్ని=విరహతాపాగ్ని, అడఁగునె=శాంతించునా, మనమై=మనయొంతమనము, ముల్లుపుచ్చి = ముల్లు తీసివైచి, కొఱ్ఱు = ఇనుపమేకును, అడఁచినచందము = దిగగ్రుచ్చినవిధము,

అయ్యోక్, ఎలదోఁటన్ = లేఁదోఁటను, చరింపక = తిరుగక, ఇంటికిన్, పదమా = నడువుమా !

వనము తాపహార మని యిందుఁ జొచ్చితివి గాని వసంతుఁ డిందు నిండారియున్నాఁడు. వసంతఋతు విది యనుట. వసంతుఁడు మరుని సామంతుఁడు. పూవులు, తుమ్మెదలు, మలయానిలాదులు మరునిపరివారమె గాన నిటుఁ జేరుట ప్రమాదము. మరుని పరివారము.—

శ్లో. "ధనుః పౌష్పం మౌర్వీ మధుకరమయీ పంచవిశిఖాః
వసంతః సామంతో మలయమరుదాయోధనరథః"
(సౌందర్యలహరి.)

తా. వరూథినీ ! చంద్రునివలన బాధఁ దాళలేక యూఱట చెందుటకని నిండారిన వసంతకాలమున శుకపికాదుల నెలవయిన యీ యెలఁదోఁటకు రాఁదగునా ? ఇవి మల్లు తీసి యా గాయమున కొట్టు గ్రుచ్చుకొనినట్లున్నది. ఇక్కడ తాపము హెచ్చునే కాని యుపశాంతి కలుగదు. ఇంతట నీ యెలఁదోఁటలోఁ దిరుగుట మాని యింటికిఁ బోవుదము రమ్ము. ఇందు విషమాలంకారము ధ్వనించుచున్నది. అలం-లోకోక్తి; కావ్యలింగము.

క. అని యొడఁబడఁ బల్కుచుఁ దో
డ్కొని వచ్చినఁ బాన్పుఁ జేరి గురుకుచ దనపైఁ
గనకనఁ గనలెడు వెలుఁగులఁ
గనికర మఱి మండుచంద్రుఁ గని కర మలుకన్. 35

టీ. అని=ఇటులని, ఒడఁబడన్ = అంగీకరించునట్లు పల్కుచున్ = చెప్పుచు, తోడ్కొని వచ్చినన్ = తీసికొనిరాఁగా, గురుకుచ = గబ్బిగుబ్బలుగల యా వరూథిని, తనపైన్=తనమీఁద, కనకనన్ = కనకనమనుచు, (ఇది మండుట కనుకరణము) కనలెడు వెలుఁగులన్ = వెలిఁగెడి కిరణములతో, కనికరము=దయ, అఱి=దయమాలి, మండుచంద్రున్=వెలుఁగుచున్న చంద

పని, కని, కరము=మిక్కిలి, అలుకన్ = కోపముతో, (వైపరీత్యముతో నన్వయము,) విరహిణులకుఁ జంద్రకిరణములు మిగుల వేఁడిగా నుండును. కాన వెన్నెలలోఁ జొరవెఱచి చంద్రుని దూషింతురు.

"శ్లో. చంద్రః చండకరాయతే" (శృంగారతిలకము.)

తా. అని యొప్పించి నెచ్చెలు లింటికిఁ గొనితేరఁగా వరూథిని నిప్పు లొలుకుచు వెలుఁగుచున్న చంద్రునిఁ జూచి మిగులఁ గోపముతో.

క. ఓచెల్ల! విరహిణీవధ
మేచతురత నీకు దురితమే చేయుపనుల్
రాచఱికపుఫలమే య
య్యో! చంద్ర వివేక మెఱుఁగవో గురుసేవన్. 36

టీ. ఓచెల్ల=ఇస్సిరో! ఇది సంతాపార్థకము. చంద్ర = చంద్రుఁడా, నీకు, విరహిణీవధము = వియోగినులను హింసించుట, ఏచతురత = ఎట్టినేర్పరితనము? దురితమే=పాపమునే, చేయుపనుల్ = కలిగించునట్టిపనులు, రాచఱికపుఫలమే = దొరతనపుఁబ్రయోజనమా ? గురుసేవన్ = గురుశుశ్రూషచే, వివేకము=యుక్తాయుక్తములు తెలిసికొనునట్టి తెలివిని, ఎఱుఁగవో=తెలిసికొన్నవాఁడవు కావో యేమో! (ఇది వెక్కిరింపు మాట.) బృహస్పతియొద్ద శుశ్రూషచేసి నీవు గడించిన వివేక మాయన భార్యను జేరఁదీసికొనుటయే కాదా! గురుసేవచే వివేకమును గడించి పుణ్యకార్యములు గావించినవాఁడవు కావు. కాననే విరహిణీవధూమారణమునకుఁ బూనుకొంటివి. చంద్రునకు రాజను నామాంతరము గలదు. రాజధర్మము రాచఱికము. విరహిణీవధ నీ పరిపాలనాఫలితమా యని యాక్షేపణ.

"రాజీవాక్షుల నేచుపాతకివిచంద్రా రాజవా నీవు" (వసుచరిత్ర)

సీ. తొలుదొల్తఁ గమలమిత్రునివంక రూపాట
దక్షాధ్వరధ్వంసి తన్నుఁ గనుటఁ

బరివేషమిషమునఁ బాశంబు దాల్చుటఁ
గప్పు దేహమునందుఁ గానఁబడుటఁ
గాలవశంబునఁ గాని తోఁపక యుంట
సతతసింహికగదాసక్తతఁ గనుటఁ
బూని పాండుక్షేత్రమునఁ బ్రవర్తించుటఁ
బ్రకటానురాగకారకతఁ దనరుటను
తే. నంతరం బెద్ది యాత్మలో నరసి చూడ
రాజ సీతును నలధర్మరాజునకును
బ్రాణిలోకంబు బాధలఁ బఱచునపుడు
ధర్మపద మొక్కఁ డెక్కుడౌ ధన్యునందు. 37

టీ. (ఈపద్యమునందు యమునకును జంద్రునకును సమత్వము తెలుపఁబడినది. కావున రెండుపక్షముల నర్థముఁ జూచుకొనునది) తొలుదొల్తన్ = మొట్టమొదట, కమలమిత్రునివలనన్ = సూర్యునివలన, రూపొంటన్ = స్వరూపము చెందుటచేతను, (సూర్యకిరణములు సోఁకి రూపేర్పడుటచే నని చంద్రపరమునను, సూర్యునకుం గొడు కగుటచే నని యమపరమునను సరి చూచుకొనునది) సూర్యకిరణములు సోఁకఁగాఁ గళలు వృద్ధినొంది చంద్రునకు స్వరూప మేర్పడుట శాస్త్రసిద్ధము.

సీ. "చండదీధితికరజ్వాలమండలములోఁ బ్రోదిబొందినమహోగ్రుండుపీఁడె"
(శృం-నై.)

చంద్రునివృద్ధిక్షయములకు సూర్యుఁడే కారకుఁడు.

"కలాః షోడశ సోమస్య శుక్లే వర్ధయతే రవిః
... ... ... ... ...
కలావశిష్టో నిష్క్రిత్ప్రవిష్టః సూర్యమండలం
అమాయాం విశతే రశ్మౌ అమావాసీ తతస్స్మృతా.
ఏవం సంక్షీయతే సోమః క్షీణస్త్వాప్యాయతే పునః
తస్మాత్ సూర్యః శశాంకస్య క్షయవృద్ధివిధేర్విభుః." (దేవీపురాణము.

దక్షాధ్వరధ్వంసికిన్న = (చం) దక్షునియజ్ఞము చెడఁగొట్టిన వీరభద్రుని కాలితాఁపును, (య) దక్షయజ్ఞము చెడఁగొట్టించిన శివుని కాలితాఁపును, కనుటన్ = పొందుటచేతను, పరివేషమిషమునన్ = (చం) గాలి గుడి యను నెపమున, "పరివేషస్తు పరిధి రుపసూర్యకమండలే". చంద్రునకు సూర్యునకుఁ బైని మండలాకారముగ నుండు తేజస్సును బరివేష మందురు. అది చుట్టి చుట్టిన త్రాడువలెఁ దోఁచుచున్న దని భావము. పాశంబున్ = పాశమును, తాల్చుటన్ = ధరించుటచేతనుఁ (య) పరివేషమిషమునన్ = (ప్రాణి సమూహమును) చుట్టుకొను నెపమున, పాశంబున్=త్రాడును, తాల్చుటన్ = ధరించుటచేతను, (ప్రాణుల సర్వత్ర యాక్రమించు నెపమున స్వతస్సిద్ధ మైన పల్దత్రాటిని (కాలపాశమును) దాల్చుటచేతనని యమునిపరమగు నర్థము.) కప్పు = (చం) కళంకము, (య) నలుపు, కానఁబడుటన్, కాల వశంబునన్ కాని (చం) కాలముబట్టియే కాని, (కళలవృద్ధిక్షయాదిక మునుబట్టి యనుట) (య) చావుకాలముననే కాని, తోఁపకయుంటన్ = అగపడకుండుటచేతను, సతతనిష్ఠురగదాన్వితతన్ = (చం) ఎప్పుడును ఘోర మైన క్షయరోగముతోఁ గూడికొనుటను, (య) ఎప్పుడును గ్రూరమైన గద యను నాయుధముతోఁ గూడియుండుటను, కనుటన్, పూని=ప్రయత్న పడి, పాండుక్షేత్రమునన్ = (చం) తెల్లనిశరీరముతో, (య) పాండు రాజుభార్యయందు, ప్రవర్తించుటన్ = (చం) వర్తించుటచేతను, (య) ప్రవర్తన చేయుటచేతను, ప్రకటానురాగతారకుఁ డగుటను, (చం) ప్రసిద్ధ మయిన అనురాగముగల యశ్విన్యాదినక్షత్రములు గలవాఁడు, (య) ప్రస్ఫుటమయిన యెఱ్ఱఁదనముతోఁగూడిన గ్రుడ్లుగలవాడు అగుటను, ఆత్మలోన్, అరసిచూడన్, రాజ=రాజనామముగల చంద్రుఁడా! నీకును, ఆల ధర్మరాజునకును = ఆ యమధర్మరాజునకును, అంతరంబు = భేదము, ఎద్ది. ప్రాణిలోకంబున్ = ప్రాణులసమూహమును, బాధలఁబఱచునపుడు =

బాధలఁబెట్టునెడ, ఆ ధన్యునందున్ = ఆ పుణ్యాత్మునందు, ధర్మపదము ఒక్కఁడు=ధర్మశబ్దము ఒక్కటి, ఎక్కుడు=ఎక్కువ.

చంద్రా! నీవు రాజవు. ఆతఁడు ధర్మరాజు. మీయిరువురు పరపీడారతులైనను ఆతనియెడ ధర్మపదమొకటి యతిశయముగా నున్నది. కాన నాతఁడు ధర్మవిచారణ మొనరించి యధార్మికులను మాత్రము హింసించి యన్వర్థనాముఁడై యున్నాఁడు. నీ వధర్మాత్ముఁడవుగాన ధర్మరాజగు యమునికంటెఁ గూడఁ గ్రూరుఁడవు. మీయిరువురికంతరము ధర్మపదమునఁ దక్కఁ బ్రాణిలోకమును బాధపఱచునపుడు లేదనుట.

తా. నీవును యమధర్మరాజును సమానులే. కాని యాతఁడు ప్రాణిహింసపట్టున ధర్మమును విచారించువాఁ డగుటచే ధర్మపద మొక్కటి హెచ్చుకలదు. నీకంటె యముఁడే మేలని భావము. అలం. రూపకము వ్యతిరేకము గమ్యము.

చ. ఒక పెనుఁబాపఱేఁడు చల మొప్ప రసాతలసీమకున్ జకో
రకములు భూతధాత్రికి సురల్ దివికిన్ బగ దీఱు నట్లుగా
మొక మొకపాటుతోడ నిను మ్రింగక పో రెపుడున్ద్రిలోకకం
టకుఁడవు గాన నీయొడలు నజ్జుగఁ జేసి కురంగలాంఛనా.

టీ. కురంగలాంఛనా=చంద్రుఁడా! జింకవలెఁ గానవచ్చు మచ్చగలవాఁడా! కళంకితాత్ముఁడా యనుట. త్రిలోకకంటకుఁడవు=మూఁడులోకములకును బాధకుఁడవు, విరోధివి. కానన్ = కావున, చలము = మత్సరము, ఒప్పన్=అమరునట్లు, రసాతలసీమకున్ = పాతాళప్రదేశమునకు, ఒక పెనుఁబాపఱేఁడు=ఒక్క పెద్దసర్పరాజును—రాహువు, భూతధాత్రికిన్=భూలోకమునకు, చకోరకములు = వెన్నెలపులుఁగులును, దివికిన్ = స్వర్గలోకమునకును, సురలు = దేవతలును, పగదీఱునట్లుగాన్ = మూఁడులోకములవారికిని గలవిరోధము తీఱిపోవునటుల, మొకమొకపాటుతోడన్ = తృష్ణతో, గర్వ

ముతో, నీయొడలు = నీశరీరమును, నజ్జుగఁజేసి = నులినులిచేసి-నలఁగఁగొట్టి, నినుక్, మ్రింగకపోరు = మ్రింగనే మ్రింగుదురు.

చంద్రుని దేవతలు భుజింతు రనుటకు:—

శ్లో."పర్యాయపీతస్య సురైర్హిమాంశోః కలాక్షయశ్శ్లాఘ్యతరో౽భివృద్ధేః." రఘు.

శ్లో."భక్ష్యార్థం సర్వదేవానాం సోమః సృష్టస్స్వయంభువా,
త్రయశ్చ త్రిసహస్రాశ్చ దేవా స్సోమం పిబంతి యే." దేవీపురాణము.

చకోరములు వెన్నెలఁ దిను ననుట కవిసమయసిద్ధము.

శ్లో."జ్యోత్స్నా పేయా చకోరైర్జలధరసమయే మానసం యాంతి హంసాః
ఇత్యాద్యన్యస్య మర్థ్యత్ కవిసమయగతం సత్కవీనాం ప్రబంధే."
(సాహిత్యదర్పణము.)

తా. చంద్రా! నీవు ముల్లోకములకును బాధకుఁడవు కావున నీమచ్చ ణడఁగించుటకై పాతాళలోకమున నొకసర్పరాజును (రాహువు), భూలోకమున వెన్నెలపులుఁగులును, స్వర్గలోకమున దేవతలును నీయొడలు నజ్జునజ్జుగఁ జేసి మ్రింగుచుందురు. రాహువు పర్వముల గ్రసించుటయు, చకోరములు కిరణము లాహరించుటయు, వేల్పులు కళలను హరించుటయు నెఱుంగునది. ఉత్ప్రేక్షాలంకారము.

క. వాతాపివలన నెఱిఁగితొ
శీతకిరణ కడుపుఁ జొచ్చి జీర్ణింపని యా
రీతి నినుఁ దినియు నాయువు
చేత సురల్ చెడరుగాక చెఱుపవె వారిన్. 39

టీ. శీతకిరణ = చంద్రుఁడా, కడుపుచొచ్చి = కడుపులోఁ బ్రవేశించి, జీర్ణింపని యారీతిక్=అఱుగకయుండు నీవిధమును, వాతాపివలనక్ = వాతాపిరాక్షసునివలన, ఎఱిఁగితొ = తెలిసికొంటివా యేమి, (ఈనీతిక్ = ఈన్యాయమును పా.) నినుక్=నిన్ను, తినియుఁక్ = భుజించియు, ఆయువు చేతక్ = ఆయుష్యముగలవా రగుటచేత (చావులేనివా రగుటచే), చెడరు

గాక=చెడరుగాని, (లేనిచో) వారిక్=నశించువారైనయెడల నాదేవతలను గూడ, చెఱుపవే=చంపవా. నీవు నిశాచరుఁడవు. వాతాపి నిశాచరుఁడు గాన మీరువు రొకతెగవారు. కానసే యాతనివద్ద నీజీర్ణముగానివిద్య నభ్యసింపఁగలిగితివి. శీతకిరణ యనుటచేఁ జలిదియన్నమువలె నీవు జీర్ణముగా కుంటివి యనుభావ మూహ్యము. సుర లనక సుర లనుటకు సురశబ్దము నిత్యముగా స్త్రీసమం బని బాలవ్యాకరణము. "చంద్రమా జాయతే పునః నవోనవో భవతి జాయమానః...ప్రచంద్రమాః" ఇత్యాదులచేఁ జంద్రుఁడు మాటిమాటికిఁ బుట్టి వృద్ధినొందుచుండు నని తెలిసికొననగును.

తా. జీర్ణింపక మఱల వెడలి వచ్చు నీరీతిని వాతాపిరాక్షసునియొద్ద నేర్చుకొంటివా యేమి? దేవతలు చావులేనివా రగుటచే నిటుఁ దినియుఁ జావరైరి గాని లేనిచో నశింపఁజేయవా? (వాతాపి యనురాక్షసుఁడు మేఁకయై మునివేషధారి యగువానితమ్ముఁ డిల్వలునిచే నతిథు లగుమునులకు మాంసభోజనమునకు తాను వండిపెట్టఁబడుటయుఁ వారామాంసము భుజించినతోడన కడుపుఁ జించుకొని స్వస్వరూపముతో బయల్వెడలి వచ్చినయామునులను భక్షించుటయుఁ బురాణప్రసిద్ధము.)

తే. త్రిపురసంహార మొనరించునప్పుడు హరుఁడు
బండికల్లుగ నీమేను గండి చేసె
నదియు నెలవాఱె తెగటాఱ వైతి చంద్ర
యకట! రోహిణియెడ నపథ్యమునఁ జేసి. 40

టీ చంద్ర! హరుఁడు = శివుఁడు, త్రిపురసంహారము = రాక్షసుల మూఁడుపురములయొక్కయు వినాశమును, ఒనరించునప్పుడు=చేయునపుడు, బండికల్లుగన్=రథచక్రముగా, నీమేను=నీశరీరమును, గండిచేసెన్ = తొలఁచి రంధ్రముచేసెను. అదియున్ = ఆరంధ్రపుగాయమును, నెలవాఱి = నెల వేసి, రోహిణియెడన్=ప్రియసతియగు రోహిణివిషయమున, అపథ్యమునన్

చేసి=(సంసర్గమును) అపథ్యమువలన (దోషించి), తెగటాఱవైతి = చావవైతివి. అయ్యో=అక్కటా (పా. అపథ్యంబు గలిగి) చంద్రునకుఁ దక్కిన గ్రహాదులకంటె రోహిణి మిగులఁ బ్రియమగుభార్య గాన రోహిణీసంగమము చెప్పఁబడెను.

శ్లో. "హేరోహిణి త్వమసి రాత్రిచరస్య భార్యా." (శృంగారతిలకము.)

తా. చంద్రా! శివుఁడు త్రిపురసంహారము చేయునాఁడు నీశరీరమును బండిచక్రముగఁ జేసికొని గండి పొడిచెను. ఆగండి నెలవేసి రోహిణీసమాగమమువలన దోషించి చావనైనఁ జావకపోతివిగదా! మేము నీచే హింస లొందవలసిన యోగ ముండుటచేతనే నీవు బ్రదికితివి.

తే. పాలఁ బుట్టినమాత్రాన మేలిగుణము
నేఁడు నీ కేల గల్గునో నీరజారి
నీటఁ బుట్టినవాఁడు కాఁడోటు వహ్ని
గాల్చుచున్నాఁడు జగమెల్లఁ గరుణ లేక. 41

టీ. ఓనీరజారి = చంద్రా! పాలన్ = (పాలసముద్రమం దనుట.) క్షీరమునందు, పుట్టినమాత్రానన్ = జననము నొందినంతమాత్రముచేతనే, నేఁడు=ఈదినము, మేలిగుణము = ఉత్తమభావము, నీకున్, ఏల కల్గున్ = ఏవిధముగాఁ గలుగఁగలదు? మంచిగుణములుగలుగుటకు మంచితావునఁ బుట్టుట యెన్నఁటికిఁ గారణము కాఁజాలదు. ఎటులన, నీటన్ = జలమున, పుట్టినవాఁడు కాఁడోటు=పుట్టినవాఁడు కాఁడాయేమి? వహ్ని=అగ్ని, జగమెల్లన్ = లోకమంతయుం, కరుణలేక = దయలేక, కాల్చుచున్నాఁడు = దహించుచున్నాఁడు. నీరజారి యను సంబోధనముచే నీతోఁబుట్టువులగు నీరజములకే పగవాఁడ వగు నీవు పుట్టువొకచోటనేగల యచ్చరలయెడఁ గనికరింతువా యని స్వారస్యము.

తా. పిటఁ బుట్టి యగ్నిహోత్రుఁడు జగమెల్లఁ గాల్చుచున్నాఁడు. పాలఁ బుట్టినమాత్రాననే నీకుమాత్రము మంచిగుణము కల్గునా యేమి? ప్రతివస్తూపమాలంకారము.

క. గోవధము సేయు తురకల
దైవంబవు నీవు మొదలఁ దక్కక పాంథ
స్త్రీవధము సేయ రోయుదె
నీవర్తన మేమి చెప్ప నీరజవైరీ. 42

టీ. నీరజవైరీ=చంద్రా! నీవు, మొదలన్ = మొదలనే, గోవధము = గోవులహింసను, చేయుతురకలదైవంబవు = చేయునట్టితురకలకు దేవుఁడవు; (తురుష్కులు చంద్రోదయమును జూచికాని నమాజు మొదలగునవి చేయరు.) తక్కక = మానక, పాంథస్త్రీవధము = విరహిణీవధము, చేయన్ = చేయుటకు, రోయుదె = రోఁతపడుదువా? నీవర్తనము = నీనడువడి, ఏమిచెప్పన్ = ఇంక నే మనఁగవచ్చును?

తా. చంద్రా! తొల్తనే నీవు గోవులం జంపి తినుతురకలకు దైవమవు. ఇట్టి నీ వింక విరహిణీస్త్రీలను జంపుట కేవగించుకొందువా! నీ నడువడి నేమనవచ్చు? భక్తులచే గోవధఁ జేయించు మహానుభావుఁడ వగు నీవు పంచ మహాపాతకములఁ జేయుటలో వెనుకాడుదువా? అందు విరహిణీస్త్రీవధము నీకు మఱియుఁ జాలకనకదా! అర్థాపత్త్యలంకారము.

క. విడువక తలపయిఁ గొన్నా
ళ్లిడి చూచి కళంకి వగుట యెఱిఁగి మహేశుం
డుడుకుచు దక్షాధ్వరమున
నడుగునఁ బడవైచె దాన నడఁగవు చంద్రా. 43

టీ. చంద్రా! ఓచందమామా! (నిన్ను) మహేశుఁడు = శివుఁడు, విడువక = మానక, తలపయిన్ = తలమీఁద నలంకారముగా, కొన్నాళ్లిడి =

కొన్నిదినములు, (నీగుణ మెఱుంగరానియంతవఱకు) ఇడి = ఉంచుకొని, చూచి, కళంకివి=కళంకముగలవాఁడవు—అపవాదము గలవాఁడవు, అగుట = ఐయుండుట, ఎఱిఁగి = తెలిసికొని, ఉడుకుచున్ = కోపించుచు, దక్షాధ్వరమునన్ = దక్షునియజ్ఞమున, అడుగునన్ = కాలి క్రింద, (వీరభద్రాకృతిగలవాఁడై), పడవైచెన్ = పడవైచి త్రొక్కెను. దానన్ = ఆకాలి క్రిందఁబడి చెందిన నలుగుడుచేనైనను, అడఁగవు = నశింపవైతివి, చచ్చినవాఁడవు కాకపోతివి!

తా. చంద్రా! శివుఁడు నిన్నుఁ గొన్నాళ్లు తలపైఁ దాల్చి చూచి నీ కళంకము నెఱిఁగి దక్షయజ్ఞమున వీరభద్రమూర్తియై కాలి క్రింద నలుగఁద్రొక్కెను. అప్పుడును జావవైతివి గదరా! విశేషోక్త్యలంకారము.

క. గాండీవము నీచేతిది
పాండవునిన్ జేరఁబట్టి బ్రతికితి మా వి
ల్లుండిన నేఁడు నిశాచర
చెండవె యల్లునికిఁ దోడు శితభల్లములన్. 44

టీ. నిశాచర=రాత్రులయందుఁ జరించు నోరాక్షసుఁడా! చంద్రుఁడా! నీచేతిది = నీచేతిలోనుండెడిది, గాండీవము=గాండీవ మనువిల్లు, పాండవునిన్ = అర్జునుని, చేరఁబట్టి = చేరుటచేతనే, బ్రతికితిమి = జీవించియున్నారము, ఆవిల్లు = ఆగాండీవధనుస్సు, ఉండినన్ = (నీచేతనే) ఉన్నయెడల, నేఁడు = ఈదినము-ఇప్పుడు, ఈవిరహావస్థయందు, అల్లునికిన్ = మేనల్లుఁడగు మన్మథునికి, తోడు = సహాయముగా, శితభల్లములన్ = వాఁడిములుకులచే, చెండవె = ఖండింపక యూరకుందువా? ఖండించితీరెదవు.

పూలములుకులతోడను జెఱకువింటితోడను నీయల్లుఁడే ప్రాణములు తీయుచుండ నంతకు గొప్పవాఁడవును మామవగునీవు గాండీవమె యున్నచో వాఁడిబాణము లేయుటలో నాశ్చర్య మేమున్నది? నీవు నిశాచరుఁడవుగాన నెపుడో చంపెడివాఁడవు.

తా. ఓరి నిశాచరుఁడా! మున్ను నీచేతనున్న గాండీవ మాయర్జునునిచేఁ జిక్కెఁ గావున ప్రతికూలిమిగాఁగలవు. అట్లుకాక యావిల్లు నీచేతనే యుండినచో మేకల్గునట్టుఁ దోఁచుగా వాఁడిములుకు లేసి మమ్ముఁ జెండాడవా! ఉత్ప్రేక్షాలంకారము.

వ. అని పలికి యక్కలికి తేనియలొలుకు పూములుకుల జళుకుఁ
బుట్టించు నించువిలుతు నుద్దేశించి. 45

టీ. అనిపలికి=అని వాపోయి(ఇట్లు చంద్రుని నిందించి,) అక్కలికి=ఆస్త్రీ, వరూథిని, తేనియలొలుకుపూములుకులన్ = తేనెలు చిందుపువ్వుబాణము లచే, (ఇవి విషముపూసిన ములుకులవలె నయ్యె నని వ్యంజితము) జళుకు= భయమును, పుట్టించు = కలుగఁజేయు, ఇంచువిలుతున్ = మన్మథుని, చెఱకువింటివానిని, ఉద్దేశించి = గుఱించి.

చ. తొడిఁబడఁ బాఱి పైకుఱికి ధూర్జటి కంటికడిందిమంటలో
నడఁపొడ గానరాక తెగటాఱియుఁ గాలినయట్టిమ్రోడవై
వడి రతిలోచనాంబువులవాన నిగిర్చితె పాంథబాధకై
మడియ కనంగ యవ్వెలఁదిమంగళసూత్రమహత్త్వ మెట్టిదో.

టీ. అనంగ=శరీరములేనివాఁడా! మన్మథుఁడా! తొడిఁబడన్=తత్తఱ పడఁగా, పాఱి=పర్వెత్తి, పైన్ = (శివునిమీఁదికి) ఉఱికి, ధూర్జ...మంట లోన్=ధూర్జటి = శివునియొక్క, కంటి, కడిందిమంటలోన్ = తీవ్రాగ్నిలో, అడఁపొడగానరాక=ఉన్నయునికియే కన్పడకుండునట్లు, తెగటాఱియున్ = నశించియు, కాలినయట్టి మ్రోడవై వడిన్ = (కారుచిచ్చుచే) మాడిపోయిన వృక్షమువలె, మడియక=చావక, రతి...వానన్=రతి యొక్క, లోచనాంబువుల = కన్నీళ్లయొక్క, వానన్ = వర్షముచే, దుఃఖాతిశయముచే వాన చినుకులవలె నెడతెగకుండ రాలుచున్నకన్నీటిచే, పాంథబాధకై=విరహుల హింసకొఱకై, నిగిర్చితె=చిగిర్చితివా, అవ్వెలఁది...మహత్త్వము=అవ్వెలఁది =

ఆరతియొక్క, మంగళసూత్రమహత్త్వము=తాలిబొట్టుయొక్క సామర్థ్యము, ఎట్టిదో = ఎంత యద్భుతమైనదో గదా! శివలోచనాగ్నిచే మన్మథుఁడు బూది యయ్యెను. రతి విలపింపఁగా శివుఁ డనుగ్రహించి యనంగుఁడుగానుండునటుల వరమును బ్రసాదించెను. కాన మన్మథుఁ డనంగుఁడై యుండఁగలుగుట రతి కన్నీటియొక్కయు మంగళసూత్రముయొక్కయుఁ బలువవలన.

తా. మన్మథా! శివుని కంటిమంటలో రూపఱియు, కాలిన మోడు వలెఁ బావక రతియొక్క కన్నీటి వానచేఁ దిరిగి మాఱొంట్లు హింసించుటకై చిగిర్చితివా? ఆమె మంగళసూత్ర మహత్త్వ మెట్టిదో గదా! శివునికంటి మంటను మన్మథుఁడు భస్మము కాఁగాఁ బిదప రతివిలాపము నాలించి శివుఁ డామెకు మన్మథునకుఁ జావులేనట్లు వరమిచ్చె ననియుఁ బురాణకథ. అలం. విషమము, ఉత్ప్రేక్ష, ఉపమ, హేతువులు.

శా. సాహంకారత శంకరుం డలిగి నేత్రాగ్నిన్ బయిన్ బంపినన్
స్వాహాకాముకుఁడౌటనిన్నతఁడు గావంబోలు మోమోడిసం
దేహంబేని రతీశ నీవు మగుడన్ దేహంబుతో నుండు టె
ట్లోహో! దైవము దోసకారులకె తోడై వచ్చు నెప్పట్టునన్.

టీ. రతీశ = మన్మథా! సాహంకారతన్ = గర్వముతోఁగూడి యుండుటచేత, నీవు గర్వించినవాఁడ వగుటచేత, శంకరుండు = శివుఁడు, అలిగి = కోపించి, నేత్రాగ్నిన్ = కంటిమంటను, పయిన్ పంపినన్ = నీమీఁదికిఁ బంపఁగా, అతఁడు = ఆ ప్రయోగింపఁబడిన యగ్నిహోత్రుఁడు, స్వాహాకాముకుఁడు = స్వాహాదేవిని గామించినవాఁడు, ఔటన్ = అగుటచే, మోమోడి = కామమును గలిగించు నీకు నపకృతిఁ జేయలేక మొగ మోటపడి, కావంబోలున్ = కాపాడియుండవచ్చును. సందేహంబువినిన్ = (ఈవిషయమున) సందియ మయినపక్షమున, నీవు, మగుడన్ = తిరిగి, దేహంబుతోన్ = శరీరముతో, ఉండుటెట్లు = ఉండుట యెట్లుసిద్ధించును?

తా. ఓరి నిశాచరుఁడా! మున్ను నీచేనున్న గాండీవ మాయర్జునునిచేఁ జిక్కెఁ గావున ప్రతికిలిమిగా నలయుము. అట్లుకాక యావిల్లు నీచేతనే యుండెనా మేకల్లునకుఁ దోఁచుగా వాఁడిములుకు లేసి మమ్ముఁ జెండాడవా! ఉత్ప్రేక్షాలంకారము.

క. అని పలికి యక్కలికి తేనియలోలుకు పూములుకుల జళుకుఁ
బుట్టించు నించువిలుకు నుద్దేశించి. 45

టీ. అనిపలికి=అని వాకొని(ఇట్లు చంద్రుని నిందించి,) అక్కలికి=ఆస్త్రీ, వరూథిని, తేనియలోలుకుపూములుకులన్ = తేనెలు చిందుపుష్పబాణములచే, (ఇవి విషముపూసిన ములుకులవలె నయ్యె నని వ్యంజితము) జళుకు=భయమును, పుట్టించు = కలుగఁజేయు, ఇంచువిలుతున్ = మన్మథుని, చెఱకువింటివానిని, ఉద్దేశించి = గుఱించి.

చ. తొడిఁబడఁ బాఱి పైకుఱికి ధూర్జటి కంటికడిందిమంటలో
నడపొడ గానరాక తెగటాఱియుఁ గాలినయట్టిమ్రోడుకై
వడి రతిలోచనాంబువులవాన నిగిర్చితె పాంథబాధకై
మడియ కనంగ యవ్వెలఁదిమంగళసూత్రమహత్త్వ మెట్టిదో.

టీ. అనంగ=శరీరములేనివాఁడా! మన్మథుఁడా! తొడిఁబడన్=తత్తఱపడఁగా, పాఱి=పర్వెత్తి, పైన్ = (శివునిమీఁదికి) ఉఱికి, ధూర్జ...మంటలోన్-ధూర్జటి = శివునియొక్క, కంటి, కడిందిమంటలోన్ = తీవ్రాగ్నిలో, అడపొడగానరాక=ఉన్నయునికియే కన్పడకుండునట్లు, తెగటాఱియున్ = నశించియు, కాలినయట్టి మ్రోడుకైవడిన్ = (కారుచిచ్చుచే) మాడిపోయిన వృక్షమువలె, మడియక=చావక, రతి...వానన్-రతి యొక్క, లోచనాంబువుల = కన్నీళ్లయొక్క, వానన్ = వర్షముచే, దుఃఖాతిశయముచే వానచినుకులవలె నెడతెగకుండ రాలుచున్న కన్నీటిచే, పాంథబాధకై=విరహుల హింసకొఱకై, ఇగిర్చితె=చిగిర్చితివా, అవ్వెలఁది...మహత్త్వము-అవ్వెలఁది =

ఆరతియొక్క, మంగళసూత్రమహత్త్వము=తాలిబొట్టుయొక్క సామర్థ్యము, ఎట్టిదో = ఎంతయద్భుతమైనదో గదా! శివలోచనాగ్నిచే మన్మథుఁడు బూదియయ్యెను. రతి విలపింపఁగా శివుఁ డనుగ్రహించి యనంగుఁడుగానుండునటుల వరమును బ్రసాదించెను. కాన మన్మథుఁ డనంగుఁడై యుండఁగలుగుట రతి కన్నీటియొక్కయుం మంగళసూత్రముయొక్కయుఁ జలువవలన.

తా. మన్మథా! శివుని కంటిమంటలో రూపఱియుం, కాలిన మోఁడు వలెఁ జావక రతియొక్క కన్నీటి వానచేఁ దిరిగి పూబోంట్ల హింసించుటకై చిగిర్చితివా? ఆమె మంగళసూత్ర మహత్త్వ మెట్టిదో గదా! శివునికంటి మంటను మన్మథుఁడు భస్మము కాఁగాఁ బిదప రతివిలాపము నాలించి శివుఁ డామెకు మన్మథునకుఁ జావులేనట్లు వరమిచ్చె ననియుఁ బురాణకథ. అలం. విషమము, ఉత్ప్రేక్ష, ఉపమ, హేతువులు.

శా. సాహంకారత శంకరుం డలిగి నేత్రాగ్నిన్ బయిన్ బంపినన్
స్వాహాకాముకుఁడౌటనిన్న తఁడు గావంబోలు మోహోఢిసం
దేహంబేని రతీశ నీవు మగుడన్ దేహంబుతో నుండు టె
ట్లాహా! దైవము దోసకారులకె తోడై వచ్చు నెప్పట్టునన్.

టీ. రతీశ = మన్మథా! సాహంకారతన్ = గర్వముతోఁగూడియుండుటచేత, నీవు గర్వించినవాఁడవగుటచేత, శంకరుండు = శివుఁడు, అలిగి = కోపించి, నేత్రాగ్నిన్ = కంటిమంటను, పయిన్ పంపినన్ = నీమీఁదికిఁ బంపఁగా, అతఁడు = ఆప్రయోగింపఁబడిన యగ్నిహోత్రుఁడు, స్వాహాకాముకుఁడు = స్వాహాదేవిని గామించినవాఁడు, ఔటన్ = అగుటచే, మోహోఢి = కామమును గలిగించు నీకు నపకృతిఁ జేయలేక మొఁగమోటపడి, కావంబోలున్ = కాపాడియుండవచ్చును. సందేహంబేనిన్ = (ఈవిషయమున) సందియ మయినపక్షమున, నీవు, మగుడన్ = తిరిగి, దేహంబుతోన్ = శరీరముతో, ఉండుటెట్లు = ఉండుట యెటులసిద్ధించును?

దైవము = దేవుఁడు, దోసకారులకే = పాపపుఁబను లొనర్చువారికే, ఎప్పట్టునన్ = ఎప్పుడును, తోడైవచ్చున్ = సాయమైవచ్చును. ఆహా = ఇది యాశ్చర్యము.

మన్మథుఁడు ఇంద్రుఁడు మొదలగువారిప్రేరణచేతనేగాక యహంకారముచేతఁ గూడ శివునిపైకి విజృంభించెను. మన్మథుఁడు సాహంకారి యనుట కతనివాక్యములు.

శ్లో. "ప్రసీద విశ్రామ్యతు వీర వజ్రం శరైర్మదీయైః కతమః సురారిః,
బిభేతు మోఘీకృత బాహువీర్యః స్త్రీభ్యోఽపి కోపస్ఫురితాధరాభ్యః.

శ్లో. తవ ప్రసాదాత్ కుసుమాయుధోఽపి సహాయమేకం మధుమేవలబ్ధ్వా,
కుర్యాం హరస్యాపి పినాకపాణేర్ధైర్యచ్యుతిం కేమమధన్వినోఽన్యే."
(చూ. కుమార సం. తృ. స.)

తా. మన్మథా! ఎదిరి నెఱుఁగక వర్తించు నీగర్వమునకు శంకరుం డాగ్రహించి నీపైకి నేత్రాగ్నిని బ్రయోగింపఁగా నాయగ్నిహోత్రుఁడు స్వాహాకాముకుఁ డౌటచే మొగమోడి నిన్నుఁ జంపఁ డయ్యెను. కానిచో నీవు తిరిగియుం దేహముతో నుండు టెట్లు? ఆహా! దైవము సైతము పాపాత్ములకే తోడగుచుండును గదా? అర్థాంతరన్యాసాలంకారము.

చ. జడ నొకయింత లేని నెఱచక్కఁదనంబుల నెల్లఁ గూర్పఁగాఁ
బొడ వయినట్టి ధన్యుఁడవు భోగివి పూవిలుకాఁడ విట్టి నీ
వెడపక నిష్ఠురత్వమున కెట్లలవాటుగఁ జేసి తక్కటా!
పడఁతులమీఁద నేయ రతిపయ్యెదకుం దనువైన చేతులన్.

టీ. జడను = మాంద్యము, ఒకయింత = ఇంచుకైనను, లేని, నెఱ చక్కఁదనంబులనెల్లన్ = నిండుసౌందర్యములనన్నిటిని, కూర్పఁగాన్ = రాశి చేయఁగా, పొడవు = ఆకారముగా, అయినట్టిధన్యుఁడవు = ఏర్పడిన కృతార్థుఁడవు. మిగులఁ జక్కఁదనముగలిగి లోకోత్తరుఁడవై వర్తించువాఁడవు.

భోగివి=భోగముల ననుభవించువాఁడవు, పూవిలుకాఁడవు = పూవులవిల్లుగాఁ గలవాఁడవు. ఇట్టినీవు = ఇట్టిమృదులక్షణములుగలవాఁడవగు నీవు, రతిపయ్యెదకున్ = రతీదేవిపైఁటకు, ననుపు=ప్రియము, ఐనచేతులన్ = అగునట్టిచేతులతో, ఎడపక=ఎడతెగక, పడఁతులమీఁదన్ = స్త్రీలపై, ఏయన్ = ప్రయోగించుపట్లు బాణప్రయోగము చేయునంతటి, నిష్ఠురత్వమునకున్ = కాఠిన్యమునకు, ఎట్లు, అలవాటుగన్ = అభ్యాసముగా, చేసితి=కావించితివి, అక్కట=అయ్యో!

మన్మథుఁడు చక్కనివా రందఱికంటెను మిగులఁ జక్కనివాఁడు. రతీదేవి ప్రలాపించుచు నీయభిప్రాయమునె చెప్పెను.

శ్లో. "ఉపమానమభూద్విలాసినాం కరణం యత్తవ కాన్తిమత్తయా,
తదిదం గతమీదృశీం దశాం న విదీర్యే కఠినాః ఖలు స్త్రియః."
(కుమార. చతు.)

తా. మన్మథా! నీవు లోకమునందలి నిండుచక్కఁదనముల కెల్లఁ బ్రోవుచేసి యేర్పఱుపఁబడినట్టున్నసౌందర్యము గలవాఁడవు, మిగుల భోగపురుషుఁడవు. మృదులములైనపూలు విల్లుగాఁ దాల్చువాఁడవు. ఇట్టి నీవు రతీదేవియొక్క, నును పైఁట నంటఁదగిన యెలచేతులను విరహిణులపై బాణములు ప్రయోగించుపాటి కఱకుఁదనమున కెట్లలవాటు చేసితివి? విషమాలంకారము.

తే. అనుచు నిందించి వలవంత యినుమడింప
నవ్వరారోహ విదళితహల్లకముల
కమ్మపుప్పొడి పైఁ దుమారమ్ము రేఁచు
మలయమంథరపవనుపై నలుక వొడమి. 49

టీ. అనుచున్ = ఇటులని, నిందించి = (మన్మథుని) దూషించి, వలవంత = మదనతాపము, ఇనుమడింపన్ = రెట్టింపఁగా, అవ్వరారోహ = (శోభిపిఱుఁదులుగల) ఆస్త్రీ, విద...దుమారమ్ము - విదళిత = విరియఁ

చేయఁబడిన, హల్లకముల = ఎఱ్ఱగలువలయొక్క, కమ్మపుఁబుప్పొడి = కమ్మని వాసన గలపుష్పపరాగముయొక్క, పైఁదుమారమ్ము = మీఁదిధూళిని, రేఁచు ...తమపైన్ - రేఁచు = తనపైకి రేఁగించు, మలయమంథరపవనుపైన్ = మలయపర్వతము నుండివచ్చు మందమారుతముమీఁద, అలుక = కోపము, పొడమి=కలిగి, దీనికి ముందున్న వచనములోని "అని పలికి" యను దానితో నన్వయము.

మలయమంథరపవనమనుటచే మలయగిరినుండి గంధపుఁదావులతో వీచు నది యనియు, మంథరమనుటచే నెఱ్ఱగలువలపుప్పొడి బరువున మెల్లఁగా వీచుచున్న దనియుం భావము. ముందుపద్యములోని గంధవాహా యనుసంబోధనచే నీభావము సువ్యక్తము.

తా. అని యాపైనిఁ జెప్పినచొప్పున వరూథిని మన్మథుని నిందించి మన్మథతాపము హెచ్చఁగా నెఱ్ఱకలువలపుప్పొడితోఁ జల్లఁగా వీచుచున్న పరిమళముతోడి దక్షిణపుగాలి సోఁకులకుఁ దాళలేక యాగాలిపైఁ గోపించిన దై యని తా. అలం. కావ్యలింగము.

ఉ. అక్కట గంధవాహ తగవా హరిణాంకునిఁగూడిపాంథులన్
బొక్కఁగఁ జేయఁ బావకునిపొందొనరించి జగమ్ము లేర్చునీ
యక్కఱగామి మాన వది యట్టిద చుల్కనివృత్తిదుర్జనుం
డొక్కనిఁజొచ్చి క్రిందుపడు నొండ్లకుఁగీడొనరింపఁగల్గినన్. 50

టీ. అక్కట! గంధవాహా = (సుగంధమును మోయు) మారుతమా! హరిణాంకునిన్=చంద్రుని, కూడి, పాంథులన్ = విరహులను, బొక్కఁగఁ జేయన్ = పరితపింపఁజేయుట, తగవా = యుక్తమా, పావకునిపొందు = అగ్నిచెలిమి, ఒనరించి = చేసి, జగమ్ములు = లోకములు, ఏర్చునీయక్కఱ గామి=కాల్చునట్టి నీ (అగ్నివలన నేర్చుకొన్న) యాపనికిమాలినతనము, మానవు, అదియట్టిది అ = అగునది యట్లే, ఆదుష్టస్వభావ మెటువంటిదే.

దుర్జనుండు=దుష్టుఁ డయిన మనుష్యుఁడు, ఒండ్లకున్ = ఇతరులకు, కీడు = అపకారము, ఒనరింపన్ = చేయుటకు, కల్గినన్ = వీలు కలిగినయెడ, చుల్కనివృత్తిన్ = నీచవ్యాపారముచే, ఒక్కనిన్ = ఒండొకని, చొచ్చి = చేరి, క్రిందుపడున్=లోఁబడును. అల్ప వ్యాపారమునం దింకొకదుష్టునిఁ జేరి లోఁబడి యుండు ననుట.

గంధవాహుఁడు పావకుని పొందొనరించిన విధము—ఆగ్నేయ మూలకు నంటియుండునది దక్షిణదిశ. అటనే మలయపర్వతము గలదు. అట నుండి వీచుగాలియే మలయపవనము! ప్రక్కన నగ్ని గలఁడు గాన నగ్నితోఁ జెలిమి చేసె ననుటకుఁ గారణములు.

తా. అయ్యో! మారుతమా! ఇది నీకుఁ దగునా? చంద్రునితోఁ గూడి విరహులను మాడ్చుచుంటివే. అగ్నితోఁ గూడి లోకములఁ గాల్చు పనికి మాలినతనము మానవైతివి. అవు నదియుంతే. దుర్మార్గుఁ డొకరికి కీడుచేయు సందు గుదిరినప్పుడు వేఱొకదుష్టునిఁ గూడి యానీచకృత్యమున వానికి లోఁబడును గదా! అర్థాంతరన్యాసపరికరాలంకారములు.

క. నాలుకలు రెండు నిన్నుఁ
గ్రోలనె కల్పించె నలువ ఘోరాహికి న
న్నాలిగ్రహ మిప్పుడుఁ దెగఁ దినఁ
జాలద మృదుపవన విరహిజనదురితమునన్. 51

టీ. మృదుపవన = చల్లగాలీ! నలువ = చతుర్ముఖుఁ డగు బ్రహ్మ, ఘోరాహికిన్ = భయంకరమైన సర్పమునకు (జాత్యేకవచనము), నాలుకలు రెండు=రెండునాలుకలు (పాము ద్విరసన మను పేరు గలది) నిన్నుం గ్రోలనే = నిన్నుఁ దినుటకే, కల్పించెన్ = కలుగఁజేసెను. అన్నాలిగ్రహము=అకుల్పితపిశాచము, (పాము వేయేండ్లు జీవించినఁ బిశాచ మగు నందురు.) ఇప్పుడును = ఇప్పటికిని, విరహిజనదురితమునన్ = వియోగి

జనుల పాపము కారణమున, ప్రియుల నెడబాసి తపించు మాబోంట్లపాపము చేతనేమో! తెగఁదినఁజాలద = మొదలంటఁ దిననే లేకుండెను.

తా. మలయమారుతమా! బ్రహ్మ సర్పములకు రెండేసినాల్కలు నిన్ను మ్రింగుటకే కల్పించెను. అయినను మాబోఁటి విరహిజనులపాపముచే నిప్పటికిని నాసర్పములు నిన్ను నిశ్శేషముగా మ్రింగివేయనే లేకున్నవి. విశేషోక్త్యలంకారము.

వ. అని పలికి యక్కలకంఠకంఠి దీపించుతాపంబువెల్లున మూర్ఛిల్లినం దోడిపల్లవోష్ఠు లల్లనల్లన హల్లకంబుల హిమాంబుపూరంబులం గర్పూరపటీరకర్దమాసారంబులం జెంగావుల మృణాళభంగంబుల నంగంబులకుం జలువ పుట్టింప నెట్టకేలకుం దెలిసె నంతఁ బ్రభాతసమయం బగుటయు నొక్కపువ్వుఁబోఁడి వరూథినితో నిట్లనియె.

టీ. అని = ఇటులని, పలికి = మలయమారుతమును నిందఁగావించి, అక్కలకంఠకంఠి = కోయిలపల్కుఁగల యావరూథిని, దీపిం... వెల్లునన్ = దీపించు = ప్రజ్వలించు, తాపంబు = మన్మథతాపపు, వెల్లువన్ = అతిశయముచే, మూర్ఛిల్లినన్ = మూర్ఛనొందఁగా, చూచి = చూచినవారై, తోడిపల్లవోష్ఠులు = వరూథినితోఁ గూడియున్న చిగురాకువంటి పెదవిగల చెలిమికత్తెలు, అల్లనల్లన = మెల్ల మెల్లఁగా, హల్లకంబులన్ = కలువల చేతను, హిమాంబుపూరంబులన్ = పన్నీటివెల్లువలచేతను, కర్పూ...బులన్ = కర్పూరక = కర్పూరముచేర్చిన, పటీర = గంధముయొక్క, కర్దమ = పంకముయొక్క, ఆసారంబులన్ = ఎడతెగని చల్లుటచేతను, చెంగావులన్ = చెంగావివల్వలచేతను, మృణాళభంగంబులన్ = తామరతూండ్లతుంపుల చేతను, అంగంబులకున్ = అవయవములకు, చలువ = చల్లఁదనము, పుట్టింపన్ = కలుగఁజేయఁగా, శిశిరోపచారములు చేయఁగా ననుట. ఎట్ట

కేలకున్ = బహుప్రయత్నముచే, తెలిసెన్=(స్మృతి) తెలిసెను. అంతన్ = అప్పుడు, ప్రభాతసమయంబు = తెల్లవారు సమయము, అగుటయున్ = కాఁగా, ఒక్క పువ్వుఁబోఁడి=ఒకపూలవంటి మనోహరాంగకములుగల చెలువ వరూథినితోన్ = వరూథినినిగూర్చి, ఇట్లనియెన్ = ఇట్లు పలికెను.

చెంగావికిని ఉదయచ్చంద్రచంద్రికకును సామ్యము గలదు, చెంగావి యుదయచ్చంద్రికవలెఁ జల్లనైనది. చంద్రిక వేఁడిగ నుండును. చంద్రికవలె నించుకవెట్టగానుండు చెంగావి చల్లగా నుండును. విరహిణికిఁ జెంగావి తాపకారియనుటకు,—

దమయంతికిఁ జెలులు చేయు శిశిరోపచారభాగమునుండి దృష్టాంతము,

సీ. "వలిపెంపుఁజెంగావివలువ గప్పు చకోరి బిసకాండహారంబు పెట్టు హారిణి"

(శృం. నై. ఆ. ౨)

తా. ఇట్లు పలికి వరూథిని తాపము హెచ్చి మూర్ఛిల్లె. నెచ్చెలులు బహువిధోపచారములఁ జేసి తేర్చిరి. అంతఁ దెల్లవాఱువేళ యయ్యె. అప్పు డొకచెలి వరూథినితో నిట్లనియె.

ఉ. పాటన సేయమిన్ గురులు పైఁబడి శీర్ణపటీరపంకలా
లాటిక మై దరస్మితవిలాసపుఁజంద్రిక డొంకి వాడుటన్
దేటఁదొలంగి విన్ననగు నీ మొగమోయన మాసిచంద్రుఁడో
పాటలగంధి వ్రాలె నదె భానురుచిన్ దనకందు మీఱఁగన్.

టీ. ఓ పాటలగంధి = పాటలపుఁబూవులపరిమళముఁ బోలుపరిమళము గలదానా! పాటన సేయమిన్ = చక్కఁ బఱుపక పోవుటచే—దువ్వక పోవుటచేత, కురులు=వెండ్రుకలు, పైఁబడి=పైని గ్రమ్ముకొని, శీర్ణ...లాటికమై—శీర్ణ=చెదరిన, పటీరపంక=మంచిగందముచే నైన, లాలాటిక మై= పాపటబొట్టు కలదై, దర...చంద్రిక—దరస్మిత = చిఱునగవు యొక్క, విలాసపుఁజంద్రిక = వికాస

మసవెన్నెల, డొంకి=తగ్గి, వాడుటన్ = వాడిపోవుటచేత, తేట=ప్రసన్నత, తొలంగి=మాసి, విన్ననగు=చిన్నవోయిన, నీ మొగమో అనన్=నీముఖమే మొ యనునటుల - నీముఖమువలె, మాసి = కాంతితగ్గి, భానురుచిన్ = సూర్య కాంతిచే. తనకందు = తనకళంకము, మీఱఁగన్ = హెచ్చఁగా, అడ ప్రాలెన్ = అస్తమించెను.

కురులు మోమునందు జారిన వరూథినిముఖము కళంకముతో నున్న చంద్రబింబమును బోలియుండెను. ఆచంద్రుఁడు భానురుచిచేఁ గాంతిమాసిన చంద్రుఁడు. వరూథినిమోమునఁ జిఱునవ్వను గాంతి లేమిచే నదియుఁ గాంతి కోలుపోయిన చంద్రునివలె నున్నది. అద్దపుబిళ్లవలెఁ జంద్రుఁడు గానవచ్చు నటులు వరూథిని ముఖము మంచిగంద మంటఁగట్టిన పాపటబొట్టువలె నున్నదని భావము.

తా. ఓపాటలగంధీ! చిక్కులు దీర్చి దువ్వి చక్కఁబఱుపక పోవుటచేఁ జెదరి నీచెంద్రుకలు క్రమ్ముకొని మంచిగంద మంటి యట్టవలెఁ గట్టి పాపట బొట్టుచందమునఁ గానరాఁగా చిఱునగవుఁబొలుపు తగ్గి, వాడి చిన్నవోయి యున్న నీమొగమో యనునట్లు సూర్యునివెలుఁగుచేఁ దనకాంతి మాసి కళంక మెక్కువ కాఁగాఁ జంద్రుఁడు అస్తమించెను. ఉత్ప్రేక్షాలంకారము.

సీ. సకుటుంబముగ వీఁగి చరమశైలముఁ జేరు
  తుహినాంశుదుముదారుదొర యనంగ
సానీర మై వచ్చునలినబాంధవుఁడెక్కి
  యంబుపై దీపించు నద్ద మనఁగ
నరుణాగ్రనిబిడవాద్యములలోఁ గనుపట్టు
  సమయశాంఖికుచేతిశంఖ మనఁగ
నినుఁ డప్పు డజుఁ డౌట మునుమున్న పడివాగెఁ
  గొనివచ్చురాయంచకోదమ యనఁగ

తే. నుదయగిరిమీఁదఁ గోపురం బుండి నిగుడు
నహితరవిరశ్మిచే బద్ధుఁ డగుచుఁ దోడి
బలఁగమైనట్టిచుక్కలవలసత్రోవఁ
జూప నేతెంచె నన వేగుఁజుక్క వొడిచె. 54

టీ. సకటుంబముగన్=ఆలుబిడ్డలతో, పీఁగి = (సూర్యుఁడను) శత్రువకు భయపడిపాఱి, చరమశైలమున్ = పడమటికొండను, చేరు=చేరుటకుఁ బోవుచున్న (వలసపోవుచున్న) తుహి...దార - తుహినాంశు = చంద్రుని యొక్క, దుమాదారుదార = (రాజునకు వెనుక కాపుదలరై యుండెడు) సేనానాయకుఁడో, అనంగన్ = అనునట్టుగాను, నాసీరమై = సేనాముఖమై — దండునకుముందు నడచునదియై, వచ్చు=వచ్చుచున్న, నలినబాంధవు టెక్కియఁబుపైన్=సూర్యునిధ్వజము మీఁద, దీపించు నద్దము అనఁగన్= ప్రకాశించుఅద్దమేమో యనునట్లు, అరు...లలోన్-అరుణాగ్ర=సూర్యుని ముందఱ, నిబిడ=ఎడతెగని, వాద్యములలోన్ = భేరిమొదలగు వాద్యముల యందు, కనుపట్టు=కనఁబడుచున్న, సమయ...శంఖము-సమయ=కాల మను శాంఖిక = శంఖమూఁదువానియొక్క, చేతిశంఖము = చేతిలోనిశంఖమేమో, అనంగన్=అనునట్లు, ఇనుఁడు=సూర్యుఁడు, అప్పుడు = ఆకాలము నందు-ఉదయకాలమునందు, అజుఁ డౌటన్ = బ్రహ్మ యగుటచే, (సూర్యుఁడుదయమున బ్రహ్మ, మధ్యాహ్నమున రుద్రుఁడు, అస్తమానమున విష్ణువు నగు నని చెప్పఁబడును.) మునుమున్న = ముందుముందుగా, పడివాగెన్ = ఎక్కుటకు సిద్ధపఱుపఁబడినతీరున, కొనివచ్చు = ఎదటికిఁ దీసికొనివచ్చుచున్న, రాయంచకొదమ = చిఱుతప్రాయంపు రాజహంస, అనఁగన్, ఉదయగిరి మీఁదన్=తూరుపుకొండమీఁద, గోపురంబుండి=పగవారిని తెలిసికొనుటకొఱకు పొంచుండి, నిగుడు...రశ్మిచేన్ - నిగుడు = ముందునకుసాగు, అహిత = శత్రుఁడగు, రవి=సూర్యునియొక్క, రశ్మిచేన్=కిరణము లనుత్రాటిచే, బద్ధుఁ

దగుచున్ = కట్టఁబడినవాఁ డగుచు, తోడి=తనతోడిదగు, బలఁగము = ఆత్మజనము, ఐనట్టిచుక్కల = ఐనవనక్షత్రములయొక్క, వలసత్రోవన్ = విప్లవమునకు వెఱచి ప్రాణార్తులై యితరదేశములకు బ్రదుకఁబోవు త్రోవను, చూపన్ = చూపించుటకు, ఏతెంచెనో యనన్ = వచ్చెనేమో యనునటుల, వేగుఁజుక్క = తెల్లవారుచుక్క (శుక్రుఁడు), పొడిచెన్ = ఉదయించెను. ఉత్ప్రేక్షారూపకాలంకారములు.

మ. సకలాశాగతినర్మకోపవిరతిశ్రౌతక్రియారంభణా, త్మకవర్గత్ర
యికిన్ మదుచ్చరితశబ్దజ్ఞానమే మూలమిం, తకుఁ బోలన్ వినుఁ
డంచుఁ దెల్పుగతిఁ జెంతన్ గొండపైఁ బల్లెలన్, గృకవాకుల్
మొరసెన్ గృహోపరిఁ ద్రిభంగిన్ భుగ్నకంఠధ్వనిన్. 55

టీ. సక...త్రయికిన్ - సకలాశాగతి = (పనిపాటులకు జనులు) ఎల్లదిక్కులకుఁ బోవుట—జనులు స్వకార్యములు నిర్వర్తించుకొనుటకు నెవరి దారిని వారలు యథేచ్ఛముగాఁ బోవుట. నర్మకోపవిరతి = ప్రణయకోపము యొక్క చల్లారుట, స్త్రీపురుషులు పొలయలుకను మానుకొని రతులకు దొరకొనుట, శ్రౌతక్రియారంభణ = వేదచోదితములైనకర్మలఁ జఱుప నారంభించుట—వేదవిహితములగు స్నానసంధ్యాద్యనుష్ఠానములు వేళదాటనీయక నెఱవేర్చుట, ఆత్మక=(అనునీ) రూపమైన, వర్గత్రయికిన్ = త్రివర్గమునకు, (అర్థ, కామ, ధర్మ పురుషార్థములందుఁ బ్రవృత్తికి), మదుచ్చరితశబ్దజ్ఞానమే=నాచేఁబలుకఁబడిన పలుకుయొక్క యెఱుకయే—ధ్వని వినుటచేఁ గలిగిన మేలుకువయే, మూలము=ఆధారము, ఇంతకున్ = ఈవిషయమునకు, పోలన్=సరిగా, వినుఁడు = (లోకులారా) ఆలకింపుఁడు, అంచున్ = అని, తెల్పుగతిన్ = తెలియఁజేయువిధముగా, చెంతన్=సమీపమునందున్న, కొండపైపల్లెలన్ = కొండమీఁదిపల్లెలలో, గృహోపరి = ఇండ్లమీఁద, కృకవా

కుల్ = కోళ్లు, భుగ్నకంఠధ్వనిన్ = వంగినకంఠపుధ్వనితో, త్రిభంగిన్ = ముత్తెఱఁగుల, మొరసెన్ = కూసెన్.

ఏడేని పదిమంది యాలకింపవలసిన యంశముఁ జెప్పువాఁడు ఎత్తగు స్థలమునందుండి చెప్పినచో నలువురు తొలుత చూచి తఱువాత విన వీలుకలుగును. కాన కోళ్లు ఉన్నతస్థలమున నెక్కి త్రివర్గావశ్యకమును దెలుపుచున్నవి. కోడికూఁతయందున్న ఉవర్ణములు (కొకొక్కొరోకో యని హ్రస్వదీర్ఘప్లుత రూపములగు స్వరములు) మూఁడు మూఁడుపురుషార్థముల సూచించి నటులుండెను.

తా. ప్రజలు పనిపాటులకు నలుదెసలకై యరుగుట, దంపతులు ప్రణయకోపము నుజ్జగించుట, నైష్ఠికు లనుష్ఠానములకుఁ బూనుట యను నీ అర్థ, కామ, ధర్మపురుషార్థవ్యాపారములకు నాకూయుంకూఁతయే కారణము. తిన్నఁగా జనులారా! వినుఁడని తెల్పువిధమున నచ్చటి కొండపల్లెలలో నిండ్లపైనెక్కి గొంతు వంచి ముత్తెఱఁగు లగుకూఁతలను గోళ్లు కూసెను. అలం॰ ఉత్ప్రేక్షాస్వభావోక్తులు.

మ. ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁ డేతేరఁ దద్దీప్తి నం
జనసంబంధజబాంధవంబున రతిశ్రాంతాంగనానేత్రకో
ణనికాయంబుల డాఁచితద్ధవళిమన్ దాఁబూనెనో చొప్పుమా
ర్పనగా వెల్వెలఁబాఱె దీపకళికావ్రాతంబు శాతోదరీ. 56

టీ. శాతోదరీ = చిక్కనకడుపుగలదానా! (వరూథినీ), ఇనుఁడు = సూర్యుఁడు, అస్తాద్రికిన్ = పడమటికొండకు, పోవన్ = పోఁగా, దీపకళికావ్రాతంబు = దీపపుమొగ్గలసమూహము, తద్దీప్తిన్ = అతనికాంతిని, కొల్లగొని = దోఁచుకొని, నేఁడు = ఈదినమున, ఏతేరఁగాన్ = ఆసూర్యుఁడు మరల రాఁగా, చొప్పుమార్పన్ = ఉన్నవిధముమార్చుటకై, (తాను దొంగ యని గురుతింతు రేమో యని యున్నయునికి మఱుగుపఱచి తెలియకుండఁ జేయుటకు,) అంజనసంబంధజబాంధవంబునన్ = కాటుకసంబంధముచేఁ గల్గిన

చుట్టఱికముచే, రతి...నికాయంబులన్ - రతిశ్రాంత = సురతముచే బడలిన, అంగనా=స్త్రీలయొక్క, నేత్రకోణ=కనుగొనలయొక్క, నికాయంబులన్ = సమూహములందు, డాఁచి=దాఁచి, తద్ధవళిమన్ = వానితెల్లఁదనమును, తాన్ = తాను, పూనెనో = వహించెనో, *అనన్, వెల్వెలఁబాఱెన్ = తెల్లవోయెను.

సూర్యుఁ డస్తమించినపు డాతనికాంతి యగ్నిహోత్రుని జేరు ననుట ప్రసిద్ధము. సూర్యుఁ డస్తమింప దీపములు సూర్యకాంతిని గొల్లగొనె ననుటచే నగ్నియందు సూర్యకాంతి చేరుట సూచింపఁబడెను. సూర్యకాంతి రాత్రి అగ్నిని జేరు ననుటకు——

శ్లో. "రుచిధామ్ని భర్తరిభృశంవిమలాః పరలోకమభ్యుపగతేవివశుః,
జ్వలనంత్విషఃకథమివేతరథాసులభోఽన్యజన్మని స ఏవపతిః." (మాఘకావ్య.)

తా. వరూథినీ ! సూర్యుఁ డస్తగిరి కరుగఁగా దీపములు వాని ప్రకాశమును దొంగిలి వెలుంగుచు నేఁడు మఱల నాతఁడు రాఁగా నున్నరూపును మార్చుటకై కాటుకసంబంధముచేఁ దమకు మిత్త్రము లైనరతిశ్రాంత లగునంగనల కడకన్నులడగ్గఱ నీప్రకాశము డాఁచి వానితెలుపును తాము తాల్చెనో యనునట్లు దీపములు తెలతెలవాఱెను. రతిశ్రాంత లగునంగనల కనుఁగొన లెఱ్ఱవాఱె ననియు దీపములు కాంతి తగ్గి తెలతెలవాఱె ననియు భావము. ఉత్ప్రేక్షాలంకారము.

శా. వాలారుంగొనగోళ్ల నీవలసతన్ వాయించుచో నాటకున్
మేళం బైనవిపంచి నిన్నమొదలున్ నీవంటమింజేసి యా
యాలాపంబె యవేళఁ బల్కెడుఁ బ్రభాతాయాతవాతాహ
త్యాలోలత్తంత్రుల మేళవింపఁగదవే లోలాక్షి దేశాక్షికిన్.

టీ. లోలాక్షి=చలించు కన్నులుగలదానా ! నీవు అలసతన్=ప్రాల్మాలికచే, వాలారుంగొనగోళ్లన్=వాఁడియగు గోటికొనలచే, వాయించుచోన్,

నాటకున్ = నాటరాగమునకు, మేళంబు = స్వరస్థానములు సరికూర్పఁబడినది,- ఐనవిపంచి = అయినట్టి వీణ, నిన్న మొదలున్, నీవు, అంటమిన్ చేసి = తాఁకక పోవుటచే, ప్రభాతా...తంత్రులన్ - ప్రభాత = ప్రాతఃకాలమందు,- ఆయాత = వచ్చిన, వాత = గాలిచే, ఆహత = తాఁకఁబడినవై, ఆలోలత్ = మిగులఁ గదలుచున్న, తంత్రులన్ = తీగలచే, ఆయాలాపంబె = ఆ నాటరాగపు స్వరక్రమమునే, (నాటకు మేళము గావింపఁబడియుండుటచే మెట్లపై గాలి పోఁకి యిపుడుగూడ సమయవ్యతిరిక్తముగా నాటరాగమునే,) అవేళన్ = ఆసమయమున, పల్కెడున్ = పలుకుచున్నది. దేశాక్షికిన్ = దేశాక్షిరాగ మునకు, మేళవింపఁగదవే = స్వరస్థానములు కూర్చుమా. స్వభావోక్త్యలంకారము.

తా. ఓవరూథినీ! నీవు నిన్న మధ్యాహ్నకాలమునం దప్పటికిఁ దగినట్టు నాటరాగమునకు స్వరస్థానములు కుదిర్చి మీటుచున్నవీణ యది మొదలు నీవు దానిని ముట్టకుండుటచేత నిప్పుడును దంతులు గాలిచేఁ గదలఁగా నామేళము తోనే వాఁగుచున్నది. అది యీ యుదయకాలమునకుఁ బొసఁగదు గనుక నిప్పటికిఁదగిన దేశాక్షిరాగమున కనుకూలముగా స్వరస్థానములు కుదిర్చి, జతపఱుపుము. (ఇట్లనుటచేత మధ్యాహ్నకాలమునందుఁ బాడఁదగినది నాట రాగము. ప్రాతఃకాలమునందుఁ బాడఁదగినది దేశాక్షిరాగము అనుట తేఁట-పడుచున్నది.) స్వభావోక్తి.

చ. పలుకులు నేర్పువేళఁ గలభాషిణి నీ విటులుండఁ బంజరం
బుల నరగన్ను వెట్టి ముఖముల్ చరణాగ్రనఖాళి గోఁకు
చున్, నిలుగుచు నావులింపుచు వసీవిహగోత్కర మెట్లు
వల్కు నప్పలుకులె యట్టు లెత్తి విని పల్కెడు వింటివె
కీరశారికల్. 58

టీ. కలభాషిణి = అవ్యక్తమధురముగు పలుకులుగలదానా! వరూ-థినీ! పలుకులు = మాటలు, నేర్పువేళన్ = అభ్యసింపఁజేసెడు సమయము..

వంతు, నీవు, ఇటులుండఁగన్ = ఈవిధముగా నస్వస్థవైయుండుటచే, (పరాధీన హృదయముతోనుండి బుజ్జగింపక పోవుటచేత,) పంజరంబులన్ = పెంపుడు పక్షులకొఱకు ఏర్పాటుచేయఁబడిన గూండ్లయందు, కీరశారికల్ = చిలుకలు గోర్వంకలు, అరగన్ను వెట్టి = మూఁగన్నువైచి, సగము మూసి సగము తెఱచినటు లున్న కన్నులతో - నిదురచేఁ దూలుచు, చరణాగ్రనఖాళిన్ = కాలిగోటికొనలపంక్తులతో, గోఁకుచున్ = గోఁకికొనుచు, నిలుగుచున్ = ఒడలు విఱుచుచును, ఆవులించుచున్ = ఆవులింతలు విడచుచు, వనీవిహంగోత్కరము=అడవిపక్షులగుంపు, ఎట్లుపల్కున్ = ఏవిధముగాఁ గూయునో, అప్పలుకులె = ఆకూఁతలె, అఱ్ఱులెత్తి = మెడలు పైకెత్తుకొని, విని=ఆలకించి, పలికెడున్ = పలుకుచున్నవి, వింటివె = నీవు విన్నావా?

తా. వరూథినీ! చిలుకలకును గోర్వంకలకును నీవు వాడుక చొప్పున నిప్పుడు మాటలు నేర్పమిచేఁ బంజరములలోఁ నరగన్ను వైచుకొని గోళ్లతో మెడలు గోఁకికొనుచు, నావులించుచు నడవి పక్షులకూఁతలు విని వానినే మరలఁ గూయుచున్నవి, వినుచున్నావా? అడవిపక్షుల యఱపులకె మఱల యలవాటుపడిన యెడల నీకలభాషణములు వచ్చుట చాలకష్టము. స్వభావోక్తి భ్రాంతిమదలంకారములు.

మ. ఉరుసంధ్యాతపశోణచ్ఛృత్కలితమై యొప్పారు బ్రహ్మాండము
న్గరిడిన్ గాలపుహొంతకాఁడు చరమాగస్కంధముం జేర్చు
న్నిబ్బరపున్ సంగడమో యనన్ శశి డిగెన్ బ్రాగ్భూమిభృ
త్త్రైకతవే, తరబాహాగ్రపుసంగడం బనఁగ మార్తాండుం
డోఁచెన్ దివిన్. 59

టీ. ఉరు...కలితమై-ఉరు = అధికమైన, సంధ్యాతప = ప్రాతస్సంధ్యవేళఁగల్గు ప్రకాశమును, శోణచ్ఛృత్=ఎఱ్ఱపట్టితో, కలితమై = కూడినదై, ఒప్పారు=ఒప్పుచున్న, బ్రహ్మాండము, అన్ గరిడిన్ = అనునట్టి గరిడిసాలలో,

కాలపురుషాంతకాఁడు=కాల మను జెట్టికాఁడు, 'చరమాగస్కంధముక్'=పడమటికొండ యనుమూఁపున, చేర్చు...గడమో-చేర్చు=పెట్టుకొను, నిబ్బరపు=గట్టిదైన, సంగడమో=గుండో, అనక్=అనునటులు, (సాధనము చేయునపుడు జెట్టివాండ్రు బంతివలె గుండ్రముగా నుండు పెద్దశిలాఖండమునో లోహ వస్తువునో భుజములపై ద్రిప్పుదురు. దీని సంక్తోలా యని యందురు.) శశి = చంద్రుఁడు, డిగెన్ = దిగువకు వ్రాలెను. (అస్తమించెను) ప్రాగ్భూ... సంగడంబు - ప్రాగ్భూమిభృత్ = తూర్పుకొండ యను, కైతవ = మిషగల, ఇతరబాహాగ్రపు = రెండవభుజముమీఁది, సంగడంబు = గుండు, అనఁగన్ మార్తండుండు = సూర్యుఁడు, దివిన్ = ఆకసమున, తోఁచెన్.

జెట్టులు పోరుచోటు అభ్యాసము చేయుచోటు ఎఱ్ఱమట్టితో నించి యుందురు. రక్తపాతము జరిగినను తెలియకుంటకు, ఎఱుపురంగు ప్రతాపమును సూచించునది గాన ప్రతాపాతిశయమునకుఁ గూడ, గరిడి యెఱ్ఱని మట్టి పఱుపఁబడి రక్తవర్ణముతో నలరారు ననుటకు.—

తే. "బహువిరోధిమణిప్రభాపల్లవాగ్ర మల్లసంగ్రామఖురళికామండలాయ
మానసానాపరిష్కారమహితగాత్రి మనుజపతిపుత్రియాస్థానమునకువచ్చె."
(శృంగారనైష. ఆ. ౫.)

తా. ప్రాతస్సంధ్యారాగ మను నెఱ్ఱమట్టితో నెసఁగెడు బ్రహ్మాండ మను గరిడిసాలలోఁ గాల మను జెట్టి పడమటికొండ యనుమూఁపునఁ జేర్చుకొనుసంక్తోలా (ఇదియొక గరిడిసాధనము) యనునట్లు చంద్రుఁడు వ్రాలెను. తూర్పుకొండ యను రెండవ మూఁపుమీఁద దాల్చు సంక్తోలా యనునట్లు సూర్యుఁ డుదయించెను. రూపకోత్ప్రేక్షాపహ్నవములు, అలం.

చ. కరకరి గూఁటఁ గట్టి యుండఁగా మొఱవెట్టెడులీల బాలభా
స్కరకరకాండకందళవిఘట్టన నించుక వాయివిడ్డతా, మర
మొఱవెట్టిపెట్టి పలుమాఱును వాకిలి దాఁటి యాఁగుచున్

మొఱయ విపంచి మీటుగతి మ్రోసి యళుల్ వెడలెన్
గొలంకులన్. 60

టీ. కరకరిన్ = కఱకుఁదనముతో—క్రూరస్వభావముతో ననుట. గూఁటన్ = గూఁటిలో, కట్టియిడఁగాన్ = కొయ్యపెట్టినప్పుడు, మొఱ వెట్టెడులీలన్ = పక్షులు మొఱ్ఱోయని కూయునటుల, బాల...విఘట్టనన్ = బాలభాస్కర = బాలసూర్యుని యొక్క, కర=కిరణము లనెడు, కాండకం దళ = కత్తిపల్లయొక్క, విఘట్టనన్ = పోటుచే, ఇంచుక = కొంచెము, వాయివిడ్డతామరన్ = నోరువిచ్చిన తామరపూవునందు, ఇట జాత్యేకవచనము. మొఱవెట్టివెట్టి = దుఃఖముతో నఱచియఱచి, పలుమాఱును = మాటిమాటికి, వాకిలి = విడిసిన ద్వారమును, దాఁటి, ఆఁగుచున్ = నిలుచుచు, మొఱయన్ = మ్రోయునట్లు, విపంచిమీటుగతిన్ = వీణ మీటువిధమున, మ్రోసి=ఝుంకరించి, అళులు=తుమ్మెదలు, కొలంకులన్ = సరస్సులయందు, వెడలెన్=తామరపూవులనుండి బయలుదేరెను.

తుమ్మెదల యఱపు వీణమ్రోఁతలవలె నుండునని కవులు చెప్పుట ప్రసిద్ధము. చూడుఁడు. చంపూభారతము.

శ్లో॥ "అలాపకాలసమపల్లవితాంకవీణాసౌరభ్యపాతిమధుపారవసంకులస్య,
తంత్రీస్వనస్యసమితౌ తరుణీరవస్య జానాతియత్ర చతురోపిన తారతమ్యమ్."

తా. దయమాలినవాఁ డెవఁ డయిన గూఁటఁ గట్టిపెట్టి పొడువఁగాఁ బ్రాణభయముచేఁ గూటిలో నున్నపక్షులు విచారముతో రొద చేసెడువిధమున బాలభాస్కరుని కిరణములతాఁకుడుచేఁ గొంచెము ద్వార మేర్పడిన పద్మమునుండి తుమ్మెదలు వెలువడి యక్కడనే యిటునటుఁ దిరుగాడుచు, వీణ మీటువిధమున మ్రోయుచుండెను. స్వభావోక్త్యుపమాలంకారములు.

చ. అడరునవీనభానుకిరణానల మంటినఁ గూడుకొన్నపు, ప్పొడి
కొలుచెల్ల మోచికొని పోకొడి సంభ్రమ మొప్పఁ గంటివే

పడఁతి భవద్విహారవనపద్మసరఃకుముదాలయంబులన్, వెడలు
మిళిందబృందములు వీఁపుపిశంగిమకైతవంబునన్. 61

టీ. పడఁతి = వరూథినీ! భవ...యంబులన్ - భవత్ = నీయొక్క, విహారవన=శృంగారవనమునందలి, పద్మసరః=తమ్మిపూఁగొలఁకులందలి, కుముద=కల్వలను, ఆలయంబులన్ = ఇండ్లలోనుండి, వెడలు మిళిందబృందములు = బయలుదేరు తుమ్మెదల సమూహములు, వీఁపు పిశంగిమ కైతవంబునన్ = వీఁపుయొక్క పసిమి యనుమిషచే, అడరు...అనలము - అడరు = అతిశయించు, నవీనభాను = బాలభాస్కరుని, కిరణానలము = కిరణాగ్ని, అంటినన్ = అంటఁగా, కూడుకొన్న, పుష్పాడికొలుచు = పువ్వురాగమను ధాన్యము, ఎల్లన్ = అంతయు, సంభ్రమము = తొట్రుపాటు, ఒప్పన్ = ఒప్పఁగా, మోచికొని=ఎత్తుకొని, పోయెడిన్ = పోవుచున్నవి, కంటివే = చూచితివా? తుమ్మెదలు మేనంతయు నల్లఁగానుండి వీఁపుమాత్రము పచ్చఁగానుండును. ఆవసుపురంగుల తేంట్లు ఇండ్లకాపులు ధాన్యము . మోసికొను రైతుగ నుత్ప్రేక్షింపఁ బడెను. తుమ్మెదవీఁపులు పచ్చగా నుండు ననుటకు—

ఉ. "తుమ్మెదద్రిమ్మరీఁడు పయిఁదోఁచు పిశంగిమ పద్మినీనిశాం,
కమ్మదితాఁ బరాగపటిఁ గప్పి" (వసు-ఆశ్వా. 3-138)

తా. వరూథినీ! నీయుద్యానవనమున యందలి తమ్మికొలఁకులలో సూర్యకిరణములు ప్రసరింపఁగా నచటికల్వలలోని తేంట్లు వానిపుష్పాడియంటి పచ్చనైన వీఁపులతో వెల్వడిపోవుట, నిప్పంటుకొని తగులఁబడుచున్న యిండ్లలో నుండి నిల్వఁజేసి యుంచుకొన్న ధాన్యమును వీఁపులపై మోసికొని వెల్వడు సంసారులవలె నున్నవి చూచితివా? ప్రొద్దు క్రుంకఁగనే తమ్ములను వదలి రాత్రియంతయుఁ గలువపూలలో విహరించి కొంచె మాగిన నవి ముకుళించునేమో యని యందుఃజిక్కక వీఁపునఁ బరాగమంటుకొనఁ దుమ్మెదలు వెలికి వచ్చుచున్న వని భావము. అలం. ఉత్ప్రేక్షారూపకాపహ్నవములు.

చ. కోలకోలఁగూయుఁబైనొఱగుఁగుత్తుకఁగుత్తుకఁ జుట్టుఁబాఱు
చిల్వలక్రియఁ గానరాని గతులన్ మయిమైఁ బెనుచున్ జ
నించునశ్రు లఱుత నొత్తు సోలు నిలుచున్ విధిచాతురిఁ
గూడియున్ రతిన్, దలఁపవు కంటె పాసినవెతల్ దలఁపిం
చుచుఁ గోకదంపతుల్. 62

టీ. కోకదంపతుల్ = చక్రవాకపక్షుల జతలు, విధిచాతురిన్ = దైవ విలాసముచే, కూడియున్ = మరలఁ గలసియు, పాసినవెతల్ = కడచిన కష్టములను, తలఁపించుచున్ = ఒకదాని నొకటి తలఁచుకొనునట్లు చేసికొనుచు, కోలకోలకూయున్ = కలకలధ్వని నిండార నఱచును. పై నొఱగున్ = ఒకదానిపైకి వేఱొకటి మొగ్గియానుకొనును. కుత్తుకన్ కుత్తుకన్ = గొంతును గొంతును, చుట్టున్ = అలముకొనును. పాఱుచిల్వలక్రియన్ = పారాడు పాములవలె, కానరాని, గతులన్ = నడకతో, మయిమైన్ = దేహముతో దేహమును, పెనుచున్ = పెనవేసికొనును. జనించు నశ్రువుల్ = జనించుకన్నీళ్లను, అఱుతన్ = ఒండొంటిమెడలచేత, ఒత్తున్ = తుడుచును, సోలును = సొమ్మసిల్లును. నిలుచున్ = ఏమియుఁ జేయక యూరక నిలువఁబడును. రతిన్ = భోగములను, తలఁపవు, కంటె = చూచితివా ?

తా. వరూథినీ ! చక్రవాకదంపతులు ప్రొద్దు క్రుంకినపైఁ గన్ను తెలియక యొండొంటి నెడఁబాసి రేయెల్ల వియోగము ననుభవించి ప్రొద్దు పొడువఁగానే మరలఁ గలసికొని కడచిన కష్టములఁ దలఁపించుకొనుచుఁ గోలకోలఁ గూయుచుఁ బైపై నొఱగుచు గొంతుగొంతుఁ గలుపుకొనుచుఁ బారాడు పాములవలెఁ బెనఁగొనుచుఁ గన్నీరుకార్చుచు నిట్లు పలుతెఱఁగుల సంకటపడుసుగాని సంభోగసౌఖ్యమును దలంపవు చూచితివా ? అలం. స్వభావోక్తి, కారకదీపకము, ఉపమ, విశేషోక్తి.

ఉ. ఇందునిభాస్యవాఁడనఁగనింద్రుఁడొ చంద్రుఁడొ యాయువేం

ద్రుఁడో, యిందులకై వగన్ బొగుల నేటికి నేఁటికి నందుఁ బో
దమ్మా, నందనభూమి భూమిసురనందనుఁ డుండకపోఁడు రమ్ము
నీ, చందము నందమున్ గనిన జవ్వని యెవ్వని వెఱ్ఱిఁ జేయదే.

టీ. ఇందునిభాస్య = చంద్రునివంటి ముఖముగలదానా! వరూథినీ, వాఁడు=ఆప్రవరుఁడు, అనఁగన్ = అనఁగా, ఇంద్రుఁడో = దేవరాజో, చంద్రుఁడో=చందమామయో, ఆయుపేంద్రుఁడో=ప్రసిద్ధుఁడైన విష్ణుఁడో, సుప్రసిద్ధుఁడగు నింద్రుఁడు చంద్రుఁడు విష్ణువును కాఁడు. అంతటి దేవుఁడైన విరాళిగొనుటయుం వెదకుటయుం సమంజసముగాని సామాన్యమానవుని కొఱకా ఇంతటి వలవంతలతో వేగుట, ఇందులకై=వాని సాంగత్యమునకై, వగన్ = విచారముతో, పొగుల నేటికి = దుఃఖింప నేల? నేఁటికిన్ = నేఁడును, అందున్ = ఆయుద్యానవనమునకు, పోదము, ఆనందనభూమిన్ = సంతోషకరమయిన యాప్రదేశమున, భూమిసురనందనుఁడు = ప్రవరుఁడు, ఉండకపోఁడు = ఉండనేయుండును, రమ్ము = పోదము రమ్ము. శృంగారవనము జూచి యా యువకుఁడు కాలూనక యందు నిలువకపోఁగలఁడా? జవ్వని = చిన్నదానా! నీచందమున్ అందమున్ = నీవిధమును చక్కఁదనమును, కనిన = చూచినయెడల, ఎవ్వనిన్ = ఎట్టివానినైనను, వెఱ్ఱిన్ = కామవికార మందినవానిఁగా, చేయదే=చేయదా?

ఇంద్రుఁడు చంద్రుఁడు విష్ణువు లోనగువారె నిన్నుగాంచిన వలతురు. ఇఁక సామాన్యబ్రాహ్మణునిసంగతిఁ జెప్పవలసిన దే మున్నది? ఇంద్రాదులు తమ మహత్త్వముచే నీ మీఁదివలపు నాపుకొనఁగలుగుదు రేమోగాని సామాన్యుఁడగు ప్రవరాఖ్యుఁడు ముగ్ధుఁడై యీ ప్రదేశమునం దెందెందో యుండు ననుట.

తా. వరూథినీ! ఆప్రవరుఁ డనఁగా నింద్రుఁడా చంద్రుఁడా! ఆతని పొందునకై యింతగా చింతపడ నేల? నేఁడుకూడ నయ్యుద్యాన

మున కరుగుదము. అచ్చో నవ్విప్రకుమారుఁ డుండకపోఁడు. రా! నీ చందము నీ యందము చూచినచో నెట్టి వానికి నెట్టిపుట్టదు? అలం. ఉపమ, ప్రతిషేధము, అర్థాపత్తి.

ఉ. ఏల దురంతవేదనమెయిఁ బొరలాడెదు తాల్మిదక్కి మే
లే లలితాంగి యెంతపని లెమ్మిది విప్రవరుండు గోలయున్
బాలుఁడు గాన నప్పటికిఁ బైఁబడఁ గొంకెనుగాని వానికిన్
గాలొకచోటనిల్చునె వగన్ మగుడన్ నినుఁజూచునంతకున్.

టీ. లలితాంగి = ఇంపైన యవయవములు గలదానా! తాల్మి = ధైర్యమును, తక్కి = కోల్పోయి, ఏల=ఎందులకు, దురంతవేదనమెయిన్ = అంతము లేనిబాధతో, పొరలాడెదు = క్రిందుమీఁదు పడుచుఁ దపించెదవు? మేలే = మంచిదా-ఇదియుక్తమా? ఎంతపనిలెమ్ము = ఎంతమాత్రపుఁబనిలే - యసాధ్యముకాదు (లెమ్ము అనుట యలక్ష్యమును సూచించును.) విప్రవరుండు= నీవువలచిన యాబ్రాహ్మణశ్రేష్ఠుఁడు, గోలయున్=యుక్తాయుక్తజ్ఞానశూన్యుఁడును, బాలుఁడున్=పసివాఁడును, కానన్=కాఁబట్టి, అప్పటికిన్=ఆ సమయమునకు, పైఁబడన్, కొంకెను. కాని, వానికిన్, మగుడన్=తిరిగి, నినున్, చూచునంతకున్ = చూచువఱకును, వగన్=విచారముచే, కాలు = పాదము, ఒకచోటన్=ఒక ప్రదేశమునందు, నిల్చునే = నిలుకడగా నుండునా? ఈ వనము వదలిపోవనే పోవఁడు. పోయెఁబో వెనుకకు మఱలిపోయినచో నిమునమైనఁ డుండక వచ్చితీరును.

తా. వరూథినీ! ఓర్పు వీడి మితిలేని వేదనఁజెందె దేల? మేలా యిది? ఆతని వశపఱచుకొనుట యనఁగా నెంతపని? ఎఱుఁగనివాఁడును బాలుఁడును గాన నప్పు డాతఁ డట్లు మీఁదఁబడ సంశయించెను గాని వానికి మరల నిన్నుఁ జూడకున్నచోఁ గా లొకచోట నిల్చునా?

క. రారమ్మనుటయు దివిష
న్నారీరత్నంబు నికటనాకధునీక
ల్హారాంభోరుహమధురస
ధారాచంద్రకితసలిలధౌతాననయై. 65

టీ. రారమ్ము = వనవిహారమునకు రావే రా యని, అనుటయుంగా = చెలికత్తె యనఁగా, దివిషన్నారీరత్నంబు = వేల్పుఁగన్నెలలో మిన్న యగు వరూథిని, నికట...ననయై-నికట = సమీపమున నున్న, నాకధునీ = ఆకాశ గంగలోని, కల్హార = చెంగల్వలయొక్క, అంభోరుహ=పద్మములయొక్క, మధురస= మకరందముయొక్క, ధారా = ధారలచే, చంద్రకిత = నెమలిఱెక్క కన్నులవలె బిద్దుదేఱినదిగాఁ జేయఁబడిన, సలిల = నీటిచే, ధౌత = కడుగఁ బడిన, ఆననయై = మొగముకలదై, ఈ పద్యమునకుఁ బైపద్యముతో నన్వయము.

పరిశుద్ధమగు జలమునందుఁ దేనియబొట్టువేసిన బిద్దుతేఱును. దానిపై సూర్యకిరణములు వ్యాపించెనేని యింద్రధనుస్సులోని రంగులవలె నుండును. ఇట నది యభివర్ణితము.

తా. ఈ విధముగాఁ జెలికత్తె రారమ్మనుటయుం బావరూథిని చెంగట నున్న గంగానదిలోని కలువలనుండియుం దామరలనుండియుం నొఱఁగిన పూఁ దేనెచే బిద్దుకట్టిన నీట మొగము కడుగుకొని.

సీ. ఘనసారపంక మొక్కలతాంగి దెచ్చిన
ముట్టి వ్రేలనె చుక్కబొట్టు వెట్టి
యింతి యొక్కతె పూవుటెత్తు లెత్తినఁ జూచి
విసువుతో నొకకొన్ని విరులు దుఱిమి
పడతి యొక్కతె రత్నపాదుక లిడ నిల్చి
తొడుగ కవ్వలికిఁ బోనడుగు వెట్టి

బాగాలు వెస నొక్కపద్మాక్షి యొసఁగిన
వెగ్గలం బని కొన్ని వెడల నుమిసి
తే. సగము గొఱికినయాకును సఖులుపిలువ
సగ మొసఁగునుత్తరముఁ దెల్పి సగము మఱపు
సగము నయి చింతచే సగ మగుచు నరిగె
నవ్వరూథిని యంతికోద్యానమునకు. 66

టీ. ఘనసారపంకము=కప్పురపుగందము, ఒక్కలతాంగి=ఒకతీగవంటి మేనుగలచెలువ, తెచ్చినన్=తేఁగా, వ్రేలనే=కొనవ్రేలితోనె, మట్టి=తాఁకి, చుక్కబొట్టుపెట్టి=చుక్కవలెబొట్టు పెట్టుకొని, ఇంతియొక్కతె=ఇంకొక చెలియ, పూవుటెత్తులు=పూదోంతులు, ఎత్తినన్=ఎత్తిచేతఁబట్టుకొనఁగా, చూచి=ఆవొంకరలఁజూచి, విసువుతోన్=విరక్తితో, కొన్నివిరులు=అందుఁ గొన్నిపూలుమాత్రము, తుఱిమి=కొప్పున నిడి, పడఁతియొక్కతె=మఱియొక పరిచారిక, రత్నపాదుకలు=రత్నాలపావకోళ్లు, ఇడన్=ముందఱికిఁ దెచ్చి పెట్టఁగా, నిల్చి=సరిగా నిలిచి, తొడుగక=కాలధరింపక, అవ్వలికిన్ పోన్=తొలఁగిపడునట్లు, అడుగుపెట్టి=పాదముచొన్పి, ఒక్కపద్మాక్షి=ఇంకొక్క పరిచారిక, వెసన్=త్వరగా, బాగాలు=కత్తిరించినపోఁకలు, ఒసఁగినన్=చేతి కందీయఁగా, వెగ్గలంబు=హెచ్చు, అని=అనిచెప్పి, కొన్ని=ఆబాగ ములలోఁ గొన్నిటిని, వెడల నుమిసి=పోవునటుల నూచి, సగముకొఱికిన యాకును=సగముమాత్రముకొఱికిన తములపాకును, సఖులు=చెలులు, పిల్వన్, సగము, మఱపు=అజ్ఞానము, సగము, ఐ=కలదై, చింతచేన్, సగము, అగుచున్, అంతికోద్యానమునకున్, వెడలెన్.

ఇందు అరతి యను మదనావస్థ చెప్పఁబడెను. "అరతి ప్రియవస్తు ద్వేషః" అని తల్లక్షణము. శైత్యోపచారవికారము అరతి యని యిటుల కావ్యాలంకారసంగ్రహమునఁ గలదు.—

మ. "నిరతం బాత్మకరాంఘ్రి బాహునఖకాంతిస్ఫూర్తికిం దిగ్గుఁడై
శరణంబొందు ప్రవాళపద్మబిసపల్లవశ్రేణికిం గ్రమ్మఱన్
శరణంబందుట హీనమంచునొ మఱిన్ శైత్యోపచారక్రియా
గరిమం బొల్లదు మానినీమణి కడంకన్ శ్రీనృసింహాధిపా."
(తృతీయాశ్వాసము. ప. ౧౭౫)

తా. వరూథిని ప్రియవిరహవేదనచేత విరక్తినొందినదై గంధము పూసి కొనక, పువ్వులు కొప్పునఁ జక్కఁగాఁ బెట్టుకొనక, పావకోళ్లు కాళ్లఁదొడు గక, పక్కలోకు లొల్లక, చెలికత్తెలాడు మాటలకు బదులుమాటలు సరిగాఁ జెప్పక, స్మృతిగలిగియుఁ లేనిదానివలెనే విచారముచేఁ గృశించిన దేహము గలదై, మెల్లఁగా నింటివెంబడి శృంగారపుఁ దోఁటకుఁ బోయెను.

వ. ఆసమయంబున దేవజాతిత్వజనిత విమలజ్ఞాన పాటవంబునం
దద్వృత్తాంతంబు సమస్తంబు నెఱుంగుటంజేసి. 67

టీ. దేవ...టవంబునన్-దేవజాతిత్వ=దేవజాతి యగుటవలన, జనిత= పుట్టిన, విమలజ్ఞాన = నిర్మలమగు తెల్వియొక్క, పాటవంబునన్ = గట్టి తనముచే (సామర్థ్యముచే), తద్వృత్తాంతంబు = ఆ వరూథిని సమాచారము, సమస్తంబున్ = అంతయు, ఎఱిఁగి = తెలిసినవాఁ డగుటచేత (కర్త గంధ ర్వుఁడు.)

శా. ఏగంధర్వుఁడు తద్విలాసములు మున్వీక్షించి తానెంతయున్
రాగాంధుండయి గోరి హాత్తక గడున్ రారాపులం గంతుఁడు
ద్వేగం బందఁగఁజేయ నెవ్వగల నువ్విళ్లూరుచున్ వేఁగువాఁ
డాగంధర్వకుమారుఁ డంగభవవిద్యాపారగుండాత్మలోన్.

టీ. మున్ను = పూర్వము (ఇంతకు వెనుక) ఏగంధర్వుఁడు = ఏగం ధర్వకుమారుఁడు, తద్విలాసములు=ఆ వరూథిని శృంగారచేష్టలను, ఈక్షించి= చూచి, తాన్=తాను, ఎంతయున్=విస్తారముగా, రాగాంధుండయి = అను

రాగముచేఁ గానివాఁడయి, కోరి=వరూథినిఁబొందు నపేక్షించి, హత్తక = జతపడక, కడున్ = మిక్కిలి, రారాపులన్ = ఒత్తిడిచే, కంతుఁడు=మన్మథుఁడు, ఉద్వేగంబు=కలవరమును, అందఁగఁ జేయన్ = పొందింపఁగా, సెవ్వగలన్=నిండువిచారముతో, ఉవ్విళ్లూరుచున్, ఏగంధర్వుఁడు, వేఁగువాఁడు=పరితపించుచుండువాఁడో, అంగభవవిద్యాపారగుండు = మన్మథవిద్యయందు గడిదేరినవాఁడు, (అగు) ఆగంధర్వకుమారుఁడు = యౌవనవంతుఁడగు నాగంధర్వకుమారుఁడు, ఆత్మలోన్ = హృదయమునందు, వైపద్యముతో నన్వయము.

విలాస మనునది ఇష్టుఁడగు ప్రియుని గవయ నభిలషించి భ్రూనేత్ర చాలనాదులచే నుత్సాహము వెల్లడించుట. విలాసమనను లక్షణము.—

శ్లో. "ప్రియసంప్రాప్తిసమయే భ్రూనేత్రాననకర్మభిః,
తాత్కాలికో విశేషో యస్స విలాస ఇతీరితః." (రసార్ణవసుధాకరము.)

తా. మును శాకగంధర్వుఁడు వరూథినిసౌందర్యమును దాని శృంగార చేష్టలను జూచి మోహించి యది యందులకు సమ్మతింపకపోగా దానిని వలపించు నుపాయము గానక నాఁటనుండి మన్మథవేదన బొందుచున్నవాఁడై వరూథిని ప్రవరాఖ్యుని వలచి వాఁడు తన్నొల్లమిచేత మన్మథవ్యథపడుచున్న వృత్తాంతము విని తన మనసులో నిట్లాలోచించెను.

ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖు లొల్లమి సేయుదురొక్కవేళఁ బె
న్మక్కువ నాదరింతురు క్షణక్షణముల్ జవరాండ్రచిత్తముల్
బక్కన వేసటన్ జన దుపాయములన్ దగునచ్చకంబులన్
జిక్కఁగఁ జేసి దాని సతిచిత్తముఁ బట్టి సుఖింపఁగాఁదగున్.

టీ. పద్మముఖులు = తామరపూవులవంటి ముఖముగలవారు—స్త్రీలు, ఒక్కొకవేళన్ = ఒకానొకసమయమునందు, హృదయము రాగాతిశయముచే విజృంభించనియప్పుడు, ఒల్లమిసేయుదురు = ఇచ్చగింపక పోవుదురు

ఒక్కవేళఁ = ఒకానొకసమయమున, వెన్కక్కువఁ = పెద్దయపేక్షతో, ఆదరింతురు, జవరాండ్రచిత్తముల్ = యువతులడెందములు, క్షణక్షణముల్ = ప్రతిక్షణమునకు మారునవి, (కాన) వక్కనఁ = కటాలున వేసరఁ జనదు=విసువరాదు. ఉపాయములఁ = బహువిధములగు నుపాయములచేతను, తగు నిచ్చకంబులఁ = అనువైన యిచ్చకాలతోడను, చిక్కఁగఁ జేసి = స్వాధీనపఱుచుకొని, డాసి = దగ్గఱి, సతిచిత్తముఁబట్టి = ఆఁడుదాని మనసు ననువర్తించి, సుఖింపఁగాఁ దగుఁ=సంభోగసౌఖ్యములననుభవింపఁగాఁ దగును.

స్త్రీలచిత్తములు క్షణక్షణము చలించునవిగానఁ గాలానుసారములగు ప్రయత్నములు చేయవలయు ననుటకు.—

ఉ. "ఇప్పటి నీతలంచు తెఱఁ గిట్టిదయా నిటమీఁద నెప్పు డే
చొప్పున నుండునో! నిజముసుద్ది యెఱుంగముగాని యుంగ్మలీ
చెప్పెడిదేమి! బాలికలచిత్తము లంబుతరంగలోలముల్."

(శృంగారనైషధము. ఆ. 2)

తా. ఒక్కొకప్పుడు తిరస్కరింతురు. ఇంకొకప్పుడు మిక్కిలి మక్కువ చూపుదురు. స్త్రీలచిత్తములు చపలము లగునవి కావునఁ దటాలున విసివి విడువరాదు. ఉపాయములు చేసి యనువయిన యిచ్చకములు పలికి స్వాధీనపఱుచుకొని దగ్గఱి యాఁడుదాని మనసు గుర్తెఱిఁగి సుఖింప నగును.
అలం. అప్రస్తుతప్రశంస, కావ్యలింగము.

క. అని తలఁచి యవ్విలాసిని
యనిశముఁ గ్రీడించుపుష్పితారామంబుఁ
మునుకలుగఁ జొచ్చి యొకచం
దనభూజమునీడ నిల్చి దంభం బమరన్. 70

టీ. అని తలఁచి = ఈవిధముగాఁ దలంచికొని, అనిశమున్ = ఎప్పుడును, అవ్విలాసిని = విలాసవతియగు వరూథిని, క్రీడించు పుష్పితారామంబునన్=విహరించు వికసించినతోఁటను, మును కలుగన్ = వరూథిని రాక మునుపే, చొచ్చి=చేరి, ఒకచందనభూజము నీడన్=ఒక మంచిగంధపుఁజెట్టు నీడను, దంభంబు = కపటము, అమరన్ = ఒప్పఁగా, నిల్చి = నిలువఁబడి, వైపద్యముతో నన్వయము.

తా. గంధర్వకుమారుఁడు ఎటులేని ప్రయత్నించిన వరూథిని సమాగమము లభింపవచ్చు ననుకొని ఆమెకంటె ముందుగా నామె విహరింపవచ్చు నుద్యానవనముఁ జేరి యటఁగల యొకగంధపుమ్రాని నీడను గపటాచరణములతో నిలిచియుండెను.

సీ. అర్ధచంద్రుని తేట నవఘళించులలాట
పట్టి దీర్చినగంగమట్టితోడఁ
జెక్కుటద్దములందు జిగివెల్లువలు చిందు
రమణీయమణికుండలములతోడఁ
బసిఁడి వ్రాఁతచెఱంగు మిసిమి దోఁపఁ జెలంగు
నరుణాంశుకోత్తరీయంబుతోడ
సరిలేని రాకట్టుజాళువా మొలకట్టు
బెడఁగారునీర్కావిపింజెతోడ
తే. ధవళధవళము లగుజన్నిదములతోడఁ
గాశికాముద్ర యిడినయుంగరముతోడ
శాంతరస మొల్కుబ్రహ్మతేజంబుతోడఁ
బ్రవరుఁ డయ్యె వియచ్చరప్రవరుఁ డపుడు. 71

టీ. అపుడు=ఆసమయమునందు, వియచ్చర ప్రవరుఁడు=గంధర్వుఁడు, అర్ధచంద్రుని తేటన్=అర్ధచంద్రుని తిన్నఁదనమును, అవఘళించు లలాటపట్టికన్

తిరస్కరించునోసలను, తీర్చినగంగమట్టితోడన్ - తీర్చిన=తిలకముగా దిద్దిన, గంగమట్టితోడన్ = గంగానదిలోని మృత్తికతోడను, నదీజలమునందు స్నానముచేసి సంధ్యవార్చునపుడు నదీమృత్తిక మొగమున బొట్టుపెట్టుకొనుట ఆచారము. చెక్కుటద్దములందున్ = అద్దములంబోలు చెక్కులందు, జిగివెల్లువలు=కాంతిప్రవాహములు, ప్రవాహమువలె వ్యాపించు గాంతివిశేషములనుట. చిందు=తొలఁకునట్టి, రమణీయమణికుండలములతోడన్ - రమణీయ=మనోహరమైన, మణి = రత్నములుచెక్కిన, కుండలములతోడన్ = కర్ణభూషణములతోడను, (మణిభూషలు గాన కాంతివెల్లువలు) పసిఁడి ... మిసిమి - పసిఁడివ్రాఁత = బంగారు పనితనముగల, చెఱంగు మిసిమి = అంచుయొక్క మిసమిస, తోఁపన్, చెలంగు = ఒప్పు, అరుణాంశుకోత్తరీయంబుతోడన్ - అరుణ = ఎఱ్ఱని, అంశుక = రంగుగల, ఉత్తరీయంబుతోడన్ = జందెమువాటుగాఁ బైవేసికొన్న యుపవస్త్రముతోడను, సరిలేని=సాటిలేని, రాకట్టు = రత్నపుఁ గట్టడముగల, జాళువా మొలకట్టు=మేలిమి బంగరుమొలత్రాడు, బెడఁగారు = అంద మొసఁగు, నీర్కావిపింజెతోడన్ - నీర్కావి = నీట నానఁబెట్టి నీడను ఆరవేయుటచేఁ గొంచెమెఱుపురంగుగలదిగా నున్న దోవతియొక్క, పింజెతోడన్ = వ్రేలాడునటుల విడిచిపెట్టిన కుచ్చెళ్లతోడను, ధవళధవళములు = మిగులఁ దెల్లనివి, అగు, జన్నిదములతోడన్ = యజ్ఞోపవీతములతోడను, కాశికాముద్ర = కాశిముద్ర, ఇడిన = వేసిన, ఉంగరముతోడన్ = అంగుళీయకముతోడను, శాంతరసము, ఒలుక = చిందుచున్న, బ్రహ్మతేజంబుతోడన్ = బ్రాహ్మణతేజముతోడను, ప్రవరుఁడు = ప్రవరరూపము ధరించినవాఁడు, అయ్యెన్=ఆయెను.

తా. అప్పుడు నొసట గంగమట్టిబొట్టును, చెక్కిళ్లపై వ్యాపించు కాంతులుగల రత్నాలకర్ణాభరణములును, చెఱఁగులం దక్షరపంక్తివలె సరిగతో నేయఁబడిన కమ్ములుగల యుత్తరీయమును, రత్నములుచెక్కిన మొలత్రాడును,

ముందరికట్టుకుచ్చెలు వ్రేలఁగట్టిన నీరుకావిదోవతియు, మిక్కిలి తెల్లగానుండెడి యజ్ఞోపవీతములును, కాళీముద్రతోడి ముద్దుటుంగరమును ధరించి మొగము నందు శాంతరసమును గనఁబఱచునట్టి బ్రాహ్మణతేజస్సు వెలయఁగా నాగంధర్వుఁడు ప్రవరునిరూపమును బొందెను.

క. ఇట నవ్వరూథినియు నొ
క్కొటఁ గతిపయసఖులు దన్నుఁ గొలిచి నడువఁగాఁ
జటులఝళంఝళరవపద
కటకసమాకృష్టకేళికలహంసిక యై. 72

టీ. ఇటన్=ఇక్కడ, అక్కడ గంధర్వుఁడు వనముచేరియుండఁగాఁ జెలిమికత్తెలవెంత, ఆ, వరూథినియున్ = వలపువంతచేఁ దపించుచున్న వరూథినియు, ఒక్కొటన్ = ఒక్కటిగా, కతిపయసఖులు = కొందఱు చెచ్చెలులు, తన్నున్ = తనను, కొలిచి=సేవించి, నడువఁగాన్ = తనవెంట నడచి వచ్చుచుండఁగా, చటు...కయై-చటుల = చలించునట్టియు, ఝళంఝళరవ = ఝళఝళ మనుధ్వనితోఁ గూడినట్టి, పదకటక=కాలియందెలచే, సమాకృష్ట=వెనుదవులునట్లు చేయఁబడిన, కేళికలహంసికయై = విలాసమునకుఁ బెంపఁబడిన రాయంచలుగలదై, కాలియందెలమ్రోఁత యంచలమ్రోఁతవలె నుండుటచే సజాతీయ పక్షిసముదాయ మనుభ్రమతోఁ బెంపుడుహంసలు వరూథినిని వెంబడించెను. కటకరవము అంచలయులివువలె నుంటకు దృష్టాంతములు వెనుక నీయఁబడెను.

ఒక్కట, రూ. ఒక్కొట. ఒక్కొట యనుటకు.—

క. "ఇట పాండవకౌరవు లొ
క్కొట నందఱు గురునసుజ్ఞఁ గొని" (భారతము. ఆదిపర్వము.)

సీ. ఉరగప్లుతాక్కారధూమోగ్రగంధముఁ బాసి
పొలయుఁబో యీతావి మలయపవనుఁ

డనలాక్షు పెడబొబ్బ నలమినతలదిమ్ముఁ
బాయుఁబో యీతేంట్లపాట మరుఁడు
ఘర్మసామీప్యసంకలితదాహస్ఫూర్తి
సాఁగుఁబో యీనీడ నల్లమధుఁడు
గరళసోదర్యాత్తకరసుధాకటుకత్వ
ముడుపుఁబో యీతేనె నోషధీశుఁ
తే. డనఁగఁ జంపకకురవకపనసతినిశ
నిచులవంజులదాడిమీవిచికిలామ్ర
పాటలీపూగకేసరప్రముఖతరుల
సొబగు మీఱునుద్యానంబుఁ జొచ్చి యచట. 73

టీ. మలయపవనుఁడు = మలయమారుతము - మలయపర్వతమునుండి వచ్చుచల్లగాలి, దక్షిణపు దిక్కునుండి వచ్చు గంధపుఁదావి గలగాలి, ఈ తావిన్ = ఈ పరిమళముచే, ఉరగ...గంధమున్ - ఉరగ = పాముల యొక్క, ఫూత్కార = బుసలవలనఁ గలిగిన, ధూమ = పొగచే, ఉగ్ర = తీవ్ర మగు, గంధమున్ = వాసనను, పాసి, పొలయుఁబో = ప్రసరించుఁ జుమీ, పాములవిసము అగ్నిగాన బుసకొట్టుటలు పొగలుగాఁ జెప్పఁబడెను. విసము అగ్నిగఁ జెప్పుదు రనుటకు "విసపుఁజిచ్చొండొండ దెసలు ప్రేల్వ". ఫూత్కృతులనుండి పొగలు వెడలు ననుటగూడ నిట్టిదె సుప్రసిద్ధము.—

తే. "పొదలుతనఫూత్కృతులనెల్లఁ బొగలు గవిసి
యబ్జజాండ మూదరవెట్టినట్లు గాఁగ
కాలకర్కశకాయుండు." (హరివంశము. పూ. ఆ. ౫)

మరుఁడు = మన్మథుఁడు, ఈతేంట్లపాటన్ = ఈతుమ్మెదలపాటచే, అన...బొబ్బన్ - అనలాక్షు = శివునియొక్క, పెడబొబ్బన్ = పెద్దదర్ధరింపుచే, అలమినతలదిమ్మున్ = మూఁగిన శిరోవేదనను, పాయన్ పో = ఎడఁ-

బాయుఁనుచుమీ! అల్ల మధుఁడు=ఆవసంతుఁడు, ఈనీడన్ = ఈచెట్లనీడచే, ఘర్మ...స్ఫూర్తిన్ - ఘర్మ = గ్రీష్మముయొక్క, సామీప్య = చేరికచే, సంకలిత = చేకూడిన, దాహస్ఫూర్తిన్ = తాపపుహెచ్చును, అణఁగుఁబో = అణఁచును చుమీ! ఓషధీశుఁడు=చంద్రుఁడు, ఈతేనెన్ = ఈపూఁదేనెచే, గరళ...కటుకత్వము-గరళ = విషముయొక్క, సోదర్య=తోఁబుట్టుతనముచే, ఆత్త=పొందఁబడిన, కర = కిరణములయొక్క, సుధా=అమృతమునందలి, కటుకత్వము = చేఁదును, ఉడుపుఁబో = పోఁగొట్టుకొనునుజూమా! అనఁగన్ = అనునట్లు, చంపక...తరులసొబగున్ - చంపక=సంపంగి, కురవక = గోరంట, పనస, తినిశ = సెమ్మి, నిచుళ = ప్రబ్బలి, వంజుళ=అశోకము, దాడిమీ = దానిమ్మ విచికిల = సన్నమల్లె ఆమ్ర=మామిడి, పాటలీ = కలిగొట్టు, పూగ=పోఁక, కేసర=సురపొన్న, ప్రముఖ=మొదలైన, తరులన్ = చెట్లచే, సొబగు=సొగసు, మీఱు=అతిశయించు, ఉద్యానమున్ = విహారశృంగారవనమును, చొచ్చి=ప్రవేశించి, అచటన్=అక్కడ, వైపద్యముతో నన్వయము. అలం. అప్రస్తుతప్రశంసోత్ప్రేక్షలు.

తుమ్మెదలరవమును పాట యని చెప్పుటకలదు. దృష్టాంతములు—

క. "వీనులవిందై యమృతపుసోనల పొందై యమందసుమచరదళినీ
గానముక్రందై యారవ మానందబ్రహ్మమైన నధిపతి బలికెన్.
(వసు. ద్వితీ.)

శా. "భృంగా కృష్ణుఁడు మంచివాఁ డనుచు సంప్రీతిన్ బ్రసంగించెదీ
సంగీతంబున మేము సొక్కుదుమె." (భాగవ. దశ.)

సీ. "మాధవీమధుపానమత్తాలినీగాన
విభవాకులోద్యానవీథులందు" (కవికర్ణరసాయనము.)

తా. ఈతోఁటలోనిగోరంట సంపెఁగ పనస మామిడి సురపొన్న మొదలుగాఁ గల వృక్షములవలని ఫలపుష్పపరిమళములచేత దుమ్మెదల

ఝుంకారముల చేతను మ్రాఁకులనీడల చేతను తేనెలమాధుర్యము చేతను క్రమముగా మలయమారుతమును మన్మథుఁడును వసంతుఁడును జంద్రుండును దమతమ లోపములను బోఁగొట్టుకొనుచున్నారు. అట్లుండఁగా నితరులకొఱఁతలు దీఱకపోవునా! తప్పక తీఱు నను నిశ్చయముతో నాతోఁటను జొచ్చి యని తాత్పర్యము. అలం. అప్రస్తుతప్రశంస, ఉత్ప్రేక్షయును.

మ. పవమానప్లవమానపంకజరజఃపాళీపిశంగచ్ఛవీ
భవదభ్యర్ణవికీర్ణకృత్రిమసరిత్పాథస్తరంగాహతైం
దవపాషాణవితర్దికాతలమునన్ నాళీకపత్రాక్షు లు [గ్రన్
త్సవమొప్పన్ విహరించుచున్ సరసవాచాప్రౌఢిమల్ మీఱఁగ

టీ. పవమాన...తలమునన్ - పవమాన = గాలిచే, ప్లవమాన = తేలియాడుచున్న, పంకజ = తామరపూలయొక్క, రజఃపాళీ = పరాగపుంజముచే, పిశంగచ్ఛవీభవత్ = పచ్చనికాంతిగలవగుచున్న, అభ్యర్ణ = చెంగట, వికీర్ణ = చెదరిన, కృత్రిమసరిత్ = కాల్వలయొక్క, పాథః = నీళ్లయొక్క, తరంగ = తరఁగలచే, ఆహత = కొట్టఁబడుచుండు, ఐందవపాషాణ = చంద్రకాంతమణులుగూర్చిన, వితర్దికాతలమునన్ = అరుఁగుపై, నాళీకపత్రాక్షులు = తమ్మిరేకులవంటికన్నులుగల స్త్రీలు, ఉత్సవము = వేడుక, ఒప్పన్ = ఒప్పునటుల, విహరించుచున్ = సంచారముచేయుచు, సరస...ప్రౌఢిమల్ - సరస = ఇంపైన, వాచాప్రౌఢిమల్ = వాక్చమత్కారములు, మీఱఁగన్ = అతిశయింపఁగా, వైపద్యముతో నన్వయము.

వరూథిని విరహిణిగాన శిశిరోపకృతు లవసరము. పరాగము, తరంగములగాలి, చంద్రకాంతవేదిక ఇవి సహజశీతలములు. వీని నుపాయాంతరముచే సమకూర్చిరి. పుప్పొడి గాలికిఁ దమ్ములనుండి రాలుచుండె ననుటచే నాప్రదేశము నేత్రపర్వముగ నుండెననియు అలలతాకిడి చంద్రకాంతవేదికను సోఁకు

చున్న దనుటచే మతియుం జల్లఁగా నుండెననియు భావము. సరసప్రసంగములు అన్యవ్యాసంగవశమున విరహబాధ సహనయించుటకు.

ప్రౌఢిమ-ఇది ఇమనిచ్ప్రత్యయము. ఇట్టివె ముగ్ధిమ ఇత్యాదులు. ప్రౌఢిమ ప్రయోగములచే సాధువు. "గంభీరవాక్ప్రౌఢిమన్" శ్రీనాథమహాకవి. ఇమనిచ్ప్రత్యయములు మృగ్యములని వామనుఁడు.

తా. గాలిచేఁ దూఁగియాడు తమ్మిపుప్పొడి క్రమ్మి పసిమిగాంచిన చెంగటి కాల్వల నీళ్లలో నితరఁగలు తాఁకుచున్న నెలరాతి తిన్నెపై నాకమల నయనలు సరసవాక్యము లాడుకొనుచు ఉత్సవముతో విహారము సల్పుచు. (వైపద్యముతో నన్వయము.)

చ. బటువయి విఱ్ఱవీఁగి పరిపాటిగఁ బూచి పరాగపుంజ మొ
క్కొటఁ గలయంగఁ బర్వఁ గొనగొమ్మను గోయిల మించ
నొప్పెఁ జెంగటియొలమావి హారరుచి గందవొడిన్ గను
పట్టె నీలతాస్ఫుటతరచూచుకం బగుచుఁ బొల్చువనేందిర
గుబ్బచన్నునన్.

టీ. బటువయి = వట్రువై, విఱ్ఱవీఁగి = మిగుల నిగిడి నిక్కి, పరిపాటిగన్ = తీరుగా, జొంపముగాఁ బెరిఁగి దర్శనీయముగా, పూచి = పుష్పించి, పరాగపుంజము = పుప్పొడిప్రోవు, ఒక్కొటన్ = ఒక్కసారిగా, కలయంగన్ = అంతటను, పర్వన్ = వ్యాపింపఁగా, కొనగొమ్మను = కొటారుకొమ్మపై, కోయిల, మించన్ = ఒప్పఁగా, చెంగటియొలమావి = దగ్గఱనున్న లేఁతమామిడిగున్న, హారరుచిన్ = ముత్యాలహారపుఁ గాంతిచేతను, గందవొడిన్ = బుక్కాపొడిచేతను, కనుపట్టి = కన్పడి, నీలతా...చూచుకంబు - నీలతా=నల్లఁపుచే, స్ఫుటతర = మిగుల స్పష్టమైన, చూచుకంబు = చన్మొన గలది, అగుచున్, పొల్చు=చెలఁగెడు, వనేందిరగుబ్బచన్ను=వనలక్ష్మియొక్క సుంద్రనికుచము, అనన్ ఒప్పెన్.

గున్నమావి గుబ్బచన్నుగను, పుప్పొడి చనులపైఁ బూయుగందపొడి పూఁతగను, పూలకాంతి హారరుచిగను, కోయిల చన్ను మొనగను జెప్పఁబడినది. హారములు, పూవులు శ్వేతగణములోనివి. గుబ్బచన్ను అనుటచే బిగివి నిండారి గుబ్బవలె నిక్కినచన్ను.

తా. గుండ్రనై నిక్కి జొంపములు వైచి తీరుగాఁ బూఁత పూచి, యంతటను బుప్పొడి క్రమ్ముకొని కొనగొమ్మను గోయిల గల్గిన యీలేమావి గున్న ముత్యాలహారములును, బుక్కాముసుగల్గి నల్లని చన్మొక్కలతో నొప్పు వనలక్ష్మియొక్క గుబ్బచన్నో యనునట్లు చూపట్టుచున్నది. ఉత్ప్రేక్షాలంకారము.

తే. వెలఁది యిచ్చటిసంపెంగవిరులు గహన
దేవతలయిండ్ల నెత్తినదీపశిఖలు
గాక యుండినఁ బంచబంగాళ మగుచుఁ
బాఱునే మత్తమధుకరపటలతమము. 76

టీ. వెలఁది = ఓచెలియా! ఇచ్చటి సంపెంగవిరులు = ఈవనములోని పూచిన సంపెంగపూలు, గహనదేవతల యిండ్లన్ = వనదేవతలయిండ్లలో ఎత్తినదీపశిఖలు = పెట్టినదీపజ్వాలలు, కాకయుండినన్ = కానిచో, మత్త మధుకరపటలతమము = మదించిన తుమ్మెదల సమూహ మనుచీకటి, పంచబంగాళ మగుచున్ = రూపుమాసినదై, పాఱునే = పాఱిపోవునా!

సంపెఁగపూవును రక్తవర్ణముగాఁ జెప్పుట కలదు. ఇందుచే దీపములు గూడ రక్తవర్ణము లని గ్రహించునది. సంపెంగపూవును జూచినతుమ్మెదలు దీపమును జూచిన చీకటులవలెఁ దొలంగును. మధుకరముల మత్తము లనుటచేతను బటలమనుటచేతను అంధకారమునకు నెక్కువ సాదృశ్యముంటస్పష్టము.

తా. చెలీ! ఇచ్చటి సంపెంగపూలు వనదేవతలయిండ్లలోని దీపజ్వాల లనఁదగును. కావుననే కాఱుతుమ్మెద లను చీకట్లు వానినిఁ జేరక దూరముగాఁ బాఱుచున్నవి. అలం. అనుమానము, రూపకమును.

చ. అపరిమితానురాగసుమనోలసయై చిగురాకుఁజేతులన్
దపసిని గౌఁగిలించె వనితా యిదె రంభ దలంప రంభ దా
నపరిమితానురాగసుమనోలసయై చిగురాకుఁజేతులన్
దపసిని గౌఁగిలించు టుచితంబెకదా యన నవ్వె రంభయున్.

టీ. వనితా = చెలీ, రంభ = అరటిచెట్టు, అపరిమిత...లసయై - అపరిమిత = మితిలేని, అనురాగ = ఎఱ్ఱఁదనముతోఁగూడిన, సుమనః = పూవుచే, అలసయై=ఓపనిదై, వాసియల్లు కొను స్వభావముగలదై, చిగురాకుఁజేతులన్ = చిగురాకులను చేతుఁలతో, తపసిని = అగిసెచెట్టును, కౌఁగిలించెన్ = అనుకొనెను-ఆలింగనము చేసికొనెను, ఇదె = ఇదిగోఁ జూడుము, (అని యొకతె చెప్పఁగా మఱియొకతె) తలంపన్=విచారింపఁగా, రంభ = రంభయనునచ్చర, తాన్=తాను, అపరి...లసయై - అపరిమిత = మితిలేని, అనురాగ=అనురక్తితోఁ గూడిన, సుమనః = మంచిమనస్సుచే, అలసయై = ఓపికలేనిదై, చిగురాకుఁజేతులన్ = చిగురాకులవంటి చేతులతో, తపసిని = తపస్సు కావించు వానిని, కౌఁగిలించుట = ఆలింగనముచేయఁట, ఉచితంబె కదా = యుక్తమేకదా. అనన్ = అనఁగా, రంభయున్ = (వారిలోఁ గలసి విహరించు) రంభయను నచ్చర, నవ్వెన్ = అందులకుఁ బరిహాసించెను.

అవిసెచెట్టును జూచినయరఁటిచెట్టు అనుకొనెను. దానినే యర్థాంతర వివక్షచే రంభ తపస్విని కౌఁగిలించుకొనె నని పలికి చెలికత్తెలు నవ్వులాడిరి.

తా. వనితా ! రంభ (అనఁటి) మెండయిన యనురాగము (ఎఱుపు) గల సుమనస్సుల (=పూవుయొక్క) బరువు మోయలేనిదై తపసిని (అగిసెను) కౌఁగిలించుకొనెను. అని యొకతె మఱొకచెలితో ననఁగా నది యావాక్యమునకే యర్థాంతరకల్పన చేసి మరల ననుచున్నది. అగును, రంభ (అచ్చర) అపరిమిత మగు ననురాగము గలమంచిమనస్సుతో నోపనిదై చిగురాకులం బోలు చేతులతోఁ దపస్విని గౌఁగిలించుట వింత గాదు గదా ! యనఁగా రంభయు నవ్వెను. వక్రోక్త్యలంకారము.

ఆ. కొమ్మ కన్నుఁగవకుఁ గోరగింపఁగఁ బూచి
తఱుచుజొత్తు గ్రక్కు-దాసనంబు
గవియునీతమాలగహనాంధకారవి
తానమునకు నుదయభానుఁ డయ్యె. 78

టీ. కొమ్మ=బాలా ! కన్నుఁగవకున్ = కండోయికి, కోరగింపఁగన్ = వెక్కస మగునట్లు, కనులారఁ జూడ వీలుగాని యటుల, పూచి = పుష్పించి, తఱుచుజొత్తు=ఎక్కువరక్తిమను, గ్రక్కు-దాసనంబు = వెలిపఱుచు దాసాని చెట్టు, కవియు = క్రమ్ముకొను, ఈతమాలగహనాంధకారవితానమునకున్ = ఈ చీకటిమ్రాఁకుల తోఁపులోని చీకటితుండమునకు, ఉదయభానుఁడు = ఉదయించుచున్న సూర్యుఁడు, అయ్యెన్ = ఆయెను.

దాసానిపువ్వులు మిగుల నెఱ్ఱఁగా నుండును గాన నుదయించు సూర్యుని వలె నుండెను. తమాలవృక్షములు చీఁకటులవలె నల్లగా నుండెను.

తా. బాలా ! ఎఱ్ఱఁగాఁ బూచి యుండిన యీదాసానిచెట్టు చీకటి మ్రాఁకు లనుగాఢాంధకారమునకు నుదయభానునివగిది యయ్యెను. (ఎఱ్ఱఁగాఁ బూచియుండిన దాసానిపూలకాంతి చీకటి చెట్ల నలుపును విరజిమ్ముచున్న దనుట). రూపకాలంకారము.

తే. శ్యామలోపరినిబిడపత్త్రాభ్రములకుఁ
గాండషండంబు దిగువానకాల్వ గాఁగఁ
బంకరుహనేత్ర వర్షర్తుశంక నొసఁగు
పోఁకబోదియనవకంపుమోకఁ గంటె. 79

టీ. పంకరుహనేత్ర = పద్మనయనా, శ్యామలో...భ్రములకున్ శ్యామల = పసుపుమీఱిన నల్పుకల, ఉపరి = మీఁది, నిబిడ = తఱచైన, పత్త్ర=ఆకులనెడి, అభ్రములకున్ = మేఘములకు, కాండషండంబు = బోదెల సమూహము, దిగువానకాల్వగాఁగన్ = (నేలపైకి) దిగువర్షధారలు కాఁగా,

వర్షర్తుశంకన్ = వర్షకాలమను సంశయమును, ఒసఁగు... మోకన్ - ఒసఁగు = ఇచ్చునట్టి, పోఁకబోదియ = పోఁకచెట్ల మొదళ్లయొక్క, నవకంపుమోకన్ = నునుపైనచాలును, కంటె = చూచితివా ?

శ్యామలము అన నలుపురంగునకును ఆకుపచ్చనిరంగునకును జెప్పఁట గలదు. చెట్లు ఆకుపచ్చగా నున్నను దూరమున నున్నవారి కాయాకుపచ్చన నల్లఁగా గానవచ్చును గాన నలు పనుట ప్రసిద్ధము సంస్కృతకవులు వృక్ష పత్త్రవర్ణము శ్యామల మని చెప్పిరి. దానినే పెద్దన యనుకరించెను. చూడుఁడు ఉత్తరరామచరిత్రము.—

శ్లో. "తస్యాధస్తాద్వయమపి రతాస్తేషు పర్ణోటజేషు
గోదావర్యాః పయసి వితతశ్యామలానోకహశ్రీః." (అంకము. ౨)

తా. సఖీ ! పోఁకమ్రాఁకుల పైనుండు నలుపుమీఁటినయాకులు మబ్బు వలెను, వానిబోదెలు వానకాళ్లగను దోఁచుటచే నిది వర్షాకాలమే మో యనుసందియము గలిగించుచున్నవి చూడు. అలం, రూపకము, ఉత్ప్రేక్ష యును.

ఉ. చూతమె డాసి పక్వతరశుక్తిపుటాంతరదృశ్యమౌక్తిక
వ్రాతము లై వెలుంగు గరువంపుఁగొటారులనొప్పు తామ్రప
ర్ణీతట మట్లు జీర్ణదళబృందసమావృతపాండురప్రసూ
నాతిమనోజ్ఞమూలముల నర్థి నెసంగుమధూకసాలముల్. 80

టీ. పక్వ...వ్రాతములై - పక్వతర = మిక్కిలి నిండిన, శుక్తిపుట = ముత్తెపుఁజిప్పలయొక్క, అంతర = లోపల, దృశ్య = చూడఁదగిన, మౌక్తిక = ముత్యములయొక్క, వ్రాతములై = సమూహములుకలవై, వెలుంగు = ప్రకాశించునట్టి, గరువంపుఁగొటారులన్ = గొప్పవగు రాశిపోఁతపోయు నెలవులతో, ఒప్పు, తామ్రపర్ణీతట మట్లు = తామ్రపర్ణీనదీతీరప్రదేశమువలె, జీర్ణదళ...మూలములన్ — జీర్ణ = పండిన, దళ = ఆకులయొక్క, బృంద =

సమూహముచేత, సమావృత = కప్పఁబడిన, పాండుర= తెల్లనైన, ప్రసూన = పుష్పములచేత, అతిమనోజ్ఞ = మిగుల మనోహరము లయిన, మూలములన్ = మొదళ్లచే, ఎసంగుమధూకసాలముల్ = ఒప్పునట్టి ఇప్పమ్రాఁకులను, అర్థిన్ = ప్రీతితో, డాసి = చేరి, చూతమె = మనము కనుఁగొందమా!

రాలిన పండుటాకులు ముత్తెపుఁజిప్పలుగను ఇప్పపూవులు ముత్తెముల రాసులుగను ఇప్పమ్రాఁకులమొదళ్లు తామ్రపర్ణీతీరములుగను నిందుపమింపఁబడెను.

ముత్తెములు తామ్రపర్ణియందు విశేషముగా జనించుననుటకాధారము.

ఉ. "నైపుణిఁ జందనాద్రిగహనద్రుమసౌరభవీచిఁ దామ్రప
ర్ణీపరిలబ్ధమౌక్తికమణిప్రకరంబులు దోఁచి దక్షిణా
శావనమందు సల్లు వెదఁ జల్లు జనించెన కాక వీనికే
లా పొడమంగ నప్పాలవ మప్పుడు నా వనిఁ దోఁచెఁ గ్రొన్ననల్."

(ఆముక్తమాల్యద పంచ. ౧౧౪)

తా. ముత్యములు వెలికిఁ బ్రకాశించు ముదురుముత్యపుఁజిప్పల కొటారులతో నొప్పారు తామ్రపర్ణీనదీతీరమువలెఁ దొఱగిన యెండుటాకు దొప్పలతో రాలి నిండినపూలు గలయిప్పమ్రాఁకులమొదళ్లను పోయి చూతమా! (తామ్రపర్ణీనదిలో ముత్యాలు దొరకుట ప్రసిద్ధము.) ఉపమాలంకారము.

క. పంకజముఖి విరహులపయిఁ
గింకన్ నిజసైన్యకోటికిని సెలవిడుమీ
నాంకునికరతల మన నల
కంకేళిన్ జిగురు గాలిఁ గదలెడుఁ గంటే. 81

టీ. పంకజముఖి = పద్మాననా! విరహులపయిన్ = వియోగమునందువారిమీఁద, ప్రియజనము నెడఁబాసిన స్త్రీపురుషులమీఁద, కింకన్ =

కోపముతో, నిజసైన్యకోటికిని = తనసేనాసమూహమునకు, సెలవు = అను జ్ఞను, (దండు వెడలుటకు ఉత్తరువు గావించునట్టి యనుట) ఇమువిూనాంకుని= ఇచ్చునట్టి మన్మథుని, (చేఁపటెక్కెముగాఁ గలవాఁ డనుట) కరతలము = చేయి, అనఁగ్, ఆల కంకేళిక్ = ఆయశోకవృక్షమున, చిగురు = చిగురు టాకు, గాలికిక్ = గాలిచేత, కదలెడుక్ = కదలుచున్నది, కంటే = చూచితివా?

తా. చెలియా! వియుక్తులమీఁదఁ గోపముతో దాడి వెడలుటకుఁ దనసేనాసమూహమున కనుజ్ఞ నొసఁగు మన్మథునిహస్తసంజ్ఞ యో యనునట్లు ఆ యశోకవృక్షమునఁ జిగురాకు గాలిచేఁ గదలుచున్నది. చూచితివా? ఉత్ప్రేక్షాలంకారము. మన్మథపరివారము వెనుకఁ జెప్పఁబడెను.

చ. నునుఁజిగురాకు మేయుతఱి నోరికెలంకులఁ దేఁటి గుట్టినన్
వనతరుశాఖలన్ గువకువధ్వనిఁ బాలుపికాంగనన్ బికంబు
ననయ మొప్పమాన్పఁగ తినాత్మముఖంబుముఖంబుఁ జేర్చి చుం
బన మొనరించె సందుసుడి మాయలుగా మగవారికృత్యముల్.

టీ. నునుఁజిగురాకుక్ = మిగుల మృదువగు చిగురుటాకును, మేయం కటిక్=తినునప్పుడు, నోరికెలంకులక్ = నోటిపార్శ్వములందు, తేఁటి = తుమ్మెద, కుట్టిఁక్ = నోటితోఁ బొడువఁగా, వనతరుశాఖలక్ = తోఁట లోని చెట్లకొమ్మలపై, కువకుపధ్వనిక్ = కువకువమనుకూతతో, పాలుపికాం గనక్=పర్విషు నాఁడుఁగోయిలను, పికంబు = మగకోయిల, అనునయము = ఊరడింపు, ఒప్పక్ = ఒప్పునటుల, మాన్పఁగలిక్ = ఆతుమ్మెదగుట్టఁగాఁ గలిగిన బాధను బోఁగొట్టునటుల, ఆత్మముఖంబు=తనముఖమును, ముఖంబుక్= ఆఁడుకోయిలముఖముతో, చేర్చి = జతపఱచి, చుంబన మొనరించెక్ = ముద్దిడుకొనెను. మగవారికృత్యముల్ = మగవారిపనులు, సందు సుడిమాయ లుగా = సమయము చూచి మోసపుచ్చునవి గదా!

నోటికెలంకులు మిగుల మృదువగు భాగములు గానఁ దేఁటిగుట్టిన మిక్కిలి బాధ. శాఖలపైనుండి చివురుల మేయుంతటి తేఁటిగుట్టెగాన దిక్కు సెఱుంగక లేచినది లేచినటులఁ గొమ్మలనడుమనుండి పరుగెత్తెను. కోకిల పరు గెత్తునపుడు కువకువ యనియు సాగియున్నపుడు కోకోయనియుఁ గూయుంట ప్రసిద్ధము.

ఆఁడుకోయిల తేఁటి గుట్టఁగా నవస్థపడుచుండ మగకోయిల మోస ముచేఁ దనపని నెరవేర్చుట వరూథిని విరహావస్థలో నుండ మాయాప్రవరవేష ముతో గంధర్వుఁడు తనపని నెరవేర్చుకొనెనను కథాంశమునకు సూచన.

తా. ఇచ్చెలీ! యాచెట్టునం దొకయాఁడుఁగోయిల చిగురాకు మేయుచో నోరిప్రక్కఁ దుమ్మెద కుట్టఁగాఁ గువకువఁ గూయుచుఁ గొమ్మల మీఁదుగాఁ బర్విడుచుండఁగా పుంస్కోకిలము చూచి బాధ మాన్పునది పోలె దానిమొగముతోఁ దనమోముఁ జేర్చి ముద్దుకొనెను. చూచితివా? మగవారినడవడి సమయము చూచి మోసపుచ్చునవి గదా! అర్థాంతర న్యాసాలంకారము.

క. అని పొగడుచు నొయ్యారపు
టనువున జడ లల్లి జిలుఁగు లగుపయ్యెదలం
జనుకట్లు గట్టి గట్టిగ
ననిమిషకాంతలు లతాంతహరణోత్సుకలై. 83

టీ. అనిమిషకాంతలు = వేలుపుఁజెలువలు, అని = ఇటు లని, పొగ డుచున్ =(ఆవనమనోహరత్వమును) పొగడుచు, లతాంతహరణోత్సుకలై - లతాంత = పూవులను, హరణ = కోయుంటయందు, ఉత్సుకలై = వేడుక గలవారై, ఒయ్యారపుటనువునన్ = విలాసవైఖరితో, జడలల్లి = జడలను వేసికొని, జిలుగులు=సన్ననివి, అగు, పయ్యెదలన్ = పైఁటలచే, గట్టిగన్ = దృఢముగా, చనుకట్టుకట్టి=రవికలమీఁదఁ జేర్చి బిగఁగట్టి-పూవులు గోయుంటకు వెడలి రనుట యిట నధ్యాహార్యము.

తా. ఆదేవతాస్త్రీలు మీఁదఁ జెప్పినవిధముగా నుద్యానవనమును బొగడి యంతటఁ బువ్వులు గోయఁగోరినవారై పుష్పలచెట్లకొమ్మలు మొదలైన వానికిఁ దలవెండ్రుకలు తగులుకొనకుండునట్లుగా జడలువేసికొని పయ్యెఁట జాఱిపోకుండునట్లుగా బొమ్ములపైఁ జుట్టి బిగియఁగట్టుకొని వెడలిరి.

రగడ. నేర్పుమై నల్లయది నెఱులఁ దొలువూఁ దుఱిమె
దర్పకున కర్పింపఁ దలఁప దెంతటి పెరిమె
యింతి పావురపురొద యేల విసె దారజము
వింతయే విరహిణుల వెతఁబెట్టు బేరజము
సురపొన్న క్రొన్ననల్ సొచ్చి నలుగడ వెదకు
తఱుఁగ దందులతావితండంబు క్రొవ్వెదకు
నఱిమి ననుఁ జిపురునకు నగునె కంటక మాడఁ
జాఱుకు మనె వేఱొక్కచోటఁ గంటక మాడఁ
గుందములు నీకొసఁగఁ గూర్చితిని గైశికము
నిందులకు వెల యడుగ నేల విడు వైశికము
చిఱుఁ దేంట్లకొసఁగె గుజ్జెనఁగూళ్లు గొజ్జంగ
యెఱుఁగ కది పూవంద నేల యిటు రజ్జంగ
నెదరింపఁ బోలు నీ వింతి రతిపతిఁ దెగడఁ
బొదలఁ జిగురులతుదలఁ బూచి యున్నది పొగడ
పుడుకు మల్లన గందవాడికి నీప్రేంకణముఁ
దడయ కిటు నీ కిత్తుఁ దగ రత్నకంకణము
నెరసి పోఁ జూచెదవు నిలునిలువుమా కనము
గురియు తేనెల జేబుకొన్న దంతట వనము
కా దల్లయది ఫుల్లకంకేళి పన్నిదము
మోదు గోడిన నీదు ముత్యాలజన్నిదము

ఏటవాలైనయది యీయరఁటి బాలెంత
చేటునకె యగుచూలుచేఁ గలుగుమే లెంత
నెలఁత యీ గేదంగి నీ కబ్బె బుక్కాము
చిలుకునీపుప్పొళ్లొ చెంచెతలబుక్కాము
మితి లేనితేనె నామెత చేసె విరవాది
యితరలతికల మరగి యేఁగు నది పరవాది
కలిగొట్లు ప్రాఁకువేడ్కాలె నీకుఁ దలఁచెదను
నలినాక్షి కడిమిగొండమున కే వెఱచెదను
గురివెంద నదె గెలుబుకొనిరెఁ బఱ్యేరదొంగ
విరుల గరికుంభకుచ వెరఁజా మై యరగ్రుంగ
మెరమెరనికొలనిదరి మీ లందు లకుముకులు
మరగె నీకనుదోయి మాయింపు చకచకలు
ఏకాంత మని తొలఁగె దెందు నీవఁట వేఱు
చేకొనవె మున్నాడి చెలువ యీవటివేరు
అరిది యీయేడాకులరఁటి నగుకప్పురము
పాళ కల్లది పోఁకఁ బ్రాఁక బందము దెగిరెు
సాళి యది దిగజాఱునట్టిచందము నగిరెు
మలయపవనునిఁ బిలిచె మావి ఖళి యీవేళ
మలయుకో వెలపంచమస్వరం బను నీల
సులభ మై దొరకె మంజులవాణి చంపకము
* చిలువానెఁ బూఁబొదలు చేరి యిఁక వంపకుము
చనకుఁ డిఁక దవ్వులకు సఖులార పువ్వులకు
ననుచు నలరులు గోసి రతివ లల్లన డాసి. 84

* చిలుకవన్నె పుఁబొదలు—పా.

(ఈరగడ చెలికత్తెలు పూలుకోయుంతఱిఁ బరస్పరము కావించు సంభాషణరూపముగ నున్నది. కావున నెక్కడిమాట కక్కడనే యన్వయము) అల్లయది = అదిగో నాచెలి, నేర్పుమైఁ = నేర్పుతో, నెఱులఁ = తల వెండ్రుకలలో, తొలుపూఁ = తొల్త గోసినపూవును, తుఱిమెఁ = చెరి వెను. దర్పకునకుఁ = మన్మథునకు, అర్పింపన్ = సమర్పించుటకు, తలఁపదు=తలంపదు, ఎంకటి పెరిమె = (పూవులందు) ఎంతప్రేమయే, (పెరిమె యన గౌరవ మనియుఁ బెద్దఱిక మనియుఁ గొంద ఱర్థముఁ జెప్పియున్నారు. పెద్దఱిక మను నర్థము గ్రహింతుమేని పెద్దఱికముచే మన్మథుని లక్ష్యము చేయలే దని భావము.) ఇంతి = చెలీ, పావురపురొద = పావురాయిమ్రోఁత, ఏల వినెదు = (ప్రశ్న) ఎందులకు వినుచున్నావు? (ఉత్త.) ఆరజము = సొంపైనది. వింతయే=ఇది యంతవింత యైనదా? ఎన్నఁడును విని యెఱుంగ నిదా? విరహిణులన్ = వియోగము పొందినస్త్రీలను, వెతఁబెట్టు వేరజము = ఆయాసపెట్టుకొంటెతనము గలది. సురపొన్నక్రొన్ననల్ = సురపొన్నయొక్క క్రొత్తమొగ్గలను, చొచ్చి = ఆచెట్టులో ప్రవేశించి, నలుగడన్ = నాల్గు వైపులను, వెదకు=నీవు వెదకుము. అందుల తావితండంబు = ఆపూలవలని పరిమళపుసమృద్ధి; క్రొవ్వెదకున్ = క్రొత్తకొప్పునకు, తఱుగదు = తగ్గదు, అఱిమి = మీఱి, ఆక్రమించి, ననున్ = నన్ను, చివురునకున్ = చివురుటాకునకు, కంటకము = పరుషవచనము, ఆడన్ = పలుకుట, నిందఁ జేయుట, అగునె = అనఁదగునా? వేఱొక్కచోటన్ = ఇంకొక్క ప్రదేశమునందు, కంటకము = ముల్లు, ఆడఁ = నాటుకొనఁగా, గ్రుచ్చికొనఁగా ననుట, చుఱుకుమనెన్ = చుఱుక్కుమనెను. కుందములు = మొల్ల మొగ్గలు, నీకుఁ, ఒసఁగఁ = ఇయ్యను, కైశికముఁ = కొప్పునందు, కూర్చితిఁ = చేర్చితిని, పెట్టుకొంటిని. ఇందులకుఁ = ఈపూలకు, వెల = క్రయము, ఆ[illegible]=అడుగుట యెందులకు, వైశికము = బోగముతనము,

(మోసమును) విడు=మానుము, గొజ్జఁగ = గొజ్జఁగపొద, చిఱుఁదేంట్లకున్ = చిన్నతుమ్మెదలకు, గుజ్జెనఁగూళ్లు = ఆటతిండ్లు, (పసిపిల్లలాటలాడు కొనుచుఁ జిన్నిపిడతలతో వండుకొని తినునన్నమునకుఁ బేరు) (పా-చిఱుతేంట్ల కొదవె గుజ్జనఁగూళ్లు=చిన్నితుమ్మెదలకు గుజ్జనగూళ్లు లభించెను.) ఒసఁగెన్ = ఇచ్చెను, అది = ఆవిషయము, ఎఱుఁగక, పూవు, అందన్ = అందుకోఁగా, ఇటు, రజ్జఁగన్ ఏల=నిష్ఠురోక్తు లాడ నేల, ఇంతి=వనితా, నీవు, రతిపతిన్ = మన్మథుని, తెగడన్ = దూఱఁగా, ఎదిరింపన్ పోలున్ = మారుఁడు నీవయి సెదిరించి యుండవలయును. (కనుకనే) పొగడ=పొగడచెట్టు, తుదలన్ = కొనకొమ్మలయందు, చివురులు = చిగురాకులు, పొదలన్ = వృద్ధినొందఁగా, పూచినది=పుష్పించినది. (మన్మథుని దూషింతువేని నాతనికిఁ గుసుమాయుధములు సిద్ధముగా నున్నవి యనుట), అల్లనన్ = మెల్లఁ, గందవొడికిన్ = ఋశ్యమునకు, ఈప్రేంకణము = ఈప్రియాళువును, పుషుకము = కొనవ్రేళ్లతో నానియు నానసటుల నొక్కిపట్టుము. ఇటు=ఈవిధముగా, (పా. తడయకుము=ఆలస్యము చేయకుము) తడయక = ఆలస్యము చేయక, నీకున్ = నీకు, తగన్=(పుష్పాడి త్వరగాఁ గాల్చినందులకు) తగినటుల, రత్నకంకణము= మణులు చెక్కినమురుగును, ఇత్తున్, సెరసిపోన్ = దాఁటిపోవుటకు, (పొదరిండ్లలో దూరి తప్పించుకొనిపోవుటకు) చూచెదవు = యత్నము చేయుచున్నావు, నిలునిలుపుమా = అటులఁబోవల దాగుమాగుము. (అవరాద్ధి వ్యరుక్తి) కనము = అరిగితివేని, తిరిగి నిన్నుఁ గలిసికోఁజాలము, (ఏలన) కురియుతేనెలన్=కాఱుచుండెడు తేనెలచే, అంతటన్=అన్నిచోటులందును, వనము = ఈ యుద్యానవనము, జేబుకొన్నది = క్రిక్కిఱిసియున్నది. అల్లయది = అదిగోనది, (అదూరముగా నెట్టయెదుటఁ గనిపించునది) కాదు = మోదుగుకాదు, ఫుల్లకంకేళి = వికసించిన యశోకవృక్షము, పన్నిదము = పందెము (ఎంత), (మఱొక్కతె యనుచున్నది.) మోదుగు = మోదుగు

చెట్టే, ఓడినన్ = ఓడిపోయినచో, నీదు ముత్యాలజన్నిదము = ముత్యాల సరము (పందెము పెట్టుము) (కామ=అది కంకేళికాదు అనునర్థ మొకా నొకరు వ్రాసిరిగాని యంతకంటె నిదియె సరసము). ఈయరఁటిబాలెంత=పూఁచిన యీ యరఁటిచెట్టు, ఏటవాలైనయది = ఒఱగినది, చేటునకె = చెఱుపునకే, అగుచూలు చేన్ = అగునట్టి ప్రసవము చే, కలుగు మేలు = కలుగు నుపయోగము. ఎంత=ఏపాటిది? (అరఁటిని గెలవైచిన పిదపఁ గొట్టివేయుదు రనుట. అట్టి యపకారమయిన చూలుగనుకనే యిప్పు డిట్టి యవలక్షణము పుట్టినదని భావము.) నెలఁత = వనితా, ఈగేదంగిన్ = ఈపచ్చ మొగిలిని, నీకున్ = నీకు, బుక్కాము = గందవొడి, అబ్బెన్=లభించెను, చిలుకు నీపుప్పొళ్లు = రాలునట్టి యీపూఁదుమ్ము, చెంచెతలబుక్కాణము=చెంచుటాండ్రకు గంధపొడి, విరవాది = విరజాజితీఁగ, మితిలేనితేనెన్ = మేరయేలేనంతమకరందమును, ఆమెతచేసెన్ =(తుమ్మెదకు) విందుచేసెను (ఎంతో తేనియ నొసంగినను ఆ తుమ్మెద దానితోఁ బరితృప్తి గొంచెమేని పొందక) ఇతరలతికలన్ = వెఱతీవలను, మరగి = రుచిమరగి, పోఁగున్ = పోవుచున్నది. అది, పరవాది = పరుల పక్షముఁ బూనునది. (కావునఁ దనివిసననిది తన్ను గారవించినవాని దిరస్కరించు ననుట) నలినాక్షి = ఓచెలీ! నీకున్ = నీకు, తఱచు = విస్తారముగా, ఎదను=మదిని, కలిగొట్లు = పాటలీవృక్షములను, ప్రాఁకుసేద్యాలె = ఎగఁబ్రాఁకవలయు ననుకోరికలే, కడిమిగండమునకున్ = (జాఱిపడినచోఁ గల్గు) పెద్దయాపదకు, అటులఁ బ్రాఁకిన జాఱిపడుట నిశ్చయము గాన నాయపాయమునకె, ఏన్ = నేను, వెఱచెదను = భయపడెదను. కరికుంభకుచ = ఏనుఁగు కుంభస్థలములవంటి గుబ్బలుగలచెలియా! గురివెందన్ = బండిగురివెందతీగెచే, పయ్యెరదొంగ=గాలియనుతస్కరుఁడు, అదె, గిలుబుకొనియెన్= దొంగిలించెను. కొల్లగొనియెను. తావిగల పూవుల నన్నింటి హరించెను. మై = శరీరము, ఆరక్రుంగన్=సగము వంగునట్లు, శరీరమును వంచి, విరులు = గురివెందపూలు, పెరఁజు = ప్రోగుచేయుము. లకుముకులు = టిట్టిభపక్షులు,

(మీలవల్లంకు లంపరు.) మెరమెరని = మెరమెర యని మెఱయుచుండెడి, కొలనిదరిమీలు = సరస్సుగట్టున నుండెడిచేఁపలు, అంచుక = అని భ్రమయుంచు, నీకనుదోయిన్ = నీకన్నులజంటను, మరగెన్ = ఆశించెను. చకచకలు = చకచకలాడు కన్నుల కాంతులు, మాయింపు = అణఁచివేయుము. ఏకాంతము = రహస్యము. అని, తొలఁగెదు = తప్పుకొనెదవు. ఇందున్ = ఇచ్చో, నీవు, వేఱు అఁటే=వేఱయినదానవా, నీవు గూడ మాలోనిదానవే గదా తొలఁగిపో నేల? మున్నాడి=ముందుగా, చెలువ=చెలీ, ఈపటివేఱు = ఈపట్టివేఱును, చేకొనవె=కైకొనవె. ఈతమేడాకులరఁటిన్ = ఈకానఁబడు ఏడాకులయరఁటి చెట్టునందు, అగుకప్పురము = కల్గుకర్పూరము, అరిది = అపురూపమయినది, సాధారణముగా లభించునది కాదు. దానికిన్ = ఆ కర్పూరమునకు, అల శశియొడలు = ఆచంద్రుని మేను, చంద్రబింబము గూడ, సరిరాదు=సమానము కాదు. (ఏలన) ఉరము = ఱొమ్ము, కప్పు = నల్పు, (చంద్రబింబమునకు మధ్యకళంకము గలదు. ఏకళంకము లేక తెల్లఁగా నున్న పచ్చకప్పుర మాచంద్రుని మించినది) పాళకున్ = పూవుగెలకు, అల్లది=అదిగో నాచెలి, పోఁకన్ = పోఁకచెట్టును, ప్రాఁకన్ = ఎగఁబ్రాఁకఁగా, బందము తెగియెన్=కాలికిఁ గట్టుకొనిన త్రాడు తెగిపోయెను. అళి=దానిచెలి, అది దిగజాఱునట్టి చందము = జాఱిపడిపోవుచున్న తెఱఁగు (చూచి) నగియెన్ = నవ్వెను. ఈవేళన్ = ఈసమయమున, బళి = బాగు, మావి=మామిడిచెట్టు, మలయుంకోవెల పంచమస్వరంబు అను ఈలన్ = వ్యాపించునట్టి కోయిలయొక్క పంచమ కూజిత మను ఈలచేత, మలయపవనునిన్ = మలయమారుతమును, పిలిచెన్ (గాలి లేనిచో ఈలవేసినయెడ వీచు నని ప్రతీతి) మంజులవాణి = మనోహర వాక్కులు గలదానా (చెలి), చంపకము = సంపంగి, సులభమై = సులువుగా, దొరకెన్ = లభించెను, పూఁబొదలు = పూలపొదలు, చిలువ ఆసెన్ = పాము అంటినది. చేరి = సమీపించి, ఇఁకన్, వంపకము = వంగలాగకుము, (పాచిలుక వన్నెపుఁ

బోదలు, అన్నెపుఁబోదలు=ఇతరములగు పూఁబోదలు, చిలుకవు=పూలసీయవు) సఖులార = చెలికత్తెలార, ఇఁకన్ = ఇఁకమీఁద, దవ్వులకున్ = దూరమునకు, పువ్వులకున్, చనకుఁడు = పోకుఁడు. అనుచున్, అతివలు = స్త్రీలు, అల్లనన్, డాసి=చేరి, అలరులు=పూలు, కోసిరి. అలం-మెరమెరనియనుచో భ్రాంతిమంతము. కావ్యలింగము. అరిదిశలియొడలు అనుచో ప్రతీపము. లక్షణములు నీటిరేవున నున్న చేఁపల మిగులఁ జులకనఁగాఁ బట్టుకొను ననుటకు.

మ. "కలయన్ నీలమయంపుఁ దల్లియొఱదాఁకన్ దేటనీరొప్పరత్యలకూపంబులమీఁలఁ జూచి వలభీవ్యాసంగితుంగద్రుశా
ఖలలో డాఁగి శుభాలనన్ లకుముకుల్ గ్రంథై పసున్ లేచు."
(ఆముక్తమాల్యద ప్రథ. 57)

క. నాళీకమధూన్మత్తను, రాళీముఖ రాళిసుఖకరంబగుకొలనన్
గేళీలాలసగతి డిగి, యాళీనివహంబు లోల లాలెడువేళన్.

టీ. నాళీక...కరంబు-నాళీక = తామరలయందలి, మధు = మకరందముచే, ఉన్మత్త = మదించిన, మరాళీ = అంచపెంట్లవలనను, ముఖర = ధ్వనిచేయు, అళి = తుమ్మెదలవలనను, సుఖకరంబు = సుఖమును గలిగించునది, అగు కొలనన్ = అగు సరస్సున, కేళీలాలసగతిన్ = క్రీడలయందాసక్తి గల స్థితితో, డిగి = దిగి, ఆళీనివహంబులు = చెలికత్తెలసమూహములు, ఓలలు ఆడెడువేళన్ = ఓలలాలలని యీఁదులాడునెడ. వైపద్యముతో నన్వయము.

తా. తామరతూండ్లు దినియుం దామరపూఁదేనెలు త్రాగియుం మత్తిల్లిన హంసలు దుమ్మెదలు గలిగి సౌఖ్యము గలిగించునదియై యొప్పుచున్న యొక తామరకొలనిలో దిగి వరూథిని చెలికత్తెలుందఱును జలక్రీడ చేయుచుండఁగా.

ఉ. వాడినమోముఁదమ్మి తెలివాలికకన్నులు విన్నఁబోవఁ దో
నాడక నెన్నొసల్ కరమునం దిడి తీరనిషణ్ణయై జలం
బాడఁగఁబిల్చువారినొకహస్తపుమ్రొక్కున నాడుఁ డంచుఁదా
జూడకచూచుచూడ్కినలజోటిదెసల్ పరికింపనొక్కచోన్.

టీ. అలజోటి=ఆస్త్రీ (వరూథిని), వాడినమోముఁదమ్మి = (విరహాతిశయముచే) సోలినపద్మమువంటి ముఖమును, తెలివాలిక కన్నులు = తెల్లనైన నిడుపులైన కన్నులు, విన్నఁబోవన్ = కళదప్పియుండగా, తోన్ = కూడ, ఆడక=(జలక్రీడ) సల్పక, నెన్నొసల్=నిండు నొసలు, కరమునందున్ = అరచేతిలో, ఇడి=ఉంచి, తీరనిషణ్ణ=ఒడ్డునఁగూరుచున్నది, జలంబు ఆడఁగన్= జలవిహారము సేయుటకు, పిల్చువారిన్ = పిలుచుచున్న చెలిమికత్తియలను, ఒక హస్తపుమ్రొక్కునన్=(నొసలు పెట్టుకొన్న చేయిగాక రెండవ) ఒంటి చేతిమ్రొక్కుతో, ఆడుఁడు అంచున్=మీరు సల్పుఁడు (నేను రాను) అని, తాన్, చూడక=ఎదిరివస్తువును గ్రహింపక, చూచుచూడ్కిన్ = చూచెడు రిత్తచూపులతో, దెసల్=దిక్కులు, పరికింపన్ = చూడఁగా, ఒక్కచోన్. వైపద్యముతో నన్వయము.

స్తంభాదులు సాత్త్వికలక్షణములు; అవి యెనిమిది. కన్నులు చిన్నవోవుట మోము వాడుటయుం సాత్త్వికలక్షణములలోఁ జేరినవనుటకు సాధారము.

"స్తంభ ప్రళయ రోమాంచాః స్వేదో వైవర్ణ్య వేపథూ
అశ్రు వైస్వర్య మిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః" (సాహిత్యచింతామణి)

దెసలు పరికించుట ,చెలులు చెప్పినమాటను బట్టి ప్రవరుఁ డెటనేని కానవచ్చునేమో యని, మ్రొక్కుతోఁ బ్రత్యుత్తరము నొసంగుట విరహాతిశయమునఁ బలుకనోడి.

తా. ఆవరూథిని విరహాతిశయముచేత వెలవెలఁబోయిన మోము గలదై తక్క చెలులతో జలక్రీడ సల్పక వామహస్తమున నొసలు చేర్చుకొని-

యొద్దునఁ గూర్చుండి నీ రాడ రమ్మని పిల్చుచెలులకు రెండవ చేతితో నేను రాను మీరు కానిం డని మ్రొక్కి మ్రొక్కుచు నెదిరివస్తువును గ్రహింప నేరని రిక్తచూపుతో గిక్కలను జూచుచుండఁగా నొకవైపున.

మాలిని. రవిరుచిఁ ద్రసరేణువ్రాతముల్ మించువాత్యా
నివహనిహతిలో నిందిందిరశ్రేణు లాడన్
గువలయఘనకుల్యాకూలవల్లీవనీసం
భవము లగుచు మింటన్ బర్వుపుప్పొళ్లలోనన్. 87

టీ. రవిరుచిన్ = సూర్యకాంతియందు (ఎండలో), త్రసరేణువ్రాతముల్ = పరమాణుసమూహములు, మించువాత్యానివహనిహతిలోన్ = అతిశయించుచున్న సుడిగాలియొక్క సమూహముకొట్టుటలో, ఇందిందిరశ్రేణులు = తుమ్మెదల సమూహములు, ఆడన్ = తిరుగుచుండఁగా, కువ...సంభవములు- కువలయ = కల్వలచే, ఘన = దట్టమైన, కుల్యా = కాల్వలయొక్క, కూల = గట్టుయందలి, వల్లీవనీ = తీగల సమూహమునందు, సంభవములు = జనించినవి, అగుచున్ = అయి, మింటన్ = ఆకసమున, పర్వుపుప్పొళ్లలోనన్ = ప్రసరించు పుష్పపరాగములో. త్రసరేణువు: గవాక్షమునుండివచ్చు వెలుఁగులోఁ గానవచ్చు అణువును రజ మందురు. దానిలో నాఱవభాగమును త్రసరేణు వందురు. ఇట్లనుటకు.

శ్లో. "జాలసూర్యమరీచిస్థం సూక్ష్మం యద్దృశ్యతే రజః,
తస్య షష్ఠతమో భాగః త్రసరేణురితి కథ్యతే."

తా. ఎండవెలుఁగులోఁ గానవచ్చు చిన్నిపరాగముతో సుడిగాలి కొట్టఁగాఁ దట్టమైన ఆసుడిగాలిలో నాడుచుండఁ గలువలు నిండిన కాలువల గట్టులందుఁ దీవప్రోవులలోని పుప్పొడులు రేఁగి యాకసమునంతయుఁ నాక్రమించుకొనఁగా నాపుప్పొడిలోన - (పై పద్యముతో నన్వయము.)

సీ. పసిఁడితోరముతోడిబాహు వల్లన నెత్తి
సారెకుఁ బొదలపైఁ జాఁచి చాఁచి
బింబాధరంబు గంపింప నొయ్యన విపం
చీస్వరంబున జట సెప్పి చెప్పి
దిశల మార్గాన్వేషిదీర్ఘలోచనదీప్తి
గణముచేఁ దోరణకట్టి కట్టి
కమనీయతనుకాంతికనకద్రవంబున
నారామురంగంబు నలికి యలికి

తే. యానితంబవిలంబి కాలాహికల్ప
ఘనకచగ్రంథి నచటిభృంగముల కసిత
దీధితులు వడ్డి కొసఁగుచు దేవపూజ
విరులు చిదిమెడికపటభూసురునిఁ గనిరొ. 88

టీ. పసిఁడితోరముతోడి బాహువు—పసిఁడి = బంగారుతోఁ జేసిన, తోరముతోడి = వ్రతకంకణముతోఁగూడిన, బాహువు = భుజమును, అల్లనన్ = మెల్లఁగా, ఎత్తి, సారెకున్ = మాటికిని, పొదలపైన్ = పూవులచే నలరారు పొదలపైన, చాఁచి చాఁచి = సాగించి సాగించి (అందుకొనుటకుఁ జాపి) బింబాధరంబు = దొండపండువంటి మోవి, కంపింపన్ = చలింపఁగా, ఒయ్యనన్ = చక్కఁగా, విపంచీస్వరంబునన్ = వీణాధ్వనివంటి ధ్వనితో, జట=వేదజటను, (ముందు వెనుకపదములను రెట్టించి రెట్టించిచెప్పెడి క్రమమును జట యందురు.) చెప్పిచెప్పి=పలుమాఱు పఠించి పఠించి, మార్గా...గణముచేన్ - మార్గాన్వేషి = త్రోవను వెదకు, దీర్ఘలోచన = పొగ కన్నులయొక్క, దీప్తిగణముచేన్ = కాంతిపుంజముచే, దిశలన్ = దిక్కులను, తోరణకట్టికట్టి = తోరణములుకట్టి, పలుమాఱు దిక్కులను దేరి చూచుచు నని భావము. కట్టుపదము పద్యాదులలోనిది గాన పరమగుటచే సువర్ణలోపమయ్యెను. ఇటులె, జయపెట్టు, భయపడు. కమ...వంబునన్ -

కమనీయ = మనోహరమైన, తనుకాంతి = శరీరకాంతి యను, కనకద్రవంబుచేన్ = బంగరునీటిచే, ఆరామరంగంబున్ = వనప్రదేశమును, (ఉద్యానవన మను నాట్యప్రదేశమును) అలికి యలికి=బంగారు కరిగిన నీటివలె నున్న మేనికాంతి యాప్రదేశమునిండ బాగుగాఁ బూసి, అనితంబ... గ్రంథిన్ - అనితంబ = పిఱుఁదువఱకు, విలంబి=వ్రేలాడు, కాలాహికల్ప = కాలసర్పము వంటి, ఘన = పెద్దదైన, కచగ్రంథిన్ = సిగముడిచే, అచటిభృంగములకున్=అక్కడి తుమ్మెదలకు, అసితదీధితులు = నల్లనికాంతులు, వడ్డికిన్ = వృద్ధికి, ఒసఁగుచున్ = ఇచ్చుచు, తుమ్మెదలు నల్లనివి; పెన్నెరి యింకను నల్లనిది. కాన తన నీలకాంతి తుమ్మెదలకు వడ్డి కీయఁగల్గుట. దేవపూజావిరులు= దేవతార్చనపుష్పములు, చిదిమెడుకపటభూసురునిన్ = కోయుకృత్రిమ బ్రాహ్మణుని, ప్రవరవేషధారియగు గంధర్వకుమారుని, కనియెన్ = వరూథిని చూచెను.

తా. వరూథిని బంగారు వ్రతకంకణముగల హస్తమును బూలకై పొదలమీఁదికిఁ జాచుచు దొండపండువంటి మోవి యదరఁగా వీణాధ్వని వంటి ధ్వనితో జటసెప్పుచు, శ్రోవను నిడుదచూడ్కులచే దిక్కులను దోరణకట్టించుచు కరుగఁ బోసిన బంగరువంటి మేనికాంతిని వనమునెల్ల వ్యాపింపఁజేయుచు బిఱుఁదులవఱకు వ్రేలాడు పెన్నెరుల జాఱుముడిచే నచటి తుమ్మెదల కెక్కువనల్పు నొసఁగుచు దేవతార్చనపుష్పములను గోయు కపటబ్రాహ్మణునిఁ జూచెను. ఉపమాపరిణామనిదర్శనాలంకారములు.

ఉ. కాంచి కలక్వణత్కనకకాంచిక యై యెదు రేఁగి యప్పుడ
కాంచనకేతకీకుసుమగాత్రి వయస్యలడించితన్నికుం,జాంచల
వీథిఁ దాఁటుచు ఘనాంతచలచ్ఛపలాకృతిన్ గలన్, గాంచిన
వస్తువున్ దెలిసి గాంచినయట్లనురక్తిఁ గాంచుచున్. ౬౩

టీ. కాంచి = అకపటబ్రాహ్మణకుమారుని జూచి, అక్కాంచనకేతకీ కుసుమగాత్రి = పసిమి మొగిలిపూవువంటిమేనుగలయావరూథిని, అప్పుడు, వయస్యలన్ = చెలికత్తెలను, డించి=విడిచి, కల...చికరైు-కల = అవ్యక్త మధురముగా, క్వణత్ = ధ్వనిచేయుచు, కనక కాంచిక రై = బంగరుమొల నూలుగలదై, ఎదురేఁగి = ఎదురుగాఁ బోయి, తానే యొంటరిగా నెవ్వతెను సహాయముగైకొనక యతఁ డున్నయెడ కేఁగి, ఘనాంతచలచ్చపలాకృతిన్- ఘన=మేఘములయొక్క, అంత=సమీపమునందు, చలత్=సంచరించుచున్న, చపలాకృతిన్ = మెఱుపువిధముగా, తన్నికుంజాంచలవీథిన్ - తన్నికుంజ= మాయావిప్రుఁడు పూలుగోయుపొదరింటియొక్క, అంచలవీథిన్ = చివరి ప్రదేశమందు, తాఱుచున్ = నక్కుచు, కలన్ = స్వప్నమున, కాంచిన వస్తువున్ = చూచిన పదార్థమును, తెలిసి = మేల్కొని, కాంచినయట్లు = చూచినవిధమున, అనురక్తిన్ = అనురాగముతో, ఆ కపటబ్రాహ్మణుని, కాంచుచున్ = చూచుచు, మీఁదిపద్యముతో నన్వయము.

తా. ప్రవరాఖ్యునిరూపమును దాల్చి యెదుటఁ గానవచ్చిన గంధర్వ కుమారునిఁజూచి ప్రవరుఁడని మనస్సులో నిశ్చయించికొని వానిని బలుమాఱు జూచి కలలోఁ గన్నదానిని మేలుకనినపిదప మరలఁ గాంచినవిధమున సంతసించుచు వయస్యల విడిచి బంగరుగజ్జెలమొలనూలు మ్రోఁగఁగా నెదురుపని, యాతఁ డున్నపొదరింట్లనడుమనే మబ్బులలో మెఱుపు విధమునఁ దాఱుచు. ఉపమోత్ప్రేక్షానిదర్శన లలంకారములు.

ఉ. ఆకమలాక్షి యింపున దృగంచల మించుక మూసి పార్శ్వబా
హ్వాకులకోణశోణరుచు లగ్రమునన్ జనఁ జూచుచూపుతో
రై కనుపట్టెఁ దమ్మరస మంటుకొనన్ వెడవింటివాఁడు క్రో
ధైకధురీణతన్ గఱచి యేసినసింగిణికోలయో యనన్. 90

టీ. ఆకమలాక్షి=ఆవరూథిని, ఇంపుగన్=ఎలమితో, దృగంచలము = జడకన్ను, ఇంచుక మూసి=కొంచెము మూసికొన్నదై (అరమూపుతో),హర్ష... రుచులు-హర్ష బాష్ప=సంతోషబాష్పములచే, ఆకుల=కలఁకఁబాఱిన, కోణ = కనుఁగొనలయొక్క, శోణరుచులు=ఎఱ్ఱనికాంతులు; (పా. శోణకోణరుచులు= ఎఱ్ఱనికనుఁగొనలకాంతులు) అగ్రమునన్=ఎదుర, చనన్ = ప్రసరించునట్లు, చూచుమాపు=కనుఁగొనునట్టిదృష్టి. తీరై=అంతమై, వెడవింటివాఁడు = మన్మథుఁడు, క్రోధైకధురీణతన్=కోపోద్రేకముచే, తమ్మరసము = తాంబూలపు ద్రవము, ఆంటుకొనన్=సోఁకునటుల, కఱచి = వెనకకొఱికి, ఏసినసింగిణి కోలయో=ప్రయోగించినకొమ్ములవింటి బాణమో, అనన్ = అనునట్లు, కనుపట్టెన్ = కనఁబడెను.

తా. ఆవరూథిని యెలమితోఁ గడకన్ను కొంచెము మూసి సంతోషబాష్పములతోఁ గలఁకఁబాఱినకన్గొనలయెఱ్ఱనికాంతులు ముందునకుఁబాఱఁగాఁ జూచినచూపు మన్మథుఁడు కోపోద్రేకముతోఁ దమ్మరస మంటునట్లు కఱచిదీఱఁ గొఱికి ప్రయోగించిన సింగిణికోలయో యనున ట్లుండెను. ఉత్ప్రేక్షాలంకారము.

సీ. తొలుదొల్త వానిఁ గన్నులఁ గాంచినప్పుడ
పల్లవాధరగుండె జల్లు మనియె
నట రెండుమూఁడంజ లరుగునప్పుడ కాళ్లఁ
బంకజాక్షికిఁ దొట్రుపాటు గదిరె
డాయంగఁ జనునప్పుడ ముఖాంబుజంబునఁ
గంబుకంధరకు దైన్యంబు దోఁచెఁ
గదిసి నిల్చినయప్డు కనుదోయి ఱెప్పల
లలనకు మిగులఁ జంచలత బెరసెఁ

తే. గటకటా యనునపుడ గద్గదిక వొడమెఁ
జెఱఁగువట్టినయపుడ లేఁజెమట గ్రమ్మె
సొలసి మాటాడ నుంకింపఁ దలఁచి మోముఁ
దేరకొని చూచునపుడ కన్నీరు వొడమె. 91

టీ. తొలుదొల్తన్=మునుముందు, వానిన్ = ప్రవర వేషధారియగు గంధర్వకుమారుని, కన్నులన్ = కన్నులతో, కాంచినప్పుడ = చూచినప్పుడే, పల్లవాధరగుండె = చివురువంటి మోవిగల వరూథిని డెందము, జల్లుమనియెన్ = చలించెను. జల్లు అనుట ధ్వన్యనుకరణము. ఆటన్ = అవ్వల, రెండుమూఁడు, అంజలు=అడుగులు, అరుగునప్పుడ = చనునప్పుడే, పంకజాక్షికిన్=పద్మములఁ బోలు కనులుగల వరూథినికి, కాళ్లన్ = అడుగులందు, తొట్రుపాటు=తడబాటు, కదిరెన్=కలిగెను, డాయంగన్=చేర, చనునప్పుడ = పోవునప్పుడే, ముఖాంబుజంబునన్ = ముఖపద్మమున, కంబుకంధరకున్ = శంఖమువంటి మెడగల వరూథినికి, దైన్యంబు=దీనతనము, మనస్సులోని విచారముచే బయటికిఁ దోఁచిన వెలవెలపాటు, తోఁచెన్ = కనఁబడెను. కదిసి=దగ్గఱి, నిల్చినయప్డు = నిలుచున్నసమయమునందే, లలనకున్ = వరూథినికి, మిగులన్ = విస్తారముగా, కనుదోయి ఱెప్పలన్ = రెండుకన్నులఱెప్పలను, చంచలత = చాంచల్యము, బెరసెన్ = కలిగెను. కటకటా = అయ్యో! (మోసపుచ్చితివి గదా) అనునపుడ = అనుచున్నపుడే, గద్గదిక=డగ్గుత్తిక, వొడమెన్=జనించెను. చెఱఁగు = (వాని) వస్త్రపుఁగొంగును, పట్టినయపుడ, లేఁజెమట = చిఱుచెమట, క్రమ్మెన్, సొలసి = సొక్కి, మాటాడన్, ఉంకింపన్=యత్నించుటకు, తలఁచి, మోము = (వాని)ముఖము, తేరకొని = తేఱఁబాఱి, చూచునపుడ = తిలకించునపుడే, కన్నీరు = బాష్పములు, వొడమెన్ = పుట్టెను. విచారముచేఁ గ్రమ్మెను.

"భావమ్మనోగతం సాక్షాత్స్వహేతుం వ్యంజయంతి యే, తేఽనుభావా ఇతి ప్రోక్తా భ్రూవిక్షేపస్మితాదయః" అను ప్రమాణముచే రత్యాదులఁ దెల్పు భ్రూవిక్షేపాదు లనుభావములు. ఇవి శారీరములు మానసము లని రెండు విధములు. శారీరములు సాత్త్వికము లని, మానసములు వ్యభిచారు లని పేరు. ఇందు సాత్త్వికభావములు ఎనిమిది. అవి యే వన, —

శ్లో. "స్తంభః ప్రళయ రోమాంచాః స్వేదో వైవర్ణ్య వేపథూ
అశ్రువైస్వర్యమిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః."

ఈ సాత్త్వికభావము లిందు వరూథినికి మాయాప్రవరసందర్శనమునఁ గలిగినటులఁ జెప్పఁబడెను.

తా. ప్రవరుని వేషముతో నున్న యాగంధర్వుని మునుముందుచూడఁగానే యావరూథినికి గుండె జల్లుమనెను. ఆవల రెండుమూఁడడుగులు చనునప్పటికి నడుగులు తడఁబడఁ దొడఁగెను. చేరఁబోవునప్పటికి మోమున దైన్యము తోఁచెను. చేరి నిల్చునప్పటికి రెండుకనులందును జాపల్యము కలిగెను. కటకటా! న న్నింత మోసపుచ్చితివి గదా యనునప్పటికి డగ్గుత్తిక పడెను. పైకొంగు పట్టుకొనఁగానే చిఱుచెమ్మటలు గ్రమ్మెను. మాటాడుటకుఁ దలఁచఁగానే కన్నుల నీరు గ్రమ్మెను. స్వభావోక్తి.

క. పాటితకరిదంతద్యుతి
పాటచ్చరగండఫలకభాగంబులపైఁ
గాటుకకన్నీ రొలుకఁగ
మాట వెడలఁ గ్రేటుకొనుచు మానిని పలికెన్. 92

టీ. మానిని = స్త్రీ (వరూథిని), పాటిత...భాగంబులపై - పాటిత = చీల్పఁబడిన, నడిమికిఁ జీల్పఁబడిన, కరిదంత = ఏనుఁగుదంతములయొక్క, ద్యుతి = కాంతికి, పాటచ్చర = దొంగలైన, గండఫలకభాగంబులపైన్ = ఫలకలవంటి చెక్కిళ్ల పట్టులందు, విరహాతిశయమున స్రుక్కుటచే వెలవెలఁ

బోయి నీరసముగా నున్న తెల్లనిచెక్కులందు, కాటుక కన్నీరు = కాటుక గలిసిన కన్నీటిబిందువులు, ఒలుకంగన్ = చిందుచుండఁగా, మాటవెడలన్ = మాటవచ్చుటకు, క్రేటుకొనుచున్ = గొంతు సరిచేసికొనుచు, పలికెన్ = ఇటు లని యొకమాట చెప్పెను. ఉపమాస్వభావోక్తులు.

ఉ. ఏలర యీచలం బుడిగి యేలర బాలరసాలమాలతీ
జాలములో శశాంకకరజాలములో వలవంత నశ్రువుల్
జాలుగ నాల్గుజాలు లిఁకఁ జాలు భవం బనునంతకాఁకకున్
బాలయి రాత్రి పంచశరుబారికిఁ జిక్కితి నీకు దక్కితిన్. 93

టీ. ఈచలంబు = ఈమచ్చరము, పట్టుదల, ఏలర = ఎందునకురా? ఉడిగి = (చలము) మాని, బాల...జాలములోన్ - బాలరసాల = లేయ్యామామిడిగున్నయొక్కయు, మాలతీ = జాజులయొక్కయు, జాలములోన్ = సమూహమునందు, వాని మధ్యభాగములయందు, ఏలర = ఏలుకొరా, రాత్రి, నాల్గుజాలున్ = నాల్గుజాములును, వలవంతన్ = మదనతాపముచే, అశ్రువుల్ = కన్నీరు, జాలుగన్ = వెల్లువకాఁగా, శశాంకకరజాలములోన్ = చంద్రకిరణసమూహమందు, నిండారఁ గాయు పండువెన్నెలయందు, భవంబు = ఈజన్మము, ఇఁకఁ జాలున్ = ఇంకమీఁదట నవసరము లేదు, అనునంత = అని తలంచునంతటి, కాఁకకున్ = తాపమునకు, పాలు అయి = లోఁబడి, పంచశరుబారికిన్ = మన్మథునిబాధకు, చిక్కితిన్ = లోనైతిని, నీకున్ దక్కితిన్ = నీకు వశమైతిని.

తా. భూసురవర్యా! ఏల యీమచ్చరము? లేమావులతోను జాజిపొదరిండ్లలోను నన్నేలుకొనుము. కడచినరాత్రి యెల్లను గన్నీరు జాలువారఁగా వెన్నెలలో మన్మథబాధకుఁ దాళఁజాలక యిఁక నీజన్మముచాలురా యనునంత చింతకుఁ బాలైతిని. ఇదె నీకు దక్కితిని.

శా. రా వైరాగ్యముఁ బూని నీవు కడు నిర్దాక్షిణ్యచిత్తంబు
నన్, రావై తేఁ జవిగానియిందులకు హోరాహోరిగాఁ బోరి
యే,లా వాలాయము సేయఁగా బ్రదుకు నీ వాచార
వంతుండ వై, చావో యెక్కుడొ నీయెడన్ బొడము
వాంఛన్ భూసురగ్రామణీ. 94

టీ. భూసురగ్రామణీ = బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! రా = రమ్ము, (నన్నేలు కొనుము). నీవు, కడున్ = మిక్కిలి, నిర్దాక్షిణ్యచిత్తంబునన్ = దయలేని డెందముతో, వైరాగ్యమున్ = విరక్తతను, పూని, రావై తేన్ = రాక పోతివేని, చవిగానియిందులకున్ = నీకు రుచింపనిదీనికై, హోరాహోరిగాన్ = సందుబింకముతో, పోరి = పోరాడి, వాలాయము సేయఁగాన్ = నిర్బంధము చేయఁగా, ఏలా = ఎందులకు, నీవు, ఆచారవంతుడవు ఐ = నిష్ఠకలవాఁడవై, వేదవిహితాచారముల నతిక్రమింపక యగ్నిహోత్రరక్షణము ఏకపత్నీవ్రతము నెరవేర్చుచు, బ్రతుకు = జీవింపుము. నీయెడన్ = నీయందు, పొడము వాంఛన్ = పుట్టెడుకోరికచే, చావో = చావుమాత్రమో, ఎక్కుడో = దానికి మించినదో.

నీవు ఆచారమునే యపేక్షించి పరకాంత నని నన్ను వదలుదువా? చెప్పవలసినవి యన్నియుఁ నిదివఱకె చెప్పితిని గాన నిర్బంధించి ఫలము లేదు. అందుచే నాకు సిద్ధించునది చావు. అంత కెక్కుడులేదు గదా! దాని కొప్పుకొని యున్నా నని భావము.

తా. భూసురవర్యా! దయమాలి నన్ను గారవింపక వైరాగ్యము పూని యుండునీతోఁ బ్రేమింపు మని బలవంతపెట్టి పోరాడఁగా నేల? నీవు సదాచారము విడచుకొనక నెఱవేర్చుకొనుచుఁ జిరకాలము బ్రదుకుము. నీపై వాంఛచే నాకుఁ జావో దానికంటె నెక్కువో కలిగిన నేమి! ఆక్షేపాలంకారము.

క. కట్టిఁడితనమున కిట్లొడి
గట్టి మనసు ఱాయిసేసి కరఁగవు మఱి నీ
పట్టినది విడువ విఁక ని
న్నిట్టట్టన నేల మాయదృష్టం బుండన్. 95

టీ. కట్టిఁడితనమునకున్ = కాఠిన్యమునకు, ఒడిగట్టి = పాల్పడి. ఇట్లు = ఈవిధముగా, ఎంతప్రార్థించినను ఆమోదింపక, మనసున్ = హృదయమును, ఱాయి చేసి = ఱాతివలెఁ గఠినముఁ జేసికొని, కరఁగవు = మెత్తఁబడవు, కరుణాభావమును దాల్పకపోతి వనుట, మఱి=మఱియును, నీపట్టినది = నీపట్టును, విడువవు = వదలువాఁడవు కావు, మాయదృష్టము=మాభాగ్యము, ఉండన్ = ఇటు లుండ, ఇఁకన్ = ఇంకపైన, నిన్నున్, ఇట్టట్టనన్ ఏల = ఇది యిట్టని అది అట్టని యనుట దేనికి? నిష్ఠురము లెన్ని యాడినను లాభము లేదు.

తా. బ్రాహ్మణుఁడా! కఠినుఁడవై మనసు ఱాయిచేసికొని యెంత ప్రార్థించినను దయ తలఁపకున్నావు. మా దురదృష్టవశమున నీకింతటి కఠినబుద్ధి కలిగినదిగాని వేఱుకారణముఁ గాదు. ఇఁక నిన్ను నేమనినను లాభము లేదు. మాదురదృష్టమును దూర్చి లోలోన నిందించుకొనవలసినదే. అలం. వ్యాజనింద.

వ. అనిన నక్కుహనాభూసురుండు. 96

టీ. అనినన్ = వరూథిని యిటు లనఁగా, కుహనాభూసురుండు = కపటబ్రాహ్మణుఁ డగు గంధర్వుఁడు.

సీ. కౌనసాఁగి కామినీగోష్ఠిఁ బ్రౌఢములైన
యుదుటుఁజూపుల తెప్పతుదల నాఁచి
[illegible]తసంబున ముఖాబ్జమునందుఁ జిఱునవ్వు
కందళింపక యుండ డిందుపఱిచి

పొంగారుమైఁ దోఁచుశృంగారచేష్టల
  తమిఁ దెచ్చికోలుమౌగ్ధ్యమున డాఁచి
పొడము రసావేశమున వచ్చునర్మోక్తు
  లొదివి నాలుకకు రాకుండఁ గ్రుక్కి
తే. మస్తకము వాంచి యూసు రని మౌనముద్ర
  నేల బొటవ్రేల వ్రాయుచు నిలిచి కొంత
  సేపు వెడవెడ చింతించి శిర సొకింత
  యెత్తి సన్నంపుటెలుఁగుతో నిట్టు లనిరి. 97

టీ. కొనసాఁగి = సమగ్రముగా, కామినీగోష్ఠిన్ = కాముకురాండ్ర తోడిసల్లాపమున, ప్రౌఢములు = గడిదేఱినవి, ఐన యెదుటుఁజూపులన్ = అగు నిబ్బరపుఁజూపులను, ఱెప్పతుదలన్ = కొనఱెప్పలచేత, ఆఁచి = అణఁచి, సంతసంబునన్ = సంతోషమున, ముఖాబ్జమునందున్ = తామరపూవువంటి ముఖమునందు, చిఱునవ్వు = దరహాసము, కందళింపకయుండన్ = అంకురింప కుండునట్లు, డిందుపఱిచి = తగ్గించి, పొంగారుమైన్ = ఉబ్బిపొంగు దేహమును, తోఁచుశృంగారచేష్టలతమిన్ = చూపట్టుశృంగార చిహ్నమాత్రమును, తెచ్చికోలుమౌగ్ధ్యమునన్ = తెచ్చుకొన్న ముగ్ధత్వముచే, డాఁచి = దాఁచి, పొడము రసావేశమునన్ = ఉప్పతిల్లు మోహరసాతిశయముచే, వచ్చునర్మోక్తులు = నోరికి వచ్చెడు మేలపుమాటలను, ఒదివి = క్రమ్మి, నాలుకకున్ = నాలుకమీఁదికి, రాకుండన్ = రానియటుల, క్రుక్కి = నోటిలోననే యణఁచి, మస్తకము = తల, వాంచి = వంచి, ఊసు రని = ఊస్సు అని యొక్క నిట్టూర్పును విడిచి, మౌనముద్రన్ = మాటలాడ కుండునియమముతో, నేలన్ = భూమిమీఁద, బొటవ్రేలన్ = కాలిబొటనవ్రేలితో, వ్రాయుచున్ = అక్షరముల లిఖించునటుల నటునిటు నొరయుచు, వెడవెడ = ఏమో లేని పోనిది, చింతించి = ఆలోచించి, శిరసు = తల, ఒకింత యెత్తి = కొంచెముగ నెత్తి, సన్నంపుటెలుంగుతోన్ = సన్నకంఠధ్వనితో, హీనస్వరముతో (వినఁ

బడినిన(బడనియట్లు) ఇట్టులు = ఈవిధముగా, అనియెన్ = ఈరీతిగాఁ బ్రత్యుత్తరము నొసంగెను.

ఆయాశృంగారలక్షణము నుపాయాంతరములచే మాటుపఱచుటయే గాక తాను పరకాంతావిముఖుఁ డని తెలియుటకు మౌనముద్ర తలవంచుట కాలివ్రేలఁ వ్రాయుట సలిపెను. ఇందుచే గంధర్వకుమారుఁడు జాణ యని గ్రహింప నగును.

తా. ఆప్రవరవేషముఁ దాల్చినగంధర్వుఁ డప్పుడు (నిజముగా బ్రవరుఁ డనిపించుటకై) స్త్రీలతోఁ గలసి మెలసి యుండుటచే గడిదేఱిన యందుటుఁజూపులను ఱెప్పలలోనే యడఁచెను. ముఖమునఁ దోఁచు చిఱునవ్వును గప్పిపుచ్చెను. శరీరమునఁ గనపట్టుశృంగారచేష్టలయుద్రేకమును లేనిపోనిమౌగ్ధ్య మభినయించి డాఁచెను. మోహరసము మీఱివచ్చెడు నర్మవచనములను నాల్కఁ దాఁటనీయకే గుటుక్కుగొనెను. తల వాంచి యున్నా రని మౌనము దాల్చి కాలిబొటనవ్రేలితో నేల రాయుచు నేమేమో లోలోఁ జింతించి యల్లన తల యెత్తి సన్నగొంతుతో నవ్వల ని ట్లనియెను.

శా. తల్లిందండ్రియు నన్నుఁ గాననిమనస్తాపంబునం బొక్కఁగా
నిల్లాలార్తిఁ గృశింపఁగా సవనవహ్నిశ్రేణి చల్లారఁగా, నిల్లున్
శూన్యత నొంది సొంపు చెడఁగా నిచ్చోట నేఁ జిక్కి యో
ఫుల్లాంభోరుహనేత్ర యేసుఖమతిన్ భోగించెదం జెప్పవే.

టీ. ఓఫుల్లాంభోరుహనేత్ర = వికసించిన తమ్మిపూవువంటి కన్నులుగలదానా! వరూథినీ! తల్లిందండ్రియున్ = తల్లిదండ్రులు, నన్నున్, కాననిమనస్తాపంబునన్ = చూడమిచేఁ గలిగిన మనస్సులోని చింతచేత, పొక్కఁగాన్ = పరితపింపఁగా, ఇల్లాలు=భార్య, ఆర్తిన్=వియోగవ్యథచే, కృశింపఁగాన్=చిక్కఁగా, సవనవహ్నిశ్రేణి = యజ్ఞాగ్నులవరుస, త్రేతాగ్నులు, చల్లారఁగాన్ = ఆఱి చల్లఁబడిపోవఁగా, ఇల్లున్=గృహమును, శూన్యతన్=

లేమిని, ఒంది=పొంది, పాడువడి యని యొకరర్థముచెప్పిరి, సొంపుచెడఁగాన్ = నింపుతనము మాయఁగా, ఇచ్చోటన్ = ఇక్కడ, నేన్ = నేను, చిక్కి = చిక్కుకొని, ఏసుఖమతిన్ = ఎట్టిసుఖేచ్ఛతో, భోగించెదన్ = నీతోసంభోగింతునో, చెప్పవే = నీవే చెప్పుము.

తా. ఉవిదా! నేను తమకన్నులయెదుట లేక యీకాననిక్రాంతలయం దుండుటచే నాకల్లిదండ్రులు నాయునికి తెలియక చింతిల్లుచుండ, నా భార్య వియోగదుఃఖ మనుభవించుచుండఁగా, యాజ్ఞికాగ్నులు చల్లారి పోఁగా, గృహము పాడ్వడఁగా, నే నిక్కడఁ జిక్కి యుండి సౌఖ్య మెట్ల పేక్షింతును? ఎట్లు నీతో భోగము లందుదును? నీవే చింతింపుము.

ఆర్తి యను విరహతాప మని నరసభూపాలీయమునం దొసఁగఁబడిన యుదాహరణము.

క. "బెడిదపుమదనజ్వరమున, మిడిసిపడున్ హారలతలు మృగలోచనకున్
వెడవిలుతువింటికోలల, వడువున సతి నింక నేచవలదు నృసింహా."

(ఆశ్వా. 3.)

ఉ. ఓసరసీరుహాక్షి వినవో రతిఁ గౌఁగిట నీవు చేర్చునిం
పాసురభర్తకైనఁ గలదా వల దంచుఁ బెనంగ నేను స
న్న్యాసినె యొక్కచో తహతహన్ మన సొగ్గదు కేళిపై 'ననా
శ్వాసితదుఃఖితే మనసి సర్వ మసహ్య' మనా నెఱుంగవే.

టీ. ఓసరసీరుహాక్షి = తామరపూవులవంటి కన్నులు గల వరూథినీ! వినవో = విన్నావుకావా, రతిన్ = సంభోగమునందు, నీవు కౌఁగిటన్ చేర్చునింపు = నీవు కౌఁగిలించుకొనఁగాఁ గలుగునానందము, ఆసురభర్తకైనన్=ఆయింద్రునకైనను, (సర్వసౌఖ్యముల ననుభవించునట్టి యింద్రునికేని యనుట) కలదా; వలదు = అక్కఱలేదు, అంచున్=అని, పెనఁగన్ = పెనఁగులాడుటకు, ఏను = నేను, సన్న్యాసినె = సన్న్యాసినా యేమి,

ఒక్కటే తహతహాన్ = (తల్లిదండ్రులు మొదలగువా రేమైరోయను) నెడ తెగనివిచారముచే, కేళిపైన్ = భోగముమీఁద, మనసు, ఒగ్గదు = పోదు. సంభోగేచ్ఛ జనింపక యున్నది! మనసి = మనస్సు, అనాశ్వాసిత = ఊఱట లేనిదియు, దుఃఖితే = దుఃఖమునొందినదియు నగుచుండ, సర్వం = ఎల్లను, అసహ్యం=రోఁతగలదే, అటాన్=అనఁగా, ఎఱుఁగవే=నీవునిని యెఱుంగవా!

రతి యన "యూనోరన్యోన్యవిషయాస్థాయినీచ్ఛారతిర్భవేత్" అలంకారిక నిర్వచనము. ఇది నరసభూపాలీయమునందు "సంభోగవిషయ మగు నభిలాషస్ఫురణము మనములఁ బొడమిన ధరలో నది రతి" అని చెప్పఁబడెను.

తా. ఉవిదా! నాపల్కు వినుము. ప్రేమతో నీవు కౌఁగిటఁజేర్చికొనఁ గలుగునానంద మాయింద్రునకైనఁ గలుగదు. నీ విట్లు నన్నుఁ బ్రేమించుచుండఁగాఁ గూడ దని పెనఁగులాడుటకు నే నేమి సన్న్యాసినా? 'ఇల్లేమయ్యెనో? తలిదండ్రు లేమైరో? కులకాంత యెట్లుండెనో?' అను పెద్ద తహతహచే మనసుగొల్పకున్నది. ఎఱుఁగవా? "అనాశ్వాసితదుఃఖితే మనసి సర్వమసహ్యమ్" (మనస్సు ఊఱట లేక చింతిలుచుండఁగా సర్వమును నసహ్యమగును) అనుపల్కును. అట్టివెతయే నాకు లేకున్నచో నాకయి నేను నీకొఱకు వెదకికొనుచు రాకయుందునా? అలం. అర్థాంతరన్యాసము, అర్థాపత్తి, ప్రతిషేధము.

క. ఐనన్ గానిమ్ము భవ
ద్దీనతకై వ్రతము విడిచితిన్ బరులకు మే
లైనన్ జాలు శరీరం
బైన నుపేక్షింపవలయు నది యట్లుండెన్. 100

టీ. ఐనన్ = అటులైనను, కానిమ్ము = కానీ, నామనసు ఎటు లున్నను దానింగూర్చి విచారింపను. భవద్దీనతకై = నీదీనత్వమును జూచి,

వ్రతము=ఇఁకమీఁద నిడి కోరనని యేర్పఱచికొన్నకట్టుపాటు, విడిచితిన్=ఇపుడె విడనాడితిని. పరులకున్ = ఇతరులకు, మేలైనన్ = మంచికలిగినను, చాలున్ = అంతియ చాలును. శరీరంబైనన్ = ఈదేహమునైనను, ఉపేక్షింపవలయున్=విడిచిపెట్టవలయును. అని=ఆవిషయము, అట్టుండెన్=అట్టుండఁగా.

తా. నాస్థితి యిటు లున్నను దానినిగూర్చి నే నించుకేనియుఁ సంకోచింపఁబోను. నీ వింతగా దైన్యపడి యడుగుచున్నావు గావున నానియమము విడనాడితిని. శరీరము విడిచి యైనను నితరులకు మేలు చేయవలయుఁ. ఆవిషయ మట్లుండనీ. అలం. అప్రస్తుతప్రశంస, కావ్యార్థాపత్తియును.

క. తివురక యిం కొక్కటి విను
కవయునెడన్ వలయుఁ గన్నుఁగవయును మూయన్
భువి నివి యస్మద్దేశ
వ్యవహారము కన్నుఁ దెఱచ నఘ మగుఁ దెఱవా. 101

టీ. తెఱవా = ఓవిదా! తివురక = తొందరపడక, ఇం కొక్కటి వినుము = ఇంక నొకసంగతిని చెలిపెద నాలకింపుము. కవయునెడన్ = కలయికచెందునప్పుడు, కన్నుఁగవయున్ = నేత్రద్వయమును, మూయన్ = మూసికొనుట, వలయున్ = ఆవశ్యకము, భువిన్ = భూమియందు, కన్ను దెఱవన్=కన్నులను దెఱచుటచేత, అఘమగున్ = పాపము కలుగును. ఇది = సంభోగసమయమునందుఁ గన్నుమూసికొనుట, అస్మద్దేశవ్యవహారము = మాదేశాచారము.

నిజముగా దోసమేని మా కీయాచార మేల యాచరణమునందు లేక పోయె నని పరూధిని యనునేమో యనిమాయాప్రవరుఁడు అస్మద్దేశవ్యవహారమనెను. అఘ మనుటచేఁ బాపమునకు వెఱచి యటులఁ జేయకుండు నని యొండొకగుట్టు మరుగుపడ కుండు ననియును.

తా. వరూథినీ! ఆత్రపడక మఱొక యీమాటనుగూడ వినుము. భూమిలో మాదేశమున సంభోగసమయమందుఁ బరస్పరము స్త్రీపురుషులు చూచుకొనరు. కన్నులు మూసికొందురు. కన్నులు దెఱచిన పాప మగును. కావ్యలింగాలంకారము.

శా. ఈమర్యాదకు నీవొడంబడిన మే లీభంగి గాదేని మా
భూమిన్ జేరఁగ నెట్లు నీయొడలితోఁ బోవంగ లేనే కదా
యీమందాకినిప్రాంత నీమునులతో నీవృక్షవాటంబులో
భామా యేఁదప మాచరింతు విధి కబ్రహ్మణ్యమున్ బెట్టుచున్.

టీ. భామా! ఈమర్యాదకున్ = ఈహద్దునకు, నీవు, ఒడంబడితేన్ = అంగీకరించినయెడ, మేలు = మంచిది. ఈభంగి = ఈరీతి, కాదేనిన్ = సంభవింపనియెడ, మాభూమిన్, ఎట్లున్ = ఏవిధమునను, ఈయొడలితోన్ = ఈశరీరముతో, చేరఁగన్ = చేరునటుల, పోవంగన్ = పోవుటకు, లేనే కదా = అసమర్థుఁడనేకదా! ఈమందాకినీప్రాంతన్ = ఈయాకాశగంగానదీ తీరమునందు, ఈమునులతోన్ = ఈతపస్సు చేయుచున్న ఋషీశ్వరులతో, ఈవృక్షవాటంబులోన్ = ఈచెట్లచాలున, ఏన్ = నేను, విధికిన్ = దైవమునకు, అబ్రహ్మణ్యమున్ = చంపవలదని మొఱను, "అబ్రహ్మణ్య మవధ్యోక్తౌ" అమరము, చంపవల దనుట. పెట్టుచున్ = ఒనరించుచు, తపము=తపస్సు, ఆచరింతున్ = చేసెదను.

లోకములో సుఖముగూర్చునవి రెండే. గంగాతీరమున తపస్సో, కామినీసంగమమో. ఈయంశమె భర్తృహరియం దిటులఁ జెప్పఁబడినది.—

శ్లో. "ఆవాసః క్రియతాం గాంగే పాపహారిణి వారిణి
స్తనద్వయే తరుణ్యా వా మనోహారిణి హారిణి." (శృంగారశతకము.)

తా. వరూథినీ! ఈనియమమునకు నీ వంగీకరించితివా మేలు. లేదేని నే నీశరీరముతో మాయిల్లు చేరనే లేను గదా! ఈగంగయొడ్డున నీమునులతో

నీ చెట్టుతోఁపులో దైవమా నన్నుఁ జంపవల దని మొఱపెట్టుచుఁ దపము కావించుచు నిచటనే యుందును.

తే. ఇంక నొక్కటి వినుము పూర్ణేందువదన
వ్రతము చెడ సౌఖ్యమైనను వలయుఁ గలుగ
వాంఛితము దీర నను నీవు వదలఁ జెల్ల
దేను నిను సమ్మతిలఁ జేసి యేఁగుదనుక. 103

టీ. పూర్ణేందువదన = పూర్ణచంద్రునివంటిముఖముగలదానా! (వరూథినీ), ఇంక నొక్కటి, వినుము, వ్రతము చెడన్ = నోముచెడినను, సౌఖ్యమైనన్ = సుఖమైనను, వలయున్ కలుగన్ = కలుగవలయును, వాంఛితము = కోరిక, తీరన్ = తీరఁగా, ననున్, నీవు వదలన్ = నీవు విడిచిపెట్టుట, చెల్లదు = కూడదు. ఏను నినున్ = నేను నిన్ను, సమ్మతిలన్ చేసి = అంగీకరింపఁజేసి, ఏఁగుదనుకన్ = వెడలువఱకును, (నీవు నన్ను) వదలఁజెల్లదు = విడిచిపెట్టఁగూడదు.

తా. వరూథినీ ! వ్రతము చెడినను సుఖమయినను దక్కవలెను. కావున నీ వాంఛితము తీరఁగానే నన్ను వదలెదవేమో? అది తగదు. నేనై నీసమ్మతిని బొంది వెడలువఱకును నీవు నన్ను విడువరాదు. లోకోక్త్యలంకారము.

వ. ఇంతయేమిటికి కంచుకినిఁ జెప్పెద నేను వైదేశికుఁడ బంధుమిత్రకళత్రంబులం బాసి దైవయోగంబున నింతదూరం బేఁగుదెంచినవాఁడ మీఁద భవదర్థంబు ప్రార్థితుండ నై వ్రతహోమాద్యనుష్ఠానంబులు విడువం గలవాఁడ నగుటం జేసి యంతరంగంబునం గల తెఱంగు తేటపడం బలుక వలసె నాకర్ణింపుము. 104

టీ. ఇంత యేమిటికిన్ = ఇన్నికష్టఁబాటు లేల, అంటేన్ = అనుదు వేని, చెప్పెదను = నీకుఁ దెలియఁజెప్పెదను. వినుము = (నీవు) ఆలకింపుము. (అనుమానింపకుంటకుఁ దనమాటలకుఁ గారణాంతరములు కల్పించుచున్నాఁడు.) ఏను = నేను, వైదేశికుండన్ = పరదేశిని, బంధుమిత్రకళత్రంబులన్ = చుట్టాలను, స్నేహితులను, భార్యను, పాసి = ఎడఁబాసి, దైవయోగంబునన్ = విధివశమున, ఇంతదూరంబు, వీఁగుదెంచినవాఁడన్ = వచ్చినవాఁడను, మీఁదన్ = అటుపై భవదర్థంబు = నీకొఱకు, ప్రార్థితుండనై = నీచే వేఁడుకొనఁబడినవాఁడనై (నీవు మిగులఁ బ్రార్థింపఁగాఁ దొలఁగఁజాలక) వ్రతహోమాద్యనుష్ఠానంబులు = నియమములు అగ్ని కార్యములు మొదలగు నిష్ఠలను, సాంతపనాదివ్రతములు వైశ్వదేవాది హోమము లనుట. విడువఁగల వాఁడను = విడిచిపెట్టనున్నవాఁడను, అగుటంజేసి = కావున, అంతరంగంబునన్ = మనస్సునందు, కలతెఱంగు = ఉన్నవిధము, తేటపడన్ = విస్పష్టమగునట్లు, పలుకవలసెన్, ఆకర్ణింపుము = వినుము.

ఉ. నీచనుదోయిసంకుమదనిర్భరవాసన మేన నూనఁ, జిర
సౌఖ్యముల్ గనుటయొండెఁ దపంబొనరించి పాపముల్
రాచుట యొండెఁ గా కిహపరంబుల కూరక దూరమై వయ
శ్శ్రీ చన నెంటికిన్ జెడిన రేవఁడ నౌదునె నీరజేక్షణా. 105

టీ. నీరజేక్షణా = కమలములవంటి కన్నులుగలదానా! (వరూథినీ) నీచను...వాసన-నీచనుదోయి = నీకుచద్వయమునందలి, సంకుమద = జవ్వాజి యొక్క, నిర్భరవాసన = మెండయినపరిమళము, మేనన్ = శరీరమున, ఊనన్ = తాఁకఁగా, చిరసౌఖ్యముల్ = పెద్దకాలముసుఖములను, కనుటయొండెన్ = పొందుటయైనను, కౌఁగిట బిగించి నీగుబ్బలు మేనొరయుచుండ సుగంధాతిశయమున కానందింపక యనుట. తపంబు = తపస్సు, ఒనరించి = చేసి, పాపముల్ = కలుషములను, రాచుటయొండెన్ = నశింపఁజేయుటయైనను, కాక =

(తగును) కాని, ఇహాపరంబులకున్ = ఈలోకమునకుఁ బరలోకమునకును, ఊరక=వ్యర్థముగా, దూరమైన=దవ్వై, ఇహలోకసుఖ మగు, నప్సరఃకాంతాభోగసౌఖ్యమును బరలోకసుఖ మగు మోక్షమును ననుభవింపక, వయశ్శ్రీ=యౌవనసంపద, చనన్ = పోఁగా, రెంటికిన్ = రెండుకృత్యములకు, చెడిన రేవఁడన్ = చెడిపోయిన చాకలివాఁడను, ఔదునె! అయ్యో! రెంటికిం జెడినరేవఁడు.—ఒకచాకలివాఁడు ఏటిలో గుడ్డ లుదుకఁబోయి,నొకతాతిపైఁ గొన్నియుదికినబట్టలఁ బెట్టి మఱొక తాతిమీఁద బట్టల నుదుకుచుండఁగా వెల్లువ వచ్చెను. అపుడు వాఁ డుదికిపెట్టిన గుడ్డలకై పర్వెత్తఁగా నచ్చటికిఁ జేరునంతలో నాగుడ్డలు కొట్టుకొనిపోయెను. అటనుండి మరల రెండవతాతి దగ్గరకు వచ్చునప్పటికి నవియుఁగొట్టుకొని పోయెను. తెలివి తక్కువదన ముచే నొకరేవులోని బట్టలనైనను గాపాడుకొనఁజాలక పోయెను. కావున దానిఁబట్టి "రెంటికిం జెడినరేవఁడు" అనుసామెత యేర్పడెను.

రేవఁడు అనుట దప్పనియు రేవణ యనుటయే యుక్త మనియు. జూలూరి అప్పయ్య పండితులటీకలో రేవణ యనియె కలదనియు లక్ష్మీనారాయణ ఇత్యాదులలో నిదిచేరినదనియుఁ జిన్నయసూరివ్యాకరణము బయలు చేరినపిదప నీపదము సంస్కరింపఁబడి చాకలివాని కథతో మొన్న మొన్న ముడిపెట్టఁబడిన దని అ. ఉ. గారు వ్రాసి యాధారముగా నీక్రిందిశ్లోకము నుదాహరించిరి.—

"ఉంబేకః కారికాం వేత్తి తంత్రం వేత్తి ప్రభాకరః
మండనస్తూభయం వేత్తి నోభయం వేత్తి రేవణః."

శ్లోకవార్తికము, తంత్రవార్తికము రానిరేవణయే యిందలిరేవణ యని ముడిపెట్టిరి. పైఁగా నీతని నాంధ్రుఁడనిరి. 1851 లో ముద్రితమైన జూలూరి అప్పయ్య పండితులవారి వ్యాఖ్యలో రేవఁడు అనురూప మెగలదు. చాఁకలికథ యావ్యాఖ్యలో నుదాహరింపఁ బడినది. 1893 లోన మార్పు గలిగె ననుట సాహసము.

రేవు+అన్న, చాఁకిరేవులో నుండువాఁ డనుటలో రేవన్నయను పదము నిష్పన్నమై దానిరూపాంతరము రేవఁడు అయి యుండును. లేదా రేవఁడు ప్రత్యేకము నామమైనఁ గావచ్చును. ఇహపరసుఖములకు దూర మగుట కిచ్చిన యీసర్వసామాన్యతార్కాణము ఎవ్వ రెఱుంగని రేవణా చార్యునకు ముడిపెట్టుట యుచిత మని తోఁచుట లేదు. తాళపత్త్రగ్రంథ ములలోఁ బెక్కెంట రేవఁ డనురూపమె కనుపించుచున్నదిగాన దీనినిగూర్చిన చర్చ యుపేక్షార్హము. రేవఁ డనుపదము గౌరన హారిశ్చంద్రద్విపదయందు కాలకౌశికునిభాషణములందు చాఁకలి యనుతలంపుతో నిట్లుచెప్పెను.

ద్వి. దక్కితివని నమ్మఁదగదు. నిన్నెపుడు, కుక్కకూఁతుర! మెడఁగోసిపోఁగలవు
రెండు పోనాడిన రేవనిరీతి, నుండబాలకు నిన్ను నోరంతప్రొద్దు."

తా. వరూథినీ! జవ్వాది వాసనలు మెండుగా గుబాళించు నీచనుఁ గవఁ జక్కఁగాఁ గౌఁగిలించుకొని పెద్దకాలము సుఖమైన ననుభవింపవలె, లేదా తపము కావించి పాపముల నెల్ల నశింపనైన జేసికొనవలెఁ గాని దాని కిని జెడి దీనికిని జెడి యిహపరములఁ బోఁగొట్టుకొని రెంటికిఁ జెడిన రేవఁడను గా నొల్లను. కావున నాకై నేను నిన్ను వదలి పోవునంతవఱకు నన్ను పీడకుండునటుల బాసగావింతువేని నీతోఁ గలసిమెలసియుండెదను. అటులఁ జేయ నియ్యకొనవేని యిపుడె నాత్రోవ నేను జూచుకొందును. లోకోక్త్య లంకారము.

క. అని యాస గలుగఁ బలికిన
విని వేలుపువెలఁది మోము వికసిల్లంగాఁ
దనచేతిచెఱఁగు బిగియన్
బెనఁచుచుఁ దల వాంచి నగవు బెరయఁగఁ బలికెన్. 106

టీ. అని = ఇటులని, ఆసగలుగన్ = కోరికపుట్టునటుల, పలికినన్ = మాయాప్రవరుఁడు పలుకఁగా, వేలుపువెలఁది = దేవతాస్త్రీ, విని, మోము =

ముఖము, వికసిల్లంగాన్ = విరియఁబాఱఁగా, తనచేతిచెఱఁగు = తనచేతఁ గైకొన్న యూకని ఉత్తరీయపుఁగొంగును, బిగియన్ = బిగియుచునట్టుల, పెనఁచుచున్ = చేత మెలివేయుచు, నగవు, బెరయఁగన్ = కలుగఁగా, తల వాంచి = తలవంచుకొని, పలికెన్ = ఈవిధముగా నొక్కమాట పలికెను.

శా. హా నీనిష్ఠురవృత్తి మాని కరుణాయత్తచిత్తంబునన్
మానన్ జాల నటంచు నేఁడు శ్రవణానందంబుగాఁ బల్కుటన్
సూనాస్త్రున్ వెలపెట్ట కేలితి సుఖార్ణోరాశిలోఁ గ్రుంకితిన్
నానోముల్ ఫలియించె నావయసు ధన్యం బయ్యె విప్రోత్తమా.

టీ. విప్రోత్తమా = బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! హా = ఔరా, (ఆఁ=సరే యని పా.) నీనిష్ఠురవృత్తిన్ = నీకాఠిన్యమును, మాని = విడిచి, కరుణాకాయత్తచిత్తంబునన్ = దయకే యధీనమయిన మనస్సుతో, కేవలదయాస్వభావముతో, మానన్ చాలను = విడువలేను, అటంచున్, నేఁడు, శ్రవణానందంబుగాన్ = చెవులపండువుగా, పల్కుటన్ = అనుటచేత, సూనాస్త్రున్ = మదనుని, వెలపెట్టక = జీతము బత్తెము నీయక, ఏలితిన్=బంటుగా నేలుకొనఁగలిగితిని, సుఖార్ణోరాశిలోన్ = సౌఖ్యసముద్రమున, క్రుంకితిన్= మునిఁగితిని. నానోముల్ = నావ్రతములు, ఫలియించెన్ = పండెను. నావయసు = నాయౌవనము, ధన్యము = కృతార్థము, అయ్యెన్ = ఆయెను. (క్రుంకితిన్ అనుచోఁ జొక్కితిన్ అనియు నావయసు అనుచో నాతలము అనియుఁ బాఠాంతరములు.)

తా. భూసురవర్యా! ఎన్నిచెప్పినను మునుపటివలెఁ గఠినభావము వహించి నన్ను ఖేదపఱుపక, నేఁడు దయ దాల్చి నిన్ను విడువఁజాల నని పల్కుటచే మన్మథుని జీతబత్తెములు లేనిబంటునుగా నేలితిని. సుఖసముద్రమున మునిఁగితిని. నానోములు పండినవి. నాప్రాయము కృతార్థమయ్యెను. రూపకాలంకారము.

వ. నీవెట్లు చెప్పి తట్లుసేయంగలదాన నని యతని నొడంబఱుచు
సమయంబునం దోడినెచ్చెలు లచ్చకోరాక్షిం గూడుకొని.

టీ. నీవు, ఎట్లు చెప్పితి = ఏవిధముగా నడుచుకొనవలయునని యాజ్ఞ కొసంగితివో, అట్లు = ఆవిధముగానే, చేయంగలదానను=చేసెదను (నడచు కొందును), అని, అతనిక్ = ఆప్రవరాఖ్యుని, ఒడంబఱుచుసమయంబునక్= (తనతోడికూటమికి) అంగీకరింపఁజేయువేళ, అచ్చకోరాక్షిక్ = చకోర పక్షులవంటి కన్నులుగల యావరూథినిని, కూడుకొని = చేరి, వైపస్యముతో నన్వయము.

సీ. అకట నిర్దయబుద్ధి వని దూఱెఁ గడు రంభ
యాహా వివేకివా దనియె హరిణి
చేఁదు మ్రింగెద వంచుఁ జిలికి నవ్వె ఘృతాచి
మాయలాఁ డని తిట్టె మంజుఘోష
న్యాయనిష్ఠురములఁ బ్రార్థించె నూర్వశి
జంకించె రమ్మంచుఁ జంద్రరేఖ
చెలి నేఁచి తని దిసంతులు గొట్టె మేనక
విడువు మాయ లటంచు నొడివె హేమ
తే. గొంట వనియెఁ దిలోత్తమ గూర్మిఁ గొసరె
ధాన్యమాలిని పుంజికస్థల యదల్చె
దివిజకామిను లీరీతిఁ దిరుగువాఁటె
గఁవ్వకోల్గొంచుఁ దమలోన నవ్వుకొంచు. 109

టీ. అకట = అయ్యో! నిర్దయబుద్ధివి = దయలేనిడెందముగలవాఁ డవు, అని, కడుక్ = మిగుల, రంభ, దూఱెక్ = నిందచేసెను, హరిణి అనునప్సరస, ఆహా! వివేకివి = వివేకముగలవాఁడవు. చేఁదు = అగుదువు, అనియెక్ = అనెను, తనకై తాను వలచిరాఁగా వేలుపుఁజేడియను నీవు గాన

విడచితివి, ఇంకొకఁ డెవఁడేని విడచునా? నీవివేకము నడుగవలయునా యని యాక్షేపణ. (అట్టికాంత వలచి వచ్చినపుడు విడనాడ నెంచితివే యెంత యవివేకివి! అనెను.) ఘృతాచి, చేఁదు మ్రింగెదవు=చేఁదుపదార్థమును మ్రింగుచున్నావు బలవంతమున నంగీకరించితివి. వరూథినిపొందు నీకు చేఁదువస్తువు మ్రింగినట్లుండెనే) అంచున్, చిలికి = వెల్లడిగా, నవ్వెన్, మాయలాఁడు = మోసగాఁడు, అని, మంజుఘోష = ఈ పేరుగలయచ్చరపొలఁతి, తిట్టెన్ = దూషించెను. (వలపు దాఁచికొని యుద్యానవనము దాఁగియుంటయే మోసము) న్యాయనిష్ఠురములన్ = న్యాయముగల నిష్ఠురోక్తులతో, ఊర్వశి, ప్రార్థించెన్ = వేఁడుకొనెను, రమ్మని=ఈబెట్టుసరిపొందులకు, రమ్మంచున్ = ఇఁక లేచిరావయ్యా యని, చంద్రరేఖ, జంకించెన్ = భయపెట్టెను. చెలిన్ = చెలిమికత్తెయగువరూథినిని (పా. నొంచితివి = నొప్పించితివి.) కపటవిరాగముతో విరహపరవశురాలగు వరూథినిని అవస్థలఁబెట్టితి వనుట, ఏఁచితి = బాధించితివి, అని, మేనక, దిసంతులుగొట్టెన్=నిందించెను, మాయలన్=మోసపుఁజేష్టలను, విడు+ఆటంచున్ = వదలిపెట్టుము అని, (విడువు మీల యని పాఠాంతరము, ఈల=సిగ్గు) హేమ, నొడివెన్ = పల్కెను, గొఁటవు = గడసరివి, (అని) తిలోత్తమ, అనియెన్ = వాకొనెను, కూర్మిన్ = ప్రేమతో, ధాన్యమాలిని, కొసరెన్ = కోరెను, పుంజికస్థల, అదల్చెన్ = బెదరించెను. దివిజకామినులు = దేవతాస్త్రీలు, ఈరీతిన్ = ఈవిధముగా, తిరుగువాఱి = చుట్టుమూఁగి, గువ్వకొల్గొంచున్=గుంపుగూడుచు, (పా. గువ్వకరిగొండ్రు= గుంపుగూడికొందురు.) తమలోనన్ = తమలోఁదాము, నవ్వుకొంచున్ = నవ్వులాడుచు, ఉండిరి అధ్యాహారము.

క. అకుహనాఘాసురుఁ డపు
డా కాంతలసరససమ్మదాలాపములన్
గైకొనుచు ముదితహృదయుం
డై కేలీవనము వెడలి యరిగి కుఱంగటన్. 110

టీ. అప్పుడు = అచ్చెరవిటుల మాటలాడుతఱి, ఆమాయాభూసురుఁడు = ఆకపటబ్రాహ్మణుఁడు, ఆకాం...పములన్ - ఆకాంతల = ఆస్త్రీలయొక్క, సరస = రసవంతములయిన, సమ్మదాలాపములన్ = సంతోషసంభాషణములను, కైకొనుచున్ = అంగీకరించుచు, ముదితహృదయుండు = సంతోషించిన మనస్సు కలవాఁడు, ఐ, కేళీవనము = ఉద్యానవనము, వెడలి = అరిగి, కుఱఁగటన్ = చెంతన్.

ఆస్థలము వదలుట యచ్చెరలనుడువులకు లజ్జించినవానివలె నటించుటకు.

తా. వేల్పుచెలువలందఱీవిధముగా సరసాలాపము లొనరించుచుండ వారలప్రసంగములను సంతోషహృదయముతో మాయాప్రవరాఖ్యుఁ డాలకించుచుఁ జెంత నున్న యుద్యానవనమున కేఁగెను.

సీ. మృగనాభినికరంపుబుగబుగల్ గలచోటఁ
జవలేటితుంపురుల్ చెదరుచోట
వకుళవాటీగంధవహుఁడు పైకొనుచోటఁ
గర్పూరతరుధూళి గప్పుచోటఁ
బసమీఱుసెలయేఱు లిసుకవెట్టినచోటఁ
జిగురుమావులసంజ నిగుడుచోట
నవమాలికలతీవెన ట్లుట్టిపడుచోట
మాణిక్యదీపముల్ మలయుచోటఁ
తే. బ్రమదమునఁ దేఁటు లెలుఁగెత్తి పాడుచోటఁ
శారిక లనంగశాస్త్రముల్ చదువుచోటఁ
గీరకలకంఠములు క్రొవ్వి కేరుచోటఁ
బావురము లారజంబులు పలుకుచోట. 111

టీ. మృగనాభినికరంపు బుగబుగల్ - మృగనాభి = కస్తూరియొక్క, నికరంపు = రాశియొక్క, బుగబుగల్ = గుప్పుగుప్పునఁ గొట్టుతావులు,

కలచోటన్ = ఉన్నచోటను, చదలేటితుంపురుల్ = ఆకాశగంగలోని నీటి తుంపురులు, చెదరుచోటన్ = ప్రసరించునట్టితావునను, వకుళవాటీగంధవహుఁడు = పొగడచెట్లతోఁపుమీఁదనుండి వచ్చువాయువు, సుగంధమును గొనితెచ్చువాఁడు గాన గంధవహుఁడు; ఇట గంధవహుఁడు వకుళవాటినుండి తావిఁ గొనివచ్చుచున్నాఁడు. పైకొనుచోటన్ = ప్రసరించు స్థలమునను, కర్పూరకదళీధూళి = పచ్చకప్పురపు టరఁటిచెట్టుయొక్క కర్పూరపుఁ బరాగము, కప్పుచోటన్ = క్రమ్ముకొనుతావునను, పస...యేఱులు - పసమీఱు = బాగుమీఱిన, సెలయేఱులు = కొండయేళ్లు, ఇసుకపెట్టినచోటన్ = ఇసుకతిన్నియ లేర్పడునటులఁ బ్రవహించిన తావులయందును, చిగురుమావులసంజ = చిగిర్చినమావిచెట్లకాఁరంగు, సంధ్యారాగమువంటి మావిచిగుళ్ల కాంతులు, నిగుడుచోటన్ = వ్యాపించుస్థలమునను, నవమాలికలతీవెనట్లు = జాజితీఁగల (ఉయ్యాల) త్రాళ్లు, ఉట్టిపడుచోటన్ = ఉప్పతిల్లెడు స్థలములను, నట్లు = అంటు త్రొక్కిన మొక్కలని యొకవ్యాఖ్యాత. (పా - నవమాలికల తేనె నట్టొట్టుపడుచోటన్ = జాజిపూవులనుండి తెంపులేక తేనియలుకారు చోటులను) మాణిక్యదీపముల్ = దీపములవలెఁ బ్రకాశించునట్టిరత్నములు, మలయుచోటన్ = వ్యాపించుస్థలమునను, ప్రమదమునన్ = సంతోషముచే, తేటులు, ఎలుఁగెత్తి = గొంతెత్తి, పాడుచోటన్ = గానములు గావించు ప్రదేశమునందును, శారికలు = గోర్వంకలు, అనంగశాస్త్రముల్ = మన్మథశాస్త్రములను, చదువుచోటన్ = పఠించుప్రదేశమునందును (అనంగశాస్త్రములు అచ్చరలు పఠించుట విని తాము నేర్చి గోరువంకలు తమంత తాము పఠించుచున్నచోటున నని భావము) కీరకలకంఠములు = చిలుకలు కోయిలలు, క్రొవ్వి, కేరుచోటన్ = చెలరేఁగుతావునను, పావురములు = పావురాళ్లు, ఆరజంబులు = అమధురధ్వనులను, పలుకుచోటన్, పైఁజెప్పిన మనోహరలక్షణములచే నలరారుచున్నప్రదేశమునందు అని భావము. (పైపద్యముతో నన్వయము). అలం. ఉదాత్తము, రూపకము, పరిణామము.

తే. అపరూథినిమణిమండితాలయంబుఁ
గాంచి యనురాగమునఁ బ్రవేశించి యంత
వారి నిరువురఁ గూర్చి యవ్వనజగంధు
లాత్మగృహముల కేఁగి రనంతరంబ. 112

టీ. అపరూథిని (యొక్క) మణిమండితాలయంబున్ = మణులతోఁ బ్రకాశించు గృహమును, కాంచి = చూచి, అనురాగమునన్ = ప్రేమతో, ప్రవేశించి = అందుఁ జొచ్చి, అంతన్ = అట్లుచేరఁగానే, వారిన్ ఇరువురన్ = వారిద్దఱను, కూర్చి = జతగాఁ జేర్చి, అవ్వనజగంధులు = ఆ చెలికత్తెలు, ఆత్మగృహములకున్ = తమయిండ్లకు, ఏఁగిరి = వెడలిపోయిరి. అనంతరంబ = వెంటనే మీఁదిపద్యముతో నన్వయము.

క. ఫుల్లలవలీనవైలా
వల్లిమతల్లికలతోడ వాసంతిక లు
ద్వల్లీల నల్లిబిల్లిగ
నల్లికొనిన యొకలతాగృహాంతరసీమన్. 113

టీ. ఫుల్ల...తోడన్-ఫుల్ల = వికసించిన, లవలీ = వెన్నెలతీఁగలతోడను, నవ ఏలా=లేఁతయేలకియొక్క, వల్లిమతల్లికలతోడన్ = మేలగుతీఁగలతోడను, వాసంతికలు = బండిగురివెందతీఁగలు, ఉద్వల్లీలన్ = ఉప్పతిల్లు విలాసములతో, అల్లిబిల్లిగన్ = కలిసిమెలసి, అల్లికొనిన = పెనవేసికొనిన, ఒకలతాగృహ = ఒకపొదరింటియొక్క, అంతరసీమన్ = లోపలిప్రదేశమునందు "భోగింపఁ దొడంగిరి" అనునంశముగల పైపద్యముతో నన్వయము.

క. ఆగంధర్వకుమారుఁడు
నాగజగమనయుఁ బ్రఫుల్లహల్లకతల్పా
భోగంబున రతి మిగులఁగ
భోగింపఁ దొడఁగి రాత్మఁ బొంగెడు కాంక్షన్. 114

టీ. ఆగంధర్వకుమారుఁడుక్ = ప్రవరాఖ్యుని వేషమును ధరించిన గంధర్వకుమారుఁడును, ఆగజగమనయుఁక్ = ఏనుఁగునడకవంటి యొయ్యారపు నడకగల వరూథినియును, ప్రఫుల్ల...భోగంబునక్ - ప్రఫుల్ల = వికసించిన, హల్లక = ఎఱ్ఱఁగల్వల, తల్ప = సెజ్జయొక్క, ఆభోగంబునక్ = వైశాల్యమున (విశాలమగుతల్పమున). రహిః = రక్తి, మిగులఁగక్ = అతిశయింపఁగా, ఆత్మక్ = హృదయమునందు, పొంగెడుకాంక్షక్ = పెంపుచెందెడు నాసతో, భోగింపక్ = సంభోగముచేయ, తొడంగిరి = మొదలు పెట్టిరి. వరూథినిని తరుణి యనియు గజయాన యనియుఁ జెప్పుటచే నామె ద్వితీయ యౌవన యని గ్రహింపవలయును. ద్వితీయ యౌవనాలక్షణములు.—

శ్లో. "స్తనౌ పీనౌ తనుర్మధ్యః పాణిపాదస్థరక్తిమా
ఊరూ కరికరాకారౌ అంగం వ్యక్తాంగసంధికమ్.
నితంబో విపులో నాభిర్గభీరా జఘనం ఘనం
సువ్యక్తరోమావళిస్స్నిగ్ధ్యమంగకేసరశేక్షణమ్.(రసార్ణవసుధాకరము)

వ. ఆసమయంబున. 115

సీ. సహసానఖాంకచస్తనదత్తపరిరంభ
మామూలపరిచుంబితాధరోష్ఠ
మతిశయప్రేమకల్పితదంతసంబాధ
మగణితగ్లానిశయ్యానిపాత
మతివేలమణితయాచ్ఞార్థగల్లచపేట
మతిదీనవాక్యార్పితాత్తవిరహ
మంకురత్పులకజాలావిద్ధసర్వాంగ
మానందకృతహూరవానశబ్ద
తే. మాక్రమక్షీణనుతివర్ణ మానిమీలి
తాక్ష మాస్విన్నగండ మాయత్తచేష్ట

మాస్తిమితభూషణారవ మావధూటి
ప్రథమసురతంబు గంధర్వపతిఁ గరంచె. 116

టీ. సహసా...పరిరంభము - సహసా = తొందరకలుగునటుల, సఖుంపచ = గోరువెచ్చఁగా నుండెడి, స్తన = చన్నుఁగవచేత, దత్త = ఒసంగఁబడిన, పరిరంభము = కౌఁగిలింతగలదియు, ఆమూ...ష్టము - ఆమూల = అంతయు, కొఱఁతలేకుండ సంపూర్ణముగా, పరిచుంబిత = బాగుగా ముద్దుఁగొనఁబడిన, అధరోష్ఠము = మోవిగలదియు, అతిశయ...బాధము-అతిశయ = మిక్కుటమైన, ప్రేమ = అనురాగముచేత, కల్పిత = ఒనరింపఁబడిన, దంతసంబాధము = దంతక్షతములు (పలు నొక్కులు) గలదియు, అగణిత...నిపాతము - అగణిత = ఎంచఁగా వశముగాని, గ్లాని = శ్రమవలనఁ గల్గినబడలికచేత, శయ్యా = పానుపునందు, నిపాతము = తూలిపడుటయు, అతివేల...చపేటము - అతివేల = విస్తారమైన, మణిత = సంభోగకాలమునఁ గలుగు కంఠధ్వనులయొక్క, యాచ్ఞార్థ=యాచనకొఱకు లభించిన, గల్లచపేటము = చెంపపెట్టులుగలదియు, అతిదీన...విరహము- అతి = మిక్కిలిగ, దీన = విచారమును దెలియఁజేయు, వాక్ = పలుకుల చేత, సూచిత = సూచింపఁబడిన - తెలియఁజేయఁబడిన, ఆత్మవిరహము = తమ వియోగముగలదియు, అంకురత్...సర్వాంగము-అంకురత్ = మొలచు చున్న, పులకజాల = గగుర్పాటు సమూహముచేత, ఆవిద్ధ = బాగుగా గ్రుచ్చుకొనఁబడిన, సర్వాంగము = సమస్తావయవములుఁగలదియు, ఆనంద...బ్జము-ఆనంద = సంతోషముచేత, కృత = చేయఁబడిన, హారవ = హాహా యను ధ్వనులతోఁగూడిన, ఆననాబ్జము=తామరపూవులవంటి ముఖములు గలదియు, ఆక్రమ...వర్ణము - ఆక్రమ= క్రమక్రమముగా, క్షీణ = తరిగి పోవుచున్న, నుతి = పొగడ్తమాటలయొక్క, వర్ణము = అక్షరములుఁగల దియు, అనిమీలితాక్షము = పూర్తిగా మూయఁబడిన కన్నులుగలదియు,

ఆస్విన్నగండము=అంతటను జెమర్చిన చెక్కులు గలదియు, ఆయత్తచేష్టము=స్వాధీనమైన శృంగారచేష్టలు గలదియు, ఆస్తిమితభూషణారవము=మిగులఁ దగ్గిపోయిన కరకంకణాద్యాభరణముల మ్రోఁతగలదియునైన, అవధూటి = అవరూధినియొక్క, ప్రథమసురతంబు = తొలికూటమి, గంధర్వపతిక్ = గంధర్వాధీశ్వరుఁడగు మాయాప్రవరుని, కరంచెక్ = కరఁగునటులఁజేసెను. సంతోషపెట్టెను. అక్రమక్షీణ - అని పాఠాంతరము గలదు.

ఇందు శ్రమ మను సంచారీభావము చెప్పఁబడెను. తల్లక్షణము.—

శ్రమః ఖేదోఽధ్వమృగయా యుద్ధవాహాధిరోహణైః
సంభోగనృత్తశస్త్రాస్త్రవ్యాయామాద్యైః ప్రజాయతే.
నిశ్వాసస్వేదసీత్కారాః సఙ్కోచో ముఖనేత్రయోః
శీతవాతోదకచ్ఛాయాపేక్షా సంవాహనాని చ
అంగమోటనమిత్యాద్యైరనుభావైస్తు లక్ష్యతే.

ప్రథమసంభోగమునందు శ్రమయు, నిమీలితాక్షము, చెక్కులు చెమర్చుట, వ్యథయును సహజములు. శ్రీనాథకవియు,

తే. "అస్తి వామ్యభార మస్తి కౌతూహలం బస్తి ఘర్మసలిల మస్తి కంప
మస్తి భీతి, యస్తిహర్ష మస్తివ్యథం బస్తివాంఛ మయ్యెనపుడురతము" అని:

ఈవిధముగాఁ జెప్పినాఁడు. ఆస్తిమితభూషణ మనువాక్యము సంభోగజనిత సుఖపారవశ్యమును దెలుపును. భవభూతియును నిటులె సంభోగావసరమున-"న జానే తతః" అనియును, "నహి తతో జానే కిమాసీదితి" అని కాళిదాసుఁడును జెప్పియున్నారు. ఇవి సంభోగసుఖపారవశ్యతను దెలుపును. పరవశమునఁ గంకణాదికచలనము లాగుట సహజము. అలం-ఉదాత్తము.

క. అన్ననఁ గనుమూయుట రోద
నన్నగిలుటఁ గౌఁగిలింత సడలుట నేర్పుల్

సున్నగుట వరూథినీరతి
కన్నె తీకపురతియుఁబోలెఁ గడు నింపొసఁగెన్. 117

టీ. అన్నునన్ = పారవశ్యముచే, కనుమూయుటన్ = కనులమూసి కొనుటచేతను, రొద = కంఠధ్వని, సన్నగిలుటన్ = తగ్గుటచేతను, కౌఁగిలింత = ఆలింగనము, సడలుటన్ = వదలఁబాఱుటచే, సేర్పుల్ = మెలఁకువలు, సున్నఅగుటన్ = లేనివియగుటచేతను (లేకుండఁ బోవుటచే), వరూథినీరతి = వరూథినియొక్క సంభోగము, కన్నెతీకపురతియున్ పోలెన్ = తొల్తటి కూటమివలె, బోగముపడుచుతోఁ జేయు తొలినాటికూటమివలె, కడున్ = మిగుల, ఇంపు = ఉత్సాహము, ఒసఁగెన్ = ఇచ్చెను.

క. ఈవిధమున నయ్యిరువురు
భావజతంత్రైకపరత బహుకాలము సౌ
ఖ్యావహలీలల నుండం
గా వేలుపుముద్దరాలు గర్భముఁ దాల్చెన్. 118

టీ. ఈవిధమునన్ = ఈరీతిగా, అయ్యిరువురున్ = ఆవరూథినియుం మాయాప్రవరాఖ్యుఁడును, భావజతంత్రైకపరతన్ = మన్మథవ్యాపారము లందే యాసక్తి గలిగి, బహుకాలము = విశేషకాలము, చిరకాలము, సౌఖ్యావహలీలన్ = సౌఖ్యమును కూర్చువిలాసములతో, ఉండంగాన్ = ఇటుల వర్తించుచుండఁగా, వేలుపుముద్దరాలు = దేవతాస్త్రీ (వరూథిని), గర్భము = వేఁకటిని, తాల్చెన్ = ధరించెను. (ఇటుల గర్భము ధరించినంత.)

తా. ఇతరవ్యాపారములు మాని వరూథినియు మాయాప్రవరుఁడును సురతవ్యాపారములందు వర్తించుచుఁ జాలకాలము గడపిరి. ఇటులుండ వరూథిని గర్భవతి యయ్యెను.

క. నడ జడనువడిరొయి నారే
ర్పడిరొయిన్ జనుమొనలు నల్లవడిరొయిన్ వడియన్

బడియెఁ గడు నొడలు పడఁతికి
బడలికయును నిదురయరుచి బహుళం బయ్యెన్. 119

టీ. పడఁతికిన్ = ఇంతికి, నడ=నడక, జడనుపడియెన్ = మందగించెను, ఆరు = నూఁగారు, ఏర్పడియెన్ = వ్యక్తపడియెను. చనుమొనలు = స్తనాగ్రములు, నల్లవడియెన్ = నలుపెక్కెను. కడున్ = మిక్కిలి, ఒడలు = మేను, వడియఁబడియెన్ = సన్నగిల్లెను. బడలిక = ఆయాసము, నిదుర = నిద్ర, అరుచి = ఇష్టములగు వస్తువులయందు రుచితప్పుట, బహుళంబు = విస్తారము, అయ్యెన్. స్వభావోక్త్యలంకారము.

గర్భము లావగుకొలఁది నారు స్పష్టమగుచుండును.—

సీ. "దుష్టాలయంబుల ధూమరేఖలు పుట్ట లేమనూఁగారున రోమలేఖ మెఱసె"

(భాగవతము దశమ.)

మ. పలుచంబాఱుటఁ గోమలస్మితరుచుల్ పైఁదోఁచె నా
గౌరకాంతుల గండద్వితయంబు పొల్చెఁ బ్రమదార్ణోరాశి
ఖేలన్నవోత్కలికాభంగపరంపరోపరిసముద్యత్పాండుడిండీ
రపంక్తులు నాఁ జిట్టుము లుల్లసిల్లెఁ దఱుచై తోడ్తోఁ గు
రంగాక్షికిన్. 120

టీ. కురంగాక్షికిన్ = జింకకన్నులవంటికన్నులు గలయావరూథినికి (ఈవిధముగా గర్భచిహ్నములన్నియుం నేర్పడిన) తోడ్తోన్ = వెనువెంటనే, గండద్వితయంబు = రెండుచెక్కిళ్లును, పలుచంబాఱుటన్ = పల్చనగుటచే, కోమలస్మితరుచుల్ = మృదువైనచిఱునవ్వు వెల్గులు, పైన్ = మీఁదికి, తోఁచెనాన్ = కనబడెనా యనునట్లు, గౌరకాంతులన్ = తెల్లనికాంతులతో, పొల్చెన్ = ఒప్పెను. ప్రమ...పంక్తులనాన్ - ప్రమద=సంతోష మను, అర్ణోరాశి = సముద్రమునందు, ఖేలత్ = విహరించు, నవ = క్రొత్త, ఉత్కలికా కోరికలను, భంగపరంపరా = తరఁగలవరుసలయొక్క, ఉపరి =

మీఁద, సముద్యత్ = పుట్టు, పాండు = తెల్లని, డిండీరపంక్తులు = నురుఁగు వరుసలు, నాఁ = అనఁగా, చిట్టుములు = కేవిళ్ల యోకిలింతలు, నురుఁగు వలె నోటినుండివచ్చునట్టి యుమ్మిఁ, తఱుచై = విస్తారమై, ఉల్లసిల్లెన్ = అతిశయించెను.

తా. చెక్కులు పలుచఁబాఱుట మృదువులగు చిఱునవ్వువెలుఁగులు పైకిఁ బ్రసరించెనేమో యన్నటుల వరూథినిచెక్కులు తెల్లవడెను. సంతోషమను సముద్రమందు జనించిన కోర్కులను తరంగములపై బోడము నురుఁగు వరుసలవలె నురుగుతోఁ గూడిన యుమ్మి యతిశయించెను. ఇవి గర్భిణీలక్షణములు. ఉత్ప్రేక్షారూపకములు అలం.

తే. నాకజలజాక్షినిఱుపేదనడుము బలిసి
యల్లనల్లన వళిసీమ నాక్రమించెఁ
బేర్చి దివసక్రమంబున బీద బలిసి
బందికాఁడైనఁ బోరువులు బ్రదుకఁ గనునె. 121

టీ. నాక...నడుము-నాకజలజాక్షి = అప్సరస్త్రీయొక్క (వరూథినియొక్క); నిఱుపేదనడుము = మిక్కిలిబీదయగునడుము, బలిసి=బాగెక్కి, అల్లనల్లనన్=మెల్లమెల్లఁగా, వళిసీమన్=కడుపుమీఁదిముడుతలప్రదేశమును, ఆక్రమించెన్ = ఆవరించుకొనెను. నడుము బలియుటచే ముడుతలన్నియు నంతరించెను. బీద=బీదవాఁడు, బలహీనుఁడు, దివసక్రమంబునన్ = దినముల వెంబడిని, బలిసి = బలవంతుఁడై, పేర్చి = అతిశయించి, బందికాఁడు = దొంగ, ఐనన్, పొరువులు = ఇరుగుపొరుగులు, బ్రదుకఁగనునె=జీవించునా? జీవింపఁజాలదనిభావము. ఉత్ప్రేక్షాలంకారము.

నిఱుపేదనడు మనుటచే వరూథినినడుము మిక్కిలి సన్ననిది. అల్లనల్లన యనుట గర్భము నానాఁటికిఁ గ్రమాభివృద్ధినొందిన దనుట.

క. పాటలసుగంధి పాటలు
నాటలు లేకప్పు డొప్పె నలసతఁ బథికో

త్పాటనజయపరిశ్రాంత
జ్యాటంకృతిచలనమదనచాపముఁబోలెన్. 122

టీ. పాటలసుగంధి = పాదిరిపూవువంటి దేహపరిమళము గలయా వరూథిని, అప్పుడు = ఆగర్భముధరించిన సమయమునందు, పాటలు = సంగీతము బాడుటలు, ఆటలు = నాట్యము మొదలగుక్రీడలు, లేక, అలసతన్ = ప్రాల్మాలికతో, పథిక...చాపముఁబోలెన్ - పథిక = వియుక్తులను, ఉత్పాటన = పెల్లగించుటవలని, జయ = గెల్పుచే, పరిశ్రాంత = నిల్చిపోయిన, విశ్రాంతిని దీసికొనుచుండిన, జ్యా=నారియొక్క, టంకృతి=టాత్కారమును, చలన = కదలికయుఁగల, మదనచాపముఁబోలెన్ = మన్మథునివిల్లువోలె, ఒప్పెన్ = ఒప్పినదాయెను.

ఇట మదనచాపము వరూథిని; పాటలు నారిమోఁతలు; ఆటలు వింటి చలనము. వరూథిని యలసత పథికోత్పాటనజయపరిశ్రాంతత. మన్మథుఁడు విరహివధానంతరము విల్లు నెక్కుడించినటుల, చిరకాలభోగానంతరము వరూథినియుం గర్భము ధరించి యలసతతో నొప్పెను.

తా. గర్భభారముచే నాటలుఁ బాటలు లేక యలసురాలై యున్న యావరూథిని, మన్మథుఁడు విరహులను జయించినపిదప, నెక్కుడించి పడవైచుటచే నారిమ్రోఁతయుఁ గదలికయు లేక యుండువిల్లో యనునట్లుండెను. ఉత్ప్రేక్షాలంకారము.

సీ. మనసుకక్కుఱితి మెల్లన లేచి చేతులఁ
గాంతుని జబ్బుగాఁ గౌఁగిలించు
నలసత మృద్గంధి యైనకమ్మనినోర
నధరంబు నెడనెడ నాని కూర్కు
మణితాదిపవనధారణశక్తి చాలమి
నొయ్యన నర్మోక్తి నుబ్బనర్చుఁ

గాంక్షితక్రీడ కంగము పంపు సేయమి
నొడ్డుగా నిట్టూర్పు లొరయఁ బొగులు
తే. నిచ్చ యెఱిఁగినరతికేళి మెచ్చి పొగడు
నప్పు డక్కాంత రతిపరిహాసవేళ
జీవితేశుసమేళంపుఁజేఁత లుడుపుఁ
ప్రార్థనాపూర్వదీనసంభాషణముల. 123

టీ. అప్పుడు = గర్భధారణమువలన నాయాసము గలిగిన యాసమయమునందు, ఆకాంత = ఆవరూథిని, మనసు పెక్కుటిలిన్ = హృదయము మాటిమాటికి సంభోగక్రియాలోభము గలదగుటచే, మెల్లనన్ లేచి = తిన్నఁగా నెట్లో లేచి, చేతులన్ = చేతులతో, కాంతునిన్ = ప్రియుని, జబ్బగాన్ = మేను లొరసి యొరయ నటుల, కౌఁగిలించున్ = కౌఁగిలించుకొనుచు. అలసతన్ = (గర్భభారముచేఁ గలిగిన) అలయికచేత, మృద్గంధి = మట్టివాసనఁ గలది, ఐనకమ్మనినోరన్ = అయినరుచికరమగునోటితో, ఎడనెడన్ = అపుడపుడు, అధరంబు = ప్రియుని మోవిని, ఆని = చవిగొని, తూర్చున్ = నిదురఁబోవును. మణితాది...శక్తి - మణితాది = గళరవములు మొదలగువానికి, పవన = ఊపిరిగాలిని, ధారణశక్తి = బిగబట్టుబలము, చాలమిన్ = వలసినంత లేకపోవుటచేత, ఒయ్యనన్ = మెల్లఁగా, నర్మోక్తిన్ = పరిహాసవాక్యములచేత, ఉబ్బు = ప్రియునకు సంతోషమును, ఒనర్చున్ = కలుగఁజేయును. కాంక్షితక్రీడకున్ = ప్రియుఁడు గోరిన సంభోగక్రియకు, అంగము = దేహము, పంపుసేయమిన్ = వలచినటుల స్వాధీనము కాకపోవుటచేత, ఒడ్డుగాన్ = విశేషముగ, నిట్టూర్పులు = దీర్ఘములగునిశ్వాసములు, ఒలయఁగాన్ = కలుగఁగా, పొగులున్ = విచారపడును. ఇచ్చ = తనకోరిక, ఎఱిఁగినరతికేళిన్ = తెలిసిన ప్రియునిదైన సురతక్రీడను, మెచ్చి = మెచ్చుకొని, పొగడున్ = కొనియాడును. రతిపరిహాసవేళన్ = సంభోగసమయమునందుఁ బరిహాసములనాడునపుడు, ప్రార్థ

సా...భాషణములన్ - ప్రార్థనా = వేఁడికొనుట, పూర్వ = ముందుగాఁగల, దీన = దైన్యముగల, సంభాషణములన్ = మాటలచేత, జీవితేశు...చేఁతలు- జీవితేశు = ప్రాణనాయకునియొక్క, సమేళంపుఁజేఁతలు = కూటమికొఱకుఁ జేయుఁచేష్టలు, ఉడుపన్ = మాన్పను. అలం. స్వభావోక్తి.

గర్భభారముతో నున్న కాంతలు మృదువగు భోగముల కిచ్ఛగించుట సాజము. ఇటులె గర్భిణీసురతము కవిరాజమనోరంజనమునఁ జెప్పఁబడినది చూడుఁడు.

ఉ. "పీడని ప్రేమలం గలియుఁ వేఁకటిప్రేఁగుటలంలికూటముల్
వేడుకకు న్వినోద మొదవింపఁగ నయ్యుపనాథుతో హిత
క్రీడ మెలంగుచుండ నరిగెన్నవమాసములు." (ద్వితీయాశ్వాసము.)

ఈపద్యమునందలి గర్భిణీసురతవర్ణనము మిగుల నేహ్యముగ నున్న దని యొకానొకర్డు వ్రాసిరిగాని యది సరిగాదు. వరూథిని దేవవేశ్య, కేవల కామార్త. గర్భధారణానంతరము గలిగినయశక్తిచేఁగూడఁ గలయికలఁ గోరె ననుట యామెకామాతిశయమునె తెలుపునుగాన నిది గర్హ్యము గాదు. అంతియగాక 'బ్రౌనుదొరవారిటీకలో నీపద్యము లేదు. కొన్నిప్రతులయం దీ పద్యము గానరామి ప్రక్షిప్తమేమో యని తోఁచెడిని. ఇంక నిది విచార్యము.

క. అంత వియచ్చరుఁ డభిమత
ముంతయు సమకూఱుటయును నచ్చర గర్భ
శ్రాంత యగుటయును గనుఁగొని
యంతట నిచ్చోటు వాయ కే నిఁక నున్నన్. 124

టీ. అంతన్ = వరూథిని పైవిధముగా గర్భభారముతో నున్నపుడు, వియచ్చరుఁడు = (ప్రవరవేషమున నున్న) గంధర్వుఁడు, అభిమతము = కోరిక, అంతయున్ = సంపూర్తిగా, సమకూఱుటయును = సిద్ధించుటయును,

అచ్చర = వరూథిని, గర్భశ్రాంత = వేఁకటివడియలసతగలది, అగుటయుఁ౯ = ఐయుండుటయు, కనుఁగొని=చూచి, ఇంతటఁ౯=ఇంతటితో, వీను, ఇచ్చోటు, పోయక౯=వదలక, ఇఁక౯ = ఇఁకమీఁద, ఉన్న౯=ఉన్నయెడల, పైపద్యముతో నన్వయము.

క. వంచన యెఱిఁగిన మఱి శపి
యించునొ సురకాంత చెప్ప కేఁగినఁ బ్రేమ౯
బంచశరశరపరంపరఁ
బంచత ప్రాపించి మీఁదఁ బాపం బిడునో. 125

టీ. సురకాంత = దేవతాస్త్రీ (వరూథిని), వంచన = (నాచేసిన) మోసము, ఎఱిఁగిన౯, మఱి=పిమ్మట, శపియించునో = శాపము పెట్టునో, చెప్పక, ఏఁగిన౯=వెళ్ళినచో, ప్రేమ౯=స్నేహముచే, పంచశర...పరంపర౯- పంచశర=మదనునియొక్క, శరపరంపర౯ = బాణసమూహముచే, పంచత౯= చావును, ప్రాపించి=చెంది, మీఁద౯=(నా)పై, పాపంబు=స్త్రీవధపాతకమును, ఇడునో.

సురకాంత గాన శాపశక్తి గలదు. వంచన బయటపడెనా సహింపదు. చెప్పకేఁగిన ప్రేమ మరణింపఁజేయును. మన్మథుఁడు పంచశరుఁడు. శరపరంపరకుఁ దప్పుకొను టసాధ్యము. మరునిములుకులు చంపు ననుటకు.—

క. "కూ ముడిగించు నశోకము, వాడించును మల్లెవిరి వివర్ణతసేయు౯
జూడఁగఁ జూతము తలఁపుల్, జోడించును దమ్మి చంపఁజూచుం గలువల్."

తా. ఈదేవతాస్త్రీ నామోసమును గ్రహించెనేని శపించునో లేక చెప్పకయే యరిగినచో విరహమున కోర్వక మేను విడిచి స్త్రీహత్యాపాతకమునకుఁ బాల్పఱుచునో? సందేహాలంకారము.

వ. అని వితర్కించి యక్కపటవిప్రుఁ డాలింగించి యనిపించు

కొనియ పోవువాఁడై యప్పూ దప్పువ్వుఁబోఁడి డాయం
బోయి బుజ్జవం బొప్ప నిట్లనియె. 126

టీ. ఇట్లు = ఈవిధముగా, వితర్కించి = తనలోఁ దా నాలోచనము
గావించి, ఆకపటవిప్రుఁడు = ఆ మోసపుబ్రాహ్మణుఁడు, గంధర్వుఁడు, ఎఱిం
గించి=వరూథినికెటులో చెప్పి, అనిపించుకొనియు=నీడ్క్రాఁ జేసికొనియు, ఆజ్ఞ
నొందియే, పోవువాఁడై=పోవ నిశ్చయించికొన్నవాఁడై, అప్పూవుబోఁడిన్ =
ఆపుష్పమువలె సుకుమార మగు దేహముగల వరూథినిని, డాయం బోయి=చేర
నరిగి, బుజ్జవంబు=ఉపలాలనము, ఒప్పన్=ఒప్పునట్లుగా, ఇట్లనియెన్ = ఈవిధ
ముగాఁ బలికెను.

తే. ఎవ్వఁడేఁ బాదలేప మొక్కింత నాదు
పాదములఁ బూయ నింతేసిపనులు పుట్టె
నమ్మహాయోగి బహుయోజనాధ్వగామి
యీగిరికి నేఁగుదెంచె నేఁ డేఁగి కంటి. 127

టీ. ఎవ్వఁడేన్=ఏసిద్ధుఁడు, పాదలేపము=పాదములకు దూరగమనము
కొఱకు రాచికొను పసరుపూఁత, నాదుపాదమున్ = నాయడుగులందు,
పూయన్=రాయఁగా, ఇంతేసిపనులు = (మంచుఁగొండకు నారాక, పాదలేప
నము మంచుసోకి కరఁగిపోవుట పిదప యిల్లుఁజేరలేక నీతగులమునకు లోనగుట
లోనగు) ఈనడవళ్లన్నియును, పుట్టెన్=పుట్టెనో, అమ్మహాయోగి=ఆ గొప్ప
వాఁడగు సిద్ధుఁడు, బహుయోజనాధ్వగామి = అనేకములగు ఆమడలత్రోవ
పయనము చేయువాఁడు, ఈగిరికిన్ = ఈకొండకు, నేఁడు, ఏఁగుదెంచెన్ =
వచ్చెను. ఏఁగి=నేను పోయి, కంటిన్=చూచితిని.

తా. ఈహిమవత్పర్వతమునకు వచ్చి నానావిధములయిన యవస్థలు
పడుటకుఁ గారణముగా మందు నాయడుగులకుఁ బసరు రాచి పోయిన

సిద్ధుఁడు నేఁ డెక్కడెక్కడనో తిరిగి యీకొండకు వచ్చినాఁడు. నే నాయనను విహారార్థముగాఁ బోయినప్పుడు చూచి మాటలాడివచ్చితిని.

క. అతఁడు మఱి తీర్థయాత్రా
వ్రతవశమున వచ్చి మాపురంబు తెరువుగాఁ
గతలుగ మాసంసార
స్థితు లెల్లను జెప్పె నేమి సెప్పుదు నబలా. 128

టీ. అబలా = వరూథినీ, అతఁడు=ఆ సిద్ధుఁడు, మఱి = ఇప్పుడును గూడ, తీర్థయాత్రా వ్రతవశమునన్ = తీర్థములనుగూర్చి పయనము చేయుంట యను నియమమునుబట్టి, మాపురంబు తెరువుగాన్ = మాయూరి త్రోవఁగా, వచ్చి, కతలుగన్=కథలుగా, మా సంసారస్థితులు = మాకాఁపురపుస్థితిగతులు. ఎల్లన్ = అన్నియు, చెప్పెను = తెలిపెను. ఏమి సెప్పుదున్ = నే నేమని చెప్పుదును. ఆవృత్తాంతమంతయు నీకుఁ జెప్పఁ జాలకుంటిని.

సీ. వైపరామరిక చొప్పడమిఁ బక్వము దప్పి
పండఁబాఱినపాల మెండఁబాఱెఁ
గట్టిఁ గాపింప దక్షత లేమి నూకూర
బందెలఁ బడిపోయెఁ బశుగణంబు
వంచనామతిఁ బ్రాడ్వివాకులై వటువు లో
జ్జల కొప్పగించిరి చదువు లెల్లఁ
గికురించి రిచ్చిపుచ్చుకొను చోటుల వార
లాఁకకు లోనుగా కప్పు లీక
తే. గ్రహణసంక్రమణాదుల రాచనగరఁ
గాసుపీసంబు వెడల గ్రాసమునకు
నాధి వెట్టితి క్షేత్రంబులందుఁ గొన్ని
లెస్సయుండునె గృహకర్త లేని బ్రదుకు. 129

టీ. వైపరామరిక = వైవిచారణ, చొప్పడమిన్ = సమకూఱక పోవుటచే, పక్వముఁదప్పి = అదనుచెడి, పండఁబాఱినశాలము = పండుటకు సిద్ధమైనచేను, ఎండఁబాఱెన్ = ఎండిపోఁ జొచ్చెను. కట్టన్ = గుంజలను గట్టిపెట్టుటకును, కాపింపన్ = మేఁకకుఁ దోలుకొనిపోయి కాచుకొనివచ్చునట్లు చేయుటకును, దక్షత=దిక్కు, లేమిన్ = లేకపోవుటచే, ఊరూరన్ = ఊరికి నూరికి, పశుగణంబు = పశువుల సమూహము, బందెలన్ = బందెదొడ్లలో, పడిపోయెన్ = చిక్కుకొని పోయెను. పశువు లసంఖ్యాకములు గాన ఊరూరియందుఁ జిక్కుపడెను. వంచనావళిన్ = కొంటెబుద్ధితో, ప్రాడ్వివాకులై = తగవులమారులై, వటువులు = విద్యార్థులు,చదువుకొల్లన్, ఒజ్జలకున్ = ఉపాధ్యాయులకు, ఒప్పగించిరి = అప్పగింతఁబెట్టిరి. మఱచి పోయిరి. వటువులనఁ జదువుకొనుచున్న బ్రహ్మచారులు. బ్రహ్మచారు లనక వటువు లనుట తొందరపాటు సూచించును. కాననే తగవులకంపెలై వచ్చిన విద్దియసంతయుం నప్పగింత పెట్టి రనుట. ఇచ్చి పుచ్చుకొను చోటులవారలు = అప్పు లిచ్చి పుచ్చుకొను సంబంధముగల తావులవారలు. అప్పులు = అప్పు తీసికొన్నసొమ్ము, ఆఁకకున్ = ఏర్పాటునకు, లోనుగాక = లోఁబడక, కికురించిరి = వంచించిరి. గ్రహణసంక్రమణాదులన్ = సూర్యచంద్ర గ్రహణములు మకరసంక్రమణాది సంక్రాంతులు మొదలగువానియందు, రాచనగరన్ = రాచదివాణమున, కాసువీసంబు = కాసుగాని వీసముగాని, వెడలమిన్ = రాకపోవుటచే, గ్రాసమునకున్ = భుక్తికి, క్షేత్రంబుసందున్ = మాన్యములందు, కొన్ని, అధిపెట్టిరి = కుదువయుంచిరి. గృహకర్త = ఇంటి యజమానుఁడు, లేనిబ్రదుకు = లేనికాఁపురము, లెస్స యుండునె=చక్కఁగా నుండునా !

తా. ఇన్నివ్యవహారములు నే నింటనుండి, మెలఁకువతో నవరించుకొను వాఁడను. బహుకాల మిట నుంటచేఁ బ్రసిద్ధినొందిన నాసంసారస్థితిగతు

బల్లియుఁ బాత్రిగా మారి కథలయ్యెను. యజమానిలేని యింటినిఁగూర్చి ప్రత్యేకించి చెప్పవలసిన దేమున్నది ? అర్థాంతరన్యాసాలంకారము.

క. అది గాకే నిట వచ్చిన
యది మొదలుగఁ జింతచే నహర్నిశమును నా
కెదురెదురె చూచు చిద్దఱు
ముదుసళ్లును బుత్త్రమోహమున నగునార్తిన్. 130

టీ. అదిగాక=సర్వము నేను లేకపోవుటచేఁ జెడిపోవుటయేగాక, ఏన్=నేను, ఇట వచ్చినది మొదలుగన్ = ఈమంచుకొండకు వచ్చినది యాదిగా, ఇద్దఱు ముదుసళ్లును=వృద్ధులగు నాతలిదండ్రు లిరువురును, అహర్నిశమును = పగలును రాత్రియందును, పుత్త్రమోహమునన్=పుత్త్రప్రేమచే, అగునార్తిన్ = కలుగువ్యథచే, నాకున్=నాకొఱకై, ఎదురెదురె చూచుచున్ = దిక్కులం జూచుటయే పనిగాఁ బెట్టుకొని. (పైపద్యముతో నన్వయము.)

క. తడి గంటి నెపుడుఁ దఱుఁగక
కడి దఱుఁగఁగ వడియుఁ దఱిఁగి గాసిన్ బుడమిన్
బడినఁ గనరాక మంచపుఁ
దొడుగఱ లైరట్టె రుజలతో నేమందున్. 131

టీ. కంటన్ = కంటియందు, ఎపుడున్ = సర్వకాలసర్వావస్థలయందును (ఎల్లప్పుడు ననుట), తడి=నీరు, తఱుఁగక = తగ్గక, కడి = ఆహారము, తఱుఁగఁగన్=తగ్గఁగా, వడియున్ = శక్తియును, తఱిఁగి = తగ్గి, గాసిన్ = శ్రమచే, పుడమిన్, పడినన్=పడియున్నను, కనరాక=కానఁబడక, నేలపైఁబడియున్నపుడు బరుండియుండిరని గుర్తింపరానంతగా శుష్కించి యని భావము. రుజలతోన్=వ్యాధులతో, మంచపుఁదొడుగఱలు = మంచముమీఁది తొడుగుమండలు, మంచమును విడిచి బైట నడుగిడ లేనివారు, ఐరట్టె=ఐరాఁట, ఏమందున్ = ఏమని చెప్పుదును? అతిశయోక్తి అలంకారము.

తా. నన్ను విడచి మాతలిదండ్రు లెపుడు దుఃఖించి దుఃఖించి శుష్కించిరి. మంచములో నుండి పైటనడుగుఁ బెట్టరాని యటుల వారు శుష్కించిరి. మాకుటుంబస్థితినిగూర్చి యింకఁ జెప్పవలసిన దే మున్నది ?

క. కావున వారలఁ జూడం
గా వేగమ చనఁగవలయుఁ గమలదళాక్షీ
నీ వెఱుఁగనిధర్మాధ
ర్మావస్థితి గలదె దీనికై యడలకుమీ. 132

టీ. కమలదళాక్షీ = తామర రేకులఁబోలుకన్నులుగలదానా (వరూథినీ)! కావునన్ = కాఁబట్టి, వారలన్ = ఇట్టి విచారస్థితియందున్న వృద్ధులగు తలిదండ్రులను, చూడంగాన్ = చూచుటకు, వేగమ = త్వరగా, చనఁగవలయున్ = నేను కల్లుచేరఁబోవలయును. నీ వెఱుఁగని = నీకుఁ దెలియరాని, ధర్మాధర్మ = న్యాయాన్యాయములయొక్క, అవస్థితి = మర్యాద, కలదె = ఉన్నదా? లేదు. సమస్తధర్మములను నీ వెఱింగియే యున్నావు. కావున, దీనికై = నేను నిన్ను విడిచిపోవుటకు, అడలకుమీ = దుఃఖపడకుమా !

తా. వరూథినీ ! నీవు ధర్మము అధర్మము నెఱింగినదానవు గాని వెట్టిదానవు గావు. మాతలిదండ్రులు కుటుంబముస్థితి యిటులున్నది. నే నింటికిఁ బోవలసియున్నది. నావియోగమునకుఁ బరితపింపకుము.

క. వడిఁ గాఁచికాఁచి యుండన్
గడవలనీ రినుము ద్రావుకైవడిఁ బై పైఁ
బొడమెడుకోర్కులచేఁ బె
ల్లుడికినమది భోగముక్తి నూఱట గనునే. 133

టీ. కాఁకాఁచి = కొలిమిలోఁ గాకయెక్కించియెక్కించి, ఉండన్, ఇనుము, కడవలనీరు = కుండలకొలఁదినీటిని, వడిన్ = వేగముగా, త్రావకైవడిన్ = త్రాగువిధమున, పైపైన్ = మీఁదమీఁద, పొడమెడుకోర్కులచేన్ =

పుట్టుచున్నకోరికలచేత, పెల్లుడికినపది = మిక్కిలి త ప్తమైనడెందము, భోగ కాంక్షలచే నుద్రేకవంత మగు హృదయము. భోగము క్తికిఁ = విషయానుభవ త్యాగమునకు, ఓటట = ఓర్పు ని, కనునే = పొందునా!

ఇనుము కాఁచఁగాఁ గాఁచఁగాఁ గాకయెక్కు నది. హృదయము కోర్కెలచే పెట్టకొన్నది. పెట్టచేఁ బెల్లుడికినది. కాన వేఁడియందు హృదయమునకు ఇనుమునకుఁ బోలిక. ఇనుము నీరు గోరునటుల హృదయము భోగముల నపేక్షించుచున్న దని భావము.

తా. ఇనుము కాఁక హెచ్చినకొలఁది సెక్కువనీటిని బీల్చునగిదిని మఱిమఱి పుట్టుచున్నకోరికలచే నుడుకుచెందినడెందము, భోగము లెన్నియైన నపేక్షించునే కాని విరమించుట కూటఁ జెందునా ! ఉపమాలంకారము.

ఉ. కావున నెన్నఁడుఁ దెగనికాంక్ష నెపం బొకఁ డెన్ని రోసి నేఁ
బోవఁదలంతునేనివలపుఁ ననుపుఁ దగవుఁ బ్రియంబుఁ
నీవలనఁ సమగ్రములు నిల్పిన సంపెఁగపువ్వుఁ దేనె క్రొ
త్తావికిఁ దేఁటి చిక్కునవిధంబునఁ జిక్కెనె లోలలోచనా!

టీ. లోలలోచనా = చలించుకన్నులుగలదానా ! (వరూథినీ), కావునఁ = కాఁబట్టి, ఎన్నఁడుఁ = ఎప్పుడును, తెగనికాంక్షఁ = తీరనికోరికను, రోసి = రోఁతపడి, నెపంబు ఒకఁడు = ఒక నెపమును, ఎన్ని=ఎంచి, కలుఁగఁజేసికొని, నేఁ = నేను, పోవఁ = నిన్ను విడిచిపెట్టిపోవుటకు, తలంతునేనిఁ=తలంచినయెడ, వలపుఁ = మోహమును, ననుపుఁ = అనురాగమును, తగవుఁ = న్యాయమును, ప్రియంబునఁ = ఇష్టమును, నీవలనఁ = నీయెడల, సమగ్రములు = నిండారియున్నవి. కొఱఁతలేక పరిపూర్ణముగా నున్నవి. నిల్పినఁ = (పోక) నిల్చినయెడ, సంపెఁగ...తావిఁ= సంపెఁగపువ్వు = సంపంగిపువ్వుయొక్క, తేనె = మకరందముయొక్క,

క్రొత్తావికిన్ = క్రొత్తపరిమళమునకు, తేఁటి = తుమ్మెద, చిక్కినవిధంబునన్ = తగులుకొన్నవిధమున, చిక్కెనె = తగులుకొనదా? తప్పక తగుల్కొని తపించును!

తా. నెచ్చెలీ! భోగములో మానరానిది ప్రమాణమో ఆపరానిది. కాఁబట్టి యెన్నటికిని దాఁపు లేని యీభోగేచ్ఛ కేదే నొకసాకు పన్ని వెడలి పోవుదు నన్నచో నీయెడల మోహము ననురాగము న్యాయము మంచియుం నిండుకొనియున్నవి. నీవంటి ప్రియురాలి నెటుల విడిచిపోవనగును? విడిచిపోక నీచెలిమి నాసించి యిక్కడనే యుందుమన్నచో సంపెఁగపూఁదేనె పరిమళమునకుఁ దుమ్మెద జిక్కుకొన్నవిధమున చుట్టపక్కములకు స్వజనమునకుఁ గానివాఁడనై యిటనే గతింపవలసివచ్చునుగదా! తుమ్మెదలకు సంపెంగ పూవ్రుఁవాసిగాని తేనియగాని రుచింపదు. పైగా నపాయకరము. ఉపమాలంకారము.

“నానాసూనవితానవాసనల నానందించు సారంగ మే
లా న న్నొల్లదటంచు గంధఫలి.” (వసుచరిత్రము.)

ఉ. ఎవ్వఁడు మీఁదు దెలుంగక యథేచ్ఛసుఖైకరతిన్ జరింపఁగా
నవ్వల వంశహాని ప్రతహాని యశోధనహాని పుట్టుఁ దా
నవ్వెడఁ గమ్మనుష్యపశు వయ్యవివేకి చెడున్ జగంబునన్
నవ్వఁగబాలు రౌరవమునం బడఁబాలును నిందపాలునై.

టీ. ఎవ్వఁడు = ఏమనుష్యుఁడు, మీఁదు = ముందుజరుగఁబోవు దానిని, భవిష్యత్తును, ఎఱుంగక = తెలిసికొనక, యథేచ్ఛసుఖైకరతిన్ = ఇష్టమువచ్చినట్లు సౌఖ్యములయందే యాసక్తితో, చరింపఁగాన్ = ప్రవర్తింపఁగా, అవ్వలన్ = అటుపై, వంశహాని, = కులహాని, ప్రతహాని = ఆచారనియమనాశము, యశోధనహాని = కీర్తికి ధనమునకు నాశము, పుట్టున్ = పుట్టునో, ఆవ్వెడఁగు = ఆజడుఁడు, అమ్మనుష్యపశువు = మనుష్య

రూపముననున్న యాపశువు, అయ్యవివేకి = అవివేకహీనుఁడు, తాన్ =
తాను, జగంబునన్ = లోకమునందు, నవ్వఁగఁబాలున్ = నవ్వులకుఁబాలును,
రౌరవమునన్ = నరకమున, పడఁబాలును = పడుటకుఁ బాత్రమును, నింద
పాలును = నిందకుఁబాత్రమును, ఐ, చెడున్ = నశించును.

సుఖాదులకుఁ బరిమితి గలదు. యథేచ్ఛసుఖైకరతి పశుధర్మము.
దానిచేఁ బెక్కునష్టములు సంభవించును. కామాదికములవలన జనించు సుఖము
కంటె తృష్ణాక్షయమువలన లభించుసుఖమే గొప్పది. కాన నీతో సంబం
ధము త్రెంచుకొనుచుంటి నని ప్రవరవేషధారి పల్కెను. కామసుఖముకంటెఁ
దృష్ణాక్షయసుఖమె గొప్ప దనుటకు.—

శ్లో. “యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖం,
తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతష్షోడశీం కలామ్.” (భారతము, శాంతి.)

తా. ఎవఁడు ముందుగతి యెఱుఁగక యిష్టము వచ్చినట్లు విషయైక
సక్తుఁడై ప్రవర్తించునో యట్టి వివేకశూన్యుఁ డగు మానవపశువు కులమును
ఆచారమును కీర్తిని ధనమును సర్వమును జెఱుచుకొని నలుపురలో నవ్వులకును
నిందలకును బాత్రుఁడై నరకము గాంచును. అలం. అప్రస్తుత ప్రశంస.

మ. అనినం జిత్తము జల్లనన్ సొరుగు నయ్యంభోజపత్రాక్షి
లోచనగోళంబులఁ జిమ్మ లై చిలుప లై జాలై తరంగం
బులై, చనుదోయిన్ గొనబారురంగమదచర్చల్ జాఱిపో
నొక్కయొడ్డున బాష్పాంబుఝరంబు లుప్పతిలెఁ బోటుం
బాటుగా నెంతయున్. 136

టీ. అనినన్ = ఇటుల మాయాప్రవరుఁ డనఁగానే, చిత్తము =
మనస్సు, జల్లనన్ = జల్లు మనఁగా, (దిగులు నొందగా) సొరుగు...గోళం
బులన్-సొరుగు = వ్రాలిపడినట్టి, అయ్యంభోజపత్రాక్షి = తామరరేకులవంటి
కన్నులుగలదియగు నావరూథినియొక్క, లోచనగోళంబులన్ = కనుగ్రుడ్ల

యందు, బాష్పాంబుఝరంబులు = కన్నీటిప్రవాహములు, (మొదట,) చిమ్మలై = బిందువుల మొత్తములై, తొలుత చిన్నచిన్నబొట్టువలె స్రవించి, చిలుపలై = పడియలై, కొంచెము కొంచెముగాఁ బల్లపుఁదావుల నిలిచి, జాలై = ప్రవాహమై, తరంగంబులై = కెరటములవలెఁ జెలరేఁగినవయి, చనుదోయిన్ = కుచద్వయమున, కురంగమదచరనల్ = కస్తూరితో వ్రాసినపత్త్రరచనలు, జాజిపోన్ = జాజిపోఁగా, ఒక్కయొద్దునన్ = ఒక్కపూనికఁగా, (ఒక్కమొందునన్ = ఒక్కయతిశయముతో పా.) పోటున్ = ఊబుకుటయు, పాటున్ = తగ్గుటయు, కాన్ = కాఁగా, ఎంతయున్ = మిక్కిలి, ఉప్పతిలెన్ = పుట్టెను.

తా. ప్రవరరూపధారి యగు గంధర్వకుమారుఁ డీవిధముగా స్వగ్రామమున కేఁగుదు నని చెప్పఁగా వరూథిని నేలవ్రాలి పరవశమునొంది గుండియ యదరఁగా విచారము భరింపనోపక గ్రుడ్లనుండి వెల్లువలు వెల్లువలుగాఁ గన్నీరు విడువసాగెను. సారాలంకారము.

క. అత్తఱి గంధర్వవిభుం
డత్తామరసాక్షివదన మక్కునఁ గృపతో
నొత్తి మొగ మెత్తి యశ్రులు
మెత్తనఁ గొనగోరఁ బాఱమీటుచుఁ బలికెన్. 137

టీ. అత్తఱిన్ = అప్పుడు, గంధర్వవిభుండు = (ప్రవరవేషముననున్న) గంధర్వశ్రేష్ఠుఁడు, అత్తామరసాక్షివదనము = ఆవరూథినిముఖమును, అక్కునన్ = ఱొమ్మున, ఒత్తి, కృపతోన్ = దయతో, మొగమెత్తి = ఆయమ ముఖమును చేతితో నల్లన పైకెత్తి, అశ్రులు = కన్నీరు, మెత్తన్ = సుకుమారముగా - గోరుసోఁకనటుల, కొనగోరన్ = గోటికొనతో, పాఱమీటుచున్ = తొలఁగఁజిమ్ముచు, పలికెన్ = ఇట్లు వాకొనెను.

తా. అప్పు డాగంధర్వుఁడు వరూథిని దుఃఖము చూచి జాలిగొని దయతో దానిముఖము తనఱొమ్మున నదిమిపట్టి యూఱడించి యంతట

వెక్కఁగా మొగమెత్తిపట్టుకొని కన్నీళ్లు దుడుచుచు దానిదుఃఖ ముపశమించు నట్లొకమాట చెప్పెను.

శా. ధీరస్వాంతవు వంత నీకుఁ దగునే దివ్యాంగనల్ కోవిదల్
గారే యోగవియోగముల్ సతములే కర్తవ్యముల్ సేయరే
పోరే రారె ప్రియంబు గల్గినజనుల్ పోరామి పోఁ బోవునే
పోరాకుండఁగ నేమి కాళ్లు దెగెనే ఫుల్లాంబుజాతేక్షణా.

టీ. ఫుల్లాంబుజాతేక్షణా=విరిసిన తామరపూవువంటి కన్నులుగలదానా (వరూథినీ), ధీరస్వాంతవు=తాల్మిగల డెందముగలదానవు, నీకుఁ = నీవంటి దానికి, వంత=దుఃఖము, తగునే, దివ్యాంగనల్ = దేవతాస్త్రీలు, కోవిదల్ = జ్ఞానముగలవారు, వివేకముగలవారు, కారే=కారా? అగుదురుగదా! యోగవియోగముల్ = కలయికగాని యెడఁబాటుగాని, సతములే = నిత్యములా, కర్తవ్యముల్ = చేయవలసినవి, చేయరే=లోకు లెవ్వరు చేయరా! చేయుదురుగాదా యనుట, ప్రియంబుగల్గినజనుల్=ప్రేమగలవారు, పోరే=పోవలసిన తావులకుఁ బోవుటలేదా! రారే=రావలసిన తావునకు వచ్చుటలేదా! పోరామి=ఉన్న స్నేహము, పోఁ = (ఎచ్చటికైన) నరిగినమాత్రాన, బోవునే, పోరాకుండఁగన్ = పోకుండుటకును రాకుండుటకును, పోవలసినచోటులకుఁ బోవకుండుటకును రావలసిన చోటులకు రాకుండుటకును, ఏమి కాళ్లు తెగెనే = కాళ్లు విఱిగిపోయెనా యేమి? (గళ్లుతెగెనే=సంబంధములు విడిపోయెనా-పా.)

యోగము (కలిసికొనుట) ఎటుల సతముకాదో వియోగమటులె సతము గాదు. మనుష్యజాతి స్త్రీవలె దివ్యాంగనయు నిందులకుఁ బరితపించుట కోవిదతకు భంగము. ధీరస్వాంతలు వంతనొందుదురా?

తా. చెచ్చెలీ! నీవు మిగులఁ దాల్మి గలదానవు. దుఃఖింపఁ దగునా? దేవాంగనలు వివేకవతులు గదా! యోగవియోగములు శాశ్వతములా? చేయు

వలసిన కార్యములు చేసికొనవలెనా? పరస్పరముఁ బ్రేమము గలవా రెచటికిని బోరా రారా? ఎచటికేనిఁ బోయినమాత్రాన స్నేహము చెడునా? ఎందును బోయి రాకుండుటకుఁ గాళ్లు తెగిపోయెనా? అలం. అప్రస్తుతప్రశంస.

తే. మూలకుట్టుగఁ దెల్పె నమ్మునివరుండు
ప్రార్థితుం డయి నాకు నప్పరమవిద్య
వచ్చుచును బోవుచుండెద వదల నిన్ను
శుకకలాలాప! నమ్ము త్రిశుద్ధిగ నను. 139

టీ. శుకకలాలాప=చిలుకవలె నవ్యక్తమధురముగ మాటలాడువాఁడా! అమ్మునివరుండు = ఆపాదలేపనము నొసంగిన సిద్ధుఁడు, ప్రార్థితుండయి = నాచే వేఁడుకొనఁబడినవాఁడయి, అప్పరమవిద్యన్ = ఆగొప్పవిద్యను, మూలకుట్టుగన్ = సమూలముగా, తెల్పెన్ = తెలియఁజేసెను. వచ్చుచును బోవుచుండెదను = వలసినపుడెల్ల నీయొద్దకు నాకయి నేనే వచ్చిపోవుచునుందును. నిన్నున్ వదలను = నిన్ను విడిచిపెట్టను, త్రిశుద్ధిగన్=ముమ్మాటికిని, నమ్ము=నా మాటల నమ్ముము, (పా. త్రిశుద్ధికిన్ = ముమ్మాటికి)

తా. చెచ్చెలీ! నిన్ను నే వీడను. ముమ్మాటికిని నమ్ముము. ఆమునివర్యుని బ్రార్థించి యతనియొద్ద పాదలేపముతోఁ గోరినచోటులకుఁబోవునట్టి యీ మహావిద్యను సమగ్రముగా నేర్చుకొంటిని, వచ్చుచుఁ బోవుచు నుందును.

తే. అని వరూథిని నూఱార్చి యచటు వాసి
పోయెఁ దనయిచ్చ గంధర్వపుంగవుండు
తప్పరాదు ఋణానుబంధంబు దెగినఁ
బ్రాణపద మైనవలపును బాసి చనదె. 140

టీ. అని=ఇటుల నమ్మఁదగినమాటలను దెల్పి, వరూథినిన్, గంధర్వపుంగవుండు = గంధర్వశ్రేష్ఠుఁడు, ఊఱార్చి = ఓదార్చి, అచటు=ఆచోటు, వాసి=విడిచిపెట్టి, తనయిచ్చన్=తన యిష్టమువచ్చిన చొప్పున, పోయెన్ =

వెడలిపోయినవాఁ డాయెను, ఋణానుబంధంబు = పూర్వజన్మపుఋణసంబంధము, తెగినన్ = తీఱిన యెడల, ప్రాణపదము = జీవితస్థానము, (ప్రాణసమానము) అయినవలపును = అయిన యనురాగముకూడ, పాసి చనదె = తొలఁగిపోదా? తప్ప రాదు=ఇది తప్పదు.

తా. మరలఁ దప్పక వచ్చువాఁడ నని వరూథిని నమ్మునటుల నెన్నియో యిచ్చకములుచెప్పి గంధర్వశ్రేష్ఠుఁడు తన యిచ్చచొప్పున నరిగెను. ఋణానుబంధము తీఱిపోయినచో నెట్టిమోహమేనిఁ దొలఁగిపోదా! అర్థాంతరన్యాసమలంకారము.

వ. అనుటయుఁ దరువాతివృత్తాంతంబుఁ గృపాయత్తం బగు
చిత్తంబున నానతీవలయు నని యడుగుటయును. 141

టీ. అనుటయున్ = ఇటులఁ బక్షులు చెప్పఁగా, తరువాతి వృత్తాంతంబు=ఆపిమ్మటి కథాంశమును, కృపాయత్తంబు = దయాధీనమైనది, అగుచిత్తంబునన్ = అగునట్టి మనస్సుతో, ఆనతీవలయున్ = సెలవొసంగవలయును, అని యడుగుటయున్ = అని యడిగినంతనే, (నాలవయాశ్వాసపు, 2-వ వచనమునందలి 'అనియెన్' అనుదానితో నన్వయము).

శా. హిందూరాజ్యరమాధురంధర భుజాహిగ్రామణీకంచుక
త్కుందస్వచ్ఛయశోగుళుచ్ఛ! యవనక్షోణీధవస్థాపనా
షండీభూతకృపాకటాక్ష! యసకృన్మాద్యత్కళింగాంగనా
బందీగ్రాహవిగాహితోత్తరకకుబ్ఘాటీసమాటీకనా! 142

టీ. హిందూ...గుళుచ్ఛ - హిందూరాజ్యరమా = హిందూదేశపురాజ్యలక్ష్మియొక్క, ధురంధర = భారము వహించిన, భుజాహిగ్రామణీ = భుజమను సర్పశ్రేష్ఠునకు, కంచుకత్ = కుబుసమువలె నగుచున్న, కుందస్వచ్ఛ = మొల్లపూలవలెఁ దెల్లనైన, యశోగుళుచ్ఛ = కీర్తిపుంజముగలవాఁడా, (కీర్తియనెడు పూలగుత్తిగలవాఁడా! పూలగుత్తి వలె స్వచ్ఛమగు కీర్తిగలవాఁ-

జనుట) యవ...టాక్ష-యవనక్షోణీధవ = తురకరాజుయొక్క, స్థాపన = ప్రతిష్ఠించుటయందు, అమందీభూత = తగ్గని, కృపాకటాక్ష = దయగల చూపుకలవాఁడా, అన...సహాటీకశా - అనేకకృత్ = మాటిమాటికి, మాద్యత్ = పొగరుగొను, కళింగ = కళింగరాజుయొక్క, అంగనా = స్త్రీలయొక్క, బందీగ్రాహ = చెఱఁగొనివచ్చుటయందు, విగాహిత = ప్రవేశింపఁ జేయబడిన, ఉత్తరకకుప్ = ఉత్తరదిక్కునందలి, ధాటీ = దాడియొక్క, సహాటీకశా = ప్రయత్నము గలవాఁడా (అని కృష్ణరాయనికి సంబోధనము.)

తా. ఆదిశేషునివలె హిందూదేశరాజ్యభారముఁ దాల్చి కీర్తిగన్నవాఁడవును, లోఁబడిన తురకరాజును దిరిగి దయతోడ రాచఱికమున నిల్పినవాఁడవును, మదించిన ఉత్తరదేశమునకు దండెత్తి కళింగరాజుమద మడఁచి వానిస్త్రీలను చెఱపట్టి తెచ్చినవాఁడవును (అగు కృష్ణరాయా)! ఉపమాలంకారము.

క. తిరుమలదేవీచరణో
దరలాక్షాకల్పకల్పితస్థలకమల
స్ఫురదిందీవరబంధుర
హరిహయమణివలయకూటహర్మ్యవిహారీ! 143

టీ. తిరు...విహారీ-తిరుమలదేవి = తిరుమలదేవి యనురాణియొక్క, చరణోదర = అఱకాళ్లయందు, (పాదముల యడుగుప్రదేశమునందు) లాక్షాకల్ప = లత్తుకచేఁ జేయఁబడిన యలంకారముచే, కల్పిత = కలుగఁ జేయఁబడిన, స్థలకమల = మెట్టతామరలందు, స్ఫురత్ = ప్రకాశించు, ఇందీవర = నల్లగల్వలవలెనే, బంధుర = దిట్టమయిన, హరిహయమణి = ఇంద్రనీలమణిమయ మయిన, వలయ = గుండ్రని, కూటహర్మ్య = యంత్రాల మేడయందు, విహారీ = విహరించువాఁడా!

తా. ఇంద్రనీలమణి కుట్టిమమందుఁ దిరుమలదేవియొక్క లాక్షాసక్తము లయిన పాదములాని లత్తుక యంటినప్రదేశములు మెట్టదామరలవలెను

తక్కిన తావులు నల్లగల్వలవలెను నుండె నని తాత్పర్యము. అట్టిమేడమీఁద విహరించువాఁడా యని కృష్ణరాయనికి సంబోధనము. (హర్మ్యాగ్రమున ఇంద్రనీలములు పఱుపఁ బడెను. లాక్షారసము సోఁకినచోటులు మెట్టతామర లగుచుఁ దక్కినతావులు నల్లగలువలుగా నుండెను.) ఉదాత్త మలంకారము.

ఉత్సాహ. వర్ణనీయకీర్తివైభవా! ప్రభూతభూతిదృ
క్కర్ణకుండలా! వితీర్ణకర్ణ! దీర్ణహృద్భృదు
ర్దుర్ణయారిమానహారి! దుర్భరానకార్భటీ
ఘూర్ణమానకొండపల్లికొండవీడుమండలా. 144

టీ. వర్ణ...భవా - వర్ణనీయ = వర్ణింపఁదగిన, కీర్తివైభవా = యశో విస్తారముగలవాఁడా, ప్రభూత...డలా-ప్రభూత=పండారిన, భూతి=ఐశ్వర్య ముచే, దృక్కర్ణకుండలా=(పాములు కుండలములుగాఁ గల) శివుఁడా, (శివుఁ డనైశ్వర్యసంపన్నుఁడు అట్టివాఁడా యనుట.) వితీర్ణకర్ణ = దాతృతయందుఁ గర్ణుఁ డగువాఁడా, దీర్ణ...మానహారి - దీర్ణ = పగిలిన, హృత్ = గుండెలు గలవారై, భృత్=తిరుగాడు, దుర్ణయ = నీతిమాలిన, అరి = శత్రుల యొక్క, మాన = గర్వమును, హారి=హరించినవాఁడా, దుర్భ...మండలా- దుర్భర = భరింపరాని, ఆనక=భేరియొక్క, ఆర్భటీ = మ్రోఁతచే, ఘూర్ణ మాన = తిరుగుపడుచున్న, కొండపల్లి కొండవీడుమండలా = కొండపల్లి కొండవీడురాజ్యభాగములు గలవాఁడా!

తా. పొగడ్త కెక్కిన కీర్తి గలవాఁడా! ఐశ్వర్యమున శివునివంటి వాఁడా! దానకర్ణుఁడా! దుర్ణయులైన రాజులు గుండె పగులునట్లు చేయు వాఁడా! భేరీధ్వానమాత్రముననే కొండపల్లి కొండవీడురాజ్యములను వణఁకించువాఁడా!

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహపర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిరనందవర పురవం

శో త్తంసశఠకోపతాపసప్రసాదాసాదిత చతుర్విధకవితామ
తల్లికాల్లసాని చొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్యప్రణీతం
బైన స్వారోచిషమనుసంభవం బను మహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము. 145

టీ. శ్రీమ...ప్రణీతంబు - శ్రీమత్ = విద్వత్తాసంపదగల, ఆంధ్ర కవితాపితామహ = ఆంధ్రకవిత్వమునకు బ్రహ్మయును, సర్వతోముఖ = అంతటవ్యాప్తిగల, అంక=బిరుదుగల్గినట్టియును, పంకజాక్ష=విష్ణువుయొక్క. పాదాంబుజ = పాదపద్మములకు, అధీన = వశమైన, మానసేందిందిర = మనస్సనెడు తుమ్మెదగలట్టియును, నందవరపురవంశోత్తంస=నందవర మనెడి యూరివారివంశమున (నందవరీకకులమున) శ్రేష్ఠుఁడగునట్టియును, శఠకోప తాపస = శఠకోపయతియొక్క, ప్రసాద=కృపచే, ఆసాదిత = పొందఁ బడిన, చతుర్విధ = నాల్గువిధములగు (బంధ, చిత్ర, గర్భ, ఆశు కవన ములు), కవితామతల్లిక=శ్రేష్ఠకవిత్వముగలట్టియు, అల్లసాని చొక్కయామాత్య పుత్ర = అల్లసానిచొక్కయమంత్రికిఁ గుమారుఁ డగునట్టియు, పెద్దనార్య= పెద్దనార్యునిచే, ప్రణీతంబు=రచియింపఁబడినది, మహాప్రబంధంబునందున్ = మహాకావ్యమున, తృతీయాశ్వాసము.

ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనాసమాసాదితాఖండసాహితీధురీ ణుండు నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్ల వంశపయోరాశిరాకాసుధా కరుండు నగు రామస్వామిశాస్త్రిచేత ననేకపూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచింపఁబడిన రుచిరసమాఖ్యానం బగువ్యాఖ్యానంబునఁ దృతీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# మనుచరిత్రము.

## సటీకము

---

## చతుర్థాశ్వాసము

శ్రీకృష్ణరాయ! గుణర
త్నాకల్పా! కల్పకద్రుమాధికదాన
శ్రీకుతుకాగతలోకా
లోకాంతరసకలసుకవిలోకస్తుత్యా! 1

టీ. శ్రీకృష్ణరాయ=సంపద్యుక్తుఁడవగు నో కృష్ణరాయప్రభువతంసా, గుణరత్నాకల్పా - గుణ = సద్గుణము లనెడు, రత్న=రత్నములే, ఆకల్పా = భూషణముగాఁ గలవాఁడా, కల్పక...స్తుత్యా - కల్పక = కల్పవృక్షమని యెడు, ద్రుమ = చెట్టునకంటె, కల్పవృక్షముకంటె, అధిక = మిక్కిలియైన, దానశ్రీ = వితరణసంపదయందలి, కుతుక = సంతసముచే, ఆగత = వచ్చియున్న, లోకాలోక = చక్రవాళభూధరముయొక్క, అంతర = మధ్య ప్రదేశమునందుండిన, సకల = ఎల్లవారునైన, సుకవి = మంచికవులయొక్క, లోక=బృందముచే, స్తుత్యా=స్తవముచేయఁదగినవాఁడా, ఈకృతిపతిసంబోధనము తరువాతవచ్చు వచనములోని అవధరింపు మనుదానితో నన్వయింపవలయును.

కల్పవృక్ష మనక కల్పకమనుటచేఁ గప్రక్ష్యయము గున్న యని తెలుపుచు: చిగుళ్లు ఫలములు పూవులు సర్వజనుల కందుబాటులో నుండు ననుట. కోరికలు పడయుట సర్వజనసాధ్యముగా నుండె ననుట.

తా. సర్వసుగుణములు గలిగి కల్పకమును మించిన దాతృత్వముచే లోకాలోకపర్వతముచే నావృతంబైనధరణీభాగంబునం దుండిన సమస్తసుకవులం జేరి పొగడుచుండ వెలయు శ్రీకృష్ణరాయప్రభువరా. (చక్రవాళపర్వతము భూమండలముచుట్టు నుండు నందురు.)

వ. అవధరింపుము జైమినిమునీంద్రునకుఁ బతంగపుంగవంబు
లి ట్లనియె. 2

టీ. అవధరింపుము = వినుము, జైమినిమునీంద్రునకున్ = జైమిని యను మునివర్యునకు, జైమినిమునితో నని యర్థము. పతంగపుంగవంబులు = పిట్టలలో మిన్నలు, ఇట్లనియెన్ = పైవిధముగాఁ జెప్పెను.

తా. చరిత్రముం జెప్పుపక్షులు జైమినిమునికీక్రిందిరీతిం జెప్పెను.

సీ. మున్ను విప్రాకారమునఁ గూడుచోఁ గంకఁ
గనుమూయఁ బనిచె నాఖచరభర్త
యవ్వరారోహయు నాసక్త గావున
నిచ్చలో నటు సేయ నియ్యకొనియె
నాప్రతిజ్ఞాపూర్తి యరయ్యఁ దనంత న
వ్వనితకు రతిపారవశ్యపటిమ
నపుడు తత్ప్రవరదేహాసమిద్ధశిఖిదీప్తి
శాంబరీమహిమచే సంగ్రహించి
తే. నట్టిగంధర్వమూర్తి సౌఖ్యానుభూతిఁ
జలన మేదినమానసాబ్జమున నిలువ

వెలసెఁ దేజోమయం బైనవృద్ధి నట్టి
మేటిగర్భంబు నెలలు తొమ్మిదియు నిండె. 3

టీ. మున్ను = పూర్వము, విప్రాకారమునన్ = బ్రాహ్మణస్వరూపముతో, కూడుచోన్=కలియునపుడు, శంకన్=నిజస్వరూపము తెలిసిపోవు ననుసందియముచే, ఆఖచరభర్త=ఆగంధర్వప్రభుఁడు, కనుమూయన్=నేత్రములను మూసికొని యుండునట్లు, పనిచెన్ = ఆజ్ఞాపించెను. అవ్వరారోహయున్=ఆమగువయును (వరూథినియు), ఆసక్త=ఆసక్తిగలది (తాత్పర్యముగలది), కావునన్, అటుసేయన్ = ఆప్రకార మొనర్చుటకు (కనుమూయుటకు), ఇచ్చలోన్=తలంపునందు, ఇయ్యకొనియెన్ = సమ్మతించెను. అవ్వనితకున్=ఆస్త్రీకి (అనఁగా వరూథినికి), రతిపారవశ్యపటిమన్ - రతి=సంగమమునందలి, పారవశ్య = పరవశత్వముయొక్క, పటిమన్ = సమర్థతచే, తనంతన్=తనయంతటఁ దానే, ఆప్రతిజ్ఞాపూర్తి = ఆప్రతిన తుదముట్టుట (ఇందలి ప్రతిజ్ఞ కనుమూయుటయ), అపుడు = ఆసంభోగవేళను, తత్ప్రవరదేహ సమిద్ధ శిఖిదీప్తిన్-తత్ప్రవర = ఆప్రవరుని, దేహ=ఒడలున, సమిద్ధ = మిగులఁ బ్రకాశించుచున్న, శిఖిదీప్తిన్=అగ్నియొక్క వెలుఁగువంటి తేజమును, శాంబరీ మహిమచేన్ - శాంబరీ=మాయయొక్క, మహిమచేన్ = మహిమవలన, సంగ్రహించినట్టి గంధర్వమూర్తి = తాను దాల్చియున్నగంధర్వాకారము, సౌఖ్యానుభూతిన్ = సుఖము ననుభవించుటచే, చలనము=చాంచల్యము, ఏదినమానసాబ్జమునన్ - ఏదిన = పోయిన, మానసాబ్జమునన్ = మనఃపంకజమున, నిలువన్ = నిల్చియుండఁగా, అట్టి మేటిగర్భంబు = ఆయుత్కృష్టమైన గర్భము, తేజోమయంబు = కాంతిమయము, ఐనవృద్ధి = అయిన యభివృద్ధిచే, వెలసెన్=ప్రకాశించెను. నెలలు తొమ్మిదియు నిండెన్= నవమాసములు పూర్తియయ్యెను.

రతి పారవశ్యముచేఁ గనులు మూఁతపడుట ప్రసిద్ధము. వరూథిని ప్రమాదముచేనైన నియమ మల్లంఘింపకుండ రతిపారవశ్యము తోడుపడి కనులు మూయించెను. కనులు రతిపరవశమునఁ మూఁతపడు ననుటకు ఇందే,

సీ. "ఆలాపగలిసౌఖ్యానరమోడ్పుకనుగవ రతిపారవశ్యవిభ్రమముదెలుప."

క. గాత్రంబు పరవశం బగు, నేత్రంబులుమూయుచెమటనించినయూర్పుల్.
చిత్రగతిఁబోలయుఁబలుకులు, చిత్రించుచునుండు..."కళాశాస్త్రము,ద్వి.

వరూథిని రతిపారవశ్యమునఁ గనులు మూసెను గానఁ బ్రవరుని మనోహారాకారము హృదయమునందు నిలిపెను. మార్కండేయపురాణమునందుఁ గూడ నిటులె వరూథిని ప్రవరునిమూర్తి హృదయమున నిలిపె నని కలదు.

క. సురతసమయమున నాసుందరి నయనాబ్జములుమోడ్చి దహనశిఖావి
స్ఫురితశరీరుండగు నాధరణిసురకుమారు నాత్మఁ దలఁచెను నెమ్మిన్."
(పంచమాశ్వాసము.)

తా. కామరూపి కావుటచే, గంధర్వుఁడు విప్రాకారమున వచ్చి వరూథినితోఁ గ్రీడించుచుఁ గలయికయప్డు నిజాకారము కనఁబడిన మోసమగు నని యూహెను నేత్రనిమీలనము చేయఁ గోరెను. ఆకోరికపై నావరూథిని కన్నులు ముకుళింప నవసరము లేకుండ రతిపారవశ్యపటిమచేతనే మూఁతపడియెను. అట్టి సంభోగమున గర్భము గలిగెను. అది మిక్కిలి తేజోమయము గానఁ బెంపు చెందఁ దొమ్మిదినెలలు నిండెను. (రతిసమయమునను, ప్రాణావసానసమయమునను మాయావరణ ముండ దని పెద్దలు పల్కుదురు. కావునఁ దన వేషము వెల్లడి యగు నని "ఇది మాదేశాచార" మనుమిషపైఁ దనపై ననురాగము గల యావరూథినితోఁ జెప్పె ననుట.) అలం. సమాధి.

వ. అనంతరంబ యొకానొకపుణ్యదివసంబున. 4

టీ. అనంతరంబ=మాసపూర్తియైనంత, ఒకానొకపుణ్యదివసనంబునన్ = ఒక శుభదినమున.

శా. తేజం బబ్జభవాండగేహమునకున్ దీపాంకురచ్ఛాయ యై
రాజిల్లన్ గ్రహపంచకంబు రవిఁ జేరం బోనిలగ్నంబునన్
రాజీవాక్షి కుమారుఁ గాంచె సుమనోరాజన్యమాన్యున్
జనుల్ జేజేపెట్టఁ బ్రసూనవర్షము సురశ్రేణుల్ ప్రవర్షింపఁగన్.

టీ. గ్రహపంచకంబు = అంగారక, చంద్ర, బృహస్పతి, శుక్ర, శనైశ్చరులను గ్రహము లైదును, రవిన్ = రవిగ్రహమును, చేరంబోని లగ్నంబునన్ = సమీపింప కున్న లగ్నమందు, రాజీవాక్షి=తామర రేకుల వంటి కనులు గల వరూథిని (గర్భము ధరించిన వరూథిని), తేజంబు = శరీర కాంతి, అబ్జభవాండగేహమునకున్ = బ్రహ్మాండ గృహమునకు, దీపాంకుర చ్ఛాయ యై = మొలకదీపపు కాంతియై, రాజిల్లన్ = దీపింపఁగా, జనుల్ = ప్రజలు, జేజేపెట్టన్ = జయజయధ్వనులతో స్తుతింపఁగా, అమరశ్రేణులు = దివిజబృందము, ప్రసూనవర్షము = పుష్పవృష్టి, ప్రవర్షింపఁగన్ = కురియు నట్లు చేయఁగా, సుమనోరాజన్యమాన్యున్ = దివిజపతి యగు నింద్రునిచే మన్నింపఁబడ నర్హుఁ డగు నతని, కుమారున్ = పుత్త్రుని, కాంచెన్ = కనియెను.

గ్రహపంచకము సూర్యునిచేరుట యనఁగా సూర్యుఁ డున్నరాశిలో నాయైదుగ్రహములు చేరుట; అదియే యస్తమయము. అస్తమయదోషము గల గ్రహములు శుభఫలము లొసంగఁజాల వని జ్యోతిశ్శాస్త్రమతము గాన అంగారకాదిగ్రహముల కస్తమయదోషము లేని యుత్తమలగ్నమునందు 'దీపాంకురచ్ఛాయమై' యను పాఠాంతరముగలదు. ఛాయాశబ్దము షష్ఠీసమాసమున వైకల్పికముగా నపుంసకలింగ మగు నని యొకానొకరు సమర్థించిరి గాని యంతకంటె ఛాయ యని స్త్రీలింగముగా నుంచి, మైయను ప్రత్యయమునకుఁ దృతీయార్థము చెప్పుట యుక్త మని తోఁచుచున్నది.

తా. ఆవరూథిని, సురలు కుసుమవర్షముం గురియ జనులు స్తోత్రము చేయుచుండ శుభగ్రహములతోఁగూడిన లగ్నమున దేదీప్యమానుఁడును

దేవేంద్రునిచేఁ గొనియాడఁ దగువాఁడును మహత్తరకాంతి సంపన్నుఁడు వగు కుమారునిఁ గనియెను. అలం. రూపకము. ఉపమ.

క. స్వరుచిస్ఫురణను శశిభా
స్కరపావకతారకాప్రకాశము లెల్లన్
విరళములు సేయు నతనికి
స్వారోచి యనునామ మిడి రచటిమును లెల్లన్. 6

టీ. స్వరుచిస్ఫురణన్ = తనయొక్క తేజముయొక్క ప్రకాశము చేత, శశిభాస్కర...ప్రకాశములు-శశి = చంద్రునియొక్కయు, భాస్కర= సూర్యునియొక్కయు, పావక = అగ్నిహోత్రునియొక్కయు, తారకా = నక్షత్రములయొక్కయు, ప్రకాశములు = వెలుఁగులు, ఎల్లన్=అన్నిటిని, విరళములు = దూరమైనవిగా (తక్కువ యైనవిగా), చేయన్=చేయుటచేత, అతనికిన్=అబిడ్డనికి, అచటి మును లెల్లన్, స్వారోచి = స్వారోచి (స్వప్రకాశముగల యట్టివాఁడు), అనునామము = అను పేరు, ఇడిరి=పెట్టిరి.

మునులు స్వారోచి యని నామకరణము గావించుటచే నాపే రెంతయు దగియున్న దని భావము. మునులవాక్యము నే యర్థమనుసరించుఁ గాన నన్వర్థ మగు నీనామము మిగుల నొప్పును. ఋషుల వాక్కులఁగూర్చి,

శ్లో. "లౌకికానాం హి సాధూనామర్థం వాగనువర్తతే,
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి." (ఉత్తరరామ.)

తా. సూర్యచంద్రాదులగు కాంతిగలవారిప్రభ నడఁచు శరీరచ్ఛాయ గలవాఁడు గావున నక్కడ నున్నఋషులు స్వారోచి యని పేరుపెట్టిరి. అలం. అతిశయోక్తి.

చ. మఱియు నతండు సంయమిసమాజవినిర్మితజాతకర్ముఁ డై
నెఱిఁ బరివర్ధితుండు నుపనీతుఁడు నై వివిధాయుధంబులన్
గఱకరి యై రణస్థలుల గద్దఱి యై నిగమార్థవేది యై
నెఱతనకాఁడు నై మెఱసె నిర్మలకాంతివిలాసరేఖలన్. 7

టీ. మఱియుఁ = వెండియు, అతండు = ఆపరూథిని కుమారుఁ డగు స్వరోచి యనుబాలుఁడు, సంయమిసమాజ...కర్ముఁడై = తపస్వులయొక్క బృందముచే నొనర్పఁబడిన జాతకర్మము గలవాఁడై, (జాతకర్మ మన జన్మసమయమునఁ జేయు వేదవిహిత మగు నొకానొక కార్యము) నెఱిన్ = సాసాఁటన్, పరివర్ధితుండున్ = లెస్సగఁ బెంపఁబడిన యతఁడును, ఉపనీతుఁడున్ = ఉపనయనము గావింపఁబడినవాఁడును, వివిధాయుధంబులన్ = అనేకవిధాయుధోపయోగములందును, కఱకరియై = చాలినవాఁడై, రణస్థలులన్ = యుద్ధభూములయందు, గద్దఱియై = దార్ఢ్యముగలవాఁడై, (దిట్టయై), నిగమార్థవేదియై = వేదములను వానియర్థమును దెలిసినవాఁడై, నెఱతనకాఁడునై = అన్నిటియందు నేర్పుగలవాఁడై, నిర్మలకాంతివిలాసరేఖలన్ - నిర్మల = విమలమైన, కాంతి = సౌందర్యముచేతను, విలాస = హొయలయొక్క, రేఖలన్ = ప్రకారములచేతను, మెఱసెన్ = వెలుఁగొందెను.

ప్రయోగోపసంహారాదులకు దివ్యమంత్రములు గల యస్త్రములను నభ్యసించుట కుపనీతుఁ డగుట యవసరము. కాననే ఉపనయనానంతరము శస్త్రవిద్య నేర్పఁబడెను. నెఱతనకాఁడగు నప్పటికిఁ బారోక్తవిద్యలన్నియు నభ్యసించెను.

తా. ఆబిడ్డఁడు దినదినాభివృద్ధి గలిగి మునీంద్రులచే జాతకర్మనామకరణాదులం బొంది, వడుగు చేయఁబడి, ధనుర్వేదము నభ్యసించి, వేదార్థాదులు నేర్చికొని, పోరులం దిట్టఁడై, సకల న్యాయ్యవిచారణములం జేయ సమర్థుఁడై కళావంతుఁ డయ్యెను.

స్రగ్ధర. గ్రుద్ధగోత్రాచలంబుల్ గులగుల లయిపోఁ గోతముల్
గ్రుద్ధలీలన్, ఖడ్గిఁ జెండాడు వ్యాఘ్రుల్ కవుఁగిటికోలఁదుల్
కత్తినొక్కొక్కఘాతన్; బ్రోద్దామప్రౌఢి వాతాద్భుతగతిఁ

బఱచుఁ భూమి జవ్వాడఁగా నిట్లద్దేవీనందనుం డత్యనుపమ
బలుఁడై యౌవనారంభ వేళన్.

టీ. గోత్రాచలంబుల్ = కులపర్వతముల నేడింటిని, గులగులలయి
పోన్ = నుగ్గయిపోవునట్లు, గోతముల్ = మల్లసాధనవిశేషములగు గోత
సంచులను, గ్రుద్దులీలన్=ముష్టిఘాతము చేయునట్లు, గ్రుద్దుచున్ = పిడికిలితోఁ
బొడుచుచు (జెట్టీలు సాధనము చేయుతఱి దిటవుగల గోతములలో ఱాలు
పోసి గోతమును గ్రుద్దుచు సాధనములు చేయుచుండుట ప్రసిద్ధము.) కవుఁ
గిటికొలఁదుల్=ఆలింగనము చేసికొనుటకుఁదగినవైన, మ్రాఁకుల్ = చెట్లను,
ఖడ్గిన్=సారప్రయత్నముతో, కత్తిన్=ఖడ్గముతో, ఒక్కొక్కఘాతన్ =
ఒక్కొక్క దెబ్బతో (ఒకచెట్టు నొక్కదెబ్బతో) చెండాడున్ =
ముక్కలుగా ఖండించును. భూమి, జవ్వాడగాన్ = కంపమునొందఁగా,
ప్రోద్దామప్రౌఢిన్=అతిశయ మగుశక్తిచే (పా. ప్రోద్దామక్రీడన్=హెచ్చగు
ఆటలందు), వాతాద్భుతగతిన్ = వాయువుయొక్క యచ్చెరువైన వేగముం
బోలిన వేగముతో, పఱచున్ = పరుగిడును. ఇట్లు, అద్దేవీనందనుండు=ఆదివ్య
వనితాకుమారుఁడు, యౌవనారంభవేళన్ = తారుణ్యప్రారంభమునందు,
అత్యనుపమబలుఁడై=ఉపమారహితమగు మెండైనబలము గలవాఁడై, వైపద్య
ముతో నన్వయము.

కులపర్వతములు మహేంద్రము, మలయము, సహ్యము, శుక్తిమంతము,
పారియాత్రకము, గంధమాదనము, వింధ్యము, అని యేడు. ఇందు స్వరోచి
దేహబలము, అసిచాలనపైపుణ్యము, గమనవేగాతిశయము చెప్పఁబడెను.
యౌవనారంభమునందె యనుపమబలుఁ డగుటచే ముందు లోకోత్తరుఁడు
కాఁగలఁ డనుట.

తా. స్వరోచి యౌవనారంభవేళ నమితబలముచే కులాచలములను
గోతములపై గ్రుద్దినట్లు గ్రుద్దుచు, పెద్దమ్రాఁకులను గత్తితో నఱకుచు,
ధరణి వడంక నతివేగమునం బరువెత్తుచు నుండెను. ఇం దుపమయుం నతిశయో
క్తియుం జెప్పఁబడియెను.

క. వేదండముతొండముసరి
కోదండముఁ దివియు నెడమఁ గుడి నిబిడజ్యా
నాదము రోదసి నిండఁగ
భేదించుఁ గండశిలలఁ బృథుబాణములన్. 9

టీ. వేదండము తొండము సరి కోదండముఁ=ఏనుఁగుతొండముతో సరియైనధనుస్సును, ఎడమన్=ఎడమవైపునను, కుడిన్=కుడివైపునను, నిబిడ జ్యానాదము = దట్టమైన గుణధ్వని, రోదసిన్ = భూమ్యాకాశమధ్యమును, నిండఁగన్ = పూర్ణమగురీతిని, తివియున్ = లాగును. గండశిలలన్ = పెద్దగుండుతాళ్లను, పృథుబాణములన్ = పెద్దబాణములచే, భేదించున్ = బ్రద్దలుగొట్టును.

భూమ్యాకాశముల మధ్యభాగము నిండునట్లగాన నారిమ్రోఁత నిబిడము. సామాన్యబాణములైన శిలల భేదింపవు. శిలలు గండశిలలు, బాణములు మిగుల గొప్పవి. కాననే విల్లును ఏనుఁగుతొండములాఁటిదన నుంట; అతిశయము ఎడమ కుడి సమముగా చేయుట.

తా. ఏనుఁగుతొండమువంటి లావగువింటి నెక్కిడి, భూమియు నాకసము నిండునట్లు నారి సారించుచు గొప్పగొప్పబాణములతో నెడమచేతి తోను గుడిచేతితోను గండశిలలను భేదించుచుండెను. ఉపమాతిశయోక్త్యలంకారములు.

క. అతఁడు మఱి తనకుఁ మంథ
క్షితిభృత్తటి విశ్వకర్మ చేసిననగరిన్
వితతాటవికచమూనే
వితుఁడై సామ్రాజ్య మనుభవింప నొకతఱిన్. 10

టీ. అతఁడు=ఆస్వరోచి, మఱి=మఱియును, మంథక్షితిభృత్తటిన్ = మందరపర్వతపు చఱియయందు, విశ్వకర్మ = దేవతల శిల్పకారుఁడు, చేసిన నగరిన్ = (అపూర్వరీతిగా) నిర్మాణముచేసిన పట్టణమునందు, వితతాటవిక చమూసేవితుఁడై-వితత=విస్తారమైన, ఆటవిక = అడవిజాతివారలయొక్క, చమూ = సైన్యముచేత, సేవితుఁడు ఐ=సేవింపఁబడువాఁడై, సామ్రాజ్యము= ప్రభుత్వసంపదను, అనుభవింపన్ = అనుభవించుచుండ, ఒకతఱిన్=ఒక్క సమయమున.

తా. స్వరోచి విశ్వకర్మ నిర్మించిన మందరాద్రితటమునం గల నగరమున బహుకిరాతసమూహము కొల్చుచుండ సామ్రాజ్య మనుభవించుచుండ నొక్కనాఁడు: ముందు పద్యముతో నన్వయము.

క. కరకాచిటపటరవభీ
కరమై పెళపెళనినాదఘనమై ఝుంఝా
మరుదుజ్ఝితబిలమంద్ర
స్వరమై యక్కొండ నొక్కవర్షము గురిసెన్. 11

టీ. అక్కొండన్ = ఆనగముపై, కరకాచిటపటరవభీకరమై = వడగండ్ల చిటపటధ్వనిచే భయముం బుట్టించునదియై, పెళపెళనినాదఘనమై = పెళపెళయను చప్పుడులతో గర్జించు మబ్బులుంగలది యగుచు, ఝుంఝా... స్వరమై - ఝుంఝామరుత్=వర్షయుక్త మగు వాయువుచే, ఉజ్ఝిత = విడువఁబడిన, బిల=కొండగవుల, మంద్రస్వరమై = పెద్దశబ్దముగలిగినదియై గంభీరధ్వనిగలదై (మంద్రస్తు గంభీరః - అమ.) ఒక్కవర్షము = ఒకవాన, కురిసెన్ = వర్షించెను.

తా. ఆకొండపై వడగండ్లు రాలుచుండఁగా, బెళపెళ మొగుళ్లుఱుము చుండఁగా, గాలివాన గుహలు ధ్వని చేయుచుండఁగా, వర్షము గురిసెను. అలం. స్వభావోక్తి.

క. తెలతెల వేగిన నగ్గిరి
జలజలఁ బ్రవహించుసెలలచప్పుళ్లఁ శిఖా
వలకులకలకేకాకల
కలములు గలతలపాలంబు గనుఁగొను వేడ్కన్. 12

టీ. తెలతెలవేగినన్=(పైనఁ జెప్పిన విధముగా రాత్రియంతయుఁ నెడ తెగక వాన కురిసి) పిమ్మటఁ దెల్లగాఁ దెల్లవాఱఁగానే, అగ్గిరిన్ = ఆపర్వతమున, జలజలన్ = జలజల మనుచు, ప్రవహించు సెలలచప్పుళ్లు - ప్రవహించు=పాఱుచున్న, సెలల = గిరినిర్ఝరములయొక్క, చప్పుళ్లు = నాదములు, శిఖావల...కలకలములు - శిఖావల=మయూరముల, కుల=సమూహములయొక్క, కల = అవ్యక్తమాధుర్యముగల, కేకా = ధ్వనుల (నెమిళ్ల ధ్వనికిఁ గేక యని పేరు), కలకలములు=కోలాహల నాదములును, కలతల పాలంబున్ = కలిగియున్న ,పర్వతముయొక్క నెత్తములను, కనుఁగొను వేడ్కన్=దర్శింపఁ బుట్టినసంతోషముతో, మీఁది పద్యముతో నన్వయము.

సెలయేళ్లు ఎత్తగు ప్రదేశములనుండి ప్రవహించుచుంటనే మిగుల మ్రోఁత జనించెను. ఆమ్రోఁతను మేఘధ్వనిగా భావించి నెమిళ్లు కేకలు వేయుచు నానందపరవశమున నుండెను. సెలయేళ్లు నెమిళ్లు దర్శనీయములు.

నగరములందును గ్రామములందును వేఁకువజామునఁ గోళ్లు కూసినటుల నడవులయందు నెమిళ్లు వేకినంతన కూయుచుండును. వర్షము కురిసి వెలిసిన నాఁటి వేఁకువజామున నెమిళ్లు మిక్కుటముగా నఱచును.

తా. తెల్లవాఱినంతట నా మందరపర్వతముపైఁ బ్రవహించు సెల యేళ్లను, నాదము చేయుచున్న నెమిళ్లగుంపులును గల కొండనెత్తములం జూడఁ దలఁచి.

ఆ. అన్న గాగ్ర మెక్కి యం దొక్క శశికాంత
వేదిఁ గలిపయాప్తవేష్టితుండుఁ

కుటజవిపినపవననటదలకభరుండు
నగుచుఁ బ్రొద్దు జరపునవసరమున. 13

టీ. అన్నగాగ్రము=ఆ పర్వతశిఖరమును, ఎక్కి, అందున్ = దాని పైభాగమున, ఒక్క శశికాంతవేదిన్ = ఒక చంద్రకాంత శిలామయ మగు తిన్నెపై, కతిప...వేష్టితుండున్ - కతిపయ=కొందఱు, ఆప్త = స్నేహితులచే, వేష్టితుండున్=చుట్టువారు కొనఁబడినవాఁడును, కుటజ...భరుండు— కుటజ=కొండమల్లెల, విపిన=వనముపైనుండి వచ్చెడు, పవన = వాయువుచే, నటత్ = చలించుచున్న, అలక భరుండున్ = ముంగురులయొక్క భారము గలవాఁడు, అగుచున్, ప్రొద్దుజరపు నవసరమునన్ = కాలక్షేపము చేయుచున్న వేళను, కొండమల్లెలనుండి వచ్చుగాలి చిఱుగాలి, తావి మిక్కుటము. మందగమనముగల కుటజ సుగంధవాయువుల సుఖస్పర్శము స్వరోచి ముంగురులఁ గదలించుచుండెను. కాన సుఖస్పర్శము సూచితము.

తా. స్వరోచి యాకొండ నెక్కి యందుఁ గల చంద్రకాంత వేదిపైఁ గొండమల్లెలపైనుండి వీచుగాలిం గ్రోలుచు మిత్త్రులు గొల్వఁ గూర్చుండి వినోదించునప్పుడు.

ఆ. ఒక్కయెఱుకుఱేఁడు నక్కకొమ్మును నిఱ్ఱి
గోఱజంబు జున్నుఁ జాఱపప్పుఁ
బిలిగఱులయంపగోలలు సెలవిండ్లుఁ
గాను కిచ్చి కరయుగంబు మొగిచి. 14

టీ. ఒక్కయెఱుకుఱేఁడు = ఒక శబరనాయకుఁడు, నక్కకొమ్మును = నక్కయొక్క కొమ్మును, ఇఱ్ఱిగోఱజంబున్ = లేఁడిగోరోచనమును (మృగనాభి యనుట), జున్నున్ = తేనెయుంచు, చాఱపప్పున్ = ముంతమామిడిపప్పును (అరణ్యములందు చాఱచెట్టనునది గలదు. దాని కాయలనుండి దీయుపప్పు జీడిపప్పుకంటెఁ జిన్నదిగను రుచ్యముగా నుండును. జీడిపప్పుగాఁ జెప్పుటకుఁ

గారణము మృగ్యము.) పీలిగఱులయంపకోలలుక్ = పికిలి యనుపక్షి పెంట్రుకలతోఁగట్టిన పుంఖములు గలబాణములును, నెలవిండ్లును = ఒకదినుసు ధనుస్సులును, నెలసుకట్టైతోఁ జేసినధనుస్సులు, కరయుగంబు మోగిచి = చేతులఁ రెండును మోడ్చి (నమస్కరించి); నెలసుకట్టె ధనువు లాటవికులు వాఁడుదురు. చాలగట్టివి యనుట కాధారము.—

తే. "విల్లుపట్టిన నెల పదినాళ్లలోన
పీఁకగలిగిన తడవిల్లు వెదురువిల్లు
నెలసువిల్లును మొదలైన చేఁగవిండ్లు
చులకఁగాఁదీసి శబరేంద్రసూనుఁ డేయం."

(శ్రీకాళహస్తిమాహాత్మ్యము. తృ.)

తా. అచ్చటి కొంకశబరుఁడు తమతేఁడగు స్వరోచిని దర్శింప నెంచి నక్కకొఱయు మంచికస్తూరియు, తేనెయుఁ, జాఱపప్పును, ప్రశస్తతరములగు ధనుర్బాణములు నుపాయనము పెట్టి నమస్కరించి.

వ. యుగవిగమసమయసముద్భూత జీమూతపటలంబునుంబోలెఁ గైలాసగిరినితంబప్రాంత కాంతారపర్యంతంబు నిరంతరం బై కాఱుకొన్నయొక్క గహనరేఖం గరాంగుళిం జూపి భూపతి కి ట్లనియె. 15

టీ. యుగ...బోలెక్—యుగవిగమసమయ = కాలపరిమాణ మగుయుగములుసమాప్తినొందునపుడు, కృతత్రేతాదియుగములుముగింపఁబ్రళయమువచ్చినపుడు, సముద్భూత = పొడమిన, జీమూత = మబ్బుల, పటలంబునుంబోలెక్ = సమూదాయమురీతి, కైలాస...పర్యంతంబు—కైలాసగిరి = శివనిలయ మగు రజతపర్వతముయొక్క, నితంబ = (పర్వత) మధ్యభాగమునకు, ప్రాంత = దాఁపున నున్న, కాంతారపర్యంతంబు = వనముదాఁక, నిరంతరంబై = తెఱపిలేనిదై, కాఱుకొన్న...రేఖక్—కాఱుకొన్న = దిత్తుగాఁ జీకటిపలె నున్న, దట్టముగాఁ బెరిఁగిన

యని కొందఱు. (పా. కారుకొను=చీకటికమ్ము) ఒక్కగవాన రేఖన్=ఒక వనపంక్తిని, కరాంగుళిన్ = చేలిప్రేలితో, చూపి, భూపతికిన్ = స్వరోచికి, ఇటనియెన్=ఇట్లనని చెప్పెను. చివురాకులచాయ ఆకుపచ్చగా నున్న, దూరమున నున్న వారికి నలుపుగాఁ గానిపించును, ఆకుపచ్చరంగును కృష్ణవర్ణగణమునందుఁ జేర్చి చెప్పుట గలదు. కాననే ప్రళయకాలమేఘముల వర్ణముతోఁ బోల్చిచెప్పఁబడెను. ఆకుజొంపములచాయ మేఘవర్ణముతోఁ బోల్చుటకు వేఱొక ఉదాహరణము.

సీ. "అభినవజలధరశ్యామంబు లగుచెడ లాకుజొంపంబుల ననుకరింప"
(భారతము-విరాటపర్వము.)

శ్లో. "గోదావర్యాః పయసి వితతశ్యామలానోకహశ్రీః." (ఉత్తరరామ.)

తా. ప్రళయకాలమునందలి నీలమేఘమువలెఁ గైలాసపర్వతము దనుక కాఱుకొనియున్న యొక యడవిం జూపి ముందుఁ జెప్పఁబోవునట్లు పలికెను. అలం. ఉత్ప్రేక్ష.

క. అల్లదె కంటే పొనపొన
దెల్లనిగట్టుఱుత మబ్బుదేఱెడుపొలమం
దెల్లెడఁ జూచిన ధరణీ
వల్లభ సీరాముసేన వాలుమెకంబుల్. 16

టీ. ధరణీవల్లభ=భూపతీ, అల్లదె=అదె కనఁబడుచున్నది. కంటే = చూచితివా, పొనపొన = చూచాయఁగా, తెల్లనిగట్టుఱుతన్=కైలాసము సమీపమున, మబ్బు దేఱెడు పొలమందున్=చీఁకటి చుట్టుచున్నవనమున, చూచినన్ = వీక్షింపఁగా, ఎల్లెడన్ = అంతటను, వాలుమెకంబులు = క్రూరజంతువులు, సీరాముసేన=శ్రీరామసైన్యము, లెక్కలేని దని యర్థము. పొనపొన యన చూచాయ యనుటకు.

రగడ. పొలఁతి యది చనసాగెఁ బొనపొన్న నీడలకు' (ఉత్తరరామాయణము.)

దీని యామ్రేడితరూపము పొన పొన.

తా. ఓరాజా! ఆకనఁబడుచున్న కైలాసప్రాంతమున ఘాతుకమృగము లమితముగా నెక్కడఁ జూచినం గలవు. అలం. లోకోక్తి.

సీ. కండూతికై రాయఁ గర్కశం బగుతుంటఁ
బీఁటవెట్టినమ్రాను పెల్లగిల్లఁ
జెవి దార్చి విని చీమ చిటు కన్న నొకపారి
సెలవి వెంపరలాడు జిట్టలెల్లఁ
జప్పరించు వెదుళ్లు సట లుబ్బ దంష్ట్రాగ్ని
చొంగ పైఁబడి చుంయి చుంయి మనఁగఁ
జంద్రనిష్పాలువోలెఁ దీండ్రించుకనుమించు
లెసఁగ నొండొంటిపై నెక్కఁబాఱు
తే. వెట్టదినముల మడుఁగులమట్టి గలఁప
బుడబుడధ్వని వెడలుబుద్బుదములందుఁ
జిలుపచిలుపని నేతులు జిడ్డు దేఱు
నేమి చెప్పుదుఁ గ్రొవ్విన యేకలములు. 17

టీ. క్రొవ్వినయేకలములు = క్రొవ్వుపట్టినయడవిపందులు, కండూతికై = దురదకయి, కర్కశంబు = బిరుసెక్కినది, అగుతుంటక్ = అయిన కట్యధోభాగముచే, పీఁటవెట్టిన మ్రాను = స్థిరముగా నూఁదియుండినచెట్టు, పాదుకొన్న వృక్షమని కొంద ఱందురు. పీఁటవలెఁ గూర్చుంట కుపయోగించికొన్న యనుట, పెల్లగిల్లక్ = మొదలు సడలియూడునటుల, రాయుక్ = మేనితో రాయును, చీమచిటుకన్నక్ = చిటుకుమనిచీమ చప్పుడుచేసినను, ఎంతమాత్రముఁ గొద్దిచప్పుడు చేసినను, చెవిదార్చి = చెవియావైపునకై యుంచి, విని, ఒకపారి = ఒక్కమాఱుగా, సెలవి = కొమ్మునఁజీల్చి, జిట్టలెల్లక్ = వెదురుజిడిగలన్నియుం, వెంపరలాడుక్ = చిమ్మివేయును. (చిటుకన్న నటఁబాఱి సెలవివెంపరలాడుఁ జెట్టులెల్ల, అని పాఠాంతరము. అటఁబాఱి = ఆధ్వనిగల చోటునకు

బరుగెత్తి, సెలవి = కోఱతోజిమ్మి, చెట్టులెల్లన్ = అన్నిచెట్టులను, వెంపర లాడున్ = పెఱికివేయును) సటలు = మెడపై నున్న వెండ్రుకలు, ఉబ్బన్ = నిక్కఁగా దంష్ట్రాగ్ని = కొమ్ముయొక్క యొరయికచేఁ గల్గిన, యగ్ని, చొంగ = నోటినుండికారెడిచొల్లు, పైఁబడి = మీఁదనుండి, చుంయి చుంయి మనఁగన్ = చుంయి-చుంయి మను ధ్వనులఁ గలుగఁ జేయఁగా, వెదుళ్లు = లేఁత వెదురు మోఁకలు, చప్పరించున్ = నమిలిరుచిచూచును. (పా - చప్పరించును వెన్నుసటలంనుబ్బ = వీఁపుమెడమీఁది వెండ్రుక లుబ్బునటులఁ జప్పరించును.) చంద్రనిప్పులువోలెన్ = చంద్ర కట్టెఁగాల్చిన నిప్పులో యను నటుల, తీండ్రించుకనుమించులు = వెలుఁగునయనప్రభలు, ఎసఁగన్ = వృద్ధికాఁగా, ఒండొంటిపైన్ = ఒక్కటిపై నొక్కటి, ఎక్కన్, పాఱున్ = పరుగిడును. పెట్టుదినములన్ = ఎండకాలమున, మడుఁగులన్, చిన్నచిన్న నీటిపడియలను జలాశయములను, మట్టి = త్రొక్కివైచి, కలఁచన్ = కలఁచి వేయఁగా, బుడబుడధ్వనిన్ = బుడబుడమని వెడలుశబ్దముతో, వెడలుబుద్బుదములందున్ = పైబెలుదేఱు బుడగలలో, చిలుపచిలుపని = కొద్దికొద్దియైన, సేతులజిడ్డు = చమురుతెఱఁగు, తేఱున్ = పైకి లేచును. ఏమిచెప్పుదున్ = ఎంత క్రొవ్వియుండెనో నేను చెప్పఁజాలను.

పందికన్నులు మిక్కిలి యెఱ్ఱగా నుండును గాన నగ్నికణములతోఁ బోల్తురు. ఉదా.—

ఉ. "కోలము గాంచె నానృపతికుంజరుఁడు... ..
లోలవిలోచనాంచలవిలోకితరోషమహాగ్నికీలమున్."

(విక్రమార్కచరిత్రము. ద్వి.)

తా. ఆవనమునందలి పందులు దురదపోవుటకై వనవృక్షములనురాచి కొన్న నాచెట్లు కదలిపోవును. కొంచె మేదియేని ధ్వని వినవచ్చినఁ జెవి యొగ్గి విని కోపముచే దగ్గఱనున్న వెదురుచెట్లు చిమ్మివైచును. వెదుళ్లు చప్పరించును. ఒక్కదానిపై నొక్కటి యెక్కఁబోవును. ఎండతఱుపుడు మడుఁగు

లలో దిగిన సీటిపైఁ జనురుజిడ్డు వెడలుచుండును. వానిసంగతి నే నేమి చెప్పు దును ! అలం. అతిశయోక్తి. ఉపమ. స్వభావోక్తి.

చ. బల మిఁక నేమి సెప్ప విను పండువెదుళ్లవలీల మోరత్రో
  పులఁ బడఁ జొప్పవంచుకొనుపోలికవంచితదగ్రధాన్యముల్
  సెలవుల ఫేన ముట్టిపడ జిట్టలతోడనె చప్పరించు న, ప్పొల
  మువరాహపోతములు భూవర తొండము లేనియేనుఁగుల్.

టీ. భూవర = ధరణీశా ! విను. అప్పొలము వరాహపోతములు=ఆ వనములోని పందిపిలుగులు, తొండము లేని యేనుఁగులు, ఇఁకన్ = ఇంకను, ఇంతకుమించి యనుట, బలము = ఆవరాహముల బలము,ఏమిచెప్పన్=ఏమని మనవిచేయఁగలను. పండువెదుళ్లు=బాగుగాఁ బండిన ముదురు వెదురుచెట్లులు, అవలీలన్ = తేలికగా, మోరత్రోపులన్ = ముట్టెతోఁ ద్రోసివేయుటచే, పడన్ = పడునట్లు, చొప్ప=జొన్న సజ్జ లోనగుసస్యములదంటును, వంచు కొనుపోలికన్=వంగఁ దీసిగ్రహించువిధముగా, వంచి=వెదుళ్లను వంగఁదీసి, తదగ్రధాన్యముల్ = ఆచివరల నున్నవెదురుబియ్యమును, సెలవులన్ = పెద వులకోణములందు, ఫేనము = నురుఁగు, ఉట్టిపడన్ = వెడలిపడఁగా, జిట్టల తోడనె = వెన్నులతోడనె, చప్పరించున్ = నమలి రుచి చూచుచు మ్రింగును.

తా. అందలి సూకరములగున్నలు తొండములు లేవుగాని యేనుఁ గులే యనవచ్చును. చొప్పదంటు వంచినట్లు పండువెదుళ్లు వంచి వానితుదల నున్న ధాన్యమును నురుఁగుగ్రక్కుచు నమలును. అలం. స్వభావోక్తి. రూపకము.

క. పొడిచినకైదువునకుఁ జము
  రిడఁగా వల దగ్గికాఁక నించుక యిడినన్
  జెడుగత్తుల గ్రుచ్చినచం
  జొడు మంటలఁ దగిలి నెయ్యి జోటజోట వడియున్. 19

టీ. పొడిచినకైదువునకున్ = ఆవరాహములం జంపిన యాయుధము నకు, చమురు = నూనె, ఇతఁగాన్ = త్రుప్పు పట్టకుండుటకై పూయుటకు, వలదు = అనవసరము, చెఱుగఱ్ఱిలన్ = మాంసము కాల్చునపుడు గ్రుచ్చు నినుపపుల్లలకు, గ్రుచ్చిన నంజుడు = గ్రుచ్చి పట్టుకొన్న వానిమాంసము, అగ్గి కాఁకన్ = నిప్పుసెకయందు, ఇంచుక = కొద్దిగా, ఇడినన్ = పెట్టినచో, మంటలన్ = ఆనిప్పుమంటలయందు, నెయ్యి = చమురు, బొటబొట వడియున్ = బొటబొట మని కాఱును.

తా. ఆపందిగున్నలం బొడిచిన కత్తులు మొదలగువానికిఁ ద్రుప్పు పట్టకుండుటకై చమురు రాయ నక్కఱలేదు. ఆమాంసములో క్రొవ్వున్నది. మాంసమున కగ్గి సెగ దగిలినపుడు చమురోడుచుండుటయే దానికిఁ దార్కాణగదా! మిగులఁ బందులు క్రొవ్వియుండె నని భావము.

తే. వలదు కుక్కల విడువంగ వలవ దేయ
నడచి మొలపిడియమ్మునఁ బొడువవచ్చుఁ
బంకము గొరిజ దిగఁబడఁ బఱవలేవు
మన్ను లివ్వేళ రేగటిమన్ను లందు. 20

టీ. మన్నులు = మన్నులజంతువులు (ఋష్యములు), ఇవ్వేళన్ = ఈ సమయమునందు—వాన కురిసి నేలయంతయుం నానియున్న యిపుడు, రేగటి మన్నులందున్ = బంకమట్టి నేలలయందు, పంకము = ఊబియందు, గొరిజ = గిట్ట, దిగఁబడన్ = కూరుకొని పోవుటచే, పఱవలేవు = పరుగిడలేవు. అందున్, కుక్కలన్ = వేఁటకుక్కలను, విడువంగన్ = ఉసికొలుపుట, వలదు = అక్కఱలేదు, ఏయన్ = బాణములు గుఱిగాఁ బ్రయోగించుట, వలవదు = అక్కఱలేదు. నడచి = మెల్లఁగా దరియ నేఁగి, మొలపిడియమ్మునన్ = మొలను బెట్టుకొనిన పిడికత్తితోనె, పొడువ వచ్చున్ = పొడిచి చంపవచ్చును.

రేగటిమన్ను అంటినంతన దిగఁబడునది. ఋష్యములు బాగుగా బలిసినవి. సహజభీరువులుగాన తమంతన బెదరి బురదలో దిగఁబడునుగాన ఋష్యములను జేరి పొడువవచ్చును. కుక్కలతో నేమి సాధ్యముగాని ఋష్యములవేట యిపుడు సుసాధ్యము. ఆలసించిన నిట్టి మంచి యవకాశములుండవుగాన వెంటనే వేట కాయితము గమ్మని ప్రోత్సహించుట. పంకము గొరిజ యనునెడ పంకమునందు అను సప్తమికి విభక్తి లోపము కానవయ్యెడిని. ఇవి లాక్షణిక మనుట కాధారములు.

తే. "ఎవ్వరికి నీక తమతమ యిండ్లబ్రాతి
కొని సుఖంబుండి రథముపైఁ గొంద రందు" (భార. ఆది. ఆ. 7)

శా. "భావంబుల్ భయ ముజ్జగించి చనుఁడీ భవ్యాద్రిచా టందఱున్"
(హరివం. పూ. ఆ. 7)

తా. ఇపుడు వానకురిసిన బంకమట్టినేలలం దామన్నులం కాలందిగఁబడి పరుగెత్తలేవు; కావునఁ గుక్కలు వలదు. బాణము లక్కఱలేదు. దగ్గఱకు నడిచిపోయి మొలపిడియమ్ముతోనే పొడువ వచ్చును.

క. పొడచెదరి బోదచఱచిన
యొడళ్లతో నాల్గు రెండు నొకటియుఁ బ్రంగల్
వెడలిన కొమ్ములబరువున
నడు గిడఁగా లేవు బలిసి యందలిదుప్పుల్. 21

టీ. అందలిదుప్పుల్=ఆయడవి యందలి దుప్పులు, బలిసి = బాగుగాఁ గండఁబెట్టి, పొడచెదరి = పొడపొడలుగా నుంచిన మచ్చలన్నియుఁ బోయి, బోదచఱచిన = మత్తుకొనియున్న, (పాఁ-బూఁదిచఱచిన = బూడిదరంగు గలిగిన), ఒడళ్లతో = దేహములతో, నాల్గు రెండు ఒకటియున్ = నాలుగును, రెండును, ఒకటియుంగా నున్నవగు, ప్రంగల్ = పలవలు, వెడలిన = మొలచిన, కొమ్ములబరువునన్ =(చీలికలుగాఁ దీరి పొడవులైన పెరు) కొమ్ముల బరువుచేత, అడుగిడఁగా లేవు = అడుగు కదిపి యడుగు వేయలేవు.

దుప్పులు ముదిరినకొలఁది మేనిమచ్చలు,తగ్గి మేనంతయుఁ దొకరంగు కాలికి వచ్చును. బలిసియున్నవి, కొమ్ముల ప్రేగుచేఁ దలలు బరువగుచున్నవి. ఈబురదలో నవియుఁ గూరుకొన్న నూరకఁ జిక్కును.

తా. ఆవనములోని పృషతము లనుజంతువులు ముదిరిన కారణమున నొడలిమచ్చలు చెదరి దేహమంతయు బూడిదరంగు చఱచి పలవలుగల కొమ్ముల బలువున నడుగుదీసి యడుగువెట్టలే కున్నవి. అలం. అతిశయోక్తి.

ఆ. చలము లొదవ ముండ్లు గల ప్రాఁకుదీములఁ
గెరలి తాఁకి కొమ్ము లురులఁ దగిలి
వాని లేవ నీడ్చి కానకే కొనిపోవుఁ
బోతరించి యిఱ్ఱిపోతు లచట. 22

టీ. అచటన్ = ఆ యడవియందు, ఇఱ్ఱిపోతులు = మగలేడులు, పోతరించి = మదమెక్కి, చలములు = పంతములు, ఒదవన్ = పుట్టఁగా, ముండ్లుగల ప్రాఁకుదీములన్ - ముండ్లు గల = ఇనుపముండ్లు నాటిన, ప్రాఁకుదీములన్ = కొయ్యతో మగలేళ్ళవలెనే చేసి నిలిపిన బొమ్మలను, (సజాతీయజంతువులను బట్టుటకు వేఁటకానిచేఁ బెంపఁబడిన జంతువులను దీమములు అందురు.) కెరలి=కోపించి, తాఁకి = (తమతోఁ బోరనున్న మృగములుగాఁ దలంచి) ఎదుర్కొని, ఉరులన్ = ఆదీమములకుఁ గూర్చిన యుచ్చులలో తగిలి = తగుల్కొని, వానిన్ = ఆదీమములను, లేవనీడ్చి, కానకే = వనమునకే, కొనిపోవున్=పట్టుకొనిపోవును. ("క్రోధ మొదవ బండగులఁ బ్రాఁకుదీములఁ గెరలితాఁకి కొమ్ముటురులఁదగిలి" అనుపాఠము శబ్దరత్నాకరమందుఁ గలదు. క్రోధ మొదవన్=కోపముకలుగఁగా, బండగుఁడన్=బోనులను,ప్రాఁకున్= ఎక్కును. కొమ్ముటురులఁ దగిలి=కొమ్ములవలలోఁ జిక్కుకొని ప్రాఁకుదీములనఁ గొయ్యబోనులని యొకవ్యాఖ్యాతవ్రాసెనుగాని యది సమంజసముగాదు.)

తా. ఆకానఁబోలి యిఱ్ఱిపోతులు, తమ్ము పట్టుకొనుటకై వేఁటకాండ్రు పెట్టిన దీమములయందులను క్రోధముతోఁ గొమ్ములఁ జిమ్మి యవి యందులఁ జిక్కుకొనఁగా వాని నీడ్చికొనిపోవును. అలం. అతిశయోక్తి.

ఆ. కప్పువెట్టి వెన్ను కండమ్ము సమముగాఁ
బొదలి జోళ్లుగట్టి పోరుచుండి
వలయుఁ గాని పోవు మానిసిఁ బొడగన్న
నేమి చెప్ప వానియీసు లధిప. 23

టీ. అధిప = నృపాలా! కప్పువెట్టి = శరీరము నల్లవడి, వెన్ను = వీఁపును, కండమ్ము = మూఁపురమును, కంఠమ్ము నని పాఠము గలదు. సమముగాన్ = సరిగా—హెచ్చుతగ్గులు లేక సమానముగా నుండునట్టుల, పొదలి = వృద్ధిపొంది, జోళ్లుగట్టి = ఆఁడుదియుం మగదియుం జతలు జతలుగాఁ గూడి, పోరుచున్ ఉండి = ఎదటిమృగముతో సారెసారెకు మచ్చరముతోఁ గలియఁబడుచునుండి, మానిసిన్ = నరుని, పొడగన్నన్ = కాంచినను, వలయున్ కాని = కదిసిపోట్లాడుచుండునే కాని, పోవు = కగవుమాని తొలఁగిపోవు, వాని = ఆయిఱ్ఱిపోతుల, యీసులు = ఈర్ష్యలు, ఏమి చెప్పన్ = ఏమి చెప్పుదును? చెప్పఁజాల మని భావము.

మూఁపు వీఁపుసమముగా నుంటచే బాగుగా బలసియున్నవని భావము. మేను నల్లవడినచో బాగుగాఁ గ్రొవ్వినటుల గుర్తు. తమలోఁ దామె కలహించుతటి యిఱ్ఱులయెడఁ గానవచ్చు ఈసే వానిపోతరము దెలుపుచుండ నితరదృష్టాంతము లక్కఱలే దని భావము.

తా. సర్వాంగములును క్రొవ్వుచే సమానముగఁ బెరిగిన యెక్కుడి లేదు లొకదానితో నొకటి జతపడక పోరాడుచు మనుష్యులను గాంచినను భయపడి పోక చలముచేఁ గలహించుచునే యుండును.

క. కట్టియఁ జేకొని డేగం
బట్టి యుబుసుపోకఁ గాలము పుట్టినఁ జాలున్
దొట్టిన క్రొవ్వులు గలయవి
చెట్టడిచినఁ జేటెఁ డేమిచెప్పన్ బులుఁగుల్. 24

టీ. కట్టియన్ = మ్రానుకోలను, చేకొని = పట్టుకొని, డేగన్ = (వేఁట కలవాటుపడిన పెంపుడు) డేగను, పట్టి=పట్టుకొని, ఉబుసుపోకన్ = కాలక్షేపమునకువలె, కాలము = అవసరమును, పుట్టినన్ = వొచ్చినను, చాలును=అంతియె చాలును. పక్షులవేఁట కై ప్రయత్నములును జేయవలసిన యవసరము లేదు. పులుఁగులు=పిట్టలు, తొట్టిన క్రొవ్వులుగలయవి = పూర్ణముయిన క్రొవ్వుగలవి. చెట్టడిచినన్ = చెట్టుచెట్టును కట్టియతోఁ గొట్టినను, చేటెఁడు=చేట నిండుగ, ఏమిచెప్పన్.

తా. ఆయడవిలోనున్న పక్షులసంగతి చెప్ప నలవిగాదు. కట్టె దీసికొని డేగను విలాసముగాఁ గొని వనమునందు విహరించినఁ జాలును. చెట్టు కదలించిన చేటెడుపక్షులు లభింపఁగలవు. అలం. అతిశయోక్తి.

తే. ఉడుము గరిమిఁడికొక్కు దందడియు వెల్ల
యెలుక కన్నెల్క తఱచును నేమి చెప్ప
నడవి నెల్లెడఁ జూచిన నవనినాథ
జల్లెడయుఁబోలె లాఁగల నుల్లసిల్లు. 25

టీ. అవనినాథ = భూపతీ! ఉడుము = ఈపేరుగల గోధిక లను జంతువులయొక్కయు, గరిమిడికొక్కు = పందికొక్కులయొక్కయును దందడియున్ = అతిశయమును, వెల్లయెలుక = తెల్లమూషకములు కన్నెల్క = కన్నములలో నుండు చిన్నయెలుకలయొక్కయు, తఱచును = మిక్కుటమును, ఏమిచెప్పన్=ఏమని మనవిచేయుదును, అడవిన్ = కాననమునందు, ఎల్లెడన్ = సమస్తప్రదేశములందు, చూచినన్ = కను

గొన్నను, లాఁగలన్ = బిలములచేత, జల్లెడయుంబోలెన్ = జల్లెడకుఁగల రంధ్రములవలె, ఉల్లసిల్లున్ = ఒప్పుచుండును, (ఎల్కెల్క = తెల్లనియెలుక యని బ్రౌనుదొరవారి ప్రతిలోనిపాఠము.) అడవినిండ నుడుములు పంది కొక్కులు కన్నములు వేసియున్న వని భావము.

తా. ఉడుములు, పందికొక్కులు, తెల్లయెలుకలు, చిట్టెలుకలు మొద లైనవాని తఱచుచే నవి నివసించు కలుగు లెక్కుడై యడవి యంతటను జల్లెడవలె నగపడును. ఉపమాలంకారము.

క. అనుటయు మృగయాకౌతుక
మునఁ జిత్తము చెంగలింప భూధరశృంగం
బుననుండి డిగ్గి నగరికి
ననిమిషకాంతాకుమారుఁ డరిగి రయమునన్. 26

టీ. అనుటయున్ = ఆయెఱుకువాఁ డిట్లు పల్కఁగా, మృగయా కౌతుకమునన్ = వేఁటాడుటయందుఁగల కుతుకముచే, చిత్తము = మనసు, చెంగలింపన్ = క్రేళ్లుదాఁటఁగా, అభిలాషము కలవి యైనకతన, అనిమిషకాంతా కుమారుఁడు = దేవవనిత యగు వరూథిని కుమారుఁడు, భూధరశృంగంబున నుండి = పర్వతశిఖరమునుండి, డిగ్గి=దిగి, నగరికిన్ = పురములోనికి, రయ మునన్ = వేగముగా, అరిగి=చని, పైపద్యముతో నన్వయము.

స్వరోచి మాయాప్రవరవేషధారియగు గంధర్వునకు జనించెను. వరూ థిని బ్రహ్మతేజస్సంపన్నుఁడగు ప్రవరుని గర్భధారణసమయమునఁ దలంచి యుండెను. కాన నెవరికొమరుఁడో నిర్ణయించుటకంటె వరూథిని పుత్రుఁడను టయె యుచితము. అనిమిషకాంతాకుమారుఁ డనుటచే నితఁడు అమానుష శక్తిసంపన్నుఁ డని వ్యక్త మగును.

తా. ఈపైమాటలు బోయ చెప్పఁగా స్వరోచికి వేఁటాడ మనసుపుట్టి వేగమునఁ బర్వతము దిగి పట్టణములోనికిఁ బోయి.

వ. నగరు సొచ్చి యచ్చటం గక్ష్యాంతరశాలాంతరాళంబుల
నందంద తండతండంబులై వ్రేలునత్తెంబులం జము రంటు
పలలఖండంబుల మండితంబు లగునిడుదవెదురుదండెంబుల
బర్హిబర్హినిబద్ధాగ్రంబు లై కొమరారు దోరెపుఁద్రాళ్ల
తోడం దిరుగుడులవెడంగువడి వడిదప్పునట్లు త్రాళ్లం గట్టు
వడి పొట్ట లదురంగ నిక్కి పరిసెనంబులు వేయునవియును,
నవహాసితశార్దూలకుటిలనఖకోటిపాటవంబులగు త్రోటిపు
టంబులం జటకసరటాదిజంతుకళేబరంబులం జరణనఖరాం
కురంబుల నిఱికి చీరుచుం గేరునవియును, నాఁడునాఁటికిం
బాటించి వేఁటకాండ్రద నెఱింగి మేపుమేపులచమత్కా
రంబుల నిరాకరించి వీకునం తిరిగి దిరిగి యీఁక దీర్చుకొను
నవియును, బద నగ్గలించి కూయుచుం గడుపు నకనకంబడం
గనుకట్టుతోడమోములు మలంచుచుం బంజరస్థితకీరశారికా
పారావతాదులపలుకు లాకర్ణించి యెగసి యెగసి నిజావస్థిత
తాదృగ్విధాధారవేణుయష్టులకుఁ జట్టుపలు చెదరం
బ్రదక్షిణభ్రమణంబులఁ బరిభ్రమించి మగుడ నెట్టకేలకు
మట్టుకొనునవియును, మేరమీఱం దిన్నయొరల నన్నుకొని
యరగన్నువెట్టి బోరకడం బోటమరింపం గూరుకుచుం
గుతికిలంబడునవియును నై పఱఁగుపలువెఱంగులడేగ
మొత్తంబులను, గుత్తంబు లగుమిగుల మెత్తనిజలపోతతోలు
పట్టెడలు మెడల నమరం బనుపార్చి కట్టుఁగంబంబులకుం
దార్చిబంధించిన కుందనంపు గొలుసులుగల్లుగల్లుమనంగనొడ
ళ్లుజాడించికొనుచుం గొనసాఁగినొగలై ముంగిసమోరలుం
బోనిమోరలు సారెసారెకు నెత్తి బయలుపసివట్టుచుఁగట్టెదుటి

వాజిశాలలం గట్టినపాష్ట్రేళ్లకై యాదిగొని నీల్గి కాలుద్రవ్వి ఘనఘనాఘనఘుర్ఘురధ్వానసమధ్వనులు చెలంగ మ్రోఁగుచు నింగిఁ బ్రాఁకుచు నింగలంబు లుమియునయనగోళంబులనాభీలంబులై వివృతవదనగహ్వరవిలంబిజిహ్వాపల్లవంబులకుం గ్రూరతరదంతకోణకాంతికలాపంబులం గోరకస్తబకయోగంబు గల్పించుచు నల్పేతరగ్రస్తకీలాలపలలజాలగ్రాసంబులు నెన్నడుముసన్నఁదనంబున నట మిగుల డిగ్గి చనకునికిఁ గటితటంబులకంటెం దారె ఫుటపుట నయ్యె ననఁ దోరంబు లగుబోరలఁ గందంబులనందంబులు గని బిరుదు లంకించి తమ్ము నుపలాలించుపరిపాలకులసంస్తవంబులకుఁ జెవిదార్చి ననంగర్ణకిసలయంబులు వ్రాలంబడి వెండిగుండులుంబోలెఁ గన్నులకుండువులై గండభైరవపూజవారువంబు లన మెండుకొని యుండుజాగిలంబులునుఁ గాంచి యందు నందును వేఁటకునుఱువైనవాని నేర్పఱించి తెచ్చుటకు ననుచరుల నీవు నీవని నియమించి తానును నాఖేటకోచితపరిపాటి సన్నద్ధుండయ్యె; నయ్యవసరంబున.

టీ. నగరు = రాజగృహము, చొచ్చి = లోనికిఁ జని, అచ్చటఁ కక్ష్యాంత...బులన్ - కక్ష్యాంతర = చుట్టుకోటద్వారములయందలి, తొట్టికట్టుల లోపలి, శాలా=సాలలయొక్క, అంతరాళంబులన్ = లోపల, అందంద = అక్కడక్కడ, తండతండంబులై = ప్రోవుప్రోవులై; వ్రేలునత్రాఁబులన్ = వ్రేలఁబడిన తోలుతొడుగులందు, (డేగలం బెంచువారు వానిగోరులు గ్రుచ్చుకొనకుండఁ జేతికిఁ దొడుగుకొనుట కనుకూలముగాఁ దోలుతోఁ జేయఁబడిన చేతితొడుపును అత్తె మందురు) చమురు = జిడ్డు మొదలగునవి, అంటుపలలఖండంబులన్ = అంటుకొనునట్టి మాంసపుముక్కలచే, మండితంబులు = శృంగారింపఁబడినవి. మాంసపుముక్కలు డేగలు తినుటకుఁ గట్టిలకుఁ గట్టి

యుంచిరని భావము. అగు...దండెంబులన్ - అగు, నిడుద = పొడవైన, వెదురుదండెంబులన్ = వెదురుగడలదండెములయందు, బర్హి...గ్రంబులై - బర్హి = మయూరముల, బర్హ = పింఛములచేత, నిబద్ధ = బంధింపఁబడిన, అగ్రంబులై = తుదలుగలవై, కొమరా...తోడన్ - కొమరారు = ఒప్పు చున్న, దోరెపుఁద్రాళ్లతోడన్=బంధనరజ్జువులతో, తిరుగుడులన్ = భ్రమణ ములచే, వెడంగువడి = వికలత్వమునొంది, వడిదప్పునట్లు - వడి = భ్రమణ మునందు వేగము, తప్పునట్లు = తొలఁగిపోవునటుల, త్రాళ్లన్ = దోరెపుఁ త్రాళ్లచేత, కట్టువడి = బంధింపఁబడి, పొట్టలు = కడుపులు, అదురంగన్ = అదరిపోవఁగా, నిక్కి = నిగిడి, పరిసెనంబులు వేయుచున్నవియును = దుముకు చున్నవియు (పరిసెనము లన జెట్లుపట్టుచేష్టావిశేషములని గంతులని బ్రౌనుదొర వారివ్యాఖ్య. పరిసెనము = డేఁగలకు ఆఁకలియెత్తి వేఁటయందుఁ జోరవ కలుగుటకై మందిచ్చి కలిగించువాంతి యనియు-పా. పరిసెనంబులు సేయు చున్నవియు నని శబ్దరత్నాకరము) (స్వభావోక్త్యలంకారము.) అపహ...పాటవం బులు-అపహసిత=నవ్వఁబడిన, శార్దూల = పులులయొక్క, కుటిల = వంపులు గల, నఖకోటి = గోటితుదల, పాటవంబులగు = పటుత్వముగలవి యగు, (పులిగోళ్లవలె వంకలుదేరి దృఢమున వానిని మించిన వని భావము) త్రోటీ పుటంబులన్ = దొప్పలవలె నున్న ముక్కులచే, చటక...రంబులన్-చటక= పిచ్చుక, సరట=తొండ, ఆది=మున్నగు, జంతుకళేబరంబులన్=జంతువుల శరీర ములను, చరణ...బులన్-చరణ=పాదములయొక్క, నఖర=నఖములయొక్క, అంకురంబులన్=మొనలచే, ఇఱికి = అంకించిపట్టుకొని, చీరుచున్ = చీలిచి వైచుచు, కేరుచున్నవియును=సంతసించునట్టివియు, ఉత్సాహపడుచుండునవియు (అలం-ఉపమ.), నాఁడు నాఁటికిన్ = దినదినమును, పాటించి = జాగరూక తతో విచారించి, వేఁటకాండ్రు=వేఁటలాడువారు, అదను = (ఆఁకలిగొన్న) సమయము, ఎఱింగి=తెలిసి, మేపు=మేయునటులఁజేయు, మేపుల=మేఁతల, చమత్కారంబులన్=నేర్పులను, (సమయముదాఁటనీక మెలఁకువతో నాహర

మొసంగుచున్నను) నిరాకరించి = లక్ష్యముసేయక, పీఁచన్ = గర్వముచే, తిరిగితిరిగి, ఈఁకదీర్చుకొనునవియును = పక్షులందలి యీఁకల సరుదు కొను నట్టివియు, పీఁచునం దిరిగితిరిగి యని బ్రౌనదొరవారిప్రతి. అలం-స్వభావోక్తి. పదను=మేఁతకాలము, అగ్గలించి=అతిక్రమించి, కూయుచున్ = అఱచుచు, కడుపు=పొట్ట, నకనకంబడన్ = కృశింపఁగా, కనుకట్టుతోడన్ = కన్నులకుఁ గట్టినమూఁతతో, మోములు = మొగములు, మలచుచున్ = మరల్చుచు (డేగలు పట్టుకొన్నవానిగ్రుడ్లు పొడుచు నను తలంపుతోఁ గనులు కానరాకుంటకుఁ దోలుతిత్తి దిగవేయుట కలదు) పంజరస్థిత = పంజరములలోనున్న, కీర=శుకములు, శారికా=గోరువంకలు, పారావత=పావురములు, ఆదుల=మున్నగువాని, పలుకులు, ఆకర్ణించి=ఆలకించి, ఎగసియొగసి=ఎగిరియెగిరి, నిజ=తమ, అవస్థిత=వసించునట్టి, తాదృగ్విధ=ఆరీతియగు, ముందుఁజెప్పఁబడినటుల, గట్టఁబడిన, ఆధారశ్రేణియష్టులకున్ = అవలంబనయోగ్యములగు వెదురు కఱ్ఱలకు, చట్టుపలుచెదరన్ = ఱెక్కలు చెదరునట్టులు, ప్రదక్షిణభ్రమణంబులన్=సవ్యముగాఁ జుట్టివచ్చుటలచే, పరిభ్రమించి=తిరిగి, మగుడన్ = క్రమ్మర, ఎట్టకేలకున్=అతికష్టముచే, మట్టుకొనునవియును = తిరముకొనియున్నట్టివియు, డేగలు ఆఁకలిగొని పంజరములం దున్న చిలుకగోరువంకల పలుకులు విని వానిం దిన నుఱకఁబోయి తామున్న వెదురుగడలపైననే యతిశ్రమ మీఁదఁ బడి కుదురుకొనుచుండెను. (అలం. స్వభావోక్తి.) మేఁగమిఱన్ = హద్దుదాఁటునటుల, తిన్నయెరలన్=భుజించిన మేఁతలచే, అన్నుకొని=మదించి, అరగన్నువెట్టి = అరమోడ్పుగన్నులుగలవైయై, బోరకడన్ = గుండెలపై పుపొటమరింపన్ = స్ఫుటము లగునట్లు, గూరుకుచున్ = కునుకుచు, కులికిలంబడునవియును = కుదికిలంబడునట్టివియును, ఐ, డేగలు మితిమీఱి ఆహారము తిన్నచో మత్తున నిదురించుఁగాన బరిమితాహార మొసంగుదురు. పఱఁగు = ఒప్పెడు, పలుదెఱంగుల=అనేకవిధముల, డేగమొత్తంబులను = డేగలసమూ-

హాయము, గుత్తాయిలగు = హెచ్చుతగ్గులు లేక సరిపోయి, మిగుల మెత్తని = మిక్కిలి మృదువైన, జలపోత = బంగరుపూఁత పూయఁబడిన, తోలుపట్టెడలు, మెడలన్ = కంఠములయందు, అమరన్ = ఒప్పఁగా, పసుపార్చి = పసుపుకలిపిన నీటిలోఁ దానమాడించి, కట్టుఁగంబంబులకున్ = కట్టినకఱ్ఱలకు, తార్చి = దగ్గఱగాఁ జేర్చి, బంధించిన కుందనంపుగొలుసులు = కట్టిపెట్టిన మంచిబంగారుతోఁ జేయఁబడిన గొలుసులు, గల్లుగల్లుమనంగన్ = గల్లుగల్లుమని మ్రోఁగుచుండఁగా, ఒడళ్లు జాడించికొనుచున్ = మేనులు దులిపికొనుచు, కొనసాగి=మేనునిగుడునటుల సాచికొని, సోగలై=పొడవుగలవియై, ముంగిసమోరలుంబోని = ముంగిసమూతులంబోలిన, మోరలు = ముట్టెలను, సారెసారెకున్ = మాటిమాటికిని, ఎత్తి = పైకిఎత్తుకొని, బయలు = శూన్యప్రదేశమును, పసిపట్టుచున్ = వాసనచూచుచు, కట్టెదుటి = ఎదురుగానున్న, వాజిశాలలన్ = గుఱ్ఱములసాలలయందు, కట్టిన, పొట్టేళ్లకై = మగగొఱ్ఱెలకొఱకు, ఆఁగొని=కన్నువేసి, పొంచియుండి యని కొందఱు. నీల్గి = ముందునకు నిక్కి, కాలుద్రవ్వి = నేలమీఁదఁ గాలితోఁ గోరాడి, ఘన = గొప్పదియైన, ఘనాఘన = వానకురియుచున్న మబ్బులయొక్క, ఘర్ఘరధ్వాన=పెద్దచప్పుడుతోఁ గలసిన గర్జనలతో, సమ = సరియైన, ధ్వనులు = అఱపులు, చెలంగన్, మ్రోఁగుచున్ = మొఱుఁగుచు, నింగిన్ = గగనమును, ప్రాఁకుచున్=ఱొమ్ముతో మీఁదికి జరుగుచు, కట్టినకొయ్యలనాధారము చేసికొని పైకిలేచి ప్రాఁకునటుల నటించుచు, ఇంగలంబులు = అగ్నులు, ఉమియు=ఉమ్మివేయుచున్న (వెడలించుచున్న), నయనగోళంబులన్=పట్రువులైన లోచనగుళికలచే, అభీలంబులై = భయజనకములై, (అలం. ఉపమ.) వివృత = తెఱవఁబడిన, వదనగహ్వర=పర్వతగుహలవలె నున్న నోళ్లనుండి, విలంబి=వ్రేలాడుచుండిన, జిహ్వా = నాలుక లనియెడు, పల్లవంబులకున్ = చిగురుటాకులకు, క్రూరతర=అతికఠినములగు, దాత=దంతముల, కోణ=మొనలయొక్క, కాంతి=వెలుఁగులయొక్క, కలాపంబులన్ = సముదాయముచే, కోరక స్తబక యోగంబు = మొగ్గలగుత్తులపొందును, కల్పించుచున్ = పుట్టిం

చుచు; నాలుకలు ఎఱ్ఱగా నుండునుగాన చివురుటాకులతోను, కోఱలు తెల్లగా నుండును గాన మొగ్గలతోను బోల్పఁబడెను. (అలం. రూపకము.) అశ్వేతర=విస్తారముగా, గ్రస్త=గ్రసింపఁబడిన, కీలాల=నెత్తురుతోడి, పలల = నంజుడు యొక్క, జాల=ప్రోవులయొక్క, గ్రాసంబులు=భోజనవస్తువులు, నెన్నడుము సన్నఁదనంబునన్ = అన్నువకౌనుయొక్క తనుత్వముచే, అటన్ = అవల, మిగులన్, డిగ్గిచనకునికిన్ = దిగివెడలకుండుటచే, కటికటంబులకంటెన్ = నితంబభాగములకంటెను, తారె = తమరె, పుటపుటనయ్యెన్ = పెరిఁగెను, అనన్, తోరంబులు=బలుపుచెందినవి, అగు, బోరలన్ = ఉరములచే, కందంబులన్ = మూఁపులచే, అందంబులు కని=చక్కఁదనములు పొంది, నడుము మిగుల సన్నముగాను ఊర్ధ్వకాయము లావుగాను నుండెను, బిరుదులు=బిరుదములను, అంకించి = స్తుతించి, తమ్మున్, ఉపలాలించు = లాలనము చేయుం పరిపాలకుల = పోషించువారియొక్క, సంస్తవంబులకున్ = స్తుతులకు, చెవిదార్చె ననన్ = కర్ణము లావైపునకుఁ బెట్టెనవో యనురీతి, కర్ణకిసలయంబులు = చిగురులవంటి శ్రోత్రములు, వ్రాలంబడి = వ్రేలఁబడి, వెండిగుండులుంబోలెన్=వెండితోఁ జేసినగుండులవలె, కన్నులపండువులై=నేత్రానందకరములై, గండ...వంబులు-గండభైరవు = గండభైరవదేవునియొక్క, భూజవారువంబులు=భూజకొఱకుఁ దెచ్చినగుఱ్ఱములో, అనన్=అనునట్టుల, (అలం. ఉత్ప్రేక్ష) మెండుకొని=పూర్ణమై, ఉండు, జాగిలంబులునున్ = వేఁటాడు నొకవిధపు శునకములను, కాంచి = చూచి, అందునందున్ = వానివాని యందు, వేఁటకున్, ఊఱువైనవానిన్ = తగినవానిని, ఏర్పఱిచి = ఏఱి, తెచ్చుటకున్, అనుచరులన్ = కింకరులను, నీవు నీ పని, నియమించి = ఆనతిపెట్టి, తానును, ఆఖేట...పాటిన్-ఆఖేటక=వేఁటనిమిత్తము, ఉచిత = యోగ్యమైన, పరిపాటిన్=విధమున, సన్నద్ధుండు=సిద్ధమైనవాఁడు, అయ్యెన్, అయ్యవసరంబునన్ = అప్పుడు.

ఆటవికుఁడు దుప్పులు పందులు లోనగు నడవిజంతువులను గూర్చియుఁ బక్షులను గూర్చియుఁ జెప్పెను. కాన మృగముల వేటాడుటకు వేటకుక్కలను బక్షిగణముపై వేఁటాడుటకు క్రమశిక్షనొందిన డేగలను స్వరోచి తగినవాని నేఱించెను.

సీ. పచ్చనిహురుమంజిపనివాగె పక్కెర
పారసిపల్లంబు పట్టమయము
రాణ నొప్పారుపైఠాణంబుసింగిణి
తళుకులకోరులతరకసంబు
మిహిపసిండిపరుంజు మొహదా కెలంకుల
దాపు గుజ్జరినేతకేవడంబు
డా కెలంకున సిరాజీకరాచురకత్తి
కుఱుగటఁ గ్రొవ్వాఁడిగోరకలపొది
తే. పీలికుంచెతలాటంబు బేరజంబు
మణులమొగముట్టు వన్నె సాహిణి యొకండు
కర్తయెదుటికిఁ గొనివచ్చె గంధవాహ
బాంధవం బగునొకమహాసైంధవంబు.

టీ. పచ్చని = పచ్చరంగుగల, హురుమంజి = హురుమంజిదేశపు, పని = రత్నాదులుతాపుట, చెక్కుట మున్నగుపనులు గలిగిన, వాగె = కళ్లెమును, పక్కెర=కవచము (కప్పెడుకంబళివంటిది), పట్టమయము = పట్టుతోఁ జేయఁబడిన, పారసిపల్లంబు = పారసీకములోని జీను, రాణక = ఇంపుగా, ఒప్పారు = చక్కనైయున్న, పైఠాణంబుసింగిణి = పైఠాణదేశసంబంధమైన విల్లును, తళుకు లకోరుల తరకసంబు=ధగధగ వెలుఁగుచున్న బాణములపొది, మిహి=మేలిమి, పసిండి = సువర్ణమయమైన, పరుంజు = పట్టు కొనుపిడియున్న, మొహదా = ఈ పేరుగల వంకకత్తియు, కెలంకులదాపు =

ఆకత్తి ప్రక్కను, గుజ్జరినేఁతకేవడంబు = గుజరాతిదేశపు పనివానితనము గల కేడెమ్మును, డాకెలంకునన్ = ఎడమవైపున, సిరాజీ=సిరాజీదేశపు, కరా = కటారైన, చురకత్తి=మొనగలిగిన చిన్నకత్తియును, కుఱుఁగటన్ = (దానికి) దగ్గఱఁగా, క్రొవ్వాఁడి = క్రొత్తఁగా వాఁడిపెట్టఁబడిన, గోరకలపొది = పొట్టియీఁటెలబత్తలికయు, పీలిసుంపెతలాటంబు = పికిలియను పిట్టలబొద్దు క్రిందనుండు నెఱ్ఱివెండ్రుకల కుచ్చులతోఁ జేయఁబడిన తురాయియును, పేరజంబుమణుల = కృత్రిమరత్నములయొక్క, మొగముట్టు = మొగపుఁ బట్టమును, (పేరోజంబుమణులని యుఁ గలదు), పన్ని=పూన్చి, సాహిణి = గుఱ్ఱపువాఁడు, ఒకండు, గంధవాహబాంధవంబు = (వేగమునందు) వాయువునకు బంధుగు, అగు, సైంధవంబున్=సింధుదేశభవమైన యశ్వమును, కర్త యెదుటికిన్ = స్వరోచియగ్రమునకు, కొనివచ్చెన్.

తళుకులకోరుల అనుచోఁ దళుకులకోరిల యని పాఠాంతరము గలదు. చిన్నయభట్టారకుఁడు ఆంధ్రశబ్దచింతామణియందును దద్వ్యాఖ్యలో అహోబలపండితుఁడు లకోరీ దీర్ఘాంతముగా నిశ్చయించిరి. అథర్వణాచార్యుఁడు లఘుత్వము నామోదించినాఁడు. కవులు తఱుచుగా హ్రస్వాంతముగఁ బ్రయోగించిరిగాన లకోరులనుపాఠము దుష్టముకాదు. లకోరులు సాధు వనుటకుఁ బ్రమాణములు.—

ఉ. "కొద్దికిఁ బచ్చలుత్తురి లకోరుల కేమగుచున్నదో గదా."

(తారాశశాంకము, ఆ. ౪.)

సీ. "కురంపఁగిలకోరి హేలావతీతనూమృదుభావ మింతని యెఱిఁగివచ్చె."

(బహులాశ్వచరిత్రము, ఆ. 3.)

చ. "కలువలకోరులం గులుకుగబ్బిచనుంగవ గాడసేయఁగన్."

(దశావతారచరిత్రము, ఆ. 3.)

తే. "ద్విజుఁ డటులఁ బాడిదప్పి త్రోవ్విరిలకోరి."

(సత్యభామాసాంత్వనము, ఆ, ౪.)

లకోరీలు అనుపాఠము గ్రహింతుమేని యదియుం సాధువు.' ప్రయో గము.

క. "ఈరీతిం గొందలిరు ల,కోరీ సురతాణి కాఁకగూర్చుచకోరీ
శారికీరీమత్తమ, యూరీరవములకు నలికి యంగ్నలి మదిలోన్."

(చంద్రభానుచరిత్రము, ఆ. ౨.)

తా. కత్తెము, జీను, దానిప్రక్కనుగత్తులు, గటారులు నమ్మలపొదులు, నీఁటెలు, బాకులు మున్నగు నాఖేటసాధనసంపన్నం బైనయొక్క గుఱ్ఱమును రాజు నొద్దకు నశ్వరక్షకుఁడు తెచ్చెను.

క. తెచ్చుటయు నిచ్చ మెచ్చి మ
రుచ్చటులకురంగరయనిరోధిస్యదగ
ర్వోచ్చం బగునత్తేజి సు
హృచ్చక్రం బలర వేగ నెక్కి వెడలిఁన్. 29

టీ. తెచ్చుటయున్ = ఆగుఱ్ఱమును సాహిణి తెచ్చి యిడఁగానే, ఇచ్చన్ = మనంబున, మెచ్చి, మరు...చ్చంబు-మరుత్ = గాలిసంబంధ మైన, చటుల = పటుత్వముగల, కురంగ=మృగములయొక్క, రయ=వడిని, నిరోధి = నిలుపఁజాలిన, స్యద = రయముచేతనైన, గర్వ = గర్వముచే, ఉచ్చంబు=ఉన్నతమైనది, అగునత్తేజిన్ = అయిన యాయశ్వమును, సుహృచ్చక్రంబు = స్నిగ్ధబృందము, అలరన్ = ఆనందపడఁగా, వేగ, ఎక్కి, వెడలినన్ = ప్రయాణము కాఁగా. అలం. ఉపమ.

వాయువు వాహనము సామాన్యకురంగముగాదు సమర్థమైనది. స్వరోచి యెక్కిన యశ్వము వాయుకురంగమును వేగమున నతిక్రమించినది. వాయువేగమునఁబోవఁగలది. కాననే గంధవాహాబాంధవము. తనవాహనముల

కంటె వాయువు వేగముగాఁ బోఁగలవాఁడు. అతనితో సమముగాఁ బోఁగఁ లది గాననే యతనికి బాంధవ మనిపించుకొనెను కాన గర్వోచ్చము.

తా. వాయువాహన మైనజింకకంటెను వేగముగఁ బర్వెత్తఁజాలిన యాగుఱ్ఱమును స్నేహితుల కానందము గలుగున ట్లెక్కి బయలుదేఱెనంతట. అలం. ఉపమ.

చ. జడలు మలంచి చొల్లెముగ సన్నపుఁబాగ లడంగఁ జుట్టి చ
ల్లడములు పూని మీఁదఁ బదిలంబుగఁ గట్టినమట్టికాసెలన్
బిడియము లంటఁదోఁపి పృథుభీషణబాహులసాళువంబులన్
దడవి కెరల్చుచున్ జనిరి సాధునిమ్రోల నృపాలనందనుల్.

టీ. నృపాలనందనుల్ = రాజకుమారులు, జడలు = అల్లినశిరోజముల జడలను, మలంచి=వంచి, చొల్లెముగన్=గుండ్రపుచుట్టగా, సన్నపుఁబాగలు= మృదుతరములైన తలపాగలలో, అడంగన్ = కానరాకుండ నాజడలు ఇమిడి యుండునట్లు చుట్టి, చల్లడములు=చల్లనములు (లాఁగులు), పూని = తాల్చి, మీఁదన్=లాఁగులమీఁద, పదిలంబుగాన్ = గట్టిగా, కట్టిన = ధరించిన, మట్టి కాసెలన్=మట్టిరంగులలో ముంచిన నడికట్టులయందు, పిడియములు = బాఁకులను, అంటన్ దోఁపి=పిడివఱ కంటుకొని యుండునటుల లోనికి దోఁపి, పృథు= పెద్దదియైన, భీషణ=బెదరుపుట్టించు, బాహుల = చేతులయం దున్న (యని యర్థము.) సాళువంబులన్ = డేగలను, తడవి=దువ్వి, కెరల్చుచున్ = పురి కొల్పుచును, సాధునిమ్రోలన్=స్వరోచిముందఱ, చనిరి = నడచిరి.

తా. స్వరోచియున్నతాశ్వము నెక్కి వేఁటకుఁ బరివారముతో బయలు దేరఁగానే రాజపుత్త్రు లెల్లరుఁ దమజడలు తలపాగలలో నడఁగునట్టు చుట్టు కొని లాఁగులు తొడిగికొని కాసెకోకలు బిగించి మొలలో కత్తులు దోఁపికొని వేఁటకుఁ దగిన వేషమును ధరించి ముంజేతులపైనున్న డేగలను వేఁటకుఁ బ్రోత్స హించు మెలకువతోఁ బట్టుకొని వేఁటకు వెడలిరి. అలం. స్వభావోక్తి.

సీ. ఇవి కంఠపాశంబు లింత డుస్సిన మీఁదఁ
బడి దిశాకరి నైనఁ గెడపఁజాలు
నివి మింటఁ బఱచుపక్షీంద్రుఁ జూపిన నీడ
బడి వాలునందాఁకఁ బఱవఁజాలు
నివి గాలి గనిన మూకవరాహదనుజేంద్రు
నైన జుట్టెుంటిలో నాఁగఁజాలు
నివి కాటు కొల్పిన వృద్ధకూర్మముపీఁపుఁ
జిప్పైన నెఱిచి కైచింపఁజాలు
తే. ననఁగ ఘుర్ఘురగళగర్జజనితభూరి
భూభృదురుబిలభరితభాభాభయంక
రార్భటీదీర్ణదిగ్భిత్తు లగుచుఁ జెలఁగె
సరిపెణలఁ బట్టి తెచ్చినజాగిలములు. 31

టీ. ఇవి=ఈశునకములు, కంఠపాశంబులు = మెడకుఁగట్టిన త్రాళ్లు, ఇంత డుస్సినన్ = ఒక్కింత సడలించిన, దిశాకరి నైనన్=దిగ్దంతి నైనను, మీఁదఁబడి=పైనిఁబడి, కెడపఁజాలున్=వధింపగలవు. ఎంతదూరమునం దుండు జంతువునైనను గొలుసు వదలినంతమాత్రమున సాహసముగాఁ బోయి శునక ములు పట్టుకొనఁగలవు. ఇవి, మింటన్=గగనమున, పఱచుపక్షీంద్రున్=ఎగురు చున్నగరుడుని, చూపినన్, వాలునందాఁకన్=ఆపక్షిరాజు క్రిందికి దిగునంత దాఁక, నీడబడిన్=భూమిపైఁ గనఁబడుచున్న చాయనుబట్టి. పఱవఁజాలున్= పరుగిడఁగలవు. పైనున్నపక్షులనీడ గుర్తించి నీడవెంటఁబోయి వాలునంతవఱకు వెంబడించి యాశునకములు పట్టుకొనఁగలవు. ఇవి, గాలి గనినన్ = వానిపై నుండివచ్చు వాసనపసిగట్టినచో, మూకవరాహదనుజేంద్రున్=సూకరవేషము వేసిన మూకుఁ డనురక్కసిరాజు నైన, జుట్టెుంటిలోన్=(దూరముపోకుండ), జుత్తెఁడు లేక జుట్టెఁడు ప్రేలెఁడు నని పరిమాణార్థకము. ఆఁగఁజాలున్ =

నిలుపఁగలవు. సాధ్యముగాని యెంతటిపోతరించిన యడవిపందికైనను ఈకుక్కలు మిగులఁ జేరువలోని పట్టుకొని యీడ్వఁగలవు.-ఇవి, కాటుకొల్పినన్= కటువఁ బుఱికొలిపితిమా, వృద్ధకూర్మము వీఁపు చిప్ప = ఆదికచ్ఛపముయొక్క వీఁపుచిప్ప (తాఁబేలు జోరుసునైనను), చింపఁజాలున్ = చీల్చివేయఁగలవు. తాఁబేలువీఁపు మిగులఁ గఠినమైనది. అందు ఆదికూర్మమువీఁపు చెప్పఁ బనిలేదు. కాటంబెనేని యాకుక్కలు ఆదికూర్మమువీఁపునేని చీల్పఁగలవు. అనఁగన్ = ఘర్ఘర...భిత్తులు—ఘర్ఘర=ఘర్ఘరమనెడు, గళగర్త=కంఠమనుగోయియందు, జనిత=పుట్టిన, భూరి=విస్తారమైన, భూభృత్=కొండయొక్క, ఉరు=గొప్పవైన, బిల=గవులయందు, భరిత=పూరింపఁబడిన, భాభాభయంకరారభటీ=భౌభౌ అను భీతి పుట్టించుచున్న మొఱుగుటలచే, దీర్ణ=పగిలిన, దిగ్భిత్తులు=దిక్కులగోడలుగలయవి, అగుచున్; పసిఁడిపెనలన్ = శృంఖలములచే, పట్టి=వేటకాండ్రు పట్టుకొని, తెచ్చిన=వెంటఁగొని తెచ్చిన, జాగిలములు=వేటకుక్కలు, వెలఁగెన్= ఒప్పెను.

తా. ఈకుక్కలు దిశాకరుల నైన నిగ్రహించును. ఇవి యాకసమున నెగురు గరుత్మంతునితోఁగూడ నీడజాడఁబట్టి పసిగట్టును. ఇవి వాసన వసఁప రించి మూకాసురునైన (వాఁడు నిజమైన పందికాకున్నను)నిలుపును. దంతపటుత్వమున నాదికూర్మము వీఁపైన భేదించును. అని యనుకొనఁ జాలి భౌభౌ అను అరపులతో పర్వతగుహాలను మాఱుమ్రోగునట్లు చేయుచు వేటకై గొలుసులు కట్టి వేటకాండ్రు గొనిరా కుక్కలు వెడలెను. అలం. అశక్యకరణమును కావ్యార్థాపత్తి; ఉత్ప్రేక్ష.

చ. పులియఁడుబూచిగాఁడసురపోతులరాజను మంతిగాఁడు చెం
గలువ సివంగి భైరవుఁడు గత్తెర సంపఁగి వెండిగుండు మ
ల్లెలగుది వాయువేగి చిటిలింగఁడు సాళ్వఁడు వత్సనాభి యే
కలములముత్తి గబ్బియనఁగాఁ గలవాని గ్రహించి యుద్ధతిన్.

టీ. పులియఁడు, బూచిగాఁడు, ఈవిధమైన పేరులు గలకుక్కలను (ఈరీతిని గబ్బి యనువఱకుఁ జేర్చని తెలియవలెను.) గ్రహించి వేఁటకాండ్రు ర్థతిగా వెడలిరి.

ఉ. కట్టిననీలిదిండ్లు సెలకట్టియవిండ్లును విండ్లగౌసెనల్
చుట్టి నొసళ్లపై నిడినజుంజుఱుఁబల్లసిగల్ గటీతటిఁ
బెట్టినమోటకత్తులును మేనులఁ గార్కొనుకప్పు లేర్చి చేఁ
బట్టినవేఁటయమ్ములును బాగగువాగురికుల్ మహాధ్వనిన్. 33

టీ. కట్టిన=నడుములు బిగియునటులఁ గట్టుకొనిన, నీలిదిండ్లు = నల్ల కాసెకోకలును, సెలకట్టియవిండ్లును=ఒకదినుసు విండ్లును, (సెలసుకట్టియతోఁ జేసినవిండ్లు) విండ్లగౌసెనల్ = విండ్లుపెట్టు ఖరకాలును, చుట్టి = మెలియఁ జుట్టి, నొసళ్లపైన్=నొసటిప్రదేశముల మీఁదికి వచ్చునటుల, ఇడినజుంజుఱు బల్లసిగల్ = ఉంచుకొనిన చిక్కుపడిన యొత్తు జుట్లును, కటీతటిన్ = వెనుక ప్రక్కను - మొలవెనుకభాగములందు, పెట్టిన మోటకత్తులు = పెట్టుకొనిన యుక్కుకత్తులు, మేనులన్ = దేహములందంతట, కార్కొనుకప్పులు = కప్పుకొనిన నీలచ్ఛాయలును, ఏర్చి = మేలైనవి తీసి, చేపట్టినవేఁటయమ్ములు= పట్టుకొని వేఁటాడుటకుఁ దగినబాణములును, బాగగు వాగురికుల్ = తగిన వలవేఁటకాండ్రు, వాగురిక యన నుచ్చు; దానితో వేఁటలాడువానిని వాగురికుఁ డందురు. మహాధ్వనిన్=పెద్దధ్వనికలుగునటుల మాటలాడుచు, వైపద్యముతో నన్వయము. అలం. స్వభావోక్తి.

తా. నల్లకాసెలం కట్టుకొని, ధనుర్బాణములు ధరించి, విండ్లకుఁ బెట్టు కొలుగుడ్డలు తలకుఁ జుట్టుకొని, చిట్టివెండ్రుకలజుట్టుతో నల్లయొడళ్లతోఁ గత్తులు మొల దోపికొని యందరులవేఁటకాండ్రు వెడలిరి.

సీ. సట లెత్తుకొని రొుత్తుకిటినైన మోటాస
పడి యేయఁ బోడుతు నీపాదమూన

కలగుండువడఁ జెందుకరి నైనఁ జెవి పట్టి
బలిమిమైఁ దెత్తు నీపాదమూన
సెల నెప్పుకొని రొప్పుపులి నైనఁ బీడించి
పడవైతుఁ జొచ్చి నీపాదమూన
తెరఁ దూఱి వెఱఁ బాఱుగురుపోతుపై నైనఁ
బడి యెక్కి పొడుతు నీపాదమూన
తే. యితరదుర్బలమృగపంక్తు లేమి లెక్క
కండగరువంపుమాటలు గావు సుమ్ము
చూడు మమ్మని పంతంబు లాడుకొనుచు
నవ్వరూథినిసుతుఁ గొల్చి యరిగి రపుడు. 34

టీ. సటలు=జడలు (మెడపై నుండు రోమములు), ఎత్తుకొని = నిక్కించి, ఒత్తుకిటి నైనన్ = ఒరసికొనివచ్చు సూకరమునైనను, మాటు = వేఁటకాండ్రు తమకడ్డు పెట్టుకొనుతడికలు మొదలగునవి యని కొందఱు వ్యాఖ్యాతలు, మఱుఁగుగా నుంచుకొను మనుష్యాద్యాకృతి యని యొకరు, వ్రాసి యున్నారు. ఆసపడి=దానిమాటుననుండి, దానిమాటు నపేక్షించి, ఏయన్=బాణమును విడువను, పొడుతున్ = ఎదురుగాఁ బోయి తెగించి బల్లెముతోఁ బొడిచెదను. నీ పాదమాన=నీ పాదములపై నొట్టుపెట్టుకొందును. పందికి మెడమీఁది రోమములు నిక్కఁ బొడుచుట పూర్తిగాఁ గోపము వచ్చినటులఁ దెలుపును. అట్టి పంది నెదురుట యపాయకరమైనను సాహసింపఁ గల నని భావము. కలగుండువడన్=కలఁగిపోవునట్లు, చెందుకరి నైనన్=చెండాడుచున్న గజమునేని, చెవిపట్టి = చెవులను బట్టుకొని, బలిమిమైన్=బలాత్కారముగా, తెత్తున్ = తెచ్చెదను, నీపాదమాన = నీపాదములతోడు, సెలన్ = సెలయేటిని, నెప్పుకొని=తావుచేసికొని, రొప్పుపులి నైనన్=గాండ్రించుచున్న బెబ్బులి నైనను, చొచ్చి=దాని యిరవునకుఁబోయి, పీడించి=బాణములు మొద

లగువానిచే నొప్పించి, పడవైతున్ = నేలపైఁ బడఁద్రోయుదును; నీపాదమాన-(ఇది పంతపుమాట); వెఱన్ = భీతిచే, పాఱు, గురుపోతువైనన్ = గవయమువేని, పడిన్ = మీఁదఁబడి, తెరన్ = తెరచీరనుండి, తూఱి = బయటపడి, ఎక్కి = దానిపయి నెక్కి, పొడుతున్ = పిడికిటితోఁ బొడిచి చంపఁగలను; అడవిపంది, ఏనుఁగు, పులి, గురుపోతు వీనిని జంపుటయే కష్టము. వానినే సులభముగాఁ బట్టి చంపఁ గలిగినప్పుడు, ఇతరదుర్బలమృగపంక్తులు = తక్కినబలహీనములైన జంతుసమూ-హములు, ఏమి లెక్క = నేను గణింపను. కండగరువంపుమాటలు = క్రొవ్వెక్కి-పలుకు వాక్యములు, కావుసుమ్ము = కావుసుమా, మమ్ము = వేఁటయందు నేర్పరుల మగు మమ్ము. చూడుము = వేటలోఁ బరిశీలింపుము. (ఇప్పు-డెందులకు?) అని, పంతంబులు = ప్రతిజ్ఞలు, ఆడుకొనుచున్ = పలుకు-కొనుచు, అప్పరాధిపసుతున్ = ఆపరాధిపకుమారుఁడైన స్వారోచిని, కొల్చి = చుట్టుకొని, అరిగిరి = నడచిరి. అపుడు. వైపద్యముతో నన్వయము. అలం. కావ్యార్థాపత్తి.

తా. వేఁటకాండ్రు రాజుతో నేనింతవాఁడ నంతవాఁడనని గర్వపుమాటలు గాక తమ కున్నసహజమైన బలముకలిమిని బంతంబులాడుచు నడిచిరి.

ఆ. మువ్వ గదల నత్తెములనుండి యెగురుచుఁ
బదనుమీఱ నెరల వెదకుడేగ
పదువు వట్టి దండపాణులై నడిచిరి
విభునిగడల డేగవేఁటకాండ్రు. 35

టీ. డేగవేఁటకాండ్రు = డేగలసహాయముచేఁ బక్షులవేటలాడు వేఁటకాండ్రు, మువ్వగదలన్ = కాలినున్నమువ్వ కదలునట్లు, అత్తెముల నుండి = చేతికిఁదొడుగుకొనిన తోలుకవచమువైనుండి, ఎగురుచున్ = మీఁదికిఁ బలుమా ఱెగయుచు, పదనుమీఱన్ = వేళదాఁటిపోఁగా, ఎరలన్ = మేఁతలను, వెదకుడేగపదువున్ (పదు వన మంద), పట్టుకొని, దండపాణులై =

చేతులలోఁ గత్తులుగల వారై, విభునిగెదలన్ = అధికారిపార్శ్వభాగము లను, (పా-మోలన్ = ముందుభాగమున) నడిచిరి = నడువఁదొడఁగిరి. ఆఁకలి బాగుగాఁ గొన్నపుడుగాని డేగ పక్షుల వేఁటాడదు గాన ఆఁకలిగొను నటుల డేగలఁ గొనివచ్చి రని భావము.

తా. మేఁత వేళ యతిక్రమించి యాఁకలిచేఁ జేతులపై నుండు తమ కాలిమువ్వ ధ్వనిచేయ నెగురుడేగలను బట్టుకొనుచు రాజువెంటఁ గత్తియలం బట్టుకొని వెడలిరి. అలం. స్వభావోక్తి.

ఆ. గూనివీఁపు లదర గొణఁగి తిట్టుచు నేకుఁ
గఱచినట్టికుక్కగం డ్లనంగ
మూతినరపమీసములబోయముదుసళ్లు
పందివలలు మోచి పఱచి రపుడు. 36

టీ. గూనివీఁపులు = గూనులుగల వెన్నులు, అదరన్ = చలింపఁగా, గొణఁగి = లోలోన (ననుకొనుచు) తిట్టుచు, ఏకుఁగఱచినట్టి=దూదియేకును నోటితోఁ బట్టుకొనిన, కుక్కగండ్లు = గండుకుక్కలు, అనంగన్, మూతి నరపమీసముల బోయముదుసళ్లు = మూతిపైఁ దెల్లమీసముగల ముసలి బోయలు, అపుడు, పందివలలు = పందులఁ బట్టుకొను నురులను, మోచి = వహించి, పఱచిరి = పరుగిడిరి.

తా. (వలల మోయుచుండుటచేతనే) గూను లెక్కిన వీఁపులతోఁ దెల్ల మీసములుఁగల వృద్ధకిరాతులు, తమపైయధికృతుల లోలోనఁ దిట్టుకొనుచు, పందివలలను మోసికొని పోయిరి. అలం - ఉత్ప్రేక్ష - స్వభావోక్తి.

వ. ఇట్లరిగి యమ్మహారణ్యంబు సొచ్చి విచ్చలవిడి నచ్చటం బచ్చిక
బయళ్ల మచ్చిక లచ్చుపడం దటిచ్చటులం బగు లోచన
ప్రభాకటలంబు దిక్తటంబులం బర్వఁ దాఱుమాఱుపడ
నిడికొనిన మొగంబులతో నేణిజిహ్వాపల్లవోల్లిహ్యమానాం

గంబు లగుసారంగంబులఖురళికారంగంబు లనం గనుపట్టు
చెలికపట్టులును, బిట్టసంగునాఁకటం దట్టుపడి పొట్టకై
పుట్టకూటికిం జీరులకుం జెదలునకు నెలుంగులు గులగులం
బుట్టలు నిశితజనఖరకులిశకోటులం గోరాడ నాదండం
గాచుకొని యుండి వెడలిచను విషవిస్ఫురద్భుజంగంబుల
నల్గడం గబళించి గెంటకుండ దంటు చప్పరించుగతిం జప్ప
రించుచు నొండొంటికిం బేరెంబులు వాఱి కుప్పించి తప్పించు
కొనుదుప్పులఖురజరజశ్ఛటల నెసక మెసంగు ముసముసకల
మఱుంగువడి యుండుగండోపలంబులును, బరిహాసితసితేతర
పాషాణపాటవంబు లగు విషాణపరిఘంబు లొండొంటిం
దాఁకి కఠిల్లు పెఠిల్లు మనన్ బోరుకారుపోతులకోలాహలం
బులం బ్రతిశబ్దంబు లీనుకోనలును, మద మొదవ నెదపదను
నంబోదలు పెట్టలకుంజుట్టంబులై చిల్లరపలుగులం బిల్లలం
జొల్లరంబుల సాగనిచ్చి గమికి వెనుకయై మలయుచున్
బిఱుందం దిరుగు చిఱుగున్నలకు వెన్నాడు తోఁడేళ్లసివం
గులం దిరిగి తిరిగి మొత్తి పోనొత్తి చరియించునేకచరం
బుల ఘుర్ఘురధ్వానంబుల ఘూర్ణమానంబు లగుపరిగె పక్కె
పలు మేరు రేఁగు వేము పులుగుడు గురివెంద యీఁదు గేదంగి
మోదు గారు కోరింద కనుము కానుగు మొదలగుపొదలం
బొదు వగునానావిపినపాదపకలాపంబులును, మాటి
మాటికి మానిసికాటు మరగి తెరువులు గాచి కాచి డగ్గుత్తిక
పడందిను పెద్దపొలవలనం బుటపుటనై త్రుప్పుళ్లు డుల్లి
త్రుల్లి గంతు లిడుగబ్బిబెబ్బులులనలఁగుడుల దొడ్డజనంబులు
మంత్రించి పారక దిగిచిన నీరు మే పుడిగి గిరులు గ్రక్కదల

వాపోవుచుం దిరిగితిరిగి వాకట్టువిడిచినప్పుడు దప్పికై పాఱి
సెలయేటికెంకులం బొఱిమ్ములు ఱొమ్ముకెలంకులం గాఁడ
గాంద్రు గాంద్రు మని రొప్పి నొప్పి కుప్పరంబుగా వియత్తలం
బునకు విల్లెత్తుపొడు వెగసి నెత్తురులు గ్రక్కుచుఁ గూలం
గ్రోల్పులఁలఘుర్ఘురధ్వనుల గుండియ లవిసి కలగుండు వడు
కారండవంబులపక్షపుటపటాత్కారంబుల బోరుకలంగు సెల
యేటికెంకులును, మేఁతవెంబడిం బొలముపల్లంబులం దిరిగి
తిరిగి పెంట్రికలు వెట్టు పెంటపట్టునకు వచ్చి యచ్చటం
గ్రుచ్చి కానరాకుండ మునుమున్న మృగయుండు బిసయొడ్డి
సంఘటించిన కాలిబోనులం బడి బెగడక యద్దారు వీడ్చు
కొని యీరకులఁ దఱియంబడి యవ్వలికై వెడలి చన
లేక గెడసి తన్నుకొనుమన్ను మెకంబులయాక్రందనంబులం
గ్రందుకొనువిషమప్రదేశంబులును, జిఱుతగండ్లగమిచేత
దైవికంబున డాప్రక్కమీఁదువడ దాఁటువడి యవి గొంతు
క్రొన్నెత్తురులె క్రోలి విడిచి చన మార్మెడలువడి మశకవన
దంశమ్ములు మూఁగ మూఁగంబాఱినకొండగొఱియములు
గుడు బొందులకు సందడించు కంకగృధ్రావళుల మొల్లంబుల
ముసుంగువడుపల్లంబులును, మేయుతఱి వీఁ పెక్కిఱేఁచొకటి
మూఁపురంబు గఱచి కఱచి యొఱచి పడవైవం దోడియొక
రెండుమూఁడు వెనుక ముందఱ నందంద కాళ్లం బెనంగుచు
నత్తుచుక లేఁజియేఱి తినఁ గా లెసలినయెడ ముడుతద్వేద
నకుఁ గాక మట్ట లెత్తుకొని యొత్తు గలపొదరుటడవులం
చొరంబాఱు పిడికడితికదుపునురవడికిపిఱికి పడినవిటపివిటపం
బులం దపుకువొడిచినగతి నొందునెడలును, పదులుపదులు

నూఱులునూఱులు వేలువేలు గుములుగట్టి దట్టం బగు
నెయ్యంబున వెదురుబియ్యంబు లొండొంటి కొసంగఁ గరివర
కరేణువులు వంప ముంపు చెడి యిట్టట్టుపడి తిట్టలగుబిట్టల
సంకటంబు లగుడొంకలు వీక్షించి హర్షించి యొక్కఁడు
తమినొక్కయెడనడుగువెడలనిబెంకిఁ గని వాఱుగవులునకు
మొకము దిగ దని యొన్ని మన్ను దూర్పెత్తించి గాలి పరికించి
దిగువదెస దొడ్డివల పన్ని యెగువ పొలిమేర బారాదియగు
దూరం బేగఁ బోఁగువాఱించి యత్రాట వల మోవం దెర
లెత్తి యెత్తి నత్తెరఁ దుత్తుమురుగాఁ జించుకొనిపాఱినం
బోనీక బారిసమరుటకు వలచుట్టునుం జెట్టు దండగొని
నిలువ నలువుగలపుళిందులఁ గొందఱ నిలిపి యమ్ముండి
పిఱుంద జాగిలంబులతోడ వాగురికుల నిలువ నియమించి
తెరకు లోనగువాని నందుఁ బడంగొట్టించియు గట్టువెంట
దట్టంబుగాఁ బ్రజ నెక్కించి మఱి కలయ గహనతలంబున
నెల్లం జెల్లుగా విల్లువేఁటకు నేటుదప్పనిమేటివిలుకాండ్ర
మృగములు వెలువడుటకు హరిచ్ఛదచ్ఛటావృతశిరగకటి
ధనుష్కోటులై కొట్టికానిం జూపెట్టుకొని యెదురు
మాటులుగాకుండ నుండి చెదరి పారదెరువులం బఱవకుండ
నీరముల సందుసందులం దమతమకట్టినమోటకత్తుల నొం
డొండ ఖండితంబు లగుమండగలకంపమండలు ద్రోచి
మునుములకా గనుమ లొనరించుకొనం బంచి తాను
నొక్కొక్కయెడం బాదచారియు నొక్కొక్కయెడఁ దుర
గాధిరూఢుండును నై యెల్లెడల మెలంగుచుం గూఁత
లెగయఁ బణవ మృదంగ దుందుభిప్రముఖ తూర్యంబులు

గొట్టించియుఁ గాహళులు పట్టించియు నగ్నియంత్రంబులు
ముట్టించియు రొద మిన్నుముట్టఁ జోపు వెట్టించిన. 37

టీ. ఇట్లు = పైనిచెప్పినరీతిని, అరిగి=చని, అమ్మహారణ్యంబు = ఆపెద్ద వనమును, చొచ్చి = ప్రవేశించి, విచ్చలవిడిఁ = యథేచ్ఛముగా, అచ్చటఁ = ఆయడవియందు, పచ్చికబయళ్లఁ = పచ్చఁగా గడ్డిపట్టిన తావుల యందు, మచ్చికలు = ప్రేమములు, అచ్చుపడఁ = తేటపడునట్టుల, తటిచ్ఛటులంబు = మెఱపునట్టులఁ బ్రభావంతములు, అగులోచ...పటలంబు - అగు, లోచన = నేత్రముల, ప్రభా = తేజస్సులయొక్క, పటలంబు=సమూహము, దిక్తటంబులఁ = దిగంతములందు, పర్వఁ = ప్రసరింపఁగా, తాఱుమాఱుపడఁ = వ్యత్యయ మగునట్లు, ఇడికొనిన మొగంబులతోఁ = ఉంచుకొనిన మోములతో, ఏణీ=ఆఁడులేళ్ల, జిహ్వాపల్లవ = చిగురుటాకుల యట్టి నాల్కలచే, ఉల్లిహ్యమాన=మీఁదికి నాకఁబడుచుండిన, అంగంబులు = శరీరములుగలవి, అగు, సారంగంబుల = మగలేడుల, ఖురళికారంగంబు = సాముచేసెడుతావులు, అనఁ, కనుపట్టు=కనఁబడు, చెలికపట్టులను=బీటినేల లును, బెదరుచూపులతో దిక్కులుచూచుచు నాఁడులేడు లొడళ్లునాకుచుండ మగలేళ్లు తలలాడించుచు నుండెను. తలకదలించునపుడు కొమ్ములుగదలించుట కఱ్ఱయో కత్తియో గొని చేయుసాముపలె నుంటచే నది గరిడీ యని తోఁపఁ జేసెను (అలం. స్వభావోక్తి - ఉత్ప్రేక్ష.) బిట్టు = ఎక్కుడుగ, ఎసఁగు నాఁకటఁ = పెరుగుచున్న యాఁకలిచే, తట్టువడి = అలసినవారై కడుపునించుకొనుటకై, పుట్టకూటికిఁ=పుట్టలలో నుండు పువ్వులకడికొఱకు, (చీమగ్రుడ్లచే ముద్దలుముద్దలుగాఁ జేయఁబడినపుట్టమట్టికొఱకని యొకానొకరు) చీమలకుఁ=చీమలగుంపులకును, చెదలునకుఁ = చెదలుపురుగులకును, ఎలుంగులు = ఎలుఁగుబంటులు, గులగులఁ = గులగులమనుధ్వని కలుగునట్లుగా, (ఇది ధ్వన్యనుకరణము.) పుట్టలు, నిశిత = తీక్ష్ణములైన, నిజ = తమ, నఖర

పలిశ = వజ్రాయుధములవంటిగోరులు, కోటులన్ = అగ్రములతో, శోరా
డన్ = (మన్ను) చిమ్మివేయఁగా, అదండన్ = అప్రక్కలను, కాచుకొని
యుండి, వెడలిచను = (ఆయెలుఁగుబంటులు త్రవ్వినకలుగులనుండి) పైకి
పోవుచుండిన, విషవిస్ఫురత్ = విషముతోఁ బ్రజ్వరిల్లెడు, భుజంగంబులన్ =
సర్పములను, నల్గడన్ = నలుతట్టులు, కబళించి = కఱచిపట్టి, గొంటకుండన్ =
కదలకుండురీతిని, నంటు=చొప్పదంటు, చప్పరించుగతిన్=నమలిరసము గ్రోలు
నటుల, చప్పరించుచున్ = నమలిరసమును గ్రోలుచు, ఒండొంటికిన్ = ఒక
దానిపైకొక్కటి, పేరెంబులువాఱి = పరుగులిడి, కుప్పించి = మీఁది కుబికి,
తప్పించుకొనుదుప్పుల = తమపైఁ బడువానిబారినుండి తొలంగిపోవు దుప్పుల
యొక్క, ఖురజ = డెక్కలవలనం బొడమిన, రజశ్ఛటలన్=పరాగసమూహ
ముచే, ఎసక మెసంగు = వృద్ధియగుచున్న, మసమసకలన్ = అల్పతిమిరము
లందు, మఱుంగుపడి = కప్పువడి, ఉండు గండోపలంబులును = పెద్దఱాతి
గుండ్లును, ఎలుఁగుబంటు పుట్టలు పగులఁదీయుతఱి బయటికి వచ్చు పాములను
నమలుచుఁ దమలోఁదాము పోరుచుకొన నుద్యమించుచు దుప్పులు కుప్పించు
చుండ లేచినధూళిచేఁ జుత నున్న పెద్దపెద్దశిల లన్నియుం మఱుఁగుపడుచుండె
ననిభావము. (అలం. స్వభావోక్తి) పరమాసిత = కొంచెపుఱుకఁబడిన, సితేతర=
నల్లని, పాషాణ = ఱాళ్లయొక్క, పాటవంబులు = సామర్థ్యముగలవి, అగుః
విషాణపరిఘంబులు = పరిఘలవంటికొమ్ములు, ఒండొంటిన్ = ఒక్కదానితో
నొక్కటి, తాఁకి = స్పృశించి, కత్తిల్లు వెత్తిల్లునన్ = కతిల్ వెత్తిల్లనిధ్వని
చేయుఁగా, పోరుకారుపోతుల = యుద్ధముచేయు వనమహిషముల, కోలాహ
లంబులన్ = కలకలముచే, ప్రతిశబ్దంబులు = ప్రతిధ్వనులు, ఈనుకోనలును=
కలిగించుచున్న పర్వతపుసందులును, నల్లని కొండఱాళ్లవలె నున్న యడవిదు
న్నలగుదెలవంటి కొమ్ములు కొండలన్నియుఁ బ్రతిధ్వనులీనఁ బోరాడుచుండెను.
అలం. స్వభావోక్తి-శిపమ. పరిఘ మనః బెద్దకఱ్ఱ యని యొకరుద్రాసిరి. అవినని

కాదు. "పరిఘః పరిఘాతకః" అమరము. "పరితో హన్యతే అనేన పరిఘః" అని వ్యుత్పత్తి; ఇనుపకట్లగుదియ. మదము పిదపన్=పుట్టఁగా, ఎదపదనునన్=ఎదపోవుసమయమున, (చూలుకాలమునందు), బొదలు పెట్టలకున్=కామమువృద్ధి బొందుచున్న యాఁడువరాహములకు, చుట్టంబులై, చిల్లర నలుఁగులన్=ప్రసిద్ధి లేని పందిగున్నలను, పిల్లలన్, చుల్లరంబులన్=పాలువిడచినపందిపిల్లలను, సాగ-నిచ్చి=కదలిపోనిచ్చి, గమికిన్=మందకు, వెనుకయై, మలయుచున్ = విహరించుచు, పిఱుఁదన్=వెనుక, తిరుగు, చిఱుఁగున్నలకున్, వెన్నాడు=వెంబడించు, తోఁడేళ్లన్, సివంగులన్, తెరిగి, లెరిగి, మొత్తి=కొట్టి, పోనొత్తి=పోఁద్రోలి, చరియించు=తిరుగుచున్న, ఏకచరంబుల=వరాహములయొక్క, ఘుర్ఘురధ్వానంబులన్ = గురగురచప్పుడులచే, ఘూర్ణమానంబులు = తిరుగుచువడుచున్నవి, అగు, పరిగె (ఒకదినుసుచెట్టు), పక్కి = పిచులవృక్షము, పలుమేరు (ఇది యొకవృక్షము), రేఁగు=బదరి, వేము=వేప, పులుగుడు = వాతఘ్ని, గురి-వెంద=బండిగురిగింజ, ఈఁదు = ఈఁతచెట్టు, గేదంగి = మొగలి, పొదుగు, ఔరు=అవురుగడ్డి, కోరింద = జతూక, కసువు=కసువుగడ్డి, కానుగ = తమాలము, మొదలగు = మొదలుగాఁగలయవియగు, పొదలన్ = పొదలచేత, పొదువు=శిన్నతము, అగు=ఐనటువంటి, నానా=పెక్కులయిన, విపినపాదప=వనవృక్షములయొక్క, కలాపంబులను=సముదయములను, ఎదరైన యాఁడు పందులతో వెనుకవచ్చుచుఁ జిన్నచిన్నపిల్లలను ముందుసాగిపోవునటులఁ జేసి నడువఁజాలక వెనుకఁబడినకూనలను క్రూరజంతువులు గొనిపోకుండ జూచుచు అడవిమగపందులు వనమునందు స్వతంత్రముగాఁ జరించుచుండెను. అలం-స్వభావోక్తి. ఏకచరంబు, ఒంటరికాఁ డనుపదమునకు సంస్కృతీకరణము. క్రొవ్వియొంటరిగాఁ దిరుగు మగపంది నొంటరికాఁ డందురు. మాటిమాటికిన్, మానిసికాటు = జనులనుగఱచుట, మరగి=అభ్యసించి, తెరువులు=దారులును, కాచికాచి, దగ్గుత్తికపడన్ = కంఠమున కెగఁ దోసినట్లు, తినుపెద్దపాల వలనన్=తినపట్టినరమాంసమువలన, పుటపుటనై=మిగులబలుపెక్కి, క్రొవ్వొత్తి=.

జొచ్చి, డుల్లి=రాలి, త్రుళ్లి = మదమెక్కి, గంతులు, ఇడుగబ్బిబెబ్బులుల
నలఁగుడులన్ = పెట్టునట్టి ఘనములైన వ్యాఘ్రములరాయిడిచే, దొడ్డజనం
బులు = గోశాలలలోనిసరులు, మంత్రించి, శారకదిగిచినన్ = గడ్డిపరకతీసి
దిగదుడువఁగా, నీరు=జలము గ్రోలుటయు, మేపు = ఆహారమునుగొనుటయు,
ఉడిగి=విడిచి, గిరులు = పర్వతములు, గ్రక్కదలన్=ఎక్కుడు చలింపఁగా,
వాపోవుచున్ = బొబ్బలిడుచు, తిరిగితిరిగి, వాకట్టు = వాగ్బంధనము, విడిచి
నప్పుడు=విడిపించినప్పుడు, దప్పికై=దాహమునకై, పాఱి = పరుగెత్తిపోయి,
సెలయేటిటెంకులన్ = గిరినిర్ఝరముల తావులందు, పాఱమ్ములు = పాఱల
వంటి ముఖములుగలశరములు, ఱొమ్ము కెలంకులన్=గుండెలరెండువంకలను,
కాఁడన్ = గ్రుచ్చుకొనఁగా, గాండ్రు గాండ్రుమని = కాండ్రుకాండ్రు
మను శబ్దముకలుగునటుల, రొప్పి = ధ్వనిచేసి, నొప్పికిన్, ఉవ్వెరంబుగాన్=
పైఁగా, వియత్తలంబునకున్ = గగనభాగమునకు, విల్లెత్తుపొడువు=వింటిపెట్టు
నెత్తు, ఎగసి=దుమికి, నెత్తురులఁగ్రక్కుచును, కూలు=నేలఁబడు, క్రొవ్వులుల=
పెద్దపులుల, ఘర్ఘరధ్వనులన్=ఘుర్ఘురధ్వానములచే, గుండియ లవిసి=గుండెలు
బ్రద్దలై, కలగుండువడు=కలఁత పడునట్టి, కారండవంబుల = కన్నెలేఁడిపిట్టల
యొక్క, పక్షపుటు = దొప్పలవంటిఱెక్కల, పటాత్కారంబులన్ = పటపట
మను చప్పుళ్లచే, బోరుకలంగు=ధ్వనించుచున్న, సెలయేటిటెంకులును=కొండ
యేళ్లచోట్లును, బెబ్బులులు మనుష్యులఁ జంపి తిన నలవాటువడి యితరమాంస
మొల్లక మనుజులను వెదకుచుండఁ బశుపాలకులు వాకట్టు కట్టుటచేఁ బులి నీరు
గాని, మేఁతగాని కొన వీలుగాదయ్యెను, వాకట్టు తొలఁగఁగాఁ సెలయేటినీరు
గ్రోలుతఱి బాణము వేయ దానితాఁకున భయంకరముగాఁ గూయుటచే సెల
యేటియందలి జలపక్షులు రొదచేయుచుండె నని భావము. (అలం. స్వభా
వోక్తి) మేఁతవెంబడిన్ = మేపుటవెంట, శాలముపల్లంబులన్, తిరిగితిరిగి,
వెంత్రుకలు పెట్టు వెంటపట్టునకున్ - వెంత్రుకలు = (అడవిజంతువులు విడుచు)
లద్దెలు, పెట్టు = వేయు, వెంటపట్టునకున్ = వెంటగలచోటునకు, వచ్చి,

అచ్చటన్ = ఆవెంటపట్టునందు, త్రచ్చి = నాటి, కానరాకుండన్ = మన్ను మెకంబులకుఁ దెలియకుండునట్లుల, మునుమున్న = మృగములక్కడకు రాకముందే, మృగయుండు=వేటాడువాఁడు, బిస=మీటబోను, ఒడ్డి=ఉంచి, సంఘటించిన = కూర్చిన, కాలిబోనులన్ = కాలినిపట్టుకొనునట్టి మీటలందు, పడి, బెగడక = భీతిల్లక, అద్దారువు అమీటకొయ్యను, ఈడ్చుకొని, ఈరుములన్=పొదలకు, తటియించబడి = సమీపించి, చేరి, అవ్వలికై = అపొదల యావలికి, వెడలి = దాఁటి, చనలేక = పోనేరక, కెడసి=పడి, తన్నుకొను, మన్ను మెకంబుల=మన్నులనెడుజంతువుల, ఆక్రందనంబులన్ = కూఁతలచేత, క్రందుకొను=నిండినట్టి, విషమ=సమముగాలేని, ప్రదేశంబులను=తావులను, దుప్పిజాతి ఒకనాఁడు వెంటవేసినచోటికె మఱునాఁడు వచ్చి వెంటవేయును. ఇది సహజగుణము. ఇది యెఱింగి ఋశ్యములు రాకముందె వేటకాండ్రు బోను లొడ్డఁగాఁ బెంటవేయ వచ్చి బోనులోఁ జిక్కి బోనులను లాగికొని పొదరింద్లలోనికిఁ బోయి యటఁ జిక్కువడి యడవివిషమప్రదేశమగుటచే నావలఁ బోరాక యఱచుచుండెను. (అలం-స్వభావోక్తి.) చిఱుతగంద్లగమిచేతన్ = చిందుగుపులులమందచే, దైవికంబునన్ = దైవాధీనమున, డాప్రక్కమీఁదువడన్ = ఎడమపార్శ్వముపైకి వచ్చునట్లు, దాఁటువడి = దాటుటచేఁ గ్రిందఁబడి, అవి=అచిఱుతగంద్లు, గొంతుక్రొన్నెత్తురులె=కంఠమునందలి క్రొత్తనెత్తురులె, క్రోలి = పీల్చి, విడిచి, చనన్ = పోయినపిమ్మట, మూర్ఛెడలంబడి= మూఱుమెడలు పడినవై, మశకవనదంశములు-మశక = దోమలును, వనదంశములు = అడవియీఁగలును, మూఁగన్, మూఁగంబాఱిన = మూఁగిపోవుటకు మొదలిడిన—క్రుళ్లిపోవుటకు మొదలుపెట్టిన, కొండగొఱియ = కొండలలోనుండుగొఱ్ఱెల, ముఱుగుడుబొందులకున్ = ముఱిగిపోయిన కళేబరములనిమిత్తము, సంపడించు = ఒత్తడిగాఁ తిరుగుచున్న, కంక=రాబందులయొక్క, గృధ్ర=గ్రద్దలయొక్క, అవసల=బారుల, మొల్లంబులన్=మొత్తములచేత, ముసుంగుపడుపల్లంబులును = మూసికొనఁబడిన పల్లములును, పల్లంబులతోఁ

గొండగొట్టెలుపడి యుండెను. వానిని దిన నడవిపులుఁగులు మూఁగియుంటచేఁ బల్లెంబులన్నియు నిండియుండెను. మేఁకసందడిచేఁ గడుఁజులు ఱేఁచుకుక్కలఁ గుర్తింపఁజాలవయ్యెను. మేయుంతఱిన్ = మేయుచుండఁగా, ఱేఁచు=వనశునకము, ఒకటి, పీఁపెక్కి, మూఁపురంబున్, కఱచికఱచి, ఎఱచి=మాంసమును, పడఁబైవన్=పడవేయఁగా, తోఁడియొక రెండుమూఁడు=మొదటిఱేఁచుతోడుగానున్నయొకటిరెండు ఱేఁచులు, వెనుకన్ = పృష్ఠభాగమును, ముందరన్= ఎదుటిపైపును, అందంద=మిక్కిలిగా, కాళ్లన్=పాదములలో, పెనంగుచున్= అడ్డుపడుచు, అత్తునుకలు = ఆముక్కలను, ఏఱియేఱి = తీసికొని తీసికొని, తినన్ = భక్షించుచుండఁగా, కాలు, ఎడలినయెడన్ = తప్పినయెడల, మందుతద్వేదనకున్ = మందుచున్న యట్టినొప్పికి, కాక = ఓర్వఁజాలక, మట్టలు = తోఁక మొదటితావులు, ఎత్తుకొని, ఒత్తు = దట్టము, కలపొదరుటడవులు = ఒత్తుగాఁబొదలుగల వనములలో, చొరంబాఱు=చొరఁబోవుచున్న, పిడికడిటి = ఆఁడుకడుఁజులయొక్క, కదుపు = గుంపుల, ఉరవడికిన్ = అతివేగమునకు, విఱిగి = విఱిగిపోయి, పడిన = నేలపైఁ బడిపోయిన, విటపివిటపంబులన్ = చెట్టుకొమ్మలచే, తడుకువాడిచివగలిన్ = కంచెవేసిన కీలిని, ఒందుగొడలును = పొందుతావులును, మేయుచున్న ఆఁడుకడుఁజుల ఱేఁచుకుక్కలు పీఁపెక్కి మాంసము దినుచుండెను. క్రిందఁబడు మాంసమును దినుచు మఱికొన్ని ఱేఁచులు కాళ్లకుఁ బెనఁగొన నాబాధతొలంగించుకొనుటకుఁ గడుఁజు లుఱుకుచుండెను. ఆతాఁకిడిచేఁ గొమ్మలు విరిగిపడెను. విరిగినకొమ్మలు కంచెవేసినటు లుండెను. (అలం. స్వభావోక్తి) పదులు పదులు= పదేసిపదేసి, నూఱులునూఱులు = నూఱేసి నూఱేసి, వేలువేలు, గుములుగట్టి= గుందలుగాఁజేరి, దట్టంబు = తఱచు, అగు నెయ్యంబునన్ = ఐనస్నేహముతో, వెదురుబియ్యంబులు, ఒండొంటికిన్ = ఒకదానికొకటి, ఒసంగన్= ఇచ్చునిమిత్తము,కరివరకరేణువులు=మగయేనుఁగులు నాఁడేనుఁగులు, వంచన్= వంగునట్లుచేయఁగా, ముంపుచెడి = ఒత్తువిడిపోయి, ఇట్టట్టుపడి = ఈప్రక్కకు

నాప్రక్కకు నొరగి, తిట్టలు=ప్రోవులు, అగుజిట్టలన్ = అయిన వెదురువెన్నులచే, సంకటంబులు (విశాలము చాలనివి), అగు, డొంకలును, ఈక్షించి=కనుఁగొని, మగయేనుఁగులు ఆఁడేనుఁగులు గుంపులు గుంపులుగాఁ గూడి యొకదాని కొకటి యందించుకొని నెంచి వంపఁగా వెదురులు వీడిపోయెను. రాలిన వెన్నులు (కుప్పలగుటచేఁ ద్రోవలన్నియుం మిగుల నిఱుకుగా నుండెను. అలం. స్వభావోక్తి) హర్షించి = సంతసపడి, ఎక్కుడుతమిన్ = మిక్కుటమైన యాసక్తితో, ఒక్కయెడన్ = ఒక్కతావున, అడుగు=పదము, వెదలని టెంకిన్ = సాగని తావులను, కని = ఈక్షించి, వాఱుగవులునకున్ = తోలుపట్టెడనుండి కొట్టుచున్న వాసనకు, మెకము=మృగము, దిగదని = దిగిరాదని, ఎన్ని=విచారించి, మన్ను, తూరుపెత్తించి = ఎగురఁబోయించి, గాలిపరికించి = గాలి యేవైపునకు వీచుచున్నదో పరీక్షచేసి, మన్ను తూర్పారఁబట్టుట గాలి యే దిక్కున వీచుచున్నదో యెఱుంగుటకు, దిగువదెసన్ = క్రిందివైపున, గాలికి వాలుగానుండువైపున, దొడ్డివల = దొడ్డివలె నొకటే త్రోవయుండి నాలుగు దిక్కులగలియునంటి యున్నవల, పన్ని = నిగ్గి, ఎగువపాలిమేరన్ = పైభాగమున నున్న సరిహద్దులలో, బారాడి=మిక్కిలి, అగు దూరము = అయిన దూరప్రదేశము, ఏఁగన్ = చనునట్లు, పోఁగువారించి = నూలుత్రాఁడు చుట్టించి, అత్రాటన్ = ఆత్రాటియందు, వలమోవన్ = వల తగులునట్లు, తెరలెత్తి=వలలొగ్గించి, ఎత్తిన తెరన్=ఎత్తిన యడ్డువలను, తుత్తుమురుగాన్ = ముక్కముక్కలగునటుల, పాఱినన్ = పరుగిడినను, పోనీక, బారిసమరుటకున్=చంపుటకై, వలచుట్టును, చెట్టుదండగొని = చెట్టు నాధారముగాఁ గొని, నిలువన్ = ఉండునట్లు, నలువు = ఉపాయము, కలపులిందులన్ = కలిగినట్టిమొఱుకులను, కొందఱిన్ = కొంతమందిని, నిలిపి=ఉంచి, జంతువులు వచ్చు త్రోవ గాలివాలున గ్రహించి ముందె త్రోవయంతయుం వలతోఁగప్పిరి. అడవిమృగములు బలిష్ఠమైనవి. వల చీల్చుకొని పోవునేమో యని యటులఁ బాఱిపోవు వానిని జంపుటకు నేర్పరులగు వేఁటకాండ్ర వెనుక నుంచి రని

భావము. అప్పుడది పిఱుందన్ = ఆ యెఱుకువాండ్ర వెనుక, జాగిలంబుల తోడన్ = వేటకుక్కలతో, వాగురికులన్ = ఉచ్చులొగ్గెడువారిని, నిలువన్ = నిలుచునట్టుల, నియమించి = ఆనతియిచ్చి, వేటకాండ్రకుఁ జిక్కకున్నచోఁ గుక్కలచేఁ జంపించి పట్టుకొనుట తుదిపని. తెరకున్ = అడ్డువలకు, లోనగువానిన్ = అగ్గమైన జంతువులను, అందున్ = అక్కడనే, పడంగొట్టించియుఁన్ = చంపి పడవేయించి, గట్టువెంటన్ = పర్వతము వెంబడిని, దట్టంబుగా, ప్రజన్ = జనులను, ఎక్కించి, మఱి, కలయన్ = అంతటను నిండుకొనునట్లు, గహనతలంబున నెల్లన్ = వనభాగమున నన్నిచోటులను, పెల్లుగాన్ = ఎక్కుడుగా, విల్లువేటకున్ = ధనుస్సుపట్టి వేటాడుటకు, ఏటు = గుఱి, తప్పని మేటి విలుకాండ్రన్ = మంచిధానుష్కులను, మృగములు = జంతువులు, వెలువడుటకున్ = బయల్పడుటకు, హరిచ్ఛద = పచ్చరంగు గలవస్త్రముల, ఛటా = సమూహముచే, వృత = ఆవరింపఁబడిన. శిరః = శిరస్సులును, కటీ = అధఃప్రదేశములును ధనుః = ధనుస్సుల, కోటులై = కొనలుగలవై, కొట్టికానిన్ = వేగులవాని, చూపెట్టుకొని = కనుపెట్టుకొని, ఎదురుమాటులు = ముందువైపు చాటులు, కాకుండన్, ఉండి, వేఁగులవాఁడు నలువైపులఁ దిరుగుచు మృగముల సంగతి తాను ముందు గ్రహించి తోడివారికిఁ జెప్పవలయుఁగాన మృగములు గుర్తింపకుంటకై యాకులను గప్పుకొనెను. మాటులు ఎదురుగా నున్న మృగములఁ గొట్టునపుడు తమలోఁ దమకె తగులు నని వ్యక్త్యస్తముగా నేర్పఱచిరి. చెదరి, బారదెరువులన్ = తప్పుత్రోవలయందు, పఱవక = పరుగెత్తక, ఉండన్ = ఉండులాగున, ఊరములు = పాదరిఁడ్లయొక్క, సందుసందులన్, తమతమ కట్టిన మోటకత్తులన్ = తాము తాము కట్టుకొనిన మచ్చుకత్తులచే, ఒండొండన్ = వరుసగా, ఖండితములు = ఖండింపఁబడినవి, అగుమందగలకంపమూడలు = అయిన మంగలుగల కంపలమూడలను, త్రోచి, మూసుములన్ = ముందుభాగములయందు, కనుమలు = సందుదారులను, ఒనరించుకొనన్ = రచించుకొనునటుల, పంచి =

నియోగించి, తాను, (శ్వరోచియును) ఒక్కొక్కయెడన్, పాదచారి యయ్యెన్=కాల్నడనే పోవాఁడును, ఒక్కొక్కయెడన్ = వేఱొక్క ప్రదేశము నందు, తురగారూఢుండునై=గుఱ్ఱముపై నెక్కి పోవువాఁడు నై, ఎల్లెడలన్= అన్నితావులను, మెలఁగుచున్ = సంచరించుచు, కూఁతలు = అఱపులు, ఏఁయన్=ప్రసరింపఁగా, పణవమృదంగ దుందుభి ప్రముఖతూర్యంబులు— పణవ=ఢక్క, మృదంగ = మద్దెల, దుందుభి = నగారా, ప్రముఖ=మొదలు గాఁగల, తూర్యంబులు = వాద్యంబులు, కొట్టించియున్ = మ్రోగించు నట్లొనర్చియు, కాహళులు = తూఁతూబూరలు, సన్నాయీలు, పట్టించి యున్ = ఊదించియును, అగ్నియంత్రములు = మందుగుండు నుపయో గించు యంత్రములను, తుపాకులు మొదలగు నాళయంత్రములు, ముట్టిం చియున్ = అంటింపించియు, రొద=చప్పుడు, మిన్నుముట్టన్ = ఆకస మున కంటునట్లుగా, చోపుపెట్టించినన్ = జంతువులనిమిత్తము చోపుడు పెట్టింపఁగా, కలఁతపెట్టునట్లుఁ జేయఁగా.

మ. చకితైణాహుతిదావ మావళితపుచ్ఛస్వల్పగచ్ఛత్తర
క్షుక మద్రిగ్రహయూథభల్లుకము వక్షోభాగనిక్షిప్తడిం
భకవల్గత్ ప్లవగీకదంబము ప్రహ్వాంభఃప్రోత్థితక్రోడవా
యక మాభీలముఖవ్యాపిస్థపుటితం బయ్యెన్ వనం బత్తఱిన్.

టీ. అత్తఱిన్ = ఆవేఁటయపుడు, వనంబు=కాన, చకిత...దావము= చకిత=భీతినొందిన, ఏణ = లేడులనెడు, ఆహుతి = హోమద్రవ్యముగల, దావము=వనాగ్ని కలిగినట్టిది, కార్చిచ్చుగలది. వేటకాండ్రు గావించు చప్పు డులకు లేళులు బెదరి దిక్కుదెలియక పఱచి కారుచిచ్చులోఁబడి మరణించు చుండెనని భావము. ఆవళిత...తరక్షుకము - ఆవళిత = పూర్ణముగా చుట్టఁ బెట్టుకొనఁబడిన, పుచ్ఛ=తోఁకలుగలవియై, స్వల్ప = నెమ్మదిగా, గచ్ఛత్ = నడచుచుండిన, తరక్షుకము = సివంగులుగలదియును, తోఁకలు ముడుచు

కొనుట భయము పెంపును సూచించును. అద్రిగ్ర...భల్లూకము - అద్రి = పర్వతములను, గ్రహయాళు = గ్రహించుచున్న, భల్లూకము = ఎలుఁగులు గలదియు, వక్షోభాగ...కదంబము - వక్షోభాగ = ఉదరమున, నిక్షిప్త = పెట్టుకొనఁబడిన, డింభక = చిన్నపిల్లలుగలదియై, వల్గత్ = దుముకుచున్న, ప్లవగీ కదంబము = ఆఁడు క్రోఁతులయొక్క మందకలిగినట్టిదియు, హ్రదాంభః... సాయకము - హ్రద = జలాశయముల, అంభః = నీటిలోననుండి, ప్రోత్థిత = పైకి లేచిన, క్రోడ సాయకము = మిన్నలైన పందులుగలదియు, ఆభీల... స్ఫుటితంబు - ఆభీల = భయజనకమైన, ముఖ = మోములుగల, ద్వీపి = వ్యాఘ్రములచే, ద్వీపి యనఁ బెద్దపులి యనుటకు, "వ్యాఘ్రే ద్వీపాదద్వీపినా మనూరశ్చండకోపనః" అని నిఘంటువు. స్ఫుటితంబు = ఎగుడు దిగుడుగా నొనర్పఁబడినదియును, అయ్యెన్.

తా. ఆవేఁటసమయమున నాయడవిలో, జింకలు దవవహ్నిలోఁబడి పోయినవి. తోఁకలు ముడుచుకొని సివంగులు పరుగెత్తఁ జాలక పోయెను. కొండలంబట్టి యెలుంగులు ప్రాకఁజొచ్చెను. పిల్లలను గడుపున నద్దుకొని క్రోఁతులు గంతులిడినవి. మడువులలోనుండి పెద్దపందులు వెడలిపోయెను. పెద్దపులులు నోరులు తెఱచుకొని తిరుగాడెను. అలం స్వభావోక్తి.

క. నెల వెడలియు నెఱి సడలియుఁ
 జల ముడిగియు నిదుర సెడియు జంట లెడసియున్
 గలహము లుడఁగియుఁ బఱచెన్
 బులి కిరి కరి మన్ను దున్న మొదలగు మెకముల్. 39

టీ. నెలవు = ఉనికిపట్టు, ఎడలియున్ = వదలియు, నెఱి = సామర్థ్యము, సడలియున్ = విడిచిపెట్టియు, చలము = మచ్చరము, ఉడిగియున్ = తొలఁగియును, నిదుర = నిద్ర, చెడియున్ = నశించియు, జంటలు = జోడు, ఎడసియున్ = వీడియును, కలహములు = పోరులు,

అడవిపందిన్ = ఉడిగిపంది, పులి, కిరి = వరాహము, కరి = ఏనుఁగు, మన్ను = మన్నుజంతువు—ఋశ్యమృగము, దున్న = అడవిదున్నపోతు, మొదలగు, మొకములన్ = జంతువులు, పఱచెన్ = పరుగెత్తెను.

వేఁటకాండ్రు జంటలుగాఁగూడిన జంతువులను నిదురబోవు జంతువులను దెబ్బలుగొంటులను జంపరుగావునఁ దోలుటకు వాద్యధ్వని గావించి పిదపఁ జప్పుడులు చేయుటచే మృగములు బెదరి నలుగెలకులఁ బరుగెత్తఁ దొడంగెను.

మృగములఁ జంపరాని స్థితులు.—

తే. "పఱవనోపకయున్న మైమఱచి పెంటిఁ
బెనఁగియున్నను బ్రసవింప మొదలియున్నఁ
దెవులుగొనియున్న మృగములఁ దివిరి యేయు
రెఱచి యాహారముగ మనువెఱుకులైన." (భారతము, ఆది. పంచమ.)

ఉ. అత్తఱి వేఁపికాండ్రు యమునాంబుతరంగపరంపరాకృతిన్
ముత్తర మైనసూకరసముత్కరమున్ గని మోటుకాండ్రు వి
ల్లెత్తకమున్న రాజుమది కెక్కుడునట్లుగ దీని మిత్తికిన్
బుత్తెమటుంచుఁ బట్టెడలు బోరన డుయ్య భయంకరార్భటిన్.

టీ. అత్తఱిన్ = ఆవేఁటయపుడు, వేఁపికాండ్రు = కుక్కలంబట్టుకొనువారు, (వేఁటకాండ్రనిపాఠము గలదు,) యమునా...కృతిన్-యమునా = ఆకాళిందీనదియొదలి, అంబు = జలముయొక్క, తరంగపరంపరా = కెరటముల గుమియొక్క, ఆకృతిన్ = రూపముతో, ముత్తరము = మువ్వరుసలు, ఐనసూకరసముత్కరమున్ = ఐనట్టిపందులమందను, కని = కాంచి, మోటుకాండ్రు = మోటువేఁటకాండ్రు, కృత్రిమములగు నాకారములను జాటుచేసికొని వేఁటలాడువారు, విల్లు = ధనువును, ఎత్తక మున్న = ఎత్తకముందే, రాజుమదికిన్ = స్వరోచిమనంబునకు, ఎక్కుడునట్లుగన్ = సంతసము కలుగురీతిని, దీనిన్ = ఈపందులగుంపును, (ఈవరాహకదంబమును), మిత్తికిన్ = మృత్యువు

నకు, పుత్తము = పంపుదము; అటంచున్ = అని యనుచు, బోరనన్ = త్వరితముగ, పట్టెడలు = కంఠమునకుంబెట్టిన పట్టెడలు, దుయ్యన్ = విప్పి వేయఁగా, భయంకరాకృతిన్ = భీతిగలిగించునట్టి యాకృతులతో, పైపద్యముతో నన్వయము.

అడవిపందులు నల్లగా నుంటచే యమునాజలముతో సాటిచెప్పఁబడెను. యమునయు కృష్ణవర్ణగుణములోనిదె. ఒడ్డునకు వచ్చుతరంగములు మిగులఁ జిన్నవిగను మధ్యనుండుతరంగములు కొంచెము పెద్దవిగను దూరముగనుండు తరంగములు చాలపెద్దవిగను నుండును. వరాహములు కూడ నటులె ముందు కూనలను ఆవెనుక నడిమిప్రాయము వానిని వెనుకఁ బెద్దవియు నుండి ముత్తె అంగలతో నడచుచుండెను. వరాహములు సముత్కర మనుటచే నసంఖ్యాకములని భావము.

తా. అప్పుడు కుక్కలవేఁటకాండ్రు కాళిందీనదీతరంగములవలె నల్లని పందిమందలు కానరాఁగా మాటువేఁటకాండ్రకంటె ముందుగ రాజుగారి మనస్సునకు వచ్చునట్లు కుక్కలను విప్పి యుసికొల్పిరి. అలం - ఉపమ.

క. జాగిలములు మొఱసడములు
సాగెఁ గలిసి చాపముక్తశరగతి నందా
జాగిలము లెదిరెఁ బందుల
కై గోధాదికముగాలి కడరె నితరముల్. 41

టీ. జాగిలములు = వేఁట కుపయోగించు పొడవైనకుక్కలు, మొఱసడములు = చిన్నకుక్కలును, కలిసి, చాప=ధనుస్సునుండి, ముక్త = వదలఁబడిన, శర=బాణముల, గతిన్ = గమనమువంటి గమనముతో, సాగెన్ = నడచెను. అందున్ = ఆరెండువిధముల శునకములలో, జాగిలములు = వేఁట కుక్కలు, పందులకై = అడవిపందులకొఱకు, ఎదిరెన్ = ఎదిరించెను. ఇతర

మూలు = తక్కినవి, గోధాదికముగాలికిఁ = ఉడుములు మొదలుగువాని పసి కట్టుటకై, అదరెఁ=యత్నించెను.

మొఱసడ మన మోటకుక్క యని బ్రౌన్ దొరవారి ప్రతియందర్థము కలదు. కుందేళ్లు, ఉడుములు లోనగుచిన్నజంతువులఁ బట్టుచిన్నకుక్కలను టయే తగియున్నది. ఈయాశ్వాసములోని 51.వ పద్యమునందు మొఱసడ ములనే ఉడుపకుక్కలని చెప్పఁబడెను. ఉడుము + కుక్క యనువిభాగము గల్గి ఉడుపకుక్క పదమేర్పడెనుగాన, చిన్నజంతువులఁ బట్టుట కుపయోగించు చిన్నకుక్క లని యనుటయే తగియున్నది. అలం. నిదర్శన.

తా. జాగిలములును, బొంతకుక్కలును శరవేగముతోఁ బందులకొఱ కును నుడుములు మొదలగువానికొఱకును బైలుదేరెను.

సీ. ఎగుచుకూఁతలు మట్టె యెత్తి బిట్టాలించి
గమికిఁ గన్నాకయి గాలి యరయు
వడిఁ గుక్క లంటంగ వచ్చిన మెడఁ ద్రిప్పి
ఘుర్ఘురించుచు బయల్ కొమ్ముఁ జిమ్ముఁ
దారసించినచోట దారునఁ జొరఁ బాఱి
యొకటిరెంటిని దొబ్బ లురల నడుచుఁ
బాలచేరులు పట్టి తూలింప బలిమి నీ
డ్చుకొని డొంకలఁ దూఱి చుట్లఁ బెట్టు
తే. నీఁటెపోటులఁ బడి ప్రేవు లీఁదులాడఁ
బోయి పోలేక దగ దొట్టి పాదలు సాచ్చి
బొందు వడియును జొరనీదు పీఁటవెట్టి
చూపులనె యేర్చుఁ బ్రజ నొక్కసూకరంబు. 42

టీ. ఒక్కసూకరంబు=ఒకవరాహము, ఎగుచుకూఁతలు=వేఁటకాండ్రు జంతువులు బెదరి పరుగెత్తుటకై పెట్టుబొబ్బలను, మట్టెయెత్తి = మోరపయి

కెత్తి, బిట్టు=చక్కఁగా, అలించి=ఆఁకర్ణించి, గమికిన్=కమమందకు, కన్నాకు=శ్రేష్ఠము, (అధిపతి), ఆయి, గాలియరయన్=వేఁటకాండ్రే వైపునుండి రోయని పసిపట్టును. గుంపునకు మేటి గావున సన్నింటికి శ్రేష్ఠులాధములు గుర్తించి విన వచ్చినచప్పు డెచ్చటిదో గుంపుపెద్దయగుపంది తొలుక తలయెత్తి యాలకించెను. వడిన్=వడిగా, తుక్కలు=జాగిలములు – పందివేఁటకుక్కలు, అంటుగవచ్చి నన్ = సమీపమునకు రాఁగా, మెడ = కంఠమును, త్రిప్పి=వెనుకకుఁద్రిప్పి ఘుర్ఘురించుచు (ఇది పందిచేయు ధ్వని), బయలు = అంతరాళమును, కొమ్మున్, చిమ్మున్ (కొమ్ము విసరును) తారసించినచోటన్ = అవి దగ్గఱకు వచ్చినయెడ, దాయనన్ = చటాలున, చొరఁబాఱి = చొరఁబడి, ఒకటి రెంటిన్=ఒకటినైనను రెంటినైనను గుక్కలను, దొబ్బలు=నెత్తురుతోఁగూడిన మాంసఖండములు, ఊరలన్ = క్రిందఁబడునట్టుల, అడుచున్ = తాడించును, కోఱతోఁ జెగునట్టులఁ గొట్టును. పాలచేరులు = పాలచేరునరములు, (గజ్జలలోని సన్ననినరములను), పట్టి = కోఱలతోఁ గఱచిపట్టుకొని, తూలింపన్ = (కుక్కలు) నొప్పింపఁగా, బలిమిన్=సామర్థ్యముచే, ఈడ్చుకొని, డొంకలన్=ఈవలనావలకంచెలున్న సన్ననియిఱుకు త్రోవలయందు, దూఱి, చుట్టఁబెట్టున్=త్రిప్పులాడించును (పాట్లఁబెట్టును). ఈఁటెపోటులన్=ఈఁటె పోటులచేత, వడి=పైకివచ్చి, ప్రేవులు=ప్రేగులు, ఈఁదులాడన్=వ్రేలఁబడుచుండఁగా, పోయి కొంతదూరము వెడలి, పోలేక = అవలఁబోఁజాలక, దగ దొట్టి=దప్పిగొని, అలసిపోయి, పొదలు సొచ్చి=గుల్మములయందుఁ బ్రవేశించి బొందువడియుండు = తూలిపోయియుండు, పీఁటవెట్టి=పిఱుఁదుల నేల కానించి ముందుకాళ్లు నేల కానించి కూర్చుండి, ప్రజన్=వేఁటకాండ్ర ననుట. చొర నీక=సమీపింప నీయదు, చూపులనె=కనుచూపులతోడనె, పిర్చున్=నిప్పుల వలెఁ గన్నులెఱ్ఱఁగఁ జేసి మనుజులను గాల్చునట్లు భయంకరముగాఁ జూచు చుండును.

పీఁటవెట్టిన పందినిఁ దునుముట కష్టము. వేఁటకుక్కలు వెనుకనుండి పట్టుకొనకుండ బల్లెముతో బంటుపొడువకుండ అపాయస్థితిలో సూకరము

పెట్టునకు పేనానించి నలుదిక్కులు మెలకువతోఁ జూచుచుండును. ఆ చూపులు గుండియ లవియించును. అలం - స్వభావోక్తి.

తా. ఒకపంది మనుష్యులచప్పుడు విని మాపమందు నిలిచి కుక్కలు మీఁదఁ బడఁబోయిన నందకున్నను దల విసరుచు కుక్కలు సమీపించిన నొకటిరెంటికి దెబ్బలు పడునట్లు కొట్టి కుక్కలు తన్నుఁ బట్టుకొనినచో వానిని డొంకలలోని కీడ్చుకొనిపోవుచు నీఁటెపోటునకుఁ దనప్రేవులు పైకి వెడలుచుండఁగా నడువలేక నడువలేక నడుచుచు నొక్కచోఁ గూర్చుండి చూపులచేతనే జనులను బెదరించుచుండెను.

క. అట్టియెడ నొకవరాహము
బిట్టడిచిన మెఱసెఁ గుక్కప్రేవులు దంష్ట్రన్
జుట్టుకొని రొంపిఁ గలఁపఁగ
నిట్టలముగఁ దగిలినట్టియెట్టులు వోలెన్. 43

టీ. అట్టియెడన్=అపుడు, ఒకవరాహము=ఒకపంది, బిట్టు=బాగుగా, అడిచినన్ = కొట్టుటచే, కుక్కప్రేవులు=ఒక వేఁటకుక్క నరములు, దంష్ట్రన్=కోఱను, చుట్టుకొని=పెనవేసికొని, రొంపిన్=అడుసును, కలఁపఁగన్=కలఁచి వేయఁగా, ఇట్టలముగన్ = మిక్కుటముగా, తగిలినట్టియెట్టులు=పెనవేసికొని చుట్టుకొన్న యెట్టులు (తుహీలతలను ఎట్టి లని యందురు.) వోలెన్, మెఱసెన్=తగిరెను.

తా. ఒకపంది తనమీఁదికి వచ్చి దుముకు వేఁటకుక్కను దనకోఱతోఁ గొట్టఁగా దానికడుపులోని ప్రేవులు కోఱకుఁ జుట్టుకొనియెను. పందికోఱకుఁ జుట్టుకొనిన ప్రేవులు కోఱతో బురద కలియఁబెట్టుసమయమునఁ జుట్టుకొనిన యెట్టులవిధమున నుండెను. అలం. ఉత్ప్రేక్ష.

ఇట్టలము, నిట్టలము అని రెండురూపములు కలవు. మొదటిరూపమె యిట్టల మని తోఁచెడి.

మ. హరిణం బొక్కటి కుక్కతండముఁ బుళిందానీకముల్ ద్రోచి యు
ర్వరఁ గాలూఁదక దాఁట నేటులవికిన్ వాహంబు నడ్డంబు నూఁకి రసావల్లభుఁ డేసె భల్లమును నింగిన్ గాళ్లు జోడించుచోఁ, గొరిజల్ నాలుగుఁ ద్రెవ్వ సేన వొగడెన్ గోదండపాండిత్యమున్. 44

టీ. హరిణం బొక్కటి = ఒక్క లేడి, కుక్కతండమున్ = కుక్కల గుంపును, పుళిందానీకమున్ = ఎఱుకువాండ్రను, త్రోచి = తోలఁగఁ ద్రోచికొని, ఉర్వరన్ = భూమిపై, కాలూఁదక = పాదమానక, దాఁటన్ = దాఁటఁగా, ఏటులవికిన్ = బాణము ప్రయోగించుట కనువగుటకు, వాహంబున్ = అశ్వమును, అడ్డంబు నూకి = అడ్డుగాఁ బోనిచ్చి, రసావల్లభుఁడు = రాజు, (స్వరోచి), నింగిన్ = ఆకసమున, కాళ్లు, జోడించుచోన్ = దగ్గఱగాఁ దీసికొనుచున్నపుడు, గొరిజల్ = డెక్కలు, నాలుగున్, త్రెవ్వన్ = తెగిపోవునట్లు, భల్లమును = శరమును (బల్లెము), ఏసెన్ = వేసెను. కోదండపాండిత్యమున్ = (స్వరోచికిఁ) గల ధనుర్విద్యాకౌశలమును, సేన = స్వరోచి సైన్యము, పొగడెన్ = స్తుతించెను.

తా. ఒకజింక కుక్కలను బుళిందులను గడచి పోవుటకై నేలంగాలూనక యెగురుచుండ స్వరోచి తనగుఱ్ఱమును దానికడ్డముగాఁ దోలి యాలేడి నాల్గుకాళ్లు నొక్కటిగా, (ఎగురుచున్నపుడు) గూర్చికొనినపుడు గిట్టలు తెగునట్లు బాణముం బ్రయోగింపఁగా నాతనిసేన యెంతయుం నాతని శరలక్ష్యమును బ్రశంస గావించెను.

క. ఫలచునొకకడితిఁ బతి ముక్కుఁ
జెలిమలకై యేఁయఁ జిప్ప చినుఁగఁగ నది యు
క్కళిఁ గాఁడి దుస్సి పాఱిన
నళిముఖిఁ జాపరువువాఱె యల్లటు వడియేన్. 45

టీ. పతి=ప్రభువు, స్వరోచి, పఱచునొకకడిటిన్ = పాఱిపోవుచున్న గోకర్ణమృగమును, ముకుఁజెఱమలకై=నాసికాపుటములకుగుఱిగా, ఏయన్ = శరప్రయోగముం జేయఁగా, చిప్ప=ముట్టెయొక్క చిప్ప, చినుఁగఁగన్=చీలి పోవునట్టుల; అది=ఆయేసినశరము, కాఁడి=తూఱి, ఉక్కఱన్=బలముడుగు నట్టుల, డుస్సి పాఱన్ = ఈవలినుండి యావలికిఁబోఁగా, అఱిముఱిన్ = వ్యాకులముగా, చాపరువు = చావు పరువు, చావమువు వాఱి = చావుపరు గెత్తి, అల్లటువడియెన్ = అల్లంతదూరమునం బడియె. (పా. అఱిముఱిఁ జాపరువు.)

తా. పరుగెత్తుచుండినకదుఁజూను ముక్కుపుటములకుఁ బెట్టి స్వరోచి కొట్టఁగా నది చావుపరుగుతోఁ గొంతదూర మేఁగి పడి మృతి నందెను.

మ. గవిలో బెబ్బులి డాఁగి గ్రుడ్లు మెఱయుంగాఁ గాంచి రా జేసెనే
య వడిన్ బాణము వెంటనే నిగిడి పైకి న్నేఁచి రా నేసె రెం
డవ కాండంబుఁ దదస్త్రముం గొనక డాయన్ వచ్చి కౌక్షేయక
ప్రవిభిన్నం బయి నేలఁ గూలెఁ బవిధారాభిన్నశైలాకృతిన్.

టీ. బెబ్బులి=పెద్దపులి, గవిలోన్=కొండగుహలో, డాఁగి = కనఁబడ కుండనుండి, గ్రుడ్లు = నేత్రగోళములు, మెఱయంగాన్ = మెఱయునట్లు చేయఁగా, చీఁకటిలోనుండి జూచునపుడు పులికన్నులు మిగులఁ బ్రకాశ ముగాఁ గానఁబడును. రాజు=స్వరోచి, ఏసెన్=బాణమును బ్రయోగించెను. ఏయన్ = బాణమును బ్రయోగింపఁగానే, బాణము వెంటనే = ఆవేసిన బాణము వెంబడిగనే, బాణవేగముతో బాణమువచ్చినతావునను, నిగిడి=సాగి, అట్లు = అవిధముగా, పైకిన్ = రాజుమీఁదకు, ఏచి=చెలరేఁగి, (విజృంభించి) వడిన్=వడిగా, రాన్=రాఁగా, కాంచి=కని, రెండవకాండంబున్=రెండవశర మును, ఏసెన్=వదలెను, తదస్త్రమున్=ఆశరమునుంగూడ, కొనక=లెక్కింపక, డాయన్=రాజును సమీపించుటకు, వచ్చి=చనుదెంచి, కౌక్షేయకప్రవిభి

న్నంబు=కత్తితోఁగొట్టబడినది, ఐ,పవి...కృతిన్-పవిధారా=కులిశముయొక్క వాడిచే, భిన్న=ఖండింపఁబడిన, శైలాకృతిన్=పర్వతమువలె, నేలన్=భూమి మీఁద, కూలెన్=పడెను. (మరణించెను) (మెఱవంగా యని శబ్దరత్నాకర పాఠము.)

గుహలోనున్న బెబ్బులిని నేత్రకాంతులకతన గుర్తుపట్టుటకు గుఱి చూచి బాణము వేయుటకు వీలుపడెను. గుహలోని జంతువుపై బాణము వేయుట బైటికిఁ దోలుటకు. సమీపించినపు డెదుర్కొని కత్తితోఁ దునుముటయే వీరకార్యము.

తా. పర్వతగుహలోనుండి కనుగ్రుడ్లు మెఱయం గాంచుచున్న వ్యాఘ్రమును స్వరోచి బాణప్రయోగము చేయఁగా దానివెంబడినే యాతనిపై కవి దుమికిన నింకొకబాణము వదలెను. దానిం గణింపక దగ్గఱకురాఁగాఁ జేతితోఁ గత్తిపుచ్చుకొని నఱకిన వజ్రాయుధముచేఁ గూలినకొండవలె నేలం బడియె. అలం. ఉపమ. స్వభావోక్తి.

తే. క్రొవ్వి నడగొండకైవడి గుసుకునొక్క
యొంటిగాని మహీనాథుఁ డొదిఁగి యేయ
గొరక మే నుచ్చి ధరఁ గాఁడ శిరము విసరె
లే దసృక్స్రావ మనుచుఁ దెల్పెడు ననంగ. 47

టీ. క్రొవ్వి = బాగుగా మదించి, నడగొండకైవడిన్=నడుచుచున్న కొండయే యోయనునట్లు, గుసుకు=పరువిడుచున్న, చిఱుపరువెత్తుచున్న యని బ్రౌనుదొరవారియర్థము. ఒక, ఒంటిగానిన్=వరాహమును, మహీనాథుఁడు= ప్రభువు (స్వరోచి), ఒదిఁగి = ప్రక్కకుజరిగి, ఏయన్ = శరమును విడువఁగా, గొరక=ఆశరము, మేనుచ్చి=శరీరమునుండి దుస్సి చని, ధరన్ = నేలయందు, గాఁడన్ = గ్రుచ్చుకొనఁగా, అసృక్స్రావము = రక్తముం గ్రోలుట లేదు = ఈబాణమునకు నెత్తురు ద్రావలేదు, అనుచున్=అని, తెల్పెడున్ = ఎఱుఁగఁ జెప్పుచున్నదియో, అనంగన్ = అనుచున్నదే యోయనువిధముగా, శిరము=పంది తనతలను, విసరెన్=తాటించెను.

బాణమును ఈవలనుండి యావలకు దూరిపోవునటులఁ బ్రయోగించిన యెడల దానికి రక్త మంటదు. దశరథుఁడు వేఁటాడుతఱిఁ గాసరమును గొట్టె నెడ నిట్లే—

శ్లో. "తేనాభిఘాతరభసస్య వికృష్య పత్రీ
వన్యస్య నేత్రవివరే మహిషస్య ముక్తః,
నిర్భిద్య విగ్రహమశోణితలిప్తపుంఖ
స్తం పాతయాం ప్రథమమాస పపాత పశ్చాత్."
(రఘువంశము. నవమస్సర్గము.)

తా. క్రొవ్వినపందియొక్కటి గునగునఁబరువిడిపోవుచుండ స్వరోచి బాణమును దేహమునుం దూసికొనిపోయి యవ్వల నేలం దూఱె ననియు, నవ్వ డాపంది తల విసరి క్రిందఁబడియె ననియు, నావిసరుటం జూడ రాజు విడిచినబాణము దేహము దుస్సిపోయినదే కాని రక్తపాన మేమియుఁ జేయ లే దని చెప్పునట్లుండెను అనియుఁభావము. అలం. ఉత్ప్రేక్ష.

తే. ఒక్కఁ డడుగెత్తి గొఱకవేయుచును డాఁచి
నట్టరిగి టెంకిఁ గని వీఁకఁ బట్టుటయును
మృగయు లందఱుఁ జని వెల్వరించి నిశిత
కాండములఁ జెండి రొకపెద్దకారుపోతు. 48

టీ. ఒక్కఁడు=ఒకబోయవాఁడు, అడుగెత్తి=మెల్లఁగాఁ బాదములను గదలించి యావలఁ బెట్టి, గొఱకవేయుచును = కారుపోతువలె నఱచుచు, (పరకవేయుచు ననుపాఠమున వచ్చుత్రోవలో గడ్డిపరకలు వేయుచు నని యర్థము). అరిగి=చని, టెంకిన్ = కారుపోతుల వెంటపట్టునందు, ఒక, పెద్ద కారుపోతున్=పెద్దవనమహిషమును, కని=కనుంగొని, డాఁచినట్టు=తానక్కడ డాఁచియుంచినవిధముగానే, వీఁకన్=ప్రయత్నముతో. పట్టుటయున్=పట్టి కొనఁగానే, మృగయులు=వేఁటలాడుచున్నబోయవాండ్రు, అందఱున్=ఎల్ల

ధుషు, చని=ఏఁగి, వెల్వరించి=పెంటకట్టునుండి బయటి కీడ్చికొని తెచ్చి, నిశిత కాండములన్=తీక్ష్ణములైనశరములతో, చెండిరి=నఱికిరి.

తా. ఒకవేఁటకాఁడు కారుమన్న యున్నచోటికిఁ జక్కఁగాఁ దాని వలె నడచుచుఁ బోయి యంతకుము న్నచట దానిం దాఁచి యుంచినట్టి పట్టుకొనఁ దక్కినబోయలు కూఁడుకొని దానిం గొట్టిరి.

ఉ. ఆసమయంబునన్ జకితమై మెక మెవ్వనిమీఁదఁ బాఱె వాఁ
డేసినయమ్ము వమ్మయి మహిన్ బడ కొక్కటి కొండ చాలి వీ
తాసులఁజేయ మెచ్చి వసుధాధిపముఖ్యుఁడు మోట్లనున్న బా
ణాసనభృత్పులిందులకు నర్థి నొసంగె నభీప్సితార్థముల్. 49

టీ. ఆసమయంబునన్=ఆకాలమున, మెకము=జంతువు, చకితమై = వెఱచినదై, ఎవ్వనిమీఁదన్ = ఏబోయనిపై, పాఱెన్=పరుగిడివచ్చెనో, వాఁడు=ఆవేఁటకాఁడు, ఏసినయమ్ము = కొట్టినశరము, వమ్మయి = వ్యర్థమై, మహిన్ = నేలపై, పడక = పడిపోక, ఒక్కటికిన్=ఒక్కమెకమునకు, ఒండ (ఒండు+అ)=ఒకశరమే, చాలి = సరిపడినదై, వీతాసులన్ = ఆపైకి వచ్చిన క్రూరమృగములను ప్రాణముపోయినవానినిగా, చేయన్=ఒనర్పఁగా, మెచ్చి=పొగడి, వసుధాధిపముఖ్యుఁడు = నరవరేణ్యుఁడు, మోట్లన్=మనుష్యాకృతులతోనున్న మోట్లయందు, ఉన్న = ఉన్నట్టి, బాణాసనభృత్ = ధనుర్ధారులగు, పులిందులకున్=ఎఱుకువాండ్రకు, అభీప్సితార్థముల్=ఇష్టార్థములను, అర్థిన్=ప్రేమతో, ఒసంగెన్=ఇచ్చెను. మనుష్యాకృతులగు మోటులం దుంటచే మృగములు బెదరి పైఁబడినను వేఁటకాండ్రు బ్రతుకఁగలిగిరి, పైఁబడినను మోటులందు సురక్షితులుగా నుండియు మృగములఁ జంపినవాఁడె నేర్పరి గాన నట్టివారి నందఱఁ బ్రభువు సత్కరించెను.

తా. ఆవేఁటయందు మృగములు చెదరి బోయలపైఁ బడ నొక్కొక్క బాణమున వారందఱు వానిని జంపుపాండిత్యమునకు స్వరోచి మెచ్చి

మోట్టలో నున్న యెఱుకు లందఱకును గోరినవస్తువు లొసంగి సంతోష పఱచెను.

క. వలఁ బాఱినవానిని భటు
లలుఁగులపాలాడి రధిపుకై పట్టిరి బె
బ్బులి మహిష మెలుఁగు కిటి తోఁ
డెలు మొదలగువానిఁ గొన్నిటిని వేటకరుల్. 50

టీ. భటులు=సేవకులు - విల్లువేటకాండ్రు, వలన్ = జాలమునుండి పాఱినవానిని = తప్పించుకొనిపోయిన మెకములను, అలుఁగులపాలాడిరి = బాణములకుఁ బాలుపఱచిరి, బాణములను బ్రయోగించి సంహరించిరి. వేటకరుల్ = వేఁటాడుకిరాతులు, అధిపుకై = రాజున కిచ్చుటకు, బెబ్బులి = వ్యాఘ్రము, మహిషము = గొఱదున్న, ఎలుఁగు=భల్లూకము, కిటి = పంది, తోఁడేలు=వృకము, మొదలగువానిన్ = లోనగువలలందుఁబడిన జంతువులను, కొన్నిటిన్ = చిక్కినవానిలోఁగొన్నింటినిమాత్రమే, పట్టిరి=ప్రాణములతోఁ బట్టుకొని తెచ్చిరి. కువర్ణంబు పరంబగునపు డుకారంబునకు నకారం బగు నని వ్యాకరణము విధించుచున్నను అధిపుకై యనుటకుఁ గారణము మృగ్యము. ఇట్టి ప్రయోగములు కొన్ని గలవు.

సీ. "సంగరమునకు నుత్సవము కేఁగెడుక్రియ
సొలువకచనియెదు శూరుఁడార." (ఉత్తరహరివంశము, ఆ. 6)

క. "కమలాసన వినుచావి, క్రమమునకు వెలఁబెట్టెదేని." (నిర్వ. రా. ఆ. 7.)

ఉ. లాలనగ్రొత్త...గోలయుంసాధువైనయొకకోమటికిన్నిషధేంద్రుబచ్చుకున్.
(శృంగారనై. ఆ. 6.)

చ. "ఘనమహాబాహుఁ డుత్సవుఁడు వజ్రికి జీవుఁడు." (విక్రమార్క చరిత్రము).

ఇట్టిప్రయోగము లాధునికకవులకృతులలో మిక్కుటముగాఁ గలవుగాని గ్రాహ్యములు కావు.

తా. వేఁటకాండ్రు వలలోఁ జిక్కి వలఁజించుకొని పాఱిపోవు జంతువులను బాణప్రయోగాదులచేఁ జంపిరి. వలలోఁ బడియున్న వానిలోఁ బులి, కారుదున్న, పంది, తోఁడేలులోనగు క్రూరమృగములను మిగుల సాహసించి ప్రాణములతోఁడనే రాజునకు సమర్పించుటకై పట్టుకొనిరి.

తే. మున్ను జాగిలములఁ గూడి చన్న యట్టి
యడుపకుక్కలు కుందేళ్ల నుందురువుల
నుడుముల గ్రహింపఁ బుట్టలకడలఁ బొదల
గిరులసఱియలఁ బసివట్టి తిరుగుచోట. 51

టీ. మున్ను = ఇంతకుఁబూర్వము, జాగిలములన్ = పెద్దమెకములను బట్టు కుక్కలను, కూడి=కలిసి, చన్నయట్టియడుపకుక్కలు = పోయియున్న యుడుములంబట్టుకుక్కలు, కుందేళ్లన్ = చెవులపిల్లులను, ఉందురువులన్ = మూషికములను, ఉడుములన్ = గోధికలను, గ్రహింపన్=పట్టుటకు, పుట్టల కడన్=చిన్న పుట్టలవద్దను, పొదలన్ = చెట్టులగుబురులుగలతావులను, గిరుల సఱియలన్=పర్వతముల ప్రక్కలయందును, పసిపట్టి = వాసనను గుర్తించి, తిరుగుచోటన్ = తిరుగుచున్నపుడు.

తా. జాగిలములతోఁగూడ బొంతకుక్కలు వేఁటాడఁబోయి యుడుములు చెవులపోతులు మున్నగువానిం బట్టుటకై పసిపట్టుచుఁ గొండచఱియల వెంబడి తిరుగుసమయమున.

చ. బరవస మొప్ప గాలితడఁబాటుమెయిన్ గవిఁ దూఱి యొ
క్కకుర్కురము తమంబులో వెరఁజి కోఱలచేఁ గబళించి
పొట్టపెం,జెర నుడు మంచుఁ దెచ్చి కని చేవ దొఱంగక
ద్రుంచి వైచె ద,ద్గురుబిరుదప్రమాదములకున్ బతి మోద
విషాదశాలిగాన్. 52

టీ. ఒక్కకుర్కురము = ఒకబొంతకుక్క, ఉడుములఁబట్టు చిన్న కుక్క, బరవసము=పరాధీనబుద్ధి, (భూనిక, తేకువ యని కొందఱు వ్రాసిరి.

గాని యది సరి యని తోఁచదు.) ఒప్పన్ = వెలయఁగా, గాలితడఁబాటు మెయిన్ = పసిచూచుటలో వచ్చినవ్యత్యాసముచే, గవిన్ = గుహలో, తూఁటి = ప్రవేశించి, తమంబులోన్ = అంధకారములో, వెదఁకి = విదకించి, కోఱలచేన్ = కోఱపండ్లచేత, కబళించి = కవ్విపట్టుకొని, పొట్టపెంజెరన్ = పొట్టపెంజెర యనునొకవిధ మగు సర్పమును, ఉడుమంచున్ = ఉడు మను మాటతో తెచ్చి, కని=చూచి (ఉడుము కాదు, పొట్టపెంజెరను బట్టుకొంటి నని యూహక్క తెలిసికొని), తద్గురు...ప్రమాదములకున్-తత్ = ఆశునకముయొక్క, గురు=విస్తారమగు, బిరుద=శౌర్యమునకును, ప్రమాదములకున్ = అనవధానమునకును, పతి = స్వరోఁచి, మోదవిషాదశాలి = ఆనందమును విచారమును గలవాఁడు, కాన్=కాఁగా, చేవ=ధైర్యమును, తొలఁగక=వదలక, త్రుంచివైచెన్=ముక్కలుచేసెను.

బిరుదపదము శౌర్య మనునర్థమునఁ బ్రామాణికప్రయోగములు గానరావు. శబ్దరత్నాకర మీపదమును వికృతి యని తెలుపుచున్నది. పెద్దనార్యుఁడు సంస్కృతపదముగా భావించికాఁబోలు సమాసములో వాడియున్నాఁడు. బిరుదపదము మహారాష్ట్రపద మని లాక్షణికులు నిర్ణయించినారు.

క. "బిరుశబ్దంబు విరోధోత్కరము మహారాష్ట్రభాషఁ దత్ప్రదవిధులన్
బిరుదములనఁ జను వానిస్సేధరబిరుదావళి యొనర్పఁదగు నండ్రు బుధుల్."
(కావ్యాలంకారసంగ్రహము.)

తే. "క్షితి మహారాష్ట్రభాషచేఁ జెప్పఁబడెడు
భీకరోక్తులు బిరుదులై పెక్కుఁజెల్లు." (అప్పకవీయము.)

తా. ఉడుములం బట్టుకుక్క యొక్కటి పసిపట్టుటలోఁ బొరపాటున గుహలోనికిఁ జని యుడు మనుకొని పొట్టపెంజెరం బట్టుకొని తెచ్చి యది సర్ప మని తెలిసికొని ధైర్యముతో ముక్కలు ముక్కలుగాఁ గొఱికివైచెను. దానిం జూచి రాజు సంతోషమును బొందెను.

క. ఒడ లుబ్బ నిక్కి ముందటి
యడుగులు ధర నూఁది చిందునలబలమునకున్
జడియ కొక గబ్బిగండఁ డె
క్కుడుఁగడిమిన్ దివిచెఁ గ్రుంగి కొమ్ములయుడుమున్. 53

టీ. ఒకగబ్బిగండఁడు = బాగుగా బలిసియున్న యొకగండుఁగుక్క, ఒడలు = శరీరము, ఉబ్బన్ = పొంగఁగా, నిక్కి = సాగినటుల నిలచియుండి, ముందటియడుగులు = ముందటివగు రెండు పాదములను, ధరన్ = నేలపై, ఊఁది = ఆని, చిందునలబలమునకున్ = ప్రసరించినసందడికి, జడియక = భయపడక, ఎక్కుడుఁగడిమిన్ = మిక్కిలియైన శూరత్వముతో, క్రుంగి = మ్రొగ్గలిల్లి, కొమ్ములయుడుమున్ = కొమ్ములున్నగోధికను, తివచెన్ = బైటికి లాగెను.

తా. ఒకగండుకుక్క (కన్నములోనున్న) కొమ్ములయుడుమును సంతసముచే నుబ్బుచు ముందటికాళ్లు క్రుంచి యుత్తరమగుచప్పుడు నేమియుం లెక్కింపక మిగుల ధైర్యముగాఁ బట్టుకొని తీసెను. అలం. స్వభావోక్తి.

తే. కంపతోడు గీడ్చిన ట్లేఁదు గానఁ జన్న
తెరు వెఱుంగుచు నొకఁ డేఁగి పరువుతోన
పడి యడఁగి యుండఁగాఁ బటపటన ముండ్లు
గాలిఁ గదలుటఁ గని పంట్రకోలఁ బొడిచె. 54

టీ. ఒకఁడు = ఒకబోయ, కానన్ = వనములో, ఏఁదు = శల్యమృగము, కంపతోడుగు = ముండ్లుగల కొమ్మలబొత్తిని, ఈడ్చినట్లు = లాగికొనిపోవునటుల, (ముండ్లబారముతో నేఁదుపంది యేఁగుట కంపతోడుగు లాగినటుల నుండెను), చన్నన్ = పోఁగా, తెరువు = ఆముండ్లపంది చనినదారిని, ఎఱుంగుచున్ = అరయుచు, ఏఁగి = చని, పరువుతోన = పరుగిడుచునట

తోఁచె, పడి = డాఁగి, అడఁగియుండఁగాన్ = కనఁబడకుండ నుండఁగా, పటపటన్ = పటపట యను చప్పుడగునట్లు, ముండ్లు, గాలిన్ = వాయువశమున, కదలుటన్ = కదలుటను, కని = కాంచి, పంత్రకోలన్ = మూఁడు నాలుగు చిలువలుగల యమ్ముకఱ్ఱతో, పొడిచెన్ = ఆయేఁదుపందిని వేఁటకాఁడు సంహరించెను.

తా. ముండ్లపందియొకటి యెప్పుడో తనయొడలిముండ్లు క్రిందనీడ్చు కొనుచుఁ గంపలోదుగుకొయినట్టులు బోయినజాడ కనఁబడఁగా నా వెంటనే చని యొక్క వేఁటకాఁడు పోయి యది దాగియున్నటులఁ దెలిసికొని గాలిచే దాని యొడలిపైఁ గలముండ్లు కదలు చప్పుడుంబట్టి పంత్రకోలతోఁ బొడిచి చంపెను. అలం. ఉపమ.

వ. అత్తఱిన్ దత్తఱంబున మొత్తంబయి చోపుడుఁగోలలు
గొని కెలంకులపొలంబులన్ బులుఁగులన్ జోపుచు డేగ
వేఁటకాండ్రు వేఁబడి వేఁటాడన్ దొడంగి రందు. 55

టీ. అత్తఱిన్ = ఆవేళ డేగవేఁటకాండ్రు = డేగలతోఁ బక్షులను వేఁటలాడుబోయవాండ్రు, మొత్తంబై = గుమిగూడి, వేఁబడి = మొత్తముగా విర్పడి, తత్తఱంబునన్ = తొట్రుపడుచు, చోపుడుఁ గోలలు = చెట్లమీఁద నున్న పక్షులను లేపఁగొట్టుకట్టికఱ్ఱలు, కొని = పట్టుకొని, కెలంకులపొలంబులన్ = చుట్టుప్రక్కల నున్న తావులలో, పులుఁగులన్ = పిట్టలను, జోపుచున్ = లేచునట్లుగాఁ దోలుచు, వేఁటాడన్ = వేటయాడుటకు, తొడంగిరి = మొదలిడిరి, అందున్ = ఆపనియందు.

ఉ. లీలఁ బులిందుఁ డొక్కఁడు కళిందసుతోర్మిసరోజనీదళాం
దోళితశోకరేఖఁ దనతోరపుఁకల్లనిదీర్ఘబాహుపై
హాళిహాలంబపోలె విడియత్తెమునన్ దలయెత్తి చూచుచున్
సాళువమున్ వడిన్ జనుశశంబుపయిన్ విడిచెన్ మహోద్ధతిన్.

టీ. పుళిందుఁడు = కిరాతుఁడు, ఒక్కఁడు, లీలన్ = విలాసముగా, కళింద...రేఖన్-కళింద సుతా = కాళిందీనదియొక్క, ఊర్మి=తరంగముల యందలి, సరోజినీ=కమలముయొక్క, దళ = పత్రమునందు, ఆందోళిత = ఊఁపఁబడిన, కోకరేఖన్ = చక్రవాకమురీతిని, తన...బాహుపైన్-తన= తనయొక్క, తోరపు = బలమైన, నల్లని, దీర్ఘబాహుపైన్ = పొడవైన బాహువుమీఁద, విడియత్తెమునన్ = ప్రకాశించుచున్న చేతికిఁ దొడుగుకొను తోలుపై, హాలహాలంబపోలెన్ = హాలాహలవిషమురీతి, తలయెత్తి = శిరస్సును పైకెత్తుకొని, చూచు = కాంచుచున్న, బల్సాళువమున్ = పెద్ద డేగను, వడిన్ = వేగముగా, చనుశశంబుపైన్ = పోయెడుచెవులపోతు మీఁద, మహోద్ధతిన్ = పెద్దవడితో, విడిచెన్ = విడిచిపెట్టెను.

కిరాతుఁడు నల్లగా నుంటచేతను యమునాజలము నల్లగా నుంటచేతను రెంటికిఁ బోల్కి. యమునాతరంగమునకును కిరాతునిబాహువులకును తామరాకునకు విడియత్తెమునకును, చక్రవాకరూపమునకు డేగకును ఉపమానోపమేయములు.

బాహుశబ్దమునకు వుకారాంతాగమము లేమికి "రాహు బాహు శబ్దంబుల కంతట వువర్ణలోపంబు వైకల్పికంబు." (ప్రౌఢవ్యాకరణము.)

తా. కాళిందీనదీకరంగములో నున్నతామరాకుమీఁద నున్నచక్రవాకమువలె నొకనల్లని కిరాతునిబాహువుపైఁ గలయత్తెముమీఁదనుండి తల యెత్తి యిటునటుఁ జూచుచు నున్నసాళువపు డేగను (వాఁడు) వడిగాఁ బర్వెత్తిపోవుచున్న కుందేటిపై విసరెను. అలం. ఉపమ.

క. మొలదట్టిచెఱఁగుఁ జెక్కుచు
బలుదిట్టకిరాతుఁ డొకఁడు పటువగుముష్టిన్
నెలకట్టెఁ బట్టి వేఁటొక
నెలకట్టెన్ గొట్టివైచెఁ జెమరుంగాకిన్. 57

టీ. బలుదిట్ట = మిగులదార్ఢ్యముగల, కిరాతుఁడొకఁడు = బోయ (యొకఁడు.) మొల...చెఱఁగుల్ - మొలదట్టి = నడుమునకు బిగియింపటులఁ గట్టుకొన్న కాసెకోకయొక్క, చెఱఁగుల్ = చుంగులు, చెక్కుచుల్ = దోఁపుకొనుచు, పటువు = దిట్టము, అగుముష్టిక్ = అయినపట్టిపిడికిటిని, సెలకట్టెక్ = ఒకవిధమగుడేగను, పట్టి = గ్రహించి, వేఱొకసెలకట్టెక్ = మఱియొకవిధమగు వాఁడిబాణముతో (బ్రౌనుదొరవారు వ్రాయించిన టీకలో సెలకట్టె = చిన్నకత్తి యనిరి. శబ్దరత్నాకరములో బాణ మనియుం గలదు. సెలకట్టెఁ బట్టి యనుచో జలకట్టె యని గల పాఠము గ్రాహ్యము గాదు.) చెవరుంగాకిక్ = శేముడుగాకిని, (దీనినె బొంతకాకి యని కూడ నందురు) కొట్టివైచెక్ = కొట్టి చంపివేసెను.

తా. ఒకదిట్ట యగుబోయవాఁడు ఊడిపోవుచున్న కాసెకోకచెంగు పైకి దోఁపుకొనుచు నొకచేత సెలకట్టె యనుజాతికిఁ జెందిన బాణవేగమునఁ బోవుడేగను బట్టుకొనియు చెమరుఁగాకిని వేఱొక సెలకట్టె యనుబాణముతోఁ గొట్టెను.

సీ. పెనుదవ్వు దగఁబొట్టఁ జని రెట్ట వడఁ గొట్టె
నుడువీధి బెళగువ్వ నొకయణుజు
తెక్కతాఁకున స్రుక్క నిక్క ప్రక్కలు నొక్క
నుఱక కల్లేటి నొక్కోరణంబు
బోదఁ దూఱునొకమేటి పూరేటి వెలికిఁ బోఁ
దోలి కైకొనె నొక్కతోఁచిగాఁడు
తను నేలుదొర చిత్తమున మెచ్చఁ దీతువుఁ
జని పట్టె బిట్టొక్కజాలెడేగ
తే. విజ్జువిజ్జునఁ దన్నంగ విడువ కెలమిఁ
గఱకుటంఘ్రుల నిఱికించి గజ్జె గదలఁ

గఱికి నెఱినెఱికొలెమ్ముకయును విఱుగ
విఱిచె వడిఁ గైజు నొక పెద్దవేసడంబు. 58

టీ. ఒక్కయెడఁ జూ = అట నొకవిధమగు డేగ, పెనుదవ్వు = చాల దూరము, దగదొట్టఁగ్ = దప్పిపుట్టునట్లు, అలుపు పుట్టునట్లు అని కొందఱు; చని = పోయి, ఉడువీథిఁగ్ = గగనమార్గమున, బెళగువ్వఁగ్ = కపోతమును, కెట్టపడఁగ్ = కెట్టవేయునట్లుగా, చావఁబోవుచు కెట్టవైచి చచ్చునట్లు, కొట్టెఁగ్ = కాలితో బాగుగాఁ దన్నెను. ఒక్క ఓరణంబు = ఓరణమను నొక డేగ, ఉక్కుతాఁకునఁగ్ = తన ఉక్కుతగులుటచేతనే, స్రుక్కఁగ్ = కృశించునట్లు, ఉఱక = సరకుగొనక, కల్లేటిఁగ్ = కల్లేడు అను పేరుగల యొకపక్షిని, నిక్కి = విజృంభించి, ప్రక్కలు నొక్కెఁగ్ = ప్రక్కలణఁగఁ బట్టుకొని యొత్తి చంపివైచెను. ఒక్క తోఁచిగాఁడు = తోఁచిగాఁ డను వేఱొకజాతి డేగ, పొదఁగ్ = పొదలో, తూఱు...రేటిఁగ్ - తూఱు = దాఁగుచున్న, ఒక మేఁటిపూరేటిఁగ్ = మిన్నయగు పూరేడుపిట్టను, వలికిఁగ్ = వెలుపలకు, పోఁదోలి = బైటికి వెడలఁ గొట్టి, కైకొనెఁగ్ = పట్టుకొనెను. ఒక్క జాలెడేగ = జాలెజాతికిఁ జెందిన యొకానొక డేగ, తన నేలుదొర = తన్నుంబెంచు ప్రభువు, చిత్తమునఁగ్ = మనస్సున, మెచ్చఁగ్ = మెచ్చుకొనునట్లు, చని = గుఱిగాఁ బోయి, తీతువుఁగ్ = తీతువుపిట్టను, బిట్టు = గట్టిగా, పట్టెఁగ్ = పట్టుకొనెను. ఒక పెద్దవేసడంబు = వేసడ మను పెద్ద డేగ, కైజుఁగ్ = కైజనుపిట్టను, ఝుజ్ఝుజ్ఝునఁగ్ = ఝుజ్ఝుజ్ఝు మనునట్లు, తన్నుంగఁగ్ = తన్నుచూడ, విడువక = విడిచిపెట్టక, ఎలమిఁగ్ = సంతసముతో, కఱకుటంఘ్రిలఁగ్ = కఱకులైన పాదములయందు, ఇఱికించి = నొక్కిపట్టుకొని, గజ్జె = కాలిమువ్వ, కదలఁగ్, గఱికి = రాపిడిచేసి, నెఱినెఱికొలెమ్ముకయును = ప్రతిపక్షమునందునుగల పెద్దయెముక, విఱుగఁగ్ = విఱుగునట్లుగ, వడిఁగ్ = వడిగా, విఱిచెను = విఱిచివైచెను.

తా. ఆడేగ వేఁటయందు అణుంజు ఓరజము తోఁచిగాఁడు జాలె వేసడము నసెడిపలు తెగలడేగలు బెళగువ్వ కర్లేడు భూరేడు తీతువు కైజా అనఁబడు పక్షివిశేషములను బట్టి కొట్టి చంపి తమ్ముఁ బెంచినవారి కిచ్చెను. అలం. స్వభావోక్తి.

క. సింగికయి కుంచె యెత్తి వె
సం గో యని యార్వఁ బక్షసంహతిగాడ్పుల్
ఝం గని మ్రోయఁ గుజాగ్రపుఁ
గొంగల నొకలగుడు డిగ్గి కొట్టె నిలఁబడన్. 59

టీ. కుంచె=తోఁకయందలి యీఁకలబొత్తి, సింగికయి = ఆకసమువైపునకు, ఎత్తి = లేచునటులుగా నెత్తి, వెసన్=వేగముగ, కో యని యార్వన్ = కో యని యఱవగా, ఒకలగుడు = లగుడను పేరుగలడేగ, పక్షసంహతిగాడ్పులు=ఱెక్కగుమియొక్కగాలి, ఝంగని=ఝంగను చప్పుడుతో, మ్రోయన్ = ధ్వనిచేయఁగా, డిగ్గి=క్రిందికి దిగి, కుజాగ్రపుఁగొంగలన్ = చెట్టుచివర నున్న కొంగలను, ఇలఁ బడన్=భూమిపైఁ బడురీతిని, కొట్టెను. అలం. స్వభావోక్తి.

తా. ఆకాశమువంకకుఁ గుంచె యూఁచి వేఁటకాఁడు కో యని యార్వఁగా లగు డనుడేగ యొక్కటి ఱెక్కలగాలి ఝంగని విసరుచుండఁ గ్రిందికి దిగుచుఁ జెట్టుకొమ్మలపై నున్న కొంగలను పడఁగొట్టెను.

వ. ఇట్లాఖేటఖేలనంబున వివిధమృగవిహగవధం బాచరించి చాలించి యంచెలంచెలఁ బంచశరాపతితచమరసృమరకిరి హరిణ రురు మహిష పృషదంశ గోధికా శశ శశితఖండంబు లొండొండ యుద్వేత్తుగా నాకుఁబొత్తరలఁ గట్టియు గుదులుగుట్టియుఁ జిక్కంబుల నించియుఁ గావడుల నుంచియు సవరించి దిగదిగన విసరి బగబగన మండుచిదుఁగు పొదమంటల కడ్డంబువట్టి మాంసంబులు సూఁడిచూఁడి

వాఁడు లగుకత్తులఁ దిత్తు లొలిచి కుత్తుకలు గోసి శితముఖంబు లగునఖంబులఁ జెకలించి విపులవపురపహాసితమహాశైలంబు లగుశార్దూలంబులబొందుల నందంద పడవైచి యంతంతఁ గాంతారంబున దంతురంబుగాఁ బడిన దంతావళంబులదంతంబులు గైకొనియుఁ దత్కుంభనిర్గత మౌక్తికంబు లేఱికొనియు గోఱజంబుఁ జమరవాలంబుల బర్హిబర్హంబులఁ బరిగ్రహించియు మరలి యత్తఱి గడింది నెత్తురుఁ బ్రొద్దగుట వెఱచఱవం జఱవ నేఁదు పెనుముండ్లఁ బండ్లసరియలు నెఱియలు వాఱ బోరనఁ గాఱుధారాళరుధిరాసారపూరంబు నాకినాకి సొలుకలు దిగవైచి యేచిన మహాతపోష్ణంబునఁ దృష్ణ వొడమి దగ నిగుడ వగ రడరి యొడలఁ దొడలను మెడలను బెడిదంపునిడుదకోఱల సలుగు లడిచినయెడల బొడబొడను వెడలెడునుడుకు నెత్తుటఁ బడలి తూలుకొలేయుకమ్ములయంగమ్ము లార్ద్రీకర్పటంబులం గప్పి దప్పి నిగుడ నప్పాలంబు పశ్చిమపుదండనుండు వెండికొండబండలఁ జండకరకరహిండనంబునం బొండు ప్రభలు నిండి పఱచుతఱచుసెలయేఱులసూరెలంగాఱు కొనుభూరుహానికాయంబుల డాయం జని తద్ఘనచ్ఛాయల నిలిచి యచ్చటఁ గ్రొచ్చి గరువునేలల గుంట లొనరించి లోన నుమ్మగిలి గబ్బు వలవక కమ్మతావులు గలనావురాకులు వఱచి యెఱచిలో మేలేఱి శారిజముఁ గందనకాయ క్రొవ్వు మొదలగు మిగుల మెత్తనిపలలభిత్తంబులందుఁ గ్రందుకొనఁ గ్రుక్కి యెక్కువతక్కువలు గాకుండఁ గండ గల తింత్రిణీశలాటుసంఘాతంబు లామీఁద నెఱయం బచరించి

యెసరుగాఁ దేట లగు వేఁడినల్లలు గుమ్మరించి లవణకణసంచ
యంబు నించి లావుగాఁ గావు గప్పి యుపరిప్రదేశంబులం
గా రెనుపపెంటపట్ల నీరాలు నేలుఁ బిసుకలదాల్లిడి నెల్లి
కొయ్యలు ద్రచ్చి నుచ్చు లంటించినఁ బెచ్చు పెరుఁగుచిచ్చు
లాత్రంపులఁ దపలించి చిముడ నుడికిన వెలువరించి యుప్పు
వెప్పానఁ గలయప్పిశితఖండంబులు గనగననినిప్పులఁ జమురు
చిప్పిలఁ గాల్చిన కమ్మకఱకుట్లం జట్రాతిపయిఁ గాస్త్రేనికిం
గుడుపువెట్టి పిదపఁ బాళ్ల వెంబడిం బంచుకొని తారు నుప
యోగించి తద్దేవతాప్రీతికై తలలు దోఁకలు డొక్కలు నచటి
విటపివిటపంబుల వ్రేలంగట్టి శిశిరమధురసలిలమ్ములు ద్రావి
వాగురికులు విశ్రమింప నిలింపాంగనాసుతుండును సహాయ
మాగతచతురవలలకృతపలల ఫలమూలాదిశుచిమధురమృగ
యోచితాహారంబులం దృప్తి వహించి పరిజనారచితపల్లవా
సనాసీనుండై గండూషితపుండరీకమధురసాసారంబు లగు
నిర్ఝరానిలకిశోరంబు లోలయ నలయికలు దీఱి యున్నసమ
యంబున. 60

టీ. ఇట్లు = ఈరీతిగా, ఆఖేటఖేలనంబులన్ = వేఁటయను శాట
యందు, వివిధమృగవిహగవధంబు-వివిధ = అనేకములయిన, మృగ = మెక
ములయొక్కయు, విహగ = పిట్టలయొక్కయు, వధంబు = సంహరించుటను,
ఆచరించి = ఒనర్చి, చాలించి=మాని, అంచెలంచెలన్ = అందందు, పంచతా
...బులు-పంచతా = మృతినొందుటచే, పతిత=పడినట్టి, చమర=సవరపుమెక
ములు, సృమర=పెద్దజాతిచమరములు, కిరి=పందులు, హరిణ=లేళ్లు, రురు =
కృష్ణసారములు (నల్లచాఱలుగలజింకలు), మహిష = అడవిదున్నలు, పృషద
దంశ=(అడవి) పిల్లులు, గోధికా=ఉడుములు, శశ = చెవులపిల్లులు (క్షుద్రజంతు
వుల), పిశితఖండంబులు = మాంసపుముక్కలను, ఒండొండ = వేర్వేఱుగా,

ఉద్వృత్తగాన్=మిగులనుండునట్లు, ఆకుఁబొత్తరలన్ = ఆకుపొట్లములయందు, కట్టియున్ = పొట్లములుగాఁగట్టియు, గుదులుగుట్టియున్ = తోరణములుగా గ్రుచ్చియును, చిక్కంబులన్ నించియున్ = చిక్కములలో నిండించియు కావడులన్=కావళ్లయందు, ఉంచియున్ = పెట్టియుం, సవరించి=కూర్చుకొని దిగదిగన్ = దిగదిగమని ధ్వని కలుగునట్లు, (అనుకరణధ్వని), విసరి=గాలి తగులునట్లు విసరి, బగబగన్=బగబగ యనునట్లు, మండుచిదుఁగుసొదమంట లనన్ = మండుపుడకల (సమిదల) నిప్పుమంటలో, అడ్డఁబుపట్టి=అడ్డముగాఁ బట్టుకొని, మీసంబులు, చూఁడిచూఁడి = కాలిచికాలిచి, వాఁడులు = వాఁడి గలవి, అగుకత్తులన్ = అయినట్టికత్తులతో, తిత్తులొలిచి = తోళ్లుదీసి, కుత్తుకలు = కంఠములు, కోసి, శితముఖంబులు = వాఁడియైనమొనలుగలవి, అగు నఖంబులన్ = అయినట్టిగోళ్లతో, పెకలించి=పెఱికి, విపుల...శైలంబులు= విపుల=గొప్పవి యగు, వపుః = శరీరముచే, అపహసిత = తిరస్కరింపఁబడిన, మహాశైలంబులు=గొప్పకొండలుగలవి, కొండవలె నుండు గొప్పదేహములు గలవనుట, అగు...బొందులన్-అగు, శార్దూలంబుల = పులులయొక్క, బొందులన్ = దేహములను, అందంద = (అవి పడియున్నచోట) అచ్చటచ్చటనే, కడవైచి = ప్రోగుచేసి, మిగుల స్థూలశరీరములుగాన మోయ ప్రాలుమాలి యటనే యుంచిరి. (పులిమీసములతో విరోధులు తమకిష్టములేనివారికై దుష్ప్రయోగములు చేయుదు రని కలదు. పులిని జంపిన వేఁటకాఁడుగాని వారిహితులుగాని దానిమీసములు వెంటనే గాల్చివేయుదురు. అట్లుఁ గాల్చివేయనియెడల నామీసములు ముక్కలుగఁజేసి పరమాన్నములోఁ గలిపి వండిపెట్టినయెడలఁ దిన్నవారు చనిపోవుదు రని చెప్పుదురు. అందుచే మీసములు కాల్చునట్లుఁ జెప్పఁబడెను) అంతంతన్ = అక్కడక్కడ, కాంతారంబునన్=వనములో, దంతురంబుగాన్ = చిక్కఁగా, పడిన, దంతావళదంతంబులు = ఏనుఁగుల కొమ్ములను, కైకొనియున్ = పుచ్చుకొనియు, తత్కుంభ = ఆయేనుఁగుకుంభస్థలమునుండి, నిర్గత = బైలువెడలిన, మౌక్తికం

బులు = ముత్తెములను, ఏఱికొనియున్ = ఏర్పఱచి తెచ్చుకొనియు, ఏనుఁగు కుంభస్థలములం దముత్యములు పుట్టు ననుటకు. శ్లో. "కరీంద్ర జీమూత వరాహ శంఖ మత్స్యాహిశుక్త్యుద్భవవేణుజాని. ముక్తాఫలాని ప్రథితాని లోకే తేషాంతు శుక్త్యుద్భవమేవ భూరి." (ఏనుఁగుకుంభస్థలములందుఁ బుట్టు ముత్తెములు ఉసిరికకాయలంత యుండు నని రత్నశాస్త్రము.) గోఱజంబున్ = గోరోజనము, చమరవాలంబులన్ = చమరములను మృగము తోఁక కుచ్చులను (ఇవియే నవరములు). బర్హ బర్హంబులన్ = నెమిలికుంచెలను, పరిగ్రహించియున్ = సంపాదించుకొనియు, మఱలి, ఆర్తటిన్ = అసమయము; కడిందినెత్తురుం బ్రొద్దు = మిగుల నెఱ్ఱగా ప్రకాశించు ప్రొద్దు (మధ్యాహ్నము), అగుటన్ = అగుటవలన, వెఱచఱవఁగాఁబువన్ = భీతిపుట్టఁగాఁబుట్టఁగా, ఏనుపెనుముండ్లన్ = ముండ్లపందుల పెద్ద ముండ్లచే, పంద్లపరియలు = దంతములకొనలు నెఱియలువాఱి = బీటలువడి, భోరనన్ = ఎక్కుడుగా, కాఱు...పూరంబు - కాఱు = ఓడుచున్న, ధారాళ = ఒడ్డులేని, రుధిర = రక్తముయొక్క. ఆసార = ధారలయొక్క, పూరంబు = వెల్లువను, నాకినాకి = ఎన్నిమోమాఱులు నాకి, ఏదుఁబు ముండ్లతోఁ గొట్టఁగాఁ వేఁటకుక్కల యొడలియందు గాయములుపడెను. ఆ గాయములు లోఁతుగా నుంటచేఁ జొప్పులేక రక్తముగాఱుచుండ నాకుకొనుచుండెను. నాలుకలుదిగవైచి=నాల్కలుప్రేలాడవైచుకొని, విచినమహాతపోష్ణంబునన్ - విచిన = విజృంభించిన, మహాతప = పెద్దయెండయొక్క, ఉష్ణంబునన్ = వేఁడిచేతను, తృష్ణ = దప్పిక, పొదమి = కలిగి, దగ = తాపము, నిగుడన్ = ప్రసరింపఁగా, (ఎక్కుడుకాఁగా), పసరు = పసరుపు, ఆవిరి = పుట్టి, ఒడలన్ = శరీరములందును, తోడలన్ = తొడలయందును, మెడలన్, నలుగులు = వరాహములు, బెడిదంపుఁబిడుదనోఁటులన్ = వాఁడిగలపొడవులైన దంష్ట్రలతో, అడఁచినయొడలన్ = కొట్టినచోటులను, బొడబొడను = బుడబుడ యనుచు, వెడవెడఁ బెనుకు నెత్తుటన్ = పొడముచున్న యంష్ట

రక్తముచే, పందులు కోఱలతో శునకములను పీలుచోటులనెల్లఁ గొట్టెను. ఎండవేఁడిమికిఁ దప్పికిఁ గృశించిన శునకముల మేనులనుండి వేఁడినెత్తురు కారుచుండెను. (అప్పుడె గాయమునుండి స్రవించు నెత్తురు వెచ్చఁగా నుండును) బడలి = అలసి, తూలుకౌలేయకమ్ములయంగమ్ములు - తూలు = తూలుచున్న, కౌలేయకమ్ముల = శునకముల, అంగమ్ములు = శరీరములను, ఆర్ద్ర కర్పటంబులన్ = తడిసినదుప్పటులచే, కప్పి, దప్పి = దాహము, నిగుడన్ = ఎక్కుడు కాఁగా, అభ్రాలంబి పశ్చిమప్రసండన్ = ఆకాశముఁ బడమటివైపున, ఉండు వెండికొండబండలన్ = ఉండిన కైలాసపర్వతపాషాణములయందు, చండకరకరహిండనంబులన్ - చండకర = భాస్కరునియొక్క, కర = కిరణముల, హిండనంబులన్ = ప్రసారములచే, పాండుప్రభలు = తెల్లకెలుఁగులు, నిండి, పఱచు...సూరెలన్ - పఱచు = పాఱుచున్న, తఱుచు = విశేషములైన, నెల యేఱులన్ = కొండలందుఁ బుట్టు నేఱుల యొక్క, సూరెలన్ = ప్రక్కలను, కాఱు...బులన్ - కాఱుకొను = ఎత్తుగా నున్న, భూరుహ = చెట్లయొక్క, నికాయంబులన్ = గుంపులను, డాయం జని = సమీపించి, తద్ఘనచ్ఛాయలన్ = వాని పెద్దనీడలను, నిలిచి, అచ్చటన్ = అచ్చోటున, క్రొచ్చి = త్రవ్వి, గరువునేలలన్ = గరపనేలలయందు, గుంటలు = గోతులు, ఒనరించి = చేసి, లోనన్ = ఆగోతులలో, ఉమ్మగిలి = ఆవిరిచుట్టి, గబ్బువలవక = దుర్వాసనపుట్టక, కమ్మతావులు = సువాసనలు, కలనాపురాకులు = కలిగిన నాఁగురాకులను, పఱచి = క్రిందఁబఱచి, ఎఱచిలోన్ = మాంసములో, మేలు = శ్రేష్ఠమైనదానిని, ఏఱి = తేర్చి, కారిజము = కారిజమును (కడుపులో నీరుతిత్తి క్రింద నుండెడు మాంసఖండ విశేషము), కందనగాయ = గుండెకాయ, క్రొవ్వు, మొదలగు, మిగుల మెత్తని, పలలభిత్తంబులు = మాంసపుముక్కలను, అందున్ = ఆ నూఁతులు పఱచిన గోతులలో, క్రమ్ముకొనన్ = నిండునట్లు, త్రుక్కి = అదిమిపెట్టి, ఎక్కువ తక్కువలు = హెచ్చుగాని తక్కువగాని, కామండన్ = కామండ

పొదుపటుల, కండ...ములు-కండగల = ముదిరిన, తింత్రిణీశలాటు=చింత కా-
యల, సంఘాతంబులు=ప్రోగులను, ఆమీఁదన్=ఆమాంసపుముక్కలమీఁద,
నెఱియన్ = అంతటను, పచరించి = పఱచి, ఎసరుగాన్=ఎసటిలోనీరుగా,
లేటలు = స్వచ్ఛమైనవి; అగువేఁడినల్లలు = అయినవేఁడిరక్తమును, (అగు
లేటినల్లలు=అయిన లేడిరక్తము. పా) క్రుమ్మరించి = ద్రిమ్మరించి, లవణకణ
సంచయంబున్ = ఉప్పురాళ్లసముదాయమును, నించి = వైచి, లావుగాన్ =
దట్టముగా, కావుగప్పి=కావువేసికప్పి, ఉపరిప్రదేశంబులన్=వానిపై ప్రదేశము
లందు, కారెనుపపెంట పట్టున్ = వనమహిషములు నివసించుచోటులను,
నీరాఱునేఁబిసుకలన్ = ఎండినయేఁబిసుకలతో, దాళ్లిడి=దాలులపేర్చి,
నెల్లికొయ్యలు = నెల్లిచెట్టుకఱ్ఱలను, త్రచ్చి = మథించి, నుచ్చులు = మేఁక
పెంట్రికలు, అంటించన్=తగిలింపఁగా, అడవిలో మాంసాదికము వండుటకుఁ
పాత్రములు లేవుగాన గరపనేలలో గోతులు దీసి పైని గొల్లజిడ్డుతీఁగయాకులు
పఱచి దానిలో మెత్తనిమాంసఖండము లుంచి పులుపునకుఁ జింతకాయలు
వేసి లేడినెత్తురును ఎసరుగాఁ బోసి నెల్లికఱ్ఱ మథించి యగ్నిదీసి మేఁకపెంటి
కలతోఁ గాఁజఁబెట్టి యేఁబిసుకలను బైనిపెట్టి పక్వమొనరించిరి. పెచ్చు
పెరుఁగుచిచ్చులు=వృద్ధిపొందిన నిప్పులు, ఆత్రంపులన్ = ఆకుమ్ములయందు,
తవిలించి = అంటించి, చిముడన్ = చిమిడిపోవునట్లు, ఉడికినన్ = పక్వము
కాఁగానే, వెలువరించి = పైకిఁదీసి, ఉప్పువెప్పును = అవిరిబోకుండ నుడి
కించుటచేఁ గలిగిన వేఁడిమిని (పా. అప్పువెప్పును = పచ్చియుం వెచ్చియుం)
కలయప్పిశితఖండంబులు=కలిగినమాంసంబుడు తునుకలను, గనగననినిప్పులన్ =
కణకణమండుచున్న యగ్నియందు, చమురు = మాంసములోనిచమురు,
చిప్పిలన్ = కాఱునట్లు, కాల్చినకమ్మకఱకుట్లన్ - కాల్చిన=ఇనుపశలాకలను
గ్రుచ్చి కాల్చిన, కమ్మ = పరిమళముగల, కఱకుట్లన్ = కఱకుట్టుమాంస
ముతో, చట్రాతిపైన్ = చాఁపఱాతిమీఁద, కాట్రేనికిన్ = వనదేవతకు,
(కాటిజేసి ప్రాస్వరూపము కాట్రేఁడు-వ్యుత్పత్తివిఁబట్టి కాట్రేఁడవ శంకరుఁ

దని స్పష్టమగుచున్నది గాని పూజించినది వనాధిదేవతను గాన వనదేవత యని యర్థము వ్రాయఁబడెను.) కుడుపువెట్టి = నివేదన మొనర్చి, పిదపన్ = పిమ్మట, శూల్యకీలంబులన్ = వంతుల చొప్పున, పంచుకొని, తారున్ = తాము, ఉపయోగించి = తిని, తద్దేవతాప్రీతికై = ఆదేవతాప్రీతి నిమిత్తము, తలలు = మృగములశిరస్సులను, తోఁకలు = వాలములు, డొక్కలు = భుజములకుఁ దొడలకు మధ్యభాగములు, పొట్టలు, అచటివిటపివిటపంబులన్ = అక్కడ నున్న చెట్లకొమ్మలయందు, వ్రేలంగట్టి = వ్రేలాడునట్లుకట్టి. శిశిరమధురసలిలమ్ములు=చల్లనివియును తియ్యనివియు నగునుదకములు, త్రావి= పానము చేసి, వాగురికులు=మృగయులు, విశ్రమింపన్=ఆయాసము పోవఁగూరుచుండఁగా, నిలింపాంగనాసుతుండును = దేవవనితయగు వరూథిని కుమారుఁడును (స్వరోచి), సహా...బులన్-సహ=తోడుఁగా, సమాగత = వచ్చిన, చతుర=నిపుణులైన, వలవ = వంట చేయువాండ్ర చేత, కృత=(వంట) చేయఁబడిన, పలల=మాంసము, ఫల=పండులు, మూల = దుంపలు, ఆది = మున్నగు, శుచి=శుద్ధములైన, మధుర = తీయని, మృగయ = వేటసమయంబునకు, ఉచిత = ఉచితమైన, ఆహారంబులన్ = ఆహారపదార్థములచే, తృప్తి వహించి = తనివినొంది, వంటవాండ్రు మిక్కిలి నేర్పరులు గాన నే పాకరసవృద్ధియుం లేని తావున మధురముగాఁ బిశితముల వండఁగలిగిరి. సమాజసుకుమారుఁడు రాజు; అది వేఁటతఱిఁ దగిన యాహారముగానఁ దృప్తిగాఁ దినెను. పరి...సీనుండై-పరిజన=తనతో నున్న సేవకులచే, ఆవచిత = బాగుగాఁబఱుపఁబడిన, పల్లవ=లేఁతయాకులచేతనైన, ఆసన=కూర్చుండుపీటపై, ఆసీనుండై = కూరుచుండినవాఁడై, గండూషి...సారంబులు-గండూషిత = పుక్కిలింపఁబడిన, పుండరీక=తెల్లతామరలోని, మధురస=తేనె యొక్క, ఆసారంబులు=వృష్టులు గలవి, తెల్లఁదామరపూవులలోనుండి స్రవించు తేనియ చినుకులతో వీచుచున్నవి యగు, నిర్ఝరానిలకిశోరంబులు, నిర్ఝర = ఏఱులమీఁదినుండివచ్చు, అనిలకిశోరంబులు = సన్నవాయువులు, ఒలయన్ = పైనిసరుచుండఁగా, అల

యికలు = శ్రమములు, కేలి=కగ్గి, ఉష్ణసమయంబునన్ = ఉష్ణపుకు వైషమ్యముతో నన్వయము.

మత్తకోకిల. నిండెఁ గావిరి దిక్తటంబుల నింగిఁ గుండలిచండరు
జ్మండలంబు గనుఁగొంచు మ్రోసెను మాలకాకులమూఁక ల
య్యండ నిల్చి యదల్చె నప్డు శివాళి యూళలఁ బద్మగ
ర్భాండభాండము ధూళిధూసర మయ్యె నుద్ధతవాత్యలన్.

టీ. కావిరి=పొగవలెనుండు నల్లదనము, దిక్తటంబులన్=దిశాభాగము లందు, నిండెన్=పూర్ణమయ్యెను, నింగిన్ = ఆకసమున, కుండ...మండలిన్-కుండలి = పరివేషముతోడ, చండరుక్ = సూర్యుని, మండలిన్=బింబ మును, కనుఁగొంచున్ = కాంచుచు, మాలకాకులమూఁకలు = ద్రోణకాక సమూహము, మ్రోసెన్ = అఱచెను. అప్డు=అప్పుడు, అయ్యెడన్ = అచ్చో టను, నిల్చి=నిలువఁబడియుండి, శివాళి=నక్కలగుంపు, ఊళలన్=కూఁతలచే, అదల్చెన్=అదలించెను. ఉద్ధతవాత్యలన్ = హెచ్చుగావిసరుచున్న సుడిగా డ్పులచే, మీఁదికెగయుచున్న సుడిగాలిచేత, పద్మగర్భాండభాండము = బ్రహ్మాండకటాహము, ధూళిధూసరితము = పరాగముచేఁ గొంచెము తెల్లఁగా నున్నది, అయ్యెన్ = ఆయెను. సుడిగాలి వీచుటయుఁ గావిరి యావరించు టయు లోనగునవి యెల్ల నరిష్టసూచకములు. ఉత్తరరామాయణమునందు నిందలి యరిష్టములు కొన్ని చెప్పఁబడెను.

సీ. "సుడిగాడ్పు తేరిపల్చెట్టుజొట్టులు వెట్టె గడఁదిమంటలు వెళ్లఁ గ్రక్కె నక్క"
తే. "కావిరి దిగంతముల నెల్లఁ గ్రమ్ముకొనియె." (షష్ఠాశ్వాసము.)

తా. దిక్కులనిండఁ గావిరి కప్పెను. సూర్యబింబమును గాంచుచు మాలకాకు లఱచెను. నక్క లూళలు వైచెను. సుడిగాలిగుంపు వడిగా విసరిన బ్రహ్మాండమంతయును ధూళిచే నీషత్పాండువర్ణము గలదియయ్యెను. (ఇట్టి గుణములు అరిష్టసూచకములు.)

క. ఆకొఱగాములఁ గనుఁగొని
శాకునికుం డొకఁడు లేచి సంభ్రమ మొదవన్
జ్యాకలితశరాసనుఁ డై
వీఁకను సైనికులఁ దిట్టి విభుతో ననియెన్. 62

టీ. ఆకొఱగాములన్=అరిష్టసూచకములను, కనుఁగొని = చూచి, శాకునికుండు=శకునములు తెలిసినవాఁడు, ఒకఁడు=అటనున్నవారిలో నొకఁడు, లేచి=కూర్చున్నచోటినుండిలేచి, వీఁక శబ్దము సార్థబిందుకమైనను ప్రాసయందానియతి పాటింపఁబడలేదు. వీఁక సార్థబిందుక మగుటకు "ఆఁకలినీరువట్టు... వీఁక రఘూద్వహుండు," (రామాభ్యుదయము.) సంభ్రమము=తొట్రుపాటు, ఒదవన్=పుట్టఁగా, జ్యా...డై-జ్యా=వింటినారితో, 'కలిత = కూడిన, శరాసనుఁడై=ధనుస్సుగలవాఁడై (ధనుస్సునెక్కుపెట్టినవాఁడై), వీఁకన్=సాహసముతో, సైనికులన్ = సేనలోనివారిని, తిట్టి, విభుతోన్ = స్వరోచితో, అనియెన్ = ఈక్రిందిరీతిం బల్కెను.

తా. ఆదుశ్శకునములం గనిపెట్టి యొక్కశకునకుల నెఱిఁగినవాఁడు ధనుర్ధారియై లేచి సైన్యములోనివారి నదలించుచు విపరీతదుశ్శకునములఁ జూచియుం జేమఱియుండఁ దగునా యని పలికి, రాజుతో నేదియో చెప్పెను.

క. తఱచుగ మెకములఁ బొరిగొను
మఱపున వచ్చితిమి దవ్వు మనపాల మిట కి
త్తఱి నగునిమిత్తములు నృప
కొఱగా విదె మనకుఁ బెద్దగొడ వగు ననినన్. 63

టీ. నృపా = ఓరాజా, తఱచుగన్ = మిక్కిలిగ, మెకములన్ = జంతువులను, పొరిగొనుమఱపునన్ = చంపుటయందలి యుత్సాహమువలనఁ గలిగిన మరపుచేత, వచ్చితిమి=ఇంతదూర మరుగుదెంచితిమి. మనపాలము = మనముండుతావు, ఇటకున్=ఇక్కడకు, దవ్వు=మిగులదూరము, ఇత్తఱిన్ =

ఇష్టము, అగునిమిత్తములు = అగుచున్నశకునములు, కొలఁగావు = తగినవికావు. ఇదె = ఇదిగో, ఈ యుత్తరక్షణమునందె, మనకున్ = మనయందఱకును, పెద్దగొడవ = గొప్పయాపద, అగున్ = కలుగును, అనెన్ = అని చెప్పఁగా, (ఇప్పుడే యేదేనొకయాపద రాఁబోవుచున్నది). వైపరీత్యముతో నన్వయము.

తా. ఓరాజా! వేఁటాడుసందడిని మననివాసములకు దూరముగా వచ్చితిమి. దుశ్శకునములు తోఁచుచున్నవి. మన కేదో గొప్పయాపద త్వరలోఁ గలుగు నని నాకుఁ దోఁచుచున్న దని యనఁగా.

మ. అతఁ డాస్ఫాలితసజ్యకార్ముకుఁడు వాహారూఢుఁడుఁ బా
ర్శ్వసం, భృతతూణాహృతచండకాండుఁడు దిశాప్రేంఖత్క
టాక్షాంచల, ద్యుతిజాలుండును నై పుళిందభటసందోహం
బుతోడన్ మహోద్ధతి నుండన్ జయలాభసూచకనిమిత్తం
బుల్ మెయిం దోఁచినన్. 64

టీ. అతఁడు=ఆస్వరోచి, ఆస్ఫాలితసజ్యకార్ముకుఁడున్ - ఆస్ఫాలిత = ధ్వనిచేయఁబడిన—మ్రోయింపఁబడిన యనుట, సజ్య = ఎక్కిడఁబడిన, కార్ముకుఁడున్ = విల్లుగలవాఁడును, వాహారూఢుఁడున్ = అశ్వము నెక్కిన వాఁడును. పార్శ్వ...కాండుఁడు - పార్శ్వ = ప్రక్కలను, సంభృత = లెస్సగా ధరింపఁబడిన, తూణ = బాణములపొదినుండి, ఆహృత = తీసికొనఁబడిన, చండ = తీక్ష్ణమైన, కాండుఁడును = శరములుగలవాఁడును, దిశా...జాలుండును నై - దిశా = దిక్కులయందు, ప్రేంఖత్ = వ్యాపించుచున్న, ఎగురుచున్న; కటాక్ష = క్రేఁగన్నులయొక్క, ద్యుతిజాలుఁడును నై = కాంతుల పంక్తిగలవాఁడు నై, పుళింద...తోడన్ - పుళింద = బోయలైన, భట = బంట్లయొక్క, సందోహంబుతోడన్ = సమూహముతో, మహోద్ధతిన్ = మిగుల నౌద్ధత్యముతో, ఉండన్ = ఉండఁగా, జయ...బుల్ - జయ = గెలుపు

మను—26

యొక్క, లాభ = లాభమును, సూచక = తెలుపునట్టి, నిమిత్తంబుల్ = శకునమ్ములు, మేనన్ = శరీరమున, తోఁచినన్ = కనఁబడఁగా, (శరీరస్పందాదిశుభసూచకములు తోఁచిన వనుట).

దక్షిణాక్షిభుజోరుస్పందాదులు దేహమునఁ దోఁచు శుభలక్షణములు. స్పందనముల శుభాశుభలక్షణము లిట్లు చెప్పఁబడెను.—

క. "కనుకుడికొనదిగువవలన, ననయమువయి నదరఁ గీడు నటు కొన దిగువన్
గను కీడు పైన మొదలెంచిన మేలగు నెడమకన్ను శిఖినరసింహా.

క. అడుగుపెదవి మృష్టాన్నము, కడులాభము గడ్డ మదరఁగా ధన మబ్బున్
గుడిచెక్కు లెడమచెక్కులి, చెడుచోరభయంబులంద్రు శిఖినరసింహా.

క. ఆజి యగున్ నొసల........"

తా. ఈమాటను విని స్వరోచి ధనుర్బాణధారియై గుఱ్ఱ మెక్కి నలుదెసలఁ దనకటాక్షదృష్టులు వఱపుచు నెఱుకువాండ్రు మున్నగు భటవర్గముతో నుండఁగాఁ గొన్ని శకున శరీర మదరుట మొదలగు శుభశకునముల సూచన యయ్యెను.

వ. ప్రాణరక్షాసంశయం బగుమహారణక్షోభం బొక్కటి కలుగు
మీఁద నెట్టకేలకు మితివెట్టరానిజయమంగళంబు లగు నని
యంతరంగంబున నిశ్చయించి యూఱడిలుసమయంబున. 65

టీ. ప్రాణరక్షాసంశయంబు = ప్రాణములను సంరక్షించుకొనుటకే సంశయము గలిగినవి, అగు, మహారణక్షోభంబు = పెద్దయుద్ధపుఁగలఁత, ఒక్కటి, కలుగున్ = ముందుగాఁ గలుగును, మీఁదన్ = పిమ్మట, ఎట్టకేలకున్ = చిట్టచివరకు, మితి పెట్టన్ = గణించుటకు, రానిజయమంగళంబులు = వలనుగాని జయమును మేలును, అగున్ = కల్గును, అని, అంతరంగంబునన్ = మనంబున, నిశ్చయించి = నిశ్చయపఱచుకొని, ఊఱడిలుసమయంబునన్ = మనశ్శాంతి చేసికొనునవ్వేళ.

స్పందనములు (అదరుటలు) శుభమును అశుభమునుగూడ సూచించును. శుభాశుభమిశ్రములుగా సూచన లుంటచే రాజు తొలుత మిగుల నపాయము తరువాత మిగులశుభము కలుగు నని తలంచెను.

క. ఆవిపినాంతరమున హా
 హా వనిత ననాథ నబల నార్త విపన్నన్
 గావరె యీపుణ్యమునం
 బోవరె యని పలుకువాఁడు మొఱ వినఁబడియెన్. 66

టీ. ఆవిపినాంతరమునన్ = ఆవనము లోపుండి, హాహా = అక్కటక్కటా! వనితన్ = స్త్రీని, అనాథన్ = నాథుఁడు లేనిదానను, అబలన్ = దుర్బలను, ఆర్తన్ = బాధపడుచున్నదానను, విపన్నన్ = విపత్తునందున్నదానను, కావరె = రక్షింపరయ్యా! ఈపుణ్యమునం బోవరె = ఈపుణ్యముం గట్టుకొనరో, అని, పలుకువాఁడు మొఱ = పలుకుచున్నయాఁడుదాని మొఱ్ఱ, వినఁబడియెన్ = వినవచ్చెను.

ఆఁడుదానిని గాపాడుటయే సుకృతము. అందాపన్నను దీనురాలిని దిక్కులేనిదానిని గాపాడుట మఱియుం సుకృతము. ఈసుకృత మంతంతన లభించునది కాదు. అప్రయత్నలభ్య మగు నీసుకృతమున కెవరేని పాల్గొనుఁడని ప్రార్థించెను.

తా. వైరులగ ముందు రణక్షోభము గలిగినను బిమ్మట మేలు గలుగు నని స్వరోచి తలంచుచుండ నాయడవిలో నొకయాఁడుదానిదుఃఖరవము "అక్కటా! వనితను, అనాథను, ఆర్తురాలను, నన్ను రక్షించి పుణ్యము గట్టుకొం" డనుచు వినంబడియెను.

క. ఆమొఱ వేడుకుఁ జెవి నిడి
 భూమండలభర్త కరుణ పొడముఁగ నయ్యో
 యేమానిని కెవ్వనిచే
 నేమాయెనొ యనుచు నచటు నీక్షించుతఱిన్. 6

టీ. భూమండలభర్త = భూపతి (స్వరోచి), ఆమొఱ = ఆయాఁడు దానివిలాపవాక్యములను, వేమఱుక్ = పెక్కుమాఱులు, చెవినిడి = ఆల కించి, కరుణ = దయ, పొడమఁగన్ = కలుగఁగా, అయ్యో, ఏమానికిన్ = ఏవనితకు, ఎవ్వనిచేన్ = ఏపురుషునిచేత, ఏమాయెనో = ఏమియాపద సంభవించెనో, అనుచున్ = అని తలఁచుచు, అచటన్ = అధ్వవి వినఁ బడినవైపును, ఈక్షించుతఱిన్ = కాంచునపుడు.

తా. స్వరోచి యాయాక్రందనము విని పాప మెవ్వతెయొ యెట్టి యపాయము సంభవించెనోగదా? యని యావైపునకుం జూచుచుండ గా.

శా. మట్టెల్ మ్రోయఁగ గబ్బిచన్నుఁగవ కంపంబంద వేణీభరం
బట్టిట్టై కటిఁ జిమ్మచీకటులు గా నశ్రువ్రజం బోడిక
ల్గట్టన్ జూపులు చిమ్మరేఁగి దివి రోలంబాళిఁ గల్పింపఁగా
మిట్టాడంగ నరుండు లేనియడవిన్ మీనాక్షి దీనాకృతిన్.

టీ. మీనాక్షి = మత్స్యములవంటి నేత్రములుగల వనితయొకతె, మట్టెల్ = కాలిమట్టెలు, మ్రోయఁగన్ = మ్రోఁగఁగా, గబ్బిచన్నుఁగవ = గొప్పదైన కుచద్వంద్వము, కంపంబు = వణఁకును, అందన్ = చెందఁగా, వేణీభరంబు = జటాభారము, అట్టిట్టై = చెదరి, కటిన్ = పిఱుఁదులపై, చిమ్మచీకటులు = చిక్కనిచీకటులు, కాన్ = క్రమ్మినటులకాఁగా, అశ్రువ్రజంబు = కన్నీటిగుంపు, ఓడికల్ = ధారలుగా, కట్టన్ = ఏర్పడఁగా, తెంపులేక కాలువలవలెఁ ప్రవహింపఁగా, చూపులు=వీక్షణములు, చిమ్మరేఁగి= మిగులచెదరి, (రూ. చిమ్మిరేఁగు-భయవశమునఁ బరుగెత్తుచు రక్షించువారెవరా యని దిక్కులుచూచుటచే నన్నికడలకుఁ జెదరి) దివిన్=ఆకాశమునందు, రోలంబాళిన్=తుమ్మెదలబంతులను, కల్పింపఁగాన్=పుట్టింపఁగా, మిట్టాడంగన్ =

తిరుగాడుటకు, నరుండు = మానవుఁడు, లేనియడవిన్ = లేనియట్టివనమున, దీనాకృతిన్ = దుఃఖము నొందినరూపముతో. మీఁదిపద్యముతో నన్వయము. అలం. స్వభావోక్తి.

నను లేవను సూచించుటకు యడవిగాక దేవతలేని కదలింతురేమో యని పైకిఁ జూచుటచేఁ జూపులు పైకిఁ బ్రసరించి తుమ్మెదలబారులవలె నుండెను. చూపులు తుమ్మెదలగుంపుగాఁ జెప్పుట గలదు. చూపులు కృష్ణగణము.—

శ్లో. వేశ్యాస్త్వత్తో నఖపదసుఖాన్ ప్రాప్య వర్షాగ్రబిందూన్
ఆమోక్ష్యంతే త్వయి మధుకరశ్రేణిదీర్ఘాన్ కటాక్షాన్."

(మేఘసందేశము.)

తా. ఒకస్త్రీ మబ్బులు క్రమ్ముచుండఁగా, స్తనద్వయము కదలుచుండ, జడవిడి వీఁపుపైఁ బిఱుదులవఱకుఁ బడి చీకటిక్రమ్మిన ట్లుండఁగాఁ, గన్నీరు ధారలుకట్టుచుండ, (భయముచేత) దృష్టులు గగనంబునఁ దుమ్మెదలపంక్తులవలె నగుచుండఁగా జనసంచారములేని యారణ్యమందు దైన్యము నొందిన యాకారముతో (ఎదుట నిలిచె నని ముందఱిపద్యముతో నన్వయము.)

క. ఒక్కతె భయశోకంబుల
వెక్కుచు మెయిఁ గలవిలాసవిభ్రమలక్ష్మిల్
దక్కుటయును నొకయొఱపై
నెక్కొన ధరణీశునెదుర నిలిచి వినీతిన్. 69

టీ. ఒక్కతె = (పైఁజెప్పఁబడిన యొకస్త్రీ) భయశోకంబులన్ = భయముచేతను దుఃఖముచేతను, వెక్కుచున్ = వెక్కివెక్కి యేడ్చుచు, మెయిన్ = దేహమునందు, కల...లక్ష్మిల్-కల=కలిగిన, విలాస=ప్రియులను జూచినపుడు కనుబొమ్మలు మొదలగువాని చేతలవలన వెల్లడియగు సొబగు, విభ్రమ=మదనావేశమునఁ గలుగుతొట్రుపాటు, భూషణముల వ్యత్యస్తముగఁ దాల్చుట, (లోనగువాని) లక్ష్మిల్ = సంపత్తులు, తక్కుటయున్ =

లేకపోవుటయును, ఒకయొఱపై = ఒకరీతిచక్కఁదనమై, నెక్కొనఁగ౯ = స్థిరముకాఁగా, ధరణీశునెదుర౯ = స్వరోచి కెదుట, నిలిచి, వినీతి౯ = వినయముతో.

విలాసలక్షణము.—

“ప్రియసంప్రాప్తిసమయే భ్రూనేత్రాననకర్మభిః
తాత్కాలికో విశేషో య స్స విలాస ఇతీరితః.”

విభ్రమము.—

“ప్రియాగమనవేళాయాం మదనావేశసంభ్రమాత్
విభ్రమాంగదకాంచ్యాది భూషాస్థానవిపర్యయః.”

(రసార్ణవసుధాకరము.)

తా. వెక్కువెక్కు యేడ్చుచు శృంగారచేష్టాభావమైనను నది యొక వింత సౌందర్యము కలుగునట్లు స్వరోచియెదుట నిలువంబడి (పలికె నని ముందటి పద్యములో నున్నది.)

క. పలుచనివాతెఱమెఱుఁగునఁ
బలుమెఱుఁగులు సందడింపఁ బాపటపై నం
జలిఁ జేర్చి జళుకుఁజూపులఁ
బలుకులఁ బులకండ మొలుకఁ బలికెఁ గలఁక౯. 70

టీ. పలుచనివాతెఱమెఱుఁగున౯ = పల్చనిపెదవియొక్క కాంతిలో, పలుమెఱుఁగులు = దంతకాంతులు, సందడింప౯ = కలిసియతిశయింపఁగా, పాపటపై౯ = సీమంతముపై, అంజలి౯ = మోడ్పుఁగేలును, చేర్చి = ఘటించి, జళుకుఁజూపుల౯ = చంచలదృష్టులతో, కలఁక౯ = కలవరపాటుతో, పలుకుల౯ = పలుకులయందు, పులకండము = పటికబెల్లము, (రుచి) ఒలుక౯ = ఒలుకుచుండఁగా, పలికె౯ = వక్ష్యమాణవిధముగాఁ బలికెను.

వాతెఱ యెఱ్ఱగా నుంటచే దానికాంతులు ప్రసరింప దంతము లెఱ్ఱపడి మిగుల మనోహరముగాఁ గనుపించును. ఎఱ్ఱదాలుచే నొప్పుదంతములు

మిగుల మనోహరముగా నుండు నటుకు సుభగశబ్దము విశేషముగాఁ గవి సార్వభౌముఁడు కూర్చెను.

తే. "విభుఁడు పరిహాసమాడి నవ్వించుఁగాని
పడయలేఁడయ్యె నెన్నియుపాయములను
రాజబింబాస్యతాంబూలరాగసుభగ
దంతకురువిందమాలికాదర్శనంబు." (శృం. నై. ఆ 7-వ 173.)

ఇటులె కాళిదాసమహాకవియుఁ జెఱ్ఱగా నున్న పెదవియొక్కయుఁ దెల్లగా నున్న దంతములయొక్కయుఁ గాంతిని లోకోత్తరముగా వర్ణించెను.

శ్లో. పుష్పం ప్రవాలోపహితం యది స్యాన్ముక్తాఫలం వా స్ఫుటవిద్రుమస్థం,
తతోఽనుకుర్యాద్విశదస్య తస్యాస్తామ్రౌష్ఠపర్యస్తరుచః స్మితస్య."
(కుమార. ప్రథమసర్గ.)

తా. వాతెఱమెఱుఁగులును దంతముల మెఱుఁగులును గలిసికొను నట్లుగా, నాదలఁ గేలుదోయి చేర్చి భయపడి దిక్కులు చూచుచు కలవరపాటుతో స్వరోచిఁ గూర్చి యొకమాట చెప్పెను.

శా. ఓరాజన్యమహేంద్ర యోమణిగణప్రోతాసివాతాశన
ప్రాజ్యత్కటిచక్ర యోముఖరశార్ఙ్గక్రూర బాహార్గళా
యోరుక్మాచలకల్ప యోకవచితపూర్వార్ధాంగ కావంగదే
యోరావుత్తశిరోమణీ నిరవధిప్రోద్యత్ప్రతాపారణీ. 71

టీ. ఓరాజన్యమహేంద్ర = ఓభూపాలరత్నమా, ఓమ...చక్ర—ఓఓయి, మణిగణ=మణులచేత, ప్రోత = చెక్కఁబడిన, అసివాతాశన=పాము వలె నున్న కత్తిచే, ప్రాజ్యత్ = ప్రకాశించుచున్న, కటిచక్ర = చక్రాకారములుగా నున్నపిఱుదులు గలవాఁడా, ఓ...బాహార్గళా—ఓ, ముఖర = ధ్వని చేయుచున్న, శార్ఙ్గ = ధనుస్సుతోఁగూడిన, క్రూర = కఠినములగు, బాహార్గళా = తలుపుగడియకఱ్ఱలవంటి భుజద్వయము గలవాఁడా, ఓరుక్మాచల

కల్పా = ఓ బంగరుకొండవంటివాఁడా, అర్థులకుఁ గామితము లొసంగుటలో బంగరుకొండవంటివాఁడ వనియుఁ గొండవంటి ధైర్యముగలవాఁడ వనియు భావము. ఓకవచితవ్యూఢాంగ = ఓ మైమఱువుఁ దాల్చిన ఘనశరీరము గలవాఁడా, ఓరాహుత్త శిరోమణీ = ఓరాజపుత్రులందఱిలోన తలకట్టా, నిరవ...రణీ-నిరవధి=హద్దులేని, ప్రోద్యత్=మిగుల వెలుఁగుచున్న, ప్రతాపద ప్రతాపమునకు, అరణీ=అగ్గిద్రిప్పెడు పుడకలవంటివాఁడా, (అరణి=అగ్నిమంథపుకఱ్ఱ, ఇక్కడఁ బ్రతాపము నరణి యని చెప్పుటచేఁ బ్రతాపమును నిప్పుగా భావింపవలయును.) కావం గదే = రక్షింపుమా.

ఖడ్గముపిడి పాముతలను మిగిలినభాగము పాముదేహమును బోలి యుండెను. పాముతలపై మణులుండునటుల ఖడ్గమునకుఁ గూడ మణులు చెక్కఁబడి యుండెను గాన "మణిగణ ప్రోతాసివాతాశన" పద మెంతయు నొప్పియున్నది.

ప్రతాపము విరోధులకుఁ దాపకారి గావున నగ్నిగా వర్ణించుట కవి సమయము. అలం. ఉపమ, రూపకము.

తా. రాజేంద్రుఁడవు, రత్నస్థగిత సుగుపెద్దకత్తిఁ దాల్చితివి, ధనుర్ధారివి, (కాంతిని, ధైర్యమున) మేరువువంటివాఁడవు, రౌతులమిన్నవు, తేజశ్శాలివి (కావున,) నను రక్షింపు మని (కోరె నని) తాత్పర్యము.

క. అనినఁ దలంపున నింపిన
యనుకంప నిలింపచంపకామోదసుతుం
డనునయ మొప్పఁగ నోడకు
మని నిజవృత్తాంత మడుగ నది యిట్లనియెన్. 72

టీ. అనినన్ = రక్షింపు మని (ఆవనిత) పలుకఁగా, నిలింపచంపకామోదసుతుండు = సంపెఁగతావివంటి మేనితావిగల వరూథినిపుత్రుఁడు, (స్వరోచి), తలంపునన్ = మనస్సులో, నింపినయనుకంపన్ = నిండఁజేసిన

కృకతో, అనునయము = ఊఱడిల్లఁజేయుట, ఒప్పఁగన్ = వెలయుచుండఁగా, ఓడకుము = వెఱవకుము, అని, నిజవృత్తాంతమున్ = ఆకోమలి వార్తను, అడుగన్ = ప్రశ్నింపఁగా, అది, ఇట్లనియెన్ = ఈరీతిగా నుత్తరము చెప్పెను.

తా. స్వారోచి యాకాంతపై దయగలిగి నీవు భయపడకు మని యూఱడించి నీ వెవ్వరు సంగతి యే మని యడిగిన నామె యిట్లు చెప్పుచున్నది.

సీ. విసుమానములు గాఁగ వసతోడఁ బెనవెట్టి
  నెట్టెంబుగాఁ బ్రేవుఁ జుట్టినాఁడు
బఁడికండెనచాయ బైసిమాలిన మేన
  మెదడుగందపురొంపి మెత్తినాఁడు
కనకఖంపుడాచేతిపుఱ్ఱకప్పెర నిండఁ
  బ్రాణికోటులనల్లఁ బట్టినాఁడు
కొంకిబికి వేసంపుగూనిమూఁపులమీఁద
  మూఁడుపంగలయీఁటె మోపినాఁడు
తే. సిట్టతాడనఁ బొడవుచే నిక్కినాఁడు
నిడుదకోఱల మిడిగ్రుడ్ల నెగడినాఁడు
నరవరోత్తమ నేఁడు మూఁనాళ్ళనుండి
యసుఱు గొన వెంటఁ దిరిగెడు నసుర యొకఁడు. 73

టీ. నరవరోత్తమ = ఓరాజతిలకమా, విసుమానములు గాఁగన్ = ఎగుడుదిగుడుగా (విసుమానములు = హెచ్చుతగ్గులు బ్రౌఢదొరవారి ప్రతిలోని పాఠము.) వసతోడన్ = క్రొవ్వుపొరలతో, పెనవెట్టి = గుట్టఁబెట్టి, పిరివెట్టి, నెట్టెంబుగాన్ = గుండ్రముగానుండు తలగుడ్డవలె, ప్రేవున్ = ప్రేఁగులను, చుట్టినాఁడు = చుట్టలుగాఁ దలకుఁ జుట్టుకొనినాఁడు. బండికండెన చాయన్ = బండియిరుసునకుఁ బట్టియున్న మడ్డిమసివంటి, బైసిమాలిన

మేనన్ = సొంపులేనియొడలిపై, వికృతాకారముగల దేహమునం దనుట. మెదడుగందపురొంపి = (జంతువుల) మెదడు అను చందనపంకమును, మెత్తినాఁడు = దట్టముగాఁ బూసికొనినాఁడు. ఆరినకొలఁది మదలమరలఁ బూయుంట మెత్తుట యందురు. కునఖ...కర్పర - కునఖంపు = పుప్పిగోళ్లుగల, డాచేతి = ఎడమచేతిలోని, పుఱుకకర్పరన్ = కపాలపాత్రమును, నిండన్ = నిండునటుల, ప్రాణికోటులనల్లన్ = జంతుజాలములరక్తమును, పట్టినాఁడు = నించినాఁడు, పోసికొనినాఁడు, కొక్కిబికి = వికృతరూపముగా నున్న, వేసంపు = వేషముగల, గూని = గూనులుగల, మూఁపులమీఁదన్ = అంసములమీఁద, మూఁడుపంగలయీఁటెన్ = మూఁడుచిలువలుగా నున్నబల్లెమును (త్రిశూలమును), మోపినాఁడు = ఆనించిపెట్టుకొనినాఁడు, నిట్టతాడనన్ = మిగులఁ బొడవైనతాటిచెట్టువలె, పొడవుచేన్ = ఔన్నత్యముచే, నిక్కినాఁడు=నిగిడినాఁడు, నిడుదకోఱలన్ = దీర్ఘములైన దంష్ట్రలచేతను, మిడిగ్రుడ్లన్ = మీఁదికిఁ బెరిఁగిన నేత్రకోణములచేతను, నిగడినాఁడు = అతిశయించినాఁడు, విఱ్ఱవీఁగుచున్నాఁ డనిభావము. అసురయొకఁడు=దానవుఁడొక్కఁడు, నేఁడు మూనాళ్లనుండి=నేఁటికిమూఁడునాళ్లనుండి, ఉసుఱుగొనన్ = నాప్రాణములం గుచ్చుకొనుటకు, నన్నుఁ జంపి భుజించుటకొఱకు, వెంటఁ దిరిగెడున్ = నన్ను వెంబడించి సంచరించుచున్నాఁడు.

నల్లనివస్తువు లన్నింటికంటె మిగులనల్లనిది బండికండెన. శ్రీనాథుఁడును మిగులనల్లని కలిదేహమును వర్ణించునపుడుగూడ నిటులె,

సీ. “బండికండెనతోడఁ బ్రతివచ్చుమైచాయ
నీలిపచ్చడముతో మేలవింప.” (శృం. నై. ఆ. ౭.)

నెట్టె మన గుండుకలపాగ యనుటకు.—

సీ. “తనయుడుగుండమ్ములను రాచనెట్టెంపుఁ
గులదిండిరాతుమ్మెదలు చెలంగ.” (యయాతిచరిత్రము, ఆ. ౧.)

తా. ఒక్క రాక్షసుఁడు, క్రొవ్వుబోరలు ప్రేవులుఁ దలఁకుఁ జుట్టుకొని, మసిమంటియసహ్యమైనవాసన గంధమువలె మెదడు పూసికొని, యెడమ చేతిలో నెత్తురునించిన పుఱ్ఱె పట్టుకొని, మూఁపులపైఁ ద్రిశూలము బెట్టుకొని పెడదకోఱలును, మిడిగ్రుడ్లును, నిట్టతాడువంటి మొనలును గలిగి నవ్వుఁ జూపుటకు మూఁడుదినములనుండి వెన్నాడి వచ్చుచున్నాఁడు. అలం. స్వభావోక్తి, నిదర్శన, రూపకము, ఉత్ప్రేక్ష.

క. ఏయెడ ననదల మొఱ వా
లాయము విననలయు 'దుర్బలస్య బలం రా
జా' యన వినవే ధరణీ
నాయకులకు నార్తరక్షణంబులె క్రతువుల్. 74

టీ. ఏయెడన్ = ఎల్లప్పుడును, అనదల మొఱ = దిక్కులేనివారి దైన్యంపు మొఱను, వాలాయము = తప్పకుండ, విననలయున్ = ఆదరింప వలయుం గదా. దుర్బలస్య = బలములేనివానికి, రాజా = రాజే, బలం = బలము, అనన్ = పెద్ద లిట్లు చెప్పుచుండఁగా, వినవే = నీవు వినియే యుంటివి గదా! ధరణీనాయకులకున్ = భూపాలురకు, ఆర్తరక్షణంబులె = ఆర్తులను (దీనులను) గాపాడుటలె, క్రతువుల్ = రాజు లొనర్పవలసిన యశ్వమేధాదులవంటివి. (దీనులం బోషించినఁ గ్రతువు చేసినంతఫల మని తాత్పర్యము). అలం. కావ్యలింగము, రూపకము.

తా. ఓరాజేంద్రా! నేను దిక్కులేని దీనురాలను. ఆర్తురాల నగు నామూఁడుకుయ్యి నాలింపవలయును. బలములేనివారికి రాజేబలము (ఆధారము). రాజులకు దీనసంరక్షణము యజ్ఞనిర్వాహణమువంటిది.

క. మరుదశ్వపుత్రి కిందీ
వరాక్షగంధర్వరాజువలనఁ బొడమితిన్
నరవర వెలసితిఁ గళలం
దు రమించుటఁజేసి భువి మనోరమయనఁగన్. 75

టీ. నరవర = నృపా, మరుదశ్వపుత్త్రికిన్ = మరుదశ్వుఁ డను పేరు గల గంధర్వునికుమార్తెను, ఇందీవరాక్షగంధర్వరాజువలనన్ = ఇందీవరాక్షుఁ డను గంధర్వపతివలన, పొడమితిన్ = జన్మించితిని. కళలందున్ = చతుష్షష్టికళలయందును (అఱువదినాల్గువిద్యలయందును), రమించుటఁ జేసి = వ్యాసంగము చేయుటంబట్టి, భువిన్ = ఈభూలోకమందు, మనోరమ యనఁగన్ = మనోరమ యను నామమున, వెలసితిన్ = ప్రసిద్ధిపొందితిని.

తా. నాతండ్రి యిందీవరాక్షుఁడు (అనుగంధర్వుఁడు). నాతల్లి మరుదశ్వునికొమార్తె. నే నన్నికళలయందును రమించుచుండుటచే నాకు మనోరమ యని పేరు వచ్చె.

శా. రారాపిల్ల భుజాంగదంబులమణుల్ రాలంగ విద్యాధరుల్
గారా మొప్పఁగ నెత్తికొందు రను నంకస్థాయినిం జేయఁగా
వారిన్ వీడ్కొని సింహపీఠికఁ జలత్వం బొందు మాతండ్రి మం
జీరం బించుక ఘల్లు మన్న నవి దాఁ జెప్పంగ నిం కేటికిన్.

టీ. విద్యాధరుల్ = విద్యాధరులను దేవజాతివారు, రారాపిల్లన్ = (తొలుత నే నెత్తుకొనవలయును నే నెత్తుకొనవలయు నను తమకముచే) ఒకరి నొకరు త్రోసికొని వచ్చుటచేఁ గలిగిన యొకపిల్లవలన, భుజాంగదంబులమణుల్ = భుజకీర్తులలోనిమణులు, అంగదములు రత్నములు చెక్కినవి గాన నొరపిడిచే, రాలంగన్ = రాలిపోవుచుండ, గారాము = ముద్దు, ఒప్పఁగన్ = ఒప్పునట్లు, నన్నున్, ఎత్తికొందురు = ఎత్తుకొని యాడింతురు, మాతండ్రి = మాయయ్యయొక్క, మంజీరంబు = కాలియందె, ఇంచుక ఘల్లుమన్నన్ = ఎంతస్వల్పముగా చప్పుడైనను, (నేను వడకూర్చుచుంటి నను సూచన దెలిసినంతన కందిపోవునేమో యని) అంకస్థాయినిం జేయఁగాన్ = తనతొడమీఁదఁ గూర్చుండఁబెట్టుకొనినదానినిగాఁ జేయుటకు, (తొడపైఁ జేర్చి కూర్చుండఁబెట్టుకొనుటకు) (అంకస్థాయినిగాఁ గొల్వులోవారికిన్ = ఒడియందున్నదాననగుటకుఁ గొలువు

కూటమునందున్న వారిని. ఇది బ్రౌనుదొరవారి ముద్రిత ప్రతిలోని పాఠము) వారిన్ = ఆయెత్తుకొను విద్యాధరులను, పిడుగ్రాకి=తొలఁగిపోవుఁడని, సింహ పీఠికన్ = సింహాసనమునందుండి, చలత్స్వాంతుండనై = చలించుచు. లేచి వచ్చు నని భావము. అవి=ఆయుద్ధములను, తాన్=నేను, ఇరకన్ = ఇట్టి స్థితిలో - ఈదురవస్థనొందుసమయమునందు, చెప్పంగన్=చెప్పుట. ఏటికిన్= ఏల? చెప్పుకొనుట శ్లాఘ్యోత్కర్షయో గాని ఫలము లేదు. ఒకదాని నొకటిగాని ఒకరి నొకరు గాని రాచికొనినంత గలుగు రాపిడి రారాపిడి యందురు. దీనికి శ్రీనాథుఁడు,

సీ. "రతిదేవి చెన్నొందు రారాపుఁజన్నులు." (శృంగా. ఆ. 7)

తా. ఒకరొకరు నేను నే నని విద్యాధరు లొత్తిడిపెట్టుచువచ్చి తమ భుజాంగదమ్ములందలి రత్నములు రాలుచుండ నన్నెత్తుకొనుచుండిరి. నాతండ్రి నాకాలియందె గొంచెము ధ్వనిచేసినంతనే, నన్నెత్తి తొడమీఁద నుంచుకొని సింహాసనముమీఁదనుండి లేచి విద్యాధరుల నందఱ తొలఁగుఁడు తొలఁగుఁ డని వారించును. ఆవెనుకటియుద్ధము లన్నియుం నిపు డీస్థితిలోఁ జెప్పుకొనుటవలన నాకు లాభ మేమి? అలం-స్వభావోక్తి, ఆక్షేపము, ఉదాత్తము.

తే. దేవ పార్ష్ణిపట్టి కళావతియును
నల్లమందారవిద్యాధరాత్మజన్మ
యగువిభావసియును నాకుఁ బ్రాణసఖులు
వారు నేనును నొకనాఁడు గారవమున. 77

టీ. దేవ=రాజా, పార్ష్ణి పట్టి=పారుఁడను ఋషికొమరిత, కళావతి యును=కళావతియను పేరుగలకన్నెయు, అల్ల...జన్మ-అల్లు=సుప్రసిద్ధుఁడైన, మందార = మందారనామము గల, విద్యాధర = విద్యాధరుని, ఆత్మజన్మ = పుత్త్రిక, అగువిభావసియున్=అయినట్టి విభావసియను నామముగలకన్యకయు, నాకుఁ బ్రాణసఖులు=నా ప్రియసఖులు (నెచ్చెలులు), వారున్=ఆయిద్దఱును

నేనును, గారవమునన్=అన్యోన్యానురాగముతో, ఒకనాఁడు=ఒకానొకదినము నందు. (పా. నాదుప్రాణసఖుల్) మార్కండేయపురాణమునందు విభావరి యని చెలికత్తె పేరు చెప్పఁబడెను.

తా. నాను పాదుఁ డను ఋషికిఁ బుత్రిక యగు కళావతియును, మందారుఁ డను విద్యాధరునకుఁ బుత్రియగువిభావసియును బ్రాణపదమువంటిచెలిమికత్తెలు. వారును నేనును గలిసి యొకానొకదినమున మిగుల నుత్సాహముతో (మీఁదిపద్యముతో నన్వయము.)

సీ. నెత్తము లేకొండనెత్తములం దాడు
    విద్యాధరీకోటి విటులతోడ
  నేచటిగాడ్పులఁ బుట్టువిచికిలామోదంబు
    శబరకాంతలకుట్టు పళ్లఁబెట్టు
  నెన్నగేంద్రపుఁజఱులఁ మిన్నంది పెన్నంది
    కోరాడుఁ దనగుబ్బకొమ్ము లొడ్డి
  యొందుండు గురివెందపందిళ్ల పూఁదేనె
    జడి యిందుశిలలందు జాలువాఱు
తే. నట్టికలధౌతశిఖరిఁ బుష్పాపచయము
  సేయు వేడుకఁ బొదరిండ్ల చాయలందుఁ
  దిరుగుచుండి యొకానొకదెసఁ ద్రృణంబు
  దళముగా వాత మొలచినబిలమునందు. 78

టీ. ఏకొండనెత్తములందున్ = ఏపర్వతముపైనున్న సమానపుప్రదేశములందు, విద్యాధరీకోటి = విద్యాధరవనితాగణము, విటులతోడన్ = తోడికాంద్రగువిటకాంద్రతో, నెత్తములు=ద్యూతములను, ఆడున్ = ఆడుచుండునో, ఏచటిగాడ్పులన్=ఏకొండమీఁదిగాలిచే, పుట్టు...దంబు-పుట్టు=పుట్టుచున్న, విచికల = చిన్నచుత్తెపువ్వుల, ఆమోదంబు = వాసన, శబరకాం

కలగట్టు = చెంచెతలరహస్యమును, సల్లఁబెట్టుక్ = వీడఁజేయుచుండునో (ఆపుష్పములపరిమళము వారికిఁ గల మన్మథోద్రేకమును మఱుఁగుపఱచికొను టలోఁ గల నేర్పునంతయుఁ దొలఁగించుచున్నదనుట. మన్మథతాపముకలిగించు చున్న దని భావము.) ఎన్నఁగొండ్రపుఁజఱుల్ = పిఁగట్టులరాయచఱియలను, పెన్నంది = పెద్దనంది - శంకరునివాహన మగు నందీశ్వరుఁడు, మిన్నంది= మిన్నుముట్టి (ఉవ్వాంగి), తలగుబ్బకొమ్ములు=తలుపుగుబ్బలవంటి తన కుఱుచ కొమ్ములను, (గుబ్బ లనఁ దలుపుల మొలకువానికి వేయుంచవి), ఒడ్డి = ఒగ్గి, కోరాడుక్ = పొడిచియాడునో (వృషభము మొదలగు కొమ్ములు గలవి మంటిదిబ్బలు మొదలగువానిని పొడిచి మన్నుఁ జిమ్ముట కలదు), ఎందుక్ = ఎచ్చోట, ఊడు...జడ-ఊడు = ఊడుపట్టి. గుఱివెందవుదిల్ల = గురువెంద తీఁగలల్లుకొనిన కాయమానములవలనం బుట్టెను, పూఁదేనెజడి=పువ్వులలోని మకరందవృష్టి, ఇందుశిలలందుక్ = చంద్రకాంతపు ఱాలపై, జాలుం వాఱుక్ = పఱవలై పాఱుచుండునో, అట్టి కలధౌతశిఖరిక్ = అటువంటి కైలాసపర్వతశిఖరకూటమునందు, పుష్పాపచయము చేయువేడుకక్-పువ్వు= పూవులయొక్క, అపచయము చేయు వేడుకక్ =కోయుటయందైననంతసముచే, పొదరిండ్ల చాయలందుక్ = ఇండ్లవలెనున్న పొదలప్రక్క, తిరుగుచుండి = సంచరించుచునుండి, ఒకానొకచోటక్ = ఒక్కచోట. తృణంబు = పూరి, దళముగాక్ = ఒత్తుగా, వాతక్ = ముఖప్రదేశమునందు (ముందు భాగము నందు), మొలచినబిలమునందుక్ = పెరిఁగినగుహాలో, (అన్వయము ముందు న్నది.) విద్యాధరకాంత లసంఖ్యాకలు, విటులు నటులె యసంఖ్యాకులు. వీరలందఱు విమానములతో సంచరించుకతన నాకొండపైఁగల విశాలశిఖర మాక్రమించి వాదములాడఁ బురికొల్పుచుండెను. విటులతో నాటలు గాన నేఁడంట కాఁజంటగా నాడుకొనవలయును. ఇందలి క్రీడాదికమునకు నెత్త మనుకూలముగ నున్న దనుట. శిఖరములందు శిల్పులు, మేఖలలయందుఁ శబరకాంతలుఁ జఱియలయందుఁ బశుగణము, క్రిందిభాగమునందుఁ బోద

రిం డ్డుంటచే హిమాలయము స్త్రీలకుఁగూడ విహారయోగ్యముగా నున్న దని భావము.

తా. తమవిటులతో విద్యాధరకాంతలు జూదమాడు చదునులుగల యట్టియు, శబరస్త్రీలకు మన్మథోద్రేకముం బుట్టించు చిఱుమల్లెపూలవాసనతో నిండిన వాయుంవులుగలట్టియు, శివుని వాహనమైన వృషభము తనకొమ్ములతోఁ బొడిచి యాడుచున్న శిఖరములుగలట్టియు, సురిపొందలనుండి వెడలుపువ్వురజము కాలువలు చంద్రకాంతశిలలు గలట్టియు, వెండికొండపై మేము మువ్వూర మును బూవులుకోయుచు నొకానొకచోట గడ్డిచే మూసికొనిపోయిన ద్వారముగలగుహయందు (ముందుపద్యములో నున్న జీర్ణమునిని గాంచితి మని తాత్పర్యము.) అలం. ఉదాత్తము.

ఉ. ఊసరవెల్లి చందమున నొక్కట బీఱనరాలు దేఱఁగా
మీసలు గడ్డముల్ జడలు మే నుదరంబును వీనులున్ జరా
ధూసర మైనరోమతతితోఁ బెనఁగంబడి దూది రాశిగాఁ
జేసినరీతి నున్న యొకజీర్ణమునిన్ గని కౌతుకంబునన్. 79

టీ. ఊసరవెల్లిచందమునన్=ఊసరవెల్లి యను నొకవిధ మగు తొండ వలె, (ముదిరినతొండ నూసరవెల్లి యందురు.) ఒక్కటన్=ఒక్కవిధముగా, బీఱనరాలు=పెద్దవియగునరములు, తేఱ గాన్=స్పష్టముగా నగపడుచుండఁగా మీసలు = మీసములు, గడ్డముల్, జడలు, మేను = దేహమును, ఉదరంబున్=బొజ్జను, వీనులున్ = చెవులును, జరాధూసరము=వృద్ధత్వముచే నరయ నారంభించినది (ధూసర మన బూడిదరంగు; వెండ్రుకలు చాలవఱకు నరసి కొలఁదిగ నరయకుంటచే నామిశ్రవర్ణము ధూసరము.) ఐనరోమతతితోన్=అయినట్టిరోమములసముదాయముతో, పెనఁగంబడి=కూడుకొనఁబడి, దూది, రాశిగాన్=ప్రోవుగా, చేసిన రీతిన్ = చేసినయట్టుల, ఉన్న యొక జీర్ణమునిన్=ఉండినయొక ముదిసినమునీంద్రుని, చూచి, కౌతుకంబునన్= వేడుకతో, అన్వయము పైపద్యమునం గలదు.

తా. రక్తమాంసములు క్షీణించుటచే నరములన్నియుఁ బయటికిఁ గానవచ్చుచు. నొడలినిండ నున్న వెండ్రుకలన్నియు నరయుటచే దూదిరాశి వలె నున్న యొకవృద్ధుఁ డగుబుషీశ్వరుం జూచి కుతూహలముతో, అలం: ఉపమ. ఉత్ప్రేక్ష. స్వభావోక్తి.

ఆ. ఇతనివదనకుహర మెద్ది నేత్రద్వయం
బెద్ది కర్ణయుగళ మెద్ది యనుచు
బూచివోలె నున్న వాచంయమునిమోము
బాల్యచాపలమునఁ బట్టుటయును. 80

టీ. ఇతనివదనకుహరము = ఈమునియొక్క ముఖబిలము (నోరు), ఎద్ది = ఎక్కడ నున్నది? నేత్రద్వయంబు = కన్నుఁగవ, ఎద్ది = ఎక్కడ నున్నది? కర్ణయుగళము = వీనుదోయి, ఎద్ది = ఎక్కడ నున్నది? అనుచున్ = అనుకొనుచు, బూచివోలెన్ = భూతమువలె, ఉన్నవాచంయమునిమోము = ఉన్నట్టి మౌనివదనమును, బాల్యచాపలమునన్ = చిన్నతనపుఁజంచలత్వముచే, పట్టుటయున్ = పట్టుకొనఁగానే, దూదిబుంగవలెఁ గానవచ్చుటచే నెం దేయవయవములు గలవో చూడవలయు నని కౌతూహలము గలిగెను. మహామునుల జోలి కటులఁ బోవచ్చునా యనుటకుఁ బరిహారము బాల్యచాపలము.

తా. బూచివలె నున్నకారణమున నోరు, కన్నులు, చెవులు, నీతని కున్నవా లేవా యను సందేహము గలిగి యెటనెట నేయవయవములు గలవో పరిశీలించుద మని చిన్నతనపుఁజంచలబుద్ధిచేఁ బట్టుకొంటిని.

క. ధ్యానస్తిమితుం డగుట
న్మౌని మదీయాంగుళీవిమర్శనములచే
మే నెఱిఁగి తొంటియనుసం
ధానము చెడి కన్ను దెఱచి దారుణఫణితిన్. 81

టీ. ధ్యానస్తిమితుండు = నిశ్చలధ్యానముగలవాఁడు, ఆసంయమ్యాని= ఆయొకయోగాముని, మదీ...చేఁన్ - మదీయ = నాదియగు, అంగుళీ = చేతి వ్రేళ్లయొక్క, విమర్శనములచేఁన్ = ఎక్కుడుస్పర్శవలన, మేను ఎఱింగి=ఒడలు తెలిసి, తొంటియనుసంధానము = మొదట నున్ననిష్ఠ, చెడి = చెడిపోయి, కన్నుఁదెఱచి, దారుణఫణితిన్=కఠినవాక్యములతోఁ గూడినరీతిగా, "మనుఁదు కొను" అనుపద్యములోని పలికె అను క్రియతో నన్వయము.

ధ్యానలక్షణము.—

ధ్యానము సగుణము నిర్గుణము అని రెండువిధములు. హృదయపద్మము నందు తటస్థలక్షణస్వరూపుఁ డయిన విరాట్పురుషుని నిలిపి మనస్సుచే షోడశోపచారము లొనర్చి పూజించుట సగుణధ్యానము.

శరీరత్రయమును ఇంద్రియములును నేను గానని సర్వదృక్కగుపర బ్రహ్మము తానను దృఢము కలుగుదనుక నెల్లప్పుడు నిర్వికల్పనిష్ఠగలిగి యుండుట నిర్గుణధ్యానము. (చూ. సీతారామాంజనేయము ప్ర.)

తా. నాచేతివ్రేళ్లు గట్టిగాఁ దగులుటచే ధ్యాననిష్ఠ చెడి కన్నులు విచ్చి చూచి నన్నుఁగూర్చి దారుణముగా (ఏదియో పలికె నని తాత్పర్యము.)

ఉ. ఓసి దురాత్మురాల గృహమొల్లక సర్వసుఖంబులున్ నిరా
యాసమునన్ దొఱఁగి మిహిరాంశుమరుచ్ఛదనీరనీరస
గ్రాసము దేహధారకముగా గుహలన్ దపమాచరించుమ
మ్మాసరణిన్ స్పృశించి నగ నేమిఫలంబొనఁగూడెఁ జెప్పుమా.

టీ. ఓసిదురాత్మురాల = ఓదుష్టస్వభావముగలదానా! గృహము = ఇల్లు, ఒల్లక=ఇష్టపడక, బంధము లని యిల్లువాఁకిలిని విడిచిపెట్టి, సర్వసుఖంబులున్ = సమస్తసౌఖ్యములను, నిరాయాసమునన్ = తేలికగా, (సుఖత్యాగము మిగులఁ గష్టమైనను వైరాగ్యదృష్టిచే నాయాసములేకయే వదలిపెట్టియనుట) తొఱంగి = వదలి, మిహిరాంశు...గ్రాసము - మిహిర =

సూర్యుని, అంశు=కిరణములను, మరుత్ = వాయువును, ఫల=పత్రములును, శీకర = నీటిని (తుట్టి), నీరస = నిస్సారమైన, గ్రాసము = తిండి, దేహాధారకము = మేను నిల్పునది, కాక = కాగా, గుహలన్ = కొండబిలములలో, తపము = తపంబు, ఆచరించు మమ్మున్ = చేసికొనుచుంటిమావంటి వారిని ఈసరణిన్ = ఈప్రకారముగ, స్పృశించి = చేతితోముట్టికొని, నగన్ = నవ్వుటచే, ఏమిఫలంబు = ఎట్టిలాభము, వినంగూడెన్ =దొరకెనో, చెప్పుమా!

తా. ఓమదాత్తురాలా! ఇల్లు విడిచి సంసారబంధములను సమస్తసుఖములను ఇంచుకేని యాశింపక సంతోషముగా విడిచిపెట్టి గుహాలలో నుండి సూర్యకిరణములు, వాయువు, ఆకులు, నీరు, నిస్సారమగు నాహారము ప్రాణధారణకు వలసినంతమాత్రముగా గ్రహించుచుఁ దపస్సుచేసికొను మమ్ము బోఁటివారిని దాఁకుటవలన నీకేమి మేలు గలిగెనదో చెప్పుము.

క. తిమిరంపువయసుగుబ్బల
కొమరాలవు నీకుఁ దగినగోవాళ్లఁ మహిన్
నెమకి నగరాదె ముదిసిన
మమ్ముఁ జెనకిన నేమి కలదు మద మేమిటికిన్. 83

టీ. తిమిరం...లవు - తిమిరంపు = మద మెక్కిన—యౌవనోద్రేకముచే మంచిచెడుగు నెఱుఁగఁజాలక కనులకుఁ జీకటులు క్రమ్మిన, వయసు = వయస్సునందలి, గుబ్బల = బిగువైన గుబ్బలఁబోలు చన్నులు గల, కొమరాలవు = పడుచుదానవు, మహిన్ = భూమియందు, నీకుఁ దగినగోవాళ్లన్ = నీవయస్సునకుం దగినమిండగానిని, నెమకి = వెదకి (గ్రహించి), నగరాదె = వెదకిచూడరాదా!, ముదిసినమమ్మున్ = ముసలివాండ్రమైన మావంటివారిని, చెనకినన్ = స్పృశించఁగా (పట్టుకొనఁగా), ఏమి కలదు = ఏమిప్రయోజన మున్నది? ఇంతక్రొవ్వేమిటికిన్ = ఇంతకండకావరము తగునా యనుట.

కొమరు = యౌవనము. యౌవనముగలచెలువ కొమరాలు. కొమరాలన యౌవనవతి యని భావము ఇటు లనుటకు.—

తే. "చాలముద్దరాలు జవరాలు కొమరాలు" (భాగ. స్కం. 9)

తా. నీవు నిండుకొనియున్న యౌవనాంధకారమునఁ గనులు గానక తిరుగుచున్నావు. మునులు నీ కెందు కుపకరింతురు? కావున నీకుం దగిన వరునితోఁ బరిహాసము లాడుము. ముసలివాఁడను నన్నుఁ జూచి పరిహసించుట నీ మదగర్వమును సూచించునే కాని నీ కింతయుం లాభము గానరా దని తిరస్కారము.

క. ముసురుకొనుజరభరంబున
నసురుసురై యున్న మమ్ము నడకించితి వి
ట్లుసురు మనఁ బట్టువడు మొక
యసురకు నీవనుచుఁ బలికె నాగ్రహ మెసఁగన్. 84

టీ. ముసు...భరంబునన్-ముసురుకొను=చుట్టుకొనిన, జర = ముదిమి యొక్క, భరంబునన్ = ఉద్రేకముచేత, అసురుసురై = అలసియలసి, ఉన్న మమ్మున్ = ఉన్నమమ్ము, ఇట్లు, అడకించితివి = పరిహాసముచేసితివి (బాధించితివి కావున), ఉసురుమనన్ = ఉస్సురనునట్లు, నీవు, ఒకయసురకున్ = ఒక్కరక్కసికి, పట్టువడుము = దొరకుము. అనుచున్, ఆగ్రహము=క్రోధము, ఎసఁగన్ = ఎక్కుడుకాఁగా, పలికెను = చెప్పెను, శపించెను.

అసురశబ్దంబు వికల్పంబుగా స్త్రీసమంబగు ననమాత్రముచే నసురఁ డనియుం నసుర యనియుఁ జెప్పవచ్చును.

తా. ముసలితనమున నలసి యల్లాడుచున్న నన్నీరీతిని బరిహాసము చేసితివి గావున నీవు రాక్షసునిచేతం బడి శ్రమపడు మని శపించెను.

క. జననాథ యేమి చెప్పుదుఁ
గనలుచు నవ్వృద్ధతపసి కటము లదరఁగాఁ

తనచేతినాగబెత్తముఁ
గొని పసరముఁ గొట్టినట్లు గొట్టె నదయుఁడై. 85

టీ. జననాథ = నరపాల, ఏమి చెప్పుదున్ = ఏ నేమి యని చెప్పుదును? ఆ వ్యగ్రతపసి = ఆ ముసలిముని, కెరలుచున్ = కోపించుచు, కటములు = కణఁతలు, అదరఁగాన్ = కొట్టుకొనఁగా, అదయుఁడై = దయ లేనివాఁడై, తనచేతినాగబెత్తమున్ = తాను చేతఁ బట్టుకొను యోగవేత్రమును, గొని = పుచ్చుకొని, పసరముఁ గొట్టినట్లు = గొడ్డును బాదినరీతిని, గొట్టెన్ = నన్నుఁ బాదివైచెను.

నాగబెత్తము అన పామువలె మెలికలు దిరిగి పాముపడగవలె నుండు కఱ్ఱ. దీనినె యోగబెత్త మందురు. ఇది మునులు లోనగు సిద్ధులవద్ద నుండు ననుటకు, దీని శిక్షాసాధనముగ నుపయోగింతు రనుటకు.—

సీ. "పడిమూర్ఛ్వాంతరిచి లేవకయుండఁ దన నాగ
బెత్తాన మూర్ధాన మొత్తిమొత్తి." (కళాపూర్ణో. ఆ. 3)

తా. ఓరాజా! నిన్నుఁ నేమి చెప్పుదును? ఆముసలిఋషి కోపముచేత (దౌడలు) కణఁతలు చలించుచుండఁగా నాగబెత్తముం గొని పశువును గొట్టినటుల నన్ను కరుణమాలి కొట్టెను. అలం. ఉపమ.

క. కొట్టువడి యటకు మునుపే
తిట్టుం బడి యేడ్చువాదువేసఁ గని మదిలోఁ
గట్టలుక వొడమి నాసఖు
లిట్టనిరి మునీంద్రుతోడ నెత్తినవెలుఁచన్. 86

టీ. కొట్టువడి = దెబ్బతిని, అటకుమునుపే = అంతకుముందే, తిట్టుంబడి = తిట్టుతిని (శాపము బొంది), ఏడ్చువాదువేసన్ = ఏడ్చుచున్న నాయవస్థను, కని = కాంచి, నాసఖులు = నా నేస్తురాండ్రు, మదిలోన్ = మనస్సులలో, కట్టలుక = ఎక్కుడుకోపము, పొడమి = జనించి, ఎత్తిన

కెలఁచన్ = అగ్రహాక్షేపముచే, మునీంద్రునితోడన్ = ఆమునీంద్రునితో, ఇట్లనిరి = ఈరీతిం బలికిరి.

తా. దెబ్బలుపడి దానికంటెఁ బూర్వమే శాపమునొంది యేడ్చు స్థితి నాచెలికత్తెలు చూచి కోప మాపుకొనలేక మునితో ముందుచెప్పఁబోవు నామాటలం బల్కిరి.

ఉ. ఓయి దయావిహీనమతి యూరక యీపసిబిడ్డఁ గొట్టఁగాఁ
జేయెటు లాడె నీకు నిది చేసిన దేమి వృథా శపింతురే
బోయవె యాఁడుదోడునను బుట్టవె శాపనిమిత్తమే తపం
బీయెడ నున్న శాంతిపరు లే మనువా రిఁక నీచరిత్రమున్.87

టీ. ఓయిదయావిహీనమతి = ఓ నిర్దయహృదయుఁడా! ఊరక = నిష్కారణముగా, ఈపసిబిడ్డన్ = ఈచిన్నపిల్లను, కొట్టఁగాన్ = కొట్టుటకు, చే యెటు లాడెన్ = నీచేతు లెట్లువచ్చెనవి? మిగుల సుకుమారియగు నీపసిబిడ్డను గొట్టుటకంటె దయమాలినపని వే ఉన్నదా యనుట. ఇది = ఇప్పసిబిడ్డ, చేసినది = ఒనర్చినతప్పు, ఏమి = ఎట్టిది? వృథా = ఊరకయె, శపింతురే = శాప మిత్తురా? బోయవె = ఎఱుకువాఁడవా? ఆఁడుఁదోడునను బుట్టవె = అక్కలుఁ జెల్లెండ్రు లేకుండ నీ వొక్కఁడవే పుట్టియుంటివా! ఆఁడుపడుచులతోఁ బుట్టినవారికిఁ గనికరము ఆఁడుపడుచులఁ బ్రేమించు విధము దెలిసియుండును. నీ వొక్కఁడవె యుట్టిపడితివి కాఁబోలు ననుట. తపంబు = నీయీతపస్సుచేయుట, శాపనిమిత్తమే = శాపములిచ్చుటకొఱకే యైయున్నదా? ఇఁకన్ = ఇంకమీఁద, నీచరిత్రమున్ = నీయొక్కయీరీతి నడవడికి, ఈయెడన్ = ఇచ్చోట, ఉన్నశాంతిపరులు తపస్సుచేసికొను చున్న శాంతిస్వభావములుగల మునీంద్రులు, ఏమనువారు = ఏమందురో (రోయుఁగుదువా.)

కొట్టుట శపించుట యీరెండును నిరాతకార్యములు. తపస్సంతన్ను ఆచరింపరానివని. తపము శాంతసాధనమునకు, శాంతిపరులగు తపస్వులే.

నీయవివేకము గనిపట్టఁగలరు. వారివలె నీవెంతవలుచనైతివో యోజింపక పోతివిగదా యని చెలికత్తెలం బలికిరి.

తా. ఓనిర్దయుఁడా! కారణము లేనిదే యీబిడ్డను గొట్టుటకు నీచేతు లెట్లాడెనది? ఏమితప్పు చేసినది? ఊరకయె శపించెదవా? దయలేక పోవుటకు (తల్లి బిడ్డ యనకుండ జంతువులం జంపు) కిరాతుఁడవా? నీకు నక్కసెల్లెండ్రు లేరా? నీవు తపంబొనర్చుట యొరులకు శాపమిచ్చునిమిత్తమేనా? ఇట్టినిన్గని శాంతిపరులైన యిక్కడ నుండు తక్కినమునీంద్రు లేమందురో తెలియుచా?

క. పాము కడు ముదిసి కడపట
గా మగుచందమున వార్ధకంబునఁ గ్రోధం
బేమియు మానక మండెడు
నాముని మునియే తలంప నదియుఁ దపమే. 88

టీ. పాము, కడున్ ముదిసి = మిక్కిలి ముదిరి, కడపటన్ = తుదకు, గామము = గ్రహము, అగుచందమునన్ = అగునట్లుగా, వార్ధకంబునన్ = వృద్ధత్వమునందు, క్రోధము = రోషము, ఏమియున్ = ఎంతమాత్రమును మానక = వదలక, మండెడునాముని = కోపవికారము కొంచెమేనియుం బాపుకొనఁజాలనిముని, మునియే = మునియేనా? తలంపన్ = ఆలోచింపఁగా, అదియున్ = కోపమును జయింపఁజాలని యాముని గావించునట్టి తపస్సును, తపమే = తపస్సేనా?

నాగుఁబాము వెయ్యిసంవత్సరములు బ్రదుకును. వేయియేండ్లు పూర్తియైన పిమ్మట రెక్కలువచ్చి గ్రహమై మనుజుల బాధించుచు, నాగుఁబాము మిడినాగనఁబడు ననునైతిహ్యము నిట ననుసంధించుకొనునది. అలం. అప్రస్తుతప్రశంస. ఉపమ

తా. పాము ముదిరి గామైనట్లు ముసలితనమునందుఁ గూడఁ గోపము విడువక చిఱచిఱలాడుచుండు నాముని యొక మునియా? అతఁడు చేయుం

నది యొకతపస్సా? (నక్కముదిరి వఱ డగుననియు, గ్రద్ద ముదిరి పులుఁ గగు ననియుఁ, బాము ముదిరి గ్రహ మగుననియుఁ జెప్పుకొందురు.)

క. పరులయపరాధగతులకుఁ
గెరలక తనుఁ బొగడుచోటఁ గీడాడెడుచోఁ
బరితోషము రోషము నెదఁ
జొరనీనితపస్వి సుమ్ము సుకృతి ధరిత్రిన్. 89

టీ. ధరిత్రిన్ = భూమియందు, పరుల...గతులకున్ - పరుల = అన్యులయొక్క, అపరాధగతులకున్ = తప్పుదారులకు, ఇతరులు తెలిసియో తెలియకయో 'చెడుత్రోవలఁ బ్రవేశించినపుడు, కెరలక = కోపము నొందక, తనున్ = తన్ను, పొగడుచోటన్ = స్తుతించునపుడును, కీడాడెడుచోన్ = నిందించునపుడును, స్తుతినిందాదులయందు సమభావముగలవాఁడై యవికారముగా మెలఁగ నేర్చి, పరితోషమున్ = సంతసమును, రోషమున్ = క్రోధమును, ఎదన్ = డెందమున, చొరనీని = చొరకుండఁజేసెడు (పుట్టకుండఁ జేయు) తపస్వి = తపంబొనర్చునతఁడు, సుమ్ము = సుమా, సుకృతి = ధన్యుఁడు.

తా. ఇతరులు తన కొనర్చిన యొగ్గులకుఁ గోపింపక, తన్నుఁ బొగడునపుడు సంతోషమును, నిందించునపుడు కోపము లేని మునీంద్రుఁడు ధన్యాత్ముఁడు గాని తక్కినవారు కా రనుట. అలం. అప్రస్తుతప్రశంస.

తే. ఒండొకఁడ వైన నిపుడ నీపిండి యడమె
బ్రాహ్మణుఁడ వౌట మాచేత బ్రదుకుఁగంటి
తడవఁ బని లేదు నిన్ను గౌతమునిగోవ
వనుచు వాదించి విడిచిన నాగ్రహించి. 90

టీ. ఒండొకఁడవు=మఱియొకఁడవు - బ్రాహ్మణేతరుఁడవు, ఐనన్ = అయితివేని, ఇపుడ = ఇప్పుడే, నీపిండి యడమె = నీదేహము పిండిచేయుమా, బ్రాహ్మణుఁడ వౌటన్ = విప్రుఁడవైన కారణమున, 'బ్రాహ్మణో నహంతవ్య' యను

ధర్మానుసారముగా, మాచేతన్ = మాచేతను, బ్రదుకఁగంటి = బ్రదుకఁగలిగి యున్నట్టియట్టి బ్రతికితివి. నిన్నున్ = నిన్ను. తడవన్ = ఇట్టివాఁడ వట్టివాఁడ వని యెంచుటకు. పనిలేదు = అవసరము లేదు. గౌతమునిగోవు = గౌతమమునియొక్క ఆవు పోలినవాఁడవు, వృద్ధుఁడవుగాన తాఁకినంతనె మరణించి మాకందరమునకు బ్రహ్మహత్యాపాతకము కలుగఁ జేయుదువు. అనుచున్ = అనిపలుకుచు, వాదించి = వాదము చేసి, విడిచినన్ = వదలఁగా, ఆగ్రహించి = (ముని) కోపమునొంది.

గౌతముని గోవుకథ:—గౌతమమహాముని ద్వాదశవర్షమహాక్షామము వచ్చినపుడు ప్రతిదిన ముదయమున లేచి తాను సిద్ధికెను వడ్లు చల్లుచుండెను. అవి యనుష్ఠానసమయమునకు మొలచి ఫలింపఁగా నన్నాతురులగు సమీపస్థులగు మునుల కేతెంచిన నవియె పక్వము చేయించి మృష్టాన్నము పెట్టుచుండెను. కఱవు తీరినపిదప మునులు తమతమ యాశ్రమముల కేఁగుచు వినాయకుని ప్రేరణచే గౌతమునిఁ దమవెంట రమ్మనిరి. రా ననుటకుఁ గినిసి యొక మాయా గోవును సృజించి పైరుపైఁ దోలిరి. గౌతముఁ డాగోవును దర్భతృణముతోఁ గొట్టఁబోవ నది మరణించెను. గోహత్యాదోష మారోపించి మును లందఱు గౌతముని లోఁబఱచికొనిరి. ఇదియె గౌతమునిగోవు.

తా. నీవు బ్రాహ్మణుఁడ వగుటచే నిన్ను విడిచితిమి. మఱియొకజాతి వాఁడ వైనఁ జంపివేయమా ! తెలిసినది. నీవు గౌతమునిగోవువంటివాఁడవు. (ఊఁదిన నెగిరిపోవునంతటివాఁడవు) అని వాదించి విడిచిపెట్టిన యాకస్యులపైఁ గోపించి.

క. ముసలి శపియించె నపుడ
యయ్యసితాబ్జేక్షణల రాజయక్ష్మక్షోభం
బెసఁగ నశియింప నగు న
ద్దెసఁ బాలుఁడు సుగుడిగామి తెల్లమియె కదా. 91

టీ. అపుడు = అప్పుడు, ముసలి = ఆవృద్ధముని, అయ్యసితాబ్జేక్షణలన్ = నల్ల కలువలవంటి కన్నులుగల పడుచులను, రాజయక్ష్మక్షోభంబు =

క్షయరోగబాధ, ఎసఁగన్ = వృద్ధిపొందఁగా, నశియింపన్=క్షీణించునట్లు, శపియించెన్ = శాపమిచ్చెను. అగున్ = (అట్టి శాపముపెట్టుట యామునియోగ్యతకు) తగును. అద్దెసన్=ఆసమయమున, పాఱుఁడు = బ్రాహ్మణుఁడు (ముని), సుగుణిగామి= మేలుగుణములుగలవాఁడు కాకపోవుట, తెల్లమియకదా= తేటగా తెలియబడుచున్నదిగదా ! (పా. సుగుణి=మంచిగుణముగలవాఁడు.)

తా. ఆసమయమునఁ గోపించినముసలిముని యాయిద్దఱను క్షయరోగముచే బాధపడుం డని శపియించెను. అది యతనిగుణమునకుఁ దగియే యున్నది. దీనింబట్టి (నీవు కూడ) యాతఁడు సరసుఁడు గాఁడని తెలిసికొన వచ్చునుగదా !

క. అరుజ యప్పుడ యయ్యం
భోరుహలోచనలఁ బొందె భూవర నన్నున్
వారత్రయమునుండియు
దారుణగతి నొక్కయసుర తఱిమెడు వెంటన్. 92

టీ. భూవర=రాజా, అప్పుడ=ఆముని శాపమిచ్చినప్పుడే, అయ్యంభోరుహలోచనలన్ = పద్మములవంటి నేత్రములుగల యాస్త్రీలను, అరుజ = అరోగము, పొందెన్ = అంటుకొనెను, నన్నున్=నన్ను, వారత్రయమున నుండి=మూఁడునాళ్లనుండి, ("నరవరోత్తమ నేఁడు మూనాళ్లనుండి" యని మనోరమ రాక్షసునిచే మూఁడుదినములనుండి బాధపడుచుంటి నని చెప్పెను గాన నిట వారత్రయమునకు మూఁడుదినము లనియె చెప్పవలయును.) ఒక్కయసుర=ఒక్కదానవుఁడు, దారుణగతిన్ = క్రూరరీతిని, వెంటన్ = నన్ను వెన్నాడి, తఱిమెడున్ = తఱుముచున్నాఁడు.

తా. నాచెలికత్తె లిద్దఱకు నా క్షయరోగ మాశపించినపుడే యంకురించినది. నన్ను మూఁడుదినములనుండి యొక్కరాక్షసుఁడు వెంబడించి

ప్రింగటకై మిగులఁ గౌరవభావముతో వెంటనంటి సేవించుకొని వచ్చు చున్నాఁడు.

సీ. ఇచ్చెద నీకస్త్రహృదయంబు నివ్విద్య
నరనాథ మున్ను పినాకపాణి
యగురుద్రుఁ డిచ్చె స్వాయంభువమనువున
కతఁ డిచ్చె మఱి వసిష్ఠాఖ్యమునికి
నతఁ డిచ్చెఁ గరుణఁ జిత్రాయుధుం డనుపేరఁ
దనరు మదీయమాతామహునకు
నతఁ డిచ్చెఁ బెండ్లియానపు దరణంబుగా
మాతండ్రి కతఁ డిచ్చె మమత నాకు
తే. సకలరిపునాశకము యశస్కరము నైన
దీని వేవేగ నాచేఁ బ్రతిగ్రహించి
యడఁపు మాదైత్యు వీరవా రనఁగ వలవ
దనఘ సద్విద్య యొందున్నఁ గొనఁగవలయు. 93

టీ. నరనాథ=జనపతీ, నీకు, అస్త్రహృదయంబున్ = అస్త్రహృదయ మను విద్యను. ఇచ్చెదన్ = నేర్పెదను, ఇవ్విద్య = ఈయస్త్రహృదయ మను విద్యను, మున్ను = పూర్వకాలమున, పినాకపాణి = పినాకమనుధనుస్సును చేతఁబట్టినవాఁడు, అగురుద్రుఁడు = అయిన శంకరుఁడు, స్వాయంభువ మనువునకున్=స్వాయంభువుఁ డనెడు మొదటిమనువునకు, ఇచ్చెన్ = ఒసం గెను, అతఁడు=ఆస్వాయంభువమనువు, మఱి=తర్వాత, వసిష్ఠాఖ్యమునికిన్ = వసిష్ఠుఁ డను పేరుగలమునికి, ఇచ్చెన్=అస్త్రహృదయము నొసంగెను. అతఁడు= ఆవసిష్ఠుఁడు, కరుణన్ = దయతో, చిత్రాయుధుండు, అనుపేరన్ = అను నామముతో, తనరు = వెలయుచున్న, మదీయ = నాయొక్క, మాతామహు నకున్ = తల్లితండ్రికి, ఇచ్చెను. అతఁడు=ఆచిత్రాయుధుఁడు, మాతండ్రికిన్,

పెండ్లియాడునపుడు = వివాహము చేయుచున్నపుడు, అరణంబుగాన్ = అల్లున కిచ్చు కట్నముగా, ఇచ్చెను. అతఁడు = మాతండ్రి, మమతన్ = ప్రేమచేత, నాకు నిచ్చెను. సకల రిపునాశకమున్ = సమస్తవిరోధిశమనమును గావించునది, యశస్కరమున్ = కీర్తిని కలిగించునదియు, ఐనదీనిన్ = ఐనట్టియావిద్యను, నాచేన్ = నావలన, వేవేగన్ = త్వరితముగా, ప్రతిగ్రహించి = పుచ్చుకొని, ఆదైత్యున్ = ఆరాక్షసుని, అడఁపుము = మ్రాదింపుము. అనఘా = పాపరహితుఁడా! సద్విద్య = మంచివిద్య, ఎందున్నన్ = ఎవ్వరియొద్దనున్నను, కొనఁగవలయున్ = తీసికొనవలయును, వీరువారు = విద్యనిచ్చువారు (ఇది యాఁడుది, యితఁడు పురుషుఁడు) ఇట్టివా రట్టివారు, అనఁగన్ = అని యాలోచించుట, వలదు = తగదు.

"నీచాదప్యుత్తమాం విద్యాం స్త్రీరత్నం దుష్కులాదపి" యను ధర్మమును బట్టి విద్య తనకంటెఁ దక్కువవా రగు నీచులనుండియుఁ, గన్యను గులహీనునినుండియుఁ బరిగ్రహింపవచ్చును. గావున బరిగ్రహింపుము. విద్యాగ్రహణమునకు యుక్తాయుక్తముల విచారించుచు నుంటివేని యసురుఁడు పైఁబడును గాన త్వరగఁ బరిగ్రహింపు మని భావము. "సద్విద్యగొనుటకు జాతి చూడకుము, సద్విద్య యెందుండనే చండాలునందు." అనునార్యోక్తి నిట ననుసంధించునది.

తా. నీకు నే నస్త్రహృదయ మనువిద్య నిచ్చెదను. ఇది నాకు శివుని నుండి క్రమాగతమై వచ్చినది. సకలశత్రు నాశనము చేయును. యశస్కరమైనది. దీనిం గొని నీవారక్కసుం జంపుము. విద్యను స్త్రీవద్దనుండి కొనుటకు సంకోచింపకుము. "నీచా దప్యుత్తమా విద్యా" యని సద్విద్య నెవరివలననైనఁ బరిగ్రహింపవలసినదే.

క. అనుటయు శుచియై నిలిచిన
జననాథునకున్ బ్రయోగసంహారంబుల్

వనిత రహస్యంబుగఁ జె
ప్పిన నాతఁడు నెఱిఁగె నంత భీషణభంగిన్. 94

టీ. అశుచయుఁడై = అనియిట్టుపల్కఁగానే, శుచియై = పాదప్రక్షాళనము నాచమనాదికములు గావించి శుద్ధుఁడై, నిలిచినన్ = మంత్రోపదేశము కొఱకు సిద్ధపడి స్వరోచి నిలువఁబడి యుండఁగా, వనిత=మనోరమ, జనవాథునకున్=స్వరోచికి, ప్రయోగసంహారంబుల్ = అస్త్రములయొక్క ప్రయోగము (ఎక్కిపై విడుచుట) సంహారము (మరలించుట) మొదలగు సాధనములను, రహస్యంబుగన్ = రెండవవారికిఁ దెలియకుండునట్లు, చెప్పినన్ = తెలియఁ జెప్పఁగా, అతఁడును=ఆరాజును, ఎఱిఁగెన్ =గ్రహించెను. అంతన్ =అంతట, భీషణభంగిన్ = భయజనక మైనవిధమున.

తా. ఇట్లని మనోరమ చెప్పఁగా నావిద్యను గ్రహించుటకై స్వరోచి శుచిగా నిలువంబడెను. ఆమె స్వరోచికి అస్త్రహృదయమును మిగుల రహస్యముగాఁ బ్రయోగించుట యుపసంహరించుట లోనగు సాధనములతోఁ గూడ నెఱింగించెను. ఇంతలో భయంకరమై. (పైపద్యముతో నన్వయము.)

మహాస్రగ్ధర. గళగర్తక్రోడనిర్యత్కహకహనినదోద్గాఢహాసం
బు భూభృద్బిలముల్ మ్రోయింపఁ గాదంబినిగతిని బొగల్
వెంప మిన్నెల్ల నైగాఁ, జలితాస్యక్రూరదంతక్షతరదవసన
క్షారకీలాలవేల్లజ్జ్వలనజ్వాలాభజిహ్వాంచలుఁడగుచు గదన్
జాళిమల్ ద్రిప్పుకొంచున్. 95

టీ. గళగర్త...హాసంబు-గళగర్త = కలుఁగువలెనుండు కుత్తుకక్రోవియొక్క, క్రోడ=అంతర్భాగమునుండి, నిర్యత్ =బైలుదేఱుచున్న, కహకహ= కహకహయనెడు, నినద = నాదముతోడి, ఉద్గాఢ=అతిగాఢమైన, హాసంబు= నవ్వు, భూభృద్బిలముల్ = పర్వతగుహలను, మ్రోయింపన్ =ధ్వనించునట్లొనర్పఁగా, కాదంబిని గతిన్ =మేఘములచాలువలె "కాదంబినీ మేఘమాలా"-

అకరము. పొగల్=పొగలను, పెంపక్=వృద్ధిపొందించునట్లు, మిన్నెల్లక్ = గగనమునిండ, మైగాక్ = శరీరముకాఁగా, చలిత...చలుఁడు-చలిత = కదలింపఁబడిన, ఆస్య = మోమునందు, ఖర=గట్టివైన, దంత=పండ్లయొక్క, క్షత=కఱచుటలచేనైనవ్రుఁద్దుగల, రదవసన = ఓష్ఠమువలన, కాఱెడు, క్షార=కారముగల, (వెగటుగూర్చునట్టి) కీలాల = నెత్తురుతో, వేల్లత్ = వ్రేలాడుచున్న, జ్వలన=అగ్నియొక్క, జ్వాలాభ=జ్వాలం బోలిన, జిహ్వాంచలుండు=నాలుకతుదగలిగినవాఁడు, అగుచుక్ = అయి, గదక్ = గదయను నాయుధము, జాళిమల్=గిరగిరమని, త్రిప్పుకొంచుక్ = త్రిప్పుచు.

తా. సమీపమున నున్న కొండగుహాలన్నియుం మాఱుమ్రోఁగునటుల కహాకహా యనుసందడి కలుగునటుల నవ్వుచు, మేఘములచాలు ఆకసమునంతయుం నల్లఁగాఁజేయుచునటుల నాకసమంటు నల్లని విస్తృతశరీరముతో విఱ్ఱవీగుచు మాటిమాటికి కొఱుకుటచేఁ బెదవులందుఁబడిన పుండ్లనుండి కంపుగొట్టు చొల్లుకారుచుండ అగ్నిజ్వాలలఁబోలిన నాలుకతో నాకికొనుచు గదను గిరగిరఁద్రిప్పుచు (దీనికి కర్తృపదము పైపద్యములోని దానవుఁడు.)

(అలం. స్వభావోక్తి, అతిశయోక్తి, ఉపమ.)

ఉ. దానవుఁ డద్ధరారమణుఁ డాఁకె నుదగ్రపదాగ్రఘట్టన
గ్లాని సపాటమై యచటి కాన ఘురట్టవిఘట్టితాకృతిం
బూని చెడన్ గిరీశగళమూలహాలాహలకాలకాంతితో
మేనఁజికంబులాడుతనమేటిత్రిశూలముఁ బూని యుద్ధతిన్.

టీ. దానవుఁడు=దనువుసంతతివాఁడు-రాక్షసుఁడు, ఉదగ్ర...గ్లానిక్-ఉదగ్ర = భయంకరమైన, పదాగ్ర = కడకాలియొక్క, ఘట్టన = అణఁగఁద్రొక్కుటవలనఁగలిగిన, గ్లానిక్ = నలఁగుటచేత, సపాటమై=ఎగుడుదిగుడు లేకుండ సమానమై, అచటికాన = అచ్చటివనము, ఘురట్ట...కృతిక్-ఘురట్ట=తెరుగలియందు, విఘట్టిత = విసరఁబడినదానిరూపమువంటి, ఆకృతిక్=ఆకార

మును. పూని=పొంది, చెరఁగ్=వెడిపోఁగా, గిరీశ = శంకరునియొక్క, గళమూల=మెడక్రిందిభాగమునందుఁగల, హాలాహల=కాలకూటవిషముయొక్క, కాల=నల్లని, కాంతితోన్=వన్నెతో, మేచకితంబులు = మేలంపుఁజూపులు, మేనత్తమేనమామబిడ్డ లాడుకొనుపరిహాసములు, అనుకన మేటిత్రిశూలమున్= అడుసట్టి తనపెద్దమున్మైనవాలును, శివునికంఠమునందుఁ గాననగుకాలకూటమువలె నల్లగానుండు త్రిశూలమును, పూని=ధరించి. ఉద్ధతిన్=గర్వముతో, అర్ధరాత్రమునన్=అరరాత్రైనప్పరోచిని, తాఁకెన్=ఎదిర్చెను.

తా. ఆదానవుఁడు భూమియాకసము కలిసి హెచ్చుతగ్గులేకుండ సమమగునట్లును అడవిలోనిచెట్లులన్నియుఁ దాఁకిడికి విఱిగి పడిపోవునట్లును భయంకరముగా నడుగులు పెట్టుచు మిగుల నల్లఁగాఁ బ్రకాశించుచున్న వాఁడి వైన త్రిశూలము భుజంబునం బెట్టుకొని వచ్చి రాజు నెదుర్కొనెను.

(అలం. అతిశయోక్తి. నిదర్శనము. ఉపమ.)

తే. నింగి నొరయు రాకాసిమన్నీని మేని
నీడఁ జీకటిఁగొనె నవనీతలంబు
చంద్రికలు గాంచె నట్టహాసముల వెడలు
నిశితదంష్ట్రలచేన వనీతలంబు. 97

టీ. నింగిన్=ఆకసమును, ఒరయు...నీడన్-ఒరయు=రాయుచున్న, రాకాసిమన్నీని = రక్కసిఱేనియొక్క (రాక్షసరాజుయొక్క), మేని = శరీరముయొక్క, నీడన్=నీడచేత, అవనీతలంబు=నేల, చీకటిఁగొనెన్=చీకటి పడియెను. అట్టహాసములన్ = వెఱ్ఱినవ్వులవలన, వెడలు...చేన - వెడలు = బైలువెడలునట్టి, నిశిత=తీక్ష్ణమైన, దంష్ట్రలచేన=పెద్దకోఱలచేతనే, వనీతలంబు వనభాగము. చంద్రికలు=వెన్నెలలను, కాంచెన్=పడసెను.

తా. మిన్నంటిన పొడవుగలరాక్షసుని దేహచ్ఛాయచే భూమియందుఁ జీకటి క్రమ్మెను. అట్టహాసము చేయఁగాఁ బైటికిఁ గనఁబడినదంతకాంతుల చేత నడవియంతయు వెన్నెలలు కాసినట్లుండెను. అలం. అతిశయోక్తి.

పంచచామరము...

పలాశి డాసి రాజుఁ జూచి పల్కెఁ నోరి నోరి కీ
పొలానఁ బెన్పొ లాన లేకపోవ నీవు దోఁచి తౌ
బలా బలాలితోడఁ బాలఁ బట్టి బిట్టు చుట్టి నిన్
హళాహళిన్ హలాహలాభ యాబుభుక్షఁ దీర్చెదన్. 98

టీ. పలాశి=మాంసమును దిను రాక్షసుఁడు, డాసి=సమీపించి, రాజున్=రాజగు స్వరోచిని, చూచి = కాంచి, పలికెన్ = ఈవిధముగా భాషించెను. ఓరి=ఓరి, ఈపొలానన్=ఈవనమునందు, నోరికిన్=నోటికి, పెన్పొల = పెద్ద మాంసము, ఆనన్=కుడువను (తినుటకు), లేకపోవన్=దొరకకపోఁగా, నీవు, దోఁచితి=అగపడితివి—లభించితివి, ఔన్=తగును. బలా=బలే (నీవంటిరాచవాఁడు నా కాహారముగా నేఁడు లభించుట మిగులసంతోషము), బలాళితోడన్=నీబలము(సేన)తోఁ గూడ, బాలన్ = ఈబాలికన్, పట్టి = పట్టుకొని, బిట్టు=వడిగా, నిన్ చుట్టి=నిన్నుఁగూడఁ జుట్టఁబెట్టి, హలాహలాభ = హాలాహల మను విషమువంటిది—కాలకూటమువలె నుదరమును దహింపఁజేయుచున్నది, ఆబుభుక్షన్ = అగునట్టియాఁకలిని, హళాహళిన్ = ఆత్రముతో, తీర్చెదన్ = పాపుకొందును. పరిజనముతో నీవును ఈబాలికయును లభించితిరి. ఇందరితో నాయాఁకలితీరును.

తా. రాక్షసుఁడు రాజుదగ్గఱకు వచ్చి యోరీ నా కిక్కడ నోటి చవిదీఱ మనుష్యమాంసము తినుటకు లభింపకపోవుటచేఁ దిరుగుచుండఁగాఁ బరిజనసహితముగా నాయదృష్టవశమున నీవు గనఁబడితివి. నిన్ను నీసేనను నీబాలికను గలిపి మ్రింగివైచి కాలకూటవిషమువలె జ్వలించుచున్న నాయాఁకలిం దీర్చుకొందు నని పలికెను. అలం. ఉపమ.

ఈపద్యమునందు శబ్దాలంకారము యమకము. తల్లక్షణము—"స్వరవ్యఞ్జనసముదాయపౌనరుక్త్యం యమకం" వాత్స్యాయనకామసూత్రములు

మహాస్రగ్ధర. అని బాహాస్ఫోటరావాహతపతగకులం బవ్వనీ
శాఖిశాఖా,జనితవ్యాకీర్ణజీర్ణచ్ఛదములకరణిం జల్లనన్ రాల
భూషార్చి నుదీర్ణాలాతచక్రాకృతిగ జిఱజిఱన్ ద్రిప్పివైచెం
గదన్ వైచినఁ దేజిన్ రాజు గెంటించెఁ దొలఁగ నది
యచ్చెంతకాంతార మేర్చెన్. 99

టీ. అని=అని చెప్పి, బాహా...కులంబు-బాహా = భుజములయొక్క, ఆస్ఫోట = చఱపులయొక్క, (బాహాస్ఫోటము=దండచఱపులు - మల్లచఱపులని భావము), రావ = చప్పుడుచే, ఆహత = కొట్టఁబడిన, పతగకులంబు = పిట్టలగుంపు, అవ్వని...కరణిన్ - అవ్వని = ఆవనమున, శాఖి = చెట్టుయొక్క, శాఖా = కొమ్మలవలన, జనిత = కలిగిన, వ్యాకీర్ణ = సర్వత్ర ప్రసరించిన, జీర్ణచ్ఛదములకరణిన్ = పండుటాకులరీతి, జల్లనన్ = జల్లుమనునట్లు, రాలన్ = క్రింద రాలఁగా, పక్షులాయాకస్మికధ్వనికి బెదరి చచ్చి పండుటాకులవలెఁ బడెను. భూషార్చిన్ = భూషణములకాంతులచే, ఉదీ...కృతిగన్-ఉదీర్ణ = ఘనమగు, అలాత = కొఱవియొక్క, చక్రాకృతిగన్ = చక్రముయొక్క యాకారమువంటి యాకారము కలుగునట్టుగా, గదన్ = గదను, జిఱజిఱన్ = బిఱబిఱమని, త్రిప్పివైచెన్ = త్రిప్పి (స్వరోచిపై) విసరెను. వైచినన్ = విసరఁగా, రాజు, తొలఁగన్ = తొలఁగిపోవునట్లు, తేజిన్ = అశ్వమును, గెంటించెన్ = ఊటికించెను. అది = ఆగద, అచ్చెంతకాంతారము = ఆసమీపవనమును, ఏర్చెన్ = పాడుచేసెను.

తా. అని పల్కి దండదెబ్బలు కొట్టిన నాధ్వనికి వృక్షములమీఁది పిట్టలు చెట్టుపండుటాకులు రాలినట్లు క్రిందఁ బడియెను. భూషణములకాంతులచేఁ బ్రకాశించుగదను బిఱబిఱఁ (కొఱవి త్రిప్పినట్లు చక్రాకారముగ వెలుఁగులతోఁ దిరుగఁగాఁ) ద్రిప్పి రాజుపై విసరెను. ఆవ్రేటు తప్పించుకొన రాజు గుఱ్ఱమును దొలఁగ దాఁటించెను. ఆగద యాచుట్టుప్రక్కల నున్న వనవృక్షముల నెల్లఁ బడఁగొట్టెను. అలం. ఉత్ప్రేక్ష, నిదర్శన, అతిశయోక్తి.

పృథ్వి. గదాహతికి నాత్మఁ గొంకక యెదిర్చి రాఁగా నిదేఁ
గదా యనుచుఁ ద్రిప్పి రాక్షసుఁడు వైచె గాఢభ్రమీ
నదత్కనకకింకిణీనటనజాగ్రదుగ్రార్భటీ
వదావదమహాగుహావలభి యైనశూలంబునున్. 100

టీ. గదాహతికిన్ = గదయొక్కదెబ్బకు, ఆత్మన్ = మనస్సులోన, కొంకక = జంకునొందక, ఎదిర్చి = ఎదుర్కొని, రాఁగాన్ = రాఁగా, ఇది=ఈధైర్యము, ఔఁగదా = తగినదేకదా, అనుచున్ = అనిచెప్పుచు, స్వరోచి సాహసమును ప్రశంస యొనర్చుచు, రాక్షసుఁడు = అసుర, గాఢ...వలభి-గాఢ = మిక్కుటమైన, భ్రమీ = తిరుగుడులచేత (భ్రమణములచే), నదత్ = ధ్వనిచేయుచున్న, కనకకింకిణీ = బంగారుచిఱుగంటల యొక్క, నటన = చలించుటయందు, జాగ్రత్ = మేలుకువయైన, ఉగ్ర = భీతిజనకమైన, ఆర్భటీ = ఆర్భాటముచే, వదావద = అతిప్రలాపము చేయుచున్న - ప్రతిధ్వనిచేయుచున్న, మహాగుహా = పెద్దకొండగవులయొక్క, వలభి = ముందటిభాగములుగలది, ఐనశూలంబునున్ = అయినట్టి శూలమును గూడ, త్రిప్పి = గిరగిరఁద్రిప్పి, వైచెన్ = స్వరోచిపై వేసెను.

తా. రాక్షసుఁడు ప్రయోగించిన గదపెట్టును స్వరోచి తప్పించుకొని తనపైకి రాఁగాఁ జూచి శూరునివిధ మిదియే గదా యని స్వరోచినిఁ బ్రశంసించి త్రిప్పునప్పు డెడతెగక గణగణమని మ్రోగుచున్న చిఱుగంటలధ్వనిచేతనే గుహాముఖములు మాఱుమ్రోయునట్టి శూలమునుగూడ నారాజుపై విసరెను.

అలం. అతిశయోక్తి.

పృథ్వీవృత్తము:...

"ప్రియం బగుచు రుద్రవిశ్రమము పృథ్వికాసంజ్ఞికా
వ్యాయంబగు జసంబులో జసయవంబులున్ గూడినన్."

అని ౧౧ యతి యని యున్నను ఇందు ౧౦-వ యతి గలదు.

శా. ఆశూలం బవనీశమౌళి కులిశాహంకారహుంకారకృ
న్నైశిత్యం బధికత్వమై నెగడుబాణశ్రేణిఁ జెండాడి వే
కాశశ్వేతగరుత్పరంపరల నాకాశంబు దుగ్ధాబ్ధిసం
కాశంబై వెలుఁగన్ శరావళులచేఁ గప్పెం గకుప్పంక్తులన్.

టీ. అవనీశమౌళి = రాజశ్రేష్ఠుఁడు, స్వారోచి, కులిశా...శిత్యంబు - కులిశ = వజ్రాయుధముయొక్క, అహంకార = అహంభావమునకు - గర్వమునకు, హుంకారకృత్ = హుంకరించుచున్న (నీ కింతగర్వమా యని హుం అనుధ్వనితో నదలించుచున్న - వజ్రాయుధముయొక్క వాఁడిని మించిన యని భావము.) నైశిత్యంబు = తీక్ష్ణత్వము-వాఁడిమి, అధికత్వమై = మిగుల మతింపఁదగినదై, నెగడుబాణశ్రేణిన్ = ప్రసిద్ధికెక్కిన బాణములసమూహముచే, ఆశూలంబున్ = ఆదానవుఁడు విసరినశూలమును, చెండాడి = ముక్కలుముక్కలుచేసి, వే=త్వరితముగ, కాశ...పరంపరలన్ - కాశ = రెల్లుపువ్వులరీతిని, శ్వేత = తెల్లని, గరుత్ = ఱెక్కల, పరంపరలన్ = ఒకదాని వెనుక నొకటిగా వెడలు (బాణముల) పక్షములచే, ఆకాశంబు = ఆకాశము, దుగ్ధాబ్ధిసంకాశంబై = క్షీరసముద్రముతో సమమై, వెలుఁగన్ = మెఱయఁగా, శరావళులచేన్ = బాణజాలములచే, కకుప్పంక్తులన్ = దిక్కులసమూహములను - అన్నిదిక్కులను, కప్పెన్ = మూసివైచెను.

శూలము సామాన్యమైనది గాదు. దానిని త్రిప్పినప్పుడు చిఱుగజ్జెల మ్రోఁత కొండల మాఱుమ్రోగెను. ఆట్టిశూలమును ద్రుంచుటకుఁ గొండలను నుక్కడంచిన వజ్రాయుధమును మించినయాయుధము గావలెను. కాన నట్టి బాణశ్రేణిచే శూలమును ద్రుంచెను.

తా. స్వారోచి వజ్రాయుధమును దిరస్కరించు వాఁడిగలబాణజాలమును బ్రయోగించి యారాక్షసుఁడు వైచినశూలమును నఱికి, తెల్లనిగఱులు కట్టిన పుంఖానుపుంఖము లగుబాణసముదాయముచే నాకసము పాలసముద్రమువలెఁ గన్పట్ట నెల్లదిక్కులను మూసివైచెను. అలం. ఉపమ.

క. అవి యాతనిపై తోలును
నవియింపఁగ లేక మిడిసి యల్లటువడఁ జూ
చి వనేచరు లేచినవెఱ
దవిలినమతి నద్దిరయ్య దయ్యం బనుచున్. 102

టీ. అవి=ఆశరములు, ఆతనిపైతోలును=ఆరాక్షసునియొక్కచర్మమును గూడ, అవియింపఁగన్=చీల్చుటకు, లేక=సమర్థములు కాక, మిడిసి = తూలి, అల్లటుపడన్=అంతదూరమునఁ బడఁగా, వనేచరులు=పుళిందులు (వనమునం దిరుగువారు), చూచి=ఆబాణములన్నియుఁ నిరుపయోగము లగుటఁ గనిపెట్టి, ఏచినవెఱ=హెచ్చైనభయము, తవిలినమతిన్ = తగులుకొనిన బుద్ధితో - హృదయమునందు మిగుల భయపడి, అద్దిరయ్య = అద్దిరా, దయ్యంబు = భూత మిది, అనుచున్=అనుకొంచు. (పైపద్యముతో నన్వయము.)

తా. స్వరోచి ప్రయోగించినబాణములు రాక్షసునిపై తోలునైన గ్రుచ్చుకొనలేక తూలి నేలఁబడుటఁ గాంచి కిరాతు లందఱును మిక్కిలి భయపడి యౌరా యిది పెద్దదయ్య మని తలంచి. (అలం. కావ్యార్థాపత్తి.)

సీ. పక్కపక్కన నంఘ్రిపాశముల్ వెసఁ ద్రెంచి
డేగతండముల మింటికిని విడిచి
గళగళధ్వనులతోఁ గంఠశృంఖల లూడ్చి
సుడివడఁ గుక్కల నడవిఁ గలిపి
గుప్పగుప్పన మోచికొనియున్న వలలతోఁ
బలలంపుఁబొత్తరల్ పాఱవైచి
కంగుకంగున నేలఁ గైదప్పగాఁ బడు
వేఁటమ్ము లేఱక దాఁటి దాఁటి
తే. తిరిగి చూచుచు దట్లుగఁ దీసికొనుచు
దగలు దొట్టి యథాయథ లగుచు విఱిగి

యొకఁడు వోయిన త్రోవ వేఱొకఁడు వోక
చెట్టొకఁడు గాఁగ బఱచిరి చెంచు లపుడు. 103

టీ. అప్పుడు = ఆసమయమునఁ, చెంచులు = బోయవాండ్రు, పక్కు పక్కునన్ = పుటుకుపుటుక్కున, అంఘ్రిపాశముల్ = కాళ్లకుఁగట్టిన, దారెపుఁ బ్రాళ్లు, వెసన్ = వేగముగ, త్రెంచి = త్రెంపి, డేగకంఠముల్ = డేగల మెడను, మింటికిన్ = గగనమునకు, విడిచి = ఎగిరిపోవవదలి, గళగళధ్వను లతోన్ = గళగళమనుధ్వనులతో, కంఠశృంఖలలు = మెడ నున్న గొలుసులు, ఊడ్చి = విప్పి, సుడిపడన్ = కలఁత నొందునట్లుగా, కుక్కలన్ = శ్వానములను, అడవిఁగలిపి = వనమునందు విడిచిపెట్టి, గుప్పు గుప్పునన్ = గుప్పుగుప్పు మను నట్లు మోచికొని, ఉన్నవలలతోన్ = ఉన్నవేఁటవలలతోఁగూడ, వలలంపుఁ బొత్తరల్ = మాంసపుఁబొట్లములు, పాఱవైచి = దూరముగాఁ బడవేసి, కంగు కంగునన్ = కంగుకంగుమనునటుల, నేలన్ = పుడమిపై, కైదప్పు = చేతి పొరపాటు, కాన్ = అగునట్లు, పడువేఁటమ్ములు = చేతినుండి పడిపోయిన వేఁటకుఁబనికివచ్చు నమ్ములను, ఏఱక = ఏఱుకొనకుండ, దాఁటిదాఁటి = పరుగెత్తి పరుగెత్తి, తిరిగి చూచుచున్ = (రాక్షసుఁడు తమ్ముఁ వెంబడించి వచ్చుచున్నాఁడేమో యని) వెనుకకుఁ దిరిగిచూచుచు, దట్టు = నడికట్టు కోకలు, ఎగఁదీసికొనుచున్ = (వీడిపోవుచుండఁ గాలి కడ్డముపడునేమో యని) మీఁదికిఁ జెక్కుకొనుచు, దగలు = దప్పికలు, తొట్టి = ఎక్కుడగు, యథా యథలు = నలుదిక్కులకుఁ దొలఁగిన వారు - ఒకరితో నొకరు సంబంధము లేక చీలిపోయిన వారు, అగుచున్ = అయి, విఱిగి = చెదరి, ఒకఁడుపోయిన త్రోవన్, వేఱొకఁడుపోక, చెట్టొకఁడు గాఁగన్ = ఒకచెట్టున కొక్కఁడుగా - గట్టున కొకఁడుగా గుట్టకొకఁడుగాఁ జీలిపోయి, పఱచిరి = పలాయనము నొందిరి.

తా. ఆకిరాతులు రాక్షసునిఁ దమరాజుబాణములం గొట్టఁజాల మని భయపడి డేగలను విడిచిపెట్టియుం, కుక్కలను వదలిపెట్టియుం, వలలం

మూఁకసపుఁబొట్లములుఁ బాఱవైచియుఁ, జేతినుండి జాఱినబాణముల నెత్తికొనకయుఁ, వెనుకనుండి యారక్కసి తఱిమికొని వచ్చుచున్నాఁడేమో యను వెఱపుచే వెనుక వెనుకకుఁ దిరిగి చూచుచు, వీడిపోవుచున్న కాసెకోఁకలు సవరించికొనుచు, నలుఁదిక్కులకు నలువురు నొకరినిగానక యొకరు పరువెత్తి చెట్టొకపిట్టగా నైరి. అలం. స్వభావోక్తి.

క. ప్రోపు దలపోసి నిలువక
పాపాత్మకమై కిరాతబల మటు పాఱన్
భూపతి యయ్యింతి హయ
స్థాపితఁగాఁ జేసి పలికెఁ దన్ముఖ్యులకున్. 104

టీ. ప్రోపు = రాజుప్రాపకమును - పోషణమును, తలపోసి = తలంచి, నిలువక = నిలువంబడక, పాపాత్మకమై = పాపస్వభావము గలిగి, రాజునెడఁ గృతజ్ఞతఁ జూపి నిలువక ప్రాణభీతిని బాఱిపోవుట పాపకార్యము. కిరాత బలము=పుళిందసేన, అటు=ఆరీతిగా, పాఱన్ = పరువెత్తిపోవఁగా, భూపతి= రాజు స్వరోచి, అయ్యింతిన్=రాక్షసుఁడు తఱుముకొనిరాఁగాఁ దనయందుఁ జేరిన మనోరమ యనుచెలువను, హయస్థాపితఁగాన్ = అశ్వముపై నెక్కింపఁ బడినదానినిగా, చేసి = ఒనర్చి = గుఱ్ఱముపైని గూర్చుండఁ బెట్టి, తన్ముఖ్యులకున్ = ఆపుళిందానీకములోని పెద్దవారితో, పలికెన్ = ఈక్రిందిరీతిం జెప్పెను.

తా. తనకు సహాయముగా నుండక తిన్నఋణము తీర్చుకొనుట మఱచి కిరాతు లందఱును ప్రాణభీతిచే నెవరికి వారు చెట్టున కొకఁడు గుట్ట కొకఁడై పోయినంతట మనోరమను రాజు గుఱ్ఱముమీఁదఁ గూర్చుండఁబెట్టి కిరాతేంద్రుం గాంచి యిట్లు చెప్పెను.

ఉ. నైదువు సున్న పూజ్యములు కంకటఖేటశిరస్త్రలత్రముల్
లే దరదంబు తత్తడి హుళిక్కి సహాయము సర్వమంగళం

బీదనుజుండు చిక్కె భయమేటికి లుబ్ధకులార యాత్మకుం
బేదతనంబు మేలె మఱి మృత్యువు డాఁగెడిచోట లేదొకో.

టీ. లుబ్ధకులార = ఓకిరాతులార, కైదువు = ఆయుధము, సున్న = లేదు, కంకట...ముల్ - కంకట = మైమఱువును, ఖేట = డాలును, శిరస్త్రాణముల్ = తలనుగాపాడు నట్టితలకుడుము మున్నగునవియును, పూజ్యములు = లేవు, అరదంబు = రథమును, లేదు, తత్తడి = అశ్వము, పాళిక్కె = లేదు, సహాయము = జత, సర్వముంగళంబు = సర్వవిధములఁ జూచినను శూన్యము. ఈదనుజుండు = ఇట్టి ఆయుధాదిక శూన్యుఁడగు రాక్షసుండొకఁడు, చిక్కెన్ = (సర్వబలసమగ్రుఁడ నగువానిచేతిలో) చిక్కుపడెను. భయము = భీతి, ఏటికిన్ = ఏల? ఆత్మకున్ = హృదయమునకు, పేదతనంబు = బేలతనము, మేలె = తగునా? మఱి = మఱియు (పిఱికితనమున నెటకో పాఱిపోయినపక్షమున) డాఁగెడిచోటన్ = దాఁగియున్న స్థలమునమాత్రము, మృత్యువు = చావు, లేదొకో = సంభవింపదా? ఎక్కడికిఁ బోయినను మరణము రాఁదగిన సమయమునకు వచ్చితీరు నని భావము.

తా. ఓ కిరాతులార! ఈరక్కసికి ఆయుధములు, కవచము శిరస్త్రాణము, రథము, గుఱ్ఱము, తోడు నేవియులేక దైవవశమున సమస్తబలసంయుతుల మగు మనహస్తములలో నొంటరిగాఁ జిక్కినాఁడు గావున వీనిని జంపుట యొక పెద్దపని గాదు. మీరందఱుఁ బిఱికితనముచే నటుల పాఱెదరేల? మీరు పోయి డాఁగినచోటునకు మృత్యువు రాదే దని తలంచితిరా? ధైర్యము తెచ్చుకొనుఁడు. పిఱికిపందలు కాకుఁడు.

ఆ. నీడఁ గడవఁ బాఱ నేలకు వెలిగాఁగ
నడుగు వెట్టి తిరుగ నాత్మ మొఱఁగి
యొకటిఁ దలఁప నరుల కొదఁన నొదవ దే
కరణి మృత్యుదేవిఁ గన్నుఁ బ్రామ.

టీ. నరులకున్ = జనులకు, నీడన్ = తననీడను, కడవన్ = తొలఁగునటుల, పాఱన్ = పాఱిపోవుటకును, నేలకున్ = వసుధను, వెలి = వెలుపల నున్నది, కాఁగన్ = అగునటుల, అడుగు = చరణమును, పెట్టి = మోపి, తిరుగన్ = నడయాడుటకును, ఆత్మన్ = మనంబును, మొఱఁగి = మోసముచేసి, ఒకటిన్ = ఒక్కదానిని, తలఁపన్ = తలపోయుటకును, ఒదవినన్ = దొరకినను, (ఈయసాధ్యకార్యము లెన్నఁటికిని సాధ్యములు కాఁజాలవు. ఒకవేళ నైనను) ఏకరణిన్=ఎట్టులును, మృత్యుదేవిన్=మృత్యుదేవతను, కన్నుఁబ్రామన్ = కనుగప్పుటకు, ఒదవదు = సామర్థ్యముండదు.

తా. తననీడను తొలఁగించుకొనుట తనకు సాధ్యమైనను గావచ్చును; నేల నంటక నడచిన నడవవచ్చును. మనస్సునకుఁ దెలియక యాలోచనము చేసిన చేయవచ్చును. గాని మృత్యువును దప్పించుకొనుసామర్థ్య మెవ్వరికి నుండదు. అలం. అప్రస్తుతప్రశంస.

క. చావుఁ దలపోసి మానవుఁ
డేవగ దుష్కీర్తి వొరయకే దినములు వోం
దై వెడలునట్లు నడవఁగ
దైవం బటమీఁద మేలు తాన ఘటించున్. 107

టీ. మానవుఁడు = నరుఁడు, చావున్ = చావును, తలపోసి = ఎంచి, ఏవగన్ = ఎట్టులైనను, దుష్కీర్తి = అపయశస్సును, పొరయక ఏ = పొందకుండఁగనే, దినములు = నాఁడులను, వెడలునట్లు=కడచునట్లు, నడవఁగన్ = వర్తించుచుండఁగా, అటమీఁదన్ = తర్వాత, దైవంబు=కాలము, తాన = తనంతటఁదానే, మేలు = శుభములు, ఘటించున్ = సమకూర్చును.

తా. నరులు తా మెప్పటికైనఁ జచ్చువారమే యని తలంచుకొని యున్న నాలుగుదినము లపకీర్తి రాకుండఁ జక్కఁగా నడుచుచుండిన

దైవము తానే వారివారికిఁ దగిన మేళ్లను బొందించును. కావున మీరు పాఱి పోయి యపకీర్తి నొందక యీరాక్షసునిఁ జంపుటచేఁ గాకుఁ దోమునకు కీర్తి నొందుఁడు. అలం. అప్రస్తుతప్రశంస.

సీ. బుద్ధీంద్రియక్షోభములకుఁ బెట్టనికోట
  విపదంబురాశిదుర్విక్రుతికోడ
 ఖలదురాలాపమార్గణవజ్రకవచంబు
  రణమహీస్థలికి శ్రీరామరక్ష
 శాత్రవదుర్గర్వసంస్తంభనౌషధి
  మొనయుచింతాశ్రేణిమూఁకవిష్వ
 యోగాదిసంసిద్ధు లొనఁగూర్చుపెన్నిధి
  తూలు నేకాకులతోడునీడ
తే. సకలగుణప్రధానంబు సకలకార్య
 జాలసాఫల్యకరణైకసాధనంబు
 ధైర్యగుణ మట్టిధైర్యంబు దక్కి పారిఁ
 దత్తఱింతురె యకట మీరతరమువారు. 108

టీ. ధైర్యగుణము = ధీరత్వము-ఏట్టకన మనెడి గుణము, బుద్ధీంద్రియక్షోభములకున్ - బుద్ధి = మనస్సుయొక్కయు, ఇంద్రియ = కన్ను ముక్కు చెవులు లోనుగాఁగల యింద్రియములయొక్కయు, క్షోభములకున్ = కలవరపాటులకు, పెట్టనికోట = పెట్టకుండఁ దనంతటనే యేర్పడినకోట యట్టిది, కోట విరోధులకుఁ జేర నెటులశక్యముగాదో యటులె ధీరగుణము నంతరంగశత్రు లేవియుఁ జేరఁజాలనిదని భావము. విప...కృతికిన్ - విపత్ = విపత్తులనెడు, అంబురాశి = సముద్రముయొక్క, దుర్విక్రుతికిన్ = దుష్టవికారమునకు, ఓడ = ఓడవంటిది, ఖల...కవచంబు - ఖల = దుష్టులయొక్క, దురాలాప = వాఁగుడు (అను), మార్గణ = శరములకు, వజ్రకవచంబు = వజ్రములతోఁ జేసిన కవచమువంటిది, రణమహీస్థలికిన్ = యుద్ధముచేయు

చోటునకు, శ్రీరామరక్ష = శ్రీరామసహాయమువంటిది, ఖలులవలని దుర్వాక్యము లన్నను సంగరరంగ మన్నను ధీరగుణము జలనభావము కలిగింపఁజాలదు. శాత్రవ...షధి - శాత్రవ = శత్రుసంబంధమైన, దుర్గర్వ = దుష్టాభిమానమునకు, సంస్తంభన = నిలుపుచేయునట్టి, ఓషధి = వనౌషధియట్టిది, మొనయు...విప్వ - మొనయు = పుట్టుచున్న, చింతాశ్రేణి = దుఃఖసముదాయమునకు, మూఁకవిప్వ = ఎడబాటుకలిగించునది, ధీరగుణము విరోధుల గరువమును జింతలనన్నింటినిఁ దొలఁగఁద్రోయు ననిభావము. యోగాదిసంసిద్ధులు- యోగ=కోరిన వస్తువుదొరకుట, ఆది = మొదలగువానిని, సంసిద్ధులు=బాగుగా సమకూర్చుటలును, ఒనగూర్చు పెన్నిధి = సమకూర్చునట్టి ధననిక్షేపము వంటిది-రొక్కము నించి పెట్టినపాత్రవంటిది. తూలు = తూలిపోయి, ఏకాకుల = ఒంటిగా నున్నవారలకు, తోడునీడ విడువకుండ నీడవలె నుండునది, ఏసహాయము లేని యొంటరికాండ్రకు ధైర్యగుణమె పదిమంది పెట్టుగా నుండు ననుట. సకలగుణప్రధానంబు = సమస్తసద్గుణములయందును ప్రశస్తమైనది, సకల...నంబు - సకల = ఎల్ల, కార్య = కార్యములయొక్క, జాల = సముదాయముయొక్క, సాఫల్య = సాఫల్యమును (నెఱవేఱుటను) కరణ = ఒనర్చుటకు, ఏక = ముఖ్యమైన, సాధనంబు = పనిముట్టు, అట్టిధైర్యంబుఁ = అటువంటి ధైర్యస్వభావమును, తక్కి = వదలి, పోరఁ=రణములో, మీకరమువారు = మీబోఁటులు, తత్తఱింతురె = తొట్రుపడుదురా ?

తా. ధైర్యగుణము బుద్ధిని నింద్రియములను, నిశ్చలపఱచును. ఆపదలం దొలఁగించును. దుష్టజనులు నిందించినను మనసున వికృతిం బుట్టనీయదు. యుద్ధభూమియందు రక్షించును. విరోధియహంకారమును దగ్గించును. దుఃఖమున కెడ మియ్యదు. కోర్కులు సమకూర్చును. తోడు లేని వానికి సహాయ మొనర్చును. చేయవలసినపనులం జేయుట కొకసాధనము. కాఁబట్టి గుణములన్నింటిలో ధైర్యగుణము మీవంటివారు వీడిపోవుటకూడదు. అలం. రూపకము. ఉల్లేఖము.

క. అని తెలిపి తిరుగుఁ డనుటయు
మనమున లజ్జించి యెఱుకుమన్నీ లిఁక నీ
జనపతితోడిద లోకం
బని తమతమ మొనలు ద్రిప్పి రవియును దిరిగెన్. 10౯

టీ. అని = ఇట్లని, తెలిపి = బోధించి, తిరుగుఁడు = మరలుఁడు, వెన్నిచ్చి పోవకుఁడు - యుద్ధరంగమునకు మరలుఁడు, అనుటయున్ = అని స్వరోచి చెప్పినవెంటనే, (ఇందుఁ గర్త స్వరోచి) ఎఱుకమన్నీలు = చెంచుదొరలు, మనమునన్ = అంతరంగమునందు, లజ్జించి=సిగ్గును బొంది - తాము ప్రాణభయముచే దూరము పోఁజింపక పాఱిపోయినందులకు సిగ్గుపడి, ఇఁకన్ = ఇంకమీఁద, ఈజనపతితోడిద=ఈ నృపాలునితో నుండునదియే - రాజుచచ్చినఁ జత్తము; రాజు బ్రదికిన బ్రదుకుదము; అతఁడేశరణ్యమనుకొని, లోకంబు=మనలోకము, అని=ఇట్లనుకొని, తమతమ మొనలు = వారివారిసంఘములను, త్రిప్పిరి = మరల్చిరి, అవియును = ఆమొనలును, తిరుగున్ = మరలెను.

తా. అని బోధించిన స్వరోచిమాటలకు సిగ్గిల్లి యెఱుకరాజులు తమ బ్రదుకు లారాజుతో నున్న వని నిశ్చయించుకొని పరుగెత్తిపోవుచున్న వారి సేన లన్నియుం యుద్ధభూమివంకకు మరలించిరి. తమనాయకుల యాజ్ఞార్థ మాయాసేన లన్నియు వెనుకకు మరలి సంగరమున కాయితమయ్యెను.

వ. ఇట్లు తిరిగి యుక్కెక్కి రక్కసుం డెక్క డెక్కడ నని య
క్కొట్టబలంబు లగుడంబులుఁ గటారు లీటెలు పందీటెలు
విండ్లు గండ్రగొడ్డండ్లుఁ జిల్లకోలలుఁ బంత్రగోలలు మెఱయ
రయసముద్ధూతధూళీధూసరితధారాధరపథంబగుచు నొక్క
పరియ చీమపరి యనం గవిసె నందు. 110

టీ. ఇట్లు = ఈరీతిగా, తిరిగి = మరలి, అక్కొట్టబలంబు=ఆబోయ వారల దండు (చండాలేతరాంత్యజాతివిశేష మని సర్వశబ్దసంబోధిని.)

ఉక్కెక్కి = ధైర్యమగ్గలమై, రక్కసుండు = మనుజాశి, ఎక్కడెక్కడన్ = ఏడీ యెక్కడ నున్నాఁడు - ఎక్కడనున్నాఁడు, అని, లగుడంబులు=దుడ్డు కఱ్ఱలును, కటారులు = ఖడ్గములు, ఈఁటెలు = బల్లెములు, పందిఁటెలు = పందులఁబొడుచు దృఢతరములగు బల్లెములు, విండ్లు, గండ్రగొడ్డండ్లు=చంద్ర రేఖవలె వంపుగానుండు పెద్దగొడ్డండ్లును. చిల్లకోలలు=తోమరములును, దోఁటి వలె చివరకొంకెముగల యొకానొకవిధములగు బల్లెములు. పంట్రకోలలు = రెండుమూఁడుసూదిపలవలుగల ప్రాఁకోలలును, మెఱయన్ = వెలుగఁగా, రయ...పథంబు - రయ = వడిచేత - గమనవేగముచేత, సముద్ధూత=ఎగురఁ గొట్టఁబడిన, ధూళి=రజముచే, ధూసరిత = కొంచెము తెల్లగానైన, ధారాధర పథంబు=గగనము గలది, అగుచున్, ఒక్కపరియ=ఒకమాఱుగనే, చీమపరి= చీమలచాలో, అనన్ = అనురీతిని, కవిసెన్ = రాక్షసునిఁ జుట్టిముట్టినవి, అందున్ = అటులఁ గవిసిన యాబలమునందు. పైపద్యముతో నన్వయము.

మ. శరసంధానముతోనె కొన్నియడుగుల్ జౌజవ్వనన్ బాఱియ,
ద్ధరణిన్ గాల్కొని ద్రోణముల్ దివియు దోర్దండంబులం
జేది యేసిరి బోయల్ దిను మంచు నార్చి పరఁగన్
జిట్టాసలన్ డాయుచున్, గోరవంకల్ మొఱవెట్టినట్లు
గుణముల్ ఘోషింప రోషింపుచున్. 111

టీ. బోయలు = ఎఱుకులు, రోషింపుచున్ = క్రోధించుచు, శరసంధానముతోనె = అమ్ములు విల్లునందుఁ గూర్చుటతోనే, కొన్నియడుగుల్ = కొన్నియంజలమేర, జౌజవ్వనన్ = నేల జవజవలాడునట్లు, పాఱి=పరుగెత్తి, అద్ధరణిన్ = ఆచోట, కాల్కొని = కాలూఁది నిలువఁబడి, ద్రోణములు= కఱ్ఱగూటములను (ముద్గరములను), దివియుందోర్దండంబులన్ = త్రిప్పనట్టి దండములవంటి బాహువులతో ద్రోణములను ద్రిప్పుచు నభ్యాసముచేయుంటచేఁ గఱ్ఱలవలె గడుసుబాఱిన భుజములను, చేఁది=ఆకర్షించి, గోరవంకలు= గోరువంక పిట్టలు, మొఱవెట్టినట్లు = కూసినట్లు, గుణము = నారి, ఘోషిం

వన్ = మ్రోఁగఁగా, చిట్టాసలన్ = స్వల్పమైనయాశలతో - చావకప్రముకఁ గల మను నాశ పూర్తిగా నశించునట్లు (పా-చెట్టాసలన్ = చెట్టుచాటున) పరఁగన్ = ప్రసిద్ధమగునట్లు, జూజూచున్ = దానవునివద్దకుఁ జేరుచు, తినుము ఇదిగో వీనిని భుజింపుము. అంచున్ = అనుచు, ఆర్చి = కేకవైచి, ఏసిరి = కొట్టిరి-బాణములఁ బ్రయోగించిరి.

తా. ఎఱుకువాండ్రు క్రోధావేశముచే శరములు ధనుస్సునం గూర్చుచునే ముందున కుఱికి పుడమి పడఁకునట్లు పరుగెత్తి నిల్చి యుద్ధసాధనముచేఁ గఠినములైయున్న బాహువులతో బాణములం గొని గోరువంకపిట్టలవలె మ్రోగుచున్నవారినిఁ గూర్చి యివె వీనిం దిను మంచు రాక్షసునిమీఁదికి విడిచిరి.

తే. ఆశరావళి నమ్మనుజాశనుండు
లీల మృగదంశకము మశకాలి నొడిసి
చప్పరించువిధంబున శాతదీర్ఘ
దంష్ట్రికలఁ జప్పరించి రౌద్రమునఁ గెరలి. 112

టీ. అమ్మనుజాశనుండు = మనుష్యులను భుజించువాఁడగు రాక్షసుఁడు, ఆశరావళిన్ = ఆబోయవాండ్రు తనపయి ప్రయోగించిన బాణసమూహమును, లీలన్ = విలాసముగా (లీలగా), మృగదంశకము = శునకము, మశకాలిన్ = దోమలబారును, ఒడిసి = పట్టుకొని, చప్పరించువిధంబునన్ = చప్పరించునట్లు, శాత...లన్ - శాత = పదునుగలవియును, దీర్ఘ = పొడవైనవియు నైన, దంష్ట్రికలన్ = కోఱలచే, చప్పరించి = అంగిట నదిమి వెట్టి నమలి, రౌద్రమునన్ = భయంకరత్వముతో, కెరలి = చెలరేఁగి-విజృంభించి. (వైద్యముతో నన్వయము.)

తా. ఆరాక్షసుఁడు బోయలు వేసినబాణములను, కుక్క దోమలఁ జప్పరించునట్లు, దంష్ట్రాకరాళమైననోరఁ బడవైచుకొని చప్పరించి మిగులఁ గోపముతో నాబోయదండుపైకిఁ గవిసె. అలం-ఉపమ.

సీ. గళితశృంఖల మైనగంధనాగమువోలెఁ
బ్రజలపైఁ జేరెముల్ వాఱి పాఱి
కలశాబ్ధి మథియించు కైటభాంతకులీల
జవ మొప్ప జేతులుసాఁచి చాఁచి
కన లూనుకీనాశ కాసరమ్మునుబోలెఁ
గమిచి తట్టువగుంపుఁ జమరి చమరి
యమృతాపహరణార్థ మరుగుపక్షిస్వామి
గతిఁ బుళింద శ్రేణిఁ గమిచి కమిచి
తే. సెలవులు బిగించి నేత్రదంష్ట్రికలు మెఱయ
నిడుద మొగ మెత్తి మీసల నెత్తు రొలుకఁ
బటబటఁ గపాలపంక్తులఁ బగుల గొఱికి
బలము నెల్లను గడియలోపలన మ్రింగె. 113

టీ. గళితశృంఖలము = వదలిపోయినగొలుసులుగలది,ఐనగంధనాగము వోలెన్=అయినట్టి మదగజమురీతిని, ప్రజలపైన్ = సేనలపై, పేరెముల్వాఱి పాఱి = పలుమాఱు పరుగులెత్తియెత్తి, కలశాబ్ధి = క్షీరసముద్రమును, మథియించుకైటభాంతకులీలన్=తఱచుచున్న నారాయణునియట్లు, జవము=వడి, ఒప్పన్ = ఒప్పునటుల, చేతులుసాఁచిచాఁచి=పలుమాఱు చేతులు చాఁచియు, కనలు=క్రోధమును, ఊను...బోలెన్-ఊను=వహించునట్టి, కీనాశ=యముని యొక్క, కాసరమ్మునుబోలెన్ = మహిషమునట్లు, కమిచి = కప్పుకొని, తట్టువగుంపున్=చిన్నవిగా నుండు గుఱ్ఱములగుంపును, చమరిచమరి = నలఁగఁ గొట్టికొట్టి, అమృతాపహరణార్థము = అమృతభాండముం దెచ్చునిమిత్తము, అరుగుపక్షిస్వామిగతిన్ = వెళ్లుచున్న పక్షీంద్రుఁడగుగరుడునివలె, పుళింద శ్రేణిన్ = చెంచుగుములను, కమిచికమిచి=మ్రింగిమ్రింగి, సెలవులు=ఓష్ఠ కోణములను-పెదవుల మొదళ్లను, బిగించి = బిగియునట్లు పట్టి, నేత్రదంష్ట్రి కలు=నేత్రములును కోఱపండ్లును, మెఱయన్=కాంతిలుచున్నట్లు, నిడుద

మొగమును = సొమ్ముగైన మోమును, ఎత్తి = మీఁదికి నెత్తి. మీసలన్ = మీసములమీఁదుగా, నెత్తురోలుకన్ = రక్తము తొణికిసలాడుచుండఁగా, కపాల పంక్తులన్ = తలపుఱ్ఱెలసమూహమును, పటపట = పటపట మనుధ్వనితో, పగులన్ = పగిలి చూర్ణమగునట్లు, కొఱికె = నమలి, బలము నెల్లన్ = కిరాతుల బలమునంతను, గడియలోపలన = గడియ సమయములో, మ్రింగెన్ = మ్రింగెను. క్షీరాబ్ధిని దేవతలును రాక్షసులును దఱచినట్లు భాగవతాది గ్రంథములందును విష్ణుపురాణమునందును గలదు. విష్ణుమూర్తి స్వయముగా ద్రచ్చినట్లు నిందుఁ జెప్పఁబడినది. ఇట్టులు చెప్పుపురాణకథాంశములు మృగ్యములు. దేవీపురాణమునఁగూడ దేవతలు రాక్షసులు సముద్రమును ద్రచ్చినట్లుఁ గలదు చూడుఁడు.—

శ్లో. "తే సర్వే తత్ర సహితా మమంథుర్వరుణాలయమ్
తస్మింస్తు మథితే జాతః ప్రసన్నో హి మహీపతే." (దేవీపురాణము.)

తా. కట్టు విప్పుకొనిన మదపుటేనుఁగువలె మనుష్యులపైఁ బడియును సముద్రమథనము చేయ విష్ణునట్లు చేతులు సాఁచియు, యమునివాహనము వలె గుఱ్ఱపుకట్టను గొట్టియు, నమృతముం దేవపుంగవుఁడునిరీతిం బులులం జంపియు, నోరిలోనుండి నెత్తురు పారునట్లు తలపుఱ్ఱెలను నమలియు, గడియలోఁ దనపై వెడలినబోయల నెల్లరం జంపి తినియె. అలం. ఉపమ.

క. ఆసమయంబున గీర్వా
ణీసుతుఁ డయ్యింతి నొక్కనికటనికుంజా
వాసమ్మున నిడి క్రమ్మఱి
వే సురరిపుఁ దాఁకెఁ దురగవేగము మెఱయన్. 114

టీ. ఆసమయంబునన్ = తనపరిజనమునంతయుఁ జంపి రాక్షసుఁడు వారి పుఱ్ఱెలను నములుసమయమునందు, గీర్వాణీసుతుఁడు = దేవవనితాకుమారుఁడు (స్వరోచి), అయ్యింతిన్ = తనతో గుఱ్ఱముపైఁ గూర్చుండఁ బెట్టుకొని

దయున్న మనోరమను, ఒక్క...మ్మునన్-ఒక్క = ఒకానొక, నికట=చేరువనున్న, నికుంజావాసమ్మునన్ = నివాసయోగ్యమగు పొదరింటియందు, ఇడి = కూర్చుండఁబెట్టి, క్రమ్మఱి = తిరిగి, తురగవేగము = గుఱ్ఱపు పరుగువంటి వేగము, మెఱయన్=ఒప్పఁగా - ప్రకాశింపఁగా, (అతిశయింపఁగా ననుట). వే=త్వరితముగా, సురరిపున్ = దేవతలకు విరోధియగురాక్షసుని, తాఁకెన్= ఎదిరెను.

తా. ఆసమయంబున స్వరోచి తనతోఁబాటు గుఱ్ఱముమీఁద నున్న మనోరమ యనునాచిన్నదానిని గొనిపోయి యొక సమీపపుపొదలోఁ బెట్టి వేగముగ వచ్చి రాక్షసు నెదిరించెను.

వ. ఇట్లు తలపడి యమ్మనుజదనుజులు బీరంబులు దోరంబులుగాఁ బోరుతఱి భూరమణుండు క్రుద్ధుండై సమిద్ధరణి బద్ధపరంపరయగు సంపఱన్ జెంపఱన్ జంపరాదు నిలింపారాతి నని వితర్కించి కించిత్తును గొంచక కాంచన ద్రవకంచుకితంబును దరణిఖరకిరణకాండచండంబును నయి యాఖండలదోర్దండసముజ్జృంభితవజ్రాయుధచకచకన్ బకపకనవ్వు వజ్రభేదియలుంగు వెలుంగ మత్తారులకు నుత్తలంబిడు నత్తలంబును బద్మరాగమణిచూడం బగు కేడెంబునున్ గొని వేడెంబునన్ దురంగంబుఁ బఱపి తెఱపి గని తఱటు చేసి యొరసి చన నుఱికించి కఱకుటరిబరిఁ బఱియ వడన్ బొడిచి కడచి నిలిచినన్ బెలుచనన్ బరిగోలపోటున నాటోపించుమత్తకరివృత్తినెత్తురొలుక నక్తంచరుం డుదంచితగతి సవ్యదిశ కొత్తి తఱుము నపసవ్యగతిన్ జాళెంబున హయంబుఁ బోనిచ్చుచు నచ్చరకొడుకు దిరిగి తిరిగి సింగిణి నేయుచున్ జుట్టుకొనిరా మనుజాశియు నట్లట్ల వెనుక వెనుక కదుగిడుచు నడ్డంబుగా నడవికడ కొత్తికొని నడచి యొడదొడు కగుడు బెడిదంపు

నడక నడరి కడకాళ్ల కొడియం జిక్కె రక్కసునకుం
దుష్కారం బనునాలోన నడిదంబునం బుడమిపతి పెడ
విసరు విసరి యసురవరు కరాంగుళంబులు దెగ నడిచె
నడిచిన సుడివడక మడమలఁ దాటించిన ఘోటకంబు
వెగ్గలంబుగ మ్రొగ్గియు నగ్గలిక చెడక మోఁకరించుకొని
కొన్ని యడుగులు సని సేకరించుకొని కంచుమించుగఁ
బఱచుట గగనచరుల వెఱఁగు వఱిచె నట్లు పఱచినఁ
గందంబుఁ జఱచి మొగంబు దుడిచి ప్రస్తుతులఁ గుస్తరించి
యతిరభసఫూత్కారఘోరారావంబుతో ఘోణారంధ్ర
నిశ్శ్వాసగంధవాహప్రవాహంబు వెడలు వాహఁబు దగ
మట్టువడ నిట్టట్టు మట్టించుచు నాస్వారోచి నిశాచరునుద్వే
గంబు చూచికొనవలసి నిలిచి యంతన యతం డొక్క
తరువుఁ గరయుగళి నిఱియుంబట్టి పెల్లగింప మల్లాడునాలో
నన గల్లుఁ గింకిణులు మొరయ మెఱుంగు మెఱసినగతి
మరల హారిం బఱపి యొకటి రెండు మూఁడు గొరకల నెఱఁ
కులు గాఁగ గుబ్బకొలందికిం దిగవైచి మ్రాను విడిపించి
యొలయించుకొని బయలు వెడలించి దోషాచరుండు
పాషాణమ్ముల కెపుడెపుడు వంగె నపుడపు డెల్లం దురం
గంబు నటం దోలి గంటియాడి వెంటంబడుటయు గెంటించి
లేదు బంతి యన్న య ట్లల్లంత నుండి వాగె సడలించి
పగతుపై నిగిడి వాగెఁ గుదియలప ముంగాళ్లు గగనంబున
రా మగిడించి యందెచప్పుడుఁ గింకిణీరవంబును నురుమ
గిసినగతిఁ దేఁటి మ్రోసిన క్రియ నాదాఱక యేదిక్కుఁ
జూచిన నాదిక్కునవే వినంబడ నెక్కడఁ జూచినఁ దానయై

నీడ యేర్పడక పార్శ్వంబులంగట్టు కెంబట్టులాలసరి సముకట్టు
తెక్కలుగా యాతుధానుం డనుకొండచిలువ నొడియ
నేలపఱపుగా నాడుగరుడుం డనఁ బాయుచు డాయుచు
దవ్వులఁ బొలసి కుఱంగటఁ దోఁచి కుఱంగట నని చూడ
దవ్వులఁ బొలసి దవ్వుచేరువ లనిర్ధార్యంబులుగా మెలంగఁ
దేజికాశ్వంబు మెలంపుచు వింటనుం బంట్రకోలల నడిదం
బున నత్తలంబున నేసియు వ్రేసియు నడిచియుఁ బొడి
చియుఁ గడపలఁ గానక మిడిసి మృతుండునుఁ గాని
దానవునిం జూచి వేసరి రోసంబున. 115

టీ. ఇట్లు=ఈప్రకారముగా, తలపడి = తాఁకి, ఎదిరింపఁగా, అమ్మనుజదనుజులు = ఆనరుఁడును రక్కసియు, బీరంబులు = వీరగుణములు (సాహసములు), తోరంబులుగాన్=ఎక్కుడైనవి కాఁగా, పోరుతఱిన్=రణమొనర్చునపుడు, భూరమణుండు=స్వారోచి, క్రుద్ధుఁడై=రోషమునొందినవాఁడై, సమిద్ధరణిన్=రణరంగమున, బద్ధపరంపర = కట్టఁబడిన బారులుగలవి, అగునంపఱన్= అంపశరసముదాయముచే, నిలింపారాతిన్ = దేవవిరోధిని - దానవుని; పెంపఱన్=ఉద్రేకము నశించునట్లు, చంపరాదు = మడియింపఁ దరముకాదు. వితర్కించి = ఆలోచించి, బాణములను జప్పరించివేయు నీరాక్షసుని బాణసమూహముపైనేసి చంపుట యసాధ్యము. అని యోచించె ననుట. కించిత్తును= ఇంచుకయైనను, కొంచక = సంశయింపక, కాంచన...బును-కాంచనద్రవ= బంగారునీటిచే, కంచుకితంబును = పూఁతపూయఁబడినదియు, తరణి...బును- తరణి=సూర్యునియొక్క, ఖర=తీక్ష్ణమైన, కిరణకాండ = కిరణముల ప్రోవువలెఁ చండంబును=వాఁడిమిగలదియును, ఐ, అఖండ...చకన్=అఖండల = దేవేంద్రుని, దోర్దండ=కఱ్ఱలవంటివగు భుజములయందు, సముజ్జృంభిత = మిగుల విజృంభింపఁబడిన - మిగుల వెలుఁగునటులఁ జేయఁబడిన, వజ్రాయుధ=కులి

శరముయొక్క, చకచకన్ = చకచకమను ప్రకాశముతో. పకపకనవ్వ = పరిహాసముచేయు, వజ్రభేదియను అంగు = వజ్రభేదియను వాఁడిబాణము. (వజ్రభేది = వజ్రకవచమునుగాని వజ్రాయుధమునుగాని భేదించు సాయుధ మనియుఁ జెప్పవచ్చును) వెలుంగన్ = వెలుఁగఁగా, సామాన్యబాణముల కీరాక్షసుఁడు సాధ్యుఁడు గాఁడని బంగారునీరు పూసినదియు సూర్యకిరణములవలె మిగుల వాఁడిగలదియు వజ్రాయుధమును బరిహసించునదియు వజ్రభేది యను బాణమును స్వరోచి ప్రయోగించెను. అలం. ఉపమ. "పరిహాసముచేయు" అనునది యుపమావాచకము. ఉపమావాచకములు.. శ్లో. "స్పర్ధతే జయతి ద్వేష్టి ద్రుహ్యతి ప్రతిగర్జతి, ఆక్రోశత్యవజానాతి కదర్థయతి నిందతి. తస్య చానుకరోతీతి శబ్దాః సాదృశ్యవాచకాః ఉపమాయామిమే ప్రోక్తాః కవీనాం బుద్ధిసౌఖ్యదాః." (దండి) మత్తారులకున్ = మదించినవిరోధులకు, ఉత్తలంబు = పరితాపము, ఇమునత్తలంబును = కలిగించునట్టి యాఁటెను, పద్మరాగమణిచూడంబు = పద్మరాగమణులు (కెంపులు) చెక్కిన గ్రంథులుగలది, (కెంపులు చెక్కినగుబ్బలుగలది. దీనికిఁ గర్తడాలు). అగుకేడెంబును = అగునట్టి డాలునుఁబూని = పట్టుకొని, వేడెంబునన్ = చుట్టుపరువులచే, తురంగంబున్ = అశ్వమును, పఱపి = తోలి, తెఱపి = బైలు, కని = చూచి, తఱటుచేసి = చబుకుతోఁ గొట్టి, ఒప్పిచన్ = రాక్షసుని నశ్వము రాచుకొనిపోవునట్లు, ఉఱికించి = దాటించి, కఱకుటరిబరి - కఱకు = దిట్టఁడైన, అరి = శత్రువుయొక్క, బరిన్ = ప్రక్కలను, పఱతియువడన్ = చెక్కలు చేయునటుల, పొడిచి = (తనచేతియాఁటెతోఁ బలుమాఱు) పొడిచి, కడచి = తొలఁగి, నిలిచినన్ = నిలువఁబడఁగా, వెలుచనన్ = కోపముతో, బరిగోలపోటునన్ = పార్శ్వములఁ గ్రుచ్చునట్టి కోలయొక్క పోటుచే, (బరిసెతోఁ బొడుచుటచేత నని బ్రౌనుదొరవారి ప్రతి) ఆటోపి... వృత్తిన్ - ఆటోపించు = ఆట్టహాసముచేయునట్టి - చెలరేఁగునట్టి, మత్తకరివృత్తిన్ = గంధగజంబుచందంబున, నెత్తురు = రక్తము, ఒలుకన్ = దేహమునుండు చిందఁగ, నక్తంచరుండు = రాత్రిసంచరించువాఁడు - రాక్షసుఁడు,

ఉదంచితగతికిన్ = ఒప్పుచున్నటుల, సవ్యదిశకున్ = ఎడమవైపునకు (కుడివైపునకనియుఁ గలదు) ఒత్తి=రాచుకొని, తఱుమన్ = వెంటాడఁగా, అపసవ్యగతిన్=కుడితట్టునకుఁ జనునటుల, జాళింబునన్=ఓరనడకతో, హయంబున్=అశ్వమును, పోనిచ్చుచున్ = నడిపించుచు, అచ్చరకొడుకు = ఆయప్సరసకుమారుఁడు (స్వారోచి), తిరిగితిరిగి = చుట్టిచుట్టి, రాక్షసుఁడు కుడివైపునకు వచ్చిన రాజు ఎడమవైపునకు రాజు ఎడమవైపునకు వచ్చిన రాక్షసుఁడు కుడివైపునకుఁ దిరిగి, సింగిణిన్ = ధనుస్సుచే, ఏయుచున్ = బాణప్రయోగము చేయుచు, చుట్టికొనిరాన్ = (తను) ఆవరించివచ్చుచుండ, మనుజాశియున్=రాక్షసుఁడును, అట్టట్ట=రాజెట్టుకావించిన (తానును) నట్లె, వెనుకవెనుకకున్ = అడుగువెంట నడుగు వెనుకవైపునకె, అడుగిడుచున్ = నడుచుచు, అడ్డంబుగాన్ = స్వారోచి కడ్డుగా, అడవికడకున్= వనముతుదవఱకును, ఒత్తుకొని నడచి=తోసికొనుచుం బోయి, ఒడుదొడుకు = ఇక్కట్టు, అగుడున్=కాఁగా, బెడిదంపునడకన్ = శీఘ్రగమనముచే, అడరి= సంతసించి, కడకాళ్లకున్ = గుఱ్ఱముయొక్క ముందుకాళ్లకొఱకు, ఒడియన్ = ఒడిసిపట్టరాఁగా, స్వారోచిని నెదుర్కొనుచు రాక్షసుఁడు రాఁగా నాతఁడు గుఱ్ఱమును వెనుకడుగువేయించుచు వనముతుదివఱకుఁ దీసికొని పోయెను. ఇంక గుఱ్ఱము పోఁదగినచోటు లేదని రాక్షసుఁ డానందించి యొడిసి గుఱ్ఱపుముందుకాళ్లు పట్టుకొనఁ బ్రయత్నించెను. తుక్ఖారంబు=గుఱ్ఱము, రక్కసునకున్=దానవునకు, చిక్కెన్ = దొరకెను. అనుచాలోనన్ = అని యనుకొనుచున్నంతలోన, పుడమిపతి=రాజు, పెడవిసరు = ప్రక్కవాటుగావిసరు విధముగా, విసరి = ఊటెను విసరివేసి, అసురవరుకరాంగుళంబులు=రక్కసుని చేతివ్రేళ్లు, తెగన్=తెగునట్లు, అడిచెన్ = కొట్టెను, అడిచినన్ = అట్లుకొట్టినప్పటికిని, నుడివడక=స్రుక్కక, మడమలన్=కాలిమడమలతో, తాటించినన్= తాడింపఁగా, ఘోటకంబు=తురగము, పెగ్గలంబుగన్=మిగుల, మ్రొగ్గియున్= ముందఱికి వంగునట్లు వడియును, అగ్గలిక = ఆతురత, పెడక = చెడి

పోక, మోఁకరించుకొని = మోఁకాళ్లమీఁద నిలువంబడి కొన్నియడుగులం (దూరము) చని, సేకరించుకొని = సేదదేఱి తెప్పరిల్లి (సకిలించి యనికొందఱు) కంచుమించుగన్ = కనఁబడకుండ చూచువారికన్నులకుఁ గానరానివిధముగా, ప్రయోగములను బట్టిచూడఁగాఁ గంచుమించుగా ననుపదమునకుఁ జెల్లాచెదరు అనునర్థము గానవచ్చుచున్నది. చూడుఁడు.—

సీ. "మేదినీంద్రులు కంచుమించుగాఁగ." (దశావతారచరిత్రము.)

ద్విపద. "వంచన గననీక వలపించి నేఁడు, కంచుమించుగ ఘోరకాననంబునకు" (ప్రభులింగలీల.)

సీ. "కంచుమించుగ నెంచు నంచ నెంచఁగ సంచరించుపల్కులతేని తనము." (అచలాత్మజాపరిణయము. ఆ. 3.)

పఱచుట = పరుగిడిపోవుట, గగనచరులన్ = ఆకసమునం దిరుగుదేవతలను, వెఱఁగుపఱిచెన్ = అచ్చెరువుపడున ట్లొనర్చెను, పడఁబోయి యూపుగొని యలపటలీతినంతన యసురునకుఁ జిక్కక గుఱ్ఱ మేఁగుట దేవతలకుఁగూడ సంతోషము కలుగఁజేసెను. అట్లు = ఆచొప్పున, పఱచినన్ = పరుగెత్తఁగా కంపంబుఁజఱచి = మూఁపుపైజఱచి, మొగంబు = మొగమును, తుడిచి = దువ్వి, ప్రస్తుతులన్ = పొగడికలచే, బుస్తరించి = బుజ్జగించి, అతి...తోన్- అతి=మిగుల, రభస=వడిగావచ్చు, ఫూత్కార = ఫూత్కృతధ్వనితో, ఘోర = భయముం గలిగించు, ఆరావంబుతోన్ = చప్పుడుతో, ఘోణా...హంబు- ఘోణారంధ్ర = ముక్కుపుటములనుండి పుట్టెడు, నిశ్వాస = ఊపిరియొక్క, గంధవాహ = వాయువుయొక్క, ప్రవాహంబు=వెల్లువ (పరంపర), వెడలించు వాహంబున్=ఉప్పతిల్లుచున్న యశ్వమును, దగ=శ్రమమును, మట్టువడన్ = శాంతించునటుల, ఇట్టట్టుమట్టించుచు = ఇటునటు నడిపించుచు, నిశ్వాస పరంపరలవలన నశ్వము అలసటనొందినసంగతి రాజు గ్రహించి యలసటదీఱు నంతవఱకు నిటునటు త్రిప్పెను. స్వరోచి, నిశాచరుదుర్యోగంబున్=అరక్కసి చేయఁబోవు యత్నమును, చూచికొనవలసి = తెలిసికొనవలసి, నిలిచి, అంతన—

అంకలోనె, అతండు = ఆదనుజుండు, ఒక్కకరువుఁ = ఒకచేతను, కర
యుగళిన్ = రెండుచేతులతో, ఇఱియంబట్టి = కలయంబట్టుకొని, వెల్లగింపన్ =
ఊడఁదీయుటకై, మల్లాడుసాలోనన = ఆల్లాడుచున్న యాసమయములోనె,
ఘల్లునన్ = ఘల్లుమని, కింకిణులు = చిన్నగంటలు, మొరయన్ = మ్రోఁగగా,
మెఱుంగు = మెఱపు, మెఱసినగతిన్ = వెలిఁగినట్లుల, మరలన్ = మరల, హరిన్ =
గుఱ్ఱమును, ఱఱపి = వానిపైకి నడపి, ఒకటిరెండుమూఁడు, గోరకలన్ = (ఇనుప
బాణములచేత, ఇది నారాచపదమునకుఁ బర్యాయపద మనికొందఱు. గుజ్జీ:బె
లని కొందఱు చెప్పుచున్నారు.) నెఱకులు = మర్మములు, కాడన్ = గ్రుచ్చు
కొనునటుల, గుబ్బకోలందికిన్ = బాణము క్రింద నుండు పిడివఱకు, దిగనైచి =
దిగునట్లుచేసి, వింట నమ్మును సంధించి పిడివఱకు నసురుని మేన నాటునటులఁ
బ్రయోగించి, మ్రాను = ఊడఁదీయఁచున్నచెట్టును విడిపించి = విడుచునట్లుచేసి
ఎలయించుకొని = తనవైపునకుఁ జేరవచ్చునట్లుచేసికొని, బయలు వెడలించి =
ఆమరుగుచోటునుండి బహిరంగస్థలమునకుఁ గొనివచ్చి, దోషాచరుండు =
నిశాచరుఁడు, పాషాణమ్ములకున్ = ఱాళ్లకొఱకు, ఎపుడెపుడు వంగెన్ =
ఎప్పుడెప్పుడువంగెనో, అపుడపుడెల్లన్ = అప్పుడప్పుడే, తురంగంబున్ = గుఱ్ఱం
బును, అంటం దోలి = దగ్గఱకు నడపి, గంటియిడి = వానిదేహమునిండ
గాయములు గలుగఁజేసి, మ్రాను పెఱుకునదనెఱింగి బాణములఁ బ్రయోగించి
యాటంక పఱచెను. పైని విసరుటకు ఱాల నేరుచుండ నాయదనున స్వరోచి
యసురను సమీపించెను. సమీపించి గాయపఱుపఁగా, వెంటంబడుటయున్ =
రాక్షసుఁడు వెంబడింపఁగా, గెంటించి = దాఁటఁ దోలి, లేమ బంతి యన్న
యట్లు = అసత్యమనురీతిని-నీకుఁజిక్కుటయసంభవ మనువిధముగా, అల్లంత పుడి =
ఆంతదూరమునుండి, వాగె సడలించి = కళ్లెమును వదులుచేసి, పగతుపైన్ =
విరోధిమీఁద, నిగిడి = కవిసి-పైఁబడియనుట, వాగెన్ = కళ్లెమును, తుది
యింపన్ = వెనుకకుఁ గుదించిపట్టఁగా, ముంగాళ్లు = ముందటికాళ్లు గగ
నంబునన్ = ఆకాశమునందు, రాన్ = వచ్చునట్లు, మగిడించి = మరలించి, అంతె

చప్పుడును = గజ్జెపుగాలియందెల ధ్వనియును, కింకిణీరవంబును = మువ్వల చప్పుడును, ఉరుమగీసినగతిన్ = ఉరుమ యను వాద్యవిశేషము వాయించినట్లు, (తప్పెటవలె గుండ్రముగానుండు చట్రముపైఁ దోలుతొడుగఁబడి చుట్టుగలజనకుఁ దాళ్ళములు బిగించియుండు నొకవాద్యమును ఉరుమ యందురు. దీనిని జేతితో గీసినంతన మ్రోఁతపుట్టును.) తేఁటి=తుమ్మెద, మ్రోసిన క్రియన్= ఝంకరించినట్లు, నాదు=ధ్వని, ఆఱక = చల్లాఱక, ఏదిక్కుఁజూచినన్ = ఏదెసఁ గనుఁగొనినను, ఆదిక్కున నే = ఆదిశాభాగమునందె, వినంబడన్=వినఁబడఁగా, ఎక్కడఁజూచినన్ = ఎక్కడఁగాంచినను, తానయై = తానేయై, తాను దప్ప మఱియేదియుఁ గానరాకుండునట్టుల, నీడ ఏర్పడక = బాగుగా నీడకనంబడక, పార్శ్వంబులన్ = రెండుప్రక్కలను, కట్టుకెంబట్టుజాలరి = కట్టినయెఱ్ఱనిపట్టుజాలరు, సమకట్టు ఱెక్కలుగాన్ = కూర్చిన ఱెక్కలవలెఁ గాఁగా, యాతుధానుండు = దనుజుఁడు, అనుకొండచిలువన్ = అనువట్టి కొండలయందుండు పామును (కొండచిలువ = దుండుపాము), ఒడియన్ = పట్టుకొనుటకు, నేలవఱపుగాన్ = నేలకు మిగులఁ జేరువఁగా, అనుగరుడుండు= ఱెక్కలవిచ్చియాడుచున్న గరుత్మంతుఁడేమో, అనన్ = అని తలచునట్లు, పాయుచున్ = దూరముగాఁ దొలఁగిపోవుచు, డాయుచున్ = సమీపమున కేఁగుదెంచుచు. (అలం-ఉత్ప్రేక్ష) దవ్వులన్ = దూరమున, పొలసి = సంచరించి, చేఱంగటన్ = సమీపమున, తోఁచి = అగపడి, కుఱంగటన్ = దగ్గఱగా, అని = కలదని, చూడన్ = చూడఁగా, దవ్వులన్ = దూరముగా, పొలసి = మెలంగి, దవ్వుచేరువలు = దూరమును దగ్గఱయు, అనిర్ధార్యంబులు = నిర్ధారణచేయ నలవి కానివి, కాన్ = అగుచుండ, మెలంగన్ = ప్రవర్తించునట్లు, అంతలో సమీపంబునను అంతలో దూరమునను ఉండి చేరువలో నున్నదనిగాని దూరముగా నున్నదనిగాని నిర్ధారణచేయవీలుగానివిధముగాఁ బ్రవర్తించుచు గుఱ్ఱము సంచరించెను. తేజికాశ్వంబున్ = మేలైన తేజీని, మెలంపుచున్ = నడుపుచు, వింటన్ = విల్లుచే, యంత్రకోలలన్ =

ములుకులుగల కొయ్యబాణములచేతను, అడిదంబునన్ = కత్తిచేతను, అత్తలంబునన్ = ఈఁటెతోడను, ఏసియున్ = వేసియు, వ్రేసియున్ = కొట్టియు, అడిచియున్ = నఱికియు, పొడిచియున్ = పోటుపొడిచియు, వింట బాణముల సంధించి ప్రయోగించియుఁ బత్రకోలలతోఁ గొట్టియు ఖడ్గముతో ఖండించియు నీఁటెతోఁ బొడిచియు నింకఁ బెక్కుతెఱఁగుల ఖండించినను, కడపలన్ = అంతమును, కానక = చూడలేక, మిడిసి = మిట్టి మృతుండును = మరణించినవాఁడును, కానిదానవునిన్ = కాకుండుదనుజుని, చూచి, వేసరి = విసివి, (బడలి యని కొందఱు) ఎన్నివిధముల యత్నించినను రాక్షసుఁడు చావకుంటచే విసిగి, రోసంబునన్=కోపముచే. పైపద్యముతో నన్వయము.

క. భూపతి పావకబాణం
బేపున సంధించి తివిచి యేసిన మెయిఁ గీ
లాపటలి పొదువ నతఁడా
రూపం బెడఁబాసి ఖేచరులు వెఱఁగందన్. 116

టీ. భూపతి = స్వరోచి, ఏపునన్ = ఉత్సాహముతో, పావకబాణంబు = అగ్నిదేవతాకమైనబాణమును - ఆగ్నేయాస్త్రమును, సంధించి = సజ్జముచేసి (నారింగూర్చి), తివిచి = చెవివఱకు లాగి, ఏసినన్ = విడువఁగా, ఆబాణముచేత, మెయిన్ = రాక్షసునిదేహమునందు, కీలాపటలి = మంటసమూహము, పొదువన్ = చుట్టుకొనఁగా, అతఁడు = దనుజుఁడు, ఆరూపంబు = అప్పటితనరాక్షసాకారమును, ఎడఁబాసి = వదలి, ఖేచరులు = ఆకాశమునందు సంచరించువారలు - దేవతలు, వెఱఁగు = ఆశ్చర్యంబును, అందన్ = పొందునట్లు. పైపద్యముతో నన్వయము.

తా. రా జాగ్నేయబాణముం బ్రయోగింపఁగా దానిమంటలు రాక్షసునిదేహమును జుట్టుకొనియెను. అంత వానిరాక్షసాకారము పోయి దేవతల కాశ్చర్యము కలిగించునట్లు.

లయవిభాతి:—

ధగధగనిదేహరుచి నిగనిగనికుందనపుఁ
దగడుఁ దెగడన్ జిగురుజిగినెగచుమోవిన్
నగవు నిగుడన్ గురులపొగరు మగుడన్ నయన
యుగళి వెలిదామరల మగలమగలై డా
లెగయ మృగనాభిభుగభుగ లెసఁగఁ జామరలు
మగువ లిడ మౌళిమణి మిగులఁగ వెలుంగన్
దెగలు గలహారములజిగి చెలఁగఁగాఁ గొదమ
మొగులఁ దగుయానమున గగనచరుఁ డయ్యెన్.117

టీ. ధగధగనిదేహరుచి = ధగధగమనుశరీరచ్ఛాయ, నిగనిగనికుందనపుఁదగడున్ = నిగనిగలాడుమేలిమి బంగారుఱేకును, తెగడన్ = తిరస్కారముచేయఁగా-మేలిమిబంగారుకాంతిని మించి వెలుఁగు దేహకాంతితో, జిగురుజిగిన్ = పల్లవములయొఱ్ఱనికాంతిని, ఎగచుమోవిన్ = తోలివేయు నధరమునందు-తిరస్కరించు నట్టి యెఱ్ఱనిపెదవులయందు, నగవు = చిఱునవ్వు, నిగుడన్ = పుట్టఁగా, ఎఱ్ఱఁగా నుండు పెదవుల మధ్యనుండి ప్రసరించు తెల్లనిదంతకాంతులు మిగుల మనోహరముగా నుండును. కురులపొగరు = తలయందున్న వెండ్రుకలనైల్యము, మగుడన్ = మరలఁగా, నయనయుగళి = నేత్రద్వయము, వెలి...మగలై-వెలిదామరల = పుండరీకములకు, మగల = మేలైనవానియొక్క, మగలై = అధిపతులై, నిడుపలువెడఁదలు నగు తెల్లఁదామరపూవులవలె నున్న తెలిగన్నులయొక్క, డాలు = ప్రభలు, ఎగయన్ = విస్తరిల్లఁగా, మృగనాభిభుగభుగలు = భుగభుగయను కస్తూరియొక్క పరిమళములు, ఎసఁగన్ = వృద్ధిపొందఁగా, చామరలు = చామరములు, మగువలు = ఆఁడువాండ్రు, ఇడన్ = పట్టఁగా - విసరఁగా, మౌళిమణి = కిరీట రత్నము, మిగులఁగన్ = మిక్కిలిగా, వెలుంగన్ = కాంతులు ప్రసరింపఁగా-

రత్నస్థగిత మగు కిరీటమునందలి వివిధరత్నముల మనోహరములగు కాంతులు నాలుగుదెసలను వ్యాపింపఁగా, తెగలు = పొడవులు, కలహారములజిగి=కలిగి పట్టి గళమునందలి దండలయొక్క కాంతి, చెలఁగఁగాన్ = వెలయఁగా, క్రొందమ మొగులన్ = తరుణమేఘమునందు - అపుడె వ్యాపించుచున్న నల్లని మబ్బునయి, తగుయానమునన్ = ఉచితమైన విమానములో, గగనచరుఁడు= ఆకసమునం జరించువాఁడు (గంధర్వుఁడు), అయ్యెన్=అయ్యెను.

తా. ఆరాక్షసుఁ డాగ్నేయబాణముచే నశించి బంగారుచాయగల మేనును, లేఁజిగుళ్లవంటి మోవిపైఁ బ్రకాశించు నంద మగునగవును, దీర్ఘము లైన తలవెండ్రుకలును, తెల్లదామరలం బోలిన కన్నులును గలగంధర్వాకారముం దాల్చి, కస్తూరిమిశ్రమై మేనఁబూయఁబడిన గంధపుఁదావులునిండార, స్త్రీలు, వీచోపు లిడుచుండ విమానారూఢుఁడై కిరీటమణులును గంఠహారము నందలి మణులకాంతియుం బ్రసరింప నాకాశమార్గమునఁ గానఁబడియె. అలం. ఉపమ-ఉదాత్తము.

క. నవనవసౌరభముల నె
క్కువ కువలయవర్ష మపుడు గురిసెన్ మొరసెన్
రవరవ మురజరవంబులు
దివి దివిషజ్జలజముఖులు దెలిసి నటింపన్. 118

టీ. అపుడు = అట్టిసమయమునందు, దివిన్=గగనమునందు, నవనవ సౌరభములన్=మిగులనూతనమైన సువాసనలచే, ఎక్కువకువలయవర్షము = మిక్కిలి యగు కల్వపూవులవర్షము, కురిసెన్ = వర్షించెను. దివిషజ్జలజముఖులు=దేవతాంగనలు(అచ్చరలు), తెలిసి=ఈగంధర్వునివృత్తాంతము నెఱిఁగి, గంధర్వుఁడు శాపవిముక్తుఁడై రాక్షసరూపము తొలఁగిన యంశమును దెలిసికొని, నటింపన్ = నృత్యమొనర్పఁగా, రవరవమురజరవంబులు=రవరవయను మృదంగనాదములు, మొరసెన్=మ్రోఁగెను.

తా. స్వరోచి రాక్షసునిపై నాగ్నేయాస్త్రమును బ్రయోగింపఁగా నాతఁడు పూర్వరూపమును దొరంగి వెంటనే, గంధర్వరూపముం గొనినటులఁ దెలిసికొని దేవతలు కవలయ పుష్పవర్షముం గురిసిరి. అప్సరస లాడుచుండ మద్దెల వాయించిరి.

వ. అనిన విని తరువాతివృత్తాంతంబు వినుటకుం దివుటమై మదీయమానసంబు కౌతుకాధీనం బయ్యెడు వినిపింపుఁ డని యడుగుటయును. 119

టీ. అనినన్ = ఈప్రకారము శకుంతములు పలుకఁగా, విని, (జైమిని) తరువాతివృత్తాంతంబు = అనంతరకథను, దివుటమైన్ = ఆసక్తితో, వినుటకున్ = ఆలకించుకొఱకు, మదీయమానసంబు = నాహృదయము, కౌతుకాధీనంబు = కుతూహలపడుచున్నది. అయ్యెడున్ = అగుచున్నయది, వినిపింపుఁడు = నాకు వినఁజెప్పుఁడు. అని యడుగుటయున్ = అని పక్షులను గోరఁగా, (ఇక్కడి కాశ్వాసము పూర్తియైనందున నన్వయము పంచమాశ్వాసములోని రెండవపద్యములోఁ బక్షులు చెప్పినట్లు కలదు).

శా. శ్లాఘాలంఘనజాంఘికోజ్జ్వలగుణాలంకార ఘీంకారహే
హాఘోషోద్భటధాటికాగజఘటాశ్వోత్తుంగనిశ్వంభరా
మోఘీభూతభుజంగభోగభర సంఫుల్లాబ్జపత్రేక్షణా
ద్రాఘీయఃప్రతిభావిచక్షణ త్రయీధర్మైకసంరక్షణా. 120

టీ. శ్లాఘా...కార-శ్లాఘా = పొగడికను, లంఘన = అతిక్రమించుట యందు, జాంఘిక = పిక్కబలిమిగలిగిన, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, గుణ = సుగుణములు, అలంకార = ఆభరణములు గాఁగలవాఁడా-కొనియాడ శక్యము గాని యుత్తమగుణములే భూషణములుగాఁ గలవాఁడా యనట, ఘీంకార ...భోగభర - ఘీంకార = గీపెట్టుటల యొక్కయు, హేహా = సకిలించుటల యొక్కయు, ఘోష = నాదముతోడి, ఉద్భట = ఎక్కుడగు, ధాటికా = పరు

ప్రయాణమునందలి, గజఘటా = ఏనుఁగులమందలచేతను, అశ్వ=గుఱ్ఱముల చేతను, క్షుణ్ణ=నలఁగిన, విశ్వంభరా = వసుధచే, మోఘీభూత = వృథచేయఁ బడిన, భుజంగ = ఆదిశేషునియొక్క, భోగభర = పడగలబరువుగలవాఁడా, దిగ్జైత్ర యాత్రలయందు గీపెట్టుచు నేనుఁగులు సకిలించుచుగుఱ్ఱములు తెంపు లేక పయనములు గావించుటచే నా త్రొక్కుడివలన భూమిపైనుండి దుమ్మం తయుం లేవఁగా భూమిబరువు తగ్గెననియు నందుచే నాదిశేషునకు భూభారము తగ్గించినవాఁడా యనిభావము. సంఫుల్లాబ్జపత్త్రేక్షణా=చక్కఁగావిరిసిన తామర రేకులంబోలిన నేత్రములు గలవాఁడా, ద్రాఘీయః ప్రతిభావిచక్షణ - ద్రాఘీయః = విస్తారమయిన, ప్రతిభా=బుద్ధివిశేషముచే, విచక్షణ = నేర్పుగల వాఁడా-యుక్తసమయములం దుపకరించు సద్యఃస్ఫురణముగల గొప్పబుద్ధి గలవాఁడా, త్రయీధర్మైకసంరక్షణా - త్రయీ = వేదములయందుఁ జెప్పఁ బడిన, ధర్మ=ధర్మములయొక్క, ఏక = ముఖ్యమైన, సంరక్షణ = రక్షించుట గలవాఁడా! వేదములచేఁ జెప్పఁబడిన ధర్మములు స్థాపించి వర్ణాశ్రమధర్మము లను గాపాడుచున్నవాఁడా! శ్రీకృష్ణదేవరాయా! అలం. అత్యుక్తి.

తా. పొగడుటకు సాధ్యముగాని సుగుణములు గలవాఁడా! యుద్ధ యాత్రవేళలు నేనుఁగుల గుఱ్ఱములసడకచే నలఁగి భూమి రజమై యెగిరి పోవుటచే సర్పరాజునకు భూమివహించుభారమును దగ్గించినవాఁడా, పద్మ ములవంటి వికచనేత్రములు గలవాఁడా, బుద్ధి విభవము గలవాఁడా, వేద మార్గధర్మప్రతిపాలనము చేయువాఁడా! యని కృష్ణదేవరాయలంగూర్చిన కవిసంబోధనములు.

క. బహువీరహననమిళదఘ
వహనభ్రమకృత్కళంకవర్గో గ్రాసి
గ్రహిళభుజయుగళ గజప
త్యహితాపహరణతార్క్ష్య శ్రీసజ్జనావనదక్షా. 121

టీ. బహు...యుగళ-బహు=అనేకులైన, వీర = యుద్ధవీరులయొక్క, హనన=చంపుటచే, మిళత్=సమకూడిన, అఘ=దోషముచు, వహన=మోయుంట-యొక్క, భ్రమకృత్=భ్రాంతిగలిగించుచున్న, కళంక=నల్లనికాంతియొక్క, వర్ధ=పోవుచే, ఉగ్ర=భయజనకమైన, అసి = కత్తిని, గ్రహిళ=పట్టుకొనిన, భుజ=భుజములయొక్క, యుగళ=ద్వంద్వముగలవాఁడా, అనేక విరోధి రాజులను జంపుటచేఁ గల్గినపాపములన్నియుఁ దనయందుఁ బ్రవేశించెనేమో. యనునటుల నొప్పు నల్లనిచాయలచే నలరారు భయంకరఖడ్గమును గేలఁ దాల్చిన వీరాధివీరుఁడా! గజ...తార్క్ష్య-గజపతి=కళింగదేశ ప్రభువగు గజపతి యనెడు, అహిప = పాఁవుఱేని, హరణ=పట్టుకొనుటయందు, తార్క్ష్య= గరుడుఁడైనవాఁడా, గరుత్మంతుఁడు పామును బట్టుకొనినవిధముగా నిరాయాసముగా గజపతిని బట్టుకొనినవాఁడా, సజ్జనావనదక్ష = మంచివారిని రక్షించుటయందు సమర్థుఁడా, శిష్టరక్షణకుశలుఁడా శ్రీకృష్ణదేవరాయా యని. కృతిపతికి సంబోధనము. అలం. భ్రాంతిమంతము. ఉత్ప్రేక్ష. రూపకము.

తా. అనేకులం జంపుటచేఁ గల్గినదోషము లేమో తనయందుఁ బ్రతిఫలించుచున్న వని సంశయము పుట్టునట్టున్న నల్లనిచాయలుగల కత్తిం దాల్చిన వాఁడా! గజపతి యను పామును బట్టుటకు గరుత్మంతునివంటివాఁడా! సజ్జనులను రక్షించువాఁడా!

పృథ్వి. సుధీమధురవాక్సుధాసుముఖ నాగమాంబాసుతా
 మధుప్రసవసాయకస్మయవిరామరమ్యాకృతీ
 దధీచవిధుకామధుగ్ఘనదదుగ్ధసింధుప్రథా
 వధీరణపరాయణోజ్జ్వలవదాన్యతాలంకృతా. 122

టీ. సుధీ...సుముఖ - సుధీ=పండితులయొక్క, మధుర=రుచికరములైన, వాక్=వాక్యము లను, సుధా=అమృతమునకు, సుముఖ=ఎదురుచూచువాఁడా, నాగమాంబాసుతా = నాగమ్మపుత్త్రుఁడా, మధు...కృతీ - మధు=

వసంతునియొక్కయు, ప్రసవసాయక = పుష్పబాణుఁడగు ఆమన్మథుని యొక్కయు, స్మయ = గర్వమును, విరామ = ఆపివేయు, రమ్య = సుందరమైన, ఆకృతీ = రూపముగలవాఁడా, దధీ...లంకృత - దధీచ = దధీచముని యొక్కయు, విధు = చంద్రునియొక్కయు, కామధుక్ = కామధేనువు యొక్కయు, ధనద=కుబేరునియొక్కయు, దుగ్ధసింధు=క్షీరాబ్ధియొక్కయు, ప్రథా=ప్రసిద్ధిని, అపధీరణ = తిరుగుబాటు చేయుటయందు, పరాయణ = నిష్ఠగల, ఉజ్జ్వల = ప్రకాశించుచున్న, వదాన్యతా = దానగుణముచే, అలంకృతా=అలంకరింప బడినవాఁడా.

ఇందు రాయల విద్వత్ప్రియతయు, ఆభిజాత్యమును, సౌందర్యాతిశయమును, ఔదార్యాతిశయమును జెప్పఁబడెను.

(దధీచి ఇంద్రునకు వజ్రాయుధము లభింపఁజేయుటకు వెన్నెముక నొసంగుటయుఁ జంద్రుఁడు వేలుపులకుఁ దనకళలఁ బానముచేయ నొసంగుటయుఁ గామధేనువు కోరినవారికామికములు కడమపడక తీర్చుటయుఁ, గుబేరుఁ డర్థులకు లేదనక ధనము నొసంగుటయు, సింధువు తరచినంతన కల్పకామృతాదుల నొసంగుటయుఁ బ్రసిద్ధములగు పురాణకథాంశములు.)

తా. పండితులవాక్యములు వినుటయం దాదరము కలవాఁడా! నాగమాంబకుమారుఁడా! వసంతమన్మథులమించిన సుందరాకారముగలవాఁడా! దధీచి, చంద్రుఁడు, కామధేనువు, కుబేరుఁడు, పాలసముద్రము మొదలగు వీనికిఁగల ప్రఖ్యాతికంటె మించినదానగుణమునందలి ప్రఖ్యాతి గలవాఁడా!

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీన మానసేందిందిర నందవరపురవంశోత్తంస శఠకోపతాపసప్రసాదాసాదితచతుర్విధకవితామ

తల్లి కాల్లసాని చొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్యప్రణీతంబైన స్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

టీ. శ్రీమ...ప్రణీతంబు-శ్రీమత్=విద్వత్సంపదగల, ఆంధ్రకవితాపితామహ = ఆంధ్రకవిత్వమునకు బ్రహ్మయగు, సర్వతోముఖ = అంతట వ్యాప్తిగల, అంక = బిరుదుగల్గినట్టియు, పంకజాక్ష = విష్ణువుయొక్క, పాదాంబుజ = పాదపద్మములకు, అధీన = వశమైన, మానసేందిందిర=మనస్సను తుమ్మెదగలట్టియు, నందవరపురవంశోత్తంస = నందవర మనెడి యూరి వారివంశమున (నందవరీకకులమున) శ్రేష్ఠుఁడగునట్టియు, శఠకోపతాపస = శఠకోపయతియొక్క, ప్రసాద=కృపచే, ఆసాదిత=పొందఁబడిన, చతుర్విధ = నాల్గువిధములగు (బంధ, చిత్ర, గర్భ, ఆశుకవనములు), కవితామతల్లిక = శ్రేష్ఠకవిత్వముగలట్టియు, అల్లసానిచొక్కయామాత్య పుత్త్ర = అల్లసాని చొక్కయమంత్రికిఁ గుమారుఁడగునట్టియు, పెద్దనార్య = పెద్దనార్యునిచే, ప్రణీతంబు = రచియింపఁబడినది, మహాప్రబంధంబునందున్ = మహాకావ్యమున, చతుర్థాశ్వాసము.

ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనాసమాసాదితాఖండసాహితీధురీణుండును నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్లవంశపయోరాశిరాకాసుధాకరుండు నగురామస్వామిశాస్త్రిచేత ననేక పూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచియింపఁబడిన రుచిసమాఖ్యానం బగువ్యాఖ్యానంబునందుఁ జతుర్థాశ్వాసము.

శ్రీరస్తు

# మనుచరిత్రము.

## సటీకము

## పంచమాశ్వాసము

శ్రీనందనసౌందర్య సు
ధీనందన వితరణావధీరితబలిరా
డ్భానుజ పరరాజస్వ
ర్భానుభుజాహీంద్ర కృష్ణరాయనరేంద్రా. 1

టీ. శ్రీ = లక్ష్మికి, నందన = పుత్త్రుఁడైనమదనునివంటి, సౌందర్య = అందముకలవాఁడా! సుధీ = పండితులను, నందన = ఆనందపఱుచువాఁడా! వితరణ = దాతృతచే, అవధీరిత = కొఱవడఁజేయఁబడిన, బలి=బలిచక్రవర్తియును, రాట్=చందురుండును, భానుజ = కర్ణుండును గలిగినవాఁడా! పర= విరోధిరాజులనెడి, రాజ=చంద్రులకు, స్వర్భాను = రాహువను, భుజ=భుజమనెడు, అహీంద్ర = భుజగోత్తమము గలిగినవాఁడా! కృష్ణరాయనరేంద్రా! అని కృతినాయకసంబోధనము.

తా. ఎక్కువచక్కఁదనమును నీవియును విరోధినృపాలురను భక్షించుకొను శక్తియును గలవాఁడా! అలం. రూపకము. నిదర్శనము. అతిశయోక్తి.

వ. అవధరింపుము. జైమినిమునీంద్రచూడారత్నంబునకు నీడోద్భవంబు లి ట్లనియె. 2

టీ. అవధరింపుము=ఆలకింపుము. జైమిని=జైమిని యను, మునీంద్ర=మునిశ్రేష్ఠులలో, చూడారత్నంబునకున్ = శిరోరత్న మైన యాతనికి-మునిశ్రేష్ఠులలో నుత్తముఁ డగు జైమిని మహామునికనుట, నీడోద్భవంబులు = (గూటియందుఁ బుట్టిన) కథను జెప్పఁ బట్టి ధర్మపక్షులు, ఇట్లనియెన్=ఈప్రకారముగాఁ జెప్పఁ దొడంగెను.

తే. అపుడు గంధర్వపతి మహి కవతరించి
రాజు విస్మయమున హయరాజు డిగ్గ
నక్కుఁ జేర్చె ముదంబుతో ననియె దంత
కిరణములు హారకాంతులు సరసమాడ! 3

టీ. అపుడు, గంధర్వపతి=(రాక్షసుఁడుగా నుండి స్వరోచి బాణప్రయోగముచేఁ బూర్వరూపము గోలుపోయి స్వస్వరూపమొందిన) గంధర్వరాజన్యుఁడు, మహికిన్=భూమికి, అవతరించి = (విమానము మీఁదినుండి) దిగి, రాజు = స్వరోచి, విస్మయమునన్=ఆశ్చర్యముతో (తనతోఁ బ్రతిఘటించి పోరిన రాక్షసుఁ డాకస్మికముగా గంధర్వుఁ డగుటయే యాశ్చర్యకారణము). హయరాజున్ = శ్రేష్ఠమైన గుఱ్ఱమును, డిగ్గన్ = దిగఁగా ఆక్కుఁజేర్చి = ఆలింగనము చేసికొని, ముదంబుతోన్ = సంతసమున, దంతకిరణములు=పలువరుసల కాంతులును, హారకాంతులున్=పెద్ద నున్న ముత్తెపు స్ఫటికపు దండల తెలికాంతులును, సరసమాడన్=కలయికను బొందఁగా,(తెల్లని దంతకాంతులును హారముల తెలిరుచులు నొకదానితో నొకటి కలసి మెలసి సరసమాడుచున్నట్టులు గనవచ్చుచుండ) అనియెన్=పలికెను. (ముందు పద్యముతో నన్వయము). దంతములు హారములందలి ముత్తెములులో నగునవి శ్వేతగణములోని వనుటకు—

శ్లో. "శుభ్రాణి భారతీ ధర్మశేషేశవరణేందవః...
ముక్తాకుసుమనక్షత్ర దన్తస్వేదాంబుబిందవః." (కావ్యకల్పత.)

తా. అప్పుడు రాక్షసత్వము (రాక్షసరూపమును) వీడి నిజరూపమును బూనిన గంధర్వరాజు విమానమునుండి భూమిమీఁదికి డిగి తన్ను వీక్షించి యద్భుతముతో నశ్వముం దిగిన స్వరోచిని మోదంబున నాలింగనము చేసి యిట్లనెను. అలం-ఉపమ.

సీ. భద్రమా నీకు నీబాహాభృతక్షితిఁ
బ్రజలకు లెస్సలా రాచవారు
ధన్యుండ నైతి నీదర్శనమ్మునఁ జేసి
నాదుష్కృతములెల్ల నాశ మొందె
నీజగత్త్రయి నన్ను నిందీవరాక్షాఖ్యుఁ
గీర్తించు నప్సరోగీతసరణి
గారాపుమీతల్లి కడవాఁడఁ గాని నే
గణుతింపఁ గడవాఁడఁ గాఁజుమయ్య

తే. పెండ్లికొడుకవు మాకు నీవిసరుహాక్షి
కూర్మినందన యొకమౌనిఘోరశాప
వికృతి మాసినీదిండి నై యకట దీని
ప్రాణముల కల్గఁ దలఁచితి బాపబుద్ధి. 4

టీ. నీకున్, నీబాహాభృతక్షితిన్=(నీ పరిపాలనయందున్నభూమిలో) నీ భుజములచే భరింపఁబడిన భూమియందు, ప్రజలకున్ = మనుజులకు, భద్రమా = క్షేమమే కదా? రాచవారు = బంధురాజులు-సాటివారగు క్షత్రియవంశజులందఱు, లెస్సలా = చక్కఁగా నున్నవారుకదా? నీదర్శనమ్మునఁ జేసి=నీయొక్క సందర్శనముచేత-నిన్నుఁజూడఁ గలుగుటచేత, ధన్యుండనైతిన్ = కృతార్థుఁడనైతిని (నీదర్శనసిద్ధికతన రాక్షసజన్మ తొలంగిన దని

కృతజ్ఞతా పూర్వకముగా నొప్పుకొనుట.) దుష్కృతములు = దురితములు, పాతిన జన్మమునందు నేను గావించిన పాపములు, ఎల్లన్ = అంతయున్, వాని మొందెన్ = నశించెను. ఇంక నాకు బాధములు లేవనుట, అప్సరోగీత నరణిన్ = అప్సరస్త్రీలగానముచే, ఈజగత్త్రయి = ఈ మూడులోకములు, నన్నున్, ఇందీవరాక్షాఖ్యన్ = ఇందీవరాక్షుఁడను నామముతో, కీర్తించున్ = పొగడును. శాపవశమున రాక్షసుఁడనై యుంటినైతిని గాని నీచే నేను మేనమామనుగాని యెఱుంగను, నేన్ = నేను, గణింపన్ = ఆలోచింపఁగా, గారాపు = ప్రియమగు దొంద దగిన, ఒక్కల్లికవాఁడన్ = మీయమ్మకుఁ జెల్లితమ్ముఁడను, కాని, కడవాఁడన్ = పరాయఁడను, కాఁచుము అయ్యుండానన్ను మాను, పెండ్లిఁగొనకవు = అల్లుండవు, ఈవనజ పాతి = ఈ తామరపూవులవంటి కనులుగలది యగు మనోరమ, కూర్మినందన = ప్రియపుత్రిక, ఒక. మౌని = మునియొక్క, ఘోర = తీవ్రమైన, శాప వికృతిన్ = శాపకారణముచే, శాపవికారముచేత నను, మానిసిదిండినై = మనుజుల భక్షించు రాక్షసుఁడనై, పాపబుద్ధిన్ = దురితచింతతో, దీని ప్రాణములకున్ = ఈ బాలికజీవనమునకు, అల్గన్ = కోపించుటకు - ప్రాణము దీయుటకు, తలఁచితిన్ = ఎంచితిని, అకట = అయ్యో! ఇది గతమునకు విచారము నొందుట.

ఆత్మనామము చెప్పికొనుట తగదని శాస్త్రము విధించుచున్నది గాన తన పేరు తాను చెప్పక గంధర్వులు గానము చేయుచున్నటుల నిందీవరాక్షుఁడు చెప్పుకొనెను. పేరు చెప్పరా దనుటకు.——

శ్లో. "ఆత్మనామ గురోర్నామ నామాతికృపణస్య చ
ఆయుష్కామో న గృహ్ణీయా జ్జ్యేష్ఠాపత్యకళత్రయోః
నామానుకీర్తనం పుంసామాత్మనశ్చ గురోః స్త్రియాః
విన మేకం హరత్యాయుః... ... ..."

తా. నీవును నీపరిపాలనలో నున్నవారును సుఖముగా నున్నారా? నేను నీదర్శనంబునం జేసి కృతార్థుండనైతిని. నే నన్యుండనుగాను. మీజననితోం బుట్టినవాఁడను. నే నిందీవరాక్షుండను, నీవు మాయల్లుఁడవు. ఇది నా కుమార్తె. మునిశాపమున రాక్షసత్వమును వహించి ప్రియపుత్త్రిక యను ననురాగమైన లేక యాహా! దీనినే భక్షింపఁబూనితిని. ఇఁక నాసంగతి నే మని చెప్పెదను?

క. అనునెడ వచ్చి మనోరమ
జనకునిపాదముల కెరఁగ సస్నేహమతిన్
గనుఁగవ నీ రొలుకఁగ నం
దనమూర్ధాఘ్రాణ మతఁడు దయఁ గావించెన్. ౫

టీ. అనునెడన్ = గంధర్వుఁ డీవిధముగా స్వరోచితోఁ జెప్పుచుండఁగా, మనోరమ=గంధర్వరాజునందన, వచ్చి=సమీపమునకుఁ జేరవచ్చి, జనకునిపాదములకున్=తండ్రియగు నిందీవరాక్షుని యడుగులకు, ఎరఁగన్ = నమస్కారము చేయఁగా, అతఁడు, సస్నేహమతిన్ = ప్రేమతోఁగూడిన హృదయముతో. కనుఁగవన్ = కన్నులు రెంటియందును, నీరు = కన్నీరు, ఒలుకఁగన్ = చిందఁగా-కారఁగా, దయన్ = ప్రేమతో, నందన = పుత్త్రిక యొక్క. మూర్ధ-శిరస్సును, ఆఘ్రాణము=వాసనచూచుటను, కావించెన్ = ఒనర్చెను.

తా. ఇందీవరాక్షుఁ డను గంధర్వరాజు తన సంగతిని విన్నవించుచుం డఁగాఁ గోమలిత యగు మనోరమ తండ్రిపాదములకు నమస్కరింప నామెం జూచి విచారమునఁ గంట నీరువెట్టుచుఁ బేర్మితో శిరస్సును మూర్కొనెను.

ఆ. అపుడు విస్మితాత్ముఁ డై వరూథినిసుతుఁ
డేమి కారణమున నేతపస్వి
యిట్టిశాప మిచ్చె నెఱిఁగింపు విన వేడు
క య్యె ననఘ యనిన నాతఁ డనియె. 6

టీ. అత్తఱి=ఆసమయమునందు, వరూథినీ సుతుఁడు = స్వరోచి, విస్మితాత్ముఁడై = ఆశ్చర్యమునొందిన మనస్సుగలవాఁడై, అనఘ=పాపరహితుఁడా, (నీవు పాపము నెఱుంగనివాఁడవు. ఇట్టి నీకు శాప మేమని యెందుల కిచ్చెనో యెఱుంగ నగు నని) ఏమికారణమునన్=ఏహేతువుచేత, ఏతపస్వి = ఏమౌని, ఇట్టిశాపము = రాక్షసుఁడు కమ్మను నీశాపమును, ఇచ్చెన్ = ఇచ్చెనో, ఎఱిఁగింపు=తెలియఁజేయుము. వినన్ = వినవలయునను, వేడుక = సంతోషము, అయ్యెన్=ఆయెను. అనినన్=ఇటుల స్వరోచి యనఁగా, అతఁడు = ఆయిందీవరాక్షుఁడు, అనియెన్=(ఇటులఁ దనవృత్తాంతమును) తెలిపెను.

తా. స్వరోచి యిందీవరాక్షునిఁ గనుంగొని విస్మయమునొంది "ఓయీ! యేహేతువుచే నే మునీంద్రుం డిట్టిశాపంబు నీకొసంగెనో యా విషయము నాకు విన వేడుక యగుచున్నది. చెప్పు" మన నిందీవరాక్షుండు స్వరోచికిఁ దన శాపవృత్తాంతము నీవిధముగాఁ జెప్ప మొదలిడెను.

మ. కలఁ డుల్లోకయశఃపురంధ్రి జగతిన్ గంధర్వవంశంబునన్
నలనాభాహ్వయుఁ డేఁ దదీయతనయుండన్ బ్రహ్మమిత్రుండు
శిష్యులకున్ గంటను వత్తిఁ బెట్టుకొని యాయుర్వేద మ్మా
రంత ప్రౌఢులఁ జెప్పఁగా వినుచుండి మానసమునందుం దగ
ఘృణారతిన్. 7

టీ. జగతిన్ = ధాత్రియందు, ఉల్లోక= లోకాతీతమైన, యశః = యశస్సనెడు, పురంధ్రి = పతివ్రతగలిగినవాఁడు-పతివ్రత యొక భర్తతోనే యుండునటులఁ గీర్తియు నొక్కనినే యాశ్రయించె ననుట. గంధర్వవంశంబునన్ = గంధర్వులవంశంబున, నలనాభాహ్వయుఁడు = నలనాభుఁ డనెడి పేరు గలిగినవాఁడు, కలఁడు, నాతండ్రియగు నలనాభుఁడు మిగులఁ గీర్తిశాలియు విఖ్యాతుఁడునై యుండెను. ఏన్ = నేను, తదీయతనయుండన్=ఆతని పుత్రుఁడను, బ్రహ్మమిత్రుండు=బ్రహ్మమిత్ర నామము గల మునీశ్వరుఁడు, శిష్యులకున్=విద్య నభ్యసింపఁ దలఁచి యేతెంచిన యంతేవాసులకు, కంటను

వత్తిఁ బెట్టుకొని-కంటన్ =కంటియందు, వత్తిన్ పెట్టుకొని=దీపము వత్తిఁబెట్టు కొని-రాత్రులందుఁ గూడ దీపముఁబెట్టుకొని, (అక్షరస్వరూపము స్పష్టముగాఁ గానరాని తాళపత్ర గ్రంథములు చదువుటకతి దీపము కనులఁజెంతఁ జేర్చిన గాని కానరాదుగానఁ జేరువలో దీపముంచుకొనుటయే కంటవత్తి నిడుకొనుట. నిరంతరాత్రాద్దులన్ = సర్వకాలసర్వావస్థలయందును, ఆయుర్వేదము=వైద్య శాస్త్రంబును, చెప్పన్ = చెప్పుచుండఁగా, వినుచుండి = నే నాలకించుచుండి, ముని శ్రద్ధగాఁ జెప్పుచుండె నని విని, మానసమునందున్ = హృదయమున, తత్=ఆశాస్త్రమును, జిఘృక్షన్ = నేర్చుకొనవలె నను, రతిన్ = అభిలాషచే, (సుందరి కన్వయము.)

తా. ఈభూమియందు యశోవంతుఁడైన నలనాభుఁ డనెడి పేరుగల గంధర్వుని తనయుండను నేను. బ్రహ్మమిత్త్రుం డనెడి యాయుర్వేదవిద్యానిధి శిష్యుల కహోరాత్రములు వైద్యశాస్త్రమును బోధించుచుండ నది విని యయ్యది గ్రహింపవలయు నని యెంచి.

తే. మునివరుఁ జేరి భక్తి నమస్కరించి
చెప్పవే నాకు నీవిద్య శిష్యకోటి
తోడఁ గూడంగ నేఁ గృతార్థుండ నగుదు
ననుచుఁ బ్రార్థింప ననుఁ జూచి యుపహసించి. 8

టీ. మునివరున్ =ఆమునిశ్రేష్ఠుని, చేరి=సమీపించి, భక్తిన్ = పూజ్యభావముతో, నమస్కరించి = మ్రొక్కి (ప్రణామము చేసి) ఈవిద్య=ఈ యాయుర్వేదము, శిష్యకోటితోడఁగూడంగన్ = మీయొద్దఁజదువుకొనువారితోఁ గూడ, నాకున్ చెప్పవే = నాకుఁగూడ నభ్యాసముచేయుము. నేన్, కృతార్థుండను = కోరినకోరిక సఫలమైనవాఁడను, అగుదున్ = అయ్యెదను. ఎందు లోపములేని నా కీవిద్య నొసంగితివేని సమస్తకామితములు నెఱవేఱినటు లగును. దానఁ గృతార్థుఁడ నగుదును, అనుచున్ = అని, ప్రార్థింపన్ =

వేఁడఁగా, ననుఁ, చూచి, అవహేళించి = వేళాకోళముచేసి, (మునుపటి కన్వయము).

తా. ఆ మునివరు చెంగటి కేఁగి భక్తితో నమస్కారముచేసి యావైద్య శాస్త్రమును నీ శిష్యులతోపాటు నాకుఁగూడ నుపదేశింపుము, ధన్యుండ నయ్యెద నని వేఁడ నన్ను వేళాకోళముచేసి.

క. నటవిటగాయకగణికా
కుటిలవచశ్శీధురసముఁ గ్రోలెడుచెవికిన్
గటు వీశాస్త్రము వల ది
చ్చట నినుఁ జదివింప కున్న జరగదె మాకున్. 9

టీ. నట=నాట్యముచేయు వాండ్రయొక్కయు, విట=పరనారీలోలు రగు పురుషులయొక్కయు - జారులయొక్క యనుట, గాయక = సంగీతము పాడువారియొక్కయు, గణికా = వేశ్యలయొక్కయు, కుటిల = వంకర గలిగిన వీరందరి వాక్యములు నీచములుగాన నట్టి, వచః=వాక్యములనెడి, శీధు రసమున్=మద్యమును, క్రోలెడు = పానముచేయునట్టి, నటులు, జారులు, పాటకులు, భోగపుఁజేడియలు లోనగువాండ్ర పరిహాసరూపములగు నిందా వాక్యముల నాలించుటయందే సమాదరభావముగల మీబోంట్ల, చెవికిన్ = చెవులకు, ఈశాస్త్రము = ఈయాయుర్వేదశాస్త్రము, కటువు = రుచిలేనిది, వలదు = నీకుఁ బనికిరాదు. ఇచ్చటన్ = ఈ యాశ్రమభూమియందు, నినున్ చదివింపకున్నన్ = నిన్నుఁ జదువరులఁ జేయకయున్న యెడల - నీకు చదువుచెప్పమేని, మాకున్=(తృష్ణారహితులము మునులము నగు) మాకు, జరగదె=గడువదా? నిత్యకృత్యముల కేమేని లోపము వాటిల్లునా?

తా. నటవిటగాయకాది గణికాసాంగత్యమునఁ బ్రొద్దుపుచ్చుచు వాండ్రపలుకులతో నానందించుటయం దలవాటువడిన నీచెవుల కీయాయుర్వేదము రుచించునా? ఆశ్రమమునందుఁ జేర్చుకొని నీ కిది చెప్పకున్నచో మాకేమి కొఱఁత? అలం. రూపకము.

తే. అనఁగ నే నట్టివాఁడఁ గా ననఘచరిత
యించుకించుక మీవంటి యెఱుక గలుగు
పెద్దవారలశిక్షలఁ బెరిఁగినాఁడ
నవధరింపుము శిష్యుఁ గా ననిన నతఁడు. 10

టీ. అనఁగన్ = బ్రహ్మమిత్రుఁ డిటు లనఁగా, అనఘచరిత = యోగ్యమైన చారిత్రముకల మునీంద్రా! నే నట్టివాఁడఁ గాను = నే నట్టిదురభ్యాసములు గలవాఁడఁ గాను, ఇంచుకించుక = స్వల్పము స్వల్పము-శక్తికొలఁది, మీవంటి = మిమ్ముఁబోలిన, ఎఱుకగలుగు = జ్ఞానులైన, పెద్దవారల = ఘనులయొక్క, శిక్షలన్ = నేర్పుటలచేత, పెరిఁగినాఁడన్ = వృద్ధిఁబొందితిని, శిష్యుఁగాన్ = శిష్యునివలె, అవధరింపుము = ఇష్టపడుము. అనినన్ = అని నేను వినయమునఁ బ్రార్థింపఁగా, అతఁడు = ఆబ్రహ్మమిత్రమహాముని ముందరి కన్వయము.

తా. ముని యట్లు పలుకఁగా నేను మీరు చెప్పినవాఁడను గాను. మీయట్టిపెద్దల యనుపాజ్ఞలలోఁ బెరిఁగినవాఁడను. నన్ను శిష్యునిగా నంగీకరింపుఁ డని వేఁడఁగా నతఁడు.

క. ధనరాజ్యరమామదమునఁ
గనుగాననినిన్ను శిష్యుఁగాఁ గైకొనుకం
టెను నేరమి గలదే ననుఁ
గనలించుచుఁ ద్రేల కిఁకఁ బొకాలు మటన్నన్. 11

టీ. ధన...మునన్-ధన = ద్రవ్యముయొక్కయు, రాజ్య = ప్రాభవముయొక్కయు, రమా = భాగ్యమునవచ్చిన, మదమునన్ = గర్వముచే, కను గానని = కన్నెఱుంగని, ఐశ్వర్యముతో మునులకు రాజులకుఁ గలయంతరమును గ్రహింపఁజాలకున్న, నిన్నున్, శిష్యుఁగాన్ = విద్యార్థిఁగా, కైకొనుట కంటెన్ = అంగీకరించుటకంటెను, నేరమి = అజ్ఞానము, కలదే = ఉన్నదా! ఇఁకన్, ననున్, కనలించుచున్ = క్రోధము గలవానినిగాఁ జేయుచు, త్రేలక =

వాగక, (పా. ఇటక్=ఇక్కడనుండి), పొకాలుము=లేచిపొమ్ము, అటన్నన్ = అని బ్రహ్మమిత్రుఁ డనఁగా, "పొకాలుము" అనునది కోపముతో లేచిపొమ్ము అను నెడ విశేషించి ప్రయోగింపఁబడును. పరితాపముతోఁ బోవుటకుఁగూడ నీప్రయోగము గానవచ్చెడిని. (ముందరి కన్వయము.)

ఉ. "...................జనపత్యతపంకనూర్ధ్వలో
కమ్ముఁడు లేకపోయినఁ బొకాలఁగనిమ్ము" (జైమినిభార. ఆ. 7.)

శా. "...................బ్రాహ్మ్యమిం
కోవానోచాలఁపొకాలితోయెదరోపోరోమాటలింకేటికిన్." (ఇందే.ఆ.6.)

ఉ. "ధాత్రి పొకాలిపొమ్మనుచుఁ బల్కిన నుల్కకమానసంబునన్."
(వరాహపురాణము. ఆ. 5-15)

తా. ధనరాజ్యములయొక్క సిరివలన మదించి తన్ను గానవినిత్తు శిష్యునిఁగాఁ బరిగ్రహించుటకన్నఁ దెలివితక్కువ యింకొకటి లేదు కావున నింక నాకుఁ గోపము గల్గునట్లు ప్రేలక లేచిపొమ్మనఁగా.

క. అచటన్ "ద్వేష్టి గతాయు
శ్చ చికిత్సక" మనునయోక్తిచర్చను నుచ్చా
వచవచనంబులఁ గోపము
ప్రచురము గానీక మానిపతి కిట్లంటిన్. 12

టీ. అచటన్ = వానికడ, గతాయుశ్చ = ఆయువు నశించినవాఁడును, చికిత్సకమ్ = వెజ్జును, ద్వేష్టి = విరోధించుచున్నాఁడు. (చెప్ప నిష్టముగాని బోధకుఁడు శిష్యునటులనే ద్వేషించును. అనుట కిది యుపమానము.) అను = అనియెడు, నయోక్తి=నీతివచనముయొక్క, చర్చనన్=విమర్శవలన, ఉచ్చావచవచనంబులన్ = పలుతెఱఁగులవాని యవమానపుపలుకులచేత, కోపము = క్రోధము. ప్రచురము గానీక = బయలుపడనీయక, మానిపతికిన్ = మౌని ముఖ్యునితో, ఇట్లంటిన్ = ఈవిధముగాఁ బలికితిని.

తా. వైద్యశాస్త్రాభ్యాసముఁ జేయుతలంపు గొన్నవాఁడ నగుటంజేసి యుష్పు డాతనిసమ్ముఖంబున "ఆయువుమూఁడినవాఁడు చికిత్సకునితో ద్వేషించు" ననునీతివాక్యముం దలఁచి కోపంబు నణఁచికొని యాతనిపరుషభాషణంబుల నోర్చి యి ట్లంటిని. అలం. లోకోక్తి.

తే. నీవు చదివింతు ననుచు నిన్నియును విడిచి
బిచ్చ మెత్తంగ రాదుగా తెలతపసి
కడవ నాడకు చాలు నీగొడవ యేల
వెజ్జుఁదన మేల యని మది లజ్జ వొడమి. 13

టీ. తెలతపసి = తెలివితక్కువమౌని, నీవు, చదివింతు ననుచున్ = విద్య నేర్పించెద నని, ఇన్నియును = నాకుఁగల ధన ధాన్య రాజ్యాది సర్వసంప దలను, విడిచి = వదలి (నేనును సన్యాసి నయి), బిచ్చ మెత్తంగన్ = భిక్ష మెత్తుట, రాదుగా = తగదుగదా, ఉన్నంతవఱ కనుభవింప వలయునుగాని మౌని సన్యాసినై చేయవలసిన దేమున్నది? కాన, కడవక = (నాకును నీకును గల తారతమ్యమును గ్రహింపక) మేరమీఱి, ఆడకుము = అతిక్రమించి దూషింపకుము. చాలున్ = ఇప్పటికిఁ బలికినపలుకులు చాలును. నీగొడవ యేల = నీసంగతి నాకెందుకు? వెజ్జుఁదనము = వైద్యత్వము, ఏల = రాజు నకు నాకెందులకు, అని = అనిపలికి, మదిన్ = హృదయమునందు, లజ్జ వొడమి = సిగ్గుపుట్టి, మునియొనర్చిన నిందావాక్యములకు సిగ్గుపడి, (ముందరి కన్వయము.)

తా. జ్ఞానహీనుఁడవగు నోమునీ! నీయొద్దఁ జదువ నారంభింతు నని యొప్పుండేని కనయైశ్వర్యముం బోఁగొట్టుకొని బిచ్చమెత్తుకొనఁ గూడదుగదా! మంచిచెడ్డలం బాటింపక లేనిపోనివి పలుకకుము. నీచదు వేల? నీవైద్యమేల? నాకు వల దని సిగ్గు వొడమ.

శా. కంటే బ్రాహ్మణుఁ డెన్ని కాలు ఁఅచెన్ గర్వించి వీరెల్లనా
కంటెన్ బాత్రులె విద్య కెట్లు నిది నేఁగైకొందునంచున్ మదిన్

గెంటెంపుంజల ముప్పతిల్లఁ గపటాంతేవాసినై శాంబరిన్
గొంటుంజందము మీఱ నాశిష్యులగెడన్ గూర్చుండి చర్చారతిన్.

టీ. కంటే = కనుఁగొంటివా, గర్వించి = పోతరించి, బ్రాహ్మణుఁడు = విప్రుఁడు, ఎన్నికాఁడు అఱచెన్ = ఎన్నిపరుషభాషణములాడెనో, విద్యకున్ = ఆయుర్వేదమును నభ్యసించుటకు, వీరెల్లన్ = ఈశిష్యులందఱును, సాకంటెన్ = సాకన్నను, పాత్రులె = యోగ్యులా, వీరియందుఁగల పాత్రత నాయందేది లేకపోయినదో, ఎట్టున్ = ఏయుపాయముచేతనైనను, ఇది = (ఈయాయుర్వేదము) ఈశాస్త్రము, కైకొందున్ = సంపాదించెదను. అంచున్ = అని మదిన్ = మనస్సునందు, గెంటెంపుంజలము = ఇనుమడించినకట్టుకల, ఉప్పతిల్లన్ = కలుగఁగా, శాంబరిన్ = మాయచేత, కపట = కృత్రిమపు, అంతేవాసి నై = శిష్యుండనై, శిష్యరూపము దాల్చి యనుటే శిష్యులలోఁ గలసి నేనుకూడ శిష్యునివలె నటించి, గొంటుజందము = దుర్మార్గవర్తనము - దుష్టత్వము, మీఱన్ = అతిశయింపఁగా, శిష్యులగెడన్ = ఛాత్రులసమీపమున. కూర్చుండి = కూర్చున్నవాఁడనై, చర్చా = సంగతిని తరచి కనిపెట్టుటయందలి, రతిన్ = అభిలాషతో, (ముందరి కన్వయము.)

తా. ఈతం డేవ్విధంబున నహంకరించి నన్ను నిందించె నీతనికడఁ జదువుశిష్యులు మాత్రము సాకన్న సత్తములా యని యెంచి యావైద్యశాస్త్రము నభ్యసింపఁ దలంపు గలవాఁడనై కృత్రిమంబున శిష్యునివలె వేసము వేసికొని వారిం జేరి యాసక్తితోఁ జర్చించుచు.

తే. కాయబాలగ్రహోర్ధ్వాంగకములు నాల్గు
శల్యదంష్ట్రాజరావృషసంజ్ఞ నాల్గు
నైన యష్టాంగకముఁ దావు లారఁ గల్గు
వైద్య మెనిమిదినెలల సర్వమును నేర్చి. 15

టీ. కాయ = శరీరము. బాల = చిన్నపిల్లలు, గ్రహ = క్షుద్రదేవతాదులు, ఊర్ధ్వాంగకములు = మీఁదియవయవములు (అనఁగా మెడమీఁ

ద్వైభాగ మందలివి) నాల్గు, శల్య = శలాక మొదలగు, దంష్ట్రా = దంతపు కాటు, జరా = ముదిమి, ముదిమి యన విషప్రయోగాదికముచే దటస్థించిన యాకస్మికమరణావస్థ, వృష = రేతస్సు, సంజ్ఞక్ = ఈపేరులచే నొప్పు, నాల్గుక్ = నాలుగును, ఐన = అయినట్టువంటి, అష్టాంగకముతావులు = ఎనిమిదిచికిత్సాంగముల స్థానములును, ఆరక్ = ఒప్పునట్టుల, కల్గువైద్యము = కలిగియున్న వైద్యశాస్త్రము, సర్వముక్ = అంతయు, ఎనిమిదినెలలక్ = ఎనిమిదినెలలలోపల, నేర్చి = అభ్యసించి, శాంబరిసహాయమున బ్రహ్మమిత్రునివద్ద నేర్చికొని, (పైపద్యముతో నన్వయము.) "కాయచికిత్స బాలచికిత్స, గ్రహచికిత్స, ఊర్ధ్వాంగచికిత్స, శల్యచికిత్స, దంష్ట్రాచికిత్స, జరాచికిత్స, వృషచికిత్స, యని యాయుర్వేదమునం దంగము లెనిమిది. ఇందులకుఁ బ్రమాణము.—"శ్లో. కాయబాలగ్రహోర్ధ్వాంగ శల్యదంష్ట్రా జరావృషాన్, అష్టావంగాని తస్యాహు శ్చికిత్సా యేషు సంస్థితాః." మఱి కొందఱు శల్యతంత్రము, శాలాక్యతంత్రము, కాయచికిత్స, భూతచికిత్స, కౌమారభృత్యము, అగదతంత్రము, వాజీకరణతంత్రము, రసాయనతంత్ర మని యెనిమిదంగములుగాఁ జెప్పిరి. ఈరెంటి కించుకమాత్రమె భేదము గలదు. కాయచికిత్స యన జ్వరము, రక్తస్రావము, అతిసారము లోనగు శరీరసంబంధములగు రోగముల నుపశమించుటకుఁ జేయుచికిత్స. బాలచికిత్స బాలురకుఁ బెద్దలకు వ్యాధులందును ఆహారాదికములందును భేదముంటచే బాలచికిత్స ప్రత్యేకించి చెప్పఁబడెను. గ్రహచికిత్స, బాలగ్రహములు మున్నగు క్షుద్రగ్రహములచేఁ గలుగుపీడ నివారించుటకుఁ జేయు మంత్రప్రయోగాదిరూప మగు చికిత్స. ఊర్ధ్వాంగచికిత్స, శిరస్సంబంధములగు మెడ నరములు కనులు నాసిక నోరు మెదడు లోనగువానికిఁ గలుగు వ్యాధుల మాన్పుటకుఁ జేయుచికిత్స. శల్యచికిత్స, కత్తి బాణము లోనగునవి గ్రుచ్చుకొనిన వ్రణములకుఁ జేయుచికిత్స. దంష్ట్రాచికిత్స, పాములోనగు విషజంతువుల కోఱలనుండి విషము లోనికి బ్రవేశించినతఱి జేయు నివారణచికిత్స.

జరాచికిత్స విషప్రయోగాదికముచే నకాలవార్ధకము వచ్చి దుర్బలుఁడై యపాయస్థితియందున్నప్పుడు చేయుం రసాయనచికిత్స. వృషచికిత్స ఇంద్రియము చెడి సంభోగశక్తి నశించినపుడు, తృప్తి, స్వాస్థ్యము, అభివృద్ధి పొసఁగునట్టుఁ జేయుంచికిత్స. ఆయుర్వేదగ్రంథములందు శల్యచికిత్స, పాటన, వ్యధన, ఛేదన, లేఖన, ప్రచ్ఛన సేవనము లని (చూ. చరకము అధ్యా. ౨౫.) యాఱువిధములుగను మఱికొంచఱిమతమున, ఆహార్య, విస్రావ్యములు గలిపి యెనిమిదివిధములుగను జెప్పఁబడియున్నది. ఇంకను విశేషాంశము లాయుర్వేదగ్రంథములందుఁ దిలకించునది.

తా. కాయము, బాలము, గ్రహము, ఊర్ధ్వాంగకము, శల్యము, దంష్ట్రి, జర, వృషము అను నెనిమిది విభాగములు గాఁగల వైద్యశాస్త్రమునందలి యష్టాంగలక్షణమును ఇందీవరాక్షుఁడు మోసముచే నెనిమిది మాసములలో నేర్చెను.

క. ఇరుమూఁడురుచులదోషపు
విరసత మానఁగ జ్వరాదివృష్యాంతం బై
పరఁగుచికిత్సయు గని శాం
బరిఁ బాసి దపస్వితోడ మదమున నంటెన్. 16

టీ. ఇరుమూఁడురుచుల = (రెండుమూఁడులు) ఆఱురుచులయొక్క, ఉప్పు, కారము, పులుసు, తీపు, చేఁదు, వగరు. (శ్లో. తువరస్తుకషాయోఽస్త్రీ మధురో లవణః కటుః, తిక్తోఽమ్లశ్చ రసాః పుంసి తద్వత్సు షడమీ త్రిషు.) (అమరము) దోషపు = తప్పిదముచేఁగలిగిన, విరసత = రసములేకపోవుట, మానఁగ = పోవువిధముగా, జ్వరాది = జ్వరము మొదలు, వృష్యాంతంబై = రేతస్సంబంధచికిత్సాంతముగాఁ దగి, జ్వరచికిత్స నారంభము చేసికొని రేతస్సంబంధమగు వృష్యచికిత్సయంతమగువఱకు, పరగు = తగిన, చికిత్సయున్ = వైద్యమును, కని = నేర్చుకొని, మదమునన్ = మత్తతచే, శాంబరిన్ = మాయ.

వేషమును, పాసి = వదలి, విద్యయందరయం నభ్యసించితిని. ఇతఁడు సన్నిధ నేమిచేయఁగలఁడనుతిరస్కారభావము గలవాఁడనై, తపస్వితోఁడన్ = మునితో, అంటిన్ = ఈవిధముగాఁ జెప్పితిని.

తా. షడ్రుచులగు లవణము మొదలగు నాయురసములయందు నేదేని చవి గానియెడల నాయరుచి దేనిచేఁగలిగెనో యారోగమును దెలిసికొని తన్నివారణముకై చేయు వానిచికిత్సలను జ్వరాదిరోగసంబంధరోగ చికిత్సలతోఁగూడిన శాస్త్రమంతయును దెలిసికొని కృత్రిమాకారమును దీసివైచి గర్వముతో మునితో నిట్లు వచించితిని.

శా. తండ్రీ నాకు ననుగ్రహింపఁగదె వైద్యంబంచుఁ బ్రార్థించినన్
గండ్రల్ గా నటులాడి ధిక్కృతులఁ బోకాల్మంటివో హో మ
దిన్, దీండ్రల్ గల్గినవారి కేకరణి నేనిన్ విద్య రాకుండునే
గుండ్రా డాఁచినఁ బెండ్లి యేవిటికిఁ జిక్కుం గష్టముష్టింపచా.

టీ. తండ్రీ = ఓనాయనా! నాకున్, వైద్యంబున్ = వైద్యశాస్త్రమును, అనుగ్రహింపఁగదె = దయచేసిచెప్పుమయ్యా, అంచున్ = అని, ప్రార్థించినన్ = వేఁడుకొనఁగా, గండ్రల్గాన్ = పరుషముగా, అటులు = (విద్యార్థిగా వచ్చినపుడు నిందించిన) ఆవిధముగా, ఆడి = అవహసించి, ధిక్కృతులన్ = అగౌరవవాక్యములచే, పోకాల్మంటివి = లేచిపొమ్మంటివి, ఓహో = ఔరా! నీవు చెప్పకపోయినఁ జెప్పువారుగాని యభ్యసించుమార్గము గాని లేకపోవునా? మదిన్ = హృదయమునందు, తీండ్రల్ = ధైర్యములు. చొరవలు, కల్గినవారికిన్ = కలవారికి, ఏకరణి నేనిన్ = ఎట్లయినను, విద్య = చదువు. రాకుండునే = రాకపోవునా, కష్టముష్టింపచా = నీచపు బిచ్చపు మనీ, గుండ్రా = సన్నికలుపొత్తరపురాతిని, డాఁచినన్ = మరుఁగుపఱిచినయెడల, పెండ్లి, ఏవిటికిన్ = ఎవ్విధమున, చిక్కున్ = ఆఁగిపోవును.

గుండ్రాయిదాఁచిన పెండ్లియాగునా యనుసామెత శ్రీనాథుఁడు

కాశీఖండమున "పరిక్షించినఁ బెండ్లియాడుదునో" అని చెప్పెను. దానిని పెద్దన యనుకరించెను.

తా. ఓతండ్రీ! నాకు విద్యాభ్యాసము చేయుమని వేఁడఁగా నహంకారమున బోధింపనంటివి. పట్టుదలతో నేర్చికొనవలె నన్న విద్య రాక పోవునా? సత్పాత్రము దాఁటినచోఁ బెండ్లి యాటంక మగునా? కావున నీవు బోధించినను నీయొద్ద నభ్యసించియే తీరెదను. అలం-అర్థాంతరన్యాసము.

మ. అనినన్ గన్నులు జేవురింప నధరం బల్లాడ వేల్లత్పున
పునరుద్యద్భ్రుకుటీభుజంగయుగళీఫూత్కారఘోరానిలం
బన నూర్పుల్ నిగుడన్ లలాటఫలకంబందంద ఘర్మాంబువుల్
చినుకన్ గంతుదిదృక్షురూక్షనయనక్ష్వేళాకరాళధ్వనిన్.

టీ. అనినన్ = నే నిటు లనఁగా, కన్నులు = బ్రహ్మమిత్రుని నేత్రములు కోపవశమున, జేవురింపన్ = ఎఱ్ఱఁబడఁగా, అధరంబు = ఓష్ఠము, అల్లాడన్ = చలింపఁగా - అదరఁగా ననుట, వేల్లత్ = ప్రేలాడుచున్నదియు, పునః పునః = మాటిమాటికిని, తెంపులేక, ఉద్యత్ = ఎగయుచున్నదియు నగు, భ్రుకుటీ = ముడికలుపడు కనుబొమలనెడి, భుజంగయుగళీ = సర్పద్వయముయొక్క, ఫూత్కార = బుసకొట్టుటయొక్క, ఘోర = భీతినిగలుగఁజేయునదియగు, అనిలంబు = గాలి, అనన్ = అనునటుల, ఊర్పులు = నిట్టూర్పులు, నిగుడన్ = వృద్ధిబొందఁగా, లలాటఫలకంబు = పలకవలె విశాలమగునుదురు, అందంద = ఎక్కువగా, ఘర్మాంబువుల్ = స్వేదజలము, చినుకన్ = వెడలింపఁగా, కంతు = మదనుని, దిదృక్షు = క్రోధపుఁజూపునఁ గనుఁగొన శక్తిగల, రూక్షనయన = వేఁడికన్నుగల శంకరునియొక్క, క్ష్వేళా = సింగపుబొబ్బరింతకైవడి, కరాళ = భీతినిఁ గలుగఁజేయునదియైన, ధ్వనిన్ = శబ్దముతో, (ముందర కన్వయము.)

మన్మథదహనకాలమున శివుఁ డొనరించిన బొబ్బ మిగుల భయంకరమైన దనుటకు.——

సీ. "అనలాక్షు పెదబొబ్బ నలమినకలదిమ్ము
బాయుఁడో యీ తేంట్లపాటమరుఁడు." (ఇందే తృతీయాశ్వాసము.)

తా. నే నీవిధముగాఁ బలుకఁగా బ్రహ్మమిత్రుఁడు మిగులఁ గోపించి కన్నుఁదోయి కెంపువారఁ బెదవి కదలుచుండ మెలికలువైచుకొని బుసకొట్టుచున్న సర్పద్వయము విడుచు నిట్టూర్పులో యనునట్లు బొమ్మముడిపాటుతో కొప్పుముఖభాగమునుండి నిట్టూర్పుగాడ్పులు సందడింప మన్మథునిఁ జూచి సింహధ్వనిచేసిన శివునిభయంకరార్భటియో యనునట్లు కంఠమెత్తి. అలం. ఉత్ప్రేక్ష-స్వభావోక్తి.

వ. జటిలుండు గిటకిటం బండ్లు గొఱికి హుమ్మని కటమ్ము లదుర ముకుఁబుటమ్ములు నటింపఁ గటకటా కుటిలాత్మా యటమటమ్మున విద్యఁగొనుటయుం గాక గుటగుటలు గురువుతోనా యని కటకటంబడి కకపాలలోనిబూది కేలఁ గొని యాసురి యగుమాయ మాయెడం బ్రయోగించి వంచించి యపహసించితివి గావున నసురవై పిసితంబును వసయును నసృగ్రసంబు నశనంబులుగా మెసవి వసుధ వసియింపు మని బసుమంబు సల్లి గుండె జల్లు మని కల్లువడి మునితల్లజుపదపల్లవంబులకుఁ ద్రెళ్లి యిట్లంటి. 19

టీ. జటిలుండు = మునీంద్రుఁడు, కిటకిటంబండ్లుగొఱికి=కిటకిట మని రొదధ్వని చేయునట్లు దంతములుగొఱికి, హుమ్మని=హుంకారము గావించి, కటమ్ములు = రెండుకణతలును, అదురన్ = కదులఁగా, కటకటా = అయ్యో! ఇది కోపాతిశయమును సూచించును. కుటిలాత్మా = దుర్మార్గపు మనస్సు గలవాఁడా! అటమటమ్మునన్ = మాయచే, విద్యన్ కొనుటయుంగాక = నేర్చుకొనుటయేగాక, గుటగుటలు = మదత్రలాపములు, గురువుతోనా = విద్యాదాతతోనా, అని, కటకటంబడి = కోపించి, కకపాలలోని = కక్షపాల

యందలి, ఋూది = విభూతిని, కేలన్ = హస్తముతో, కొని, ఆసురియగు మాయన్ = రాక్షససంబంధమయినమాయను, మాయెడన్, ప్రయోగించి = ప్రసరింపఁజేసి, వంచించి=మోసగించి, అసురునివలెఁ గపటశిష్యవేషము దాల్చి శిష్యుఁడే యని భ్రాంతి గలుగఁజేసి విద్య పఠించుటయే మోసగించుట. ఇది రాక్షసకృత్యము. దీని నొనర్చుటయేగాక, అపహసించితివి=వేళాకోళములుచేసితివి, కావునన్, అసురవై=రాక్షసుఁడవై, పిశితంబును=పలలమును, వసయును= క్రొవ్వును, (కడుపులో బొడ్డుక్రిందనుండెడు నల్లిశొరవంటి క్రొవ్వుపొరను వస యని యందురు.) అస్రగ్రసంబును = రక్తంబును, అశనంబులుగాన్ = తిండిసామగ్రిగా, మెసవి=భక్షించి, వసుధన్=ధాత్రియందు, వసియింపుము= ఉండుము. అని=ఇటులు శపించి, బసుమంబు = భస్మమును, చల్లన్=నాపయిని విసరి చల్లఁగా, గుండె హృదయము, జల్లుమని=తల్లడిల్లి, అదరి యనుట. కల్లువడి=నివ్వెఱపోయి, శిలవలె నిశ్చేష్టత్వమును బొంది, మునికల్లజు=మునీంద్రుని యొక్క, పదపల్లవంబులన్ = చిగురులఁబోలిన యడుగులపై, త్రెళ్లి = (భయవశమున నొడలెఱుంగక) పడి, ఇట్లంటిన్=ఈవిధముగా వాకొంటిని.

తా. మునీంద్రుఁడు జడిపించి యోరీ వంచకుఁడా! మాయ చేసి విద్య నభ్యసించినది చాలక పైఁగా నెత్తిపొడుపుమాట లాడి హేళనము చేసెదవా యని మంత్రించి ఋూది నామీఁదఁ జల్లి, నీవు రాక్షసమాయ మాయెడ నుపయోగించి విద్య లభ్యసించితివిగాన రాక్షసుండవై మాంసము రక్తము మొదలయినవి తినుచు సంచరింపు మని శపింపఁగా నేను భీతినొంది ముని పాదంబులపయిఁ బడి యిట్లంటిని.

శా. నాయజ్ఞానము సైఁచి సంయమివరేణ్యా కావవే రాక్షసుం
డై యే నెట్లు భజించువాఁడ దురితంబయ్యో నృమాంసంబుగా
డై యే నెట్లు భరించువాఁడ నుదరంబార్ద్రాంతరంగుండవై
మాయయ్యా దయసేయవే యవధి యేనోపఁగ దేహింసకున్.

టీ. సంయమివరేణ్యా = ఓయుత్తమమునీ, సాయజ్ఞానము = నాబుద్ధి మాంద్యమును, సైఁచి=సహించి, కావవే=కాపాడుమయ్యా,ఏన్=గంధర్వుఁడ నగు నేను, రాక్షసుండై = రక్కసినై, దురితంబు = దుష్కృతమును, ఎట్లు, భజించువాఁడన్ = అనుభవింపనేర్తును - పోషింపఁగలవాఁడను, అయ్యో = కటకటా! ఏన్=నేను (అమృతమును భుజించు నేను), నృమాంసంబు=మానుష పలలంబు, కూడై = అన్నమై (అన్నముగా భుజియించి) ఉదరంబు= పొట్ట, ఎట్లు, భరించువాఁడన్ = నింపుకొనువాఁడను, ఓయయ్యా = ఓతండ్రీ ! బ్రహ్మమిత్రమునీంద్రా ! ఆర్ద్రాంతరంగుండవై =ప్రేమగలవాఁడవై- దయచేఁ దడిసినహృదయము గలవాఁడవై, అవధి = శాపముతీరుటకుహద్దు, దయసేయవే = సెలవిమ్ము, ఏనాఁటి కీశాప మెపగిసహాయముచేఁ దొలంగునో దయచేసి తెలుపఁగదవే, హింసకున్ = ప్రాణిహింసకు, ఏన్=నేను, ఓపు గదే = సహింపనుగదా!

తా. మునీంద్రా! బుద్ధిశక్తివచే నే నొనర్చిన యపరాధమును మన్నించి నన్నుం గాపాడుము. నేను మనుజులమాంసముతో నుదరపోష ణము చేసికొనుచు శాపభారమును వహించి యుండలేను. నీవలన నైనశాప మున కిన్నిదినము లని హద్దు పెట్టి రక్షింపుము.

చ. అనినఁ బ్రసన్నుఁడై ముని కరాబ్జములన్ నను నెత్తి వత్స మ
త్సునిశితశాపశూలహతి స్రుక్కితిగా యిఁకఁ గొన్నినాళ్లపైఁ
దనయుఁను మ్రింగఁబోయి యొకధన్యునిదివ్యశరార్చిఁ ద్రెళ్లివే
కనియెదుభద్రమున్నఁదురగంబుపయింబడిప్రొద్దుగ్రుంకఁగన్.

టీ. అనినన్=అని నేను విచారముతో నీవిధముగా మునికాళ్లపయింబడి మనవిచేసికొఁగా, ముని=బ్రహ్మమిత్రమహర్షి, ప్రసన్నుఁడై=దయఁగలవాఁడై, ననున్=నన్ను, కరాబ్జములన్ = తామరపూవులవలె మృదువులగు హస్తము లతో, ఎత్తి=తనయడుగులమీఁదినుండి లేవనెత్తి, వత్స = ఓబిడ్డా, మత్ ...

హాలిక్-మత్ = నాయొక్క, సునిశిత=ఎక్కువవాఁడియైన, శాప = దూషణమనెడు, శూలహాలిక్ = శూలముయొక్క దెబ్బచేత, స్రుక్కితి=దుఃఖమొందితివిగదా! ఇఁకన్=ఇంకను, కొన్నిసాళ్లపైన్=కొలఁదిదినముల యొక్క తరువాత, తనయను=నీపుత్త్రికను, మ్రింగఁబోయి = మ్రింగుటకుఁ బ్రయత్నముచేసి, ఒకధన్వి = ఒకానొక మహాత్ముని, దివ్య = మహోత్తరమయిన, శర = బాణముయొక్క, అర్చిన్ = మంటవలన, ప్లుష్టి = తగులఁబడి- దహింపఁబడి, వే = వెంటనే, భద్రము = శుభము, కనియెదు = పొందెదవు, అన్నన్ = అని యిట్లుఁ జెప్పఁగా, తురగంబుపయిన్ = అశ్వముమీఁదు, ఎక్కి=ఎక్కి, ప్రొద్దుగ్రుంకఁగన్ = సాయంసమయమునకు (ముందరికన్వయము.)

తా. ఇట్లామునీంద్రుని వేఁడఁగాఁ దనపాదములపైఁ బడినన్ను లేవఁదీసి, వత్సా! నీవు నే నిడినశాపమువలన భయపడి నీతప్పు నీ వెఱింగి నాపాదములపైఁ బడితివి గాన నిన్నుఁ గనికరించినాఁడను. మిగులస్వల్పకాలములోనే, నీవు నీకుమార్తెను మ్రింగఁబోవ నొకానొకమహానుభావుని బాణవహ్నిజ్వాలలచే నీయసురదేహము దహించుకొని పోవ దివ్యరూపమును గ్రహించి శాపమునుండి విడువఁబడెదవు పొమ్మనఁగా గుఱ్ఱము నెక్కి యచ్చటనుండి బయలుదేఱి ప్రొద్దు గ్రుంకునప్పటికి.

క. సన్నపుఁదలయేరున మయి
యన్నుఁగొనుచు నాము దిన్న యట్టై రాఁగా
ఖిన్నుఁడనై పురి కేఁగితిఁ
దిన్నఁదనం బుడిగి కొన్నిదివియలు వెలుఁగన్. 22

టీ. సన్నపుఁదలయేరునన్ = స్వల్పమగుశిరోబాధచే, మయి = శరీరము, అన్నుఁగొనుచున్ = తెలియని స్థితిని బొందుచు, ఆముదిన్నయట్టై = విసమును మెసవిరీతియై, రాఁగాన్ = ఏర్పడఁగా, దేహము తలనొప్పిచేఁ బరవశమొందుచుండఁగా, ఖిన్నుఁడనై = చింతించినవాఁడనై, తిన్నఁదనంబుడిగి=

సహజ మగు శాంతస్వభావమును గోలుపోయి (చక్కఁదనమని కొందఱు వ్రాసి యున్నారు,) కొన్ని, దివియలు = దీపములు, వెలుఁగన్ = ప్రకాశించుచుండ, పురికిన్ = నిజపట్టణమునకు, ఏఁగితిన్ = పోయితిని. ఈపద్యమునకుఁ బాము చిన్నయత్తై నాముడిన్నయత్తై యని రెండుపాఠాంతరములు గలవు. ఆము అన విసమనుటకుఁ బ్రమాణకవుల ప్రయోగములు మృగ్యములు, నాము అన కొన్నలోనగు పైరులు గోయఁగాఁ బుట్టుమొలక. ఇదిపక్వమునకు రాకముందు విసమె. ఈయర్థము నొక రిద్దఱు వ్రాసియున్నారు.

తా. కొంచెము శిరోభారమున విసముం దిన్నగతిఁ బరవశత్వము గలిగినవాఁడై ఖేదముం జెంది దీపములు కొన్ని వెలుఁగుచుండఁగాఁ బట్టణమునకుఁ బోతిని. అలం. స్వభావోక్తి.

క. అంపఁ దగువారిఁ గసరుచు
నంపి నగరు సొచ్చి వెలఁదు లారతు లీఁగా
నిం పఱఁ గశాభిహతులన్
జంపించితి వారి నన్నిశామధ్యమునన్.

టీ. అంపన్ = సెలవునొసంగిపంపుటకు, తగువారిన్ = తగినవారిని, కసరుచున్ = భయపెట్టుచు, అంపి = ఎవరినివాసములకు వారలఁ బంపించి, నగరు = రాజమందిరమును, చొచ్చి, వెలఁదులు = అంగనలు, ఆరతులీఁగాన్ = ఆరతుల నొసంగఁగా, ఇంపు = సంతోషము, అఱన్ = నశించునట్లు, వారిన్ = ఆయారతు లీయవచ్చినస్త్రీలను, అన్నిశామధ్యమునన్ = ఆమధ్యరాత్రి యందు, కశాభిహతులన్ = కొరడాదెబ్బలచేత, చంపించితిన్ = చచ్చిపోవునట్లుగఁ గొట్టించినాఁడను.

తా. సేవకులు మొదలగువారిని కసరి పంపిరాజమందిరముఁ బ్రవేశించి సొంతసఁ గొందఱుచెలువ లారతుల నొసంగిరి. వెంటనే యాచెలువలను గొరడా దెబ్బలతో నానడురేయి గొట్టి వారిం జంపించితిని.

సీ. అభ్రమండలి మోచునందాఁక నూరక
పెరిఁగిన ట్లౌ మేను నరవరేణ్య
యవధిభూధరసానువందాఁక నూరక
పఱచిన ట్లౌ మేను పార్థివేంద్ర
యబ్జభూభువనంబునందాఁక నూరక
యెగసిన ట్లౌ మేను జగదధీశ
యహిలోకతల మంటునందాఁక నూరక
పడినయ ట్లౌ మేను ప్రభువతంస
తే. యఖిలజగములు మ్రింగునంతాఁకలియును
నబ్ధు లేడును జెడఁ గ్రోలునంతతృషయు
నచలచాలనచణ మైనయదటుఁ గలిగె
నసురభావంబు నను జెందునవసరమున. 24

టీ. నరవరేణ్య=రాజరాజా, అసురభావంబు = దైత్యత్వము, ననున్, చెందు నవసరమునన్ = ఆక్రమించువేళయందు, మేను = నాదేహము, ఊరక=కారణము లేకయే, అభ్రమండలి = గగనమును, మోఁచునందాఁకన్ = తగులునంతదనుక, పెరిఁగినట్లు = వృద్ధినొందినట్లు, ఔన్ = అగును. పార్థివేంద్ర = ఓభూవరవరా, మేను, అవధిభూధర = చక్రవాళగిరియొక్క, సానువందాఁకన్ = చఱియదాఁక, ఊరక, పఱచినట్లు = వ్యాపించినట్లు-పరుగెత్తినట్లు, ఔన్ = అగును, జగదధీశ = ఓలోకాధిపతీ, మేను, అబ్జభూ = ధాతయొక్క, భువనంబునందాఁకన్ = జగత్తుపర్యంతమును, ఊరక, ఎగసినట్లు = ఎగిరినగతి, ఔన్, ప్రభువతంస = రాజోత్తమా, మేను, అహిలోకతలము=పాతాళలోకమును, అంటునందాఁకన్ =ముట్టునంతవఱకును, ఊరక, పడినయట్లు = దించుకొనిపోయినట్లు, ఔన్, అఖిల=సర్వములగు, జగములు=ప్రపంచములను, మ్రింగునంత=తినఁదగినంత, ఆఁకలియున్, అబ్ధులేడును = సప్తపయోనిధులను, చెడఁగ్రోలునంత = ఇంకునటుల త్రాగఁ

దగినంత, తృషయున్ = దగయును, అచలచాలన=పర్వతములను గదలించు టకు, చణము=తగినది, ఐన, అదటున్ = మత్తతయును, కలిగెను.

తొలుత మే నాకాశమునంటునంత పెద్దదిగాఁ బెరిగెను. తరువాత లావుపలనఁ జక్రవాళపర్వతపుఁ జరియలను సోఁకెను. ఇంకను మేను పెరుఁగు టచే నూర్ధ్వలోకమున కవధి యగు సత్యలోకము నంటెను. సత్యలోకము ఆకసమునందున్న సర్వలోకములకుఁ బైనున్నది. సత్యలోకము మిగులఁ బైనున్న దన్నందులకు,

శా. “ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దా నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున క ల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రునికంత యై ధ్రువునిపై నంతై మహార్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంతసంవర్ధి యై”

(భాగవతము.)

తా. రాజరాజా ! అట్టి యసురత్వము నన్నాక్రమింపఁగానే నాశరీ రము పరవశమై యేమియుం హేతువు లేకుండఁగనే, ఆకాశము నంటునట్లు పొడవుగా పెరుగుచున్నట్లును, చక్రవాళగిరిదనుకఁ బలిచినట్లును, సత్యలోకము వఱకు పెరిగినట్లును, నాగలోకమునం గూలుచున్నట్లును దోఁచి లోకముల నన్నిటి నొకసారి మ్రింగునంతటి యాఁకలియుం జలధు లన్నింటిని నిమిష ములోఁ ద్రాగునంతటి దప్పియును, బర్వతముల నెత్తి యాడించునంతటి బల మును కలిగిన ట్లయ్యెను. అలం. స్వభావోక్తి.

క. రక్కసుఁడ నై నెపంబిడి
యొక్కొకయపరాధమునకు నొక్కొక్కఁడు గా
చొక్కఁగ లోకము పురపురఁ
జొక్కఁగఁ బాడయ్యె నంటిపురముఁ బురమున్. 25

టీ. రక్కసుఁడనై = ఈవిధముగా భయంకరరాక్షసుఁడ నై, నెపంబిడి = లేనిపోనితగవుం గల్పించి-ఏదేని నెపము నొకదాని నాధారము చేసికొని, ఒక్కొకయపరాధమునకున్ = ఒక్కొక్కతప్పునకు, ఒక్కొక్కఁడు కాన్ = ఒక్కొక్కమనుష్యుఁడు ఆహారమగునటుల, బొక్కఁగన్ = తినుచుండఁగా, లోకము = ప్రజ, పురపురన్ = ఎక్కువఁగా, పొక్కఁగన్ = విచారించునట్లు, అంతిపురమున్ = నగరును, పురమున్ = నేను నివసించు పట్టణమును, పాడయ్యెన్ = నాశన మైపోయెను.

తా. అన్యాయముగా నేను లేనితప్పులం బెట్టి నాగరకుల నెల్లం దిన మొదలిడఁగా నందువలన నంతఃపురమును బట్టణమును క్షీణించి పోవ జనము తొట్రుపాటుం జెందెను.

తే. ఊరు పాడైనఁ గెళవులయూళ్లు కుఱికి
మెసవ దొరఁకొంటిఁ బ్రజ మారిమసఁగినట్లు
తీఱెఁ గతిపయదినముల దేశమెల్ల
మల్లెవట్టినచేనిక్రమంబు గాఁగ. 26

టీ. ఊరు = నాపట్టణము, పాడైనన్ = (దినక్రమమున మనుజుల నందఱఁదినుటచే) నాశనము కాఁగా, కెళవుల = దూరమందున్న, ఊళ్లకున్ = గ్రామములకు, ఉఱికి = ఏఁగి, ప్రజన్ = సమూహమును, మారిమసఁగినట్లు = మారియనుక్షుద్రదేవత పాడుచేసినట్లు, మెసవన్ = మ్రింగుటకు, దొరఁకొంటిన్ = ఆరంభించితిని. దేశమెల్లన్ = నాదేశమంతయును, కతిపయదినములన్ = కొద్దిరోజులలోనే, మల్లె = ఒకవిధమగు తెగులు, పట్టిన చేనిక్రమంబు కాఁగన్ = పట్టుకొనిన సస్యమువలె నగునట్లు, తీఱెన్ = హరించి పోయెను.

కెళవులన, ఈవలావలి యనియుం సమీపమునందలి యనియుం బూర్వ వ్యాఖ్యాతలును వ్రాసియున్నారుగాని యాయర్థము సరిపడదు. రాక్షసుఁడు ప్రజల మ్రింగుట సమీపగ్రామములవారు విని పాఱిపోయి యుందురు గాన

దూరపుగ్రామముల కని చెప్పుట యుక్తముగా నున్నది. కెళవు అన దూరమగు టకుఁ ప్రాచీనప్రయోగములు గలవు.

క. "అనఘుఁడు సత్యమె రూపై
జనియించినవాఁడు వీఁ డసాధ్యుం డీవే
ళను బ్రద్యుమ్నాదుల నిట
నునిచి మనము కెళవుతొలఁగి యుండుదమనుచున్.
(జైమిని. ఆ. ౫.)

(పచ్చగా నుండుచేలలోఁ బుట్టకొక్కులవలెఁ దెల్లగా నుండుకాడతోఁ దెల్లనిపూవులతోఁ నొకవిధమగు చెట్టు పుట్టును. వీనిని మల్లె యందురు. ఇది బుట్టిన చే లెండిపోవును.)

తా. నాపురమంతయుం నాశనమై పోయిన పిమ్మటఁ జుట్టుపట్ల గల గ్రామంబులపయిం బడి మారిదేవత మ్రింగిన ట్లందఱినిఁ జంపి తినుచుండఁగా, చేను తెగులుపట్టి క్షీణించినట్లు, స్వల్పకాలములోనే దేశము సర్వమును పాడుపడిపోయెను.

వ. ఇవ్విధంబున విధివిధానంబున యాతుధానుండ నై ధారాధ
రోత్సేధంబును నతినిశితరోమసంబాధంబును ధూమసమధా
మంబును ధృతాంత్రదామంబును జ్వలితకపాలకుండలంబును
జ్వలితసితదంష్ట్రామండలంబును నాగాయుతత్రాణంబును
మస్తకోత్తుంగఘోణంబును నై యనవరతహింసానురూపం
బగురూపంబుఁ దాల్చి శకటాంగభంగికమ్ములై యింగలమ్ము
లొలుకునపాంగమ్ములకా బిశంగమ్ము లగుచుఁ బశ్యజ్జనాసు
మోచనమ్ములగులోచనమ్ములు వెలుంగ బభ్రుకేశమ్ములు దూల
సకలభూతభయంకరమ్మగుపటిమ నిచటి యుటజమ్ముల కుటీకి
జటి యనక వటు వనక యతి యనక వ్రతి యనక గృహి

యనక సతియనక శిశువనక భక్షించి భక్షించి కుక్షింభరిత్వం బునఁ బ్రవర్తిల్లితి నది యట్లుండె వినుము తారలకు వర్షధారలకు నిసుములకుఁ గసవునకు లెక్క గలిగినఁ గలుగుఁ గాని మదీయజఠరానలజీర్ణజంతుసంతానంబునకు లెక్క యిడ నక్కమలగర్భుండును సమర్థుండు గాఁ డిట్టికృత్రిమ దనుజభావావిష్టుండ నగు నాదౌష్ట్యంబు సవసవగాఁ దెలిసి ముదుకయమున్న సుతకళత్రంబులఁ బుట్టినింటివా రుత్సవావలోకనవ్యాజంబున ననిపించుకొని చని నిజగృహంబుల నునిచి రక్షించుకొని యుండి రిప్పు డేనశనంబు గానక కానక కన్నయిక్కన్నియఁ గైలాసశాసనంబునఁ గుసుమంబులు గోయుదానిఁ గని కనికరం బుడిగి కడుపుఁజిచ్చునకు మ్రింగఁ దలఁచుకొనివచ్చి యిచ్చోట భవదీయదర్శనంబున వృజినరుజవలన విముక్తుండ నై నిజప్రకృతిఁ బొంది కృతార్థుండ నైతి.

టీ. ఇవ్విధంబునఁ = ఈరీతిగా, విధివిధానంబునఁ = భగవంతుని యేర్పాటువలన, యాతుధానుండనై = రక్కసినై, ధారాధర = మేఘపర్యంతమైన (ధారాధరో జలధరో తటిత్వాన్వారిదోఽంబుభృత్. అమరము). ఉత్సేధంబును = ఉన్నతమును, అతి నిశిత = మిగుల వాఁడియైన - మిగుల చిరుసైన యనుట. రోమ = వెండ్రుకలచేత, సంబాధంబును = ఎడములేనిదియు, ధూమ = పొగతో, సమ = తుల్యమయిన, ధామంబును = ప్రకాశంబు గలిగినదియు, ధృత = ధరింపఁబడిన, ఆంత్ర = ప్రేవులయొక్క, దామంబును = దండలుగలదియు, చలిత = కంపింపఁబడిన, కపాల=పుర్రెయుముక్కలయొక్క, కుండలంబును = కర్ణభూషణములు గలిగినదియు, జ్వలిత = ప్రకాశించునట్టి, సిత = ధవళమైన, దంష్ట్రామండలంబును = కోఱపండ్ల

పరువు గలదియు, నాగాయుత = పదివేలగజములయొక్క, త్రాణంబును = బలము కలిగినదియు, మస్తక = శిరస్సుమీఁదిదాఁక, ఉత్తుంగ = పొడవుగా నున్న, ఘోణంబును = నాసికగలిగినదియు, ఐ=అయి, అనవరత = తెరపిలేని, హింసా = ప్రాణిహింసకు, అనురూపంబు = తగినది, అగు = అయినటువంటి రూపంబున్ = ఆకారమును, తాల్చి = ధరించి (అలం-ఉపమ.) శకటాంగ= బండిచక్రములయొక్క, భంగికమ్ములు=రీతులుగలవి, ఐ,ఇంగలమ్ములు=అగ్నులు, ఒలుకు = రాలుచున్న, అపాంగమ్ములన్ = క్రేఁగన్నులచేత, విశంగమ్ములు = విచ్చఁబడినవి, అగుచున్, పశ్యత్ = కాంచుచున్న, జన = నరులయొక్క, అసు = జీవనములను, మోచనమ్ములు = వదలించునవి, అగు, లోచనమ్ములు = నేత్రములు, వెలుంగన్ = ప్రకాశింప, కనులు నిప్పు లురియునటు లుంటచే జూచినవారు చూచినటుల వెఱపుచే మడియుచుండిరి. అలం - ఉపమయు స్వభావోక్తియు. బభ్రుకేశమ్ములు = పాటల వర్ణముగల శిరోజములు, తూలన్ = చలించుచుండ, సకలభూతభయంకరంబు = సర్వజీవములకు భీతినిఁ బుట్టఁజేయునదియు అగు, పటిమన్ = సత్తువచేత, ఇచటి, ఉటజమ్ములకున్=ఆకుటెండ్లకు, "పర్ణశాలోటజో స్త్రియాం," అమరము. ఉటికి = పేరేమువారి - మునుల పర్ణశాలలపైఁ బడి, జటి యనక = మునీంద్రుఁడని యాలోచింపక, వటు వనక= బ్రహ్మచారి యని యాలోచింపక, యతి యనక= సన్న్యాసి యని యూహింపక, వ్రతి యనక = వానప్రస్థుఁ డని తలంపక, గృహి యనక=కుటుంబి యని యెంచక, సతి యనక=స్త్రీ యని యెంచక, శిశు వనక=చంటిపిల్ల యని తలంపక, భక్షించి భక్షించి = మెసవి మెసవి, కుక్షింభరిత్వంబునన్ = పొట్టనించుకొనువానితనమున, పాప మనుమాటనే మఱచి కేవల మాఁకటిచిచ్చు నార్చుకొనుటయే కర్తవ్యముగఁ బెట్టుకొని, ప్రవర్తిల్లితిన్ = సంచరించుచుంటిని, అది, అట్లుండెన్ = అట్లుండఁగా, వినుము, తారలకున్ = చుక్కలకును, వర్షధారలకున్=వానచుక్కలకును, ఇసుమునకున్= ఇసుకకణములకును, కసవునకున్ = (భూమిపైఁగల) గడ్డిమొక్కలకును,

లెక్క = ఇన్ని యను పరిగణనము, కలిగినన్ = ఉండినప్పటికిని, కలుగఁ గాని = ఉండునుగాని, మదీయ = నాసంబంధమైన, జఠరానల = జఠర వహ్నివలన, జీర్ణ = అఱిగిపోయినటువంటి - నేను తిని జీర్ణించుకొని నటువంటి యనుట, జంతు = జీవములయొక్క, సంతానంబునకున్ = సముదాయమునకు, లెక్కయిడన్, అక్కమలగర్భుండును = విధాత యును-నాలుగు మోములు గల వాఁడును సృష్టికిఁ గర్తయు నగు బ్రహ్మ, సమర్థుండు కాఁడు = సామర్థ్యముగలవాఁడు కాఁడు, ఇట్టి, కృత్రిమ = పుట్టింపఁబడిన - మునిశాపముచేత సంభవించిన, దనుజభావ = దైత్యత్వము, ఆవిష్టుఁడను = పొందినవాఁడను, అగు, నాదౌష్ట్యంబు = దుర్మార్గత, నవన వగాన్ = ఒకవిధముగా, తెలిసి = యెఱింగి, మదురకయ మున్న = పెచ్చు పెరిఁగి యింటివారిని మ్రింగుటకుఁ బోకముందె, మత్ = నాయొక్క, కళ త్రంబులన్ = కులభామినులను, పుట్టినింటివారు, ఉత్సవ = వివాహాద్యుత్సవ ములను, అవలోకన = వీక్షించుట యను, వ్యాజంబునన్ = మిషమీఁద, అనిపించుకొని = నాచేఁ బంపున ట్లొప్పించుకొని, చని = వెంటగొంపోయి, నిజగృహంబులన్ = తమగేహములయందు, ఉనిచి = ఉంచుకొని, రక్షించు కొని = కాపాడుకొని, ఉండిరి. ఇప్పుడు = ఈసమయమునందు, ఏన్ = నేను, అశనంబు = తిండి, కానక = కనుఁగొనలేక - దేశమంతయుం నేను బాధపెట్టుటచే నెటను నాహారము చిక్కక, కానక = లేక లేక, కన్న ఇక్కన్ని యన్ = నేనుగన్న యీబిడ్డను, కైలాస కాననంబునన్ = కైలాసగిరియొక్క వనంబున, కుసుమంబులు = పువ్వులు, కోయుదానిన్ = కోయుచున్న దానిని కని = చూచి, కనిరంబు = ప్రేమ, ఉడిగి = విడిచి, కడుపుచిచ్చునకున్ = కడుపుమంటకు - జఠరాగ్నికి, మ్రింగన్ = తినుటకు, తఱుముకొని వచ్చి = వెంటఁబడి తఱిమివచ్చి, ఇచ్చోటన్ = ఈప్రదేశమునందు, భవదీయ = నీదగు, దర్శనంబునన్ = దృష్టివలన, వృజిన = దురిత మగు, రుజవలనన్ = జబ్బునుండి, విముక్తుండనై, = వదలఁబడినవాఁడనై, నిజప్రకృతిన్ = పూర్వప్ర

స్థితిని, పూర్వగంధర్వస్వరూపము, పొంది = గ్రహించి, కృతార్థుఁడను = సఫలమనోరథుండను, ఐతిన్ = అయితిని. శాపాంతమగుటచేఁ బూర్వస్వరూపమును నీయనుగ్రహముచేఁ బడయఁగలిగితి నని భావము.

క. ఈయుపకారమునకుఁ బ్రతి
సేయఁగ శక్యంబె జంభజిన్నిభ శఫరా
త్యాయతలోచన యైనమ
దీయాత్మజ నీకు నిత్తు దేవీమణిగన్. 28

టీ. జంభజిన్నిభ = దేవేంద్రునిబోలిన యోమహారాజా! ఈయుపకారమునకున్ = నీవొనరించినయీమేలునకు, ప్రతి = బదులు మేలు, చేయఁగన్ = చేయుటకు, శక్యంబె = సాధ్యమా, దేవీమణిగన్ = పట్టమహిషినిగా, శఫర = మత్స్యములవలె, అతి = ఎక్కువ, ఆయత = వెడల్పైన, లోచన = నేత్రములు గలిగినది, ఐన, మదీయాత్మజన్ = నాపుత్త్రికను, ఇత్తున్ = నీ కిచ్చెదను.

శఫర యన బేడిస. బేడిసమీను కదలుచున్న నెంత మనోజ్ఞముగా నుండునో యీమె చలించుచూపు లంత మనోహరముగా నుండునని భావము. చలించుచూపులను బేడిసచూపులుగాఁ బూర్వకవులు వర్ణించిరి.

"తవాపర్ణే కర్ణేజపనయనపైశున్యచకితా
నిలీయంతే నీరే నియతమనిమేషాః శఫరికాః,
ఇయం చ శ్రీరద్ధచ్ఛటపటుకవాటం కువలయం
జహాతి ప్రత్యూషే నిశి చ విఘటయ్య ప్రవిశతి."

(సౌందర్యలహరి.)

తస్మాదస్యాః కుముదవిశదాన్యర్హసి త్వం న ధైర్యా
న్మోఘీకర్తుం చటులశఫరోద్వర్తనప్రేక్షితాని." (మేఘసందేశము.)

జంభజిన్నిభ యనుసంబోధనము సాభిప్రాయము. జంభరాక్షసుని జంపి యింద్రుఁడు లోకమునకు మేలుచేసినటుల నారాక్షసత్వము పోఁగొట్టి భూలోకమునకు మేలుచేసితివి గాన జంభజిన్నిభనామము తగియున్న దనుట.

తా. ఇట్టి మహోపకారము చేసిననీకు నే నేమియుఁ బ్రత్యుపకారముఁ జేయలేను. కావున నో మహారాజా! నాతనయను నీకుఁ బట్టభార్యగా నిచ్చెదను.

క. ఆయుర్వేదముఁ గైకొని
యీయింతిం బెండ్లియాడు మెలమి రమానా
రాయణపరిణయగేయవి
గాయనగంధర్వ మైన కవ్వపుఁగొండన్. 29

టీ. ఆయుర్వేదమున్ = వైద్యశాస్త్రమును, కైకొని = పరిగ్రహించి, ఎలమిన్ = ఉత్సాహముతో, ఈయింతిన్ = నాపుత్త్రియగునీబిడ్డను, రమా = లక్ష్మియొక్కయు, నారాయణ = విష్ణుమూర్తియొక్కయు, పరిణయ=వివాహచారిత్రముగల, గేయ = సంగీతమును, విగాయన = ఎక్కువగా గానము చేయుచుండెడు, గంధర్వము = గంధర్వజాతిగలిగినది, ఐన, కవ్వపుఁగొండన్ = మంథాద్రియందు, పెండ్లియాడుము = పెండ్లిచేసికొమ్ము.

తా. నేను నేర్చుకొనినవైద్యశాస్త్రమును నాకూఁతుతోఁగూడ నొసంగెదను. గంధర్వగానములు నెలంగ మందరగిరిసమీపమునం గలనాయింటికి వచ్చి కౌతుకముతో వివాహ మాడుము.

లయ. అన్నగముపై జరఠపన్నగపతిస్ఫుట ల
న న్నగసి కోటతుదల న్నెగడుకొమ్మల్
మిన్నగలరాయ రుచిఁజెన్నగువిమానముల
పన్నుగడ మన్నుగఁ బ్రభిన్నగజఘోట

చ్ఛన్నగహనాపణముల న్నిగనిగద్యుతి ర
విన్నగుమణిప్రకర మున్నగరిమం బే
రెన్నఁ గల యంగడులవన్నెగని సంపదల
మన్నగరి యొప్పు బలభిన్నగరి తేవన్. 30

టీ. అన్నముపైన్ = ఆకస్వపుఁగొండమీఁద, జరఠ = వృద్ధత్వమును బొందిన, పన్నగపతి = పాములఱేఁడగు శేషునియొక్క, స్ఫటలు అనన్ = పడగలో యేమో యనునట్లు, నెగపి = పైకిఁ బొటకరించి-మీఁదికి నిక్కి-కోటతుదలను = ప్రాకారపుగోడలతుదలయందు, నెగడు = అతిశయించునట్టి, కొమ్మల్ = శిఖరములు, మిన్ను = గగనము, అగలన్ = బ్రద్దలగునట్లు, రాయన్ = ఒరసికొనఁగా - ఆకాశమునంటుకొని యొడతెగక రాసికొనుట చేత నని భావము. రుచిన్ = కాంతివలన, చెన్నగు = మిగులనందముగాఁ గనిపించు, విమానముల = మేడలమీఁద నలుచదరముగాఁ జప్పరములవలె (పందిరులవలె ననికొందఱు) గట్టఁబడిన కట్టడముయొక్క, పన్నగడ = ఏర్పాటు, పన్నగన్ = అందముగాఁ దనరారుచుండఁగా, ప్రభిన్న = మదించిన, గజ = కరులవలనను, ఘోట = అశ్వములవలనను, ఛన్న = ఆవరింపఁబడినవై, గహన = ప్రవేశింపశక్యముగానివై, ఆపణములన్ = దుకాణములలో, నిగనిగద్యుతిన్ = నిగనిగ యనుప్రకాశముతో, రవిన్ = దివాకరుని, నగుమణి ప్రకరము = హేళనముచేయురత్నసందోహము, (రాజవీథులందు గజములు గుఱ్ఱములు క్రిక్కిరిసియుంటచే రత్నములచే నిండిన యంగడులు చేరశక్యము గాకున్నవి. ఆయంగడిలోని రత్నములు సూర్యబింబమును మించి ప్రకాశించుచుండెను. అట్టిరత్నసందోహము) ఉన్నగరిమన్ = ఉన్నగొప్పతనముచేత, పేరు = ప్రసిద్ధిని, ఎన్నన్ = ఎంచుటకు-కొనియాడుటకు, కలయంగడులన్ = తగినరచ్చపట్టులచేతను, వన్నెగని = పొగడికం గాంచి, సంపదలన్ = భాగ్యములచేత, బలభిత్ = ఇంద్రునిదగు, నగరితేవన్ = పట్టణమువలె-అమరావతీపట్టణమువలె, మత్ = నాయొక్క, నగరి = పురము, ఒప్పున్ = ఒప్పుచుండును.

అంగదులందు రత్నము లెక్కుడుగా నుండె ననుట పురభాగ్యాతిశయము సూచించెను. ఇటులే—"శశ్వదగణ్యపణ్యవిస్తారితమణిగణాదివస్తుజాతవ్యాఖ్యాతరత్నాకరమాహాత్మ్యా." (దశకుమారచరిత్రము.)

తా. ఆపురము మందరపర్వతముపై మిక్కిలిపొడవగుకోటకొమ్మలును బ్రకాశించు మేడలమీఁదఁ బొడవుగాఁ దనరారు చిత్రములగుగోపురములును ఎల్లకడల మదపుటేనుంగులు గుఱ్ఱములతో నిండుకొని సూర్యకాంతిని దిరస్కరించు రత్నకాంతులచే నంగడులతోఁ బ్రకాశించి యింద్రపురంబువలె సకలవైభవములచే విరాజిల్లుచుండును. అలం. ఉపమ. అతిశయోక్తి. ఉత్ప్రేక్ష.

తే. అని నిజోదంత మావంత యైన దాఁప
కంతయును జెప్ప నద్భుతం బంతరంగ
మంతయును నిండ హర్షించె నాస్వరోచి
యంత రవి యేఁగెఁ బశ్చిమాశాంతమునకు. 31

టీ. అని=ఇటులని, నిజోదంతము = తనవృత్తాంతము, ఆవంతయుఁన్ = అవగింజయంతయు-కొంచెముగూడ, దాఁపక =మరుగుపఱుపక, అంతయుఁన్ = సమస్తమును, చెప్పన్ = (స్వరోచితో నిందీవరాక్షుఁడు సాకల్యముగా) చెప్పఁగా, అంతరంగమంతయుఁన్ = చిత్తమంతయును, నిండన్, ఇందీవరాక్షుండు దనకు మేనమామయగుటయుం శాపవశమునఁ గుమారిని మ్రింగ నెంచుటయుం లోనగు నద్భుతాంశములకు నాశ్చర్యపడి, హర్షించెన్ = సంతోషించెను, అంతన్ - అపిమ్మట, రవి = భాస్కరుఁడు, పశ్చిమాశా = పడమటిదిశయొక్క, అంతమునకున్ = కొనకు, ఏఁగెన్ = పోయెను. సాయంతనమయ్యెను.

తా. ఈవిధముగా గంధర్వరాజగు నిందీవరాక్షుఁడు స్వరోచితో నావంతయుం దాఁపక నిజవృత్తాంతము సాంతముగాఁ జెప్పిన విని స్వరోచి విస్మయమ్ముం గౌతుకముం జెందెను. అంతసూర్యుఁడ స్తశైలము దాపునకుఁ జేరెను.

మ. వికసిల్లం బ్రజ చక్రపాలనము గావించెన్ గరవ్యాపృతిన్
గకుబంతంబుల నాక్రమించెఁ బొసఁగంగా నేర్చె వర్ణాళిఁ గాం
తికిఁ బాపెన్ బెరరాజకోటిఁ దుదిశాంతిన్ బొందె దైవంబు నే
తకుఁ దాపం బిఁక నేల నంగ నినుఁ డస్తప్రాప్తుఁ డయ్యెన్ గడన్.

టీ. ఈపద్యమునందు సూర్యునకును రాజునకు సరిపడునటుల నర్థద్వయము గలదు. ఇనుఁడు=వేఁడివెలుఁగు, రాజు-అనియర్థాంతరము, ప్రజ=జనబృందము, వికసిల్లన్=వివేచనకలదికాఁగా-సంతోషింపఁగాననియర్థాంతరము. చక్రపాలనము=చక్రవాకములం బరిపాలించుట-మహీమండలముఁ గాపాడుటయని యర్థాంతరము, గావించెన్=చేసెను. కరవ్యాపృతిన్=కిరణములయొక్క వ్యాపనముచేత-హస్తములుసాచుటంజేసి యని యర్థాంతరము. కకుబంతంబులన్ = దిగంతములవఱకు నున్న ప్రపంచమంతయు, ఆక్రమించెన్=చుట్టుకొనెను, అధీనము చేసికొనెను. వర్ణాళిన్ = తెలుపునలుపులోనగువన్నెలను, బ్రాహ్మణక్షత్రియాదికమగు వర్ణములనని యర్థాంతరము. పొసఁగంగాన్ = ఒప్పునట్లు, ఏర్చెన్ = విభజనము గావించెను. ఇది యీరంగనిదియు, నిది యీజాతి యనియు విభజించెను. పెఱరాజకోటిన్ = అన్యుఁడగుసోమునియున్నలెని-వైరిరాజసముదాయమును, కాంతికిన్ = కాంతివలననుండి - పౌరుషమువలననుండి, పాపెన్ = తొలఁగించెను. (చంద్రకాంతినిఁ దగ్గించె ననియు, విరోధిరాజులపౌరుషమును పోఁగొట్టె ననియు), దైవంబునేతకున్ = భగవచ్చేష్టితమునకు, ఇఁకన్, తాపంబు = ఉష్ణత్వమును - చిత్తపరితాపము, ఏల = ఏమిటికి, అనంగన్ = అనునటుల, తుదిన్ = చివరకు, శాంతిన్ = వేఁడిలేకుండుటను-కామక్రోధాదిగుణంబులు లేకుండుటను, శమగుణమును, పొందెన్ = చెందెను, కడన్ = అటుతరువాత, (పా. కడున్ = మిక్కిలి) అస్తప్రాప్తుఁడు-అస్త = క్రుంకుటను-మృతినొందుటను, ప్రాప్తుఁడు = చేరుకొనినయాతఁడు-పొందినయాతఁడు, అయ్యెన్ = ఆయెను. ప్రొద్దుగ్రుంకె నని యర్థము. రాజు మృతినొందె నని యర్థాంతరము.

ఇనశబ్దము రాజునందును సూర్యునందును వర్తించు ననుటకు—

"ఇనస్సూర్యే ప్రభౌ రాజా మృగాంకే క్షత్రియేనృపే" అమరము.

తా. ఒకరాజు ప్రతాపము గలవాఁడై తనదోర్బలముచే సకలదేశ నృపాలురను గెలిచి చక్రవర్తియై యందఱిని వారివారికులమర్యాదలు చెడకుండఁ గాపాడుచు ప్రభుత్వముచేసి విధివశమున మరణకాల మాసన్నము కాఁగా నోర్పు గలిగి కాలధర్మము నందెనో యనువిధముగాఁ ప్రభాకరుఁడు తనకాంతులవలన బ్రహ్మాండమంతయు నలముకొన చంద్రతారాగణప్రకాశము మాయ పలువిధము లగురంగుల వెట్టువించుచు వెలిఁగి రాత్రివేళకుఁ దాపము తగ్గఁ గ్రమక్రమముగా నస్తమయము గాంచెను. అలం. శేషము. ఉత్ప్రేక్ష. అర్థాంతరన్యాసము.

తే. అసురవరుఁ డైనయిందీవరాక్షు మేన
నంటుకొన్న స్వరోచిబాణాగ్ని వోలె
నంతఁ గనుపట్టె శుకతుండ కాంతిఁ దెగడి
సాంధ్యరాగంబు పశ్చిమాచలమునందు. 33

టీ. అసురవరుఁడు = దైత్యోత్తముఁడు, ఐనయిందీవరాక్షు మేనన్ = అయినట్టి వంటి ఇందీవరాక్షుఁ డను గంధర్వునిదేహమునందు, అంటుకొన్న = తగుల్కొన్న, స్వరోచి=స్వరోచియొక్క, బాణ = శరసంబంధమైన, అగ్ని వోలెన్=అగ్నిహోత్రమువలెనే, అంతన్ = ఆపిమ్మట, సాయంసమయము కాఁగానే, శుకతుండ = చిలుకముక్కుయొక్క, కాంతిన్ = రక్తవర్ణమును, తెగడి = అధిగమించి, సాంధ్యరాగంబు = సంధ్యాకాల రక్తిమము, పశ్చిమ=పడమటి, అచలమునందున్ = పర్వతమునందు-అస్తపర్వతమునందు, కనుపట్టెన్=కనపించెను.

తా. శాపకారణమున దైత్యత్వమును జెందినయిందీవరాక్షుని శరీరమునం దగుల్కొనిన స్వరోచి యాగ్నేయశరజ్వాలయో యన నస్తమయము

కాఁగాఁ బశ్చిమాచలమునందుఁ జిలుకముక్కువంటి యెఱ్ఱని కాంతిసమూహ
ముతో సాంధ్యరాగంబు గాన్పించెను. అలం. ఉత్ప్రేక్ష. ఉపమలు.

క. తలచూపె నప్పు డఖిలా
శల దట్టపుటిరులు చిలువజవరాలు నభ
స్స్థలకుండపకోపరిసీ
మల నిడినసితాండపటలిమాడ్కిఁ జుక్కల్. 34

టీ. అప్పుడు = ఆసంధ్యారాగానంతరమునందు, అఖిల = సమస్తమైన ఆశలన్ = దిశలయందు, దట్టపుటిరులు - దట్టపు = తఱుచైన, ఇరులు = చీకటియనెడి, చిలువజవరాలు = ఆఁడుపాము, నభస్స్థల = గగనతలమను, మండపక = మంటపముయొక్క, ఉపరిసీమలన్ = పైభాగములందు, ఇడిన, సిత = ధవళమైన, అండపటలిమాడ్కిన్ = గ్రుడ్లప్రోవువలె, చుక్కలు, తలచూపెన్ = కాన్పించెను.

తా. తొలుత సంధ్యారాగ మావరించెను. ఆవలఁ జీకటి తఱుచుగా దెసలన్నియుఁ గలయ నల్లికొనెను. చీఁకటి యను చిలువచెలువ యాకాశ మను మండపముపైఁ బెట్టిన తెల్లని గ్రుడ్లవలె నాకసమునందుఁ జుక్కలు ప్రకాశించెను. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

ఆ. సాంధ్యనటనచండచండీశపదహతిఁ
దరణిచక్ర మొరగి శరధిఁ గ్రుంగ
దొరగల్లు వడియె భూరథేతరభాగ
చక్ర మనఁగ నపుడు శశియుఁ దోఁచె. 35

టీ. అపుడు = ఆసమయమునందు, సాంధ్య = సంజవేళయందలి, నటన = నర్తనము సేయునప్పటి, చండ = మిక్కిలితీక్ష్ణమైన, చండీశ = ఈశ్వరునియొక్క, పదహతిన్ = పాదఘాతముచేత, తరణిచక్రము = భాస్కరాకారమగుచక్రము, ఒరగి = వ్రాలి, శరధిన్ = ఉదధియందు, గ్రుంగన్ = దించు

కొనిపోఁగా, భూరథ...చక్రము-భూరథ = భూమ్యాకారమైన తేరియొక్క, ఇతరభాగ=ఇంకొక ప్రక్కదియైన, చక్రము=కల్లు, దొరగల్లువడియెన్ = దొరగలఁ బడెనో, అనఁగన్ = అనునటుల, శశియున్ = సోముఁడును, తోఁచెన్ = పుట్టెను.

శంకరుఁడు త్రిపురసంహారము చేయుసమయమునందు భూమిని రథముగను సూర్యచంద్రులను రథచక్రములుగను జేసికొని జయించిన పురాణకథ యిట ననుసంధించుకొనునది. ఈకథ భారతము కర్ణపర్వమునందును స్కాందపురాణమునందును గలదు.

శివుఁ డొనరించు నృత్యమును తాండవ మని వ్యవహరింతురు. ఇటు లనుటకు భారతీయవచనము.

"నాట్యం నృత్యం తథా నృత్తమగ్రే శంభోః ప్రయుక్తవాన్
పర్యాప్తముద్ధతం స్మృత్వా స్వప్రయుక్తం తతో హరిః
తండునా స్వగణాగ్రణ్యా భరతాయ న్యదీదిశత్
లాస్యమస్యాగ్రతః ప్రీత్యా పార్వత్యా సమదీదిశత్."

తా. ప్రౌఢగ్రుంకినతతి సంజవేళ నృత్యమొనర్చుచున్న సాంబమూర్తియొక్క ఘనమైనపాదఘట్టనలచేఁ బుడమి యను తేరియొక్క ఒక చక్రమగు నినుఁడు సాగరమున మునుంగఁగా, రెండవచక్ర మగుచందురుం డొరగలఁ బడెనేమో యనురీతిఁ జంద్రుఁ డుదయించెను. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

క. తమ మను కాలాహి ప్రపం
చము నెరకొని యోషధీశసద్యగకృతదం
డమున మగుడంగఁ గ్రక్కుడు
క్రమమున నోరొయ్యొయ్యి విచ్చి కడలకుఁ దొలఁగెన్. 36

టీ. తమము = చీకటి, అను = అనెడు, కాలాహి = నల్లత్రాఁచు, ప్రపంచమున్ = లోకమును, ఎరగొని = కబళించి, ఓషధీశ = సోముఁ

డనురాజువలన, సద్యః = తత్క్షణమే, కృత = ఒనర్పఁబడిన, దండమునన్ = దండనమువలన, మగుడంగన్ = తిరుగా, క్రక్కుడుక్రమమునన్ = వెడలఁ గ్రక్కువిధముగా, ఒయ్యొయ్యన్ = నెమ్మదినెమ్మదిగా, విచ్చి = విడి, కడలకున్ = వైపులకు - దూరపుప్రదేశములకు, తొలఁగెన్ = తొలఁగి పోయెను.

కాలాహి తక్కిన పాములకంటెఁగూడ నపాయమైనది. దీనిని శిక్షించుటకుఁ దగినవాఁడు ఓషధులమర్మము నెఱింగిన యోషధీశుఁడే. పా మేదేని భుజించినంతన వెడలఁగ్రక్కించిన నది గర్భమునందె జీర్ణముగాక బ్రతికియుండును. లోకమునంతయును సుధావిధిఁ గ్రక్కించుటకుఁ దలఁచెనుగాన నోషధీశుఁడు తత్క్షణమె (సద్యఃకాలముననె) క్రక్కించెను. అలం. రూపకము. ఉత్ప్రేక్ష.

తా. కృష్ణసర్పము తన కాహార మగుకప్పలు మొదలైనవానిని మ్రింగి పట్టు తిమిరము ప్రపంచమునంతను జుట్టుకొనఁ జంద్రోదయ మాయెను. పిమ్మట వెన్నెల దిక్కుల నలముకొనఁగా నంధకారము పటాపంచలయ్యెను.

సీ. కలయ వెల్లువగట్టి జలజలఁ బ్రవహించు
శశికాంతవాంతనిర్ఝరము జలము
మలయానిలముచే దుమారంబు రేఁగుసౌ
గంధికంబురజఃబు కలుకుదుమ్ము
నిండార విరిసినబొండుమల్లెలనుండి
పడియుమరందంబు గుడరసంబు
తొలఁకి మింటికిఁ బొంగుదుగ్ధపాథోరాశి
కరడులమీఁదిమీఁగడల మెఱుఁగు

తే. తనకు రసవర్గములుగా సుధాకరుండు
సారెసారెకుఁ గరములు సాఁచిచాఁచి

యచ్ఛతెలుపుగ నపుడు బ్రహ్మాండమండ
పంబు వెన్నెలసన్నసున్నంబు సేసె. 38

టీ. సుధాకరుండు = శశి యను సున్నపుగచ్చుచేయుం బనివాఁడు, అపుడు = ఆసమయమునందు, కలయన్ = ప్రతిస్థలమందును, వెల్లువగట్టి = ప్రవాహముగానయి, జలజలన్ = జలజలమను మ్రోఁత కలుగునటుల, ప్రవహించు = పాఱుచున్న, శశికాంత = చంద్రకాంతమణులచేత, వాంత = వెడలఁ గ్రక్కఁబడిన - తనంతనఁ బొరలుచున్న, నిర్ఝరము = నీటివఱదయొక్క, జలము = (పరిశుద్ధమగు) నీరుచు, మలయానిలముచేన్ = మలయగిరియందలి వాయువుచేత - మిగుల మందముగా వీచుచల్లనిగాలి చేత, దుమారంబు = ధూళి, రేఁగు = పైకెగయునట్టి, సౌగంధికంబు = మంచిసువాసనయుం గొంచెము రక్తవర్ణమును గలకలువపూవులయొక్క, "సౌగంధికం తు కల్హారం హల్లకం రక్తసంధ్యకం." అమరము, రజంబు = పుష్పరాగమనెడు, కఱకుదుమ్మున్ = ఇసుకను (గచ్చున కుపయోగించు నొకవిధమగు బూడిద యని కొందఱు.) కిందారన్ = బాగుగా, విరిసిన = పుష్పించిన, బొండుమల్లెఁబుండి = గుత్తిగా నుండు పెద్దమల్లెపూవులనుండి, వడియు = స్రవించుచున్న, మరందంబు = పుష్పమరందమను, గుడరసంబు = పానకమును, తొలఁకి = మించి, మింటికిన్ = గగనమునకు, పొంగు = తనంతన యుప్పొంగుచున్న, దుగ్ధపాథోరాశి = క్షీరసాగరముయొక్క, కరముల = కెరటములయొక్క, మీఁది = పయి భాగమునందలి, మీఁగడల = మెఱుఁగుపెఱలను, మెఱుఁగు = చమురును, తనకు, రసవర్గములు = సున్నపుగచ్చుపనికి పలయువకరములు, కాన్ = అగుచుండఁగా, ఈపరికరములతో, పారిపారికన్ = మాటి మాటికి, కరములు = కిరణము లనెడుహస్తములను, చాఁచి సాఁచి = సాగించి సాగించి, బ్రహ్మాండమండపంబు = బ్రహ్మాండమనునట్టి గొప్పపావడి, అచ్ఛతెలుపుగన్ = మిగులఁదెలుపురంగుగలదిగా, వెన్నెల = జ్యోత్స్నయను, సన్నసున్నంబు = పాలగచ్చు, చేసెన్ = కావించెను. సుధాకరుఁడన వెన్నెలగచ్చుచేయుంవాఁ డనియు

నమృతకిరణుఁ డనువ్యుత్పత్తిచేఁ జంద్రుఁడనియుఁ నర్థాంతరములు గ్రాహ్యములు. సుధా యన సున్నపు గచ్చనుటకు.—"సుధా లేపోఽమృతం స్నుహీ" అని అమరము.

తా. అపుడు చంద్రిక యన్నిదిశలఁ బర్వి వెలుంగఁగా శశియనుసున్నపు పనిచేయునాతఁడు నీరయి పాఱుచున్న చంద్రకాంతశిలాద్రవము నీరుగా, శీకవాతముచేఁ జలించుచున్న పరాగము ఇసుకగా, పుష్పమరందము పానకపునీరుగా, క్షీరసాగరముయొక్క కెరటములపైఁ దేలుచున్న మీఁగడ కాంతి గలుగఁజేయుతైలముగాఁ జేసికొని బ్రహ్మాండమండపమునకుఁ బాలు గచ్చుపని చేసెనేమో యనురీతి నుండెను. అలం. రూపకము.

వ. ఆసమయంబునం బరిశ్రాంతుం డగునమ్మహీకాంతుం డొక్క
శశికాంతశిలామండపంబున దట్టంబుగాఁ బఱచినచిగురు
పఱుపుల గంధర్వరాజానుం దానును సుఖాసీనుం డై యిష్ట
కథాగోష్ఠి నారాత్రి గడపె నంత. 39

టీ. ఆసమయంబునన్ = అటులు స్వచ్ఛముగా వెన్నెల గాయుచున్న సమయమునందు, పరిశ్రాంతుఁడు = ప్రాలుమాలిక గాంచినవాఁడు, అగు అమ్మహీకాంతుండు = అయిన యాస్వారోచి భూపాలుఁడు, ఒక్క, శశికాంతశిలామండపంబునన్ = చంద్రకాంతోపలములవలన నొనర్చినమిద్దెయందు, దట్టంబుగాన్ = ఒత్తుగా, పఱచిన = శయ్యగాఁ బఱచిన, చిగురు పఱుపులన్ = ననలచేఁ జేయఁబడిన ప్రక్కలయందు, గంధర్వరాజునున్ = ఇందీవరాక్షుఁడును, తానును = స్వారోచియు, సుఖాసీనుండై = క్షేమముగాఁ గూర్చుండినవాఁడై, ఇష్టకథాగోష్ఠిన్ = హితములైనచరిత్రలు వర్ణించుకొనుటవలన, ఆరాత్రి, కడపెన్, అంతన్ (ముందరి కన్వయము.)

సీ. తనుఁ బాసి శశి దవ్వుచనిన నెవ్వగఁబోలెఁ
దొలిదిక్కుజవరాలు వెలుకఁ బాఱెఁ

ప్రథమాద్రిసభయందుఁ బఱచినకెంబట్టు
జముకాణ మనఁగ రాగము జనించె
ధవుఁ గూర్మికొసరుచున్నదివోలె ముఖరాళి
వనరుహాస్యములఁ బద్మినులు తెఱచె
భానూష్మభీతి మున్పడినచుక్కలభంగి
దొరలె వేకువగాలిఁ దరులమంచు

తే. కాలగుణయుక్తి మింటిచక్కటికి నెగయ
వాసవునిపట్టి పొడువుగా వైచి యాడు
గచ్చుచమరినదారుచక్రంపుబిళ్ల
వోలె నొయ్యనఁ బ్రాచి లేఁబ్రొద్దు పొడిచె. 40

టీ. తొలిదిక్కుజవరాలు = పూర్వదిశ యనుయావనాంగన, శశి = చందురుండు, తనక్ = తన్ను, పాసి = పదలి, దవ్వు = దూరముగా, చనిన = పోవుట చేతఁగలిగిన, చిక్కఁగఁబోలెక్ = ఎక్కువవిచారమువలననో యన, వెలుకఁ బాఱెక్ = తెల్లతెల్లపోయెను - తెల్లఁగఁ దెల్లవాఱె ననుట. ప్రథమాద్రిసభ యందుక్ = ఉదయపర్వత మనుసభయందు, పఱచిన, కెంబట్టు = రక్తవర్ణము గల పట్టుసంబంధమైన, జముకాణము = ముదుకగానేసిన యెఱ్ఱనిపఱచికొను వస్త్రము, అనఁగక్ = అనునటుల, రాగము = ప్రాతస్సంధ్యారాగము, జనించెక్ = కలిగెను. తెల్లఁగఁ దెల్లవారినంతనఁ దూరుపున నుదయరాగము తోఁచెను. పద్మినులు = పద్మలతలను పద్మినీజాతియువతులు; ధవుక్ = భర్తయైన భాస్కరుని యొక్క, కూర్మి = నేత్రమును, కొసరుచుక్ = వేఁడుకొనుచు, ఉన్నదివోలెక్ = ఉన్నది యేమోయనునటుల, ముఖర = మ్రోఁగుచున్న, అళి = తుమ్మెదలతోడి, వనరుహా = పద్మములయొక్క, ఆస్యములక్ = నోళ్లను, తెఱచెక్ = విచ్చునటులఁ జేసెను. భాను = ప్రభాకరునియొక్క, ఊష్మ = ఉష్ణమనెడి, ప్రతాపమువలన గలిగిన, ప్రతాపమున కుష్ణత్వముఁ జెప్పుట కవిసమయము. భీతిక్ = భీతిచేతను, మున్ = మునుపే, పడినచుక్కలభంగిక్ = నేలరాలిన చుక్కలరీతిగా,

వేకువగాలిక్ = తెల్లవాఱుకట్ల వీచువాయువులన. తరుల = వృక్షముల యొక్క, మంచు, దొరలెక్ = రాలెను, వాసవునిపట్టి = దేవేంద్రునికుమారుఁ డగుజయంతుఁడు, కాల=సమయ మను, గుణ=సూత్రముయొక్క, యుక్తిక్ = కలయికచేత, మింటిచక్కటికిక్ = ఆకసమువైపునకు, ఎగయక్ = ఎగుర నటుల, బొదువుగాక్=ఎత్తుగ, వైచి కూఁడు=వేసికూడుకొను, గచ్చు=బచ్చెన వంగు, చమరిన=పూసిన, దాదు = కౌశల్యతోఁజేసిన, చక్రంపుబిళ్లవోలెక్ = వట్రువయైనబిళ్లయో యనునట్లు. ఒయ్యనక్ = చక్కఁగా, ప్రాచిక్ = ప్రాగ్దిశయందు, లేఁబ్రొద్దు = లేఁత ప్రొద్దు (బాలసూర్యుఁడు), పొడిచెక్ = ఉదయించెను.

పద్మినులు ధవుకూర్మి కొసరుచున్న వనుటచేఁ బద్మినీజాతిస్త్రీలు రతికిఁ గొసరుచుండి రని శ్లేష. వేకువను బద్మినీజాతిస్త్రీ రతిగోరునుగాన నిట నిది యొంతయుఁ దగియున్నది. పద్మినీజాతిలక్షణము.—"మారుకేళి నాలుగవ జామునన దేలుకేళి నితరుఁ జిత్తగింపదు." (కళాశాస్త్రము.)

తా. తెల్లవాఱఁగానే రక్తిమ కలిగెను. పద్మములు వికసించెను. వృక్షములనుండి హిమకణంబులు పడ మొదలుపెట్టెను. సూర్యోదయ మయ్యెను. అలం. ఉత్ప్రేక్ష.

క. ఈగతి నత్తఱిఁ దెల తెల
వేగిన గంధర్వపతికి వేగుట విని తా
రాగమున కేఁగి కాంచిరి
రాగమ్మునఁ గొలిచి మనుపురాతనఖచరుల్. 41

టీ. ఆత్తఱిక్ = ఆసమయమునందు, ఈగతిక్ = ఈవిధముగా, తెల తెలవేగినక్ = బాగుగాఁ దెల్లవాఱఁగా, గంధర్వపతికిక్, వేగుట=శాపముక్తి యగుట, విని, రాగమ్మునక్ = మక్కువతో, కొలిచి = సేవఁజేసి, మను = బ్రదుకుచున్న, పురాతన = పూర్వపు, ఖచరులు=గంధర్వులు, తారాగమునకు = వెండికొండకు, ఏగి=పోయి, కాంచిరి = ఇందీవరాక్షుని దర్శించిరి.

తా. ఈవిధముగా ప్రభాతము కాఁగానే కమరాజునకు శాప మోక్షణాకృతి యైనశుభోక్తిసంగతి నాంకించి యిందీవరాక్షునిపూర్వ సేవకు లగు గంధర్వు లేతెంచి దర్శనము చేసికొనిరి.

ఉ. కాంచినఁ బొంగి వారొసఁగుకానుక లర్థిఁ బరిగ్రహించి మ
న్నించి పురప్రయాణరతినిక్కనరేంద్రుఁడు మున్నుగాఁ దటి
చ్చంచలవాహమై మణులచాయల దిక్కు లలంకరించుహొ
న్నంచురథంబుచాఁగుబళియంచునకీబులుమ్రోయ నెక్కనన్.

టీ. కాంచినన్ = తనపురాతనమిత్రులగు గంధర్వులువచ్చి దర్శింపఁగా, పొంగి = ఇందీవరాక్షుఁ డానందించి, వారు = ఆగంధర్వులు, ఒసఁగుకానుకలు = ఇచ్చునట్టికానుకలు, అర్థిన్ = కోరికతో, పరిగ్రహించి = చేకొని, మన్నించి = తగు రీతినాదఱగౌరవించి, పుర = పట్టణమునకు. ప్రయాణ = వెళ్లవలెనను, రతి = ఆసక్తి, నిక్కన్ = వృద్ధిపొందఁగా, నకీబులు = వెండిబెత్తములు పట్టుకొని ముందునడచు బంట్లు, చాఁగు = సెబాసు, బళి = బళిరా, అంచున్ = ఇట్లని ప్రశంసావాక్యము లాడుచు, మ్రోయన్ = ధ్వని సలుపఁగా, తటిత్ = మెఱపులరీతి, చంచల = కదలునట్టి. వాహమై = అశ్వములు కలదియై, మణులచాయలన్ = రత్నప్రభల చేత, దిక్కులు = దెసలు, అలంకరించు = కైసేయు, హొన్న = బంగారు వికారమైన, అంచు = ప్రక్కలుగల, రథంబు, నరేంద్రుఁడు = స్వరోచి, మున్నుగాన్ = ముందఱగా, ఎక్కనన్ = ఎక్కఁగా, తొలుత గౌరవార్థము స్వరోచి నిందీవరాక్షుఁ డెక్కించెను.

తా. పూర్వభటులు లేతెంచి యుపాయనములతో భయసంభ్రమము లెసంగఁ దన్నుదర్శింప నిందీవరాక్షుఁడు ప్రేమతో వారలొసంగు కానుకలను బరిగ్రహించి మన్నించి వేత్రహస్తులు సంతోషముం దెలుప స్వర్ణమయ రథముపై ముందు స్వరోచి నధిష్ఠింపు మని తరువాతఁ దా నెక్కఁగా.

క. నందనయును సుచితరత్న
స్యందనమునఁ జనియె నర్థి జనకునిబషి న

య్యిందీవరాక్షుఁ డీగతి
మందరమున కెగయ గగనమార్గమునందున్. 43

టీ. నందనయున్ = కొమార్తెయు, ఉచిత = తగిన, రత్నస్యందనమునన్=రత్నమయమగు రథమునందు, ఆర్థిన్=ప్రేమతో, జనకునిబడిన్ = తండ్రితోఁగూడ, చనియెన్=పోయెను. ఈగతిన్=ఈవిధముగా, అయ్యిందీవరాక్షుఁడు, గగనమార్గమునందున్ = ఆకసంపుదారిని, మందరమునకున్= మందరగిరికి, ఎగయన్=ఎగురఁగా, (మందరి కన్వయము.)

తా. కుమార్తె యగు మనోరమయును మణిగణముచేఁ బ్రకాశించు పదియుఁ దనకుఁ దగినదియు నగు రథమెక్కి యనురాగముతోఁ దండ్రి వెనువెంటనే పోయెను. ఇట్లయ్యిందీవరాక్షుఁడు ఆకాశమార్గమున మందరగిరి కేఁగెను.

సీ. మండిగాలిడి దంతశుండాగ్రహతిఁ జించి
జలధరాంభముఁ గరుల్ చల్లులాడ
నహిమాంశుహయహేష లాలించి చెవి వంచి
కెరలి వాజులు బకాల్ గొరిజఁ ద్రవ్వ
ధ్వజపాతహతి నాఱ వైద్యుతాగ్నులఁ జూఁడి
పగలుదివ్వెలవారు పంజు లెత్తఁ
బెటులుచప్పుడు లాత్మభీరుస్వయంగ్రాహ
పరిరంభసుఖము ఖేచరుల కొసఁగఁ
తే. చామరప్రభ గగనగంగామురాళ
చకచకభ్రమ మొదవింప శంకరాద్రి
కాననము మోచి మందరాగంబు దాఁకఁ
బౌఁజు వెట్టిరి తన్మూలబలముదొరలు. 44

టీ. కరుల్=ఏనుఁగులు, మండిగాలిడి=ఒకకాలు కొద్దిగా వంచి యొక కాలు ముడిచి, ముందుఁ గూనకు మొగ్గి నేలపైఁ గూర్చుండి, దంత=దంత

ములయొక్కయు, శుండా = తుండముయొక్కయు, అగ్ర=చివరయొక్క, హాతిన్ =తాఁకుడుచేత, చించి = మేఘములను జీలఁదీసి, జలధర=మబ్బుల యందలి, అంభముల్ = ఉదకమును, చల్లులాడన్ = ఎగఁజల్లుచుఁ గ్రీడ లొనర్పఁగా, వాజులు = అశ్వములు, అహిమాంశు = భాస్కరునియొక్క, హయ=అశ్వములయొక్క, హేషలు = సకిలింపులు, చెవివంచి=చెవులనొగ్గి, ఆలించి=విని, కెరలి = విరోధించి, లయల్ = గగనమును, గొరిజల్ = పాదపుడెక్కలతో, ఇట గొరిజశబ్దము జాత్యైకవచనము. త్రవ్వన్=కాలు నేల కానించి దుమ్మురేఁగునటుల రాయఁగా, కచ్చెకుఁ గాలు దువ్వఁగా ననుట. పగలుదివ్వెలవారు = దినకేళను కాఁగడాలు పట్టువారు, ధ్వజ = టెక్కెము యొక్క, వాతహతిన్ = వాయుప్రతఘటంటచే, ఆఱన్=ఆరిపోవఁగా (దివిటీ లారిపోఁగా) వైద్యుతాగ్నులన్ = విద్యుత్సంబంధ మయినదివ్వెలయందు, చూఁడి=అంటించి పంజులు=కాఁగడాలు, ఎత్తన్ = పయికెత్తఁగా, విద్యుద్దీప ములు,పూర్వము వాడుచున్నటులుఁ అవి గాలికారకయుండునట్లును శృంగార నైషధము 7-ఆశ్వాసములో 169 పద్యమునందుఁ జెప్పఁబడెను. పెటులు చప్పుడులు=ఉదరుచున్న క్రోవుల చప్పుడులు, ఆత్మ = తమయొక్క, భీరు= భయపడునట్టి ప్రియాంగనలయొక్క, స్వయం=తమంతటఁదామే, గ్రాహ= పుచ్చుకొనునట్టి, పరిరంభ = కౌఁగిలింతయొక్క, సుఖము, ఖేచరులకున్ = ఆకాశసంచారులకు, ఒసఁగన్ = కలుగఁజేయఁగా, పిటికివార లగు నచ్చర చేడెలు వెఱపుచే భర్తల కౌఁగిలించిరనుట. చామర=వింజామరలయొక్క, ప్రభ= కాంతి, గగనగంగా = స్వర్గంగలోని, మరాళ=అంచలయొక్క, చకచక = మిరుమిట్లుగొలుపు వెలుతురనెడి, భ్రమము=అనుమానమును, ఒదవింపన్ = కలుగఁజేయుచుండఁగా, శంకరాద్రి=కైలాసగిరిసంబంధముయిన, కాననము= అరణ్యము, పూఁచి=ప్రారంభించి, మందరాగంబుదాఁకన్ = మందరపర్వ, తముదనుక, తన్మాలబలముదొరలు = ఆయింద్రివరాత్మునిసేనయందలియోధులు, పౌఁజుపెట్టిరి = సేనను నడిపించిరి.

తా. గంధర్వుఁడు కూఁతుకోఁడను స్వారోచికోఁడను దనపురంబునకు వెళ్లుచుండఁగా నాతనిసేన యూతఁ డుంపురజతాద్రియందలి వనము మొదలు కొని మందరపర్వతముదాఁక బంతిదీఱి నడువ నాదెస నేనుంగులు మేఘములను బ్రద్దలు చేసి నీళ్లను జిమ్మెను. అశ్వములు భాస్కరుని యశ్వములతోఁ బోరాడెను పగటిదివ్వెలవారు కేతుపటముల వాయువువలన నాఱిపోవ నాదీపములను విద్యుద్వహ్నియందు వెలిఁగించిరి. అదరుచున్న క్రోవుల ధ్వనులకు భయముఁజెంది గగనచారిణు లగుదివ్యాంగనలు భర్తలం గౌఁగిలించుకొనిరి. చామరప్రభలు స్వర్గగంగలో నున్న మరాళములశరీరధావళ్యప్రభలో యను ననుమానమును గలిగించెను. అలం. ఉత్ప్రేక్ష-ఉదాత్తము.

క. కుంజరశతాంగహయభట
రంజిత మై పై రజఃపరంపర లలమన్
మంజులకాంతిఁ గసీసపు
మాంజిష్ఠముఁ బోలె గగనమండప మమరెన్. 45

టీ. గగనమండపము=గగనమనుచావడి, మండప మన నాలుగువైపుల నాలుగు స్తంభములు నెలకొల్పి చుట్టుగోడలులేకుండఁ బైకప్పుతో నేర్పఱచిన భవనవిశేషము. కుంజర = గజములతోడను, శతాంగ=తేరులతోడను, హయ=అశ్వములతోడను, భట=సేనలతోడను, రంజితమై = రంజింపఁజేయఁబడినదై, పైన్=వానిమీఁద, రజః=ధూళియొక్క, పరంపరలు = తండములు, అలమన్=చుట్టుకొనఁగా, మంజుల=హృదయంగమమైన, కాంతిన్=ప్రకాశముచేత, కసీసపుమాంజిష్ఠముఁబోలెన్=రక్తవర్ణము నతిశయించిన పచ్చని రంగు వేసిన నల్లని చాందినిగుడ్డవలె, అమరెన్=ఒప్పెను.

కసీస మన నలుపురంగు. నీలిరం గని కొందఱు చెప్పిరిగాని నలుపనుటయె సమంజసము. ఆముక్తమాల్యదయందు, కసీసపదము నలుపు అను నర్థమునసె ప్రయోగింపఁబడెను. చూఁడు —

ఉ. ఇంగిలికంబునం దడిపి యెత్తుకసీసపురెంటమో యనన్
నింగి గరుత్పరంపరలనిగ్గులచేఁ దొగరెక్క." (ఆశ్వా-౪.)

తా. గంధర్వసేన గగనము నాక్రమించి నడుమఁ దండోపతండములుగాఁ జుట్టుకొనిన గగన మనుమండపము హరిద్రరక్తవర్ణములు మిశ్రమగురంగులు గలవల్లికాచాందినీకట్టెనో యనున ట్లున్నది.

తే. సారెకు నీరీతి దివిఁ దోడు సూపినట్టి
దొరలు గొలువంగ ఖచరేంద్రుఁ డరిగి యరిగి
మింట గ్రహరాజు తనసగమింట వెలుఁగు
మంథగిరిఁ గాంచి పలికె నమ్మనుజపతికి. 45

టీ. ఖచరేంద్రుఁడు=గంధర్వరాజగు నిందీవరాక్షుఁడు, సారెకున్ = మరుసగా, ఈరీతిన్=ఈవిధముగా, దివిన్=గగనమందు, తోడు=సహాయము, చూపినట్టిదొరలు=చూపించినట్టి సరదారులు, కొలువంగన్=తన్ను సేవింపఁగా, అరిగియరిగి=మిగులదూర మేఁగి, మింటన్=గగనమందు, గ్రహరాజు=భాస్కరుఁడు, తన సగమింటన్ = నడుమప్రదేశమునకు సమానముగా, వెలుఁగు, మంథగిరిన్ = మంథపర్వతమును, గాంచి, అమ్మనుజపతికిన్ = ఆప్రభువుతో, పలికెన్ = చెప్పెను.

తా. ఇందీవరాక్షుఁ డీ చెప్పినవిధముగాఁ గూడి తోడనే పరిచర్య యొనర్చుచు భటులు నడువ దవ్వేఁగి ముందు నడిమింటికి సమానముగా భాస్కరుఁడు ప్రకాశించుచున్న మందరాద్రిఁ గాంచి స్వరోచితో నిట్లు చెప్పెను.

సీ. జరఠకచ్ఛపరాజు చరమాంగగృహమేధి
భోగివేష్టనరేఖఁ బొలుచుజాణ
కులములోఁ దరితీపు గలిగి మించినమేటి
మైనాకు నొరసినమాసటీఁడు
తొలువేలుపుల వేలుపులపసుల్ గొనుతేఁడు
కడలిరాయలలోఁతుగన్న గబ్బి

సురరాజునకుఁ బాండుకరిఁ జేర్చుమరకాఁడు
కల్పకంబులపంటకమ్మతీఁడు
తే. కంటె మథితసుధాధౌతకటకజాత
చంపకవనప్రకంపనాకంపవిసర
దళదముఖరవమధుకరముఖరశిఖర
నందనసమందిరం బగుమందరంబు. 47

టీ. జరఠ=ముదిసిన, కచ్ఛపరాజు=ఆదికూర్మముయొక్క, చరమాంగ=వెన్నుచిప్పలోని, గృహమేధి=కుటుంబి - కాపురము చేయువాఁడు; సముద్రమథనకాలమందు మందరనగము మునిఁగిపోవ నాదికూర్మము మడుగునఁ జేరిన కథ నిట ననుసంధించుకొనవలయును. భోగి=ఆదిశేషువుయొక్క, వేష్టన=మెలిగొనుటచేతనైన, రేఖల్=ఎత్తుపల్లములుగా నున్న యొఱపిడిరేఖలచేత, పొలుచు=ఒప్పుచున్న, జాణ=నేర్పరి; కులములోన్ = పర్వతకులమునందు, తరితీపు = మథించుటచేనైన మధురత్వ మను నతిశయము, కలిగి, మించిన మేటి=అతిశయించిన గొప్పవాఁడు, మైనాకున్=మైనాకపర్వతమును, ఒరసిన=తుల్యుఁడైన, మాసటీఁడు=సెట్టి, తొలువేలుపుల=రాక్షసులయొక్కయు, వేల్పుల=దేవతలయొక్కయు, పనులు=మథించునట్టి పనులను, కొనుఱేఁడు=పరిగ్రహించినరాజు, కడలికాయలలోఁతు=సముద్రములకు రాజగు క్షీరసముద్రునిలోఁతు, కన్న=తెలిసికొన్న, గబ్బి=గాంభీర్యముగలవాఁడు, సురరాజునకున్=ఇంద్రునకు, పాండుకరిన్=ధవళగజమును, చేర్చు, మరకాఁడు=నావికుఁడు, నావికుఁడు ద్వీపాంతరములనుండి వస్తువులఁ దెచ్చునట్టుల మందరుఁడు తెల్లయేనుఁగును దెచ్చి యింద్రున కొసంగెననుట. అనఁగా మందరనగసహాయమున నింద్రున కైరావతము లభ్యమయ్యె నని భావము. కల్పకంబుల=ఈగివ్రాఁకులయొక్క, పంట=పంటకు, కమ్మతీఁడు=సేద్యగాఁడు, కమతగాఁడు; మథిత=తరిచితీయఁబడిన, సుధా=అమృతమువలన, ధౌత=క్షాళనచేయఁ

బడిన, కటక = నడిమిభాగమునందు, జాత=జనించిన, చంపకవన=చంపకా
రామమందలి ప్రకంపన = వాయువువలన, అకంప=సర్వత్ర కదలుటవలన
విసరత్=ఎక్కువగాఁ దొలంగుచున్న, అఖర = మెత్తనైన, ముఖ=ఆస్యముల
చేతనైన, రవ=ధ్వనులుగల, ఝుంకారములగు, మధుకర = భ్రమరములచేత,
ముఖర = ధ్వనించుచున్న, శిఖర=కొమ్ములచేత, నందరస = సంతోషరసము
నకు, మందిరంబు=గృహము, అగు మందరాజు, కంటె=వీక్షించితివా?

తా. రాజా! యీమంథాద్రిం గాంచితివా? ఉదధిం ద్రచ్చు
నప్పుడు సహాయముగా నున్నయాదికూర్మమునెన్నన గావుచేసికొని యుండెను.
ఆదిశేషుని పరివేష్టించుటచే నైనగీరలతో నొప్పు మైనాకపర్వతముతోఁ
దుల్యమై గిరులలో నెల్ల శ్రేష్ఠత్వమును బొంది సురాసురులవలన మథన మను
కార్యము నొనర్చి యుదధియొక్క గభీరతలు దెలిసికొని యింద్రున కైరావ
తమును ఈవిమ్రాఁకును గలిగించి యొసంగి తరిచి తీయఁబడిన యమృతము
వలన క్షాళనముచేయఁబడి శుభ్రమైన ప్రదేశమం దంకురించి వృద్ధిఁ బొందిన
చంపకారామము మీఁదివాయువు తగులుటవలన ధ్వనించుచుఁ బాఱిపోవు
నళుల ఝుంకరణధ్వానమువలన నానందరసమున కాధారమైన కొమ్ములచే
నొప్పుచుండెను. (సంపెఁగలకుఁ దుమ్మెదలకు విరోధము ప్రసిద్ధము. సంపెఁగల
తావి కనటుగా నుండుట తుమ్మెదలు సహింపక త్వరగఁ బాఱిపోవుచుండెను.
ఱెక్కలచప్పుడు నుండియె ఝుంకారముపుట్టుచున్నదిగాన ఝుంకారాతిశయము
యానవేగమును సూచించుచున్నది.) అలం-ఉదాత్తము. (మాసతీఁదు. పా.)

శా. వైకుంఠాంగదహేమ మాతతవలద్వ్యాళాశనాకృష్టరే
ఖాకారంబులఁ జుట్టు నంటి మొలనూలై మేటియొడ్డాణమై
శ్రీకారప్రభఁ గంతిమై శిఖరిరాట్సింహోల్లసత్పట్టమై [తులన్.
యీకొండన్ గనుఁగొంటెమాయదిపుష న్హేరాళపుంగాం

టీ. వైకుంఠ = నారాయణునిదైన, అంగద = బాహుపురులయొక్క,
హేమము = సువర్ణము, ఆతత = ఎక్కువగా, వలత్ = మెలిపెట్టుకొను,

వాతాశన = సర్పమగు వాసుకిచేన, ఆకృష్ట = చుట్టువారఁబడిన, రేఖాకారంబులన్ = ఒఱపిడిగీతల యాకారములతో, చుట్టును, అంటి = అంటుకొని, మొలనూళ్లై = అల్లికలచే నొప్పు మొలకుఁగట్టుత్రాడై, మేటియొడ్డాణమై = మేలైన నడుము బిగికిఁబెట్టుకొను సువర్ణాభరణవిశేషమై, శ్రీకార = శ్రీకారము యొక్క, ప్రభన్ = కాంతిచేత, కంఠియై = గళాలంకారమై - కంటెయై శిఖరి = కొండలకు, రాట్సింహ = రాజోత్తముఁ డగుటవలన, ఉల్లసత్ = వెలుంగునట్టి, పట్టమై = పట్టాభిషేకసమయమున లలాటమునం గట్టిన పట్టమై, ఈకొండన్ = ఈమందరపర్వతమును, హేరాళపుంగాంతులన్ = ఎక్కువ ప్రకాశములతో, ఇప్పుడున్, మాయదు = మాపుఁజెందదు. కనుఁగొంటె = చూచితివా? ఒకరీతిగానే ప్రకాశించుచున్న దనుట.

రాట్సింహ అనుటలో రెండుపదములు శ్రేష్ఠవాచకములు.

"స్యురుత్తరపదే వ్యాఘ్రపుంగవర్షభకుంజరాః,
సింహశార్దూలనాగాద్యాః పుంసి శ్రేష్ఠార్థగోచరాః." (అమరము.)

వాసుకిని త్రాడుగా నొనరించి త్రచ్చుటచే మందరమునం దొఱపిడి రేఖలు కలిగె ననుటకు.—

తే. "కనకకేతకకృతరేఖగాత్రయష్టి
వ్యాళతనుఘృష్టికృతవళీవలయ మగుట
మహితసోపానమును బోనిమందరాద్రి
యింపుఁ బుట్టించుఁగాత మీ కెద్దఱకును." (శృం. నై. ఆ. 5-ప. 62)

తా. ఉదధిఁ ద్రచ్చుతఱి, తరియైనమందరాద్రి ఆదిశేషుని త్రాడుఁ జేసి నిండుగాఁ జుట్టును జుట్టి లాగుటవలన వాసుకి శరీరమువలన రాపాడఁగా నైన నాల్గువరదలు నారాయణమూర్తి భుజాంగదముల సువర్ణమువలన నగుమొలత్రాడు నడుమున బిగించుకొను నొడ్డాణము, కంఠాభరణము నను నలంకారచతుష్కమై యింతవఱకు మాసిపోక వెలుంగుచుండెం గాంచితివా? అలం - ఉల్లేఖము.

తే. వేదవేదాంతములఁ వేధ వెదకి కనని
పద్మలోచనుశ్రీపాదపంకరుహము
లబ్జరేఖాంకితము లవే యచలవంశ
వల్లభుని మేఖలాసీమ నెల్ల మెఱయు. 49

టీ. వేధ = విధాత, వేద = ప్రాఁజమువులయందును, వేదాంతముల యందున్ = ఉపనిషత్తులయందును, వెదకి = శోధించి, కనని=చూడఁజాలని, పద్మలోచను = నారాయణమూర్తియొక్కయు, శ్రీ = లక్ష్మీప్రదములైన, పాదపంకరుహములు = పాదపద్మములు, అబ్జరేఖా = కమలరేఖలయొక్క, అంకితములు = చిహ్నముచేఁబడినవి. అవే, అచలవంశ = పర్వతసమూహమునకు, వల్లభుని = మందరగిరియొక్క, మేఖలాసీమన్ = నడుమ, ఎల్లన్ = అంతటను, మెఱయున్ = ప్రకాశించుచున్నవి.

తా. వేలుపులలోఁ బెద్ద యగు బ్రహ్మయంతవాఁడు వేదములందును వేదాంతములయందును వెదకినను జూడ వశముగాని విష్ణుమూర్తియొక్క పాద పద్మరేఖలు సమస్తపర్వతములలో నతిశ్రేష్ఠమైన మందరాద్రి నడిమితావుల యందుఁ బ్రకాశించుచుండెను. అలం-విశేషము.

ఉ. నాలుకబంతి వ్రేలఁబడి నంజునఁ దోఁగి తమాలపల్లవ
శ్రీల హసింప నుబ్బి కనుఁగ్రేవల జేవుఱు పుక్కిలింపఁగా
వాలికమేనిపీఁ చెగయ వాడినమాల్యమువోలె నాదిమ
వ్యాళము దీసిపగ్గ మయినట్టియవస్థఁ దలంతు నెప్పుడున్.

టీ. ఆదిమవ్యాళము = మొట్టమొదటి దగు సర్పము - వాసుకి, నాలుక బంతి=జిహ్వలయొక్కపఙ్క్తి, వ్రేలఁబడి=అడుగునకు వ్రాలి, నంజునన్ = గరళముచేత, తోఁగి=బాగుగాఁదడిసి, తమాల=చీకటిచెట్టుయొక్క, పల్లవ=చివురుల యొక్క, శ్రీలన్=సంపత్తులను, హసింపన్=పరిహాసముచేయఁగా, అతిశయింపఁగా, జేవుఱు=ఎఱుపురంగు,కనుఁగ్రేవలన్=నేత్రపుప్రక్కలయందు, ఉబ్బి=

ఉబికి, పుక్కిలింపఁగాన్ = బయటి కుమియఁగా - వ్యాపింపఁగా, పాలిక = పొడకైన, మేని = దేహముయొక్క, పేఁచు = మీఁదిచర్మము, ఎగయన్ = లేచిపోవఁగా - దోకికొని చర్మమంతయుఁ నొలుపిడిచేఁ బోవఁగా, వాడిన = వదలిన, మాల్యముఁబోలెన్ = పువ్వుమాలరీతి, దీనిపగ్గము = ఈమందర పర్వతమునకుఁ గవ్వపుఁద్రాడు, అవస్థన్ = చెడుదశను, ఎప్పుడున్ = ఎల్లప్పుడును, తలంతున్ = తలంచుచుందును. (పించెగయ యని పాఠాంతరము. పించు=బలము అని బ్రౌనుదొరవారి వ్రతి. ఈపాఠ మంత సరసముగాఁ గాన్పించుటలేదు.)

తా. సురాసురులు కడలిని మథించుసమయమునఁ గవ్వపుఁద్రాడుగా నొనర్చి యీపర్వతమును జుట్టినవాసుకిదుర్దశ నే నిప్పటికిని మఱవలేను. అంత నాశేషాహి విషము నుమియుచు నాగరళముచే సార్ద్రమగు జిహ్వాలవరుస తమాలవృక్షపల్లవములవలె నీలవర్ణములో వ్రేలుచుండ నేత్రములు రక్తిమమును జెంది రక్తము నుమియుచుఁ బ్రకాశింప నొడలిమీఁది చర్మ మాడి వాడిన పువ్వుమాలికపోలికగా నుండెను. అలం-ఉపమ. స్వభావము.

చ. బిలముఖపంక్తి నీధరణిభృత్పతి వారిధినిర్భరభ్రమిన్
దలముగ మున్ను ద్రావినసుధారసధారగుణంబునన్ జుమీ
ఫలితవికారదూరనిరపాయసుఖస్థితిఁ గాంచె నాఁగ నో
మలవిదలచ్ఛిరోరుహతమాలవినీలిమరేఖ యొప్పెడిన్. 51

టీ. ఈ, ధరణిభృత్పతి = గిరిరాజు, మున్ను, బిల = కొండబిలములను, ముఖపఙ్క్తిన్ = వక్త్రసందోహముచేత-నోళ్లచేత, వారిధి=క్షీరసాగరమునందలి, నిర్భర=ఎక్కువగా, భ్రమిన్ = భ్రమణముచే, దలముగన్ = నిబిడముగా - విశేషముగా, త్రావిన = పానముగావించిన, సుధారస=అమృతముయొక్క, ధార=ప్రవాహముయొక్క, గుణంబునన్ = గుణముచేతనే, చుమీ=సుమ్మా, ఫలిత= కల్గఁబడుటచేనైన, వికార = మార్పునకు, దూర=దవ్వైన, నిరపాయ =

చిక్కులేని, సుఖ=సుఖముయొక్క, స్థితిన్=వాసమును, కాంచెన్, నాఁగన్ = అనురీతి, కోమల=అందమైన, విచలత్ = ఎక్కువ కదలుచున్న, శిరోరుహ=శృంగము లను శిరస్సులయం దంకురించిన కేశములో యనఁదగిన, తమాల = తమాలవృక్షములయొక్క, వినీలిమ=ఎక్కువనైల్యముయొక్క, రేఖ = వరుస, ఒప్పెడిన్ = ఒప్పుచున్నది. మిగులఁ గోమలములుగాన కానుగు ఆకులు ఎక్కువ నల్లఁగా నుండెను. మందరమునకు శిఖరములు తలలు, తలలెక్కుడు గాన తమాలవినీలిమరేఖ వెండ్రుకలు. అదికాలము నాఁటివాఁడైనను ముంద రునితలవెండ్రుకలు నెఱయమి యమృతము ద్రావుటచేత; త్రావినది వల ముగ; ఒకముఖచేఁ గాదు, బిలముఖరయూహము చేత. అలం. ఉత్ప్రేక్ష - రూపకము.

తా. ఈకవ్వపుఁగొండకొమ్ములయం దున్నతమాలవృక్షసముదాయ మీపర్వతము మున్ను క్షీరసాగరమునఁ దఱిమెనదై భ్రమించునప్పుడు గహ్వ రము లనువక్త్రములచే సుధారసము ద్రావినహేతువున నేమో వృద్ధత్వము లేకుంట నల్లఁబాఱియుండు శిరోజములవలెఁ బ్రకాశించుచుండెను.

చ. జడధి మథింపఁ జిక్కి సుధసౌరభ మానుటఁ జావు దక్కి డా
పడఁకులనుండి దుగ్ధభవపాండిమ బొందుల నంద మొంద నిం
దడవి మెకాలతోఁ గదుపులై చరియించును మేతకై బయల్
వెడలి ధులీకుళీరశకులీమకరీముఖవారిజంతువుల్. 52

టీ. జడధి=పయోనిధిని, మథింపన్ = త్రచ్చుచుండఁగా, చిక్కి = మందరాద్రి క్రిందఁ దగిలియుండి, సుధ = అమృతముయొక్క, సౌరభమున్ = పరిమళమును, ఆనుటన్ = వాసనచూచుటవలన, చావు = మరణము, తక్కి = పోఁగొట్టుకొని, దుగ్ధ=క్షీరమువలన, భవ = పుట్టిన, పాండిమ = శ్వేతత్వము, బొందులన్=దేహములయందు, అంద మొందన్=ఒప్పియుండఁగా, ఇందున్ = ఈమందరనగమునందు, డాపడఁకులనుండి = శిలావకాశములయందుండి, తాళిలసందులలో నుండి, ధులీ = ఆఁడుకమఠములు, కుళీర=ఎండ్రకాయ

శకులీ=ఆఁడుమత్స్యములు, మకరీ=ఆఁడునక్రములు, ముఖ = మొదలైన, వార్జంతువుల్ = ఉదకమందలిజంతువులు, అడవిమెకాలతోన్ = అడవిమృగములతో సహితము, మేఁతకై = ఆహారమునకై, బయల్వెడలి = శైలమునుండి బయలుదేఱి, కదుపులై=తండములై, చరియించున్=తిరుగుచుండును.

తా. క్షీరసాగరమును దరుచుసమయమందు మీఁదికి రాలేక పర్వతముక్రిందఁ దగుల్కొనినకమఠములు, నక్రములు, మత్స్యములు, పీకలు మొన్నగుజంతువులు దుగ్ధములలో నుండుటచే ధవళిమఁ జెందినదేహములు గలవై యందలిసుధ యంటుటచే మరణములేనివై మందరాద్రియొక్కశిలల చరియలలోనుండి యాహారార్థమై వనజంతువులతోఁ గూడ బయలు వెడలి తండతండములై సంచరించుచుఁ దిరుగుచుండును.

మ. అనుచుం జందనపంకపంకిలతలంబై కేతురుద్ధాతపా
ధ్వనిరుష్ణంబయి మంచకోపరికుటీవాటీనటన్నర్తకీ
జనమై యావతసర్వతఃకలితవీక్షాతోరణస్రఙ్నిబం
ధనమై యొప్పుపురంబు సొచ్చి భవనద్వారప్రఘాణంబునన్.

టీ. అనుచున్=అనిచెప్పుచు, చందనపంక=గంధపునీటివలన, పంకిల = బాడిదైన, తలంబై = ధాత్రీతలముగలదై, కేతు = టెక్కెములచేత, రుద్ధ= అడ్డగింపఁబడిన, ఆతప = ఎండ కలిగిన, అధ్వ = దారియందలి, నిరుష్ణంబై = ఉష్ణములేనిదై, మంచక=చప్పరములయొక్క, ఉపరి = మీఁది, కుటీ = కుటీరములయొక్క, వాటీ=పఙ్క్తులయందు, నటత్ = నృత్యముచేయుచున్న, నర్తకీజనమై = నాట్యస్త్రీలుగలిగినదై, యావత = యావనాంగనాసముదాయముయొక్క, సర్వతః = అంతటను, కలిత=నిండిన, వీక్షా=దృష్టులను, తోరణ = తోరణములవలెఁ బ్రకాశించుచున్న, స్రక్ = పూవుదెత్తులయొక్క, నిబంధనమై=రచనకలదై, ఒప్పుపురంబు = ఒప్పుచున్న తననగరము, చొచ్చి=ప్రవేశించి, భవన =గృహముయొక్క, ద్వార = గుమ్మమునకుముం దుండు, ప్రఘాణంబునన్=మండపమందు, (ముందరి కన్వయము.)

నేల గంధప్రరోహింపిచే నలరుటచే నట్టువకత్తియలు మంచెపై నృత్య మొనర్చిరి. లేదా ఇంద్రనీలశాఖులఁ జూచుఁ బ్రజలు మూఁగుటచే నేలపైఁ జోటులేక మంచెలపై నృత్యమొనరించిరి. యువతులచూపులు తెలిచేపలు ప్రకాశ మానము. రాజును సందర్శింప నుత్సాహమును గాంచు చెలువలచూపులే నగరము నలంకరించుపూలదండలవలె నుండెను. పుష్పమాలికలు చూపులు శ్వేతగుణము లగుట సాధారణము లోనంగఁబడెను.

తా. ఇట్లు గంధర్వుఁడు స్వరోచితోఁ జెప్పుచు దిక్కులనిమంచిగంధపు కర్పూరపులు చల్లి వాకిళులయందుఁ జల్లఁగా నుండుటకై ధ్వజపటము లెత్తి యెత్తుగాఁ గట్టినకట్టడపుచవికలలో నృత్యము సేయుచున్న గణికాంగనల చూపులు దిశలయందుఁ బుష్పమాలికలతోరణములు నెలకొల్పినట్లు ప్రకాశింపఁ బ్రకాశించుపురముం బ్రవేశించి. అలం. రూపకము.

క. మంత్రుల బాంధవభటసా
మంతుల నాశ్రితుల నిలిపి మహీకాంతు నిశా
కాంతమణి కాంతికందళ
కాంతం బగునొక్కదారనగర విడియించెన్. 54

టీ. మంత్రులన్ = సచివులను, బాంధవ = బంధువులను, భట=పరిచారకులను, సామంతులన్ = ఇతరదేశప్రభువులను, ఆశ్రితులన్ = అనుసరించి బ్రదుకువారిని, నిలిపి=అందుండు నిలువ నాజ్ఞాపించి, మహీకాంతున్ = స్వరోచిని, నిశాకాంతమణి = శశికాంతమణులయొక్క, కాంతి = ప్రకాశము యొక్క, కందళ = అంకురములవలన, కాంతంబు = హృదయాహ్లాదకమైనది, అగు, ఒక, దారనగరన్ = ప్రభుమందిరమున, విడియించెన్ = విడిదిసేయించెను.

పూర్వముద్రితప్రతులందు మంత్రుల యని కలదు. ఈ ప్రాసము లాక్షణికసమ్మతమె. మంత్రిపదము మంత్రియనుటకు సమర్థక మగునా యనునది మృగ్యము. ఆధునికముద్రితప్రతులందు మంత్రి యనియె కలదు.

తా. మంత్రులను, చుట్టములను, సేవకులను, ఇతరదేశరాజులను, ఆశ్రితులను, తగినతావులయందు బసలు చేయించి, చంద్రకాంతమణులచేఁ బ్రకాశించు నొకరాజమందిరంబున స్వరోచిని విడిది సేయించెను.

వ. విడియించి యనంతరంబ యంతఃపురకాంతాకరాంతతంతన్యమానమణిభాజననీరాజనమంగళంబు లంగీకరించి ప్రియాంగనల సంభావించి మఁగుడ నాస్థానమండపంబునకేతెంచి మతంగమంకిమంకణమందపాలమరీచిమాండవ్యమార్కండేయాదిమహామునుల రావించి లగ్నంబు నిశ్చయించి గగనచరజంఘాలకరప్రేషితలేఖాతరులేఖాముఖంబులఁ జిత్రరథచిత్రాయుధచిత్రసేనాదులగు గంధర్వులను వరాహకర్ణగజకర్ణసుకేతుమాణిభద్రప్రముఖయక్షులను రేవంతప్రముఖగుహ్యకులను మందారముఖ్యవిద్యాధరులను బిలిపించి వినయపూర్వకంబుగా విత్తాధిపతికి విజ్ఞాపనపత్త్రిక లిఖియించి నిజప్రధానులం బంచి నలకూబరు రావించె నంత. 65

టీ. విడియించి = స్వరోచిని రాజమందిరమున నిలిపి, అనంతరంబ = వెంటనే, అంతఃపురకాంతా = అంతిపురపుస్త్రీలయొక్క, కరాంత = కరతలము లందు, తంతన్యమాన = ధరింపఁబడుచున్న, (సంతన్యమాన = మిక్కిలి విస్తరింపఁబడుచున్న - బ్రౌనుదొరవారిపాఠము.) మణిభాజన = మాణిక్యపుఁబళ్లెరములయందైన, నీరాజన = ఆరతులయొక్క, మంగళంబులు = శుభక్రియలు - మంగళపుటారతులు, అంగీకరించి = పరిగ్రహించి, ప్రియాంగనలన్ = అనుంగు చెలులను, సంభావించి = గౌరవించి, మఁగుడన్ = తిరుగ, ఆస్థానమండపంబునకున్ = సభామంటపమునకు, ఏతెంచి = వచ్చి, మతంగుఁడు, మంకి, మంకణుఁడు, మందపాలుఁడు, మరీచి, మాండవ్యుఁడు మార్కండేయుఁడు మొదలగు, మహామునులన్ = గొప్పమునిశ్రేష్ఠులను, రావించి = వచ్చునట్లుచేసి, లగ్నంబు = సుముహూర్తము-రాశ్యుదయమును, నిశ్చయించి = నిర్ణయించి, గగన

చర = గంధర్వులగు, జంఘాల = శీఘ్రగాములగు భటులయొక్క, "జంఘాలో౽తిజవస్తుల్యౌ" అమరము. కర = హస్తములం దుంచి, ప్రేషిత = పంపఁబడిన, లేఖకరు = దివ్యతరువులనుండి సంపాదించిన, లేఖాముఖంబులన్ = శుభలేఖల మూలముగా, చిత్రరథుఁడు, చిత్రాయుధుఁడు, చిత్రసేనుఁడు, మున్నగువారు, అగు గంధర్వులన్ = గంధర్వులను, వరాహకర్ణుఁడు, గజకర్ణుఁడు, సుకేతుఁడు, మాణిభద్రుఁడు మున్నగుయక్షులను, రేవంతుఁడు, మున్నగాఁ గలగుహ్యకులను, మందారుఁడు మొదలైన విద్యాధరులను, పిలిపించి, విత్తాధిపతికిన్ = కుబేరునికి, వినయపూర్వకంబుగాన్ = మిక్కిలి సమ్మతితో, మిగుల నడకువ ముందుకలుగునట్లుగా, విజ్ఞాపనపత్రిక = విన్నపంపుజాబు, లిఖియించి = వ్రాసి, నిజప్రధానులన్ = స్వీయసచివులను, పంచి = పంపించి, నలకూబరున్ = కుబేరునికుమారుని, రావించెన్ = రప్పించెను. అంతన్ = ఆ పిమ్మట (ముందరి కన్వయము.)

క. పసుపులనలుఁగిడి రైదువ
బిసరుహలోచనలు పెండ్లి పెద్దలయాజ్ఞన్
వసుధాధ్యక్షుబుభుక్షున
కసితాలకభరకుఁ బేరఁటాండ్రొగిఁ బాడన్. 56

టీ. ఐదువ బిసరుహలోచనలు = పద్మలోచనలగుముత్తైదువలు, పెండ్లిపెద్దలయాజ్ఞన్ = పెండ్లి కేతెంచిన పెద్దలగువారియాజ్ఞాప్రకారము, వసుధాధ్యక్షబుభుక్షునకున్ = రాజేంద్రుఁ డగు స్వరోచికిని, అసితాలకభరకున్ = నల్లనికురులుగల మనోరమకును, ఒగిన్ = వరుసగా, పేరఁటాండ్రు = పేరంటముఁజేయవచ్చిన ముత్తయిదువలు, పాడన్ = పాటలు పాడుచుండఁగా, పసుపుల నలుఁగు = పసుపుతోఁ గలిపిననలుఁగులు, ఇడిరి = పెట్టిరి.

పేరంట మన శుభకార్యములయందుఁ దాంబూలాదులకొఱ కాఁడువారలఁ బిలుచుట. ఆ పేరంటముగలస్త్రీలు పేరఁటాండ్రు, అనఁగాముత్తైదువ అని భావము.

తా. పెండ్లిపెద్దలయాజ్ఞచేత ముత్తైదువలు స్వరోచికి మనోరమకును చేరఁటాండ్రు పాటలు పాడుచుండఁగా వరుసగాఁ బసుపు నలుఁగులు పెట్టిరి.

ఉ. మజ్జన మాడె రాజు కృశమధ్యమ లింపున నంప గుంపులై
గొజ్జఁగనీటివెల్లువలు గోవజవాజులనిగ్గుఁ జూపఁ జం
చజ్జరఠాహికంచుకముచాయమడుంగుల నొత్తెఁ జెమ్మనీ
రుజ్జగిలన్ వహించె మెయినూఁదినఁబాఱుదుకూలచేలముల్.

టీ. రాజు = స్వరోచి, కృశ = అల్పమగు, మధ్యములు = అవలగ్నములుగల యువతులు - సన్ననినడుముగల చెలువలు, ఇంపునన్ = ఉత్సాహముతో, గుంపులై = గుంపులుగాఁ గూడి, వంపన్ = జలమును పోయఁగా, గొజ్జఁగనీటి = పన్నీటియొక్క, వెల్లువలు = వఱదలు, గోవ = గోవదేశపు, జవాజుల = జవ్వాజులయొక్క, నిగ్గున్ = అతి సౌరభమును, చూపన్ = కనఁబఱుపఁగా మజ్జనమాడెన్ = తాన మొనర్చెను, గోవాదేశపుఁ బ్రశస్తమగు జవ్వాదితావులను వెల్లడించు పన్నీట రాజు స్నానము గావించెను. చంచత్ = ప్రకాశించుచున్న, జరఠ = ముదిసిన, అహి = సర్పమగు వాసుకియొక్క, కంచుకముచాయ = పొరవంటి తెల్లనిరంగుగల, మడుంగులన్ = తెల్లబట్టలవలన, చెమ్మనీరు = శరీరమునఁ జెమ్మగా నుండునుదకము, ఉజ్జగిలన్ = పోవునట్లు, ఒత్తెన్ = తడియొత్తుకొనెను. ముదిసిన పాముకుబుసము మిగుల సన్నముగా నుండును. ఊఁదినన్ = ఊఁదినంతనే, పాఱు = ఎగయునట్టి, దుకూల = ప్రశస్తములైన, చేలములు = వసనములు, మెయిన్ = శరీరమున, వహించెన్ = ధరించెను.

తా. ఆ సమయమున స్వరోచి దాసీజనంబు పోయఁగా జవ్వాజివాసనచే నొప్పు ప్రశస్తమగు పన్నీట జలకమాడి పాముకుబుసమువలె సన్నముగా నుండు శుభ్రవస్త్రములచే నొడలం దడిచికొని విలువ యగు చేలములం దాల్చెను. అలం. నిదర్శనము. అతిశయోక్తి.

చ. గరువుగ నొత్తఁ జెంగలువకచ్చు ఘటించినమౌళిఁ జుట్టెఁ జెం
దిరిక తెఱంగునన్ బసిఁడితీఁగెలు నించినజిల్గుపాగ బం
భరసభ వాసనాపవనపారణఁ దేల నలందెఁ గస్తురిన్
మరకతమౌక్తికాదిమణిమండనమండితుఁ డయ్యె నయ్యెడన్.

టీ. అయ్యెడన్ = ఆసమయమునందు, గరువుగన్ = ఒకవైపునకు, ఒత్తన్ = వ్రాలునట్లు, చెంగలువకచ్చు = రక్తోత్పలంపు కుసుమకందుకము, (ఎఱ్ఱకలువరేకులగుచ్చి బిగిగూర్చి యని శ్రీనుదొరవారి ప్రతి.) ఘటించిన మౌళిన్ = తాల్చిన శిఖయందు, చెందిరిక = చంద్రకావివసనముయొక్క, తెఱంగునన్ = రీతియందు, (తెఱంగునన్ = రీతిగా. పాఠాంతరము). పసిఁడితీఁగెలు = సువర్ణసూత్రములు, నించిన = నిండించిన, జిల్గుపాగన్ = పలుచనితలగుడ్డను, చుట్టెన్ = తలకుఁ జుట్టుకొనెను. బంభర = తేంట్లయొక్క, సభ = సమూహము, వాసనా = సౌరభముతోఁ గూడిన, పవన = వాయువుయొక్క, పారణన్ = భక్షించుటచేత, తేలన్ = సంతసింపఁగా, కస్తురిన్ = మృగమదమును, అలందెన్ = లేపముచేసికొనెను. మరకత = పచ్చలు, మౌక్తిక = ముత్తియములు, ఆది = లోనగు, మణి = మణులుగూర్చిన, మండన = అలంకారముచేత, మండితుఁడు = కైసేసినవాఁడు, అయ్యెన్ = ఆయెను.

చెందిరిక తెఱంగునన్ = కప్పుపైముద్దు విధముగా నని శబ్దరత్నాకరము.

రత్నములు రాజులకు రసప్రదములు, స్త్రీలకు సౌఖ్యదాయకములు గాన రాజు ధరించెను. రత్నములనుగూర్చి.—

"తేజస్విన్యః పురుషశ్రేష్ఠాః రసబంధనకారిణః
స్త్రియం కుర్వంతి కాయస్య కాంతిం స్త్రీణాం సుఖప్రదాః."
(భావప్రకాశము)

చెందిరిక యనరక్తవర్ణవస్త్రము. స్వరోచి యెఱ్ఱనితలగుడ్డఁ జుట్టుకొనెను. చెందిరిక రూపాంతరము చెంద్రిక. చెంద్రిక యన నెఱ్ఱవలువ యనుటకు.—

ఉ. "చెంద్రికవన్నియ సాలుచుట్టి—" (విజయ. ఆ. 3.)

చ. 'చికిలిపసిండి వ్రాఁతనుచెంద్రికవన్నియమేలుకట్టు' (వసుచరిత్రము ఆ. ౫.)

తా. స్వారోచి రక్తోత్పలకందుకము౦ బెట్టి సిగచుట్టుఁ జుట్టివచ్చునట్లు కుసుంబారంగు వేసిన యంద మగు సెల్లాతికలపాగఁ జుట్టి కస్తూరిం బూసికొని రత్నమయాభరణములను ధరించెను.

మ. కదిసెన్ లగ్నమటంచు మంత్రులు దొరల్ గంధర్వరాజాజ్ఞను
న్మదవేదండఘటాభటాశ్వరథసేనాజైత్రవాదిత్రసం
పదమీఱన్ జనుదెంచి కాంచిముద మొప్పన్ జేసి రారూఢుగాఁ
గదళీ కాంచనకక్ష్యలన్ మెఱయు లేఖస్వామిచౌదంతిపై. 59

టీ. మంత్రులు = ఇందీవరాక్షునిమంత్రులు, దొరల్ = పెండ్లి పెత్తనమునకు వచ్చిన రాచబంధుగులు, లగ్నము = సుముహూర్తము, కదిసెన్ = దగ్గఱకు వచ్చెను, అటంచున్ = అని, గంధర్వరాజాజ్ఞన్ = ఇందీవరాక్షుని యనుమతిచే, ఉన్మద = మదాతిశయముచే నొప్పారు, వేదండ = కరులయొక్క, ఘటా = సమూహములును, భట = కాల్బలములును, అశ్వ = హయములును, రథ = రథములును, మొదలగు, సేనా = చతురంగసేనా పరివారముయొక్కయు, జైత్ర = జయస్వభావములగు, వాదిత్ర = భేరి మొదలగు వాద్యములయొక్కయు, సంపద = వైభవము, మీఱన్ = అతిశయింప, చనుదెంచి = వచ్చి, కాంచి = దర్శనమొనరించి, ముదము = ఉత్సాహము, ఒప్పన్ = ఒప్పిదము కాఁగా, కదళీ = కేతనములచేతను, కాంచన = సువర్ణముచే నొనర్పఁబడిన, కక్ష్యలన్ = నడుముకట్టుచేతను, నడికట్టుపట్టులచేతను, మెఱయు = ప్రకాశించు, లేఖస్వామి = దేవేంద్రునియొక్క, చౌదంతిపైన్ = దంతచతుష్కముచే నొప్పు గజముమీఁద, ఆరూఢుఁగాన్ = ఎక్కినవానినిగా, చేసిరి = ఒనరించిరి.

(కదళిపదము జెండాయందును అరఁటియందును వర్తించును. "కదళీ ధ్వజమోచయోః" ధనంజయనిఘంటువు. "కదళీ వైజయంత్యాం చ రంభాయాం హరిణాంతరే. విశ్వము".)

ఏనుఁగులపై పతాకములు గట్టుట కలదు. ఇట్టి ప్రయోగములు పలు శాస్త్రలఁ గలవు.

సీ. "పాండవుల నడిసన్న యొసఁగులు దంచెనమ్ముల పెంపు గగనంబుఁ గోలఁది పెట్ట"
(భార—విరాట.)

"పాలు నేనుఁగులు కుంభమధ్యముల వ్రాలుమావతులు పైవ్రాలు దంచెనలు"
(రామా—యుద్ధ.)

దంచెనములన టెక్కెములు.

గజములకుఁ గదళికదంబాలంకారము వసుచరిత్రమునందుఁ గూడఁ జెప్పఁబడినది.

ఉ. "ధాతుపరాగరక్తియును దంతవిభక్తియుఁ జామరప్రకా
శాతిశయంబుసంకుల మదాంకనముల్ గదళీకదంబసం
భూతియుఁ గర్బురాకృతియుఁ బుష్కరభూతియుఁ బూని భద్రదా
ఖ్యాతివహించి మించె పృథుగండము లచ్చట నద్భుతంబుగన్."
(ఆ. ౨ ప. ౯౦),

తా. పెండ్లి సుముహూర్త మాసన్న మయ్యె నని గంధర్వరాజునాజ్ఞ మంత్రులును బెండ్లి పెద్దలును మంగళారావములు సెలఁగ చతురంగ సేనాయుక్తులై ప్రయాణమై స్వరోచి విడిసిన రాజమందిరమున కేఁగి యారాజేంద్రుం జూచి యానందించి తాము అలంకరించి తీసికొని వెళ్లిన యైరావతముపై నెక్కించిరి.

ఉ. అత్తఱిఁ బట్టణంబు వికచాంబురుహాక్షులు కౌతుకంబునన్
జిత్తము లుల్లసిల్లఁ గయిసేసి గృహాంగణసౌధమాలికల్
హత్తి నరేంద్రవీథిఁ జతురంగబలంబులుఁ గొల్వఁగా మరు
న్మత్తగజంబుపైఁ జనుకుమారశిరోమణిఁ జూచి రుబ్బునన్.

టీ. అత్తఱిన్ = ఆ సమయమునందు, పట్టణంబు = పురినిగల, వికచ = వికాసమును నొందిన - వికసించిన, అంబురుహ = పద్మములవంటి, అక్షులు =.

నేత్రములుగల కాంతలు, కౌతుకంబునన్ = సంతోషముతో, చిత్తములు = మనస్సులు, ఉల్లసిల్లన్ = సంతోషము లొందఁగా, కయిసేసి = భూషణములం దాల్చుకొని, గృహాంగణ = ఇండ్ల వాకిండ్లయొక్క, సౌధ = హర్మ్యములయొక్క, మాలికల్ = పఙ్క్తులను, హత్తి = హత్తుకొని చేరి, నరేంద్రవీథిన్ = రాజపథమునందు, చతురంగబలంబులున్ = నాలుగు సేనాంగములును, కొల్వఁగాన్ = సేవింపఁగా, మరుత్ = దేవతలయొక్క, మత్త = మదించిన, గజంబుపైన్ = ఐరావతముపైని, చను, కుమార శిరోమణిన్ = రాజపుత్త్రోత్తముఁడగు స్వరోచిని, ఉబ్బునన్ = ఆనందముతో, చూచిరి.

తా. పట్టణమునం గల సుదతులందఱు నాసమయమున నానందముతో నలంకరించుకొని వచ్చి గృహములయందును మేడలందును బ్రవేశించి రాజపథమున నైరావతారోహుఁడై వెళ్లుచున్న స్వరోచిం గాంచిరి.

ఉ. అంచెలు గట్టి కాలితొడునై చననీవు గదమ్మ ప్రోదిరా
యంచలివేటిసంగడములయ్యోను దయ్యమ యేటివేడ్కనా
కంచుఁబదంబునన్ మొరయునందియయూడఁగఁదన్ని పోయి వీ
క్షించె లతాంగి యోర్తుమురజిన్నిభుసాగర మేఖలావిభున్.

టీ. లతాంగి = లతవంటి శరీరముగల రమణి, ఓర్తు = ఒకానొకతె, ప్రోదిరాయంచలు = చనువైన రాజమరాళములు-పెంపుడు రాజహంసలు, అంచెలు గట్టి=బారులు దీఱి, కాలితొడునై = పాదమంజీరముల ధ్వనినాలకించుట యనుబంధుత్వముకలవియై, చననీవు = పోవనిచ్చుటలేదు, కదమ్మ, ఇవేటిసంగడములు = ఇవియెక్కడి స్నేహములు, సహచరములు, అయ్యోను = ఆయెను, దయ్యమ = దైవమా, నాకున్ = నా వంటి తగులము వానికి, ఏటివేడ్క=సందర్శనోత్సాహ మెక్కడిది, అంచున్ = అనుచు, పదంబునన్ = పాదమునందు, మొరయు = ధ్వనించుచున్న, అందియన్ = అందెను, ఊడఁగఁదన్ని = ఊడిపోవునటుల గాలు విదలించి, పోయి = ద్వారము

దగ్గఱపడుచోయి, మురజిత్ = నారాయణమూర్తితో, నిభుఁడ్ = సమానుఁడగు, సాగర = సముద్రమే, మేఖలా = ఒడ్డాణముగాఁగల భూమియొక్క, విభుఁడ్ = భర్తయగు స్వరోచిని, వీక్షించెన్.

అందెలమ్రోఁత యంచలకూఁతవలె నుండుటచే నంచలు వెంబడించు నను కవిసమయము. ఈ యంశము పలుచోట్లఁ గలదు.

శ్లో "ఏతాశ్చలద్వలయ సంహతి మేఖలోత్థ
ఝంకారనూపురపరాజిత రాజహంస్యః," (భర్తృహరి.)

సీ. "తనుపద్మ మని యంటఁ జేరఁగునంచకు నంప్రి
హీరాంగదమృణాళ మిచ్చి యనిచె." (వసు. ఆ. ౯.)

కడియమిచ్చుటచే సజాతీయమగు కాంతిధ్వని లేమిచే నంచ వెనుకకేఁగె నని భావము.

తా. తన కాలియందెలమ్రోఁత హంసధ్వనివలె నుండుటచేఁ దమ జాతి యంచెరొద యని తలంచి పెంపుడు రాయంచలు పతి వెంట నంటి రాసాగెను. అంచలగుంపు వెంటవచ్చుట తనసందర్శనక్రియ కాటంక మని తలంచి కాళ్లను జుట్టుకొన వానిం దప్పించుకొనఁ దలంచి పాదకటకముల మాఁదన్ని వెడలెను.

చ. వలపులపల్లవుం డొకఁడు వట్టిచలంబున నేఁప దీనయై
యలుకలు తీర్చితీర్చి యొకయచ్చర వచ్చి నృపాలు నన్నగ
ర్వాలువడిచూచెఁ గాముకుఁడు వెంటనె రానపుడార్తఘూర్ణయై
వెలవెలఁబాఱెఁ దన్ముఖము వెల్వెలఁబాఱెనిటాననాబ్జమున్.

టీ. ఒక్క అచ్చర = అప్సరస్త్రీ, వలపులపల్లవుం డొకఁడు = కాముకుఁడైన విటుఁడొకఁడు, వట్టి చలంబునన్ = కారణములేని మచ్చరముచేత, ఏఁపన్ = బాధింపఁగా, దీనయై=విచారపడినదై, అలుకలు = అతని క్రోధములను, తీర్చి తీర్చి = తిన్నఁగాఁదీరిపోవునటు లొనరించి, అన్నగర్వాలువడి = తన

నివాసమగు హర్మ్యమును నదలి, వచ్చి = ద్వారము చెంగటికి వచ్చి, నృపాలున్ = రాజును, చూచెను. అపుడు = ఆ రాజును జూడవచ్చు సమయమందు, కాముకుఁడు = వలచినవాఁడును, వెంటనె రాన్ = వెంబడించి రాఁగా, ఆర్త = చెందఁబడిన, ఘర్మయై = స్వేదముగలదై, తన్ముఖము = ఆమెముఖము, వెలవెలఁబాఱెన్ = తెల్లఁబోయెను. విట = విటకానియొక్క, ఆననాబ్జమున్ = ముఖపద్మమును, వెల్వెలఁబాఱెన్ = తెల్లఁబోయెను.

తా. అప్సరసయొక్కతె విటుఁడు మాటిమాటికిఁ దనపైఁ గోపించుచుండ నాతని కోపముం బోఁగొట్టి పోఁగొట్టి చిరాకుపుట్టి ప్రభువునీక్షించు మిషతో లోననుండి వీథిలోనికి వచ్చి రాజుం గాంచెను. వెంటనే నేస్తకాఁడును వచ్చెం గావున నాతనిం జూచి తనతలంపు వలపుకానికిఁ దెలిసినదేమో యనుచింతచే శరీరము చెమర్చ మోము విన్ననయ్యెను. పిమ్మటఁ దన మాట సాగకపోయెఁగదా యను తలంపుతో విటకాని మోమును విన్ననయ్యెను.

చ. చిలుకలకొల్కి కల్కి యొకచేడియ నాటకసాలమేడపై
నిలువున నాడుచుండి ధరణీపతిఁ జూడఁ దలంచి యంచునన్
నిలిచి రహిన్ గనుంగొనుచు నెయ్యమునన్ దనువల్లి యుబ్బి కం
చెల తెగి పడ్డఁ గేతనముచీర చెఱంగున మూసెఁ జన్నులన్.

టీ. చిలుకలకొల్కి = చిలుకముక్కునుబోలిన యొల్లని కనుగొలుకులుగల, కల్కి = అందకత్తెయైన, ఒకచేడియ = ఒకానొకచెలువ, మేడపై నిలువునన్ = హర్మ్యముమీఁది యింటియందలి, నాటకసాలన్ = నాట్యశాలయందు, ఆడుచుండి = నృత్యము చేయుచుండి, ధరణీపతిన్ = స్వరోచిని, చూడఁదలంచి = చూడవలయు నని యుద్దేశించి, అంచునన్ = నాటకశాల చివరను, నిలిచి=నిలిచియుండి, రహిన్=కోరికతో, కనుంగొనుచున్, నెయ్యమునన్=స్నేహముచేత-ఆనందాతిశయముచేఁ గాంచుటవలన, తనువల్లి=తీవవంటి శరీరము, ఉబ్బి, కంచెల=కంచుకము, తెగి=బిగువుచేముడివీడిపోయి, పడ్డన్=పడి

పోఁగా, కేతనము చీరచెఱంగునన్ = టెక్కెముయొక్క వస్త్రపుకొనచే, చన్నులన్ = స్తనములను, మూసెన్ = మాటుపఱచెను. రాజగౌరవార్థము గృహములపై నెలకొల్పఁబడిన కేతనపటమె పైఁటగా నయ్యె నని భావము.

ఇందు హావభావము లభివర్ణితములు. చను లుబ్బొంగుట దర్శనోత్సాహమునఁ గాన నిది కామేంగితము. కామేంగితములు ఇదివఱకె యుదాహరించితిమి. గుబ్బ లుబ్బొంగి రైకవగులుట కామేంగిత మనుటకు.—

"మోక్తుం నైచ్ఛతి కుచపటీమాత్మనాసైవ భిన్నా" (బిల్హణీయము.)
"ప్రాగుత్తుంగఘనస్తనాంగణగళచ్చాహూత్తరీయాంచలా"

(పుష్పబాణవిలాసము.)

అవలోకనవశమున గుబ్బ లుబ్బొంగు ననుటకుఁ బ్రమాణము.—

మ. "జిలుగుంబయ్యెద జీరువాఱి యొదలన్ శృంగారపత్రాంకురం
బులతో నొక్కచకోరలోచనకుచంబుల్ పూర్ణకళ్యాణమం
గళకుంభంబులు నూత్నపల్లవవిభంగ శ్రీసమేతంబులై
నలరెం జెన్నెసలారె నైషధమహీనాథావలోకంబునన్."

(శృంగారనై. ఆ. ౬. ప 67.)

తా. అందకత్తె యొకతె మేడపైభాగమందలి నాటకసాలలో నర్తనము సేయుచు స్వరోచిని గాంచుటకుఁ దలంపుగలిగి నాట్యశాలకొన నొకవైపున నిలిచి యుండి యాతనిఁ జూచుటవలనఁ గలిగిన మోహాతిశయమున శరీరము పొంగి అధికముఁడి తెగి యూడి పడిపోవుటచేఁ జన్నులు బహిరంగము కాఁగా నందు నిల్పియున్న కేతువుయొక్క గుడ్డకొంగుచేఁ జన్నులను గప్పుకొనెను.

ఉ. కీరమనోజ్ఞవాణి యొకకిన్నరి కిన్నెర మీటిమీటి యొ
య్యారపులీల నేఁగి వసుధాధిపుఁ గన్గొనె జిల్గుపయ్యెదన్

హారముఁ జక్కఁ బెట్టెడుకుచాహితహస్తము పైఁడిగోళ్లు హిం
సారతి సేయు దర్పకుని సంపెఁగ ముల్కులుఁ బోలె మించఁగన్.

టీ. కీరమనోజ్ఞవాణి = శుకవాక్యములవంటి మనోహరమగుమాటలు గల, ఒకకిన్నరి = కిన్నరాంగనయొకర్తు, కిన్నెర, మీటిమీటి = వాయించి వాయించి, ఒయ్యారపులీలన్, పోయి, జిల్గుపయ్యెదన్ = పలుచనిపైఁటను, హారమున్, చక్కఁబెట్టెడు = సద్దుకొనుచున్న, కుచ = పాలిండ్లపై, ఆహిత = ఉంపఁబడిన హస్తము = కరముయొక్క, పైఁడిగోళ్లు = సువర్ణపునఖములు, హింసా = విరహులను బాధపెట్టుటయందు, రతిసేయు = ఇష్టపడునట్టి, దర్పకుని = మదనునియొక్క, సంపెఁగముల్కులుఁబోలెన్ = సంపెంగపువ్వు బాణములంబోలె, మించఁగన్, వసుధాధిపున్ = ప్రభువును, కన్గొనెన్ = చూచెను.

తా. కిన్నరాంగన యొకర్తు కిన్నెర వాయించుచు వాయించుచు మాని స్వారోచిం జూడ నేఁగి తీవలను మీటునప్పుడు వ్రేలికిఁ దగుల్చుకొను బంగారుగోరులుగల వ్రేళ్లతో హారములను బయ్యెదను సవరించుకొనుచు ప్రభువుం గాంచునపు డాగోళ్లు విరహులగు స్త్రీలను బురుషులను హింసింప నిచ్చగించు మారుని సంపెఁగపూవులముల్కులో యను రీతి నున్నది. అలం- ఉత్ప్రేక్ష.

చ. పరవశదైన్య మాడుకొను ప్రౌఢలఁ గానదు ఘర్మవారిచేఁ
గరఁగి స్రవించుచిత్రకము గాన దనాదృతవీటిపాటలా
ధరమున సున్నమంటినవిధంబును గానదు నవ్వుటాల కా
భరణము గొన్నఁ గానదొకబాల నృపాలునిఁ జూచి నివ్వెఱన్.

టీ. ఒకబాల = ఒకయౌవనాగమముతో నలరుచున్నది, నృపాలునిన్ = స్వారోచిని, చూచి = సందర్శించి, నివ్వెఱన్ = తొట్రుపాటుచేత, పరవశదైన్యము = ఒకని మోహమువలనఁ గలిగిన దీనత్వమును, ఆడుకొను = చెప్పుకొను.

చున్న, ప్రౌఢలన్ = ప్రౌఢత్వముగల యువతులను, కానదు = చూడదు, ప్రౌఢకాంతలు బాలభావమును గ్రహించి యెంత కామముగలది యని నింద యొనరించుచుండిరి. తదేకదృష్టితో నుంటచే బాల యానింద గ్రహింపఁజాలదాయెను. ఘర్మ = స్వేదకముయొక్క, వారిచేన్ = ఉదకముచేత, కరఁగి, స్రవించు = జాఱుచున్న, చిత్రకము = బొట్టు, కానదు, అనాదృతిన్ = ఆదరములేకపోవుటచేత, వీటి = తమ్మలముచే నయిన, పాటల = రక్తవర్ణముతోడి, అధరమునన్ = పెదవియందు, సున్నము, అంటిన విధంబును = అంటుకొనినరీతిని, కానదు = చూడదు. నవ్యవాటాలకున్ = పరిహాసమునకు, ఆభరణము = వస్తువును, కొన్నన్ = ఎవ్వరైనఁ బుచ్చుకొనినను, కానదు = తెలిసికొనదు.

ఇందు స్తంభస్వేదము లనుసాత్త్వికభావములు చెప్పఁబడెను తల్లక్షణములు,—

శ్లో. "సర్వేఽపి సత్త్వమూలత్వాద్భావా యద్యపి సాత్త్వికాః,
తథాప్యమీషాం సత్త్వైకమూలత్వాత్సాత్త్వికప్రథా.
అనుభావాశ్చ కథ్యంతే భావసంసూచనాదమీ,
... ... ... ... ...
అన్యేషాం సుఖదుఃఖాదిభావేషు కృతభావనం,
ఆనుకూల్యేన యచ్చిత్తం భావకానాం ప్రవర్తతే.
సత్త్వం తదితి విజ్ఞేయం ప్రాజ్ఞైస్తతోద్భవానిమాన్,
సాత్త్వికా ఇతి జానంతి భరతాద్యా మహర్షయః.
తే స్తంభస్వేదరోమాంచస్వరభేదాశ్చ వేపథుః.
వైవర్ణ్యమశ్రుప్రళయావిత్యష్టౌ ప్రకీర్తితాః." (రసార్ణవసుధాకరము.)

తా. ఒకానొకచిన్నది ముగ్ధత్వముచే స్పృహాజం గాంచి పరవశత్వమును బొంది, తన్నుఁ జూచి నిందించు ప్రౌఢస్త్రీలను, చెమటబిందువులచేఁ గరఁగిపోయినబొట్టును, తమ్మలము సేయుటచే పెదవి నంటుకొనిన సున్నమును, పరిహాసమునకుఁ దాను దాల్చిననగను దీసికొన్నను నేమియుం దెలియంగక యంతయుం మఱచి యున్నది.

చ. అలికులవేణి యొక్కతె రతాంతమునన్ దనయంగవల్లికన్
బులకలుచొక్కులేఁజెమరు పుట్టఁగ నేఁగి నరేంద్రుఁ జూడఁగా
పులకలు చొక్కులే జెమరుఁ బోవకయట్టుల యుండెనట్టిదా
చెలువగువానిఁగన్గొనిన చెల్వకుఁ జూపుల కావె కూటముల్.

టీ. అలికులవేణి = తేటిదండమువంటి జడగలిగిన, ఒక్కతె, రతాంతమునన్ = సంభోగానంతరమున, తన, అంగవల్లికన్ = లతవంటి శరీరమందు, పులకలు = మేని వెండ్రుకలు నిక్కబొడుచుకొనుటలు-గగుర్పాటు, చొక్కు = ఒడలు తెలియకుండుట, లేఁజెమరు = చిన్నచెమ్మట, పుట్టఁగన్ = కలుగఁగా, ఏఁగి=ద్వారముకడకుఁబోయి, నరేంద్రున్=స్వరోచిని, చూడన్=చూడఁగా, ఆపులకలుచొక్కు లేఁజెమరున్=సంభోగము చేయుటచేతఁ గలిగిన గగుర్పాటు పరవశతవలన గొంచెముగాఁ జెమటపోయుట, పోవక=అణఁగిపోవక, అట్టుల = ఎప్పటియట్లే, ఉండెను, అట్టిది = అనంతటి యటువంటిది, ఆ, చెలువగు వానిన్=అందగానిని, కన్గొనినన్ = చూచిన, చెల్వకున్=రమణికి. చూపులు= దృష్టులే, కూటముల్ = రతులు, కావె = అగును.

ఇందు స్తంభరోమాంచస్వేదములు సూచింపఁబడెను. స్తంభము, గగుర్పాటు, చెమట యివి సంభోగసమయమునందుఁ గాముకులందుఁ గలుగుట ప్రసిద్ధము.

తా. సంభోగమువలనఁ గలిగిన గగుర్పాటు, చిఱుచెమట మొదలగునవి మాటుపఱుపక యొకచెలువ స్వరోచినిఁ దిలకింప నుత్సాహపడి వచ్చెను. రాజును జూడఁగ నుత్సాహాతిశయమున మఱల స్తంభరోమాంచ స్వేదాదులు జనించెను. అలం - అర్థాంతరన్యాసము.

చ. అలరులబంతి జృంభికకు నడ్డము సేయుచుఁ గర్ణపాళిపై
కలకలఁ ద్రోయుచున్ దరఁగ రా ప్రముదాశ్రులు గోటమీటు
చున్, జెలిభుజపీఠి కొత్తగిలి చిల్కను దువ్వుచు వాలుఁగన్ను
గ్రేవల కుదభారచేర నొక వారవిలాసిని చూచె రాసుతున్.

టీ. ఒక, వారవిలాసిని=అందకత్తెయగు వేశ్య, అలరులబంతిన్=పువ్వుచెండుకమును, జృంభికతన్ = ఆవులింతను, అడ్డము చేయుచున్ = చాటుచేసికొనుచు, కర్ణపాళిపైకిన్ = చెవికమ్మిపైకి, అలకలన్ = ముఖముమీఁదికివచ్చు ఒడు—ముంగురులను, త్రోయుచున్=ఎగయఁద్రోయుచు, తరఁగలు=కెరటములు, ఔ, ప్రమదాశ్రులు = ఆనందబాష్పములు, గోటన్ = గోటితో, మీటుచున్ = ఎగఁజిమ్ముచు, చెలి=సేవకత్తెయొక్క, భుజపీఠిన్ = పీటవలెనున్న భుజముపై. ఒత్తగిలి = కొంచెము ఒఱఁగి, చిల్కను=పెంపుడుచిలుకను, దువ్వుచున్=గోటితో గీయుచు, వాలుఁగన్నుఁగ్రేవలకున్ = వాడవులగుక్రేఁగన్నులకు, ఉదధార=ఎక్కువ ప్రేమవలనఁ బుట్టిన కంటినీటిధార, చేరన్ = చేరుకొనఁగా—నిండఁగా, రాసుతున్=స్మరించి, చూచెను=కాంచెను.

ఇందు అశ్రువను సాత్త్వికభావము సూచింపఁబడినది.

తా. ఒక వారకాంత యావులింత రాఁగాఁ బువ్వుబంతిని నోటికడ్డముగా నుంచుకొని మోమున వ్రేలాడు ముంగురులఁ బ్రక్కకొత్తిగించుచు చేతిలోని శుకమును దువ్వుచుఁ గంట నీరు పెట్టుచు చేటికత్తెభుజముమీఁది కొఱఁగి నిలిచియుండి స్మరించి దిలకించె. అలం- స్వభావోక్తి.

చ. జిలుఁగులఁ బెట్టుచున్ దొడలఁ జెంద్రికపావడ యంటఁ బైతడిన్
బెళపెళ లేనిచీరఁ గటిఁ బింకపుఁ జన్నులఁ జేర్చికొంచు వే
జలకము లాడియాడి యొకచాన కరస్థితకేశయై నృపున్
వెలువడి చూచె లోఁబడితి నీకని బాసకు నిల్చెనో యనన్.

టీ. ఒకచాన = ఒకచిన్నది, జలకములు = మజ్జనములు, ఆడియాడి = చేసిచేసి (ద్విరుక్తి యాదరాతిశయము దెలుపును) జిలుఁగులన్ = పలుచని చిన్నకుంచెలను, పెట్టుచున్ = తడియొత్తుటకు మేనిపైనొత్తుచు, పైతడిన్ = శరీరమందలి తడివలన, తొడలన్ = ఊరువులపైని, చెంద్రికపావడ=చెంద్రకావిగాగర, అంటన్ = అంటుకొనఁగా, కటిన్ = నడుమును, బెళపెళలేని

చీరన్ = తడిసి వెళవెళమను ధ్వన్యనుకరణము లేని పయ్యెటకొంగును, బింకపు = బిగువగు, చన్నులన్ = చనుదోయి మీఁద, చేర్చికొంచున్ = చేరునట్టుల నొనరించుచు, కరస్థిత = హస్తమునందున్న, కేశరాజి = శిరోజములు కలదియై, వెలువడి = వెలుపలికి వచ్చి, నీకు లోఁబడితిన్ = నీకు వశ్యురాలనైతిని, అని, బాసన్ = ఒట్టుపెట్టుకొనుటకై, నిల్చెనో యనన్ = నిలిచినదేమో యను నట్టుల (ద్వారప్రదేశమునందు నిలిచి), నృపున్ = స్వరోచిని, చూచెన్ = విలోకించెను.

(లోకములో మిగులఘోర మగు ప్రమాణము గావించువారు తడివస్త్రము గట్టుకొని నీరుగారుచున్న వెండ్రుకలు చేతఁబట్టుకొని రాజు ముందుఁ బ్రమాణముచేయుట యాచారము. ఈపద్యమున ఔత్సుక్య మను సంచారిభావము సూచింపఁబడెను.)

ఔత్సుక్యలక్షణము.—

క. "మదము మదిరాదికృతమ, మ్మద మోహాహ్లాదకరంబు మఱి యౌత్సుక్యం
బదవసమయాక్షమత్వము, మది యర్థవినిర్ణయంబు మఱి యెట్టన్నన్."
(నరసభూపాలీయము.)

విలంబనము సహింపఁజాలమి యౌత్సుక్యము.

తా. ఒకయువిద మజ్జనమాడుచుండ రాజు వచ్చుచుండె నని యాలకించి వేగముగాఁ దడిగుడ్డను విడిచి వైచి యొడలుం దలయుం దుడుచుకొనకయే చెంగావిగాగర యూరువుల నంటుకొనిపోవఁ జుట్టుకొని యొడలనీటిచేఁ దడిసినపయ్యెంటచీరను గుచములపైఁగప్పుకొని నీట్లుగారుశిరోజముల నొకహస్తమున మెలికలువైచి పట్టి బయటికి వచ్చి స్వరోచిం జూచుచుండ నోయి రాజా! నీకు నే నధీనురాల నైతి నని యొట్టుపెట్టుకొనెనో యనువిధంబున నుండెను. అలం-ఉత్ప్రేక్ష.

మ. ఒకనేత్రాంబుజ మొక్కగల్ల మొక చన్నొయ్యారపుఁ గ్రీలిలవీ
థికిఁ దోఁపన్ దలుపోరగా నొకపురంధ్రీరత్నమీక్షించె రా

జకిశోరంబుఁ దదీయులై వెలయుభాషాలక్ష్ములన్ జూచి త్ర్యం
బకభాగంబు మొఱంగి మైత్రికి శివాభాగంబ యేతెంచెనాన్.

టీ. పురంధ్రీరత్నము = ఉత్తమురాలగు నొక పతివ్రతాశిరోమణి, తదీయులై = స్వారోచి సంబంధులై - ఆస్వారోచికి వశ్యురాండ్రై, వెలయు = ప్రకాశించు, భాషాలక్ష్ములన్ = సరస్వతిని, లక్ష్మిని, స్వారోచిని విద్యయు లక్ష్మియుఁ జెందియున్నవనుట చూచి, మైత్రికిన్ = స్నేహమునకై, త్ర్యంబక భాగంబున్ = సామేనగు శంకరుని పార్శ్వమును, మొఱంగి = మాటువఱచి, శివాభాగంబ = గౌరియొక్క యర్ధభాగమే, ఏతెంచెనాన్ = వచ్చెనేమో యనునట్లు, ఒక, నేత్రాంబుజము = ఒకతామరపూవువంటి కన్నును, ఒక, గల్లము = చెంపయును, ఒకచన్ను, ఒయ్యారపుఁ, లీలన్ = విలాసముతో, వీధికిన్ = బజారునకు - రాజువచ్చుత్రోవకు, తోఁపన్ = కనఁబడునట్లుగా, తలుపు ఓరగాన్ = తలుపుప్రక్కఁగా - తలుపుచాటున సగముమేను బయట సగముమేను నిమిడునంతగాఁ దెఱచియుంచి, రాజకిశోరంబున్ = స్వారోచిని, ఈక్షించెన్ = చూచెను.

సందర్శించుచున్నది పతివ్రతారత్నము గాన పార్వతితోఁ బోల్పఁబడినది. పురంధ్రి కాలమెఱిఁగినది. రాజు కిశోరము గాన సందర్శించుట యుక్తముగనున్నదని భావము. అలం-ఉత్ప్రేక్ష.

తా. పతివ్రత యొక్కరిత రాజును గాంచుతలంపుతోఁ గవాటము నొకభాగమును మూసి చాటుగా నొకలోచనము, ఒక పార్శ్వము, ఒకచన్ను, వెలుపలికిఁ గాన్పించునట్లు చూచుచుండఁగా శివునికి సామేనుగా నున్న గౌరి చేస్తకాంతగు సిరియు, సరస్వతియు, భాగ్యమును జమువులై స్వారోచిం జెంది యుండుటచే వారిం గాంచి సంతోషింపవలయు ననియు, యొకలుకదాఁచుకొని యర్ధశరీరముతో వచ్చి కాన్పించెనేమో యను నట్లుండెను.

మ. కలయన్ గూర్చెఁ జెమర్చునంగములలగ్నంబై నసన్నంపుమం
జులశౌశేయమునందు మించుకమలస్తోమంబుచేఁ జూచె నొ

కన్నులతాతన్వి చెలంగి పొంగు మదికాంతుల్ దీర మేనెల్లఁ గ
న్నులుగావించి కుమారుజవ్వనము చెన్నుం జూచు చందంబునన్.

టీ. ఒక్క, లతాతన్వి = లతవంటి శరీరముగల చిన్నది, చెలఁగి = అతిశయించి, పొంగు = ఉప్పొంగెడు, మదికాంతుల్ = చిత్తములోని యభిలాషములు, తీరన్ = నెఱవేఱఁగా, కూర్మిన్ = ప్రేమచేత, కలయన్ = దేహమంతయుఁ గలియునట్టుల, చెమర్చు = చెమట పట్టినట్టి, అంగములన్ = అవయవములయందు, లగ్నంబు = తగులుకొనినది, ఐన, సన్నంపు = మిగుల సన్ననైన, రంజిల = సొగసైన, కౌశేయమునందున్ = పట్టుబట్టయందు మించు కమలస్తోమంబుచేన్ = తామరవలెనున్న చిత్తరువునేతలోని తమ్మిపూవులసమూహముచే, మేనెల్లన్ = దేహమంతయు, కన్నులుగావించి = కనులుగాఁ జేసికొని, చూచుచందంబునన్ = చూచునట్టి విధముగా, కుమారు = స్వారోచియొక్క, జవ్వనముచెన్నున్ = వయస్సుయొక్క యందమును, చూచెను.

ఒడలెల్లఁ గన్నులు చేసికొని చూచుట యాదరాతిశయమును దెలుపును. కనులేగాక ప్రత్యవయవము రాజును జూడఁ గోరెను. ఒడలెల్ల కనులుగాఁ జూచుట యాదరాతిశయమును సూచించు ననుటకు.—

తే. "ఎల్ల చిగురాకుఁబోఁడ్లకు నెంత వేడ్క
యంత వేడుక దనలోన నతిశయిల్ల
నొక్క గుబ్బలకొమరాలు చక్క వచ్చి
కనియె నొడలెల్లఁ గన్నులై మనుజవిభుని."

(శృం. నైష. ఆ. ౧. ప. ౬౬)

ఇటులనె యందు మఱియొకవర్ణనము.—

"న జానే సమ్ముఖాయాతే ప్రియాణి వదతి ప్రియే
సర్వాణ్యంగాని కిం యాంతి నేత్రతాముత కర్ణతామ్."

ఇందు స్వేదము ఔత్సుక్య మనుసాత్త్వికభావములు సూచితములు. అలం. పరిణామము-ఉత్ప్రేక్ష.

సాత్త్వికలక్షణము.—

క. "అతిశయవికారచేతో, గతవృత్తివిశేష మరయఁగా సత్త్వము త
త్కృతిపాద్యక్రియభావము, సతతాలంకారకారి చను తెలియంగన్."
(కావ్యాలంకారచూడామణి)

తా. పెండ్లికుమారుని గాంచుతలంపుతో నొక చిన్నది తామరతేకులు గలకట్టువస్త్రము ధరించి చూడరాఁగా స్వేదించి జూడ శరీరమంతయు నేత్రములుగాఁ జేసికొని వీక్షించుచున్నదేమో యనునట్లు వస్త్రము చెమటచే శరీరము నంటుకొని యుండెను.

వ. ఇత్తెఱంగునఁ గరంగునంతరంగంబులు గలతురంగాక్షుల యపాంగంబులఁ దఱంగలించు సితేతరతరళతరదృగ్రోచుల నభంగశృంగారరసవీచులచాలు నంబోలెఁ బొదువంబడి యాలంబితచీనాంబరప్రాలంబమాలికాచిత్రములగు నాతపత్రములు మెఱయఁ బత్త్రముల డిగ్గి దుర్గాధిపతు లేమేమయని త్రోపుత్రోపాడుచు వీచువీచోపు లచ్ఛములగు కౌముదీగుచ్ఛముల సంతరింప నంతికవైజయంతికలఁ గ్రాలుపలువలఁ బొలయు చిఱుగరువలిఁ దూలు నీలాలకలయలక లుభయపార్శ్వసముత్తుంగమత్తమాతంగమదసౌరభసంగిభృంగసంఘంబుల నెలయింప సింహారుకలపంబు లబ్బాటునఁ జేటులెత్తి యొండొరులయొత్తడిఁ బొడిపొడియై యెగయ విస్ఫురత్పరాగపూగంబు చదల నెల్లెడ నుల్లెడ * గట్టిన ట్లమర దట్టదట్టమ్ముగ సాగునాగరులవాగారవమ్ములు సిగుడ

* పట్టిన. పా.

నెడవడక పొగడు పొగడికలకలకలమ్ములును బుంఖాను
పుంఖ శంఖ భేరీ పటహ కాహళ వేణు వీణాదివాదనధ్వా
నంబును గలమధురకిన్నరీనిక్వాణంబులరాణఁ ద్రాణఁ
జెలుచు *విన్నాణంపుఁగొల్పుటెలుంగులును వేల్పుగాణలు
పాడు లక్ష్మీనారాయణుల కల్యాణంపుఁబాటలఁ దీటు
కొను తిన్ననిరవంబులుఁ గలసి బలసికొను కోలాహలమ్ము
లిమ్ముగ సందడుల నెస గలుగఁ జడియు వేత్రహస్తులప్రశ
స్తతరసాహోనినాదంబు సంబంధించి పెంపొలయ నత్యంత
కాంతం బయి నిరంతరగతిఁ గ్రంత నడవ నడదివియ లై
మకుటారవిందరాగంబులు వెలుంగ నలుగడల సామంత
సందోహంబు క్రందుకొన మందమందగమనంబునఁ జదు
బృందారకవేదండంబుపై నుద్దండతనుచ్ఛాయాకలాపంబు
జఁటేటిజంబాలకదంబకంబుడంబు విడంబింపఁ దిన్ననిరవం
బునఁ గలసి బలసినకోలాహలంబు హంసాదివిహంగమ
హృదయంగమరావంబును బెడంగువడ నడుచుక్రంత
నత్యంతదర్శనీయంబు లై మెఱయు మంగళద్రవ్యంబుల
నెడనెడఁ దీండ్రించు పుండ్రేక్షుదండంబులకడలఁ గడలు
కొను పసరుటాకులడాలు శైవాలంబునందంద క్రందుగా
మందుచేదివియలు చెందొవలునుం గాఁ బాహ్యద్వయ
సముత్తుంగమణిసౌధవీథికారోదోంతరాళంబున గంధగజ
ఘటాఘనాఘనకాంతికధూళిమాగధప్రవాహంబునఁ గూలం
కషం బగునృపతిపథయమునాహ్రాదంబు గగనగంగావగాహ
నాభ్యాసంబున నిండుకొని పోవునదియునుంబోలెఁ దనరఁ

* విన్నాణంబులు.

దినసముద్దామతేజోభరంబునఁ జడిసిన మేరుగిరిమోకులం
బోలెఁ దీరుగలభుజంబులఁ దాలుమాలుగా నిడినతార
తాకంపుఁబొంచనకంబులు దోరంతరహారంబులుఁ గేయూర
హీరంబులుఁ గరకంకణమురుముద్రికంఠవళంబులుఁ గటికనక
మేఖలాఘటితంబగు చేమకరాచురీమరకతంపు-బిసి మెఱుం
గులుఁ దఱిసి వెన్నెలక్రొమ్మురువులబోరవన్నగునరపడుగు
జిలుఁగుకంచుకంబును మించి వెలుపలఁ దోఁప ముంచు
గవిసినరోహణమహీధరంబునుంబోలె రాజభవనాంగణంబుఁ
జేరవచ్చె నంత నక్కడ. 71

టీ. ఇత్తెఱంగునన్ = ఈవిధముగా, కరంగుకంతరంగంబులు = ప్రేమతోఁ గూడినచిత్తములు, కల, కురంగాక్షుల = లేఁడిచూపులవంటి చూపులుగలస్త్రీల యొక్క, అపాంగంబులన్ = క్రేఁగన్నులయందు, తుఱంగలించు = వెలుఁగుచున్న, సితేతర = నీలవర్ణములుగల, తరళతర = ఎక్కువచలములైన, దృక్ = చూపులయొక్క, రోచులన్ = ప్రకాశములచే, అభంగ = కొదువకాని, శృంగారరస = శృంగారరస మను జలప్రవాహమునందలి, వీచుల = కెరటముల యొక్క, చాలునం బోలెన్ = వరుసచేవలె, కొడువాబడి = క్రమ్ముకొనఁబడి. అలం. ఉత్ప్రేక్ష.

ఇందు అపాంగపుఁజూపులు నల్లనివిగా వర్ణింపఁబడెను. ఇదియుఁ బ్రసిద్ధమె.

శ్లో. “వేశ్యా క్త్వత్తో నఖపదసుఖాన్ ప్రాప్య వర్షాగ్రబిందూన్
ఆమోక్ష్యన్తే త్వయి మధుకరశ్రేణి దీర్ఘాన్ కటాక్షాన్.”

(మేఘసందేశము.)

సీ. “కర్పూరకస్తూరికాప్రవాహంబులు ప్రవహింప లోచన ప్రాంగణముల”

(శృంగారనైషధము. ఆ. ౫. ౭)

చ. తొలకరి చూపు లింపెసఁగ ధూపములై...”

(చంద్రికాపరిణయము. ఆ. ౧. ౪౩.)

"కటాక్షోఽపాంగదర్శనే." (అమరము.)

"యే తస్యా తీక్ష్ణచలచక్షుస్త్రిభాగదృష్టా
స్తే కామచంద్రమధుపంచమమారణీయాః
యేషు పునర్నిపతితా సకలాపి దృష్టి
ర్వర్తన్తే తే తిలజలాంజలిదానయోగ్యాః" (కర్పూరమంజరి.)

ఆలంబిత = చేకొనఁబడిన, చీనాంబర = చీనాదేశపుఁ బట్టుగుడ్డలోఁ జుట్టఁబడినదగు, ప్రాలంబ = చక్కఁగా వ్రేలాడుచున్న జాలరులయొక్క, మాలికా = వరుసలచేతను, చిత్రములు = ఆశ్చర్యముగొలుపునవి, అగు, ఆతపత్రములు = ఛత్రములు, మెఱయన్ = ప్రకాశింపఁగా, పత్త్రములన్ = వాహనములను, డిగ్గి = దిగి, "పత్త్రం వాహనపక్షయోః" అమరము. దుర్గాధిపతులు = దుర్గముల యేలుఁరాజులు, ఏము ఏము = మేమేమేమే, సేవచేయుటకు మేము ముందుగాఁ జనవలయును మేము ముందుగాఁ జనవలయును, అని, త్రోపుత్రోపాడుచున్ = ఒకరినొకరు తొలంగిపోవునటులఁ ద్రోసికొనుచు, వీచు = విసరునట్టి, వీచోపులు = చామరములు, అచ్ఛములు = ధవళములై ప్రకాశించునవి, అగు, కౌముదీగుచ్ఛములన్ = వెన్నెలగుత్తులును, సంతరింపన్ = పుట్టింపఁగా, (అలం. ఉపమ.) అంతిక = చేరువనున్న, వైజయంతికలన్ = జెండాలయందు, భ్రాలు = ప్రకాశించు, పలువలన్ = బట్టలవలన, తోలయు = అవతరించుచున్న, చిఱుగరువలిన్ = పిల్లవాయువుచేత, తూలు = చలించుచున్న, నీలాలకల = నల్లని ముఖముమీఁదికురులుగల యువతులయొక్క, అలకలు = ముంగురులు, ఉభయపార్శ్వ = రెండువైపుల నుండు, సముత్తుంగ = ఎక్కువపొడవులైన, మత్తమాతంగ = మదగజములయొక్క, మద = మదజలధారలయొక్క, సౌరభ = పరిమళములకు, సంగి = దరియుచున్న, భృంగసంఘంబులన్ = తేఁటిమొత్తములను, ఎలయింపన్ = చేరవచ్చునట్లు చేయఁగా, ఏనుఁగుల గండస్థలములందలి మదజలము గ్రోలుచున్న తుమ్మెదలు స్త్రీల ముంగురులఁ దమ్ము తుమ్మెదలేయనుకొని భ్రమపడి చేరవచ్చునటులఁ జేయుచుండెను. అలం-

శ్రాంతిమంతము. ఇంపారు=సంతోషమును బుట్టించు, కలపంబులు=గంధపుం బొట్టులు, అబ్బాటునన్=ప్రజలవలనగలిగిన వేడిచేత, పేటురెత్తి=పెల్లులేచి ఒండొరుల యొత్తడిన్=అన్యోన్యము సంఘటించు రాపుచేత, పొడిపొడియై= నలిగి మిక్కిలి పొడియై, ఎగయన్=మీదికిలేచుచున్న, విస్ఫురత్=వ్యాప్తినొందు తేజముగలిగిన, పరాగపూగంబు = ధూళిసముదాయము, చదలన్ = మింట, ఎల్లెడన్, ఉల్లెడ = శుభమునంగట్టుమేలుకట్టు, కట్టినట్టు = కట్టినవిధముగా, అమరన్ = ఒప్పంగా, మేనిగంధంపుబూత యొకయొకకతన రేగి ధూళియై మింటికెగయ నదియంతయుం జాందిని గట్టినటుల నుండెను. అలం. అతిశయోక్తి. దట్టపట్టమ్ముగన్ = ఒకరినొకరు త్రోసికొనుచు, మిగుల తఱచుగా ననుట. సాగు = బయలుదేరివచ్చు, నాగరుల = పౌరులయొక్క, వాగారవమ్ములు=వాక్యధ్వనులు, నిగుడన్ = ఎక్కువకాంగా, ఎడపడక=ఎడతెఱపిలేక, పొగడు = స్తోత్రముచేయుచున్న, పొగడికల = స్తుతిపాఠకులగు వందిమాగధుల పొగడికలయొక్క, కలకలమ్ములును = కోలాహలధ్వనులును, పుంఖానుపుంఖ = ఒకదానివెనుక నొకటిధ్వనించుచున్న, శంఖ = చిందములు, భేరీ = భేరులు, పటహ = తమ్మెతప్పెటలు, కాహళ = బాకాలు, వేణు = పిల్లనగ్రోవులు, వీణా = వీణియలు, ఆజి = మన్నకు, వాదన = వాద్యవిశేషములయొక్క, ధ్వానంబును = శబ్దములును, కల = అవ్యక్తమయిన, మధుర = ఇంపయిన, కిన్నరీ = కిన్నెర యనువీణియలయొక్క, నిక్వాణంబుల = శబ్దములయొక్క, రాణన్ = మనోహరత్వమును, త్రాణం బెఱుచు = పటుత్వమువలనం బెగ్గించునట్టి, వీణారవమును మించియతిశయించు, విన్నాణంపుం గొల్పుబెళుంగులన్=ఉకలకతోం జమువను లొనర్చు గళనాదములును, నేర్పుతోడి పాఠకులు కొనుగోలుచేయుం కంఠస్వరము లని కొందఱు. వేల్పుగాణలు = అప్సరసలు, పాడు=పాడుచున్న, లక్ష్మీనారాయణుల=లక్ష్మీదేవి విష్ణుమూర్తియొక్క, కళ్యాణంపుంబాటలన్ = పెండ్లిపాటలచేత, దీటుకొను=పూర్ణమగుచున్న, తిన్ననిరవంబులున్ = నెమ్మదిగలధ్వానము.

లును, కలసి=అన్నియుఁ నొకటియై, బలసికొను = వ్యాపించునట్టి, కోలాహలమ్ములు=కలకలమ్ములు, ఇమ్ముగన్ = తగినవిధముగా, సందడులన్ = సమ్మర్దములను, ఒరసికొనుచు వచ్చువారియొత్తిడులను, ఎడగలుగన్ = దూరమగునట్లు, ఒత్తిడితొలంగిపోవునటుల, జడియుఁ=వెరలనెట్టునట్టి, వేత్రహస్తుల=బెత్తములు ధరించినభటులయొక్క, ప్రశస్తకర = ఎక్కువ పొగడఁదగిన, సాహ్లా నినాదంబున్ = సంతోషమును గలుగఁజేయుధ్వనిని, హెచ్చరికచేయుపలుకులధ్వనిని, సంబంధించి = కూడుకొని, పెంపు=ఔన్నత్యమును, ఒలయన్ = పొందఁగా, అత్యంతకాంతంబయి=మిక్కిలిసుందరమై, నిరంతరగతిన్=ఎడతెగని తెఱంగున, క్రంతనడవన్ = సారిపట్టుకొని నడవఁగా, పెండ్లికొడుకువారు పెండ్లికుమార్తెకొఱకుఁ బ్రధానమునకు సంబంధించిన శుభవస్తువులఁ గొని వచ్చుటను గ్రంతనడచుట యందురు. నడదివియలై = గమనము చేయుచున్న దీపములై, మకుట=శిరోభూషణమగు కిరీటమునందలి. అరవిందరాగంబులు= పద్మరాగంబులు, వెలుఁగన్ = ప్రకాశింపఁగా, నలుగడలన్ = నాలుగు చెంపలయందును, సామంతసందోహంబు = చుట్టుప్రక్కల నున్న నృపాల సమూహము, క్రందుకొనన్ = చుట్టుకొని రాఁగా, మందమంద = నెమ్మది నెమ్మదియగు, గమనంబునన్ = గతితో, చను, బృందారక = దివ్యుల యొక్క, వేదండంబుపైన్ = గజమగు నైరావతముమీఁద, ఉద్దండ = విస్తారమయిన, తనుచ్ఛాయా = శరీరప్రభలయొక్క, కలాపంబు = సముదాయము, జంబేటి = జంబూనదియొక్క, జంబాల = బురదయొక్క, కదంబకంబు=గుంపుయొక్క, డంబున్=రీతిని, విడంబింపన్=తులఁదూఁగఁగా, తిన్ననిరవంబునన్ = చక్కనిధ్వానముతో, కలసి, బలసిన = చుట్టుకొనిన, కోలాహలంబులన్ = కలకలమనుచప్పుడును, హంసాలి = మరాళములు పొందలయిన, విహంగమ = పక్షులయొక్క, హృదయంగమ = చిత్తరంజకమయిన, రావంబును = చప్పుడును, బెడంగుపడన్ = శోభించునట్లు-అందము గలుగఁ జేయునటుల, నడుముక్రంతన్ = నడుచుచున్న ప్రధానద్రవ్యములఁ గొని

పౌర జనసమూహమునందు (అలం - ఉపమ.) అత్యంత = ఎక్కువ, దర్శ
నీయంబులై = వీక్షింపనొప్పినవై, మెఱయు = ప్రకాశించు, మంగళద్రవ్యం
బులన్ = శుభవస్తువులయందు, ఎడనెడన్ = మధ్యమధ్య, తీండ్రించు =
ప్రకాశించుచున్న, పుండ్రేక్షు=చారలచెఱకులయొక్క, దండంబుల = కఱ్ఱల
యొక్క, కడలన్=చివరలయందు, కదలుకొను = విజృంభించుచున్న, పసరు
టాకుల = పచ్చనియాకులయొక్క, డాలు = ప్రకాశము, శైవాలంబును =
నాచును, అందంద, క్రందుగాన్ = విస్తారముగా, మండుచేదివియలు =
ప్రకాశించుచున్న చేతిదివిటీలు, చెందొవలునున్=రక్తోత్పలములును, కాన్,
పార్శ్వద్వయ = రెండువైపులను, సముత్తుంగ = ఎక్కువయున్నతములైన,
మణిసౌధ=రత్నహర్మ్యములయొక్క, వీథికా=మధ్యమార్గములను, రోదోంత
రాళంబునన్ = మింటికి మంటికి నడుమ, గంధగజ = మత్తేభములయొక్క,
ఘటా=సముదాయములనెడి, ఘనాఘన = వానకాఱునందలిమబ్బులయొక్క,
కాంతిక=వెలుతురువంటి వెలుతురుగల, ధూళి = పరాగముతోడి, మాగధ =
మగధాశ్వములయొక్క, ప్రవాహంబునన్ = వరుసయనువరదచేత, కూలం
కషంబు = ఒడ్డులనురాపాడుచుండునది, అగు, నృపతిపథ = రాజవీథియను,
యమునాప్రవాహంబు = కాళిందీనదియందలిమడుగు, గగనగంగా = మిన్నేటి
యందు, అవగాహన = స్నానముచేయఁబట్టి, అభ్యాసంబునన్ = పరిచయము
చేత, నిండుకొని=సంపూర్ణమునొంది, పోవునదియునుంబోలెన్ = ప్రవహించు
దానివిధముగా, తనరన్ = ఒప్పఁగా. (అలం. రూపకము, ఉత్ప్రేక్షయును.)
తన = తనయొక్క, సముద్దామ = అభ్యంతరములేని, తేజోభరంబునన్ =
ప్రకాశాతిశయముచేత, జడిసిన, మేరుగిరి = మేరుపర్వతముయొక్క, పోరు
లుంబోలెన్ = కొమ్ములోయనునట్లు, తీరు=అందము, కల, భుజంబులన్ =
భుజములయందు, తాఱుమాఱుగాన్ = ఎగుడుదిగుడుగా, ఇడిన, తార
హారంపు=శుభ్రపఱిచినముత్యములయొక్క, పంచసరంబులున్=ఐదుపేటలు
గల జన్నసరములను, ఉరోంతర=వక్షస్స్థలమునందలి, హారంబులున్ = మణి.

పరములును, కేయూర=భుజకీర్తులయందలి, హీరంబులున్=వజ్రములను, కర
కంకణ = హస్తకంకణములయొక్క, కురువింద = కురువిందమణులయొక్క,
కందళంబులున్ = అంకురములును, కటి = నడుమునందు, కనకమేఖలా =
బంగారుమొలత్రాటియందు, ఘటితంబు అగు = కూర్పఁబడిన, చేరు =
హారముయొక్క పేటతోడి, కరాళురీ = బాకుయొక్క, మరకతంపు=
పచ్చతాలుదాపిన, పిడి = కత్తిపిడియొక్క, మెఱుంగులును = కాంతులును;
కలిసి=కూడుకొని, వెన్నెలక్రొన్నురువులన్ = వెన్నెలక్రొత్తగాఁబొదమిన
నురుగు, బోరనన్ = వెంటనే, నగు = హేళనముచేయుచున్నట్టి, అరపదుగు =
నగముపదుగుతోడనేసిన, వెలితియచ్చుగలపదుగుతో నేసిన=జల్లెడవలె నెఱ
ముగా నేసిన, జిలుగు=పలుచనిబట్టతోఁగూర్చిన, కంచుకంబున్ = చొక్కా
యను, మించి=అతిశయించి, వెలుపలన్=బయట, తోఁచన్=కాన్పింపఁగా,
భూషణములందుఁ గలరత్నములకాంతులు నడుముకట్టునందుఁ గల కత్తి
మెఱుంగులును గలిసి మేనఁదాల్చిన తెలికట్టుచొక్కాయికాంతి మించియుండె
నని భావము. మఱియు, కవిసిన = చుట్టుకొనిన, రోహణమహీధరంబుచుం
బోలెన్ = రత్నములతో నిండియున్న రోహణగిరివలెనే, రాజభవన = రాజ
మందిరముయొక్క, అంగణంబు=ముందరివాకిలి, చేరవచ్చెన్ = సమీపించెను,
అంతన్=అప్పుడు, అక్కడన్ = ఆయిందీవరాక్షునిగృహమునందు, వైపవ్య
ముతో నన్వయము. అలం - ముద్ర, ఉపమ. కురువిందము క్షత్రియరత్నము
గావున రాజులు ప్రియముగా ధరింతురు. ఇటుల ననుటకు దృష్టాంతరము.—

"మాణిక్యస్య ప్రవక్ష్యామి యథా జాతిచతుష్టయం
రక్తస్సితో భవేద్విప్ర స్త్వతిరక్తస్తు క్షత్రియః
పద్మరాగో భవేద్విప్రః కురువిందస్తు బాహుజః." (యుక్తికల్పతరువు)

కురువిందము ఆరోగ్యసంపదలఁ గూర్చును.

క. "కురువిందము ధరియించిన, నరవిందహితుండు ప్రీతుఁడై యారోగ్యం
బిరవొంద నిచ్చు నెప్పుడు, సిరులొంద సమస్తకార్యసిద్ధులొసంగున్."
(రత్నపరీక్ష)

కం. కాంతాకదంబకిసలయ
కాంతకరావర్జ్యమానకనకఘటీని
ర్యాంతసుగంధిజలంబుల
నింతి జలకమాడి జిలుఁగు లిడి తడియొత్తెన్. 72

టీ. ఇంతి = మనోరమ, కాంతా = ఊడిగములు సేయువనితలయొక్క, కదంబ=సముదాయముయొక్క, కిసలయ=చిగురులవలె, కాంత = అందము లయిన, కర = హస్తములచేత, ఆవర్జ్యమాన = సన్నఁగాఁ బోయఁబడుచున్న, కనకఘటీ = సువర్ణకుండికలనుండి, నిర్యాంత = ఎక్కువఁగా నుమియఁబడు చున్న, సుగంధి = చక్కని పరిమళముతో మిళితమయిన, జలంబులన్, జలక మాడి = తానమాడి, జిలుఁగులు = పలుచనిబట్టలు, ఇడి = మేనఁజేర్చి, తడి యొత్తెన్ = దేహమును దుడిచెను.

తా. ఊడిగంపువనితలు బంగారుకడవలతోఁ బన్నీరు వోయ మనోరమ స్నానము చేసి మెత్తనిబట్టతోఁ దుడుచుకొనెను.

చ. తళుకుదుకూలకోటిఁ గటిఁ దాల్చి పటీర మలంది హారకుం
డలమణిపారిహార్యరశనాకటకాంగుళిముద్రికాదిభూ
షలు తొడి పారిజాతవికసత్ప్రసవావళిఁ బూని యొయ్యన
న్వెలఁది వివాహవేదికకు వేడుకతోఁ జనుదెంచె సిగ్గునన్. 73

టీ. అన్వెలఁది = ఆమనోరమ, తళుకు = తళతళమనుచున్న, దుకూల = ధవళిమగల - తెల్లగాఁ జలువచేయఁబడిన, కోటిన్ = పట్టుబట్టను, కటిన్ = మధ్యమునందు, పిఱుఁదులపైన నని కొందఱు చెప్పుచున్నారు. "కటీ శ్రోణిః కకుద్మతి" యమరము. "కటిర్నితంబశ్శ్రోణిశ్చ జఘనం." ధనంజయనిఘంటువు. తాల్చి=ధరించి, పటీరము=సుగంధము, అలంది రాచికొని, హార=హారములు, కుండల=కుండలములు, మణి=రత్నములుదాపిన, పారిహార్య=గాజులు, సూడిగములు, మట్టిగాజులని కొందఱు వంకీలని కొందఱును, "పరితోహారంత్యసే

నేలి పరివారో హస్తః తత్ర భవః పారివార్యః” పరిహారమన హస్తముగాన హస్తాలంకారము. “పరిహారః పర్యాప్తే హస్తే చ” రత్నసుండు. గాజులనుటయు తెలియుచున్నది. రశనా = పదియారుపేటల మొలనూలు, కటక = హస్త కడియములు, అంగుళి = ప్రేళ్లనిడుకొను, ముద్రికా=ఉంగరములు, ఆది = మొదలగు, భూషలు = అలంకారములు, తొడి = తొడిగి, పారిజాత = కల్పవృక్షముయొక్క, వికసత్ = వికసించిన, ప్రసవ = పుష్పములయొక్క, ఆవళిన్ = వరుసను, పూని = పెట్టుకొని, ఒయ్యనన్ = మెల్లఁగా, అలివేణులు = వనితలు, తేన్ = తీసికొనిరాఁగా, వివాహ = పరిణయసంబంధమయిన, వేదికిన్ = తిన్నెపైకి, సిగ్గునన్ = లజ్జతో, చనుదెంచెన్ = వచ్చెను.

తా. మనోరమ సుగంధద్రవ్యములను పూసికొని మంచిమంచిపలువిధములగు విలువగలయలంకారములను ధరించి స్త్రీలు వెంట నిడుకొని రాఁగా వివాహవేదికకు సిగ్గుతో వచ్చెను.

తే. ఇట గృహద్వారసీమకు నేఁగుదెంచు
నాకుమారున కిందీవ రాక్షుఁ డెదురు
పని మరుత్కరి డిగ్గి వందనమొనర్చు
నతని దీవించి హితమంత్రియుతము గాఁగ. 74

టీ. ఇటన్=ఇక్కడ-పెండ్లికుమారునిచెంగట, గృహద్వారసీమకున్ = రాజమందిరద్వారముకడకు, ఏఁగుదెంచు = వచ్చుచున్న, ఆకుమారునకున్ = పెండ్లికుమారుఁడగుస్వరోచికి, ఇందీవరాక్షుఁడు, ఎదురుపని = ఎదురుగాఁబోయి, మరుత్కరిన్ = ఐరావతమును, డిగ్గి = దిగి, వందనము = నమస్కారము, ఒనర్చుచున్నతనిన్ = చేయుచున్నస్వరోచిని, దీవించి = ఆశీర్వచనము గావించి, హిత = స్నేహితులతోను, మంత్రియుతముగాఁగన్=సచివులతోఁ గలసికొనునట్లుగా, ముందరికన్వయము.

తా. రాజమందిరద్వారసమీపమునకుఁ బెండ్లికుమారుఁ డగుస్వరోచి వచ్చి యైరావతముం దిగఁగా గంధర్వరా జెదురుకోలునమస్కారము చేసిన స్వరోచి నమస్కరింపఁగా నాశీర్వదించి స్నేహితులు మంత్రులతోఁ గలిసె.

వ. భూసురాశీర్వాదనాదంబులు రోదసి నిండ నభ్యంతరగృహం
బునకుం దోడ్కొని పోవునప్పు డప్పుడమిఱేఁ డెడనెడం
బుణ్యాంగన లొసంగునీరాజనోపచారమ్ము లాదరించుచుఁ
గక్ష్యాంతరద్వారదేశంబుల మంగళార్థంబుగా నిడిన పూర్ణ
కలశముకురాదిపదార్థంబులఁ గనుంగొనుచుఁ దోరణస్తం
భాయమానరంభాతరుకిసలయోత్తాలతాళవృంతానిలంబులఁ
గుంతలంబులు చలియింప మంథరగతిఁ గింపురుషవృషభుం
డగుగంధర్వరాజప్రధానుం డొసంగుఁ గై దండ గొని యల్ల
నల్లన నడచి పురోహిత బ్రాహ్మణ బంధు పురంధ్రీసందోహ
నీరంధ్రం బగుచు వైవాహికక్రియారంభసంభారసంభృతముద్రం
బాదిమరుద్రంభోరువుల కిలికించితోగపలుకులకలకలంబునం
గొలగొల మనుకౌతుకాగారంబు సొత్తెంచి. 75

టీ. భూసుర = విప్రులయొక్క, ఆశీర్వాద = దీవనలయొక్క, నాదంబులు = చప్పుడులు, రోదసి = మింటికిమంటికి నడుమనున్న ప్రదేశమంతయును, నిండన్, అభ్యంతరగృహంబునకున్ = మధ్యగృహంబునకు = వివాహవేదిక యమర్పఁబడిన గృహభాగమునకు, తోడ్కొని = వెంటఁగొని, పోవునప్పుడు = పోవుచున్న సమయమందు, అప్పుడమిఱేఁడు = ఆస్వరోచి, ఎడనెడన్ = మధ్యమధ్య, పుణ్యాంగనలు = పేరఁటాండ్రు, ఒసంగు, నీరాజనోపచారమ్ములు = మంగళమర్యాదలను, ఆదరించుచున్ = స్వీకరించుచు, కక్ష్యాంతరద్వారదేశంబులన్ = ఒక్కొక్క తొట్టికట్టయొక్కయు ముంగిళ్లయందు, మంగళార్థంబుగాన్ = మంగళసూచకముగా, ఇడిన = ఉంచినట్టి, పూర్ణకలశ = ఉదపూరితములగు పూజాకలశములు, ముకుర = దర్పణములు,

ఆది=మొదలగు, పదార్థంబులన్ = వస్తువులను, కనుంగొనుచున్=చూచుచు, తోరణ = హర్మ్యములయందలి శృంగములగుమ్మములయొక్క - గోపుర ద్వారములయొక్క యనుట. స్తంభాయమాన = స్తంభములుగా నాచరించుచున్న, రంభాతరు = అరఁటిచెట్లయొక్క, కిసలయ = లేఁతపత్త్రములను, ఉత్తాల=పొడవులైన, తాళవృంత = తాఁటియాకు వీఁవనలవలని, అనిలంబులన్ = మారుతములవలన, కుంతలంబులు = శిరోజములు, చలియింపన్ = చలనముఁబొందఁగా, మంథర = నెమ్మదియగు, గతిన్ = గమనముతో, కింపురుషవృషభుండు = కింపురుషోత్తముఁడు అగుగంధర్వరాజప్రధానుండు=అగు నిందీవరాక్షునిమంత్రి, ఒసంగు = ఇచ్చునట్టి, కైదండ = చేతిపట్టు, కొని=గ్రహించి, అల్లనల్లనన్ = నెమ్మది నెమ్మదిగా, నడచి, పురోహిత= పురోహితుఁడు, బ్రాహ్మణ = ద్విజులు, బంధు=బాంధవులు, పురంధ్రీ = మంచి చరిత్రలుఁగల పేరఁటాండ్రు, సందోహ=వీరిసముదాయముచేత, నీరంధ్రంబయి= ఎడములేనిదై, వైవాహిక=వివాహసంబంధమైన, క్రియా=కార్యములయొక్క, ఆరంభ=ప్రారంభించునప్పుడు వలయు, సంభార = వస్తుసముదాయమును దీసికొని వచ్చుటయందు, సంభ్రమత్ = తొట్రుపడుచున్న రంభాది = రంభ మొదలుగాఁగల, మరుత్ = దేవతాసంబంధినులగు, రంభోరువుల = అరఁటి బోదెలవంటి తొడలుగల వనితలయొక్క, కలిత=చిత్తానందములైన, మృదు= మార్దవములగు, సోగ = బారుగల-ఎడతెగని, పలుకుల=మాటలయొక్క, కలకలంబులన్ = కలకలధ్వానములచేత, గోలగోలమను = సందడిసేయుచున్న, కౌతుకాగారంబు = వివాహమంటపమును, చొత్తెంచి = చేరి, మందరి కన్యయును.

చ. ప్రభలు నభోవిటంకమున భానుమరీచులఁ బ్రోదిసేయఁ గౌ
స్తుభసిభసూత్నరత్నపరిశోభితమై గరుడాశ్మ వేదిరు
గ్విభవము పొల్పుగుంజవిక విద్రుమపాదసువర్ణపీఠిపైఁ
బ్రభుత దలిర్ప మాయు వసుపన్ వసియించె సుదంచితస్థితిన్.

టీ. ప్రభలు = కాంతులు, నభోవిటంకమునన్ = గగనముయొక్క మూఁపటి ప్రదేశమునందలి, భాను = భాస్కరునియొక్క, మరీచులన్ = కిరణములను, ప్రోదిసేయన్ = వృద్ధిపొందింపఁగా, కౌస్తుభ = కౌస్తుభ మను రత్నముతో, నిభ=సరియగు, నూత్న = నవీనములైన, రత్న = మణులచేత, పరిశోభితమై=ఎంతయు వెలుఁగొందునదియై, గరుడాశ్మ=గరుడపచ్చరాలతోఁ గూర్పఁబడిన, వేది=తిన్నెయొక్క, రుక్ = కాంతివలననైన, విభవము = ఐశ్వర్యము, పొల్పగుంజవికన్=తనరునట్టి వివాహపుసాలయందు, విద్రుమ = పవడములచే నొనర్పఁబడిన, పాద=కోళ్ళుగల, సువర్ణపీఠమైన్ = సువర్ణ సింహాసనమున, ప్రభూత=ప్రాభవము, తలిర్పన్ = అధికముకాఁగా, మామ, సమపన్ = ఏర్పఱుపఁగా, ఉదంచిత = మిగులనందమైన, స్థితిన్ = నివాసముతో, వసియించెన్ = కూర్చుండెను.

తా. అట్టు వివాహమంటపముం జేరి చక్రాని మణిప్రభలచేఁ బ్రకాశించు స్వర్ణపీఠమున గంధర్వరాజు కూర్చుండు మనఁ గూర్చుండెను.

క. విధియుతముగ ఖచరుఁ డవ
న్యధినాథున కొసఁగెఁ బసిఁడిహరివాణమునన్
మధురమఖభుగ్గవీదధి
మధురససంపర్కమైన మధుపర్కంబున్. 77

టీ. ఖచరుఁడు=గంధర్వరాజు, అవన్యధినాథునకున్ = భూభర్తయగు స్వారోచికి, విధియుతముగన్ = యథావిధిగా, పసిఁడిహరివాణమునన్ = సువర్ణపాత్రముతో, మధుర=రుచిగల, మఖభుగ్గవీ = కామధేనువుయొక్క, దధి = పెరుఁగుతో, మధురస = తేనెయొక్క, సంపర్కము = చేరికగలది, అయిన, మధుపర్కంబున్ = దధిక్షీరములు తేనె మున్నగునవి కలిపిన పదార్థము, ఒసఁగెన్ = ఇచ్చెను.

మధుపర్కమునుగూర్చి కాళికాపురాణమున నిటులఁ జెప్పఁబడెను.–

"దధిసర్పిర్జలం క్షౌద్రం సితైతాభిస్తు పంచభిః,
ప్రోచ్యతే మధుపర్కస్తు సర్వదేవౌఘతుష్టయే,
జలంతు సర్వతస్స్వల్పం సితాదధిఘృతం సమం,
సర్వేషామధికం క్షౌద్రం మధుపర్కే ప్రయోజయేత్."

పెరుఁగు, నేయి, తేనె, పంచదార, జలము అను నైదింటితో మధుపర్కమును జేయుదురు. అన్నింటిలోఁ దేనె యెక్కువభాగము కలియునుగాన మధుపర్కమని దీని నందురు. దీనినె శ్రీనాథమహాకవి "పారణఁ జేసె రాజు మధుపర్కపుఁ దేనియ" నని శృంగార నై. ఆ. ౬ లోఁ జెప్పెను.

పంచదారబదులు అరఁటిపండును జేర్చి బ్రౌనుదొరవారి వ్యాఖ్యలో వ్రాయఁబడెను. దానినే యీవలివా రనుకరించిరి. కాని యది శాస్త్రసిద్ధము గాదు.

తా. పెండ్లికుమారుఁ డగు స్వరోచికి మామ యగు గంధర్వరాజు శాస్త్రప్రకారము బంగారపుగిన్నెలో దధి, నేయి, జలము, తేనె, పంచదార కలిపి చేయు మధుపర్క మనుపదార్థమును నొసంగెను.

తే. అంచితాకృతి సాక్షాత్కరించినట్టి
రమకుఁ బ్రతివచ్చుసురమనోరమ మనోర
మ యనుదాని ననుంగుజామాతఁ గైట
భారిసరిగాఁగ నర్చించి దారవోసె. 78

టీ. అనుంగుజామాతన్ = ఇష్టుఁడైనయల్లుని, కైటభారిసరిగాఁగన్ = నారాయణునితోసరిగా, అర్చించి = గౌరవించి, అంచితాకృతిన్ = తగిన సౌందర్యముచేత, సాక్షాత్కరించినట్టి = దర్శనమిచ్చినట్టి, రమకున్ = కమలాదేవితో, ప్రతివచ్చు = సరిపోలుచున్న, సుర = దేవతలయొక్క, మనోరమన్ = చిత్తములయందు రమించునట్టి, మనోరమ యనుదానిన్ = మనోరమ యనుచున్నదానిని, దారవోసెన్ = ధారాపూర్వకముగా దానము గావించెను.

విష్ణుస్వరూపుఁడ వగు నీకుఁ గన్య నిచ్చుచున్నాఁడ ననునర్థము నిచ్చు “దాస్యామి విష్ణవే తుభ్యం” అను మంత్రముతో ఇందీవరాక్షుఁడు స్వరోచికిఁ గన్యాదానము గావించెను.

తా. గంధర్వరాజు విష్ణుమూర్తిఁ బూజించునట్లు అల్లునిం గౌరవించి లక్ష్మీసమానురాలైన ముద్దుబిడ్డను స్వరోచికి ధారాపూర్వకముగా నొసంగెను. అలం-ఉపమ.

క. తదనంతరంబ హర్షము
పొదలుమదిన్ మెట్టుఁబ్రాలపుట్టికలయొద్దన్
గదియంబట్టిన పెందెరఁ
గదియించిరి బంధుజనులు కన్యావరులన్. 79

టీ. తదనంతరంబ = ఆటుతరువాత, బంధుజనులు = చుట్టములగు వారు, హర్షము = ఆనందము, పొదలుమదిన్ = వృద్ధిపొందుచున్న చిత్తముతో, మెట్టుఁబ్రాలపుట్టికలయొద్దన్ = సేసఁబ్రాలకట్టలున్నయెడ, దంపతులకు ముందుగాఁ బెద్దరాశిగాఁ జేసి పెద్దలుపోయఁదగిన పవిత్రతండులములుగల గంపలచెంగట, కదియంబట్టిన = సమీపింపఁబట్టుకొనిన, పెందెరన్ = గొప్పతెరపట్టను, కన్యావరులన్ = వధూవరులను, కదియించిరి = చేరువ జతచేసిరి. మెట్టుఁబ్రాలపుట్టిక యన త్రొక్కుడుతలఁబ్రాలని కొందఱు. అనుకూలదాంపత్యమును చూచి బంధువులు హర్షించిరి, హర్షము మది పొదలంట యింక నతిశయించుచున్న దనుట.

తా. కన్యాదానానంతరమున బంధువులు వధూవరులను దీవనఁ బ్రాలగంపలయొద్దఁ బట్టిన తెరసమీపమునఁ జేర్చిరి.

ఉ. అప్పుడు తూర్యముల్ మొరయ మునిముఖ్యుఁ డమ్మునిలోకనవ్యప్రహం
డెప్పుడు దేల వంపఁబడు తెల్లనిచీరతెరన్ గ్రమంబునన్

గొప్పు మొగంబునట్టుఁ జనుఁగొండలుఁ దోఁప లతాంగి పోలెఁ జె
ల్వొప్పుతిలన్ సుధారసపయోనిధి పెందెరఁ బుట్టునిందిరన్.

టీ. అప్పుడు = ఆసమయమునందు, తూర్యములన్ = మంగళవాద్యములు, మొరయన్ = మ్రోఁగఁగా, ఆమ్మిథునమ్ము = ఆదంపతులు, విలోకనస్పృహన్ = ఒండొరులఁ జూచుకొనుటకభిలాషయందు, తెప్పలఁదేలన్ = ఉప్పొంగుచుండఁగా, వంపఁబడు = క్రిందికి దిగఁదీయఁబడుచున్న, తెల్లనితెరచీరన్ = తెల్లనిదగు తెరచీరయందు, క్రమంబునన్ = వరుసవెంబడిని, కొప్పు = ధమ్మిల్లమును మొగంబున్ = ముఖమును, అట్టున్ = మెడయును, చనుఁగొండలున్ = పర్వతములంబోలెఁ బెద్దవియగుచన్నులును, తోఁపన్ = కాన్పింపఁగా, లతాంగి = మనోరమ, చెల్వు = సొగసు, ఉప్పతిలన్ = పుట్టునట్లు, సుధారసపయోనిధి = క్షీరసాగరముయొక్క, పెందెరన్ = గొప్ప కెరటమునందు, పుట్టు, ఇందిరన్ = లక్ష్మిని, పోలెన్ = పోల్పఁబడియుండెను.

తెల్లనికెరటములు క్షీరసముద్రమున నుంట ప్రసిద్ధము. తెర కెరటము వలె నుండెను. మిన్నొరయునట్లు పెరుఁగుకెరటములు తగ్గునటులఁ దెరకొంచెము కొంచెముగా వంచఁబడెను. తరంగములలోనుండి లక్ష్మి బయటవచ్చినటులఁ దల మొదలుకొని యొక్కొక్కయవయవము గనిపించె ననుట. లక్ష్మీజననముచే క్షీరసాగరము విష్ణువులోనగువారికి వాసమైనటుల మనోరమావశమున నిందీవరాక్షునినగరము స్వరోచి లోనగు వేల్పుల కునికిపట్టయ్యెను. శ్రీవిష్ణువునకు వేల్పులకు క్షీరసముద్ర మునికి యనుటకు.—

"లవణజలధిరాదౌ దుగ్ధసింధుశ్చ తస్మా
దమృతమమృతరశ్మిః శ్రీశ్చ యస్మాద్బభూవ,
మహితచరణపద్మః పద్మజన్మాదిదేవై
ర్వసతి సకలవాసో వాసుదేవశ్చయత్ర."

(గోళాధ్యాయము.)

తా. అప్పుడు మంగళధ్వను లగుచుండఁగా, వధూవరులమధ్యను బట్టు కొనఁబడిన తెల్లపట్టుతెరను పేరఁటాండ్రు కొంచుకొంచుక క్రిందికి వంచునప్పుడు, ఆ తెరచాటున నుండి పెండ్లికూఁతు రగు మనోరమ క్రమక్రమముగా, కొప్పు, ముఖము, మెడ, పాలిండ్లును గనఁబడుటచే నావధువు క్షీరసాగరముయొక్క గొప్ప కెరటమువలన నుత్పత్తి యగుచున్న లక్ష్మివలె నుండెను. అలం. ఉపమ.

చ. కటకరవంబు బోరుకలఁగన్ రమణుల్ తెరచీర వంచినన్
దటుకున రాజమో మెదుటఁ దారసమైనలతాంగి నేత్రముల్
చటులత లజ్జ కల్లడిలె జాలరిచే వలఁ బాసి ధాత్రిపై
నటునిటు మిట్టిమిట్టిపడునంబుచరంబులఁ బోలె సత్తఱిన్.

టీ. ఆ త్తఱిన్ = అప్పుడు, కటకరవంబు = కంకణనినాదము, బోరు కలఁగన్ = ఘల్లురని ధ్వనింపఁగా, రమణుల్ = వనితలు, తెరచీర = తెర గుడ్డను, వంచినన్ = వ్రాల్పఁగా, తటుకునన్ = హఠాత్తుగా, రాజమోము = పెండ్లికొమరునిముఖము, ఎదుటన్, తారసమైనన్ = చేరువకాఁగా, అంతకు ముందునుండి సందర్శింప నెంచి యుత్సుకపడుకనులకు ఆకస్మికముగాఁ బ్రియుఁడు కనిపింపఁగా, లతాంగి = మనోరమయొక్క, నేత్రముల్, చటులతన్ = చంచలతవలన, లజ్జన్ = త్రపచేత, జాలరి = బోయవానియొక్క, చేవలన్ = హస్తమందలివలనుండి, పాసి = విడివడి, ధాత్రిపైన్ = నేలమీఁద, అటునిటు = అవైపునకు నీవైపునకు, మిట్టిమిట్టి = మిడిసిమిడిసి పడు, అంబుచరంబులఁ బోలెన్ = మత్స్యములవలెనే, కల్లడిలెన్ = చలించెను

తా. పెండ్లికొడుకునకుఁ బెండ్లికూఁతునకు స్త్రీలు మధ్యను బట్టిన తెర చీర వంచునప్పుడు పెండ్లికుమారునిమోము పెండ్లికొమరితకు సమీపమునఁ గాన నయ్యెను, అంతఁ బెండ్లికొమరిత తొట్రుపాటుగల నేత్రములతో మిగులఁ బ్రియముగా రాజపుత్త్రు నీక్షించెను. అలం. ఉపమ.

మ. అవనీశ త్రిదశేంద్రుచూపుబరి కన్యాగండపాళిద్వయీ
నవలావణ్యరసంబుఁ గొల్లగొని యంతన్ జెంత ఫాలంపురా
జు విలోకించి చలించి కైకొనినయాసొమ్మెల్ల ఘర్మాంబుకై
తవమొప్పన్ వెసడించి తూఱెఁగబరీతాపింఛకుంజాంతమున్.

టీ. అవనీశత్రిదశేంద్రు = రాజేంద్రునియొక్క - స్వరోచియొక్క, చూపు = చూపను, బరి = చోరుఁడు, కన్యా = మనోరమయొక్క, గండపాళిద్వయీ = చెక్కుటి ప్రదేశముల జంటయొక్క, నవ = నూతనమయిన, లావణ్యరసంబున్ = సౌందర్యమువలనఁ గలిగిన ప్రభను, ముత్తెములందుఁ దళదళలాడెడి కాంతివిశేషమువంటి మేనికాంతిని లావణ్య మందురు. తల్లక్షణ ముదాహృతము. కొల్లగొని = దోఁచుకొనిపోయి, అంతన్ = అటుల దోఁచుకొనిపోవునపుడు, చెంతన్ = సమీపప్రదేశమునందు, ఫాలంపురాజున్ = అర్ధచంద్రాకృతి గల నొసలను రాజును, విలోకించి = తిలకించి, చలించి = వణఁకి, కైకొన్నయాసొమ్మెల్లన్ = తా నపహరించిన లావణ్య మనెడి ధనమంతయుం, ఘర్మాంబుకైతవము = స్వేదబిందువు లనుమిష, ఒప్పన్ = పొందువడఁగా, వెసన్ = శీఘ్రముగా, డించి = దొంగిలించిన లావణ్యరసమును వదలిపెట్టి, కబరీ = తురుమను, తాపింఛ = చీఁకటి మ్రాఁకులయొక్క, కుంజాంతమున్ = పొదరింట, తూఱెన్ = ప్రవేశించెను.

తా. స్వరోచియొక్క వీక్షణ మనుచోరుఁడు గండభాగములయొక్క ప్రకాశ మనుద్రవ్యమును హరించి తత్క్షణమే ఫాల మనురాజుం గాంచి భయపడి స్వేద మనునెపముచేత హరించినద్రవ్యమును పాఱవైచి ధమ్మిల్లమను చీఁకటిమ్రాఁకులలో దూఱి మాటుపడియుండెను. (ఇందు స్వరోచి మనోరమయొక్క దరహాసముజిందుచెక్కులను, భ్రూలాస్యమునకు నెలవగు నుదురును, చీఁకటివలె నల్లఁగా నున్న పెన్నెఱిని క్రమముగాఁ జూచె నని భావగుంభనము చేసెను.

ఈపద్యమునందుఁ జక్షుఃప్రీతి యను మన్మథావస్థయు, స్వేద మనెడి సాత్త్వికభావము రాజునకుఁ గలిగినటులఁ దెలుపఁబడెను. అలం. రూపకము. అపహ్నుతి.

ఆ. రాజుచూడ్కి కపుడు రాజీవముఖిచూడ్కు
లెదురుకొనియె లజ్జఁ గొదికి గొదికి
జడిసి జడిసి జహ్నుసంభవాంభోవేణి
కెదురు లెక్కమీలకొదమ లనఁగ. ౮౩

టీ. అపుడు = ఆసమయమునందు, రాజుచూడ్కికిన్ = స్వరోచివీక్షణమునకు, రాజీవముఖిచూడ్కులు = మనోరమవీక్షణములు, లజ్జన్ = సిగ్గుచేత, కొదికికొదికి=సంకోచించి సంకోచించి, జడిసిజడిసి=భయపడిభయపడి, జహ్నుసంభవాంభోవేణికిన్=గంగానదీప్రవాహమునకు, ఎదురులెక్క = ఎదురుగా నీఁదు, మీలకొదమలు=చిన్నచేఁపలేమో, అనన్ = అనునటుల, ఎదుర్కొనియెన్ = ఎదురుకోలుగాఁ బోయెను.

కనులవెలుఁగులు ఆభరణకాంతులు జహ్నుసంభవావేణికవలె నుండెను. ఇరువురిచూపు లాప్రవాహమున కెదురేఁగు చేఁపపిల్లలవలె నుండెను. చేఁపలు నీటి కెదురీఁదుట ప్రసిద్ధము. నాయకునిచూపులు గంగాప్రవాహముగ నాయికచూపులు చేఁపలవలెను వర్ణించిన యీపద్యము చూడుఁడు.

తే. “చెలిఁ దఱియవచ్చు నరపాలసితదృగాళి
దారి నాదారిచూపుచా ల్దవిలి నడిచె
నపుడు గగనధునీప్రవాహంబు సొచ్చి
వేగ నెదురెక్కు మీనౌఘవిధి వహించి.”

(చంద్రికాపరిణయము, తృ. 82.)

తా. స్వరోచిని మనోరమయుఁ మనోరమను స్వరోచియుఁ నొండొరులు చూచికొన వారిచూపులు గంగాప్రవాహములకు నెదురేఁగుచున్న శావమచేఁపలవలె నుండెను. అలం. ఉత్ప్రేక్ష.

మ. తనుమధ్యా త్రివళుల్ నటింప నిలమీఁదన్ మట్టియల్ మోవఁగాఁ
గనుపాపల్ పయిఱెప్పలన్ గదియ నుత్కంఠాగ్రయై నిక్కి సా
ధునిమాళిన్ దలఁబ్రాలు వోసె నవలా దోర్మూలకూలంకష
స్తనవిస్ఫూర్తికి సందిదండల ధళల్ సాహోనినాదం బిడన్. 84

టీ. తనుమధ్యా త్రివళుల్ = సూక్ష్మమగు నడుమును కడుపుమీఁది మూఁడు మడుతలును, నటింపన్ = కదలఁగా, ఇలమీఁదన్ = పుడమిమీఁద, మట్టియల్ = కాలిమెట్టెలు, మోవఁగాన్ = ఆనఁగా, కనుపాపల్ = కంటి నల్లగ్రుడ్డులోనిపాపలు, పయిఱెప్పలన్ = మీఁదిఱెప్పలయందు, కదియన్ = దగ్గఱిల్లఁగా, ఉత్కంఠాగ్రయై = నిలువఁబడినగళాగ్రముగలదై - మెడ కొంచెముగాఁ బయికెత్తి, నిక్కి = పైకి నిగిడి, దోర్మూల = కక్షములయొక్క, కూలంకష = ఒడ్డునుదాఁకుచున్న - ప్రక్కలనొరయుచున్న, స్తన = చన్నులయొక్క, విస్ఫూర్తికిన్ = ఎక్కువకాంతికి, సందిదండల, ధళల్ = ధళధళయను ప్రకాశములు, సాహోనినాదంబిడన్ = చోపుదారులకేకలను దెలుపుచప్పుడును బుట్టింపఁగా, నవలా = మనోరమ, సాధునిమాళిన్ = భర్తయగుస్వరోచి శిరమునందు, తలఁబ్రాలు = శిరమునఁ బోయునట్టిసేసలు, పోసెను.

నడుము మిగుల సన్నముగానుండి దానిపయిని వళులు మూఁడు కని పించుట సౌందర్యాతిశయమును బ్రకటించును. ఇటువంటి వళులచే నదరు దమయంతిమధ్యమును శ్రీనాథుఁ డిటుల నభివర్ణించెను.

"కర మనర్దైన యీసుదతికౌను వళిత్రితయంబుచే నిరం
తరమయి యాక్రమింపఁబడె." (శృం. నై. ఆ. 3. ౧౯౨)

తా. మనోరమ నడుము జవ్వాడుచుండ మెట్టెలు మ్రోయుచుండ నుదుటుచూపులతోఁ జూచుచు మెడ కొంచెమెత్తి మిగుల నుత్సాహముతో స్వరోచిపై తలఁబ్రాలు పోసెను. అలం. స్వభావోక్తి.

చ. ముడివడు కంకణప్రభల ముత్తెపుసేసలు దోఁగిలించి యొ
త్తెడుతతి బాహుమూలకుచదీప్తులపైఁ బతిదృష్టి పర్వఁగన్

బొడమినలజ్జఁ బాణియుగముం వెస వంచియ మౌళిమీఁదికై
పొడవునఁ జల్లె లేనగవు పాల్తుక ఱెప్పల నప్పళించుచున్.

టీ. పాల్తుక = మనోరమ, ముడిపడు = చుట్టుకొనుచున్న, కంకణ = హస్త కంకణములయొక్క, ప్రభలన్ = ప్రకాశములతో, ముత్తెపుసేసలు = ముత్యముల తలఁబ్రాలు, దోయిలించి = రెండుచేతులతోఁ బట్టి, ఎత్తెడునెడన్ = పైకెత్తునప్పుడు, రాజుతలపైఁ బోయుటకు నెత్తుసమయమున, బాహుమూల = కక్షములయొక్కయు, కుచ = పాలిండ్లయొక్కయు, దీప్తులపైన్ = కాంతుల పయి, పతిదృష్టి = భర్తవీక్షణము, పర్వఁగన్ = అలముకొనఁగా, పొడమిన = పుట్టిన, లజ్జన్ = సిగ్గుచేత, పాణియుగమున్ = హస్తద్వయమును, వెసన్ = శీఘ్రముగా - ఇట శీఘ్రము లజ్జాతిశయమును దెలియఁజేయును. వంచియ = వంచియు, లేనగవు = చిఱునవ్వును, ఱెప్పలన్ = కనుఱెప్పలచేత, అప్పళించుచున్ = మూయుచు, మౌళిమీఁదికై = తలమీఁదికి, పొడవున జల్లెన్ = ఎగఁజిమ్మెను.

ఇందు ఉపహిత్థ మనునది చెప్పఁబడెను. అవహిత్థ మన నాకారమును మరుగుపఱుచుట.

క. "భువిలో నాకృతిగోపన, మవహిత్థ........."

క. "హారములు గరఁగ నరసు,త్సారమణుని జూడి మొక్కపలి పులకలు మై
సిరికలెత్తిన దాచును, సారెకు హారంబుజనితశైత్యం బనుచున్."
(నరసభూపాలీయము. కృతి.)

తా. మనోరమ తలఁబ్రాలు పోయుటకు ముత్తెపుసేసలు రెండుచేతులతోఁ బట్టి మీఁది కెత్తఁబోవ స్వరోచి పెండ్లికుమార్తెకక్షములపైఁ బాలిండ్లపై దృష్టినిలుపఁగ మనోరమ తెలిసికొని చేతులు మీఁది కెత్తకయే పెనిమిటి శిరమునఁ బడునట్లు లెగఁజిమ్మెను.

క. సకలక్ష్మాపతి యుడుఁ గో
ష్మకశంబులనుండి రాలె మౌక్తికములు సా

త్త్వికజనితగండఘర్మాం
బుకదంబాసారగరిమఁ బునరుక్తము లై. 86

టీ. సకలత్మాపతి = సర్వప్రపంచమునకు భర్తయగు స్వారోచి, ఇడఁగ = తలఁబ్రాలు పోయఁగా, కొమ్మకచంబులనుండి = మనోరమకొప్పునుండి, మౌక్తికములు = ముత్తెములు, సాత్త్విక = సాత్త్వికభావమున, జనిత = కలిగిన, గండ = చెక్కులయందలి, ఘర్మాంబు = స్వేదజలముయొక్క, కదంబ = సందోహము యొక్క, ఆసార = విధివిరామములేక వర్షించు వర్షముయొక్క, గరిమన్ = విశేషముచేత, పునరుక్తములై = రెట్టించినవై, రాలెన్ = జలజల రాలెను.

స్వేదము సాత్త్వికలక్షణము లెనిమిదింటిలో నొకటి.
"సాత్త్వికా ఇతి జానంతి భరతాద్యా మహర్షయః,
తే స్తంభస్వేదరోమాంచ స్వరభేదాశ్చ వేపథుః,
వైవర్ణ్యమశ్రుప్రళయావిత్యష్టౌ పరికీర్తితాః."
(సింగభూపాలీయము)

ఇట స్వేదము హర్షాతిశయముచే జనించెను. స్వేదకారణము లిటుల నాలంకారికులచే నిర్ణయింపఁబడెను.—

"నిదాఘహర్ష వ్యాయామశ్రమక్రోధభయాదిభిః స్వేదస్సంజాయతే;
రోమాంచో విస్మయోత్సాహ హర్షాద్యైః"

తా. స్వారోచి తలఁబ్రాలు వోయ మనోరమశరీరమునఁ జెమ్మటఁబట్టి యా స్వేదబిందువులును తలఁబ్రాల ముత్తెములును గలిసి రెట్టింపయి మేఘము వలె నున్న శిరోజములనుండి వానకురిసినరీతిని రాలెను. అలం-ఉపమ.

క. పతి సతిపై నిడుముక్తా
వితతి బడఁగ దొడఁగె వడి భవిష్యత్పురుషా
యితనిర్దయరతిరభస
చ్యుతసితకబరీప్రసూనసూచక మగుచున్. 87

టీ. పతి = భర్తయగుస్వారోచి, సతిపైన్ = భార్యయగు మనోరమ మీఁద, ఇషు = పోయునట్టి, మౌక్తావళి = ముత్యములసముదాయము, ప్రథమవ్యాల్ = మంచిరికాలమునందలి, పురుషాయిత = పురుషునివలెఁ జేయునట్టి, నిర్దయ = దయలేని, రతి = సంభోగముయొక్క, గాఢమయిన పురుషాయిత రతియొక్క - పురుషాయితమునందుఁ బురుషునికంటె స్త్రీకి శ్రమ బలీయము గాన నిర్దయ మని చెప్పఁబడెను. రభస = తొట్రుపాటుచేత, చ్యుత = జారునట్టి, సిత = ధవళిమగల, కబరీ = తురుమునందలి, ప్రసూన = పువ్వులను, సూచకము = తెలియఁజేయునది, అగుచున్ = అయి, పడిన్ = వేగముతో, పడఁ దొడఁగెన్ = రాలసాగెను.

పురుషాయితమునందుఁ దెప్పెలినుండి పూవులు రాలుట సహజము. ఇటు లనుటకు.

"మేఘో వర్షతి మీనకేతువిశిఖాన స్త్రం సముత్కంపతే"

(బిల్హణీయము.)

పురుషాయితసౌఖ్యము సౌభాగ్యాతిశయము గలపురుషులకె లభించును గాన స్వారోచి భాగ్యాతిశయ మనన్యసాధ్యము.

"వల్గత్కుచం వ్యాకులకేశపాశం స్విద్యన్ముఖం స్వీకృతమందభాసం
పుణ్యాతిరేకాత్పురుషా లభంతే పుంభావమాభోగవతాం చ నారాః."

(శార్ఙ్గధరపద్ధతి)

తా. స్వారోచి మనోరమతలపైఁ దలఁబ్రాలు పోయ నాముత్యంపు సేసలు తలనుండి పడుట యెట్లుండెననఁ ముందు మనోరమ చేయఁబోవు సంభోగసమయమందు శిరోజములనుండి పడు తెల్లనిపువ్వుము లిట్లే యుండు నని సూచించుచున్నదో యనునట్లున్నది. అలం. ఉత్ప్రేక్ష.

శా. కట్టెన్ మంగళసూత్రమున్ శరధిశంఖశ్రీలకున్ బొమ్మలన్
గట్టెన్ జాలెమకంఠపీఠి నిఖలత్సౌభాగ్య శోణద్యుతుల్ .

దట్టంబై నఖకోరకోత్కరము తద్గ్రైవేయ హైమస్ఫుర
త్పట్టస్థాపితపద్మరాగములపంతంబుల్ విడంబింపఁగాన్. 88

టీ. నిఖిలక్ష్మాభర్త = చక్రవర్తియగు స్వరోచి, శోణద్యుతుల్ = రక్తకాంతులు, దట్టంబై, నఖ=గోళ్లనెడి, కోరక = మొగ్గలయొక్క, ఉత్కరము = సముదాయము, తత్ = ఆమనోరమయొక్క, గ్రైవేయ = కంఠభూషణమైన, హైమ = స్వర్ణపుదైన, స్ఫురత్ = ప్రకాశించుచున్న, పట్ట = పట్టెడయందు, స్థాపిత = కూర్పఁబడిన, పద్మరాగముల = పద్మరాగమణులయొక్క, పంతంబుల్ = కాంతులయతిశయములు, విడంబింపఁగాన్ = అతిశయింపఁగా, శరధి = కడలియందలి, శంఖ = శంఖములయొక్క, శ్రీలకున్ = సంపత్తులకు, బొమ్మలంగట్టన్ = గెలుచుకొని తదాకారములు చెక్కిన బిరుదులను ధరింపఁగా, గెలిచినవారోడినవారియాకారాదులను గండపెండేరములయందో తమ్మపడిగెలందో చెక్కించుట ప్రసిద్ధము. చాలెడు = చాలినట్టి, కంఠపీఠిన్ = కుత్తుకయందు, మంగళసూత్రమున్ = తాళిబొట్టును, కట్టెన్ = కట్టినవాఁడాయెను.

పద్మరాగము మానవులకు లభ్యముగాదు. వేల్పుచెలువ గావున మనోరమకు లభించెను.

క. "చెక్కుతెఱంగులఁ గడుఁ జెం
పెక్కినయామానికముల కెల్లను మొదలై
చొక్కమగు పద్మరాగము
లెక్కింప నమూల్య మది నిలింపుల కమరున్." (రత్నపరీక్ష)

తా. ఎఱ్ఱగా నఖములు పద్మరాగమణులవలెఁ బ్రకాశించుచుండఁగా స్వరోచి శంఖమును మీఱి వెలుఁగున్న మనోరమకంఠమందు మంగళసూత్రముం గట్టెను. అలం-ఉపమ.

క. అట్టియెడఁ బెండ్లిపనులకు
దిట్టలగు పురంధ్రు లచట నిలిపిరి వహ్నిన్

బెట్టిరి మణిపీఠి సురీ
పట్టము పైఁ బఱచి రందుఁ బతియును సతియున్. 89

టీ. అట్టియెడన్ = ఆమంగళసూత్రము గట్టునట్టిసమయమునందు, పెండ్లి పనులన్ = పెండిలికార్యములను, దిట్టలు=తగినవారు, అను, పురంధ్రులు=పతివ్రతలగు పేరఁటాండ్రు, అచటన్ = ఆ పెండ్లియరుగుసమీపమునందు, వహ్నిన్ = అగ్నిహోత్రమును, నిలిపిరి = ఉంచిరి. మణిపీఠిన్ = రతనంపుఁ బీఁటను, పెట్టిరి=వేసిరి, పైన్=పీఁటమీఁద, సురీ=సురీ (సూరత్) దేశసంబంధమయిన, పట్టము = పట్టునేఁతవస్త్రము, పఱచిరి = పఱపుగాఁ గప్పిరి. అందున్ = అటులఁ బట్టుతాపితా గప్పిన పెండ్లిపీఁటయందు, పతియున్ = స్వరోచియు, సతియున్ = మనోరమయును. ముందరి కన్వయము.

తా. మంగళసూత్రధారణము కాఁగానే పేరఁటాండ్రు కళ్యాణవేదికయందుఁ బెండ్లిపీఁట వైచి యాపీఁటమీఁద సూరతుపట్టుసేలను బఱచి దానికిముందు హోమమునకై యగ్నిఁ దెచ్చి యుంచఁగాఁ బెండ్లికుమారుఁడును బెండ్లికూఁతురును నాపీఁటమీఁదఁ గూర్చుండిరి.

క. ఆశుద్విజహుతహరితశ
మీశాఖాశకలనినద మేదురవిశదా
భీశుజ్వాలాజాలహు
తాశక్రోడమున వేల్చి రాహుతు లెలమిన్. 90

టీ. ఆశు=శీఘ్రముగా, ద్విజవిప్రులచేత, హుత = హోమము చేయఁబడిన, హరిత = పసుపురంగుగల, శమీశాఖాశకల = జమ్మిపుడకలయొక్క - జమ్మిసమిధలయొక్క యనుట, నినద = చిటపటమనుధ్వనులతో, మేదుర = దట్టముగా నున్న (జమ్మిసమిధ లనుటకంటె జమ్మిచివ్రకొమ్మ లనుటయె సమంజసము. శాఖాశకలములు = కొమ్మలతునుకలు రెమ్మలు అని చెప్పనగును. "పరిమళశ్లాఘనపశమీపల్లవాగ్రహుతహుతాశనజిహ్వాసముత్థము." (శృంగారనైషధము

ఆ. ౬-ప. ౧౦౩.) విశద = నిర్మలమయిన, అభీశు = కాంతిగల,జ్వాలా = జ్వాలలయొక్క, జాల=సముదాయముగల, హుతాశ = అగ్నిహోత్రుని యొక్క, క్రోడమునన్ = మధ్యను, ఎలమిన్, ఆహుతులు = హోమద్రవ్యములను - నేయిమొదలగుహోమవస్తువులను, వేల్చిరి = హోమముచేసిరి.

తా. అప్పుడు బ్రాహ్మణులు జమ్మిపుడకలతో జ్వాల గావించి యగ్నిహోత్రమునందు మంత్రసహితముగా నేయి మొదలగు హోమద్రవ్యములతో హోమము చేసిరి.

తే. తోయజామోద లాజలు దోయిలించి
ప్రమదమున వేల్వ నొకకొన్ని చెమట నంట
వ్రేళ్ల గనుపట్టెఁ గెంజాయ వీతిహోత్రు
నాలుకలు పాటి రాకున్న నవ్వొ ననఁగ. 91

టీ. తోయజామోద = తామరపూవులతావివంటిమేని తావిగల మనోరమ, లాజలు=పేలాలు, దోయిలించి = రెండుచేతులఁబట్టి, ప్రమదమునన్= కుతుకముతో, వేల్వన్=హోమమొనర్పఁగా, ఒకకొన్ని, చెమటన్=స్వేదముచేత,అంటన్=చేతికంటుకొనఁగా, వ్రేళ్లన్=మనోరమచేతివ్రేళ్లు, కెంజాయన్= రక్తవర్ణముచేత, వీతిహోత్రు = అగ్నియొక్క, నాలుకలు=మంటలు, పాటి రాకున్నన్=ఈడు రాకుండఁగా, నవ్వన్ = అగ్నిజ్వాలలను వెక్కిరించుటలో మాతో సరిగా రని నవ్వెను, అనఁగన్=అనునట్లు, కనుపట్టెన్ =అగపడియెను. పేలాలకును నవ్వునకును ధవళకాంతి సమానధర్మము. ఎఱ్ఱనివ్రేళ్లకును అగ్ని జ్వాలలకును రక్తకాంతి సమానధర్మము. భర్తకు దీర్ఘాయుఃప్రాప్తికై భార్యచే వివాహమునందు లాజహోమము చేయింతురు.

మంత్రము —"దీర్ఘాయురస్తు మే పతి ర్జీవాతుశ్శరదశ్శతం."

తా. మనోరమ లాజహోమమప్పుడు రెండుచేతులనుజోడించి పట్టిన కొన్నిలాజలు చెమటచే నంగుళముల నంటుకొన నవి శ్వేతవర్ణముచే నివ్వు

లేపితా ధూపితా సూతే ఫలం శాఖీవ దాడిమీ
అవిక్షార్థేన సంసిక్తా ధూపితా తత్తరోఽపిభిః
ఫలాని దాడిమీ సూతే సుబహూని పృథూని చ."

తా. పుష్పించిన దానిమ్మవలె నున్న మనోరమయొడలిపై హోమ ధూమము పడి దానిమ్మకొమ్మయందు రతిరూప మగు పండు పండుటకై చేయు దోహదక్రియవలెఁ గన్పట్టె ననుట. దానిమ్మపైఁ బొగఁ బ్రసరింపఁజేయుట దోహదవిశేషము. అలం. రూపకము, ఉత్ప్రేక్ష.

మ. జగతీనాథపతంగమ మానతశిరస్సమ్మేళనన్ నెయ్యపుం
జగడంబుల్ ప్రియ మొప్ప మాన్పెడుతఱిన్ జంచత్కిరీటాగ్రర
త్నగణస్పర్శసహంబు గావలసియో నాఁ గోర్కి దైవాఱ న
మ్మగువన్ బాదతలంబు పట్టి సనెకల్ మట్టించె మోదంబునన్.

టీ. జగతీనాథపతంగమము = భూపతులమిన్న యనుస్వరోచి, ఆనత = వంపఁబడిన, శిరః = శిరస్సుయొక్క, సమ్మేళనన్ = కూడికతో, నెయ్యపుం జగడంబుల్ = ప్రణయకలహములు, ప్రియము = అనురాగము, ఒప్పన్, మాన్పెడుతఱిన్ = ఉడిగించునపుడు, చంచత్ = ఒప్పుచున్న, కిరీటాగ్ర = బొమిడికమునందలి, రత్నగణ = రత్నసముదాయముయొక్క, స్పర్శ = స్పర్శమును, సహంబు = సైఁచుట, కావలసియో=కోరియో - ముందవసర మగుట నపేక్షించియేమో, నాన్=అనునట్లుగా, కోర్కి = కోరికి, దైవాఱన్ = మిక్కుటము కాఁగా, మోదంబునన్ = కుతూహలముతో, అమ్మగువన్ = ఆమనోరమను, పాదతలంబు = అరికాలు, పట్టి, సనెకల్ = సన్నెకల్లును, మట్టించెన్ = త్రొక్కించెను.

లకారసహితలంవర్ణమునకు ఉత్వాగమము విభాషనగు ననుటకు "లకార యుక్తస్య లోపోచ్చారస్య వా లుక్స్యాత్. పందిళ్వేసి, అంబల్దాచి, పందిళ్లువేసి, అంబల్లుగాచి ఇత్యాది. వీరుకోళ్లొక్కలకోలమంచు. ఆముక్తమాల్యద."

(అహోబలపండితీయము.)

తా. వ్వరోచి శిరస్సు వంచి వధువృపాదము పట్టుకొని సన్నెకల్లు మెట్టించెను. అది యిటులై జరుగునట్టి ప్రణయకోపమును బోఁగొట్ట నమస్కరించుతఱి కిరీటమందుఁ గూర్పఁబడినమణులుగూడ శిలలే కావున వాని యొక్క రాపిడిని సహించుట కభ్యాసము చేయునిమిత్త మామె కాల్లు తగులు నట్లు శిరస్సువంచి సన్నెకల్లు మెట్టించెనేమో యనున ట్లుండెను. అలం. ఉత్ప్రేక్ష.

క. కడు నవ్వించుచుఁ జెఱఁగులు
ముడివెట్టఁగ పేరఁటాండ్రు ముదిత కనుబొమల్
ముడివెట్టె నాలిసిగ్గున
ముడివెట్టెఁ నారి చెఱకువిల్తుని మఱఁదున్. 95

టీ. పేరఁటాండ్రు = పేరంటము చేయుటకు వచ్చినసువాసినులు కడున్ = విశేషముగా, నవ్వించుచున్ = నవ్వులాటలుఁ జేయుచు, చెఱఁగులు = కొంగులు, ముడివెట్టన్ = ముడివేయఁగా, ముదిత = మనోరమ, నాలిసిగ్గునన్ = చిఱులజ్జచేత, కనుబొమల్ముడివెట్టెన్ = (ఆ ప్రసంగమునం దిష్టము లేనిదాని వలె) మొగము చిట్లించి బొమముడివైచెను. మఱఁదున్ = మాఱఁడును చెఱకువిల్తునన్ = చెఱకు మొక్కరొక్క వింటివాఁడు, నారి = అల్లెత్రాటిని, ముడివెట్టెన్ = ముడివేసెను - నారిని సంధించెను.

తా. వధూవరులచీరచెఱఁగులు ముత్తైదువలు నవ్వులాటగా ముడివెట్టి మనోరమ లజ్జచేఁ గోపపడినట్లు కనుబొమలు ముడివైచె నరియుం వెంటనే పెండ్లికుమారునకుఁ బెండ్లికూఁతునకు నన్యోన్యానురాగము కలిగె ననియుఁ దాత్పర్యము. అలం - అనృత్తిదీపకము.

సీ. పరిణమించిరి ధరామరపురంధ్రీహస్త
ఘటితచేలాంచలగ్రంథికలనఁ

బరిపూర్ణనిష్ఠఁ గొల్చిరి ప్రదక్షిణపూర్వ
  వినతి నాలుకలార్చు వేఁడివేల్పు
వీక్షించి రుడువీథి నక్షీణసుస్థితి
  స్థాయిఁ దోషితరమాధవుని ధ్రువునిఁ
బరిణయప్రాప్తసప్తర్షిప్రియాప్రేక్ష్య
  సాక్షాదరుంధతీసతి కెరఁగిరి

తే. సకలసంయమిగణనమస్కారణకృత్య
  మాచరించి తదీయహస్తాభిమంత్రి
తాక్షతలు మౌళిఁ దాల్చిరత్యాదరమున
దంపతులు బంధుకోటి కుత్సవ మెలర్ప. 96

టీ. దంపతులు=వధూవరులు, బంధుకోటికిన్=చుట్టములకు, ఉత్సవము=సంతోషము, ఎలర్పన్ = అతిశయింపఁగా, ధరామరపురంధ్రీ = బ్రాహ్మణులయిన పేరఁటాండ్రయొక్క-హస్త = కరములచే, ఘటిత = చక్కఁ జేయఁబడిన, చేలాంచలగ్రంథికలనన్ = చెఱఁగులయొక్క ముళ్లుకలయికచే, పరిణమించిరి = కౌతుకపడిరి. నాలుకలార్చు వేఁడివేల్పున్ = జిహ్వాలు కదలించుచున్న వీతిహోత్రుని - జ్వాలలచేఁ బ్రకాశించు నగ్నిహోత్రుని, ప్రదక్షిణపూర్వవినతిన్ = ప్రదక్షిణపూర్వకమగు మ్రొక్కుచేత-ముందుఁ బ్రదక్షిణమును దావల నమస్కారమును గావించి యనుట, పరిపూర్ణనిష్ఠన్ = ఎక్కువ నియమముతో, కొల్చిరి. వధూవరు లగ్నిహోత్రునిచుట్టుఁ బ్రదక్షిణముగా నేడడుగులు తిరుగుట సప్తపది. "సఖ్యా సాప్తపదీనం స్యాత్" అను ధర్మానుసారముగా నగ్ని చుట్టును సఖ్యార్థులై దంపతులు దిరిగిరి. ఉడువీథిన్=తారాపథమందు, అక్షీణసుస్థిరస్థాయిన్=క్షీణముగాని నివాసముతో నుండెడివానిని, తోషిత = సంతోషపెట్టఁబడిన, రమాధవునిన్=శ్రీనాథుఁడు గలయాతనిని, ధ్రువునిన్=ఉత్తానపాదునికుమారుని, వీక్షించిరి=(ఆయుర్వృద్ధికై) కాంచిరి.

భక్తిమునందు, కల్పవనికా = ఈవి మ్రాఁకులతోఁటయందు, జని = పుట్టిన పుట్టువుచేత, కాంతములు = హృదయానందములు, ఐనచీరలున్ = అయినబట్టలును, హారవిభూషణావళియున్ = ముత్యాలహారములు మొదలగునగల సందోహమును, ప్రియంబుతోన్ = ప్రేమతో, ఆమిథునంబునకున్ = ఆవధూవరులకు, నారదమౌనిచేత, అదనన్ = సమయమందు, కుబేరు పేరుగాన్ = తండ్రియగుకుబేరుని పేరిట, చదివించెన్ = ఆశీర్వదింపఁజేసెను.

తా. ఆశీర్వచనముఁ జేయునప్పుడు తనమంత్రితో, కర్తవ్యము యోజించి వధూవరులకు నలకూబరుఁడు తన జనకుఁడైన కుబేరుని పేరిటఁ గల్పవృక్షజన్యము లగుపుట్టములను నలంకారములను నారదమహామునిచేఁ జదివింపఁజేసెను.

క. కలిమి మెఱయంగ మఱియుఁ
గలబాంధవు లొసఁగి రపుడు కాంచనమణిభూ
షలుఁ జీరలు నరపతికిఁ
బొలఁతికి నుడుగరలు ముదము పొదలఁగ నంతన్. 97

టీ. అపుడు = కట్నములొసంగు నాసమయమునందు, మఱియున్ = నలకూబరుఁడు చదివించినపిమ్మట, కలబాంధవులు=ఉన్నబంధువులు, కలిమి = సంపద, మెఱయంగన్ = ప్రకాశింపఁగ, కాంచనమణిభూషలున్ = రత్నమయస్వర్ణాలంకారములును, చీరలును, ముదము = ఆనందము, పొదలఁగన్ = వృద్ధిపొందఁగా, నరపతికిన్ = రాజైన స్వరోచికిని, పొలఁతికిన్=మనోరమకును, ఉడుగరలు = కానుకలుగా, ఒసఁగిరి = అర్పించిరి. అంతన్, ముందటి కన్వయము.

ఉడుగర యనఁ గానుక యనుటకు.—

తే. "కడఁక రాజింగమున నుడుగర యొసంగె."

(అచ్చతెనుఁగురామాయణము. యు. కాం.)

తా. నలకూబరుఁడు కట్నములు చదివించిన తరువాత(దక్కినబంధువు లందఱును దమకుఁగల కొలఁదిఁగా బంగారునగలు, చీరలు, పెండ్లికొమరున కును పెండ్లికూఁతునకును గానుకలు చదివించిరి.

సీ. పొగడపూవంటికంపులమదాంబువులును
  మధువర్ణదంతకాండములు మెఱయ
భీకరస్వరచారుబృంహితంబులు ఘనాం
  గారకగ్రహకాంతికన్ను లమర
నిలఁ జుట్టువడు తొండముల మించుపూర్వాంగ
  మెత్తరంబై పిఱుం దత్తమిల్లఁ
గటము లుత్కటములై నిటలముల్ బటువులై
  సిబ్బెంపుమొగముల నుబ్బు మీఱ
తే. స్వర్ణకక్ష్యాంకుశప్రాసకవధికాగ్ర
  ఘటకుథఘంటికాద్యలంకృతులఁ జెలువ
  మెసఁగు గంభీరవేదిభద్రేభశతము
  నల్లునకు నిచ్చె గంధర్వవల్లభుండు. 98

టీ. పొగడపూవంటి = వకుళపుష్పమువాసనవంటి, కంపుల=సౌరభము గల, మదాంబువులును = మదోదకములును, మధువర్ణ = తేనెరంగుగల, దంత కాండములు=వజ్రాయుధసదృశము లగుదంతములును, మెఱయన్ = ప్రకాశిం పఁగా; తేనె రక్తవర్ణగణములోనిది, కాన నేనుఁగుదంతము లెఱ్ఱగా నుండె నని చెప్పఁబడెను. శ్లో. "హింగులం మధురక్తాని, స్ఫులింగావా స్త్రిదివసః." భీకర= భయంకరములగు, స్వర = కంఠధ్వనితోడి, చారు = మనోహరము లయిన, బృంహితంబులు = ఘీంకారములును, ఘన = గొప్పదియగు, అంగారకగ్రహ= అంగారకగ్రహముయొక్క, కాంతి= ప్రకాశమువంటి ప్రకాశముగల,కన్నులు= నయనములు, అమరన్ = ఒప్పఁగా, ఇలన్ = పుడమియందు, చుట్టువడు =

చుట్టగా చుట్టఁబడుచున్న-మిక్కిలిపొడవులైన, తొండములన్ =తొండములచేతను, మించుమూర్వ్యాఁగము = అతిశయించు మూఁపటిభాగపుశరీరము, ఎత్తరంబై=పొడవై, పిఱుందు=వెనుకప్రక్కశరీరము, అత్తమిల్లన్ = తక్కువదై యుండఁగా, కటములు=గండభాగములు, ఉత్కటములై =విపులములై, నిటలములన్=నుదుళ్లు, బటువులై=గుండ్రమైనవై, సిబ్బెంపుమొగములన్=మచ్చలుగల మోములయందు, ఉబ్బు=ఉబుకు, మీఱన్=విశేషింపఁగా, స్వర్ణ=బంగరు మొగాముగల, కక్ష్య = నడికట్టుపట్టు, అంకుశ = అంకుశము, ప్రాస=ఈఁటె, శరధి=బాణములపొది (తూణీరము), శార్ఙ్గ=శిరములవిల్లు, ఖేట = డాలువాలు, కుథ=పైనఁబఱచుకంబళి, ఘంటికా=గంట, ఆది = మున్నగువానిచేతనైన, అలంకృతులన్ = అలంకారములచేతను, ఔలుపము = చక్కఁదనము, ఎసఁగు = వృద్ధియగునట్టి, గంభీరవేది = తెంపులేని మదముతోఁ గూడినవైన, భద్రేభశతమున్ = నూఱుభద్రగజములను, గంధర్వవల్లభుండు = ఇందీవరాక్షుఁడు, అల్లునకున్ = అల్లుఁడగుస్వరోచికి, ఇచ్చెన్ = ఒసంగెను.

శ్లో. "త్వగ్భేదాచ్ఛోణితస్రావాన్మాంసస్య చ్ఛవసాదపి,
ఆత్మానం యో న జానాతి స స్యాద్గంభీరవేదికః."

అని గంభీరవేదిగజలక్షణము.

మేనిపైని చర్మ మూడిపోయినను రక్తము గారుచున్నను మాంసము ఊడుచున్నను తన్నుతా నెఱుంగక యుద్ధములోఁ బాటుపడు మత్తుటేనుఁగును గంభీరవేది యని యందురు. ఇది మృగచర్మీయగ్రంథకర్తమతము. రాజపుత్రీయమునం దీయంశమె.

శ్లో. "చిరకాలేన యో వేత్తి శిక్షాం పరిచితామపి,
గంభీరవేదిర్విజ్ఞేయస్స గజో గజవేదిభిః."

గమనాదిశిక్షలం బహుకాలములకు గ్రహించుగజమును గంభీరవేది యని యందురు.

తా. అవయవసౌష్ఠవము గలిగినట్టియు, బహువిధాలంకారశోభితములునగు నూఱు భద్రజాతియేనుఁగులను గంధర్వరాజైన యిందీవరాక్షుఁడు అల్లుఁ డగుస్వరోచికి అరణముగా నిచ్చెను. అలం. స్వభావోక్తి-ఉదాత్తము.

శా. ఉర్వీజానికి మాము యిచ్చె శిఖిపింఛోద్భాసివర్ణంబుచే
నర్వాచీనఘనాళి రోహితసహస్రాకీర్ణగా మింటఁ బూ
షార్వస్తోమముఁ జిత్రయానముల నూటాడించుగాంధర్వగం
ధర్వవ్యూహము దీప్తిచండమణికాండస్వర్ణసన్నాహమున్.

టీ. మామ = మామ యైన యిందీవరాక్షుఁడు, ఉర్వీజానికిన్ = భూభర్తయగుస్వరోచికి, శిఖిపింఛోద్భాసివర్ణంబుచేన్ = మయూరపింఛవర్ణముగలిగి ప్రకాశించు రంగుచేత, అర్వాచీనఘనాళి = భూమికి దిగిన మేఘసమూహము, రోహిత = కుటిలత లేని యింద్రధనువులయొక్క, సహస్ర = వేయింటిచేత, ఆకీర్ణగాన్ = వ్యాపించినదగునట్లుగా, దీప్తి = ప్రకాశముచేతన్, చండ = మిగులఁ బ్రకాశించుచున్న-తీక్ష్ణముగా నొప్పుచున్న, మణికాండ = మణిసముదాయములు సమకూర్చిన, స్వర్ణసన్నాహమున్ = స్వర్ణకవచము గలవానిని, మింటన్ = ఆకసమునందు, పూషార్వస్తోమమున్ = సూర్యాశ్వసమూహమును, చిత్రయానములన్ = చిత్రగమనముచేత, ఊటాడించు = ఊట్లూఁతలూఁగించునట్టి - అతిశయించుచున్నయనుట, గాంధర్వ = గంధర్వులదయిన, గంధర్వవ్యూహమున్ = అశ్వసమూహమును, ఇచ్చెను.

తా. మామ యల్లునికి నెమలిపురివంటి కాంతిగలిగి వంకరలులేని వేయింద్రధనువులతోఁ గూడి భూమికి దిగివచ్చిన మబ్బులో యనునట్లు మిగులఁ బ్రకాశించుచుండు మణులు గూర్చినపక్కెరలు వైచినవానిని, నభమునఁ జరువిడు సూర్యహయములను నీసడింపఁజాలిన విచిత్రగమనములు గలవానిని, తండోపతండము లగుహయములను గానుకగా నొసంగెను. అలం. ఉపమ - ఉత్ప్రేక్ష.

క. తళతళనితరణిమెఱుఁగులఁ
తలతల మసమణుల మెఱసి తలఁచినచోటన్
నిలుచువిమానము ఖేచర
కులతిలకుఁడు కూర్మిపెండ్లికొడుకున కొసఁగెన్. 100

టీ. ఖేచరకులతిలకుఁడు=గంధర్వరాజైన యిందీవరాక్షుఁడు, తళతళని తరణిమెఱుఁగులన్ = తళతళమని ప్రకాశించు సూర్యకాంతులను, తలతలము= తప్పుకొనుము-తొలఁగుము తొలఁగుము, అనుమణులన్ = అనునట్టి రతనముల చేత, మెఱసి = వెలిఁగి, తలఁచినచోటన్=తలఁచుకొనిన ప్రదేశమందు, నిలుచువిమానమున్ = నిలుచునట్టియాకాశమునఁబోవు తేరును, కూర్మి పెండ్లి కొడుకునకున్ = ప్రేమగలయల్లునికి, ఒసఁగెన్.

ఇందీవరాక్షు, డాకాశగమనశక్తి గలవాఁడుగాన ఖేచరకులతిలకుఁడు-కూరిమి పెండిలికొమారున కపూర్వవస్తు వరణముగా నొసంగవలయుఁగాన రత్నస్థగితమును అనుకొన్నచోట నాగునదియు నగువిమానరాజము నొసంగెను. అపూర్వానర్ఘ్యమణిస్థగిత మనుటకు సూర్యప్రకాశమును గాదనుటయే తార్కాణము.

తా. ఇందీవరాక్షుఁడు ప్రేమాస్పదుఁ డైనయల్లుఁ డగుస్వరోచికి సూర్యకాంతిని దిరస్కరించునట్టి రత్నములచేఁ బ్రకాశించుచు నాఁగు మనిన తావున నాఁగునట్టి విమానమును కానుకగా నిచ్చెను.

వ. మఱియు రజతమహారజతశయ్యాసనభాజనడోలాకలాచికా ఘటకటాహపీటికాపేటికాదిగృహోపకరణంబులును, మరకత కురువిందపురుషరత్నపురందరమణిమౌక్తికాదిమహారత్నఘటితకటకతులాకోటి కంఠికాంగదైకావళీకాంచీకోర్మికాదికలాపకలాపంబులును; విచిత్రనేత్రపేశలకౌశేయ చీనాంశుకధట్టంబులం జెట్టినట్టిపెట్టియలును, అమూల్య

గరుమ్మృగమద సంకుమదకుంకుమపటీర కర్పూరహిమాంబుపూరంబులు దట్టుపునుంగు నగరుసత్తును మంచిగందవొడి చాఁదుదయభాస్కరంబు లోనుగాఁ గలపరిమళద్రవ్యసంభారపరంపరలును, జవ్వనంపుఁగ్రొవ్వున నివ్వటిల్లి మవ్వంపువాతెఱలు విప్వ నవ్వునునుసోగవెన్నెలలం గలిసి పిసాళించు చంచల దృగంచలప్రభలఁ బచారించి, మెఱుంగుఁజన్నులఁ గన్నెతమ్మిమొగ్గలవన్నె నటమటించి, పెన్నెఱుల మెఱుంగుఁదుమ్మెదవన్నెఁ దటమటించి, సన్నడుముల విన్ను వెన్నుదన్ని, బటువు మిగిలి విటనికాయంబు రాయిఁడిం బడి పుటపుటనైన కూలంకషచాటువుల మాటకారితనంబు మెఱసి నాగరికపుఁబనులగరగరికలఁగళరవచ్ఛలాలాపాచరణంబుల మిసమిసలఁ బస గలిగి మేలిమైనకులుకుల రసికజనంబులమనంబుల మరులు కొలుపఁ జాలి సురుచిరాభరణభూషితం బగు పరిచారికాసహస్రంబును గూఁతునకు నరణంబుగా నిచ్చి మఱియును. 101

టీ. మఱియున్ = ఇంతియేగాక-షట్కుల విమానాదికముల నొసంగు-టయేగాక, కూఁతునకున్ = కూఁతురగుమనోరమకును, రజత = వెండివియు, మహారజత = బంగారువియు నగు, శయ్యా = శయ్యలు, ఆసన=పీఠములు, భాజన = పళ్లెరములు, డోలా = ఉయ్యెలమంచములు, కలాచికా = తమ్మపడిగములు, ఘట = బిందెలు, కటాహ = బరిణెలు, వీటికాపేటికా = పాందానులు - తాంబూలము వేసికొనుటకు ఆకులు వక్కలు నుంచికొను పెట్టెలు, ఆది = మున్నగు, గృహోపకరణంబులును = ఇంటిపనిముట్లును, మరకత = పచ్చలు, కురువింద = కెంపులు, పురుషరత్న = రవ్వలు, వీనిని వజ్రా లనిగూడ యందురు. పురందరమణి = ఇంద్రనీలములు, మౌక్తిక =

ముత్తెసములు, ఆది = మున్నుగు. మహారత్న = ఘనమణులచేత, ఘటిత = కూర్పఁబడిన, కటక = కడియములు. తులాకోటి = అందెలు, కంఠికా = కంఠెలు, అంగద = భుజకీర్తులు. ఏకావళీ = ఒక్కపేటగల రత్నహారములు, కాంచికా = మొలత్రాళ్లు, ఊర్మికా = ఉంగరములు, ఆది = మొదలయిన, కలాప = భూషణములయొక్క, కలాపంబులు = సముదాయములను, విచిత్ర=మిక్కిలి చిత్రములయిన, పేశల=మృదువులైన, కౌశేయ=పట్టుతో నేసిన, చీనాంశుక = చీనదేశపువస్త్రములయొక్క, ఘట్టంబులన్ = సముదాయములను, పెట్టెవట్టి పెట్టెలను=పొంచినట్టి పేటికలును, అమూల్య = విలువ లేని, అగరు = దేవగంధపుఁజెక్కలు, మృగమద = కస్తూరి, సంకుమద = జవ్వాజి, కుంకుమ = కుంకుమపూవు, పటీర = మంచిగంధము, కర్పూర= పచ్చకర్పూరము, హిమాంబుపూరంబులు=పన్నీటిప్రవాహములు, పూరమనుటచే వలసినంతపన్నీ రనుట, పూవులందుఁ గాలిన మంచుబిందువులనుండి తీయు నదిగావున పన్నీటిని హిమాంబు వందురు, "సీ. మోహాపవేళల మోముద్రితములైన కనుల హిమాంబువు లునుపరాదు." (వసుచరిత్రము.) కట్టుపునుంగు=గడ్డ కట్టినపునుఁగు, అగరుసత్తువ = అగరుగంధధృతి యును, సర్వకాలము నగరు లభింపదేని వాడుకొనుటకై యగరునుండితీసిన యత్తరువును, మంచిగంద వొడి = మంచిగంధపుపొట్టును, చాఁదు=అరుగఁదీసిబొట్టు పెట్టుకొనువగరును, అగరులో నింక పల్లఁగ నుండి బిగటగ నుండుదానిని తిలకమున కుపయోగింతురు. అగరునే చాఁదని యందు రనుటకు "ఉ. సంకుమదంబునుం బునుఁగు చాఁదును గస్తురియుం ఘటంబులం బంకము చేసి"- ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యము. ఉదయభాస్కరంబు = ఉదయభాస్కర మను రంజక విశేషము, లోనుగాన్ = మున్నుగా, కల = ఉన్న, పరిమళ = సువాసనగల, ద్రవ్య = పదార్థములయొక్క, సంభార = సముదాయములయొక్క పరంపరలను = వరుసలును; జవ్వనంపుఁ గ్రొవ్వునన్ = వయోమదముచేతను- జవ్వనపునిబ్బరముచేత ననుట, నివ్వటిల్లి = వృద్ధిపొంది, మవ్వంపువాతెఱలం=

కలిగి, మేలిమైవకులుకులన్ = శృంగారచేష్టావికారమునఁ గదల్చు నవయవ చలనముచే, రసికజనంబులమనంబులన్ = రసికు లయిన పురుషులయొక్క చిత్తములను, మరులు కొలుపన్ = మోహముగలుగఁ జేయుటకు, చాలి = తగి, సురుచిర = ఎక్కువగాఁ బ్రకాశించునట్టి, అభరణ = భూషణములచేత, భూషితంబు = అలంకరింపఁబడినది, అగు, పరిచారికాసహస్రంబున్ = వేయి మంది దాసీజనమును, అరణంబుగాన్ = మనోరమకు స్త్రీధనముగా, ఇచ్చి = ఒసంగి, మఱియును = ఇంతియగాక. ముందటికన్వయము.

తా. ఇంద్రు మనోరమకు మెండిబంగారపువస్తువులను పలువిధము లయిన గృహోపకరణములగు వింతపనిముట్లను రతనములుచెక్కిన విభూషణములను చిత్రవిచిత్రము లగువస్త్రములును, వస్తుసమూహమును దాఁచికొనుట కనుకూలము లగు మిగులవిలువగల చక్కని పెట్టెలును, అగరుమొదలయిన సుగంధద్రవ్యములును, పనిపాటలయందు నేరుపు గలిగి చక్కఁదనపుఁ బెంపున నలరారి నాగరకముగా సంచరింపఁగల చక్కనిజవ్వనపు టొప్పుచేఁ దనరు చాలమంది పనికత్తె లగుదాసీజనమును అరణ మిచ్చెను. అలం. ఉపమ.

సీ. అవనతాంగుష్ఠాగ్రహార్యనిర్యద్రత్న
 ఖనిఘనాంతరితశృంగాటకములు
 మదముదావహదివ్యమైరేయధారేయ
 గోత్రభిద్విటపినిష్కుటయుతములు
 మహిళాకదంబడింభగ్రాహ్యగృహచర
 న్మృగనాభిసౌరభ్యనిర్ఝరములు
 ప్రఖరాఖునఖరధారావిదీర్ణోద్గీర్ణ
 సౌవర్ణమృత్కీర్ణజాంగలములు
తే. కోకకలహంసముఖరితాబ్జాకరములు
 సిద్ధచారణగంధర్వసేవితములు

మందరద్రోణిఁ గొన్ని గ్రామములు గూర్చి
తనయుపసువున కొసఁగె గంధర్వవిభుఁడు. 102

టీ. గంధర్వవిభుఁడు=గంధర్వరాజగు నాయిందీవరాక్షుఁడు, అవనత= వంపఁబడిన, అంగుష్ఠ = కాలిబొటనవ్రేలియొక్క, అగ్ర = చివరచేతను, హార్య = హరింపఁదగినవై, నిర్యత్ = వెడలుచున్న, రత్న = రతనములయొక్క, ఖని = గనులచేత, ఘన = ఎక్కువగా, అంతరిత = ఆవరింపఁబడిన, శృంగాటకములు=చదుకము లున్నవియు - గ్రామములందు రతనములు పైకిఁ గానవచ్చుగనులు పెక్కులుగాఁ గల వనుట. మద = మత్తతను, ముద=ఆనందమును, ఆవహ = పుట్టించునట్టి, దివ్య = ఉత్తమమయిన, మైరేయ = ఇక్షురసమద్యమునకు, ధారేయ = భారవాహులైన, గోత్రభిత్ = దేవేంద్రునివైన. విటపి = కల్పకములతో నొప్పిన, నిష్కుట = ఉపవనముల తోడ, యుతములు = కూడినవియును, దివ్యమైరేయ = దేవతాయోగ్యమైన మద్యమును అని యొకరు వ్రాసియున్నారు. మద్యము నొసంగునవి కల్పవృక్షములుగావన, దివ్య=స్వర్గసంబంధము నుట యెంతయుం నొప్పియున్నది. గ్రామములందుఁగల వృక్షములు నాయికానాయకుల కానందకరములగు మైరేయాదు లొసంగుచున్న వనుట. మహిళా = ఉవిదలయొక్క, కదంబ=సముదాయముచేతను, డింభ = శిశువులచేతను, గ్రాహ్య = తెలిసికొనఁదగిన, గృహ = గేహములయందు, చరత్ = సంచరించుచున్న, మృగ = మృగములయొక్క, నాభి = బొడ్డునలనఁబుట్టినకస్తూరియొక్క, సౌరభ్య = సువాసనలచేత, నిర్భరములు = పూర్ణముగా నిండినవియు, కస్తూరి మృగములు కలసిమెలసి తిరుగుచుంటచే స్త్రీలు శిశువులు గూడ నవి కస్తూరి విడిచినసంగతి గుర్తించుచుండిరిగాన నొసంగఁబడిన గ్రామములు కస్తూరిగంధబంధురములుగా నొప్పుచున్న వని భావము. ప్రఖర = ఎక్కువతీక్ష్ణములైన, ఆఖు = మూషకములయొక్క, నఖరధారా = గోటికొనలచేత, విశీర్ణ = త్రవ్వఁబడుటచేత, ఉద్గీర్ణ = ఉప్పతిల్లిన, సౌవర్ణమృత్=బంగరుమట్టి, కీర్ణ=

వ్యాప్తమయిన, జాంగలములు = మెట్టనేలలు గలిగినవియును, మెరక నేలలందు అంగారురేణువులు విశేషముగ నుండఁగాన నెలుకలు త్రవ్వినంతన యందలి సువర్ణము బయలుపడుచుండు గ్రామము లనుట. కోక=చక్రవాకములచేతను, కలహంస = రాయంచలచేతను, ముఖరిత = చప్పుడుచేయఁబడిన, అబ్జాకరములు=పద్మసరస్సులు గలిగినవియును, సిద్ధచారణ గంధర్వసేవితములు = సిద్ధులచేతను చారణులచేతను గంధర్వులచేతను సేవింపఁబడునవియును నగు, మందరద్రోణిక = మందరాద్రియొక్క లోయలోనివైన, కొన్ని గ్రామములు = పూర్వవిశేషములతో నలరారుచున్నట్టి యూళ్లకొన్ని, కూర్మితనయ=తనప్రియపుత్రికయగు మనోరమయొక్క, పసుపునకుఁ = పసుపుకుంకుమకుగాను, ఒసఁగెఁ = వివాహసమయమునం దొసంగెను.

తా. ఇందీవరాక్షుఁడు కుమార్తెకుఁ బసుపుకుంకుమలకొఱకై మందరాద్రియొక్క లోయలలోనివియుఁ గాలితోఁ దాఁకినంతన రత్నములు బయలుపడు మేలైన రత్నపుగనులు గలవియు నగుకొన్ని చదుకములతోడను, పూఁదేనెలతోడను, కల్పవృక్షములతోడను, కస్తూరిమృగములతోడను, అంగరువట్టి గజప్రదేశములతోడను, సరస్సులతోడను, సిద్ధచారణగంధర్వ సంచారయోగ్యస్థానములతోడను దనరారి, దర్శనీయముగా మనోహరముగాఁ ద్రికాళించులోకోత్తరసౌభాగ్యములచే నలరారునవియు నగుకొన్నిగ్రామములను వివాహసమయమునం దరణముగా నిచ్చెను. అలం-ఉదాత్తము.

తే. పౌరయాత్రికసురసిద్ధచారణాహి
యక్షగంధర్వసాధ్యవిద్యాధరులను
నిజపురంబుల కనిచె నిందీవరాక్షుఁ
డుడుగర లొసంగి విభవంబు గడలుకొనఁగ. 103

టీ. ఇందీవరాక్షుఁడు, పౌరయాత్రిక=స్వమతమపట్టణములకుఁ బయనమైన, సుర = బృందారకులు, సిద్ధ = సిద్ధులు, చారణ = చారణులు, అహి= ఉరగులు, యక్ష=యక్షులు, గంధర్వ=గంధర్వులు, సాధ్య=సాధ్యులు, విద్యా

భవులకు=విద్యార్థులు నగు పెండ్లికై యేతెంచినవారిని, విభవంబున=వైభవము, కడలుకొనఁగన్ = వృద్ధిపొందఁగా, ఉడుగరలు = కానుకలు, ఒసంగి, నిజపురంబులకున్ = ఎవరి గ్రామములకువారిని, అనిచెన్ = పంపించెను.

తా. ఇందీవరాక్షుఁడు పెండ్లికి వచ్చిన దేవతలు, సిద్ధులు, చారణులు, ఉరగులు, యక్షులు మొదలయినవారి నందఱినిఁ దగురీతిఁ గట్నములఁ గానుకలను సత్కరించి వారివారి గ్రామములకుఁ బంపించెను.

వ. అనిన విని జైమినిమునీంద్రుండు మీఁదటివృత్తాంతం బాన
తీయవలయు నని యడుగుటయును. 104

టీ. అనినన్=ఇట్లు పక్షులు పలుకఁగా, విని, జైమినిమునీంద్రుండు, మీఁదటివృత్తాంతంబు = తరువాతికథను, ఆనతీయవలయున్ = నుడువవలయును, అని, అడుగుటయున్ = అడుగఁగా, ముందటియాశ్వాసములోని రెండవవచనములోని 'బాదరాయణాంతేవాసి కిట్లనియె' అను వచనముతో నన్వయము.

మ. అతులక్షాంతిగభీర భీరహితచిత్తాంభోజ భోజక్షమా
పతివిద్యాపరిపాక పాకరిపుజృంభద్భోగ భోగాళిప
త్రితరస్వాప్రత్యనుభావ భావభరితశ్రీకాంత కాంతారపా
లితకాళింగకులేశ లేశతరవృత్తిక్షీణవైరివ్రజా. 105

టీ. అతుల = సమానరహితమైన, క్షాంతి = క్షమచేత, గభీర=లోఁతయినవాఁడా, ఇతరులు గ్రహింపజాలనియంతటి యోరిమిగలవాఁడా యనుట. భీరహిత=నిర్భయమైన, చిత్తాంభోజ = హృదయపద్మముగలవాఁడా, వెఱపునుగలనైన నెఱుంగనివీరాధివీరాయనుట, భోజక్షమాపతి = భోజమహారాజు యొక్క, విద్యాపరిపాక = విద్యాపరిపాకమువంటి విద్యాపరిపాకముగలవాఁడా, భోజునివలె సమస్తవిద్యలయందు సంపూర్ణపరిచయముగలవాఁడా యనుట, పాకరిపు=దేవేంద్రునిదైన, జృంభత్ = ప్రకాశించుచున్న, భోగ=

సౌఖ్యమువంటి సౌఖ్యముగలవాఁడా, దేవేంద్రునిమించిన సుఖానుభవము గలవాఁడా యనుట భోగాసిపత్త్రి = గరుడునియొక్క, తరః = వేగమువంటి వేగముయొక్క, స్ఫూర్తి=వెలుఁగుయొక్క, అనుభావ = మహత్త్వగలవాఁడా, భోగాశిపత్త్రి యన పాములు ఆహారముగాఁగలపక్షి గరుత్మంతుఁ డనుట, భావ= చిత్తమునందు, భరిత = ఉంచఁబడిన, శ్రీకాంత = లక్ష్మీనాథుఁడయిన నారాయణుఁడుకలవాఁడా, ఎల్లప్పుడు శ్రీమహావిష్ణునియందు భక్తిశ్రద్ధలు గలవాఁడా యనుట, కాంతార = ఘోరారణ్యములయందు, పాలిత = పాఱ వేయఁబడిన, కాళింగకులేశ = కళింగాధిపతికలవాఁడా, కళింగరాజులగు గజ పతులను జయించి యడవులపాలు గావించినవాఁడా యనుట, లేశతర = మిక్కిలి న్యూనమగునట్టుగా, వృత్తి=వర్తనము, క్షీణ=నశించిన, వైరివ్రజ= శత్రువర్గముగలవాఁడా, విరోధులవృత్తులను సంపదలనుగొని వారల దరిద్రులుగాఁజేసినవాఁడాయనుట. భోగియన సర్పశరీరమునకు ఫణమునకు నర్థముగాన తద్విశిష్టమైన సర్పమును భుజించువాఁ డని గరుఁడపర్యాయార్థము చెప్పబడెను. "భోగస్సుఖే స్త్ర్యాదిభృతావహేశ్చ ఫణికాయయోః" అమరము. అని బ్రౌనుదొరవారి వ్యాఖ్యాప్రతి.

తా. ఓర్పును, భయములేమియు, విద్యాసంపదలును, మహేంద్ర వైభవమును, విష్ణుభక్తియు, శత్రునాశసామర్థ్యమును గలవాఁడా. అలం- నిదర్శనము. ముక్తపదగ్రస్త మను శబ్దాలంకారమును.

క. నాగాంబాసుత జితకద
నాగతమదనాగసంగమానూపగృహా
భోగా భోగపురందర
భోగీంద్రశయానపురుషపూజాప్రవణా. 106

టీ. నాగాంబాసుత = నాగమ్మకొమారుఁడా, జిత = జయింపఁబడిన, కదన=పోరులవలన, ఆగత=ఏతెంచిన, మదనాగ = మత్తగజములయొక్క, సం

గమ=కలయిక చేత, ఆనూప=ఉదకముతో నిండిన ప్రదేశమైన, గృహా=గృహము యొక్క, ఆభోగ = సంపూర్ణతకల వాఁడా "జలప్రాయమనూపం స్యాత్" అనియును, "ఆభోగః పరిపూర్ణతా" యనియును నమరము. మదప్రవేతుంగులం గాన వానిమదధారలచే గృహాంకణము జలమయముగా నుండి చిదచిదలాడుచుండెనని భావము. భోగపురందర=భోగమం దింద్రునివంటి వాఁడా, భోగీంద్ర= శేషుఁడే, శయాన = శయ్యగాఁగల, పురుష = పురుషుఁడగునారాయణుని యొక్క, పూజా=పూజయందు, ప్రవణా=ఇష్టముకల వాఁడా.

తా. యుద్ధములలో జయము గాంచి తీసికొనివచ్చిన మత్తగజముల యొక్క మదధారాజలములచే, జవజవలాడు నేలఁగా నయినపట్టణమందు శేషశాయి యగు నారాయణుని బూజించుచుండు వాఁడా. అలం-విపర్యసము.

మాలిని. సరభసజయఘాటీచండవేదండకోటీ
కరవమథుహిమానీకంపితాశావఘాటీ
పరమహితవాసంతీభావభాగ్భూరితేజః
పరుషదహనకీలాప్రస్ఫురచ్చక్రవాళా. 107

టీ. సరభస=తొందరతోఁగూడిన, జయఘాటీ=దిగ్విజయార్థమగుయుద్ధయాత్రయొక్క, చండ = భీతినిఁగలుగఁజేయుంచవియైన, వేదండ = గజముల యొక్క, కోటీ = సమూహముయొక్క, కర = తొండములవలని, వమథు = తుంపురులను, హిమానీ = ఇవము చేత, కంపిత=కదలింపఁబడిన, ఆశావఘాటీ= దిక్కులనువనిపలకు, పరమహిత = మిగులనొప్పుచున్న, వాసంతీభావభాక్ = గుంపటివలె నాచరింపఁబడుచున్న, భూరి=విస్తారమయిన, తేజః=ప్రతాపమును, పరుష=కఠినమయిన, దహన = వీతిహోత్రునియొక్క, కీలా = జ్వాలలచేత, ప్రస్ఫురత్ = మిక్కిలి వెలుఁగుచున్న, చక్రవాళా = చక్రవాళపర్వతము గలవాఁడా.

వాసంతి యనఁ గుంపటియగుటకు "అంగారధాని కాంగార శకట్యపి హసంత్యపి" అని యమరము.

తా. సంగరరంగమున ముందునడుచు సేనుంగులు నీరుగ్రోలి విడచుటచే నిపమెక్కి వణఁకుచున్న దిక్కాంతలయొక్క చలిపోఁగొట్టఁదగిన లోకాలోక వ్యాప్తిగల పరాక్రమాగ్ని గలవాఁడా, కృష్ణరాయా. అలం నిదర్శనము. ఇన్ని యన్ని యని చెప్ప నలవిగానియేనుంగులదండు గలిగి ప్రపంచ మంతయును వ్యాపించిన కీర్తిప్రతాపములచే నొప్పినవాఁడా! అలం - రూపకము.

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిర నందవరపురవంశోత్తంస శఠకోపతాపస ప్రసాదసమాసాదిత చతుర్విధకవితామతల్లి కాల్లసాని చొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్యప్రణీతంబైన స్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము. 108

టీ. శ్రీమ... ప్రణీతంబు- శ్రీమత్ = విద్వత్తాసంపదగల, ఆంధ్రకవితాపితామహ = ఆంధ్రకవిత్వమునకు బ్రహ్మయును, సర్వతోముఖ = అంతటవ్యాప్తిగల, అంక = బిరుదుగల్గినట్టియును, పంకజాక్ష = విష్ణునియొక్క, పాదాంబుజ = పాదపద్మములకు, అధీన = వశమైన, మానసేందిందిర = మన స్సనెడు తుమ్మెద గలట్టియును. నందవరపురవంశోత్తంస = నందవర మనెడియూరివారి వంశమున (నందవరీకకులమున) శ్రేష్ఠుఁడగునట్టియు, శఠకోపతాపస = శఠకోప యతియొక్క, ప్రసాద = కృపచే, ఆసాదిత = పొందఁబడిన, చతుర్విధ = నాల్గువిధములగు (బంధ, చిత్ర, గర్భ, ఆశు కవనములు), కవితామతల్లిక = శ్రేష్ఠకవిత్వముగలట్టియు, అల్లసాని చొక్కయామాత్యపుత్త్ర = అల్లసాని చొక్కయమంత్రికిఁ గుమారుఁడగునట్టియు, పెద్దనార్య = పెద్దనార్యునిచే, ప్రణీతంబు = రచియింపఁబడిన, మహాప్రబంధంబునందున్ = మహాకావ్యమున, పంచమాశ్వాసము.

ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనాసమాసాదితాఖండసాహితీధురీణుండు నాత్రేయగోత్రపవిత్రుండును వావిళ్లవంశపయోరాశిరాకాసుధాకరుండు నగురామస్వామిశాస్త్రిచేత ననేకపూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచింపఁబడిన రుచిసమాఖ్యానం బగువ్యాఖ్యానంబునందుఁ బంచమాశ్వాసము.

శ్రీ ర స్తు

# మనుచరిత్రము.

## సటీకము

## షష్ఠాశ్వాసము

శ్రీకృష్ణరాయమనుజేం
ద్రా కాంతాపంచబాణ నరసింహధరి
త్రీకాంతగర్భవార్నిధి
రాకాహిమధామ కర్పరదళవిరామా. 1

టీ. కృష్ణరాయమనుజేంద్రా=కృష్ణదేవరాయ లను నామధేయముగల రాజోత్తమా! కాంతాపంచబాణ=స్త్రీలకు మన్మథుఁడా! రమణులను మోహింపఁజేయుటయందు మన్మథునివంటివాఁడా, నరసింహ = నరసింహదేవరాయలను, ధరిత్రీకాంత = భూపతియొక్క, గర్భ=కడుపనెడి, వార్నిధి= సముద్రమునకు, రాకాహిమధామ = పూర్ణిమనాఁటిచందమామా! కర్పర = ధూర్తులయిన తురుష్కులయొక్క, దళ=సేనయొక్క, విరామా = నశింపఁజేసినవాఁడా!

కర్పరదళ మనుటకుఁ బ్రౌనుదొరవారు వ్రాయించినటీకలో ధూర్తుల యొక్కసేన యనియె గలదు. కర్పరపదము దుండగులయెడ వర్తించును గాన దుండగులసేన యనుటయె సముచితమైనను బ్రకృతమునుబట్టి గజపతుల

యొక్కఁగాని తురుష్కులయొక్కఁగాని సైన్యమున కీ కర్వరపదమును విశేషణముగాఁ గొనవచ్చును.

తా. మదనాకారుఁడై స్త్రీజనముల మోహింపఁజేసిన వాఁడును నరసింహదేవరాయని కుమారుఁడును, దుర్మార్గులయిన తురుష్కులను గొట్టిన వాఁడును నైనవాఁడా. అని కృష్ణదేవరాయల సంబోధనము. అలం. రూపకము.

వ. అవధరింపుము శకుంతంబు లబ్బాదరాయణాంతేవాసి కిట్ల
నియె; నంత నొక్కనాఁడు.

టీ. అవధరింపుము = ఆలకింపుము, శకుంతంబులు = పక్షులు - కథను దెలుపుచున్న ధర్మపక్షులు, అబ్బాదరాయణాంతేవాసికిన్ = ఆవ్యాసశిష్యుఁడైన జైమినితో, ఇట్లనియెన్=ఇట్లని చెప్పెను. అంతన్=వివాహమహోత్సవమయినపిమ్మట, ఒక్కనాఁడు = ఒకానొక దినమునందు.

సీ. పాండురప్రభఁ గ్రిందువడినచీఁకటివోలె
జిగి నొప్పునీలంపుజగతి మెఱసి
యౌన్నత్యమున మ్రింగినట్టినిందులు గ్రక్కు
కరణి ధూపము గవాక్షముల వెడల
ధారుణీసతి సుగంధద్రవ్యములు దాఁచు
నరలపేటికవోలెఁ బరిమళముల
నెలవులై చెలువారునిలువ్రల విలసిల్లి
కొణిగఁ బారావతకులము వదరఁ
తే. బసిఁడినీట లిఖించినప్రతిమ లమర
నీఁగ వాలిన నందంద యొలుఁగు లొసఁగు
నట్టిసకినలమంచము లాది గాఁగ
మెఱయుపరికరముల నొప్పుమేడమీఁద. 3

టీ. పాండురప్రభన్ = తెల్లని కాంతిచేత, క్రిందుపడిన చీఁకటి ప్రోలెన్ = అడుగుఁబట్టిన యంధకారమో యనునట్లు, జిగిన్ = తళతళల చేతను, ఒప్పునీలంపుజగతిన్=తగినట్టి యింద్రనీలరత్నములఁ జెక్కిన నేలచేత, మెఱపి=వెలింగి, ఔన్నత్యమునన్=ఉన్నతిచేత,మ్రింగినట్టినింగులు=గ్రసించి కొన్న యాకసములను, క్రక్కుకరణిన్ = వెడలక్రక్కునట్లు, ధూపము = అగురుపొగ, గవాక్షములన్=కిటికీలనుండి, వెడలన్=బయలుదేరుచుండఁగా, ధారుణీపతి=పుడమి యను పిల్లాలు, సుగంధద్రవ్యములు=సౌరభద్రవ్యములను, దాఁచునరలపేటికప్రోలెన్ = దాఁచియుంచిన గదుల పెట్టెరీతి, పరిమళముల నెలవులై=సువాసనలకాకరములై, చెలువారునిలువులన్=శోభించుచున్నయంత స్తులచేత, విలసిల్లి=తగి, కోణిగన్ = ముందఱిచూరునందు, పారావతకులము= పావురముల సముదాయము, వదరన్ = అఱచుచుండఁగా, పసిఁడిసీటన్ = స్వర్ణజలముచేత, లిఖించినప్రతిమలు=వ్రాసినచిత్తరువులు, అమరన్=ఒప్పఁగా, ఈఁగవాలినన్=పయిని యీఁగవచ్చి వాలినను, అందంద = అప్పటికప్పుడే, ఎలుఁగులు=ధ్వానములు, ఒనఁగునట్టి సకినలమంచములు = ఇచ్చుకృత్రిమపుఁ చిట్టలు కీచుబిల్లలు మొదలయినవిగల పందిరి పట్టెమంచములు, ఆదిగాఁగన్= మున్నుగా, మెఱయుంపరికరములన్ = వెలుంగుచున్న సామానులతో, ఒప్పు మేడమీఁదన్=ఒప్పుచున్న యుప్పరిగమీఁద, ముందఱికన్వయము.

నిలువు లన యంతస్తు లనుటకు: బూర్వకవి ప్రయోగములు పెక్కులు గలవు.

క. "పూడిగ్రహాంబులుదిరుగఁగ, మేడలతుది నిలువులందు మెలఁగెడిబాలల్
క్రీడింపను పురుషులతో, వ్రీడం దద్వేళలందు వినుమాపీటన్."
(భాగ-దశ-పూ. ప. 1600)

సీ. "పొలుచు చతుర్దశభువనముల్ తనకీర్తి
యాడెడి నిలువుల మేడ గాఁగ" (నిర్వచనోత్తరరా.)

తా. క్రిందిభాగమున నీలమణులు కూర్చినతిన్నెలు ప్రకాశింపఁగా నాకసము నంటుపొడవు గలిగి గవాక్షములనుండి యగరుధూమములు బయలు దేరఁగా సువాసనలచే నిండినయంతరువు లొప్పఁగా సువర్ణోదకములతోఁ జిత్రములు వ్రాయఁబడి కీచుబిళ్లలు మున్నగువానితోఁ గూర్పఁబడిన పట్టె మంచము మొదలగువానితోఁ బ్రకాశించు మేఁడమీఁదను. అలం. ఉత్ప్రేక్షయు, అతిశయోక్తియును.

క. రమణునికడ కనుప మనో
  రమకున్ మజ్జనము దీర్చి రవరవకచపిం
  ఛమునకుఁ గాలాగురుధూ
  పము వెట్టి జవాదినంటు వాపి నిపుణతన్. 4

టీ. రమణునికడకున్ = ప్రియునివద్దకు, అనుపన్ = పంపుటకు, మనోరమకున్ = పెండ్లికుమారితయగు మనోరమకు, మజ్జనము = అభ్యంగస్నానము, తీర్చి = ఒనర్చి రవరవ = తళతళలాడుచున్న, కచపింఛమునకున్ = మయూర బర్హమువంటి శిరోజములసముదాయమునకు, కాలాగురుధూపము = నీలాగురు ధూపమును, పెట్టి, జవాదిన్ = జవ్వాజి సూనియుచే, అంటు = తలవెండ్రుకల చిక్కు, వాపి = పోఁగొట్టి, నిపుణతన్ = నేర్పున, ముందటికన్వయము.

రవరవ యన గుప్పుగుప్పున అని కొందఱు వ్రాసియున్నారు. తేమ శైత్యముచేయు నని త్వరగా ధూపము వేసి రనుట కీయర్థ మెంతయు నొప్పి యున్నది. రవరవయన = గరగరలాడునట్టుల నని కొందఱు వ్రాసిరి. శబ్దరత్నాకరము రవరవపదమునకుఁ గాంతివిశేష మను నర్థము చెప్పుటచే సాధురిక వ్యాఖ్యాత లిదియె గ్రహించిరి.

తా. మనోరమను భర్తకడకుఁ బంపుటకై దాసీజనము స్నానము చేయించి నెమిలిపింఛముంబోలెఁ దళదళలాడుశిరోజముల కగురుధూమము వైచి యార్చి జవ్వాజితూనెతోఁ దల దువ్వి. అలం. రూపకము.

సీ. చెంగల్వపూదండ సేర్చి పెందుఱుముపై
ఘనసారమున సూసకము ఘటించి
పన్నీటితోఁ గదంబము సేసి మృగనాభిఁ
బూసి కుంకుమ సేసబొట్టు తీర్చి
విశదముక్తాదామరశనఁ జందురకావి
వలిపపువలువపై నలవరించి
యఱుత వెన్నెలగాయుహీర మొక్కటివెట్టి
మణులసొమ్ములు మేన మట్టుపఱిచి
తే. కన్నుఁగవ గెల్చి డాకాలఁ గట్టె ననఁగ
ఘల్లుఘల్లునఁ బెండెంబుగండుమీలు
గదల నల్లన నడిపించి పొదివి తెచ్చె
నెచ్చెలులపిండు యువతి నానృపతికడకు. 5

టీ. నెచ్చెలులపిండు = మిగుల స్నేహాతిశయము గల నేస్తకత్తెలసముదాయము, చెంగల్వపూదండ = ఎఱ్ఱగలువపూవులదండను, చేర్చి = కొప్పునందుఁ దుఱిమి, పెందుఱుముపైన్ = పెద్దదియగు నాకొప్పుమీఁద, ఘనసారమునన్ = పచ్చకర్పూరముతో, సూసకము = పూవుబెత్తులుకూర్చి యొనర్చినకొప్పువలను, ఘటించి = కూర్చి, సూసక మన రాగిడిబిళ్ళవంటి భూషణవిశేష మని కొంద ఱందురు. ఘనసార మన గొప్ప స్థిరాంశముగాన నట్టి స్థిరాంశముగల జడబిళ్ళ యని కొందఱు కేవలపుష్పములు కొప్పున నుంచినఁ ద్వరలో వాడును గావునఁ బచ్చకర్పూరముతోఁ బువ్వుమాలికలు రచించి వానిచేఁ గొప్పు వలనమర్చి రనియుఁ నదియ సూసక మనియుఁ గొందఱు వ్రాసియున్నారు. ఇదియె యొప్పి యున్నది. పన్నీటితోన్ = హిమాంబువుతో, కదంబము చేసి = మిశ్రముచేసి, మృగనాభిన్ = కస్తూరిని, పూసి = దేహమునిండఁ బూసి, కుంకుమన్ = కుంకుమపూవుతో, సేసబొట్టు = అక్షతలతిలకము, తీర్చి = నొసటనందముగా

దిద్ది; విశద = స్ఫుటమయిన, ముక్తాదామ=ముత్యముల మాలలచేఁ జేసిన, రశనన్ = మొలత్రాడును, చెందురుకావి = కుసుమపువ్వువర్ణముగల; వలిపపు = పలుచని, వలువపైన్ = వస్త్రముమీఁద, అలవరించి = సమకూర్చి; అఱుతన్ = మెడలో, వెన్నెల గాయుహారము = వెన్నెలవలెఁ దెల్లఁగాఁ ప్రకాశించు వజ్రములదండ, ఒక్కటిపెట్టి = ఒకదాని నలంకరించి, మణుల సొమ్ములు = రత్నాభరణములను, మేనన్ = శరీరమందు, మట్టుపఱిచి = బిగువుగా నుంచి, కన్నుఁగవన్ = కన్నులజంటచేత, గెల్చి = జయించి - విజయము నొంది, డాకాలన్ = ఎడమకాలియందు, కట్టెన్ = బంధించివేసెనో యేమో; అనన్ = అనునట్టుల, ఘల్లుఘల్లనన్ = ఘల్లుఘల్లుమను మ్రోఁతపుట్టునట్టుల; కెందెంబుగండుమీలు = పాదనూపురములయందుఁ గూర్పఁబడిన బంగరు గండుచేఁపల ఆకారములు, కదలన్ = కదలఁగా, యువతిన్ = జవరాలయినమనోరమను, అల్లనన్ = నెమ్మదిగా, నడిపించి, అన్నృపతిలకదకున్ = పెండ్లికుమారుఁడైన స్వారోచియొద్దకు, పొదివి = చుట్టుకొని, తెచ్చెన్ = తీసికొనివచ్చెను.

తా. చెలికత్తెలు మనోరమకుఁ దల దువ్వి కొప్పు పెట్టి తుఱుమునిండ రక్తోత్పలమాలిక లమర్చి. దానిమీఁదఁ బచ్చకర్పూరపు పూవులవలచు బెట్టి, చెందిరకావిరంగుకోకను గట్టి ముత్యాలమొలనూలు నడుమునం గట్టి, కస్తూరి పన్నీరు గలిపినసుగంధమును మేన నలఁది, కుంకుమపువ్వు నరుగఁదీసి బొట్టు పెట్టి, యొంటిపేటముత్యాలహారము నఱుత వేసి, బిగువుగా రత్నాలంకారములను దొడిగి, యందెలు ఘల్లుఘల్లున మ్రోఁగఁగా మనోరమను నెమ్మదిగా నడిపించుకొనుచు స్వారోచికడకుఁ దీసికొనివచ్చిరి. అలం. ఉత్ప్రేక్ష. స్వభావోక్తి.

క. తెచ్చుటయుఁ గేలిభవనముఁ
జొచ్చెనో చొరదో యనంగ సుదతులనీడన్

జొచ్చి పయిఁ గొప్పు దోఁపఁగ
నచ్చేడియ తలుపుసంద నల్లన నిలిచెన్. 6

టీ. తెచ్చుటయున్=చెలికత్తియలందఱిటులఁ జుట్టును పొదివి తీసి కొనిరాఁగా, అచ్చేడియ = ఆమనోరమ, కేళిభవనమున్ = క్రీడాగారమును, చొచ్చెనో = ప్రవేశించెనో, చొరదో = ప్రవేశింపలేదో, అనఁగన్ = అని తలంచునటుల, సుదతులనీడన్ = నేస్తకత్తెలనీడయందు, చొచ్చి=మెల్లఁగాఁ బ్రవేశించి, పయిన్ = పైభాగము, కొప్పుదోఁపఁగన్ = కొప్పొక్కటియే కాన్పించఁగా, తలుపుసందన్ = కవాటము వెంబడిని, అల్లనన్ = మెల్లదిగా, నిలిచెన్.

తా. నేస్తకత్తెలు పిలుచుకొనిరాఁగా మనోరమ తనజాడ తెలియకుండు రీతిని నేస్తకత్తెలచాటువఁ గేళీగృహము తలుపుచాటున నిలిచియుండెను.

క. తదనంతరంబ బోటులు
చదురుల నగవులను బ్రొద్దు జరిగినఁ గేళీ
సదనము నొక్కొకపనిపెప
మొదవఁగ వెడలుటయుఁ జిత్తముద్విగ్నారన్. 7

టీ. తదనంతరంబ = ఇటుల మనోరమ తలుపుచెంత నిలువఁబడిన యంతనే, చదురులన్ = వేళాకోళముల చేతను, నగవులన్ = హాస్యముల చేతను, ప్రొద్దు = కొంతవడి, జరిగినన్=జరుగఁగా, బోటులు=చెలికత్తెలు, ఒక్కొకపనిపెపము=ఒక్కొకపనియున్న దనుమిష, ఒదవఁగన్ = కలుగఁగా, లేనిపోని పనియొకదానిని కలుగఁజేసికొని, కేళీసదనము = క్రీడాగృహమును వెడలుటయున్ = బయలుదేఱి వెళ్లఁగా, చిత్తము = స్వరోచిచిత్తము, ఉద్విగ్నారన్ = తొట్రుపాటుఁ జెందఁగా, ముందఱికన్వయము.

తా. తరువాత చెలికత్తెలు వేళాకోళముచేతను నవ్వులచేతను కొంత ప్రొద్దు జరపి తమ కేదియో పని యున్న దను నెపముతో నొక్కొక్కరె

బయటికి వెడలి పోఁగా స్వరోచిహృదయ మువ్విళ్లూరఁగా. అలం. పర్యా-
యోక్తము.

సీ. దట్టంబు నీకట్టినట్టి చెంగావికి
బాగు గా దని కేలఁ బయఁట నిమిరె
గోరంటొ గోళ్లనిక్కువపుఁగెంపో యని
చెయిపట్టి నయమున సెజ్జ సేర్చె
నగురుధూపముచేత నయొ్యారి తనూవల్లి
సెక సోఁకె నని యెదఁ జెయ్యి పెట్టె
మృగనాభికామకరికలఁగప్రము మించె
నని మూరుకొనుచుఁ జుంబన మొనర్చె

తే. హారమణులిటు సూపు నాయణుత నున్న
హారమణులకుఁ గాంతి నీ డౌనొ కావొ
యనుచు నక్కునఁ గదియించు నానెపమునఁ
గంపమును బొందుసతిమేను గౌఁగిలించె. 8

టీ. దట్టంబు = పావడ, నీకట్టినట్టిచెంగావికిన్ = నీవు ధరించిన చెంది రపురంగుచీరకు, బాగు = చక్కఁదనము, కాదని = కానేర దని, కేలన్ = హస్తముతో, పయఁట = పైఁటను, నిమిరెన్ = తడవెను. పయ్యంటకుఁ దగిన పావడ గాదని పలుకుచు వల్లెవలువను బట్టుకొని దానిమేలిమి కానం దించునటుల నటించి గుబ్బలపైనిఁ జేయిఁజేర్చెను. గోరంటో = గోరంటాకు వలనైనయెఱుపో, గోళ్ల = నఖములయొక్క, నిక్కువపు = సత్యమయిన, కెంపో = రక్తిమయో, అని = అని పలుకుచు, చెయిపట్టి = ప్రియురాలి హస్తమును బట్టుకొని, నయమునన్ = చక్కఁగా, సెజ్జ = శయ్యను, చేర్చెన్, హస్తముపట్టుకొనిగదా సెజ్జకుఁ జేర్పవలసినది. సుందరీమణి యగు నామె కెంగేలును గోరంటయెఱుపా సహజరక్తవర్ణమా యిది యని యడుగులనఁటు

బట్టుకొని మెలఁకువపై సెజ్జపైకిఁ జేర్చికొనెను. అగురుధూపముచేతన్ = అగురుపొగచేత, తనూవల్లి = లతవంటి దగునీశరీరము, సెకసోఁకెన్ = కాఁక తాఁకెను, అయ్యో యని, ఎదన్ = వక్షమునందు, చెయ్యివెట్టెన్ = చేయిపెట్టి యుంటిచూచెను. గుబ్బలపైని గేలుంచఁగఁ దలఁచెగాని దిగ్గనొక్క పీలిదివటకుఁ గలుగదయ్యెను. ధూపముసెకచే మేనుగందె. గదా యని యోర్చునటుల నటించి బొమ్మపైఁ గేలుంచెను. మృగనాభికా = కస్తూరిచే వ్రాయఁబడిన, మకరికలన్ = మకరికాపత్రములందు, కప్రము = పచ్చకర్పూరము, మించెన్ = అతిశయించెను. అని, మూరుకొనుచున్ = వాసనమాచుచు, చుంబనమొనర్చెన్ = ముద్దిడుకొనెను. మకరికాపత్రములందలి కస్తూరి మఱి పచ్చకప్పురపుఁదావి మూర్కొనునటుల నటించి చుంబనక్రియలచే నానందించెను. హారమణులు = తారహారమునందలి పూసలను, ఇటుసూపు, నాయుఱుతన్ = నాకుత్తుయందు ఉన్న, హారమణులకున్ = హారములలోని పూసలకు, కాంతిన్ = ప్రకాశముచేత, ఈడు = తుల్యము, ఔనో = అగునో, కావో = కాక పోవునో, అనుచున్ = అనిపలుకుచు, అక్కునన్ = వక్షమునందు. కదియించు నానెపమునన్ = అదిరించిచూచు నెపమున, కంపమును బొందునటి మేను = వణఁకుచున్న మనోరమశరీరమును, కౌఁగిలించెన్ = ఆలింగనముఁ జేసికొనెను. చుంబనాదికములచే లజ్జించి దూరమేఁగుచుండ మనోరమను లోఁబఱచికొనుటకు హారములోని రత్నముల తారతమ్యమును జూచు మిషచేఁ గౌఁగిలించికొనెను.

తా. స్వరోచి మనోరమచేరునకుఁ జేరి నీవు ధరించిన చెంగావి చీరకుఁ దగినది కాదని పయ్యెదను ముట్టి, వ్రేళ్లనఖముల గోరంటాకు రంగును బెట్టికొంటివా యేమి యని యడిగి హస్తమును పట్టుకొని శయ్యకుఁ దిగిచి, ధూపము వేసికొనుటచే నీమేనునకు సెకసోఁకెగదా యని యెదపైని గేలు గీలించి, మకరికాపత్రాదులయందుఁ బచ్చకప్పుర మెక్కుడయ్యె నని తావుల మూర్కొనునటుల నటించి ముద్దులఁగొని, ముత్యముల హారమణుల

సరిచూచు నెపమున వక్షము వక్షముతోఁ జేర్చి యాలింగన మొనర్చెను.
అలం- పర్యాయోక్తము.

వ. అట్లు కవియం దమకించి త్రస్తరులఁ గుస్తరింప నింపుగలి
గియు మునుమున్న మనంబునం బొడమి యుండునడ లప్పుడు
తలంపునం బాఱిన సముద్ధుం డగునతనిచే నది తీర్చించుకొనం
గలయదియైనవోఁధ గావున మాటలం దేటపడం జెప్ప శంకించి
స్త్రీస్వభావంబునం దొరఁగుకన్నీరు కంకణక్రేంకృతులు
మీఱఁ గోరఁ బాఱ మీటుచు నూరక యున్నం గనుంగొని
యవనిపతిపుంగవుం డంతరంగంబునం జెంగలించు కౌతుకాం
కురంబు కరఁగుపడ వెఱఁగుపడి యుద్వేగసమన్వితుండై సం
భ్రమించుచుఁ జెక్కుటద్దంబులు నొక్కి కురులు చక్కం ద్రో
యుచుం దోయజాక్షీ యక్షయానందసంధాయకం బగునిట్టి
క్రీడాసమయంబున వగపునకుం గారణం బేమి నాయెడం
గల్ల యేమేనియుం బాటిల్లదు గదా యెవ్వరే మప్రియంబు
గావించి రెఱింగింపు వారిం దండించెద నేమి సాధింప వల
యుఁ జెప్పు మది వేధచే నున్న సాధించెద మదీయంబు
లగునర్థజీవితంబులు భవదధీనంబు లుమ్మలిక యింత యేటి
కనుటయు నబ్బోటి గ్రేఁటుచు ని ట్లనియె. 9

టీ. అట్లు = ఆవిధముగా, కవియన్ = తన్నుఁ జేరుటకు, తమకించి = తత్తరపడి, త్రస్తరులన్ = జేళ్ళాళపుమాటలతో, కుస్తరింపన్ = ఇష్టపఱుపఁగా - సమాధానపఱుపఁగా నగుట. ఇంపుగలిగియున్ = ఇష్టముగలిగిన దయ్యును, మునుమున్న = ప్రారంభమందే, మనంబునన్ = చిత్తమునందు, పొడమియుండునడలు = పుట్టినదుఃఖము, అప్పుడు = స్వరోచి యావిధముగా నుపలాలించి కేళికి నొప్పించు సమయమునందు, తలంపునన్ బాఱినన్ =

చిత్తమునఁ బ్రసరింపఁగా—జ్ఞాపకమునకు రాఁగా, సమర్థుండు = తగినవాఁడు, అగు నతనిచేన్ = ఐన యాస్వారోచిచేత, అది=ఆదుఃఖము, తీర్పించుకొనం గలదియై=పోఁగొట్టుకొనఁ దలఁచినదై, నవోఢ = నూత్నవధువు, కావునన్ = కాఁబట్టి, మాటలన్ = సిగ్గువిడిచి మాటలాడుటచేత, తేటపడన్ = విశదమగు నట్టు, చెప్పన్ = కల రూపు ప్రియునితోఁ జెప్పుటకు, శంకించి=సందియపడి, స్త్రీస్వభావంబునన్=ఆఁడుది యగుటచే, తొరఁగుకన్నీరు = ప్రవహించుచున్న కన్నీటిని, కంకణక్రేంకృతులు = గాజులయొక్క చప్పుడులు, మీటన్ = అతిశయింపఁగా, గోరన్ = నఖముతో, పాఱమీటుచున్ = పోఁజల్లుచు, ఊరకయున్నన్ = మాటలాడక యూరకుండఁగా, కనుంగొని = మనోరమను జూచి, అవనిపతిపుంగవుండు = స్వారోచి, అంతరంగంబునన్ = హృదయ మందు, చెంగలించు కౌతుకాంకురంబు=వృద్ధిపొందునట్టి అనురాగపు మొలక, కరఁగుపడన్ = క్షీణింపఁగా, వెఱఁగుపడి=అబ్బురపడి, ఉద్వేగసమన్వితుండై= తొట్రుపాటుగలవాఁడై, సంభ్రమించుచున్=చంచలత్వమునొందుచు, చెక్కుటద్దంబులు=దర్పణములఁబోలు మనోరమ గండ ఫలకమును, నొక్కి = దంతములతో నించుక నొక్కి, కురులు=శిరోజములను, చక్కంద్రోయుచున్=సవరించుచు తోయజాక్షి = పద్మములవంటి నేత్రములుంగల మనోనాయికా, అక్షయ=క్షయముకాని ఆనంద=కౌతుకమును, సంధాయకంబు = సమకూర్చునది, అగునట్టి, క్రీడాసమయంబునన్ = రతికాలమందు, ఈ ప్రథమసంగమ సమయమునం దనుట. ప్రథమసంభోగము నాయికానాయకుల కత్యానంద కరము. వగపునన్ = దుఃఖమునకు, కారణంబు = హేతువు, ఏమి=ఏల, నాయెడన్ = నాయందు, కల్ల = నేరమి, ఏమేనియున్ = ఎద్దియును, పాటిల్లునుగదా = సంభవించునుగదా, ఎవ్వరు=పరులెవ్వరు, ఏమి ప్రియంబు = ఏమినేరము కావించిరి=ఒనర్చిరి, ఎఱింగింపు = పలుకుము, వారిన్=ఆప్రియ కరులగు నాదుండగులను, దండించెదన్ = శిక్షగావించెదను, ఏమి = దేనిని, సాధింపవలయున్ = కావలయును, చెప్పుము, అది=కావలసినవస్తువు, వేధచే

నున్నన్ = విధాత హస్తమం దున్నవు, సాధించెదన్ = తెచ్చెదను, మదీయంబులు = నాయవి, అగు సర్వజీవితంబులు = అయిన ధనప్రాణములును, భవదధీనంబులు = నీయవి, ఉమ్మలిక = విచారము, ఇంతయేటికిన్ = ఇంతగాఁ బొందనేల! అనుటయున్ = అని స్వరోచి చెప్పఁగా, అలోల్పటి = అమనోరమ, క్రేఁటుచున్ = కత్తుక సవరించుకొనుచు, ఇట్లనియెన్ = ఈవిధముగాఁ బలికెను.

ఉ. అక్కట నాయెడన్ మిగుల నక్కఱ గల్గి చరించు నెచ్చెలుల్
చిక్కి మునీంద్ర శాపహతిఁ జెందిన దుర్దమ రోగబాధలన్
బొక్కుచు నున్నవారు వనభూములఁ దద్దశ మాన్పవేని నా
కెక్కడి సౌఖ్య మన్నఁ దరళేక్షణఁ జూచి స్వరోచి యిట్లనున్.

టీ. అక్కట = అయ్యో! నాయెడన్ = నాయందు, మిగులన్ = మిక్కిలి, అక్కఱ = అపేక్షను, కల్గి = ఉన్నవారై, చరించునెచ్చెలుల్ = సంచరించు నెచ్చెలికత్తెలు, మునీంద్రశాపహతిన్ = ఒకమునిశాపమువలన, చెందిన = పొందిన. దుర్దమ = పోఁగొట్టరాని, రోగబాధలన్ = వ్యాధిబాధలతో, చిక్కి = తగులుకొని, పొక్కుచున్ = కష్టపడుచు, వనభూములన్ = అరణ్యప్రదేశములయందు, ఉన్నవారు = ఉండియున్నారు. తద్దశ = వారి దుర్దశను, మాన్పవేనిన్ = పోఁగొట్టనియెడల, నాకున్, ఎక్కడిసౌఖ్యము = సుఖము లేదు, అన్నన్ = అని పలుకఁగా, తరళేక్షణన్ = చంచలదృష్టులు గలమనోరమను, చూచి = తిలకించి, స్వరోచి, ఇట్లనున్ = ఈమీఁదఁ జెప్పెడిరీతిగాఁ బలికెను. ముందటికన్వయము.

శాప మొసంగినవాఁడు మునీంద్రుఁ డని చెప్పుటచేతను శాపసంభూతమగురోగబాధ దుర్దమ మనుటచేతను, ఋషి మహాప్రభావసంపన్నుఁ డనియు రోగ మసాధ్య మనియుం భావము. అసాధ్యవ్యాధి గాన ననన్యగతిక లగు చెలిమికత్తె లడవులలోఁ జింతనొందుచున్నా రనుట.

తా. నాయెడ నెక్కుడు ప్రేమ గలనెచ్చెలికత్తె లొకముని శాపమున విస్తారము రోగపీడితలై యడవులయం దిడుమలం గుడుచుచున్నవారు.

వారిరోగమును బోఁగొట్టు నేరవు గావక పరితపించుచుంటిం గావున నీ వయ్యది పోఁగొట్టెదవేని నాకు సౌఖ్యము గలుగును గాని లేకున్న నా కేటి సౌఖ్యమని పలుకఁగా స్వరోచి యిట్లనెను.

క. పరితాప మింక నేటికి
హరిణాక్షి మదీయసంచితాయుర్వేద
స్ఫురణమునఁ బరిహరించెద
నరు దనఁగ భవత్సఖీజనామయభరమున్. 11

టీ. హరిణాక్షీ = లేడిచూపులవంటి చూపులుగల ప్రియురాలా! ఇంకన్ = ఇఁకమీఁదను, పరితాపము = విచారమువలనఁ గలిగిన తొట్రుపాటు, ఏటికిన్ = ఎందుకు? మదీయ = నాసంబంధమైన, సంచిత = ఆర్జింపఁబడిన, ఆయుర్వేద = వైద్యశాస్త్రముయొక్క, స్ఫురణమునన్ = శక్తిచేత-సామర్థ్యముచేత ననుట, భవత్సఖీజన = నీ నేస్తకత్తెలయొక్క, ఆమయభరమున్ = రోగభారమును, అరుదు = ఇది అబ్బురము, అనఁగన్ = అని ప్రశంసించునటుల, పరిహరించెదన్ = పోఁగొట్టెదను.

తా. ఓ ప్రియాంగనా! యెందులకై విచారించెదవు! నేను నేర్చికొనిన వైద్యశాస్త్రము నుపయోగించి నీచెలికత్తెలరోగబాధ నందఱు నబ్బురపడునట్లు మాన్పెదను.

క. నా వెనుక రమ్ము నీసఖు
లేవనమున నున్నవార లిపుడ చికిత్సన్
గావింతు ననుచు రయమున
నావనితయుఁ దాను నచటి కరిగి యొకయెడన్. 12

టీ. నీసఖులు = నీనేస్తకత్తెలు, ఏవనమునన్ = ఏకాననమునందు, ఉన్నవారలు = నివసించుచున్నారు, ఇపుడ = ఇపుడే, చికిత్సన్ = వైద్యమును, కావింతున్ = ఒనర్చెదను. నావెనుకన్ = నాతో, రమ్ము = నా వెంట నుండిరా

మాప్రియకు రమ్ము, అనుచున్ = అని పలుకుచు, అవసితయుంగ్ = అమనోరమా గొంతు; శాతను = అన్వారోచియు, రయమునన్ = శీఘ్రముగా, ఆచటికిన్ = ఆమనోరమ చెలికత్తె లున్న ప్రదేశమునకు, అరిగి = వెళ్లి, పికయొదన్ = పికచోటు, నుంచబడె కన్యయము.

తా. ఆచెలికత్తె లేవసములో నుండినవీ వైద్యము చేసెదను. అక్కడికి నాతో రాండరమ్మని యామనోరమయూ దానును వెంటనే యప్పటికి వెళ్లి.

ఉ. ఆరజనీశబింబరుచి రాస్యలఁ గాంచి తదామయవ్యథా
భారము మాన్పఁగాఁ దమిన్ నృపాలుఁడు తత్కులధాతగోత్రకాం
తారపదంబునం దుపచితం బగుమందును దత్క్రియోచితా
హారము నెమ్మి నిచ్చుచు ననామయధన్యలఁ జేసె వన్నెగాన్,

టీ. ఆరజనీశబింబరుచిరాస్యలన్ = శశిబింబములవలె ప్రకాశించు మొగములుగల మనోరమ చెలికత్తియ లగు జవ్వనులను, కాంచి = చూచి, నృపాలుఁడు = స్వారోచి, తదామయవ్యథాభారమున్ = వారియొక్క రోగాధికయముచేఁ గలిగిన బాధాతిశయమును, మాన్పఁగాన్ = మాన్పుటకు, తమిన్ = అనురక్తితో, తత్కులధాతగోత్ర = ఆరజతాద్రియొక్క, కాంతారపదంబునందున్ = వనప్రదేశమందు, ఉపచితంబు = వృద్ధిబొందినది. అగుమందును = ఆయుసట్టియౌషధమును. తత్క్రియోచితాహారమున్ = ఆ యౌషధక్రియకు కనుకూలమగు నౌషధమును; నెమ్మిన్ = ప్రేమతో, ఇచ్చుచు వన్నెగాన్ = ప్రశస్తియుక్త లగునట్లుగా, అనామయధన్యలన్ = రోగము లేకుండుటచేత ధన్యురాండ్రనుగా, చేసెన్ = ఒనర్చెను.

తా. రోగపీడిత లయినప్రియురాలి చెలికత్తెలం గాంచి స్వారోచి వారిరోగము నివారణ యగునౌషధము రాజతాద్రివిపినములయందే సంగ్రహించి వారి కిచ్చి యారోగమునకుఁ దగినయట్టి పానమును బథ్యము నిచ్చి రోగము నిర్మూల మగునట్లు చేసి వారిని ధన్యురాండ్రనుగా నొనర్చెను.

శా. ఆదివ్యౌషధరాజిచేఁ దమమహావ్యాధివ్యథల్ దీఱినన్
మోదంబంది లతాంగు లంబుజకులంబుల్ నవ్వఁ గందోయితో
సౌదామిన్యభిరామదేహరుచితో సంపూర్ణచంద్రానన
శ్రీదర్పోన్నతితోఁ జెలంగి సురనారీసూనుఁ గీర్తించుచున్.

టీ. లతాంగులు = తీఁగెవంటి మేను గలవారగు మనోరమ నేస్తకత్తెలు, ఆదివ్యౌషధరాజిచేన్ = ఆరజతాద్రియందు సంగ్రహించి యొసంగిన దేవసంబంధము లగు మందులసమూహముచేత, తమమహావ్యాధివ్యథల్ = తమ యొక్క పెద్దవగు రోగపీడలు, దీఱినన్ = పోఁగా, మోదంబు = ఆనందమును, అంది = పొంది, అంబుజకులంబుల్ = పద్మసముదాయమును, నవ్వఁ గందోయితోన్ = పరిహాసము చేయు లోచనద్వయముతోను, సౌదామినీ = శంపాలత వలె, అభిరామ = మనోహరమైన, దేహరుచితోన్ = శరీరకాంతితోను, సంపూర్ణచంద్ర = పూర్ణచంద్రునివంటి, ఆనన = మోముయొక్క, శ్రీ = ప్రభాసంపదయొక్క, దర్ప = గరువముయొక్క, ఉన్నతితోన్ = అతిశయముతోను, చెలంగి = ప్రకాశించి, సురనారీసూనున్ = దేవతాంగనాపుత్త్రుఁడయిన స్వరోచిని, కీర్తించుచున్ = స్తోత్రము చేయుచు, ముందటి కన్వయము.

మహావ్యాధిగావున సామాన్యౌషధములతో నివారణము గాఁజాలదు. చికిత్సావేత్త యగు స్వరోచి దివ్యౌషధసమూహము నొసంగి వ్యాధిని నివారించెను. రోగలక్షణములచే సొంపు చెడియున్న కనులు మోము మేను సంపూర్ణారోగ్యభాసురము లయ్యెను. కృతజ్ఞతాసూచకముగ స్వరోచిని వారు స్తుతించిరి.

తా. మనోరమ నేస్తకత్తె లాదివ్యౌషధమాహాత్మ్యముచేఁ దమరోగపీడ పీడఁగా సంతోషించి పద్మసమానము లగు నేత్రములతో మెఱుపువలెఁ బ్రకాశించు శరీరకాంతితోఁ బూర్ణచంద్రునివంటి ముఖకాంతిసంపద యొక్క గర్వోన్నతితో నొప్పి స్వరోచిని స్తోత్రము చేయుచు. అలం. ఉపమ.

మా కుపకార మొనర్చితి
నీకుఁ బ్రతిసేయ నెట్లు నేరతు మైనన్
లోకోత్తర మావలనను
జేకొనఁ గార్యములుఁ గలవు చెప్పెద మెలమిన్. 15

టీ. లోకోత్తర = ప్రపంచమునం దుత్తముఁ డైనవాఁడా, మాకున్, ఉపకారము = శోకనివారణము గావించుటచే మేలును. ఒనర్చితి = చేసితివి. నీకున్, ప్రతిసేయన్ = ప్రత్యుపకారము చేయుటకు, ఎట్లు నేరతుము = ఏవిధముగా సమర్థురాండ్రము కాఁగలము. ప్రత్యుపకారముగావించి కృతజ్ఞత జెలుపుకొనఁ దగినంతశక్తి మాకు లేదు. ఐనన్ = ప్రత్యుపకారము చేయఁ జాలనివార మైనను, మావలనను = మావలననుకూడ. చేకొనుకార్యములున్ = చేసికొనఁ దగిన కార్యములును, కలవు, ఎలమిన్ = ఆనందమున, చెప్పెదము = ఆకార్యముల నివేదించెదము (చిత్తగింపుము.)

తా. రాజా! మాకు నీవు మహోపకార మొనర్చితివి. దానికిం బ్రత్యుపకారము మేము చేయఁ జాలకున్నను మావలనఁగూడ నీకు సంపాదింపఁ దగినవి కొన్ని యున్నవి. వానిని నుడివెద మాలకింపుము.

క. మును మాదగువృత్తాంతము
వినిపింపఁగ వలయు నీకు విశ్రుతముగ భూ
వినుత విను మనుచు నం దొక
వనజేక్షణ పలికె మధురవాగ్జితశుకి యై. 16

టీ. భూవినుత = పుడమియందుఁ బొగడ్తఁ గన్నవాఁడా! మును = ముందు, మాదగువృత్తాంతము = మాదగుసమాచారమును, విశ్రుతముగన్ = బాగుగఁ దెలియునట్లు, నీకున్, వినిపింపఁగవలయున్ = చెప్పవలయును, వినుము = ఆలకింపుము, అనుచున్ = అని తెలుపుచు, అం దొకవనజేక్షణ = వారిలో నొకయువిద, మధురవాగ్జితశుకియై = తియ్యని పలుకులచేత జయింపఁబడిన

స్త్రీశుకము కలదై, చిలుకపలుకులను మించిన మధురములగు మాటలతో వినుట్లు. పలికెన్ = ఈ విధముగా వాకొనెను.

తా. ఆమనోహరమగు నీ స్తరశిలలో నొకచిన్నది ప్రథమమున నూసం గతి కొంత తెప్పిదమాలికింపు మని మధురములగు వాక్యములతోఁ బలుక మొదలుపెట్టెను. అట్లు. ఈవిధము.

తే. అనఘ మందారవిద్యాధరాత్మభవను
నను విభావసి యండ్రు గంధర్వవరులు
తెలిసియుండుదు నిమ్మహీతలమునందుఁ
బరఁగు మృగపక్షిజాతులభాష లెల్ల. 17

టీ. అనఘ = పాపరహితుఁడా! (నేను), మందార = మందారుఁడను నామముగల, విద్యాధర = విద్యాధరునియొక్క, ఆత్మభవను = కొమరితెను, ననుఁ, గంధర్వవరులు = గంధర్వోత్తములు, విభావసి, అండ్రు = అని పిలిచెదరు. ఇమ్మహీతలమునందుఁ = ఈభూమియందు, పరఁగు = ఒప్పునట్టి, మృగ...భాషలు-మృగపక్షిజాతుల = మృగజాతులయొక్కయు పక్షిజాతుల యొక్కయు, భాషలు=పలుకులు, ఎల్లన్=సమస్తమును, తెలిసియుండుదున్ = తెలిసికొనియుంటిని.

తా. ఓరాజా! నేను మందారుఁడనువిద్యాధరునికుమార్తెను. నాపేరు విభావసి. భూమిమీఁదఁ గలమృగములయొక్కయుఁ, బక్షులయొక్కయు మాటలన్నింటి యర్థము నెఱుంగుదును.

క. అమ్మేటివిద్య నాచే
నిమ్ముగ నంతయు నెఱింగి నృప నన్ను వివా
హ మ్మగు మనవుఁడు రెండవ
కొమ్మ మదిం బ్రేమ గడలుకొన నిట్లనియెన్

టీ. నృప = రాజా! అన్మేటివిద్య = ఆగొప్పదియగు పశుపక్షిభాషా గ్రహణవిద్యను, నాచేన్ = నాచేతను, ఇమ్ముగన్ = చక్కఁగా, అంతయున్ = సంపూర్ణముగా, ఎఱింగి = తెలిసికొని, నన్నున్ ; వివాహమ్మగుము = పెండ్లిచేసికొనుము. అనవుడున్ = అనఁగా, రెండవకొమ్మ = మఱియొకచిన్నది, మదిన్ = చిత్తమునందు, ప్రేమ = అనురాగము, కడలుకొనంగన్ = వృద్ధిపొందఁగా, ఇట్లనియెన్ = ఇటులఁ బలికెను.

తా. రాజా! ఆగొప్పవిద్యను నావలన సర్వమును గ్రహించి నన్నుఁ బెండ్లియాడు మని చెప్పఁగా, రెండవచిన్నది యనురాగాతిశయముచే నిట్లని స్వరోచితోఁ దనవృత్తాంతము దెలిపెను.

ఆ. పారుఁ డనఁగఁ బరఁగు బ్రహ్మర్షి మాతండ్రి
యతఁడు విద్య లెల్ల నభ్యసించి
తపము నిచ్చఁ జేయఁ దలపోసి కీరభృం
గాళిరమ్య మైనయాశ్రమమున. 19

టీ. మాతండ్రి, పారుఁ డనఁగన్ = పారుఁ డనునామముచేత, పరఁగు బ్రహ్మర్షి = ఒప్పుచున్న బ్రహ్మఋషి, అతఁడు = ఆజ్ఞానియగునాతండ్రి, విద్య లెల్లన్ = సర్వవిద్యలను, అభ్యసించి = అభ్యాసముచేసి, ఇచ్చన్ = చిత్తమునందు, తపమున్ = తపస్సును, చేయన్ = ఒనర్చునట్లు, తలపోసి = ఆలోచించి, కీరభృంగాళిన్ = శుకములయొక్కయుఁ దేఁటులయొక్కయుం వరుసలచేత, రమ్యము = హృదయాహ్లాదము, ఐన, ఆశ్రమమునన్ = తపోవనస్థలమందు, ముందటి కన్వయము.

తా. నాతండ్రి యగుపారుఁ డను బ్రహ్మర్షి సర్వవిద్యల నభ్యసించి తపస్సుఁ జేయఁ జిత్తమునందుఁ దలంచి చిలుకలచేఁ దుమ్మెదలచే మనోహర మయినతపోవనంబున.

మ. ఫలమూలచ్ఛదనాంబుభుక్తిఁ బవనాభ్యాసక్రియాయుక్తిని
ర్దళితాంతర్గతశాత్రవప్రకరజాగ్రద్గర్వసర్వస్వుఁడై

చలికిన్ వానకు నెండకున్ మన మనుత్సాహంబు గానీక కం
దళితానందమునన్ ముకుందచరణధ్యానావధానంబునన్. 20

టీ. ఫల = ఫలములయొక్కయు, మూల = వ్రేళ్లయొక్కయు, ఛద = పత్రములయొక్కయు, అంబు = జలముయొక్కయు, భుక్తిన్ = భుజించుటచేతను, పవనాభ్యాసక్రియాయుక్తిన్ = గాలిని ధరించు నలవాటు చేయుపనియొక్క కలయికచేతను - వాయువును ధారణము చేయు నలవాటుచేత, నిర్దళిత = ఛేదింపఁబడిన, అంతర్గత = లోపలనుండు కామాదులగు, శాత్రవ = విరోధులయొక్క, ప్రకర = సముదాయముయొక్క, జాగ్రత్ = వృద్ధిఁ బొందిన, గర్వసర్వస్వుఁడై = పూర్ణగర్వముగలవాఁడై - కామక్రోధలోభమోహమదమాత్సర్యము లను నరిషడ్వర్గములను నణఁచివైచి, చలికిన్ = శీతబాధకును, వానకున్ = వర్షబాధకును, ఎండకున్ = ఆతపబాధకును, మనము = చిత్తము, అనుత్సాహంబు = యత్నము విడిచినది, కానీక = కానియ్యక - శీతవర్షాతపబాధలకు సహించి, కందళితానందమునన్ = పుట్టుచున్నయానందముతో, ముకుంద = నారాయణమూర్తియొక్క, చరణ = కాళ్లయొక్క, ధ్యాన = తలఁచుటయందలి, అవధానంబునన్ = సావధానముగా, ముందటి కన్వయము.

తా. కందమూలఫలపర్ణాదు లాహారముగాఁ బవనధారణ చేసి కామక్రోధాదుల జయించి శీతవర్షాతపముల బాధవలన మనస్సును గదలనీయక నిశ్చలముగా నుంచుకొని యానందముతో నారాయణపదధ్యానమందు మఱపులేనివాఁడై పారుఁ డనుమహర్షి సత్తముఁడు.

క. అంగుష్ఠము నిల మోపి ప
తంగునిపైఁ జూపు సాచి ధగధగ లర్చి
స్తుంగత నింగులు నాకెడు
నింగలములు నాల్గుదెసల నిడుకొని కడఁకన్. 21

టీ. అంగుష్ఠము = పాదముయొక్క పెద్దవ్రేలిని, ఇలన్ = పుడమియందు, మోపి, పతంగునిపైన్ = భాస్కరునిమీఁద, చూపు, చాఁచి = వ్యాపింపఁజేసి, ధగధగలు = ధగధగ మను జ్వాలలప్రకాశములు, అర్చిస్సంగతన్ = జ్వాలలయొక్క యున్నతిచేత, నింగులు = గగనమును (అధికార్థమందు బహువచనప్రయోగము), తాకెడు నింగలములు = తాఁకుచున్న వహ్నులను, నాల్గుదెసలన్ = నలువైపులను, ఇడుకొని = పెట్టుకొని, కడఁకన్ = ధైర్యముతో, ముందటికన్వయము.

తా. పాదాంగుష్ఠము భూమిపై మోపి సూర్యదేవుం గాంచు నాకాశము నంటుచున్నవహ్నుల నలుదెసల నిండుకొని పట్టుదలతో, అలం. అతిశయోక్తి.

క. సురగరుడయక్షరాక్షస
నరకిన్నరసిద్ధసాధ్యనాగోత్కర మి
ట్లరు దనఁగఁ దప మొనర్చెన్
బురుహూతుఁడు దాన నాత్మఁ బొడమినభీతిన్. 22

టీ. సుర...త్కరము = దేవతలు, గరుడులు, యక్షులు, రాక్షసులు, నరులు, కిన్నరులు, సిద్ధులు, సాధ్యులు, నాగులు మొదలగువారియొక్క, ఉత్కరము = సముదాయము, ఇట్లు = ఈరీతినిఁ దపముచేయుట, అరుదు = దుర్ఘటము, అనఁగన్ = అని ప్రశంసించుచుండ, తపము = తపస్సును, ఒనర్చెన్ = చేసెను, దానన్ = ఈవిధముగాఁ దపముచేయుటవలన. పురుహూతుఁడు = దేవేంద్రుఁడు, ఆత్మన్ = చిత్తమునందు, పొడమినభీతిన్ = జనించిన భయముతో, ముందటికన్వయము.

ఇంద్రునకు భయముగలిగినకారణము త్రిభువనాధిపత్యమును గోరి తపముగావించుచున్నాఁడేమో యని. ఇంద్రుఁడు పరతపస్సునకు వెఱచు ననుట ప్రసిద్ధము.

తా. దేవతలు మొదలగువారికన్న నెక్కుడుగాఁ దపస్సు చేయుటచే దేవేంద్రుఁడు మనస్సునఁ బుట్టినభయముతో.

క. తనయొద్దఁ బుంజికస్థల
యనునచ్చరలేమ యున్న నమ్మునికడకుఁ
జను మని యనిపినఁ బలిశా
సనమున వని కేఁగుదెంచె సంభ్రమలీలన్. 23

టీ. తనయొద్దన్ = తనకడ, పుంజికస్థల, అనునచ్చరలేమ = అను నామముగల యప్సరస్త్రీ, ఉన్నన్, అమ్మునికడకున్ = అతపముఁ జేయుచున్న వానియొద్దకు, చనుము = వెళ్లుము, అని యనిపినన్ = అని పంపఁగా, బలిశాసనమునన్ = ప్రభువానతిచే, సంభ్రమలీలన్ = త్వరతోఁ గూడిన విలాసముతో, వనికిన్ = అడవికి, ఏఁగుదెంచెన్ = వచ్చెను.

తా. తనయొద్ద నున్నపుంజికస్థలయనునప్సరసను జూచి దేవేంద్రుఁడు తపస్సు చేయుచున్న మునియొద్ద కేఁగు మని చెప్పఁగాఁ బ్రభువునానతిచేఁ దొందరగా నలంకరించుకొని యడవి కేఁగెను.

చ. చిలుకలు ముద్దుఁబల్కులకుఁ జేరఁగ రా నెఱివేణికాంతికిన్
మలయుచుఁ బైపయిన్ మధుపమాలిక వాయక సంచరింపఁగా
నలసవిలాసయానమున నమ్మునిపాలికి వచ్చె వేల్పుఁదొ
య్యలినునుపొనఁబట్టినయనంగునిమోహనబాణమో యనన్.

టీ. వేల్పుఁదొయ్యలి = పుంజికస్థల, ముద్దుఁబల్కులకున్ = అందమగుపలుకులకు, చిలుకలు, చేరఁగరాన్ = సమీపమునకుఁ జేరఁగా, పుంజికస్థలపలుకులు చిలుకపలుకులవలె నుంట సజాతీయ మగు చిలుకయని చిలుకల గుంపు డాసె నని భావము. నెఱివేణికాంతికిన్ = చక్కనిజడయొక్క కాంతికి, మధుపమాలిక = తేఁటిమొత్తము, పైపయిన్, మలయుచున్ = వ్యాపించుచు, వాయక = విడువక, సంచరింపఁగాన్ = మెలఁగంగా, తుమ్మెదలవలె నల్లఁగా నున్న జడను గాంచి తుమ్మెదలగుంపు సజాతీయము లగు తుమ్మెదచాలని భ్రమనొంది యావరించి సంచరించుచుండె నని భావము. అలస = నెమ్మదియగు, విలాస=

శృంగారచేష్టతోడి, యానమునన్ = గమనముతో, నను = మృదువైన - పొనఁబట్టిన, అనంగుని = మన్మథుని యొక్క, మోహనబాణమో = మరుల గలిగించు మోహన మను తూఁపో యేమో, అనన్, అమ్మునిపాలికిన్ = ఆఋషియొద్దకు, వచ్చెను.

తా. శుకవాక్యములవంటి హృదయానందకరము లయినపలుకులును, తేటిచాలును బోలువేణియును, విలాసములలోఁ గూడిన మెత్తఁది యగుగమనమును ప్రకాశింపఁగా మదనుని మోహనబాణమురీతి మోహముం గలిగించు నదియై యప్సరస తప మొనరించుచున్నమునియొద్దకు వచ్చెను. అలం. ఉత్ప్రేక్ష. ఉపమ. భ్రాంతిమంతము.

వ. ఆసమయంబున. 25

చ. అనువగుసుళ్ల నొప్పుమలయానిలవాహము నెక్కి తేంట్లన
ల్లినవిడువాగెఁ బూని లవలీనవవల్లిక లెమ్మెసొమ్ములై, పను
పడఁ జెట్టువట్టి మనుప్రాంతదళమ్ములతోడఁ దోలెనా,మనిదొర
మంచురాజు మడియించగఁ గోయిలగంట మ్రోయఁగన్. 26

టీ. ఈపద్యమునందు వసంతర్తువును గవీశ్వరుఁడు యగవానిపై దండెత్తు రాజుగా నిరూపించి యీవిధముగఁ జెప్పుచున్నాఁడు.—ఆమనిదొర=వసంతఋతువనురాజు, అనువు=మంచి, అగుసుళ్లన్ = అయినట్టిసుడులచే, చక్రాకారముగ భ్రమణముచే నని వాయుపరముగను దేవమణిలోనగు నావర్తములచే నని యశ్వపరముగను గ్రాహ్యము. ఒప్పు = ఒప్పుచున్న, మలయానిలవాహమున్ = మలయపర్వతమునుండి వచ్చుగాలి యను నశ్వమును, ఎక్కి = అధిష్ఠించి, తేంట్లన్=తుమ్మెదలను, అల్లిన=పేనిన, నిడువాగెన్ = పొడవగు కళ్లెపుంద్రాటిని, పూని = పట్టుకొని, లవలీనవవల్లికలు = క్రొత్తవెన్నెలలతలు, ఎమ్మెసొమ్ములై = అందమగు నలంకారములై, పనుపడన్ = కుదురఁగా, చెట్టువట్టి=చెట్టను బట్టుకొని, మనుప్రాంతదళమ్ముతోడన్ = మెలఁగుచుట్టి పండుటాకు

లనెడి ప్రముఖనట్టి పూర్వసేవకుల దండుతో, మంచురాజు = హిమవత్కాల మను విరోధిరాజు, వడిమంచఁగన్ = బలహీనుఁడు కాఁగా, కోయిలగంట = పరభృతనాద మను జయఘంట, మ్రోయఁగన్ = మ్రోఁగుచుండఁగా, గణ గణ మ్రోఁగుచుండఁగా ననుట, తొలఁగెన్ = తలఁగెను.

వసంతఋతువు దరియఁగా దక్షిణపు వలిగాలి వీచెను. తేఁట్లు బాఱు లంగా సంచరింప నారంభించెను. వెన్నెలతీఁగలు చివుళ్లతో నలరి సాల గడల నల్లుకొన సాగెను. మంచుకాలము గడచుట పండుటాకులు రాలె నని ఫలితార్థము.

తా. చుట్టుకొని చుట్టుకొని వీచుచున్న శీతముతోను, బజ్జ్యాలు దీరి ధ్వనిఁజేయు తేంట్లతోడను, వెన్నెల లకలయున్నలతోను, వసంత ఋతువు మంచిపుడుల గలయశ్వము నెక్కి కష్టెంపుఁబ్రాటివి లాగి పట్టి యందములగు భూషణములం దాల్చి యేతెంచు గొప్పరాజునీతి నేతెంచి వృద్ధి యడఁగిన హిమవత్కాల మనువిరోధినృపాలుని చెట్లయందలి పండిన పత్త్రములను పూర్వ సేవకుల దండులతోఁ బాఱఁదోలి పరభృతారావములను జయమును దెలుపు గంటను మొరయించెను. అలం. రూపకము.

సీ. సౌన దేఱి పాటమరించి నెఱె వాసినయట్టి
యాకురాలుపుగండ్లయందుఁ దోఁజెఁగి
యతిబాలకీరచ్ఛదాంకురాకృతిఁ బొల్చి
కరవీరకోరకగతిఁ గ్రమమున
నరుణంపుమొగ్గలై యరవిచ్చి పికిలిపూఁ
గలదండలట్లు గుంపులయి పిదప
రేఖ లేర్పడఁగ వర్ధిలి వెడల్పయి రెమ్మ
పసరువాఱుచు నిక్కఁ బసరు కప్పు
తే. పూఁటపూఁటకు నెక్కఁ గప్పునకుఁ దగిన
మెఱుఁగు నానాటికిని మీఁద గిఱికొనంగ

సోగయై యాకువాలంగ జొంప మగుచుఁ
జిగురు దళుకొత్తెఁ దరులతాశ్రేణులందు. 27

టీ. సొన = ద్రవము, తేటి=నిర్మలముగా నగపడి-చెమ్మగంటులనుండి వైకుబికి, పొటమరించి = అంకురమెత్తి. బొబ్బవలె నించుక యుబ్బుగాఁ గని పించి యని కొందఱు. పొటమరయన బొబ్బ. ఉ. "పొటమర్లు కెంపులపోల్కి నమరె." మొల్ల. రా. నెఱె=నాదు, వాసినయట్టి=వీడినటువంటి, ఆకురాలుపు గండ్లయందుఁ = పత్రములు డుల్లినపల్లములనుండి, తొఱఁగి = వెడలి, అలి= ఎక్కువగు, బాలకీర = శుకశాబకములయొక్క, ఛదాంకుర = పక్షాంకురముల యొక్క, మొలకలవలె మొలచు ఱెక్కలయొక్క యనుట. ఆకృతిఁ=రూప ముతో, పొల్చి = తగి, క్రమమునఁ = వరుసతో, కరవీరకోరకగతిఁ = ఎఱ్ఱగన్నేరు మొగడలరీతి, అరుణంపుమొగ్గలై = ఎఱ్ఱని మొగ్గలై, అరవిచ్చి = సగమువిడి, పికిలియాఁకలదండులట్లు = పికిలిపిట్టఱెక్కలతోఁ జేసినదండల వలె, గుంపులయి = గుబురులయి, పికిలిపిట్ట పృష్ఠభాగమున నుండు నెఱ్ఱని మృదువులగు నీఁకలఁదీసి దండలుగాఁ గట్టుదురు. ఆదండలవలెఁ జివురులాకు గంటులనుండి కనిపించుచుండె నని భావము. పిదపఁ = అటుపిమ్మట, రేఖలు= ఈనెచారలు, ఏర్పడఁగ = ఏర్పడునట్లు, వర్ధిలి = పెరిఁగి, వెడల్పయి = నిడుదయై, రెమ్మ = చిన్నకొమ్మ, పసరువాఱుచుఁ=పచ్చఁబడుచు, నిక్కఁ = నిగుడఁగా, పసరు = పసరుదనము, ప్రొఁటప్రొఁటకుఁ = ఒక్కొక్క ప్రొఁటగడచినకొలంది, కప్పు = నలుపు-నీలిరంగు, ఎక్కఁ = అతిశయము కాఁగా, కప్పునకుఁ = ఆనీలిమకు, తగినమెఱుఁగు = తగినకాంతి, మీఁదఁ= మీఁదిప్రదేశమందు, నానాఁటికిఁ = ఒకనాఁటికన్న నొకనాఁటికి, గెలి కొనంగఁ=చుట్టుకొనఁగా, సోగయై=పొడవై, ఆకు, వాలంగఁ=వ్రేలాడఁగా, జొంపము = గుబురుకొనినది, అగుచుఁ, తరులతాశ్రేణులందుఁ = చెట్ల యొక్కయు లతలయొక్కయుం పఙ్క్తులయందు, చిగురు, దళుకొత్తెఁ = మెఱుఁగొందెను - ప్రకాశించెను.

రేఖలేర్పడ వర్ధిలి యను పాఠమునకు ఈనెలం స్పష్టముగాఁ గానిపించుట పెరిఁగి యని యర్థము. ఈ పాఠ మంత సమంజసముగా లేదు.

తా. వసంతకాలము రాఁగా చెట్లు, లతలు మున్నగువానియందలి పండుటాకులు రాలఁగా నూపత్రములు గానవచ్చుటయుఁ దేమ గలిగి మొసులెత్తి గ్రుడ్డునుండి బయలువెడలిన శుకకిశోరములపక్షాంకురములవలెఁ గాన్పించి తరువాత సెట్టిక స్నేయరంగుముకుళములై పిదప నామొగడలు పడి పికిలిపిట్టవెండ్రుకలవలె నేర్పడి పిదప కొమ్మలు బలసి పసరురంగు గలిగి యూపచ్చఁదనము నలువెక్కి వానికిఁ దగుకాంతితోఁ బొడవై పత్రములు వ్రాలఁగా నుజ్జ్వలమగు పల్లవము వెలుఁగొందెను. అలం- స్వభావోక్తి.

క. హిందోళంబునఁ బాడిరి
బృందారకసతులు విరహిబృందార్తిగఁ ద్రేఁ
చెం దేఁటులు వాసంతిక
విందునఁ బికశిశువు దాడి వెడలం దోలెన్. 28

టీ. బృందారకసతులు = దేవతాంగనలు, విరహిబృందార్తిగన్ = ప్రియుల నెడబాసిన ప్రియురాండ్రయొక్కయుఁ బ్రియురాండ్ర నెడబాసిన ప్రియులయొక్కయు సముదాయమునకు బాధ కలుగునట్లుగా, హిందోళంబునన్ = హిందోళ మను రాగముతో, పాడిరి = గానముచేసిరి. తేఁటులు = తుమ్మెదలు, వాసంతికవిందున్ = బండిగురివెందపూఁదేనె ద్రావుట యను నిష్టభోజనముచే. త్రేఁచెన్ = త్రేపును గనెను. పికశిశుల్ = కోయిలపిల్లలను, దాడి = పెంపుడుజనని యగు కాకి, వెడలందోలెన్ = వెడలఁగొట్టెను.

వసంతఋతువునందుఁ గోయిలలు మనోహరముగాఁ గూయుట ప్రసిద్ధము. కూఁత వినినంతనె కోకిలలని గుర్తించి కాకులు కోయిలలను బారదోలుచుండెను. కోకిలశిశువులం గాకి తనబిడ్డ లని పెంచునుగాన దాది యని చెప్పఁబడెను. శ్లో. "శిశిరస్య వసంతస్య సంధౌ హిందోళరాగకః" యని గ్రం

ఘాంతరమునందుఁ గావున వసంతారంభమునఁ దుమ్మెదలు హిందోళరాగమున గానముచేసెను. వసంతర్తువునందు హిందోళరాగము పాడఁదగిన దనుటకు.—

మ. "అరిగా పంచమ మేవగించి నవలా లవ్వేళ హిందోళమై
ఖరిజాటం బికజాతమాత్సరవభంగవ్యాకులంబై వనీ
ధర నాలంబితపల్లవవ్రతవిధుల్ తాల్పం దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహాసంపూర్ణభావోన్నతిన్."

(వసుచరిత్రము. ఆ. ౧-ప. ౧౨౫.)

తా. వసంతకాలము వచ్చినతోడనే పరభృతము కూయుచుండఁగా నాకూఁత నాలకించి కాకము కోకిలను తన గూటినుండి వెడలఁగొట్టెను.

సీ. చలిగాలి బొండుమల్లెలపరాగము రేఁచి
నిబిడంబు సేసె వెన్నెలరసంబు
వెన్నెలరస ముబ్బి వెడలించె దీర్ఘికా
మందసౌగంధికమధురసంబు
మధురసం బెగఁబోసె మాకందమాలికా
క్రీడానుషంగిభృంగీరవంబు
భృంగీరవం బహంకృతిఁ దీఁగెసాగించెఁ
బ్రోషితభర్తృకారోదనముల
తే. విపినవీథుల వీతెంచెఁ గుపితమదన
సుభటభుజనతసుమధనుష్టాంకృతములు
సరసమధుపాననిధువనోత్సవవిలీన
యువతియువకోటికోరికల్ చివురులొత్త. 29

టీ. చలిగాలి=చల్లనిగాలి, బొండుమల్లెలపరాగముఁ = బొండుమల్లె పూవులపరాగమును, రేఁచి = రేఁగించి, వెన్నెలరసంబుఁ = చంద్రకాంతి యొక్క జలమును, నిబిడంబుసేసెన్ = పూర్ణముగునట్లు చేసెను. వెన్నెలరసము

చంద్రికాద్రవము, ఉబ్బి = ఉబికి-పయికిఁబొంగి, దీర్ఘికా = దిగుడుబావుల యందలి, అమంద = విస్తారమయిన, సౌగంధిక = ఎక్కువసువాసనగల యెఱ్ఱ కలువలవలని, మధు = తేనెయొక్క, నదంబుల్ = ఏటిని, వెడలించెన్ = ప్రవహింపఁజేసెను. వెన్నెలరసము ఎఱ్ఱకలువపూవులలోని తేనియతోఁ గలిసి యేఱువలెఁ బ్రవహించె నని భావము. 'మధునదంబు = ఆ పుష్పమరందనదము, మాకంద=రసాలములయొక్క, మాలికా=పఙ్క్తులయందలి, క్రీడా = ఆటల లోను, అనుషంగి = కూడుకొనిన, భృంగీ = ఆఁడుతేంట్లయొక్క, రవంబు ధ్వానమును, ఎగఁబోసెన్=విజృంభించునట్లు చేసెను. ఆఁడుతుమ్మెదలపాటలను టచేఁ గంఠరవమునందలి మనోహరత సూచితము. మగతుమ్మెదలపాటలకంటె నాఁడుతుమ్మెదలపాటలె మనోహరముగా నుండు ననుటకు—"సుమచరదళినీ గానముక్రందై" అని వసుచరిత్రమునందును, సీ. "తీఁగెయుయ్యాల లెక్కి తూఁగియాడుచుఁ గూడి పాడెడు మత్తాళిబాలికలును" అని నిర్వచనోత్తర రామాయణమునందును గలయంశము లనుసంధించునది. భృంగీరవంబు=ఆఁడు తేంట్లయొక్క ధ్వని, అహంకృతిన్ = గర్వముచేత, ప్రోషితభర్తృకారోదనములన్ = పెనిమిటి యితరదేశమందుండుటచే విచారమునొందిన యువిదలయొక్క ఏడ్పులను, తీఁగె సాగించెను = వృద్ధిచేసెను. తేటులపాట లాలించి కామోద్రేకపరవశలై వియోగినులు విచారము నొందుచుండి రనుట. కుపిత = కోపించిన, మదన = మన్మథునియొక్క, సమద = మత్తతతోఁ గూడిన, భుజ=భుజములచేత, నత = వంపఁబడిన, సుమధనుః = పుష్పబాణము యొక్క, టాంకృతములు=టంకారధ్వానములు, సరస = రసముతోఁగూడు కొనిన, మధుపాన=మద్యపానముచేసి, నిధువన = రతిక్రీడజరుపుటయొక్క, ఉత్సవ=వేడుకయందు, ఓలీన = కలిసియున్న, యువతి = యౌవనాంగనల యొక్కయు, యువ = యౌవనపురుషులయొక్కయు, కోటి=సముదాయము యొక్కయు, కోరికలు = అభీష్టములు, చివురులొత్తన్=చిగిరింపఁగా, విపిన వీథులన్ = ఉద్యానవనములందు, ఏతెంచెన్ = వ్యాపించెను.

పుష్పరసము గ్రోలుటవలనఁ దుమ్మెదలకు మృదుమధురమగు కంఠరవము కలుగు ననుట సుప్రసిద్ధము. ప్రోషితభర్తృకలకు విచారదాయకముగా నుండె ననుటచేఁ దేఁటులపాటలు మఱింత శ్రావ్యముగా నుండె ననుట. మకరందపానముచేఁ దుమ్మెదల కంఠస్వరమునందు శ్రావ్య మతిశయించుటకు——

శ్లో. "రతిపతిప్రహితేవ కృతక్రుధః ప్రియతమేషు వధూరనునాయికాః
వకుళపుష్పరసాసవపేశల, ధ్వనిరగాన్నిరగాన్మధుపాళినః.
మధురయా మధుబోధితమాధవీ, మధుసమృద్ధిసమేధితమేధయా
మధుకరాంగనయా ముహురున్మదః ధ్వనిభృతానిభృతాక్షరముజ్జగే."
(మాఘకావ్యము.)

మద్యపానము కామోద్దీపకమనుట ప్రసిద్ధము.

"దేశాంతరగతే కాన్తే ఖిన్నా ప్రోషితభర్తృకా" యని ప్రోషితభర్తృకాలక్షణము.

తా. వసంతకాలమందుఁ జల్లనిమారుతముచే పొగసిన మల్లికాపుష్పపరాగముచేత, చంద్రికవలన ద్రవించుచున్నజలము చిక్కఁబడెను. వెన్నెల నీటి ముంపువలన బొడ్డుబావులయందలి యెఱ్ఱకలువలవలని పూఁదేనె దమ్మై ప్రవహించెను. ఆపుష్పమరందము యొక్క కాలువచేతఁ దియ్యమామిడిచెట్లలోఁ దిరుగుచున్న మధుకరముల ధ్వని హెచ్చెను. వానిచే దేశాంతరమందున్న భర్తలం గూర్చి యేర్పడు స్త్రీలవిచారములు వృద్ధిపొందెను. వానిచే మదనుని పుష్పబాణముల ప్రోఁతలు విహారవనములం దలముకొనెను. ఆబాణధ్వనులు వ్యాప్తము కాఁగా మధురము లయినమద్యములం ద్రావి యాడుచున్న స్త్రీపురుషుల కాంక్షలు తీఱెను. అలం. కావ్యలింగము. కారణమాల.

క. అత్తఱి మురిపపుసడఁ జెలి
కత్తియగమి గొలువ మృదులకలభాషలఁ ద
ళ్కొత్తెడు వెడసగవులతోఁ
జిత్తభవుఁ డాఁడ్వనసలు చిదుము నెసమునన్. 30

టీ. ఆత్తఱిన్ = ఆ సమయమందు, మూరిపవ్వనదన్ = యౌవన మదముచే నైనగమనముతో, చెలికత్తియ యామిని = నేస్తుకత్తెగుంపు, కొలువన్ = పరిచర్య సేయఁగా, మృగమలకలభాషలన్ = మృదువగు నుచ్చారణగల పలుకులతోను, తళ్కొత్తు వెడనగవులతోన్ = వెలుఁగుచున్న చిఱునగవులతోను, చిత్తభవుండు = మారుఁడు, అర్చన్ = అఱవఁగా, ననలు = పుష్పములు, చిదుము నెపమునన్ = త్రెంపుట యను నెపముచేత, ముందటికన్వయము.

ఆర్చఁగాన్ = సింహనాదము చేయఁగా నని కొందఱు, విచారముతో విలపింపఁగా నని కొందఱు వ్రాసిరి. జనములును లగుపూలఁ గోయుం యువతులఁ గోపించునటు లఱచుచుండె ననుట సమంజసముగా నున్నది.

తా. ఆ వసంతకాలమందు యౌవనగర్వమునదకలతోఁ జెలికత్తెలు సేవించుచుండ మార్దవముగల పలుకులతోడను, చక్కని చిఱునవ్వులతోడను మదనుఁడు కేకలు వెట్టునట్లు పుష్పములు గోయుంటకాను నెపమున.

చ. అలకనిచోళిలోఁ గుసుమ మద్దినపావడ దోఁపఁ గొప్పుచెం
గలువలవల్పుఁ జన్నుఁగవకస్తురితావి యుఁ బ్రస్తరింప నం
దెలరొద మీఱఁ జెన్నిధిగతిఁ బ్రతికిం బొడకట్టె వేల్పుఁదొ
య్యలిచిఱుసానఁ బట్టినయనంగుని మోహనబాణమో యనన్.

టీ. వేల్పుఁదొయ్యలి = పుంజికస్థల, అలకనిచోళిలోన్ = పలుచని చీరలో, కుసుమము = రక్తవర్ణము - కుసుంబారంగు, అద్దిన = వేసిన, పావడ = కుచ్చెళ్ళ, తోఁపన్ = మీఁదికిఁ గానిపింపఁగా, కొప్పు = కురుముడి యందుఁ దుఱిమిన, చెంగలువల = రక్తోత్పలములయొక్క, వల్పున్ = సౌరభమును, చన్నుఁగవ = కుచద్వంద్వమునందుఁ బూయఁబడిన, కస్తురి = మృగనాభియొక్క, తావియున్ = సౌరభమును, ప్రస్తరింపన్ = నలువైపులకుఁ బ్రసరింపఁగా, తచ్ఛనలాడఁగా నని యొకవ్యాఖ్యాత. అందెలరొద = అందెల

యొక్క—చప్పుడు, మిగులన్ = అధికము కాఁగా, పెన్నిధిగతిన్ = పెద్దనిక్షే పము రీతి, చిఱుసోనన్ = చిన్నమెఱుఁగుసోనయందు, నట్టిన = నాఁటిన అనంగుని = మదనునిదైన, మోహన బాణమో = మోహనమను గణించు పుష్పబాణమే మో, అనన్, ద్రులికిన్ = ఆ మునీశ్వరునకు, పొడకట్టెన్ = తెలిసెను.

మరునిబాణములు ఐదింటిలో నొకటి మోహకరము. పుంజికస్థల చిఱుసోనపట్టిన మదుని సమ్మోహనబాణ మగుటచే జూచినంతనవలపుగొలుపు ననుట. మరునిబాణములలో నొకటి సమ్మోహకర మనుటకు—

"ఉన్మాదనస్తాపనశ్చ శోషణ స్తంభన స్తథా,
సమ్మోహనశ్చ కామస్య పంచబాణాః ప్రకీర్తితాః"

తా. పుంజికస్థల యనునప్సరస్త్రీ రక్తవర్ణముగల గాగరా ధరించి దానిమీఁద సన్నపాఁటిపైఁట వైచుకొని సౌరభమును గుబాళిల్లురక్తోత్పలము లను గొప్పునఁ బెట్టుకొని స్తనద్వయమున కస్తూరిగంధము నలందుకొని మదనునియొక్క మోహనబాణమో యనునట్లు కాలియందెలు ధ్వనిసేయ సౌయ్యారముగా నడచుచు నామునియెదుటఁ జని నిలువంబడెను.

తే. అత్తఱింగున నదిరిపాటొరజంపు
వన్నెఁ బొడకట్టి తాఁ బాడుసన్నరవళి
పాట లలిఝంకృతిశ్రుతిఁ బాదుకొనఁగఁ
జూడకయ చూచుచూపుతో సుడియుటయును. 32

టీ. అత్తఱింగునన్ = అట్లు, అదిరిపాటు = హఠాత్తుగా, ఉన్నటు లుండి, అరజంపువన్నెన్ = అందమగువేసముతో, పొడకట్టి = కాన్పించి, తాన్ = ఆ పుంజికస్థల, పాడు = పాడుచున్నట్టి, సన్నరవళి = సన్నని ధ్వని తోడి పాటలు, అళిఝంకృతిశ్రుతిన్ = తేఁటిరొద యను శ్రుతియందు, పాదుకొనఁగన్ = నెలకొనఁగా-లయించఁగా ననుట, చూడకయ = వీక్షించక

పట్టే, చూచుచూపులతోన్ = వీక్షించునట్టి కడగంటిచూపులతో - చూడనటుల నటించి చూచు నోరచూపులతో, సుడిఁయుంటయున్ = చుట్టుకొని సంచరింపఁగా.

తా. అట్లకస్మాత్తుగా సంభవమయిన రోసముతో నామునికిఁ గాన్పించి తేంట్లఝుంకారములతోఁ గలియునట్లు సన్ననిధ్వనితో సంగీతముఁ బాడుచు నోరచూపులతో నామునిం జూచుచుఁ జుట్టి చుట్టి సంచరించుచుండఁగా.

ఉ. తలకొని దానితమ్ములపుఁదావియు మోవియుఁ గౌను మేనున
గ్గలపు మెఱుంగులీను తెలిగన్నులుఁ జన్నులు భృంగమాలికన్
గెలిచిన యారుతీరుఁ దగు నెన్నడలున్ దొడలున్ వివేకమున్
గలఁపఁగఁ గాంచి పంచశరకాండవిఖండితధైర్యసారుఁడై. ౩౩

టీ. దానితమ్ములపుఁ దావియున్ = ఆపుంజికస్థలయొక్క తాంబూలపు సౌరభమును, మోవియున్ = అధరోష్ఠమును, కౌనున్ = నడుమును, మేనున్ = శరీరమును, అగ్గలపు మెఱుంగులు = అధికమగు ప్రకాశములను, ఈను తెలిగన్నులున్ = జనింపఁజేయు తెల్లని నేత్రములును, చన్నులున్ = స్తనములును, భృంగమాలికన్ = తేంట్లమొత్తమును, గెలిచిన యారుతీరున్ = జయించిన నూగారుయొక్క యందమును, తగు నెన్నడలున్ = తగిన గమనములును, తొడలున్ = ఊరువులును, వెనుకటిపద్యమునందుఁ బుంజికస్థల చూచియుఁ జూడనటుల నోరచూపులతో మునినిఁ దిలకించెను. క్రీఁగంటితోఁ గాంచుకలికి కనుపాపకొలకులకేఁగుటచేఁ గన్నంతయుఁ దెల్లఁగాఁ గాన్పించుఁగాన కవి యిటుఁ దెలికన్నులని ప్రయోగించెను. పెద్దన చూపులఁ దెలుపుగ వర్ణించును. రెండవయాశ్వాసమున—"విలోకనప్రభాపిచికలం దదీయపదవీఁ లశాంబుధి" "చంద్రికల్ దనకంజూపె, కన్నుఁగవధవళరుచుల్." అని చూపుల శుక్లవర్ణములుగనె వ్రాసెను. కవిసమయమునందుఁ జూపులను తెల్లనివిగ నల్లనివిగనుభయములుగా వర్ణించుట గలదు. తలకొని=వహించి, వివేకమున్ = తెలివిని, కలఁపఁగన్ = కలఁతపరుపఁగా, కాంచి = పుంజికస్థలను వీక్షించి, పంచశర =

మదనునియొక్క, కాండ=శరములచేత, విఖండిత = బాగుగా ఖండింపఁబడిన, ధైర్యసారుఁడై = ధైర్యబలముగలవాఁడై, ముందఱి కన్వయము.

తా. పుండరీకస్థలయొక్క తమ్ములపుసౌరభమును, దానిసంగములయందము, దానివీక్షణములసొబగును, దానిగమనపుచక్కఁదనమును గనుఁగొని యా పాపఁ డనువాని ధైర్యము దూలి మదనవేదనఁ గలవాఁడై. అలం- ఉపమ-కావ్యలింగము.

క. మేను గరుపాఱఁ దమి న
మ్మౌని జపముఁ దపముఁ దన్నుఁ మఱచి యనంగ
గ్లానిఁ బడి కదిసి వడఁకుచు
హీనస్వర మెసఁగఁ బ్రోవవే నన్ననుచున్. 34

టీ. అమ్మౌని=ఆముని, మేను=శరీరము, గరుపాఱన్ = పులకరింపఁగా, తమిన్=కోరికచేత, జపమున్=మంత్రావృత్తిని, తపమున్ = నియమవంతమగు నిశ్చలదీక్షను, తన్నున్ = తనతపోనిష్ఠావిషయమును, మఱచి = మఱచిపోయి, అనంగగ్లానిన్=మదనవేదనను, పడి=అనుభవించి, కదిసి = పుండరీకస్థలను సమీపించి, వడఁకుచున్ = సాత్త్వికభావజనితమగు కంపముఁ బొందుచు, హీనస్వరము=ధ్వనితగ్గుట, ఎసఁగన్=విశేషముగాఁగా, నన్నున్, ప్రోవవే=రక్షింపవే, అనుచున్=అని, ప్రార్థించుచు, ముందఱి కన్వయము.

తా. ఒడలు గగుర్పొడువ నాముని కోరికతో జపతపములను దన్నును మఱచి మదనవేదనం బొంది దానిం జేరి హీనస్వరముతో నన్ను రక్షింపుము రక్షింపు మని మిగులదైన్యముగాఁ బలుకుచు.

తే. చెయ్యిపట్టినమాత్రాన శిరసు వంచి
యువతి చందానఁ బైవ్రాలునవ్వధూటిఁ
బర్ణశాలాంతరముఁ జేర్చి బ్రాహ్మణుండు
కెరలుకోర్కులఁ గందర్పకేళిఁ దేలె. 35

టీ. చెయ్యిపట్టినమాత్రానన్ = హస్తముగ్రహించినమాత్రముచేతనే, శిరసు = శిరస్సును, వంచి, అవశచందానన్ = మోహమునొందినదానివలె, తత్ప్రాలువవ్వధూటిన్ = మీఁదఁబడిన యాయప్సరసను, కర్ణశాలాంతరమున్ = కర్ణగృహమునకు, చేర్చి, బ్రాహ్మణుండును = పాఱుఁడు-బ్రహ్మచారియగు సామునీంద్రుఁడు, పెరలుకోర్కులన్ = వృద్ధిపొందుచున్న కాంక్షలతో, కందర్పకేళిన్ = మదనకేళియందు, తేలెన్ = సౌఖ్యము ననుభవించెను.

తా. చేయి పట్టుకొనఁగానే తలవంచి మోహముఁ జెందినదానివలెఁ బుంజికస్థల మీఁదఁ గొలుఁగఁగా కర్ణశాలలోనికిఁ దీసికొనిపోయి పెంపొందు నగు కాంక్షలతో బ్రహ్మచారి యగు పాఱుఁడు రతిసౌఖ్యము ననుభవించెను.

క. *తపమంతయుఁ బోకవోవఁగ
నపు డన్నియు నుజ్జగించి యయ్యంగనతోఁ
దపసి మనోజక్రీడా
విపులైశ్వర్యంబు ననుభవించుచునుండెన్. 56

టీ. తపసి = మౌని, తపమంతయున్ = తాఁ జేసిన తపస్సంతయు, పోకవోవఁగన్ = వృథాయగునట్లు, అపుడు అన్నియున్ = జపము తపము మొదలయిన యన్నియు, ఉజ్జగించి = విడిచి, ఆయ్యంగనతోన్ = పుంజికస్థలతో, మనోజక్రీడా = రతివలని, విపుల = విస్తారమయిన, ఐశ్వర్యంబులు = సుఖసంపత్తులను, అనుభవించుచుండెన్ = పొందుచుండెను.

తా. ఆముని తపస్సు పాడగునట్లు జపము మొదలగునవి విడిచి యాదేవ కాంగనతో రతిసౌఖ్య మనుభవించుచుండెను.

---

* పాఠాంతరము.

క. తపనోదయాస్తమయము
లెపు డని కాలప్రమాణ మెఱుఁగనితమి న
చ్చపలాక్షిఁ గూడి రతిసుఖ
విపులైశ్వర్యంబు ననుభవించుచు నుండెన్.

క. ఈరీతిఁ గొంతకాలం
బారామమహామహీధరారణ్యములం
దారామవలఁ దగిలి వి
హారము సలుపంగ గర్భమై తఱి యగుడున్. 37

టీ. ఈరీతిన్ = ఈవిధముగా-భోగముల సంభోగసౌఖ్యముల ననుభవించుచు, కొంతకాలము = స్వల్పకాలము - కొన్నిదివసములు, ఆరామవలన్ = ఆయప్సరసయొక్క వలపను జాలమందు, తగిలి = చిక్కి, ఆరామ = ఉద్యానము లందును, మహామహీధర = ఘనపర్వతములయందును, అరణ్యములన్ = విపినము లందును, విహారము = కేళిసంచారము, సలుపంగన్ = ఒనర్పఁగా, గర్భమై = అది గర్భిణియై, తఱియగుడున్ = ప్రసవసమయము రాఁగా.

తా. అతఁ డవ్విధమున నప్సరసతోఁ గొంతకాల ముద్యానవనముల యందును, గొప్పపర్వతములయందును, అడవులయందును రతివిహారము సలుపఁగా నది చూలుదాల్చి ప్రసవసమయము తటస్థింపఁగా.

---

టీ. ఇపుడు = ఈసమయమునందు, తపనోదయాస్తమయములు = ప్రొద్దుపొడుచుట గ్రుంకుట, అని, కాలప్రమాణము = కాలపరిమితి, ఎఱుఁగనితమిన్ = తెలియని మమతతో, అచ్చరలాతిన్ = అప్సరసను, కూడి = కలసి, రతిసుఖవిపులైశ్వర్యంబులు = రతిసుఖమనెడి గొప్పసంపదలను, అనుభవించుచుండెన్ = పొందుచుండెను.

తా. ప్రొద్దు పొడుచుటయుఁ గ్రుంకుటయు ననుకాలపరిమాణ మెఱుఁగనితమితో ముని యయ్యప్సరసం గూడి గొప్పదగురతిసౌఖ్యము ననుభవించుచుండెను.

ఈపద్యము కొన్ని ప్రతులందె గానవచ్చుచున్నదిగాన నిది ప్రక్షిప్తమని తలంచి బ్రౌనుదొరవారు వ్రాయించినటీకయందు అర్థము వ్రాయఁబడదయ్యెను, ఈపద్యముకంటెఁ బైని జేర్చినపద్యమె రసవత్తరముగనుంటచే నిది ప్రక్షిప్తము కానోపు.

క. అంత ననుఁ గాంచి యది విపి
నాంతరమునఁ బాఱవైచి యరిగెఁ గృపార్ద్ర
స్వాంతుఁడగుసంయమీంద్రుఁడుఁ
జింతింపక పోయె నేమిఁ జెప్పుదు నధిపా. 38

టీ. అధిపా = రాజా, అంతన్ = ప్రసవమైనయనంతరము, అది = అపుంజికస్థలయను నప్సరస, ననున్ = నన్ను, కాంచి = కని, విపినాంతరమునన్ = వనమధ్యమున, పాఱవైచి = విసరి పడవైచి, అరిగెన్ = పోయెను. కృపార్ద్రస్వాంతుఁడు = దయచే కరఁగినచిత్తముగలవాఁడును, అగుసంయమీంద్రుఁడున్ = అగుఋషిమునీంద్రుఁడును - సర్వభూత సమదర్శి యగు మునీంద్రుఁడునుగూడ ననుట. చింతింపకపోయెన్ = నన్ను గనుఁగొనక పోయెను. ఏమి చెప్పుదున్ = ఇఁక నే మని వచింతును?

తా. కడుపారఁ గన్నజనని నిర్దయాస్వాంతురాలై యడవిలోఁ బాఱవైచి తన త్రోవను దాను వెడలిపోయెను. దయాస్వభావుఁడు సర్వసమదర్శి యగు మునియుం గాగతి నించుకేని విచారింపఁడాయెను. అపుడు నాపాట్లే మయ్యె నని చెప్పవచ్చును?

వ. అట్లు వైచి చనుటయుఁ నాఁకటం గటకటంబడుచుండి తీం డ్రించుశశిమండలంబున వెడలు శిశిరకిరణప్రణాలికామిళ దమృతరసగ్రాసంబునం జేసి కొన్నిపూఁటలం బుటపుటనైన నన్నుం గనుంగొని మునీంద్రుండు ప్రియంబొది నిజాశ్రమంబునకుం గొనిచని శశికళాసంవర్ధిత నగుటం జేసి నాకుం గళావతి యనునామం బిడి పెనుచుచుండ నేనును జనకసేవాపరతం బ్రవర్తిల్లుచుండునంత. 39

టీ. అట్లు = ఆవిధముగా, వైచిచనుటయున్ = పాఱవేసిపోఁగా, ఆఁకటన్ = ఆఁకలిచే, కటకటంబడుచుండి = బాధచేఁ బడియుండి, తీండ్రించు శశిమండలంబునన్ = మిగులఁ బ్రకాశించుచున్న చంద్రబింబమునుండి

వెడలు = పుట్టుచున్న, శిశిరకిరణ = చల్లనికిరణములయొక్క, ప్రణాళికా = సమూహములతోడ, మిళత్ = కలసికొనుచున్న, అమృతరస = సుధారసము యొక్క, గ్రాసగంబునం జేసి = తినుటచేత, కొన్ని ప్రొద్దులన్ = కొద్దిదినము లలో, పుటపుటన = వృద్ధిపొందుట కలదానను, ఐనన్నున్ = అయియున్న నన్ను, కనుంగొని = చూచి, మునీంద్రుఁడు = పాఱుఁడు, ప్రియంబు = దయచే, ఊంది = పూని, నిజాశ్రమంబునకున్ = తనయాశ్రమమునకు, కొనిచని = తీసికొనివెళ్ళి, శశికళాసంవర్ధితన్ = చంద్రకళలచే వృద్ధిఁబొందిన దానను, అగుటం జేసి = అగుటచే, నాకున్, కళావతి, అను నామంబు = అనునట్టి పేరు, ఇడి = ఉంచి, పెనుచుచుండన్ = పెంచుచుండగా, నేనును, జనక సేవాపరతన్ = సంచరించుచుండఁగా, ముందటి కన్వయము.

తా. అట్లు తల్లి కనఁగానే యడవిలో విడిచి పోఁగాఁ జంద్రకిరణములనుండి స్రవించునమృతధారలం గ్రోలి తృప్తి దీర్చుకొని కొన్నిదినములు పెరుఁగుచుండఁ దరువాత నాజనకుం డగుపాఱుండు నన్నుం గని కనికరంబునఁ దనయాశ్రమమునకుం గొంపోయి నాకుఁ గళావతి యనునామ మిడి పెంచుచుండ నేనును నాజనకుని సేవించుచుంటిని.

పైవచనమునందలియర్థమే చెప్పంబడుటచే నీ క్రిందిరెండుపద్యములు ప్రక్షిప్తము లని బ్రౌనుదొరవారిటీకలో విడిచిపెట్టఁబడినవి. రెండు ప్రతుల యందె యీపద్యములు చూపట్టుచున్న వనియుం వచనమె పెద్దనకవి దని యీవ్యాఖ్యాతతలంపు.

ఉ. ఆసమయంబునం బొగులు చాఁకటిపెల్లున నంతకంతకున్
గాసిలి పైపయిన్ వదనగహ్వర మొడఁగ నేడ్చియేడ్చి యే
మాసయుఁ గానకంతఁ దుహినాంశుఁడు దోఁచినఁ దత్కళారస
గ్రాసవిధిన్ శరీర మమరంగ భజించితి దైవికంబునన్. 40

టీ. ఆసమయంబునన్ = తల్లి పాఱవైచి వెళ్లినప్పుడు, ఆఁకటిపెల్లునన్ = ఎక్కువగా నున్నక్షుత్తుచే, పొగులుచున్ = దుఃఖించుచు, అంతకంతకున్ =

అప్పటికప్పటికి, గాసిలి = కష్టపడి, పైపయిన్ = మీఁదమీఁద, వదనగహ్వరము = గుహావలెఁ దెఱవఁబడియున్ననోరు, ఎండఁగన్ = ఆఱునట్లు, ఏడ్చియేడ్చి = విలపించి విలపించి, ఏమాపసయున్ = ఎట్టియాశయును, కానక = పొందక, అంతన్ = తరువాత, దైవికంబునన్ = దైవసహాయముచే, తుహినాంశుఁడు = సోముఁడు, తోఁచినన్ = ఉదయము కాఁగా, తత్కళారసగ్రాసవిధిన్ = ఆచంద్రకళాద్రవమును దిండిగాఁబెట్టుకొనుటచేత, శరీరము = దేహమును, అపురంగన్ = ఒప్పుఁగా, భజించితిన్ = కాచుకొంటిని.

తా. తల్లి యట్లు కని పాఱవైచినపుడు క్షుద్బాధచే దుఃఖించుచు శ్రమఁజెంది నోరెండున ఏడ్చి యాశ యేమియును లేక దైవసహాయము వలనఁ గలిగిన చంద్రకిరణములు ప్రసరింపఁగాఁ దద్రసపానమువలన శరీరమును గాపాడుకొంటిని.

సీ. ఏ నవ్విధంబున మేను పెంచుచు నుండ
నాచంద మంతయు నాత్మ నెఱిఁగి
కడుసంభ్రమమున నక్కడకు నేతెంచి యిం
పెసఁగ మైనిండినకసటు దుడిచి
తనయురంబునఁ జేర్చుకొనిపోయి యాశ్రమ
స్థలమున నిజపర్ణశాల నుంచి
విధుకళాంశాహారవిధి వసించితిఁ గాన
నాకుఁ కళావతీనామ మొసఁగి
తే. నయముమీఱంగఁ బెనుప నానాఁటఁ బెరిగి
శైశవము మాని యౌవనోత్సవముఁ జెంది
జనకు నేమైన నడుగుచు సంతతంబు
నోపి శుశ్రూష చేయుచు నున్నచోట. 41

టీ. ఏను = నేను, అవ్విధంబునన్ = ఆరీతిని, మేన్ = శరీరము, పెంచుచు నుండఁగన్ = పోషించుకొనుచుండఁగా, ఆచందము = ఆవిధము, అంతయును.

ఆత్మఁ = చిత్తమునందు, ఎఱిఁగి = తెలిసికొని, తమసంభ్రమమునన్ = మిక్కిలి తొందరతో, అక్కడకున్ = నేనున్నస్థలమునకు, ఏతెంచి = వచ్చి, ఇంపు = ఆనందము, ఎసఁగన్ = వృద్ధిపొందఁగా, మైన్ = నాశరీరమునందు, నిండిన కసటు = నిండుకొనినఖురదను, తుడిచి, తనయంబరంబునన్ = తనవస్త్రమునందు, చేర్చుకొనిపోయి = అంటఁబట్టి యెత్తుకొని పోయి, ఆశ్రమస్థలమునకున్ = తపోవనప్రదేశమందు, నిజపర్ణశాలన్ = తన యాకుటెంటియందు, ఉంచి, విధుకళాంశాహారవిధిన్ = చంద్రకళాంశముల నాహారముగాఁ దీసికొనుట చేత, వసించితిన్ = ఉంటిని, కాన్ = కాఁబట్టి, నాకు, కళావతీ నామము = కళావతి యను పేరు, ఒసఁగి = ఇచ్చి, నయము = సుకుమారత్వము మీఱంగన్ = అతిశయించునట్లు, పెనుపన్ = వృద్ధిఁబొందించుఁగా, నానాఁటన్ = దినదినక్రమముగా, పెరిఁగి, శైశవము = పసితనము, మాని = విడిచి, యౌవనోత్సవమున్ = పరువపుగరువమును, చెంది, జనకున్ = జనకుని, ఏమైన నడుగుచున్ = ఏదియేని నడుగుచు, సంతతంబు = ఎల్లకాలము, ఓపి = ఓర్చి, శుశ్రూష = పరిచర్య, చేయుచున్న చోటన్ = ఒనర్చుచుండునప్పుడు.

తా. ఆవిధముగా నేను శరీరమును బెంచుచుండఁగా నది తెలిసికొని మిక్కిలి తొట్రుపాటుతో నేనున్నచోటున కేతెంచి సంతోషముతో నా శరీరమున నిండియున్నఖురదం దుడిచివైచి తనవస్త్రమునం దిడుకొని యాశ్రమమునకుఁ దీసికొనిపోయి పర్ణకుటీరమం దుంచి చంద్రకళాద్రవమును నాహారముగాఁ జేసికొనుటచే నివసించియుంటిం గాన నాకుఁ గళావతి యను నామకరణము చేసి చక్కఁగాఁ బెంచుచుండ దినక్రమమునఁ బెరిఁగి పెద్దదాననై తండ్రి నన్నియు నడుగుచు నెల్లకాలము నోపికతో సేవ చేయుచుండఁగా,

క. ఎవ్వారు చూచినఁ జూపులఁ
జివ్వకుఁ బద పడఁగి నడచుసిగ్గున నొఱపై
నవ్వును మొదలగుపాపపు
జవ్వన మెదిరించె జిగి యొసఁగ నామేనన్. 42

టీ. ఎవ్వరుచూచినన్ = ఎవ్వరు నన్నుఁ దిలకించినను, చూపులన్ = తిరిగివారిని వీక్షించుటచేత, చివ్వకున్ = ఎదుర్కొనుటకు, చూపుల జగడమునకు, పదను = వాఁడి, అడఁగి = తగ్గి, నడచునిగ్గునన్ = వ్యాపించునట్టి నిగ్గుచేత, ఒఱపై = అందమై, రవ్వకున్ = ఆడిపోసికొనుటకు, మొదలు = హేతువు, అగుపాపపుజవ్వనము = అగునట్టిపాపపుయౌవనము, నామేనన్ = నాశరీరమందు, జిగి = నిగనిగ యను ప్రకాశము, ఎసఁగన్ = వృద్ధికాఁగా, ఎదిరించెన్ = సంభవించెను.

తా. నన్ను వీక్షించినవారినిఁ దిరుగ వీక్షించుటను సందేహమును బుట్టించునట్టి పాపపునిగ్గు వృద్ధికాఁగా నీవిన్నది యిట్టున్నది యట్టున్నది యని యందఱును నాడిపోసికొనుటకు వీలయిన యౌవనము నాకు సంభవించెను.

శా. ఆవేళన్ బొడగాంచి ఖేచరుఁ డొకం డాసక్తి దేవాపిసం
జ్ఞావంతుండు సబాంధవుండగుచు నిశ్శంకన్ ననున్ వేఁడువాఁ
డై వాచంయముఁ డగ్నికార్యనిరతుండై యున్నచోఁ బర్ణశా
లావాసంబున కేఁగుదెంచి నిజభావాకాంక్ష సూచించినన్.

టీ. ఆవేళన్ = ఆయౌవనకాలమందు, ఖేచరుఁడొకండు=గంధర్వుఁడొకఁడు, దేవాపిసంజ్ఞావంతుండు = దేవాపి యను నామముగలవాఁడు, పొడగాంచి = నను వీక్షించి, ఆసక్తిన్ = (నన్ను వివాహమాడవలె నను) కాంక్షతో, సబాంధవుండు=బంధువులతోఁ గూడినవాఁడు, అగుచున్, నిశ్శంకన్=జంకక, ననున్, వేఁడువాఁడై = కోరునట్టివాఁడై, వాచంయముఁడు=నాతండ్రియైన పారుఁడు, అగ్నికార్యనిరతుండు=హోమకార్యమునం దిష్టము కలవాఁడు, ఐయున్నచోన్=అయియున్నపుడు; పర్ణశాలావాసంబునకున్ = ఆకుటిల్లయిన నివాసమునకు, ఏఁగుదెంచి = ఏతెంచి, నిజభావాకాంక్షన్=తన హృదయమునం గలకోరికను, సూచించినన్ = తెలియఁజేయఁగా.

తా. అట్లు నేను వయోవంతురాలనై యుండఁగా దేవాపి యను గంధర్వుఁడు నను గాంచి కామించి బంధువులతోఁ గూడ నాతండ్రి

తపోవనమున కేతెంచి యథాతథంబు హోమవిధి సలుపుచుండఁగాఁ బర్ణశాల ప్రవేశించి సాతంత్రిని సన్నిమ్మని కోరుట యెట్టని జడియక హృదయమునం గల కోరిక తెలియఁబఱుపఁగా.

సీ. శిఖిపింఛదళపరిష్కృతములై సేమంతి
విరులతీరగు శిరోవేష్టనములు
నెఱగంటిచూడ్కిఁ దాయెతులబాహులు వంచి
నారాజు లల్లార్చునారజములుఁ
గాదంబరీగంధగర్భంబులై వల్చు
ఘనసారమిళదాస్యగంధములును
దరహాసములఁ దోఁచుతాంబూలసేవాంధ
కారితాధరరదచ్ఛదులయొఱపుఁ
తే. జిటులుగందంపుఁబూతలు జిహ్వికలను
ననుపు నెఱవాదిబంటుపంతపుఁబొగలు
ఘన మగుజాగుప్స వెనుప నజ్జనముఁ జూచి
ఋషి మనంబునఁ గడు నసహ్యించుకొనుచు. 44

టీ. శిఖిపింఛ = నెమలిపింఛములయందలి, దళ = ఈఁకల చేత-నెమిలి కన్నులచేత ననుట, పరిష్కృతములై = అలంకరింపఁబడినవై, సేమంతివిరుల తీరు = చేమంతిపువ్వుల విధముగలిగినవి, అగు, శిరోవేష్టనములును = తలపాగాలును, చేమంతిపూలవలె బల్లుఱపుగాఁ దలగుడ్డలఁ జుట్టి నెమిలి యీఁక లందుఁ జెక్కుకొనిరి, ఎఱగంటిచూడ్కిన్ = (మద్యపానముచే) నెఱ్ఱఁబడిన నేత్రదృష్టితో, తాయెతులబాహులు = సందిటితాయెతులుగల హస్తములను, వంచి, నారాజులు=కత్తులను, అల్లార్చు నారజములున్ = త్రిప్పెడు సౌందర్యములును, కనులు కెంపువారియుండెను. పలుమాఱు కత్తులను త్రిప్పుచుండిరనుట. కాదంబరీ = మద్యముయొక్క, గంధ = పరిమళము, గర్భంబులై = గర్భమునందున్నవై, వల్చు = వాసనకొట్టునట్టి, ఘనసార=పచ్చకప్పుర

ముతోఁ, మిళత్ = కలిసిన, అన్యగంధములును = నోటిపరిమళములును ఎన్ని సుగంధద్రవ్యముల నుపయోగించినను మద్యగంధము విడివిగా వచ్చు చుండె ననుటచే విశేషముగాఁ బానముచేసి రని భావము. దరహాసములన్ = చిఱునవ్వులతోడ, తోఁచు = కాన్పించుచున్న, తాంబూల సేవా = తమ్ము లము వేయుటచేత, అంధకారిత = కాన్పింపనివిగా చేయఁబడిన, అధర = ఓష్ఠములయందలి, రదక్షతుల = దంతక్షతములయొక్క, ఒఱపును = అంద మును, దంతక్షతములకతన భోగపరాయణు లని తెలియును. చిటులంగంపు బూఁతలును=బీటలువాఱుచున్న మంచి గందపుఁబూఁతలును, జిహ్వాకలతన్ = నాలుకలను, సనువు = అలవాటయిన, సొఱవాది = చతురతగల, బంటు పంతపు = శూరులయొక్క ప్రజ్ఞలతోడి, నగరులును = తొట్రుపాటులు గలుగను మనసు=ఎక్కువ, అగుజుగుప్స = అయినయసహ్యతను, పెనుపన్ = పెంపఁగా, అజ్జనమున్ = ఆగంధర్వుల సమూహమును, ఋషి = ముని, చూచి, మానసంబునన్ = చిత్తమునందు, కసిన్, అసహ్యించుకొనుచున్ = అభిప్రాయము సూచించుచు. ముందఱి కన్వయము. ముని శాంతప్రవృత్తుఁ డగుట చేతను, ఆగతు లగు ఖేచరులు భోగపరాయణులుగాఁ గన్పించుచుంటచేతను, నిషిద్ధమర్థ దశ నామునికి వీరిరీతు లేమియును రుచింప లేదని భావము.

తా. మాతండ్రి నన్నడుగుటకై తనగృహమున కేతెంచినగంధర్వుల మయూరబర్హములతలపాగలును, మద్యపానముచే రక్తవర్ణములు గలకన్నులును, గండిబిరుదండలతోఁ ద్రిప్పఁబడుచున్న కత్తులు చేతులయందును, మద్యపానమువలనఁ గలిగినవాసన పోవుటకై వేసికొనిన తాంబూలమువలననోటి వాసనలును, చిఱునగవులును, దంతక్షతములు కాన్పించకుండున ట్లంటించఁబడిన తాంబూలరక్తిమతోఁ గలిసిన పెదవులును, బీటలువాఱుచున్న చందనపుఁబూఁతలును, నేర్పుతోఁ గూడినతొట్రుపాటులఁగులును గలిగి చిత్తమున కసహ్యము గలుగఁజేయఁగా వీక్షించి యసహ్యపడుచు. అలం స్వభావోక్తి.

శా. ఆహా! ధన్యుఁడ నైతి మద్విమలవంశాచారవిద్యాతప
శ్శ్రీహోమాదులు నేఁడుగా తుదిఫలించెన్ నాగవాసంబును

ద్గేహక్షోణికి బిడ్డ వేఁడుటకు నేతేఁగాంచుటన్ బ్రాహ్మ్యమిం
కోహో చాలుఁబో కాలిపోయెదరొ పోరో నోటిక్రొవ్వేటికిన్.

టీ. అహో ! నాగవాసంబు = భోగపుమేళము, మద్గేహక్షోణికిన్ = నాగృహమునకు, బిడ్డన్ = చిన్నదానిని, వేఁడుటకున్ = కోరుటకు, ఏతేఁ గాంచుటన్ = వచ్చునంతటిభాగ్యమును గాంచుటచేత, ధన్యుఁడనైతిన్ = కృతార్థుఁడనైతిని, మత్ = నాయొక్క, విమల = నిర్మలమైన, వంశ = కులము, ఆచార = యోగ్యవర్తనము, విద్యా = చదువు, తపః = తపస్సుయొక్క, శ్రీ = సంపద, హోమ = హోమములు, ఆది = మొదలగునవన్నియు, నేఁడు గాన్ = ఇప్పుడుగదా, తుది = చివరగా, ఫలించెన్ = ఫలము నొందెను, ఓహో = ఔరా, ఇఁకన్ = ఇఁకను, బ్రాహ్మ్యము = విప్రత్వము, చాలును, నోటిక్రొవ్వు = నోటియొక్క క్రొవ్వు, ఏటికిన్ = ఎందుకు, బో కాలిపోయెదరో = వెళ్లిపోయెదరా, పోరో = పోకయుండెదరా.

నాగవాసమన భోగము మేళమునకు భోగము వారలకును జెప్పవచ్చును. సీ. "నాగవాసం బన నానుమా వేశ్యలమేళంబునకు" అని సాంబనిఘంటువు నందును, గీ. "నాగవాస మనఁగ నామునా వేశ్యాజనంబునకును." అని ఆంధ్రనామసంగ్రహమునందును భోగపుమేళముపరముగ నాగవాసము చెప్పఁబడెను. సీ. "నాగవాసమున ఘంటాప్రతీకమునకు వేశ్యల కగుఁ బేరు విశ్వనాథ" యని యాంధ్రనామసంగ్రహ నానార్థవర్గమందును, సీ. "నను పురికాఁడై వేల్పునాగవాసముగూడి" యని యిందును నాగవాసపదము వేశ్యాపర్యాయ పదముగాఁ జెప్పఁబడెనుగాన భోగము మేళ మనుటకు బదులుగ భోగము వార నుటయుం సమంజసమె.

తా. ఔరా! భోగము మేళము నాకుమార్తెనిమ్మని యడుగ వచ్చునంతటి భాగ్యము గలిగెను. ధన్యుఁడనైతిని, నాకులాచారములకుఁ బవిత్రత గలిగెను. నాజపతప ఆదివిద్యలన్నియుం ఫలమునకు వచ్చెను. నా బ్రాహ్మణత్వము గణుతింపఁ గాంచినది. ఏటికీవృథాప్రలాపములు మాని వెళ్లెదరా లేక వెళ్లరా చెప్పుఁడు.

అలం. వ్యాజస్తుతి - విషమము.

యున్న మానితివిగాని, మతి, మత్ = సానంబంధమయిన, వృత్త = నడవడికయుం, అన్వయ = కులమును, ఆచారంబుల్ = స్వభావమును, పేర్కొనుపాటివాఁడవు = ఇటువంటివని యెటువంటి దని చెప్పఁగంతటి మంచితనముగలవాఁడవు, నీవా, ఇలన్ = పుడమియందు, కల్గుగాకేమి = నిలిచియుందువులే, కానీ, విప్రాధమ = హీనబ్రాహ్మణుఁడా, పోపో = లేచి పొమ్ము పొమ్ము, దంభవ్రతా = కపటవ్రత నిష్ఠలుగలవాఁడా, ఇఁకన్, నిన్నుఁబోలన్ = నీయట్టి, అల్పులు = హీనులు, లేరు.

తా. ఓదుర్మార్గుఁడవగు బ్రాహ్మణుఁడా! శాపములచేతఁగా నీయాచారసంపద వెలుఁగొందును? నేను నీకన్నం దక్కువవాఁడనా? నీవు మాకుఁ గన్య నీయ కున్న నీయకుందువుగాక! మదన్వయమూదుఁ దలపోయఁదగునా? ప్రాణములతో నిఁక భూమిపై మండెదవుగా! పరుల మోసగించుటకు మునివేషమును దాలిచి లిట్టులచేఁ దపస్తత్త్వమును వెల్లడించుకొను నీకంటె నీచులింకెవరును లేరు.

తే. అనుచుఁ బగచాటి పోయి నాఁ డర్ధరాత్ర
సమయమున శస్త్రనిహతి మజ్జనకుఁ జంపె
నట్లయగుఁగాక పుడమిఁ గామాంధచిత్తుఁ
డెవ్వరి వధింపఁ డెటు సేయఁ డేమి గాఁడు. 50

టీ. అనుచున్ = అట్లుపలుకుచు, పగచాటి = విరోధమును ప్రకటించి, పోయి, నాఁడు = ఆదినము, అర్ధరాత్రసమయమునన్ = సగమురాత్రియందు, శస్త్రనిహతిన్ = కత్తిదెబ్బచే, మజ్జనకున్ = నాతండ్రిని, చంపెను. అట్ల యగుఁగాక = అట్లేజరుగుంగాని, అటుల జరుగుట సహజమె గాన, పుడమిన్ = ధరలో, కామాంధ చిత్తుఁడు = కోరికవలనఁ గన్నులుంగని హృదయముగలవాఁడు, ఎవ్వరిన్ = ఎవరిని, వధింపఁడు = చంపఁడు. ఎట్టు సేయఁడు = ఏదుర్మార్గము చేయకుండును, ఏమిగాఁడు = ఎంతదుష్టుఁడు గాఁడు.

తా. అని యీ ప్రకార మాగంధర్వుఁడు తనను వెలువరించి యీనాఁటి దుర్మార్గాత్ముండైన నాతండ్రిం గత్తితో నఱికి చంపెను. కోరికలు గలవారు దుర్నీతి నొనర్చు టాశ్చర్యకరమైనది కాదు. ఎంతెంతఘోరకార్యములఁ జేయుటకైనను సంకోచింపఁడు. అలం-అర్థాంతరన్యాసము.

తే. అప్పుడు మెడగోయ ముని రోఁజా టాలకించి
మేలుకొని దివ్వె యిడి సంభ్రమించి యేడ్చు
నన్నుఁ జొచ్చిరి పొరుగిండ్ల నున్నతపసు
లాదురాచారుఁడును బాఱె నటకు మునుపు. 51

టీ. అప్పుడు=ఆసమయమునందు, మెడగోయన్=కుత్తుక నఱుకఁగా, ముని=మరియును నాతండ్రి, రోఁజాటు=రొప్పుట, ఆలకించి = విని, మేలుకొని = లేచి, దివ్వెయిడి = దీపము పెట్టి, సంభ్రమించి = తొట్రుపడి, యేడ్చు నన్నున్ = రోదనముచేయుచున్న నన్ను, పొరుగిండ్ల = ప్రక్కయిండ్లయందు, ఉన్నతపసులు = ఉండినమునీశ్వరులు, చొచ్చిరి = చుట్టుకొనిరి. అటకు మునుపు=అంతకుముందే, ఆదురాచారుఁడును = ఆదుర్మార్గుఁడగు గంధర్వుఁడును, పాఱెన్ = పాఱిపోయెను.

తా. దుర్మార్గుఁడగుగంధర్వుఁడు మెడగోయ నాతండ్రి యొక్క రోఁజుటందు ధ్వని యాలకించి నేను లేచి దీపముఁబెట్టి చూచి విచారించి తొట్రుపాటు నొందుచుండఁగాఁ జుట్టుప్రక్కల నున్న మునీశ్వరు లందఱు వచ్చి క్రమ్ముకొనిరి. ఈయందఱి గమనించి గంధర్వుఁ డెందేని యంతకు మున్నె పాఱిపోయెను.

వ. అంతట వెలతెలవేగుటయుఁ బ్రభాతసమయంబున. 52

టీ. అంతట, తెలతెలవేగుటయున్ = బాగుగఁ దెల్లవాఱఁగా, ప్రభాతసమయంబునన్ = ఉదయకాలమున.

క. ఘోరాళీక్షతజోక్షిత
ఘోరజరాధవళితోరుకూర్చముఁగఁ గరా

టీ. తన్వీ = చిన్నదానా, ఈతనువు = ఈశరీరము, అతిసౌందర్య నిశాంతము = మిక్కిలి చక్కందనమునకు స్థానమైనది, అలభ్యంబు = (ఇట్టి దేహము) ప్రాప్తించుట కష్టము, ఇట్లు, శోకాతురాన్వితవై = దుఃఖముచే బాధింపఁబడినదానవై, దీనిన్ = ఇట్టి చక్కనిదేహమును, తొలఁగఁగాన్ = వదలుటకు, తగునె = ఒప్పునా, ఈసాహసంబు = ఈతెంపు, చాలున్, అతి లోకుండు = లోకాతీతుఁడు, స్వరోచి, నీకున్, పతి = భర్త, కాఁగ = అగును. ఆరాజున్ = ఆస్వరోచిని, చేపట్టి = పాణిగ్రహణముచేసికొని, అప్రతిమ = ఈడులేని, శ్రీ = ఐశ్వర్యముయొక్క, విభవంబున్ = వైభవమును, కాంచెదవు = పొందెదవు. కావున, ఒండు = మఱియొకవిధము, కానేర్చునే = అగునా.

లోకాతిశాయి సౌందర్యరాజిత మగు నీమేన పూర్వసుకృతాతిశయము చేతనే సిద్ధించినది. దీనిని విచారమును గారణముగాఁ జేసి వీడుట తెట్టి. భావి శుభము స్వరోచియంతవాఁడు భర్త యగుటయె. సందియపడి యింక నుద్యమించి చావఁజూచెదేమో! లోకపావని నగునాపలుకు వేఱు గాదని నీ వెఱుంగుదువు గదా!

తా. ఓసుందరీమణి! యింతచక్కని శరీరమును బొందుట బహు దుర్లభము. ఎక్కువవిచారముచే మంచిచెడ్డల నాలోచింపక యిట్టిదేహమును వదలుటకై తలపోసి యుంటివి. ఇది చాల తెంపైనపని. ఇట్టియూహ తగదు. నీకు మహారాజగుస్వరోచి పెనిమిటి కాఁగలఁడు. అతనిం బరిణయమై సకలసౌఖ్యముల ననుభవించెదవు. నాపలుకు లాలకించి యీశరీరమును గాపాడుకొను మనియెను. అలం. కావ్యలింగము.

క. వినుమదియుఁగాక పద్మిని
యనఁ బరఁగినవిద్య నేఁ బ్రియంబున నిత్తున్

గొను నీవు తత్ప్రసాదం
బున నీకు నభీష్టసౌఖ్యములు సిద్ధించున్. 57

టీ. వినుము. అదియుంగాక = అట్టిమహారాజు నీకు భర్త యగుటయే గాక, నేన్ = నేను, ప్రియంబునన్ = అనురాగముతో, పద్మిని, అనం బరఁగిన విద్యన్ = అని పిలువఁబడు విద్యను, ఇత్తున్ = ఒసంగెదను. నీవుం గొను = గ్రహింపుము. తత్ప్రసాదంబునన్ = ఆవిద్యయొక్క యనుగ్రహముచే, నీకు, అభీష్టసౌఖ్యములు = కాంక్షించిన సుఖములు, సిద్ధించున్ = దొరకును.

తా. నీ విటుపై స్వరోచి బెండ్లియాడునట్టిభాగ్యము ప్రాప్తించుటయే కాక, యీ వెంటనే నీవు కోరినసౌఖ్యములఁ జేకూర్చునట్టి పద్మిని యను విద్య నుపదేశముచేసెద దానిం గైకొనుము.

వ. అని రహస్యంబుగా నవ్విద్య నాకు నుపదేశించి ముక్కంటి వాల్గంటి మింటిచొప్పునం జనియె నేనును దద్వచనామృ తాస్వాదనంబ యూఁతగాఁ బ్రాణంబులు పట్టుకొని యున్న దాన నాస్వరోచి నీవకాఁ దలంచెద వంచనాలాపంబు లుడిగి యప్పద్మినీవిద్యారత్నంబుతోఁ గూడ నన్నుం బరిగ్రహింపు మనిన నంగీకరించి యమ్మహీవిభుండు. 58

టీ. అని = ఇటు లానతిచ్చి, రహస్యంబుగాన్ = మిగులగోప్యముగా, ఆవిద్య = ఆ పద్మిని యనువిద్యను, నాకున్, ఉపదేశించి = చెప్పి, ముక్కంటి వాల్గంటి = ఈశ్వరి, మింటిచొప్పునన్ = గగనమార్గమున, చనియెన్ = పోయెను. నేనును, తద్వచనామృతాస్వాదనంబు = ఆయమపలుకులను నమృతమును గ్రోలుటయే-అమృతమువలెఁ దీయఁగా నున్నమాటల నాసక్తితో నాలించి యనుట. ఊఁతగాన్ = ఆధారముగా, ప్రాణంబులు = జీవనములను, పట్టుకొని = విడువక, ఉన్నదానను, అమృతపానమునఁ బ్రాణము

పోషణముల గిరిజాపాదాబ్జసేవనాగ్రౌఢిచే సురలియనబాలక యెట్టులో త్రదికియుంటివి. అస్వరోచి, నీకతాన్ = నీచే యని, తలంచెదన్ = ఊహించెదను. వందనాలాపంబులు = నమస్కారయుమాటలు, తనంత వలచి వచ్చె నని తలంచి పరిహాసముతోఁ గాఁడినాడవు గావించెదవేమో! యని, ఉడిగి = విడిచి, అప్పద్మినీవిద్యారక్షణంబుతోఁ గూడన్ = పక్షినిరూపద్మినీ విద్యతోడ, నన్నున్ = నన్ను, పరిగ్రహింపుము = చేకొనుము. అనినన్, అంగీకరించి = ఇష్టపడినవాఁడై, అమ్మహీశుఁడు = అస్వరోచి, ముందటికన్వయము.

క. ఏకాగ్రత నవ్విద్యలు
గైకొని పుణ్యాహపూర్వకంబుగ గుణర
త్నాకరుఁ డయ్యిద్దఱి న
స్తోకోన్నతిఁ బెండ్లి యయ్యె సుముహూర్తంబునన్. 59

టీ. గుణరత్నాకరుఁడు = గుణములను రత్నములకునికిపట్టయినస్వరోచి, ఏకాగ్రతన్ = నిశ్చలచిత్తముతో, అవ్విద్యలు = మృగపక్షిభాషలు తెలియు నట్టివియును, పద్మిని యనునవియును నగు నారెండు విద్యలను, గైకొని = గ్రహించి, పుణ్యాహపూర్వకంబుగన్ = పుణ్యాహవాచన విధానముతో, సుము... మునన్ = మంచిలగ్నమున, అస్తోకోన్నతిన్ = అధిక గౌరవముతో, అయ్యిద్దఱిన్ = విభావరి కళావతి యనునిరువురుకన్యకలను, పెండ్లియయ్యెన్ = వివాహము చేసికొనెను.

తా. ఆస్వరోచి యాయిద్దఱవలనను రెండువిద్యలను నేర్చికొని యొక సుముహూర్తమునఁ బుణ్యాహవాచనము చేసికొని మిగుల వైభవముతో నయ్యిరువురం బెండ్లియాడెను.

ఉ. ఆసమయంబునన్ మొరసె నభ్రపథంబున దేవదుందుభుల్
సేసలు చల్లి రచ్చరలు సిద్ధనికాయము చేరి సన్నుతుల్
సేసెఁ బ్రసూనవృష్టి గురిసెన్ జనరంజనకారి వాసనో
ల్లాసము లై చెలంగె శుభలక్షణదక్షిణగంధవాహముల్.

టీ. ఆసమయంబునన్ = ఆ పెండ్లిజరిగినకాలమందు, అభ్రపథంబునన్ = గగనమునందు, దేవదుందుభులు = దేవతలభేరీవాద్యములు, మొరసెన్ = ధ్వనిచేసెను. అచ్చరలు = అప్సరస్స్త్రీలు, సేసలు = మంగళాక్షతలు, చల్లిరి. సిద్ధనికాయము = సిద్ధుల యొక్క సముదాయము, చేరి = సమీపించి, సన్నుతుల్ సేసెన్ = స్తోత్రము చేసెను. ప్రసూనవృష్టి = పుష్పవర్షము, కురిసెన్, జనరంజనకారి = ప్రజలకానందము పుట్టించునట్టి, వాసన = సౌరభముచేత, ఉల్లాసములు = తగినవి, ఐ, శుభ = శుభమైన, లక్షణ = చిహ్నములుగల, దక్షిణగంధవాహములు = మలయమారుతములు, చెలంగెన్ = వ్యాపించెను.

దక్షిణగంధవాహంపులు వీచుట శుభసూచకము. కాళిదాస మహాకవియు మేఘసందేశమునందు శుభశకునములు చెప్పుచు—"మందంమందం నుదతి పవనః [illegible] దక్షిణవాయువును శుభప్రదముగాఁ జెప్పెను. ఉత్తరదిశకు మేఘుఁ డేఁగుట కనుకూలముగా గాలివీచుచున్న దను కాళిదాసునిభావము ప్రకృతమున కనుకూలముగ నున్నది.

తా. ఆ పెండ్లి జరిగినసమయమునందు, గగనమున దేవదుందుభులు మ్రోఁగెను. అప్సరసలు శుభాక్షతలు చల్లిరి. సిద్ధులు పొగడిరి. పుష్పవర్షము కురిసెను. ప్రజల కానందమును గలుగఁజేయునట్టి పరిమళముచే నొప్పునవి యై మంచి చిహ్నములు గలవి యైన మలయమారుతములు వీచెను.

క. ఈవిధమున నుద్వాహం
బై వేలుపువెలఁదిపట్టి యంచితమతి న
వ్వాపుంబోఁడులు మూఁపుర
తో వివిధవిహారసంగతులఁ దత్పరుఁడై. 61

టీ. వేలుపువెలఁదిపట్టి = స్వరోచి, ఈవిధమునన్ = ఈప్రకారముగా, ఉద్వాహంబై = విభావసుని కళావతినిఁ బెండ్లియాడి, అంచితమతిన్ = మంచిబుద్ధితో, అవ్వాపుంబోఁడులు మూఁపురతోన్ = ఆముగ్గురుసతులతో,

వివిధ విహారసంగతులన్ = అనేక విధము లయిన వేడుకఁగాఁ దిరుగునట్టి ప్రవర్తనములయందు, తత్పరుఁడై = ఇష్టముకలవాఁడై, ముందటి కన్వయము.

తా. స్వరోచి యిట్లాయిద్దఱిం బెండ్లియాడి మంచిబుద్ధితోఁ దనము వ్వురు భార్యలంగూడి నానావిధవిలాసప్రవర్తనములయం దాసక్తిగలవాఁడై.

సీ. గంగాతరంగిణీరంగత్తరంగశీ
కరశీతసైకతోత్కరములందు
మందారమాకందమకరందతుందిలేం
దిందిరానందకృన్నందనములఁ
గాంతనిశాకాంత కాంతవితర్దికా
క్రాంతభూభృద్బృందకందరముల
మసృణబిసాహారమాంసలహంసికా
సంసదాసారకాసారతటులఁ

తే. దమక తమక ప్రియుం డని తమక మెసఁగఁ
బడఁతు లుబ్బొంగఁ గ్రీడించెఁ బద్మినీ ప్ర
భావఘటితాన్నపానభూషావిశేష
మాల్యవస్త్రానులేపసామగ్రిఁ జెంది. 62

టీ. గంగాతరంగిణీ=గంగానదియందు, రంగత్=ఆడుచున్న, తరంగ = కెరటములయొక్క, శీకర = తుంపురులచేత, శీత = చల్లఁదనముగల, సైకత= ఇసుకదిబ్బలయొక్క, ఉత్కరములందున్ = సముదాయములందును, మందార = మందారపుఁ జెట్లయొక్కయు, మాకంద = తియ్యమామిడిచెట్ల యొక్కయు, మకరంద=పూఁదేనెలచేత, తుందిల = వదించిన, ఇందిందిర = తేంట్లకు, ఆనందకృత్ = ఆనందమును గలుగఁజేయుచున్న, నందనములన్ = ఉద్యానవనములందును, కాంత = హృదయానందము లయిన, నిశాకాంత కాంత = చంద్రకాంతమణులచేఁ గూర్పఁబడిన, వితర్దికా = తిన్నెలచేత,

ఆక్రాంత=చుట్టుకొనఁబడిన, భూభృద్బృంద = పర్వతసమూహముయొక్క కందరములన్ = గహ్వరములయందును, మసృణ = మృదువైన, బిస = తామర తూండ్లయొక్క, ఆహార=భక్షణములచేత, మాంసల = బలిసిన, హంసికా = హంసాంగనలయొక్క, శకునత్ = పక్షులయొక్క, ఆసార=సర్వవ్యాపకములు గల, కాసార=చెరువులయొక్క, తటులన్ = ఒడ్లయందును, పడఁతులు = ముగ్గురుసతులును, తమకతమక=తమకేతమకే (ఎవరియంతటువారే,) ప్రియుండు=ఇష్టముగలవాఁడు, ఎవరికి వారు తాయందె స్వారోచి మక్కువగా నుండె-నని, ఉల్లాసంగన్ = ఆనందింపఁగా, పద్మినీ = పద్మిని యనువిద్యయొక్క, ప్రభావ=మహత్తుచేత, ఘటిత = సంఘటింపఁబడిన, అన్న=అన్నము, పాన = త్రాగునట్టి తేనె, పాలు, నీరు మొదలగునవి, భూషావిశేష = అలంకార విశేషములు, మాల్య=పుష్పమాలికలు, వస్త్ర = వస్త్రములు, అనులేప=మంచి గంధము మున్నగుపూఁతలు, సామగ్రిన్ =వీనియొక్క సంప్రాప్తతను, చెంది, క్రీడించెన్.

మొదటిపాదమునందు నదీతీరవిహారము, రెండవపాదమున వనవిహారము, మూఁడవపాదమున శైలవిహారము, నాలుగవపాదమున సరోవరవిహారమును గావించి రని చెప్పఁబడెను.

తా. స్వారోచి ముగ్గురు భార్యలు వెంటనంటిరాఁ బద్మినీ విద్యామహిమచే నన్నపానీయములకును వస్త్రాలంకారములకును గంధపుష్పములకును లోప మెంతమాత్రమును లేక పోఁగా నదీ సైకతప్రదేశములందును, మకరంద భరితమై తేంట్లరొదలఁ బొదలు విహారవనములయందును, చంద్రకాంతశిలా వేదికలచే నింపుమిగులు పర్వతగహ్వరములయందును, తామరతూండ్లు మెసవి చియ్యపట్టిన హంసలు వేనవేలు సంచరించుచున్న సరస్తీరములందును సంచరించుచుఁ గ్రీడ గావించెను. అలం. ఉదాత్తము.

మ. అరవిందాక్షులుఁ దాను నిట్లభిమతవ్యాపారముల్ సల్పుచున్
ధరణీశుం డొకచోటఁ గాంచె లఘుశీతస్వచ్ఛవాఃపూరమున్

పరకీరప్రజచంచుపాటితతటవ్యాకీర్ణమందారకే
సరమాకందవినిస్సరత్ఫలరసాసారంబుఁ గాసారమున్. 63

టీ. ఇట్లు=ఈవిధముగా, భగవతీశుఁడు=స్వరోచి, అరవిందాక్షులన్=తామరరేకులవంటి విశాలములగు కన్నులుగల యామువ్వురు భార్యలును, తానును, అభిమత వ్యాపారములు = కాంక్షించిన విహరింపుఁ బనులను, సల్పుచున్ = ఒనర్చుచు, ఒకచోటన్=ఒకానొక ప్రదేశమునందు, లఘు = తేలికయైన, శీత = చల్లనయిన, స్వచ్ఛ=విమలమైన, వారిపూరమున్ = జలముచే నిండినదియు, పర=ఉత్తమమయిన, కీర=శుకములయొక్క, ప్రజ=సమూహముయొక్క, చంచు=ముక్కులచేత, పాటిత=బ్రద్దలు చేయఁబడిన వస్తు, తట=ఒడ్డులయందు, వ్యాకీర్ణ=నిండుకొనిన, మందార=మందారవృక్షములవలనను, కేసర = వకుళవృక్షములవలనను, మాకంద = తియ్యమామిడిచెట్లవలనను, వినిస్సరత్ = ఎక్కువగాఁ గాఱుచున్న, ఫలరస = పండ్లరసములయొక్క, ఆసారంబున్ = అడ్డులేని జడివాన గలదియు నగు, కాసారమున్ = సరస్సును, గాంచెన్ = వీక్షించెను.

ఫలవృక్షములు ఒడ్డులయందు నిండుకొని యున్నవనుటచేఁ జిలుకలు నొక్కినఫలరస మంతయుఁ బడుట కనుకూలముగా నుండె ననుట. కీరములు ప్రజమనుటచే నసంఖ్యాకములుగనుండె ననుట. కావుననే వానిచే నొక్కఁబడిన ఫలరసము జడివానవలెఁ గారుట. లఘుత, శీతత, స్వచ్ఛత, జలప్రశస్తిం దెలుపును.

తా. సతులతో నిట్లు యథేష్టముగాఁ గ్రీడ సలుపుచు నొక ప్రదేశమునఁ దేలికయై చల్లఁగా నున్న నిర్మలోదకముతో నిండియున్నదియు, నొడ్డులయందలి చెట్లనుండి చిలుకముక్కులచేఁ బగులఁ గొట్టఁబడిన ఫలములనుండి స్రవించుచున్న మధురరసముతోఁ గూడినదియు, నగు నొకానొకసరస్సును గాంచెను.

కని తత్తటస్థలంబున
ననుమతి విహరించె సవిధహరిహయవరనం
దననందనహరిచందన
వనపవనార్భకవినోదపరవశగతుఁ డగుచున్. 64

టీ. కని = సరస్సును వీక్షించి, తత్తటస్థలంబునన్ = ఆసరస్తీరమున. సవిధ = చేరువ నున్న, హరిహయ = దేవేంద్రునియొక్క, వర = ఉత్తమ మయిన, నందన = నందనోద్యానవనసంబంధమయిన, (హరిహయవరనందన = జయంతునియొక్క, నందన = నందనోద్యానవనమువనున్న, అని యర్థాంతరముగూడఁ గలదు.) నందన = స్వీయోద్యానవనమునందలి, హరిచందన = హరిచందనము మొదలగు సురభూజములయొక్క, వన = తోఁటనుండి వీచునట్టి, పవనార్భక = పిల్లతెమ్మెరలచేత, వినోద = క్రీడించుటకు, పరవశగతుఁడు = ఆయత్తమైనవాఁడు, అగుచున్, అనుమతిన్ = ఇచ్ఛతో, విహరించెన్ = సంచరించెను.

తా. స్వరోచి యాసరస్సుం గాంచి దానిసమీపమున నందనవనము కలిగి దేవతరులతోఁటలుగల తనశృంగారారామమునుండి వీచునట్టి మలయమారుతముచే నానందింప నిచ్ఛగలవాఁడై కోర్కెతో నాసరస్తీరమునఁ గొంత తడవు విహారము సల్పెను.

ఉ. అందొకయంచలేమ గహనానిలసంచలదూర్మిమాలికా
మందవిహారసౌఖ్యమున మత్తిలి దవ్వుల నున్న చక్రవా
కిం దగఁ జేరఁ బిల్చి పరికించితె యొంటితపం బొనర్చి రీ
యిందునిభాస్యలుం బతియు నేకమతిన్నవగూడియుండఁగాన్.

టీ. అందున్ = ఆసరస్సునందు, ఒక యంచలేమ = ఒక హంసాంగన, గహన = ఉద్యానవనమునుండి యేతెంచుచున్న, అనిల = వాయువు చేత, సంచలత్ = చక్కఁగా కదలుచున్న, ఊర్మి = కెరటములయొక్క,

మాలికా = పఙ్క్తియందు, అమంద = విస్తారమయిన, విహార = వినోద విహారములని, సౌఖ్యమునన్ = సుఖముచేత, మత్తిలి = మదించి-సుఖాతిశయానుభవమునఁ బరవశము నొంది యనుట. దవ్వులన్ = దూరమున, ఉన్న చక్రవాకిన్ = ఉన్నసామాన్యచక్రవాకమును, తగన్ = ఒప్పునట్లు, చేరఁ బిల్చి = సమీపమునకుఁ బిలిచి, ఈ ఇందునిభాస్యలున్ = చంద్రముఖు లగు నీయంగనలును, పతియున్ = భర్తయగునీరాజును, ఏకమతిన్ = భేదము లేని మనస్సుతో, కవగూడి = జతగూడి, ఉండఁగాన్ = ఉండుటకు, ఎంతతపంబు = ఎంత గొప్పతపస్సు, ఒనర్చిరి = ఒనరించిరో, పరికించితె = వీరలవిహారవిధమును వీక్షించితివా.

తా. ఆసరస్సున విహారానందమునఁ దేలుచున్న యొకహంసాంగన తనకు సమీపమున దిరుగాడుచున్న యొకచక్రవాకాంగనం జేరఁ బిల్చి స్వరోచిని ఆతనిభార్యలం జూపి వీరి కెంతమాత్రమును భేదబుద్ధిలేనివారై స్నేహముతో సంచరించుటకు వీరు మునుపెంత తపస్సుచేసిరో మిగుల నానందముతో విహరించుచున్నారు చూడు మనెను.

క. మెలఁతకుఁ బతిపై నైనను
మెలఁతుకపైఁ బతికి నైన మేలగు నెందున్
గలయది మెలఁతకుఁ బతికిన్
వలపు సమం బగుట జన్మవాసన చెలియా. 66

టీ. చెలియా = స్నేహితురాలా, మెలఁతకున్ = భార్యకు, పతిపై నైనన్ = భర్తమీఁదనైనను, మెలఁతుకపైన్ = భార్యమీఁద, పతికైనన్ = పెనిమిటికైనను, మేలు = శుభము; సందర్భమునుబట్టి వలపు అని చెప్పుటయే సమంజసము. అగుట = కలుగుట, ఎందున్ = సర్వత్ర, కలయది = స్వభావము, మెలఁతకున్ = పత్నికిని, పతికిన్ = మగనికిని, వలపు = మోహము, సమంబగుట=తుల్యముగా నుండుట, హెచ్చుతగ్గులు లేక సరిగానుండుట, జన్మవాసన = పూర్వజన్మ సంస్కారము.

తా. ఓ స్నేహితురాలా! భార్యయందు భర్తకో, భర్తయందు భార్యకో, ప్రేమ మిక్కుటముగా నుండుట సహజముగాని భార్యాభర్తల కిరువురికిని మోహము సరిగా నుండుట సహజము గాదు. అట్లుగాక వీరి యందు సమాన మోహ ముండుట పూర్వజన్మమున నొనరించిన పుణ్యఫలమే కాని మఱొకటి కాదు.

ఉ. కావున వీరియందు నధికం బగుకూరిమి గల్గియుండు నీ
భూవలయాధినాథునకుఁ బోల్పుగ నీవిభునందు నగ్గలం
బీవనజాయతాక్షులకు నిచ్చఁ బ్రియంబవిగానఁ బూవుఁదా
వియుంబోలె జాలఁ బ్రమదం బొనరించిరి నాకు నెచ్చెలీ

టీ. నెచ్చెలీ = ఓచెలీ, కావునన్ = పరస్పరము వలపు సమము గావున, వీరియందున్ = ఈ చెలువలయందు, ఈ భూవలయాధినాథునకున్ = ఈ నృపాలునకు, అధికంబు = ఎక్కువ, అగుకూరిమి = అయిన ప్రేమ, పోల్పుగన్ = చక్కఁగా, కల్గియుండున్ = కలిగియున్నది, ఈ విభునందున్ = ఈ నృపాలునందు, ఈ వనజాయతాక్షులకున్ = ఈసుందరులకును, ఇచ్చన్ = చిత్తమునందు, ప్రియంబు = ప్రేమము, అగ్గలంబు = ఎక్కువ, అవిగానన్ = అట్లగుటచే, పూవుందావియుం బోలెన్ = పుష్పమును సౌరభమును రీతిఁ (ఎడఁబలుపరాని ప్రేమగలవారై), చాలన్ = విస్తారముగా, నాకున్ = నాకు, ప్రమదంబు = హర్షము, ఒనరించిరి = వీరు కలుగఁజేసిరి

తా. ఓచెలీ! యీ యింతులయం దీ నృపాలునకుఁ బ్రేమ యున్నట్టే యీ నృపాలునియం దీ యింతులకుఁ బ్రేమ యున్నది. ఇయ్యది పుష్పముతో సౌరభము కూడియున్నట్లుండెను. అందువలన నాకు వీరిం గాంచిన కొలఁదినే యెక్కువ సంతోష మగుచున్నది.

వ. అని పలుకునమ్మ రాళికలోలనయనపలుకు లాలంబుచేసి చక్ర వాకి యిట్లనియె.

టీ. చూడన్ = ఆలోచించి చూడఁగా, పలువురయందున్ = అనేకసుందరులందు, ఒక్కనికిన్ = ఒకపురుషునకు, బ్రాఁతియున్ = ప్రియమును, ఒక్కనియందున్ = ఒకపురుషునియందు, పల్వురకున్ = అనేకసుందరులకు, అగ్గలము = ఎక్కువ, అగు ప్రేమ = ఐనయట్టి యనురాగము, కల్గుట = కలిగియుండుట, అద్భుతము = చిత్రము, అట్లు, కానన్ = కావున, ఇవ్వేలఁదులయందున్ = ఈసుందరులయందు, వీనికిన్ = ఈపురుషునకు, కూర్మి పస = ప్రేమాతిశయము, ఏమియున్ లేదు = కొంచెముగూడ లేదు. వీనియందున్ = ఈపురుషునియందు, ఈజలరుహాక్షులకున్ = ఈసుందరులకు, ప్రియము = అనురాగము, ఎవ్విధంబునన్ = ఏప్రకారము చేతను, అలవడన్ = పచుపడుట, కల్గదు = కలుగఁజాలదు.

"ఏకత్రైవానురాగశ్చే తిర్యజ్మ్లేచ్ఛగతోఽపి వా,
యోషితాం బహుసక్తిశ్చ రసాభాసస్త్రిధా స్మృతః."

అనునది యిట ననుసంధించుకొననగును.

తా. ఒకనికేఁ జాలమంది సుందరులయందును, జాలమంది సుందరుల కొక్కపురుషునియందును బ్రేమ యుండుట కష్టము. కావున వీనియం దీసుదతులకుఁగాని యీ సుదతులయం దీకనికిఁగాని యెంకమాత్రముఁ బ్రేమ యుండదు.

క. మనుజేశుఁడు కొలిచినపరి
జనములతో నిష్టగోష్ఠి సలిపెడిచో నె
ట్లనురాగ మట్ల కూరిమి
వనితలు పెక్కండ్ర యందు దవశ్యము పతికిన్. 71

టీ. మనుజేశుఁడు = నృపాలుఁడు, కొలిచినపరిజనములతోన్ = తన్ను సేవించునట్టి పరివారముతో, ఇష్టగోష్ఠి = ప్రియాలాపము, సలిపెడిచోన్ = చేయఁనప్పుడు, అనురాగము = పేరిమి, ఎట్లు = ఎట్లో, అట్ల = అట్లులనే, వని

తలు=సుందరులు, పెక్కండ్రయందుఁ = పలువురయందు, పలికిఁ = పెని మిటికి, కూరిమి=అనురాగము, అవశ్యము = ముఖ్యముగా కలుగు నని యిట నర్థ్యాహార్యము.

తా. నృపాలునకు సేవకులయందువలెఁ బురుషునకుఁ బలువురు సుదతులయందుఁ బ్రేమ యుండునే కాని యొక్కభార్యయందువలె గాఢానురాగము కలిగియుండదు. అలం- ఉపమ.

క. ఈనెలఁత లీమహీశు న
హీనగతిం దగిలిరేని యితఁ డొకలేమన్
దా నెలమిఁ గూడునెడ నే
మానిని ప్రాణేశుమీఁదిమమత మెలంగున్. 72

టీ. ఈనెలఁతలు = ఈవనితలు, ఈమహీశుఁ = ఈరాజును, అహీనగతిఁ = కొఱంతలేని హృదయములతో - ఎట్టిలోపమును హృదయమునందుంచుకొనక, తగిలిరేనిఁ = వలచియున్నయెడల, ఇతఁడు = ఈరాజు, తాను, ఒకలేమఁ=ఒకచిన్నదానిని, ఎలమిఁ = ప్రేమతో, కూడునెడఁ = రతి సలుపునప్పుడు, ఏమానిని=వీరిలో నేచిన్నది, ప్రాణేశుమీఁదిమమతఁ = భర్తయందలిప్రేమతో, మెలంగుఁ = వర్తించును. ఏసతితో రాజు గలసియుండునో యాసతి యనురాగవతివలెఁ గనిపించునుగాని యందఱకు సమానానురాగము గలుగఁ జాలదనుట.

తా. ఈచెలువలందఱును రాజునెడనే వలపుగలవారలై యుండరు! రాజు వేఱొకచెలితో సంభోగసౌఖ్యము ననుభవించునపుడు మిగిలినచెలువల కెవరికేని వల్లభునిమీఁదఁ గొంచెమేని ప్రేమయుండునా!

క. కావున దాసీనికరము
కైవసమై సంచరించుక్రమమున విద్యా

ప్రావీణ్యవైభవోన్నతి
చే వచ్చినవారి వీరిఁ జెప్పకు మింకన్. 73

టీ. కావునన్ = అట్లుకావున, దాసీనికరము = ఊడిగంపుస్త్రీల సముదాయము, కైవసమై = స్వాధీనమై, సంచరించు క్రమమునన్ = తిరుగు నట్టి పోలికను, విద్యా = విద్యలయందలి, ప్రావీణ్య = నేర్పుయొక్క, వైభవ = సంపదవలని, ఉన్నతిచేన్ = గౌరవముచేత, వచ్చినవారిన్ = దొరకిన వారిని, వీరిన్ = ఈసుందరులను, ఇంకన్ = ఇంకమీఁద, చెప్పకుము = హెచ్చుగాఁ ప్రశంసింపకుము.

తా. కావున దాసీజనము చాలమంది యొకనిస్వాధీనములో సంచరించురీతిని విద్యాసంపదచే నీతనికి దొరకిన యీసుందరులవిషయమై గొప్పలు చెప్ప నొప్పదు.

ఆ. తగులు నెవ్వఁ డొక్కతరుణికి నొకనికి
మెలఁత వలచునదియ మే లనంగ
వచ్చుఁ గాని పెక్కువనితలపైఁ గూర్మి
గలుగు ననుట బొంకు గాదె తరుణి. 74

టీ. తరుణి = ఓ సుందరీ! ఎవ్వఁడు = ఏపురుషుఁడు, ఒక్కతరుణికిన్ = ఒక్కయువతియెడ, తగులున్ = మోహించునో, మెలఁత = ఒకజవరాలు, ఒకనికిన్ = ఒక్కనియెడ, వలచున్ = మోహించునో, అదియ = ఆమోహమే, మేలు = శ్రేష్ఠమైనది, అనంగవచ్చున్ = అని ప్రశంస గావింప వచ్చును. పెక్కువనితలపైన్ = అనేకస్త్రీలమీఁద, కూర్మి = ప్రేమ, కలుగును = ఒకనికి గలిగియుండును, అనుట, బొంకు = అబద్ధము, కాదే = కాదా.

రసగంగాధరమునందు-"తత్ర స్త్రీపుంసయోరన్యోన్యాలంబనః ప్రేమాఖ్యశ్చిత్తవృత్తివిశేషో రతిః స్థాయిభావః"-అని వ్రాయఁబడెను. స్త్రీలకును పురుషులకును బరస్పరాలంబనమైన ప్రేమ యనెడి చిత్తవృత్తివిశేషమే రతి యను నాలంకారికధర్మ మిట గ్రాహ్యము.

తా. ఓ నెచ్చెలీ! ఒక్క మగవాని కొక యాఁడుదాని పయిని, ఒ- క యాఁడుదాని కొక మగవానిమీఁదను ప్రేమయుండదే నన్ను ననవచ్చుఁగాని పలువురుసుందరులయం దొకమగవానికిఁ గూర్మి యున్న దనుట కల్ల.

చ. పలుకులు వేయు నేమిటికి భాగ్యసమన్విత నేన మద్విభుం
డిలఁ గలధన్యుఁ డంచు నెలుఁగెత్తి వరూథినిపట్టిముందటన్
బలుకురథాంగమానవతిపల్కు లతం డిల జంతుమండలీ
విలసదశేషభాషలఁ బ్రవీణుఁడు గాన నెఱింగి సిగ్గునన్. 75

టీ. పలుకులు = మాటలు, వేయున్ = పెక్కులు, ఏమిటికిన్ = ఎందుకు, భాగ్యసమన్వితను = భాగ్యవంతురాలను, నేన = నేనే, ఇలన్ = ధాత్రియందు, కలధన్యుఁడు = కలిగినభాగ్యవంతుఁడు, మద్విభుండు = నా పెనిమిటి, అంచున్ = అని, వరూథినిపట్టిముందటన్ = స్వరోచియెదుట, ఎలుఁగెత్తి = కంఠమెత్తి, పలుకురథాంగమానవతిపల్కులు = చెప్పుచున్న చక్రవాకాంగనయొక్క పలుకులు, ఇలన్ = పుడమియందుండెడు, జంతుమండలీ = జీవసముదాయములయొక్క, విలసత్ = ప్రకాశించుచున్న - ఒప్పుచున్న, అశేష = ఎల్ల, భాషలన్ = పలుకులయందు, ప్రవీణుఁడు = తెలిసినవాఁడు. కానన్ = కాఁబట్టి, ఎఱింగి = తెలిసికొని, సిగ్గునన్ = లజ్జచేత, ముందటికన్వయము.

తా. పలుపలుకు లేల? నేనే యదృష్టము గలదానను. నాభర్తయే భాగ్యవంతుఁ డని ముందట బాగుగా వినఁబడునట్లు గొంతెత్తి మాటలాడుచున్న యాచక్రవాకాంగనపలుకు లాలించి సకలజంతుభాషల నెఱింగినవాఁడు గావున నాపక్షివాక్యములయర్థమును గ్రహించి లజ్జతో.

క. తల వాంచి యుస్సు రని మదిఁ
దలపోయుచు మానరానితమకంబున నా
నెలఁతలతో నూఱేఁడులు
విలసితగతి సౌఖ్య మనుభవించుచు నెలమిన్. 7

టీ. తలవాంచి = శిరస్సువంచుకొని, ఉస్సురని=నిట్టూర్పుతో నుస్సురని, మదిన్ = చిత్తమునందు, తలపోయుచున్ = విచారించుచు, మానరాని తమకంబునన్ = విడువఁగూడని యనురాగముచేత, ఆనెలఁతలతోన్ = ఆ ముగ్గురు సుందరులతోను, విలసితగతిన్ = చిత్తానందమైనరీతితో, నూఱేఁడులు = నూఱుసంవత్సరములు, ఎలమిన్ = ప్రేమతో, సౌఖ్యము, అనుభవించుచున్=కాంచుచు. ముందటి కన్వయము.

తా. తలవంచుకొని యుస్సురని నిట్టూర్పు పుచ్చుచు హృదయమునందు వీడరాని ప్రేమచేత ముగ్గురుభార్యలతోను హృదయానందకరముగా నూఱుసంవత్సరములు ప్రీతితో సుఖ మనుభవించుచు.

శా. కాంచెన్ భూవిభుఁ డొక్కనాఁడు కనకాఖర్వప్రభామంజులా
స్యాంచన్మేచకరత్నవిభ్రమసనాథానూనదృగ్రోచులన్
మించుంబ్రాయపు లేటిపిండు తనుఁ గూర్మిం జుట్టి రాఁ దద్వనో
దంచద్భూమిఁ జరించు నొక్కహరిణోత్తంసం బింపారఁగాన్.

టీ. భూవిభుఁడు = స్వరోచి, ఒక్కనాఁడు = ఒకానొకదినమునందు, కనక = సువర్ణముయొక్క, అఖర్వ = ఎక్కువయైన, ప్రభా = కాంతులచేత, మంజుల=ఆనందదాయకము లయిన, ఆస్య=మోమునందు, అంచత్ = ప్రకాశించుచున్న, మేచకరత్న = ఇంద్రనీలమణులయొక్క, విభ్రమ = విలాసము వంటి విలాసముతో, సనాథ=కూడిన, అనూన=హీనముకాని, దృగ్రోచులన్ = వీక్షణముల ప్రకాశముచేత, మించుంబ్రాయపు = ప్రకాశించుచున్నజవ్వనము గల, లేటిపిండు = ఆఁడులేళ్లసముదాయము, తనున్, కూర్మిన్=ప్రేమతో, చుట్టిరాన్ = చుట్టుకొనిరాఁగా, తద్వనోదంచద్భూమిన్ = ప్రకాశించుచున్న యయ్యరణ్యప్రదేశమందు, చరించు = సంచరించుచున్న, ఒక్కహరిణోత్తంసంబున్ = ఒక మంచిలేడిని, ఇంపారఁగాన్ = సంతోషము వృద్ధికాఁగా, కాంచెన్.

లేడిచూపులు మిగుల నల్లగా నుంట సహజము గాన కృష్ణగణముగాఁ జెప్పుట ప్రసిద్ధము. చంపూభారతమునందును లేడిచూపు లిటులె నల్లనివిగా వర్ణింపఁబడెను —

శ్లో. "శ్రోణీభరా మదకలం ప్రతికృష్ణసారం
తూణీముఖే పలితపాణినఖాంకురేఽస్మిన్
ఏణీకులాని తరసైర్వ్యసునాసజలానాం
వేణీమివాత్మీకలనైర్విపినే వితేనుః."

(ప్రథమస్తబకము శ్లో-౨౧.)

తా. స్వరోచి యొకదినమునఁ గేళికావనమునందు స్వర్ణచ్ఛాయ గల ముఖములును, నీలమణిప్రభలవంటి ప్రభలుగల వీక్షణములు గల హరిణములతోఁగూడి సంచరించు నొక యంత్తమ మగు నిట్టిని గాంచెను. అలంకారదర్శన.

క. కని సతులకుఁ జూపెడుతఱి
ఘనమునఁ దమచెవుల వాలుఁగన్నులు సోలన్
మొనసెలవి యెత్తి ప్రియునా
ననముఁ జూరొ్కనుచు నట్టు నాకెడువేళన్. 78

టీ. కని, సతులకున్ = భార్యలకు, చూపెడుతఱిన్ = చూపు నప్పుడు, ఘనముగన్ = ఎక్కువగా, తమచెవులన్ = తమకర్ణములయందు, వాలుఁగన్నులు=దీర్ఘములయిన నేత్రములు, సోలన్=వ్రాలఁబడఁగా, మొన సెలవి = ముందఱిపెదవియొక్క మొదలు, ఎత్తి = మీఁదికెత్తి, ప్రియునాననమున్=తమభర్త యగు జింకయొక్క మోమును, చూరొ్కనుచున్ = వాసన చూచుచు, అట్టునాకెడువేళన్=మెడను నాకుసమయమందు. ముందఱి కన్వయము.

తా. అట్టు సంచరించుచున్న లేడిని స్వరోచి భార్యలకుఁ జూపించు నప్పుడు దానిజత యగునాఁడులేళ్ల తమపెద్దకన్నులు కర్ణములవఱకువ్యాపించి

ప్రకాశింపఁగా నట్టులెత్తి యాలేడి మోమును వానఁ జూచుచు నట్టు నాకు
చున్నవేళయందు. అలం-స్వభావోక్తి.

శా. హుంకారం బొనరించి వే తలఁగుఁడో హో నేను స్వారోచినే
పంకేజాక్షులతోడ నెల్లప్పుడు దర్పస్ఫూర్తిఁ గ్రీడింప ల
జ్జాంకూరం బడఁగించినారు తలపోయన్ నాకు రోఁతయ్యె మీ
రింకన్ బోయి వరింపుఁడొక్కరుని భోగేచ్ఛన్ నివారించితిన్.

టీ. పూర్వోక్తమృగము పెంటిమృగములఁ జూచి యిట్లు చెప్పు
చున్నది — హుంకారంబు = క్రోధమును దెలియఁజేయు హుమ్మను శ్రుతి
కటువైన ధ్వనిని, ఒనరించి = చేసి, ఓహో = ఓసుందరులారా! వే = వేగ
ముగా, తలఁగుఁడు = ఒత్తిగిలిపొండు, ఎల్లప్పుడున్ = అన్ని సమయములందును,
దర్పస్ఫూర్తిన్ = మదోన్నతిచేత, పంకేజాక్షులతోడన్ = పద్మాక్షులగు
సుందరులతో, క్రీడింపన్ = క్రీడింపను, నేను, స్వారోచినే = స్వారోచియను
రాజును, లజ్జాంకూరంబు = మొలకసిగ్గును, అడఁగించినారు = పోఁగొట్టినారు.
మీరు సిగ్గువిడిచి సంచరించుచుంటి రనుట, తలపోయన్ = (మీసిగ్గుమాలిన
తనమును) ఆలోచింపఁగా, నాకున్, రోఁతయ్యెన్ = అసహ్యమాయెను. మీరు =
మీరందఱును, ఇంకన్ = ఇఁకమీఁద, పోయి = నన్ను వదలి వెడలిపోయి,
ఒక్కరునిన్ = ఇంకొక మగవానిని, వరింపుఁడు = వేఁడుకొనుఁడు. భోగేచ్ఛన్ =
రతిసౌఖ్యమునందలి కోరికను, స్త్రీసుఖమునందలి వాంఛ ననుట. నివారించితిన్ =
మానితిని-నిలిపివేసితిని, ఇంద్రియచాపల్యము నడంచికొంటి నని భావము.

తా. ఆలేడి యాఁడులేళ్లపైఁ గోపించి కలకాలము స్త్రీలతోఁ గలిసి
రమించుటకు నేను స్వారోచిని గాను. మీరు లజ్జను త్యజించి విహరించు
చున్నారు. మీ ప్రవర్తనములు గాంచిన నాకసహ్య మగుచున్నది. కాఁబట్టి
మీతోడి సౌఖ్యమునకు సంతసింపను. కావలసినచో మీరు మఱియొక మగ
వానినిఁ గోరుకొనుఁడు, వెళ్లుఁడనియెను.

చ. బరువనకింతులం దనకుఁ బల్వురఁ గూర్చుటభోగవాంఛఁగా
కరయఁగ నొండు గాదు ధన మన్న ధ్రువంబుగ నంగనాజనో
త్కరసముపార్జితం బటులుగావున వీనికి లే దిహంబునుం
బరమును నన్ను నట్లు పలుపం బని లే దిది చెప్ప నేటికిన్. 80

టీ. బరువు=భారము-కష్టము, అనక=అని తలంపక, తనకున్=తనకై, ఇంతులన్=సుందరులను, కూర్చుట=కూర్చుకొనుట, భోగవాంఛన్=సౌఖ్యానుభవమందలి కోరికచేతనే, కాక, అరయఁగన్ = ఆలోచింపఁగా, ఒండు గాదు=మఱియొకటి కాదు. ధనము=ద్రవ్యమో, అన్నన్=అనినను, ధ్రువంబుగన్ = నిశ్చయముగా, అంగనాజన = సుదతీజనముయొక్క, ఉత్కర=సముదాయముచేత, సముపార్జితంబు=ఆర్జింపఁబడినది, అటులు గావునన్=అటులగుటచేత, వీనికిన్ = ఈస్వరోచికి, ఇహంబునున్ = ఈలోకమందలి మేలును, పరమునున్=పరలోకమందలి మేలును, లేదు. నన్నును, అట్లు=అట్లై, వలుపన్=పాటుపడఁజేయుంట, పని లేదు = అవసరము లేదు. ఇది = ఈసౌఖ్యమును, చెప్పన్=ఇట్టిది యని వచించుట, ఏటికిన్=ఎందుకు? పలువుర భోగించుటచేఁ గామ మారదు. ద్రవ్యము స్త్రీజనార్జితముగాన "స్త్రీవిత్త మధమాధమం" అనున్యాయముచే నదియుం గర్హ్యము. ఇట్టియెడ నిహపరములకుఁ దా వెక్కడిది?

తా. మగవాఁడు తనకుఁగలిగినకష్టము నాలోచింపక యూఁడువాండ్రను జేర్చుకొనుట రతికాంక్షచేతనేగాని యింకొకదానిచేఁ గాదు. వీనిభాగ్యసంపద యాసుందరులవలననే యార్జింపఁబడినది. ఇది నిశ్చయ మయినపలుకు. ఆలోచింప నింతకన్న మఱేమియుఁ గానరాదు. కావున నీ నృపాలునకు నిహపరములయందు మేలు లేదు. ఈతనిరీతినే నన్నుఁగూడ సౌందులకుం బనికిరాని వానిగాఁ దలంపరాదు. ఈవిషయ మిట్టి దని యేర్పరింప నవసరము లేదు.

క. వీనివిధంబున వనితా
ధీనుఁడ నై పెంపు దక్కి తిరుగుచు నుండం

గా నే వెఱ్ఱినె తమకము
మాని చనుం డన్న నవియు మసలక చనియెన్. 81

టీ. ఈవిధంబునన్ = ఈస్వరోచిరీతిని, వనితాధీనుఁడనై = స్త్రీలకు స్వాధీనమైనవాఁడనై, పెంపు=అతిశయము తక్కి=పోయి, తిరుగుచున్= ప్రవర్తించుచు, ఉండఁగాన్=ఉండుటకు, నేన్ = నేను, వెఱ్ఱినె = వెఱ్ఱివాఁడనా, తమకము=అనురాగము-మోహము, మాని=విడిచి పెట్టి, చనుండు= పొండు, అనన్=అని మగలేడి పలుకఁగా, అవియున్ = ఆఁడులేళ్లును, మసలక = తడవుసేయక, చనియెన్ = వెడలిపోయెను.

తా. ఈస్వరోచివిధముగా స్త్రీలకు లోనై తిరుగుటకు నేను పిచ్చివాఁడను గాను. నాయందుఁ గల ప్రేమను వీడి మరలిపొం డన నాఁడులేళ్లు ఆలస్యము సేయక బయలుదేఱి పోయినవి.

క. ఈకరణి దూఱనాడిన
యాకృష్ణమృగంబుపలుకు లటమున్నుఁగ న
క్కోకసతి యన్న మాటలు
నేకంబై తనమనంబు నెరియం జేయన్. 82

టీ. ఈకరణిన్ = ఈతెఱఁగున, దూఱన్=నిందించుటగా, ఆడిన = పలికిన, ఆకృష్ణమృగంబుపలుకులు = ఆనల్లలేడియొక్క పలుకులును, అటమున్నుఁగన్ = అంతకుఁబూర్వము, అక్కోకసతి = ఆచక్రవాకాంగన, అన్న మాటలును, ఏకంబై = ఒకటియై, తనమనంబునన్ = తనచిత్తమును, ఎరియం జేయన్ = దహింపఁ జేయఁగా. ముందటి కన్వయము.

తా. ఈప్రకారము నిందఁగాఁ బలికిన యానల్లలేడిమాటలను, అంతకుఁ బూర్వము చక్రవాకాంగనపలికినపలుకులనుగలసి తనచిత్తమును వేధింపఁగా.

ఉ. ఆరయ నిట్టిరోఁతలను నాలయముల్ జలజాక్షు లేటికిన్
వీరలతోడిసంగ మిఁక వీడెద నంచుఁ దలంచి తోన దు

ర్వారము లై నకోరికలవంక వివేకముచొప్పు దక్కియిం
పారఁగనాఱునూఱు సురహాయనముల్చరియించెఁ గ్రమ్మఱన్.

టీ. అరయన్ = ఆలోచింపఁగా, ఇట్టిరోఁతలకున్ = ఇట్టియసహ్యములకు, ఆలయముల్ = నివాసస్థానములు, జలజాక్షులు = సుదతులు, వీరల తోడిసంగము = ఇట్టిసుందరులతోడి మైత్రి, ఏటికిన్ = ఎందుకు? ఇఁకన్ = ఇఁకమీఁద, వీడెదన్ = వదలెదను: అంచున్ = అని, తలంచి = తనహృదయమున నుద్దేశించి, తోన = తోడుతనే, దుర్వారములు = వారింపవీలులేనివి, ఐనకోరికలవంకన్ = అయిన కాంక్షలవలన, వివేకముచొప్పు = తెలివియొక్కదారిని, తక్కి = విడిచి, క్రమ్మఱన్ = తిరుగ, ఇంపారఁగన్ = సంతోష మతిశయింపఁగా, ఆఱునూఱుసురహాయనముల్ = ఆఱువందల దేవమానపుసంవత్సరములు, చరియించెన్ = స్త్రీలతో సంచరించెను.

తా. స్వరోచి చిత్తమున నాలోచింపఁగా నిటువంటి యసహ్యముల కన్నింటికి నివాసస్థానములు సుందరులు కావున నీసుందరులతోడి మైత్రిని విడిచి గౌరవముం గాంచవలె నని యెంచి వెంటనే వివేకము పోయి పూర్వమువలె మువ్వురుపత్నులతోఁ గలసి దేవమానమునం దాఱువందల సంవత్సరములు సంచరించెను.

వ. తదనంతరంబ క్రమక్రమంబున మనోరమయందు విజయుం డును విభావసియందు మేరునందనుండును గళావతియందు విభావసుండును ననునందనులం గాంచి పద్మినీవిద్యాప్రభా వంబునం బాకశాసనదిశాముఖంబున విజయునకు విజయా ఖ్యపురంబును గిన్నరేశ్వరహరిదంతంబున మేరునందనునకు గంధవతి యనుపుటభేదనంబును దక్షిణంబున విభావసునకు ధారాహ్వయోదారమహానగరంబునుం గల్పించి యనల్ప విభవంబున నక్కుమారుల నప్పట్టణంబులకుఁ బట్టంబు గట్టి కృతార్థుండై యొక్కనాఁడు. 84

టీ. తదనంతరంబ = తోడనే, క్రమక్రమంబునన్ = క్రమప్రకారము, మనోరమయందు విజయుండును = మనోరమ యను పత్నియందు విజయుఁడను వాఁడును, విభావసియందు మేరునందనుండును=విభావసి యను పత్నియందు మేరునందనుఁడను వాఁడును, కళావతియందు విభావసుండును = కళావతి యనుపత్నియందు విభావసుఁ డను వాఁడును, అనునందనులన్ = అను కుమారులను, కాంచి=కని, పద్మినీవిద్యాప్రభావంబునన్ = పద్మిని యనువిద్య యొక్క మహత్తుచేత, పాకశాసన దిశాముఖంబునన్ = తూర్పుదిక్కు మొదలను, విజయునకున్, విజయాఖ్యపురంబును=విజయమను నామముగలపురమును, కిన్నరేశ్వరహరిదంతంబునన్ = కుబేరసంబంధమగు నుత్తరదిక్కు మొదలను, మేరునందనునకున్, గంధవతియనుపుటభేదనంబును=గంధవతి యను నామము గల పురంబును, దక్షిణంబునన్ = దక్షిణదిశయందు, విభావసునకున్, ధారాహ్వయోదారమహానగరంబును=ధార యను నామముగల గౌరవింపఁబడు గొప్ప పురమును, కల్పించి=ఏర్పాటుచేసి, అనల్పవిభవంబునన్=ఘనమైనవైభవముతో, అక్కుమారులన్ = ఆపుత్రత్రయమును, అప్పట్టణంబులకున్ = ఆపురములం దుమూఁడింటికిని, పట్టంబు గట్టి=పట్టాభిషిక్తులనుగాఁ జేసి, కృతార్థుండై = కోరికలు సర్వముం దీర్చుకొనినవాఁడై, ఒక్కనాఁడు. ముందఱి కన్వయము.

ఉ. శాసితశత్రుఁ డానృపతిచంద్రుఁడు తూణధరుండు సజ్యబా
ణాసనపాణిపంకజుఁడు నై మృగసంఘము లెల్లఁ బెల్లుసం
త్రాసమునొందఁ గ్రూరతనరణ్యమునన్ మృగయాకుతూహలో
ల్లాసమునన్ జరించెఁ జలలక్ష్యవిభేదవిధావధానుఁ డై. 85

టీ. శాసితశత్రుఁడు = శిక్షింపఁబడినవిరోధులుగలవాఁడగు, ఆనృపతిచంద్రుఁడు=ఆరాజోత్తముఁడు, తూణధరుండు = బాణములపొదులు ధరించినవాఁడును, సజ్య = ఎక్కిడిన, బాణాసన=ధనుస్సుతోఁగూడిన, పాణిపంకజుఁడునై = కరపద్మములు గలవాఁడునై, మృగసంఘములు=జంతుసమూదాయములు, ఎల్లన్ = సర్వమును, పెల్లుసంత్రాసమున్ = మిగులభీతిని, ఒందన్ =

పొందఁగా, క్రూరతన్ = క్రూరత్వముతో, మృగయా = వేటయందలి, కుతూహల = ఆసక్తిచేతనైన, ఉల్లాసమునన్ = ఉత్సాహముతో, అరణ్యమునన్ = వనమునందు, చల = కదలునట్టి, లక్ష్య = గుఱియగుజంతువులయొక్క, విభేద = బాగుగా భేదించుట యను, విధా = పనియందు, అవధానుఁడై = ఎచ్చరిక గలవాఁడయి, చరించెన్ = ప్రవర్తించెను.

తా. విరోధుల నందఱిని జయించి పేరుఁగాంచినస్వరోచి వేఁటాడఁ దలంచి ధనుర్బాణములం దాల్చి వనమున కేఁగి యందున్నజంతుజాలము తన్నుం గాంచి భయపడి పాఱుచుండఁగా బాణములు గుఱివిూఱ విడిచి వేఁటాడుచుఁ దిరిగెను.

వ. ఆసమయంబున. 86

టీ. ఆసమయంబునన్ = అట్లు వేఁటాడుచున్న వేళయందు.

క. *కుటిలకృశసాంధ్యరజనీ
విటకోరకకోమలచ్ఛవిస్ఫుటదంష్ట్రో
ద్భటపోత్రఖనిత్రాగ్ర
స్ఫుటితవనీధాత్రి నొక్కపోత్రిం గనియెన్. 87

టీ. కుటిల = వక్రమై, కృశ = సన్నగిలిన, సాంధ్య = సంజవేళ, రజనీవిట కోరక = బాలశశిరేఖరీతి, కోమలచ్ఛవిన్ = మృదువగు ప్రకాశముచేత, స్ఫుట = తేటగా వెలుఁగుచున్న, దంష్ట్రా = కోఱలచేత, ఉద్భట = నిగిడిన, పోత్ర = ముట్టెయను, ఖనిత్ర = త్రవ్వుగోలయొక్క, అగ్ర = కొనచేత, స్ఫుటిత = భేదింపఁబడిన, వనీధాత్రిన్ = అడవిప్రదేశము గలదానిని, ఒక్కపోత్రిన్ = ఒక వనసూకరమును, కనియెన్.

తా. సంధ్యాకాలమందలి చంద్రరేఖవలెఁ బ్రకాశించుచున్న కోఱ

---

* ఇది ప్రక్షిప్తముగా నున్నదని బ్రౌన్‌దొరవారివలన నుదాహరింపఁబడిన యీక్రిందిపద్యమును పైపద్యార్థమునే కలిగియున్నది.

లతో వనప్రదేశమునంతను ద్రవ్వనట్టి యడవిపందిం గాంచెను. అలం. నిదర్శనము. రూపకము.

సీ. జంభారిభిదురసంరంభంబు వీక్షించి
జరుగునంజనమహాశైల మనఁగ
ఝంఝాప్రభంజనాస్ఫాలనంబున కుల్కి
యరుగుసంవర్తకాలాభ్ర మనఁగఁ
గఠినకంఠేకాలకంఠమూలము వాసి
వెస వచ్చునుజ్జ్వలక్ష్వేళ మనఁగఁ
గలుషధూర్వహాఖిలోత్కరముపైఁ బఱతెంచు
దండధరక్రూరదండ మనఁగఁ
తే. ఘుర్ఘురారావసంఘాతఘూర్ణమాన
సప్తపాథోధిపాథగప్రచండనక్ర
తిమితిమింగిల మగుచు నభ్రమును మహియుఁ
గ్రమ్ముకొని వచ్చునొకయేకలమ్ముఁ గనియె. ౮౩

టీ. జంభారిభిదురసంరంభంబున్ = దేవేంద్రుని వజ్రాయుధము యొక్క యట్టహాసమును, వీక్షించి=కని, జరుగుసంజనమహాశైలము=తొలఁగి చనునట్టి పెద్ద కాటుకకొండయో, అనఁగన్, ఝంఝాప్రభంజన=వర్షముతోఁ గలసిన పెద్దవాయువుయొక్క, ఆస్ఫాలనంబునకున్ = చఱుపునకు, ఉల్కి=భీతినొంది, అరుగు=వెళ్లునట్టి, సంవర్త=ప్రళయవేళయందలి, కాలాభ్రము = నల్లనిమబ్బో, అనఁగన్, కఠిన = కఠినమైన, కంఠేకాల = ఈశ్వరునియొక్క, కంఠమూలమున్=అఱ్ఱుక్రిందిప్రక్కను, వాసి=వదలి, వెసన్ = శీఘ్రముతోఁ, వచ్చునుజ్జ్వలక్ష్వేళము = వచ్చునట్టి ప్రకాశించుచున్న గరళమో, అనఁగను, కలుషధూర్వహ = పాపముయొక్క బరువును వహించునట్టి, ఖలోత్కరముపైన్ = దుష్టులసమూదాయముమీఁద, పఱతెంచు = వేగముతో

వచ్చునట్టి, దండధర = జమునియొక్క, క్రూరదండము = కఠినదండాయు
ధమో, అనఁగను, ఘుర్ఘుర = గురగురయను. ఆరావ = ధ్వానముయొక్క,
ఘాత = పెద్దదెబ్బచేత, ఘూర్ణమాన = తొట్రుపడుచున్న, సప్తపాథోధి =
సప్తసముద్రములయొక్క, పాథః=ఉదకములనుండి బయలుదేఱిన, ప్రచండ =
భయంకరమైన, నక్ర = మొసళ్లు, తిమి = తిమి యను పెద్దజాతి చేఁపలు,
తిమింగిలము = తిములను మ్రింగు పెద్దచేఁపలును గలిగినది, అగుచుఁ, అభ్రి
మము=గగనమును, మహీయుఁ = ధాత్రియును, క్రమ్ముకొని=చుట్టుకొని,
వచ్చునొకయేకలమ్మును = వచ్చుచున్న యొకపందిని, కనియెన్.

తా. దేవేంద్రుని వజ్రమాతికి భయపడి పరుగులెత్తు కాటుకకొండ విధముగను, మహావాయువశమునఁ బోలు గొప్పమేఘమురీతిగను, శివుని కంఠప్రదేశమునుండి శీఘ్రముగా వచ్చు విషమువలెను, బాపులను శిక్షింపఁ బఱతెంచు యమునిదండమురీతిగను నుండి గుర్గురధ్వనులచే సముద్రమునందలి జలజంతువులనుగూడఁ గలఁతపెట్టుచు భూమియంతయుం నాక్రమించుకొను తనువిస్తృతియుం నాకాశమంటునంతటి యెత్తుగల యొకవరాహమును రాజు చూచెను. అలం. ఉపమ - అతిశయోక్తి.

మ. కని మౌర్వీనినదంబు సేయుచు భుజంగక్రూరనారాచముం
దనదోర్దండకృతాంతదండనిభకోదండంబునం గూర్చి బో
రన నేయం దమకించుచుండ నొకసారంగాంగనారత్న మ
జ్జననాథాగ్రణిఁ జేరి పంచజనభాషాప్రౌఢిమ న్నిట్లనున్. 39

టీ. కని = సూకరముం జూచి, మౌర్వీనినదంబు = ధనుర్గుణధ్వనిని, చేయుచుఁ, భుజంగక్రూరనారాచముం = సర్పమువలెఁ గ్రూరమయిన బాణమును, తన=తనదైన, దోర్దండ = దండమువంటిహస్తముకొని, కృతాంత దండ = యమదండముతోడ, నిభ = సమానమయిన, కోదండంబునన్ = ధనస్సునందు, కూర్చి, బోరనన్ = వేగముగా, ఏయన్ = విడుచుటకు, తమకించుచుండన్ = తొందరపడుచుండఁగా, ఒకసారంగాంగనారత్నము = ఒక

పంచియాఁడు లేడి, అజ్ఞనాథాగ్రణిన్ = ఆనృపాలోత్తముని, పంచజనభాషాప్రౌఢిమన్ = మనుజులపలుకువంటి పలుకులయందలి నిపుణతతో, ఇట్లనన్.

తా. స్వరోచి యాసూకరముం గాంచి ధనుర్గుణమును మ్రోఁగఁజేసి తీక్ష్ణమగునొకబాణమును ధనుస్సునఁ జేర్చి విడువ నూహించుచుండఁగా నొక యాఁడులేడి నృపాలుం గాంచి మనుజభాషణములతో నిట్లు చెప్పెను.

క. నృప యీ క్రోడము నీకే
యపకారము సేసె దీని కలుగఁగ నేలా
కృప మదిఁ జొనుపక నాపై
నిపు డీశర మేసి నిగ్రహించుట యొప్పున్. 90

టీ. నృప=రాజా! ఈక్రోడము=ఈసూకరము, నీకున్, ఏయపకారము చేసెన్=ఏమి కీడు చేసినది? దీనికిన్ = ఈసూకరమునందు, కృప=ప్రేమను, మదిన్=చిత్తమునందు, చొనుపక=పెట్టుకొనక, అలుగఁగన్ = కోపించుట, ఏలా=ఎందులకు? ఇపుడు=ఈసమయమునందు, ఈశరమున్=ఈబాణమును, నాపైన్ = నామీఁద, ఏసి = విడిచి, నిగ్రహించుట = మృతి నొందించుట, ఒప్పున్ = తగును.

తా. రాజా! యీసూకరము నీ కేమియుం నపకారము చేయలేదు గదా! దీనిమీఁదఁ గోపించి చంపఁ బూనుట యెందుకు? ఇప్పుడు దానిం దయచేసి వదలి నాపై నాశరమును విడిచి నన్నుం జంపిన బాగుగా నుండును.

క. అని పలుక నతఁడు నీ వీ
తనువుపయిన్ రోయ నేల తద్దయుఁ గృశవై
యునికియుఁ గాదు గదా చెపు
మనవుడు నాహరిణి వల్కె నవనీపతికిన్. 91

టీ. అనిపలుకన్ = లేడి తనచే వధింపు మని రాజుతో వాకొనఁగా, అతఁడు=ఆస్వరోచి, నీవు, ఈతనువుపైన్ = ఈశరీరముమీఁద, రోయనేల

అసహ్యపడనేటికి, తద్దయున్ = మిగుల, కృశమై = కృశించి, ఉనికియున్ = ఉండుటయు, కాదుగదా, చెపుమ = నాతోఁ జెప్పుము, అహోరాదికము లభింపక జీవనము కష్టముగా నున్న మరణింపవచ్చునుగాని సుఖముగా నుండి చావఁ గోర నేల? అనవుడున్ = అని పలుకఁగా, అవనిపతికిన్ = స్వరోచితో, ఆహారిణి = ఆయాఁడులేడి, పల్కెన్.

తా. స్వరోచి తనతోఁ బలికినజింకం గాంచి నినుం గాంచిన సౌఖ్యవంతురాలవుగాఁ గాన్పించుచుంటివే! ఇట్లు చావునకుం బూనుట యేల! అన నది చెప్పఁదొడఁగెను.

ఆ. అన్యసతులయందు నాసక్తుఁ డగువానిఁ
దమక మొదవి కూడఁ దలఁచుకంటె
మరణమైనమేలు మది వితర్కింపంగ
ననుచుఁ బలుకుటయును నవనివిభుఁడు. 92

టీ. అన్యసతులయందున్ = పరాంగనలయందు, ఆసక్తుఁడు = ప్రేమ కలవాఁడు, అగువానిన్ = ఐనపురుషుని, తమకము = ప్రేమ, ఒదవి = పుట్టి, కూడన్ = సంగమ మొనర్చుటకు, తలఁచుకంటెన్ = ఊహించుటకన్నను, మదిన్ = చిత్తమునందు, వితర్కింపంగన్ = ఆలోచింపఁగా, మరణమైనను = మృతినొందినను, మేలు = శుభము, అనుచున్ = ఇటు లని, పలుకుటయున్ = వచింపఁగా, అవనివిభుఁడు = రాజు. ముందటి కన్వయము.

తా. పరాంగనలయం దిష్టము గలపురుషునిఁ బ్రేమించి కూడఁగోరుట కన్నఁ జచ్చినను మే లని పలుకఁగానే స్వరోచి యేమో చెప్పఁ దలఁచెను.

క. తావకహృదయం బెవ్వని
పై వదలక నిలిచె నీదుభావము దెలియం
గా వలయుఁ జెప్పుమన్న ధ
రావల్లభుతోడ హరిణి క్రమ్మఱ ననియెన్. 93

టీ. తావకహృదయంబు = నీచిత్తము, ఎవ్వనిపైన్ = ఏమగవానిపై, వదలక = మానక - నిలుకడగా, నిలిచెన్ = పొందెను. నీదుభావము = నీయూహ, తెలియంగావలయున్ = నే తెలియంగవలయును. చెప్పుము = వాకొనుము, అన్నన్ = అని పలుకఁగా, హరిణి = ఆఁడులేడి, ధరావల్లభుతోడన్ = భూభర్తయగు స్వరోచితో, క్రమ్మఱన్ = తిరుగ, అనియెన్ = ఇట్లు లనెను.

తా. నీచిత్త మెవ్వనియందు నిలిచియున్నదో నేను తెలిసికొనవలసి యున్నది. కావునఁ జెప్పుమని యాఁడులేడి స్వరోచితో మరల నిట్లు పలికెను.

చ. చెదరక నామనంబు నృపశేఖర నీయెడ నిల్చి మన్మథ
ప్రదరపరంపరానిహతిపాల్పడి వ్రేఁగెడు నట్లు గాన నా
యెద నడఁగింపు మన్న హరిణాంగన వీవు నరుండ నే ముదం
బొదవఁగ నీకు నాకు మిథునోచితకృత్యము లెట్లు చేకుఱున్.

టీ. నృపశేఖర = రాజోత్తమా! నామనంబు = నాహృదయము, నీయెడన్ = నీయందు, చెదరక = చలనము నొందక, నిల్చి = నిలిచియున్నదై, మన్మథ = మదనునిదైన, ప్రదర = శరములయొక్క, పరంపరా = లెక్కలేని వరుసలయొక్క, నిహతి = దెబ్బలచే, పాల్పడి = స్వాధీనమైన, వ్రేఁగెడున్ = తాపము నొందుచున్నది. అట్లుగాన = కాఁబట్టి, నాయెదటు = నాదగు మన్మథోద్రేకమును - శరపరంపరచే నే నొందుదురవస్థను, అడఁగింపుము = అణఁచివేయుము. అన్నన్ = అని పలుకఁగా, ఈవు = నీవు, హరిణాంగనవు = ఆఁడులేడివి, నేన్ = నేను, నరుండన్ = మనుజుఁడను, నీకున్ నాకున్ = నీకును నాకును, ముదంబు = కౌతుకము, ఒదవఁగన్ = పుట్టునట్లు, మిథునోచితకృత్యములు = భార్యాభర్తల రతిక్రీడలకుఁ దగినవ్యాపారములు, ఎట్లు = ఏవిధముగా, చేకుఱున్ = కలుగును.

తా. రాజోత్తమా! నాహృదయము నీయందే తగుల్కొని మదన బాధచేఁ దాపము నొందుచున్నది. నీవు నన్నుం గూడి యీబాధఁ బోఁగొట్టు

మన స్వరోచి, 'నీవు మృగాంగనవు, నేను నరుండను, నీకును నాకును సంఘటన యెట్లు కాఁగల' దనియెను.

క. నావుడు నను నాలింగన
ఈ వనురాగమునఁ జేయుము మింతియ చాలున్
భూవర యన్నఁ గృపార్ద్రుఁడు
గావున నానృపతి హరిణిఁ గౌఁగిటఁ జేర్చెన్. 95

టీ. నావుడున్=అని, స్వరోచి పలుకఁగానే, భూవర=నృపా! ఈవు=నీవు, ననున్, అనురాగమునన్ = దయతో, ఆలింగనము=పరిష్వంగమును, చేయుము. ఇంతియ = ఈకౌఁగిలించుటయే, చాలును. అన్నన్ = అనఁగా, ఆనృపతి = ఆస్వరోచి, కృపార్ద్రుఁడు=ప్రేమచే మెత్తఁబడినవాఁడు, కావునన్, హరిణిన్ = హరిణాంగనను, కౌఁగిటఁ జేర్చెన్ = కౌఁగిలించెను.

తా. స్వరోచి యట్లనినతోడనే యా యాఁడు లేడి, 'రాజా! నీవు నన్ను ప్రేమతోఁ గౌఁగిలించుకొనుము. అదియే చాలు' నన స్వరోచి దయగల వాఁడు గనుక నాయాఁడుజింకను గౌఁగిలించుకొనెను.

సీ. వల్లీమతల్లి లావణ్యసర్వస్వంబు
విమలాంగరేఖ నావిర్భవింపఁ
మంజులమంజరీమహితసౌభాగ్యంబు
పరివృత్తకుచవృత్తిఁ బరిణమింపఁ
బల్లవచ్ఛదచారుభావానుభావంబు
మృదుహస్తలీల మూర్తీభవింప
రమణీయముకుళవిభ్రమభాగధేయంబు
కరరుహస్ఫూర్తి సాక్షాత్కరింపఁ

తే. జేసి మృగిగ్గై వహించునతిద్వయంబు
భాసురంబుగఁ దనయంకపాళిలోన

మించు క్రొమ్మించు నుపమించు మెలఁత యగుచు
నిలుచునవ్వనదేవత నృపతి చూచి. 96

టీ. వల్లీమతల్లి = శ్రేష్ఠమయిన తీవియలయొక్క, లావణ్య = ప్రభాతిశయముయొక్క, సర్వస్వంబు = సర్వసౌందర్యమును, విమలాంగరేఖన్ = స్వచ్ఛమయిన యవయవసౌష్ఠవముతో, ఆవిర్భవింపన్ = జన్మింపఁగా - తీవియ చక్కఁదనమంతయుం నవయవములుగా మాఱఁగా ననుట. మంజుల = అందమయిన, మంజరీ = పుష్పగుచ్ఛములయొక్క, మహిత = మహిమగల, సౌభాగ్యంబు = సౌందర్యము, పరిస్ఫూర్తిసువృత్తిన్ = గుండ్రనిపయోధర ప్రవర్తనముతో, పరిణమింపన్ = ఏర్పడఁగా - పూలగుత్తుల చక్కఁదనమంతయుఁ జన్నుఁదోయిగా మాఱఁగా ననుట. పల్లవచ్ఛద = లేఁజొంపములయొక్క, చారుభావ = అందముయొక్క, అనుభావంబు = ఘనత, మృదుహస్తలీలన్ = మృదువగు కరప్రకారముచేత, మూర్తిభవింపన్ = రూపమును బొందినది కాఁగా - చిరుజొంపములయందము కేలుదోయిగా మాఱఁగా ననుట. రమణీయ = మనోహరమయిన, ముకుళంపు పువ్వుమొగడలయొక్క, విభ్రమ = సౌందర్యముయొక్క, భాగధేయంబు = ఐశ్వర్యము, కరరుహస్ఫూర్తిన్ = నఖములయొక్క తెలుపుచే - మొగ్గలు పూవులు శ్వేతగణములోనివి గాన మొగ్గలు గోళ్లుగా మాఱఁగా ననుట. సాక్షాత్కరింపన్ = ప్రసన్నము కాఁగా, చేసి = కావించి, (కర్తృవిశేషణ). మృగియై = హరిణాంగనయై, వహించునక్షిద్వయంబు = ధరించిన నేత్రద్వయము, భాసురంబుగన్ = వెలుఁగఁగా, తన యంకపాళిలోనన్ = తన పరిష్వంగమందు, మించు క్రొమ్మించున్ = ప్రకాశించుచున్న నూతనపు మెఱుపును, ఉపమించు మెలఁత = పోలునట్టి సుందరి, అగుచున్, నిలుచు నవ్వనదేవతన్ = నిలిచియున్న యావనదేవతను, చూచి, నృపతి = స్వరోచి, ముందఱి కన్వయము.

తా. హరిణాంగనాకారముతో నుండిన దేవత యరణ్యములో నున్న లతలే దేహమును, పుష్పగుచ్ఛములే పాలిండ్లును, జొంపములే కరములును,

పుష్పముకుళములే నఖములును, లేడికన్నులే కన్నులుగాఁ గలయి వెలుఁగొందఁగాఁ గంపాలతవలె నారాజుకౌఁగిట నొక మనుజాంగనవలెఁ గాన్పించు నామెం జూచి స్వరోచి. అలం. ఉపమ.

క. పూనిన విస్మయరసమున
మానిని మృగివై చరించి మఱి యంగన వై
కానంబడితివి చిత్రం
బే నెన్నఁడు నెఱుఁగఁ జెప్పవే తెలియంగన్. 97

టీ. పూనిన = వహించిన, విస్మయరసమునన్ = అద్భుతరసముతో, ఆశ్చర్యమును బొంది, మానిని=ఓసుందరీ, మృగివై=ఆఁడులేడివై, చరించి = మసలి, మఱి=తరువాత, అంగనవై = మర్త్యస్త్రీవై, కానంబడితివి=కనవచ్చితివి, చిత్రంబు=ఇది చిత్రముగా నున్నది. ఏన్ = నేను, ఎన్నఁడున్=ఏనాఁడును, ఎఱుఁగన్=(ఇట్టిసంగతిని) చూచి యెఱుఁగను. తెలియంగ=ఇటుకాఁ గారణమేమో నాకుఁ దెలియురీతిని, చెప్పవే = నా కెఱింగింపుము.

తా. అప్పు డామెం జూచి రాజు. ఓసుందరీ నీవు మొదట హరిణాంగనవై యుండి తరువాత మనుజాంగనవై కాన్పించుచుంటివి. ఇయ్యది చిత్రముగా నున్నది. ఇట్లగుటకు హేతు వేమో నా కెఱింగింపుము అనెను.

సీ. నావుడు నమరకాంతాతనూభవుఁ జూచి
యవ్వనదేవత నే నరేంద్ర
సకలభూభువనరక్షాదక్షు మనువర్యు
నీయందుఁ బడయుమనెన్నిక సమస్త
దివిజులు నన్నుఁ బ్రార్థించిన వచ్చితి
ననురాగవతినైన నను వరించి
పడయుము నాయందు నపత్యంబు దీన నీ
కగుఁ బుణ్యలోకసంప్రాప్తి యనిన

తే. నట్లకా కని యమ్మంబుజాయతాక్షి
నేకచిత్తంబుతోడ నంగీకరించె
బాల యిట్లు సుఖాంబుధిఁ దేలుచుండి
యంత గర్భిణి యై శుభం బగుదినమున. 98

టీ. నావుడున్ = అనఁగా, అమరకాంతాతనూభవుఁడు = దేవతాంగనాపుత్త్రుఁడగు స్వారోచిని, చూచి, నరేంద్ర = రాజా! ఏన్ = నేను, ఇవ్వనదేవతన్ = ఈ కాననమున కధిష్ఠానదేవతను, సకల = సకలమైన, భూభువన = భూలోకముయొక్క, రక్షా = సంరక్షించుటకు, దక్షున్ = తగినవానిని, మనువర్యున్ = ఉత్తమమనువును, నీయందున్ = నీవలనను, పడయంగోరికన్ = కనవలెనని యపేక్షతో, నన్నున్, సమస్తవిబుధాలు = సర్వదేవతలును, ప్రార్థించినన్ = కోరఁగా, వచ్చితిన్ = అరుదెంచితిని. అనురాగవతిని = ప్రేమగలదానను, ఐన నన్నున్, వరించి = గ్రహించి, నాయందున్, అపత్యంబు = సంతానమును, పడయుము = పొందుము. దీనన్ = ఈ సంతానముచేత, నీకున్, పుణ్యలోకసంప్రాప్తి = పుణ్యలోకముయొక్క లాభము, అగున్ = కలుగును. అనినన్ = అని పలుకఁగా, అట్లకాక = అటులనే కానిమ్ము, అని అమ్మంబుజాయతాక్షిన్ = పద్మములవలె విశాలములయిన నేత్రములుగల యావనదేవతను, ఏకచిత్తంబుతోడన్ = ఇతరచింత లేక, అంగీకరించెన్ = పరిగ్రహించెను. బాల = ఆచిన్నది, ఇట్లు, సుఖాంబుధిన్ = సౌఖ్యసాగరమున, తేలుచున్ = ఓలలాడుచు, ఉండి, అంతన్ = తరువాత, గర్భిణియై = చూలాలై, శుభంబు = మంచిది, అగుదినమునన్, ముందటి కన్వయము.

తా. స్వారోచి తనసంగతిని చెప్పుమని యడుగ నాచిన్నది 'నే నీవనదేవతను. నీవలన నొకమనువుం గనవలె నని దేవతలు కోరఁగా నీకడ కేతెంచితిని. నన్నుం గలసి పుత్త్రుం గాంచుము. అతనివలన నీకుఁ బుణ్యలోకములు

కలుగు' నని చెప్పఁగా దాని కొడంబడి యావనదేవతం బరిగ్రహించి సౌఖ్యమునం దేలుచుండ నామె గర్భముం దాల్చి మంచిదినమందు.

శా. కాంచెన్ బుత్త్రు విశాలనేత్రుఁ బృథువక్షఃపీఠవిభ్రాజితున్
బంచాస్యోద్భటశౌర్యధుర్యఘనశుంభద్బాహుఁ దేజోనిధిం
బంచాస్త్రప్రతిమాను మానఘను సామ్రాజ్యైకహేతుప్రభూ
తాంచల్లక్షణలక్షితున్ సుగుణరత్నానీకరత్నాకరున్. ౧౪

టీ. విశాలనేత్రున్ = వెడల్పగు నేత్రములుకలవానిని, పృథు = విస్తృత మయిన, వక్షః పీఠ=పీఁటవంటివక్షముచేత, విభ్రాజితున్ = వెలుంగువానిని, (విశాలము లగు కనులు వెడఁదయురము ఇవి సాముద్రికశాస్త్రమును బట్టి చూడ శుభైశ్వర్యసామ్రాజ్యాధిపత్యసూచకములు.) పంచాస్య = సింగముయొక్క, ఉద్భట = విస్తారమయిన, శౌర్య = శూరత్వముంబోలిన శూరత్వమునకు, ధుర్య = భారమును వహించువవియైన, ఘన=గొప్పవైన, శుంభద్బాహున్ = ప్రకాశించుభుజములు గలవానిని, తేజోనిధిన్ = తేజమున కునికియైనవానిని, పంచాస్త్రప్రతిమానున్ = మదనునివంటి సౌందర్యము గలవానిని, మానఘనున్ = గొప్పమనస్సు కలవానిని, సామ్రాజ్య = మహామండలాధిపత్యమే, ఏక = ముఖ్యమయిన, హేతు = హేతువుగాఁగల, ప్రభూత = గొప్పవయిన, అంచత్ = ప్రకాశించుచున్న, లక్షణ=సాముద్రికలక్షణములచేత, లక్షితున్ = చూడఁబడినవానిని, సుగుణ = సద్గుణము లను, రత్న = మణులయొక్క, అనీక = సముదాయమునకు, రత్నాకరున్ = సముద్రుఁ డైనవానిని, పుత్త్రున్ = కుమారుని, కాంచెన్.

తా. విశాలనయనములును వెడఁదఱొమ్మును సింహపరాక్రమమును గొప్పప్రతాపమును మన్మథు నతిశయించిన సౌందర్యమును సార్వభౌమలక్షణములును సద్గుణములును గలిగిన యభిమానధనుఁ డగు నొక కుమారుఁ గాంచెను. అలం. రూపకము.

క. వేడుక నయ్యవసరమున
నాడిరి సురసతులు కిన్నరాంగన లర్థిఁ
బాడిరి గంధర్వులు గొని
యాడిరి సురతూర్యనినద మగ్గల మయ్యెన్. 100

టీ. అయ్యవసరమునన్ = అపుత్రోత్సవవేళ, వేడుకన్ = సంతోషముతో, సురసతులు = దేవతాంగనలు, ఆడిరి = నాట్యములు గావించిరి. అర్థిన్ = ప్రేమతో, కిన్నరాంగనలు = కిన్నరస్త్రీలు, పాడిరి = గానము చేసిరి. గంధర్వులు = దేవగాయకులగు గంధర్వులనువారు, గొనియాడిరి = పొగడిరి. సురతూర్యనినదము=దేవవాద్యధ్వానము, అగ్గల మయ్యెన్ = విస్తారమయ్యెను.

తా. పుత్త్రుఁడు జన్మించినప్పుడు సంతోషమున నప్సరస లాడిరి. కిన్నరాంగనలు పాడిరి. గంధర్వులు పొగడిరి. దేవదుందుభిధ్వానము లధికమయ్యెను.

తే. అట్లు జనియించి స్వారోచిషాఖ్య నతఁడు
శాంతిదాంతిదయాసత్యశౌచనిరతుఁ
డై యకామతఁ జిరతపం బాచరించె
నచ్యుతునిఁగూర్చి యంతఁ గృపార్ద్రుఁ డగుచు. 101

టీ. అట్లు, జనియించి = పుట్టి, అతఁడు = అపుత్త్రుఁడు, స్వారోచిషాఖ్యన్ = స్వారోచిషుఁ డనునామముతో, శాంతి = శమమునందును, దాంతి = దమమునందును (అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహములయందనుట), దయా = ప్రేమయందును, సత్య = సూనృతమందును, శౌచ = శుద్ధతయందును, నిరతుఁడై = ఇచ్ఛగలవాఁడై, అకామతన్ = కాంక్షలు లేనితనముతో, అచ్యుతునిఁగూర్చి = విష్ణుదేవు నుద్దేశించి, చిరతపంబు = బహుకాలము జరుపునట్టి తపస్సును, ఆచరించెన్ = ఒనర్చెను. అంతన్ = అటుతర్వాతను, కృపార్ద్రుఁ డగుచున్ = దయగలవాఁ డగుచు, ముందటి కన్వయము.

ప్రతిఫలాపేక్షతోఁ జేయుకర్మములకంటె నిష్కామకర్మమె ఫలప్రదమని భగవద్గీతాదులయందుఁ గలదు. అకామకర్మమును కృష్ణభగవానుఁడిటులఁ జెప్పియున్నాఁడు.—

శ్లో. "యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః,
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర." (అధ్యా-3. ౯.)

తా. అట్టు పుట్టి యాతండు స్వారోచిషుఁ డనునామముతో నంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహము గలవాఁడై, ప్రేమయందును సత్యమందును శుచిత్వమునను నిచ్చగలవాఁ డయి విషయేచ్ఛలు లేనివాఁడై విష్ణుదేవుం గూర్చి బహుకాలము తపము సేయఁ బిదప నారాయణుండు వరయగలవాఁడగుచు. (కర్త నుండటిపద్యమునందలి లక్ష్మీశ్వరుఁడు)

సీ. నీలమేఘముడాలు డీలుసేయఁగఁజాలు
మెఱుఁగుఁజామనచాయ మేనితోడ
నరవిందములకచ్చు లడఁగించుజిగిహెచ్చు
నాయతంబగుకన్నుదోయితోడఁ
బులుఁగురాయనిచట్టుపలవన్నె నొరపెట్టు
హొంబట్టు జిలుఁగుగెంజెంబుతోడ
నుదయదర్కబింబంబునొఱపునిండంబు
దొరలంగ నాడుకౌస్తుభముతోడ
తే. జయ జయధ్వని మౌళి నంజలులు సేర్చు
శర్వశతధృతిశతమన్యుశమనశరధి
పాలకైలబిలాదిదేవాళితోడ
నెదుటఁ బ్రత్యక్షమయ్యె లక్ష్మీశ్వరుండు. 102

టీ. లక్ష్మీశ్వరుండు=విష్ణుమూర్తి-లక్ష్మీదేవికి హృదయవల్లభుఁడు శ్రీమన్నారాయణమూర్తి నీలమేఘముడాలు=నల్లనిమబ్బుకాంతిని, డీలుసేయఁగన్ = జయించుటకు, చాలు=తగిన, మెఱుఁగు=ప్రకాశించుచున్న, చామనచాయ =

శ్యామవర్ణముతోఁగూడిన, మేనితోడన్=శరీరముతోను, అరవిందముల కచ్చులు=పద్మములయొక్క యతిశయములను-కచ్చు లనునెడ రేకలని చెప్పుటయే సమంజసము. కచ్చుపదము రేకలనునెడ రూఢము. చూ.

ఉ. "పంచశిలీముఖుండు తుదబాణమునం జగమెల్ల గెల్చి య
భ్యంచితపుష్పవృష్టి మరుదాళి నింపఁగ నిప్పు డల్లు ము
ద్రించినజాడఁ దెల్పు సుదతీ మధుపంబు పరిచ్ఛదచ్ఛటా
కంచుకితోత్పలంబు తుది కచ్చునఁ జిక్క యచంచలాకృతిన్."

(వసు. ఆ ౪. ౧౫౩)

అడఁగించుజిగిన్ = పోఁగొట్టునట్టి ప్రకాశముచేత, హెచ్చుశాయతంబు = ఎక్కువ విస్తృతమైనవి, అగునన్నఁదోయితోడన్=అయినట్టి నేత్రద్వయముతోను, పులుఁగురాయని=పక్షిరాజగు గరుడునియొక్క, చట్టుపలవన్నెన్ = పక్షములరంగును, బిరపెట్టు=సమానమయిన, హొంబట్టు = బంగరు రంగుపట్టయిన. (ప్రాఁతాదులగు పొన్నుపదమునకుఁ బరుపాదియగు పట్టుపర మగుటచే హొంబట్టుపదము సిద్ధించెను. కన్నడమున పవర్గమునకు మాఱు హవర్ణ మచ్చురింతురుగాన "హొంబట్టు" అని పెద్దన ప్రయోగించెను.) జిలుఁగు=సన్నపాటి, రెంటెంబుతోడన్ = జమిలినేతబట్టతోడను, (పా. రెంటెమ్ము = జమిలి నేఁతపట్టుబట్ట) ఉదయ = పుట్టునప్పటి, అర్కబింబంబు = రవిబింబము యొక్క, ఒఱపు = చక్కఁదనముయొక్క, విడంబంబు = ఉపమను, తొరలంగజాడు = పోఁగొట్టునట్టి. కౌస్తుభముతోడన్ = కౌస్తుభమాణిక్యముతో, జయజయధ్వనిన్ = జయజయ యనుధ్వానముతో, మౌళిన్ = శిరస్సునందు, అంజలులు = దోసిలులు, చేర్చు = ఉంచుకొనునట్టి. శర్వ = ఈశ్వరుఁడు, శతధృతి = బ్రహ్మదేవుఁడు, శతమన్యు = దేవేంద్రుఁడు, శమన = యమధర్మరాజు, శరధిపాలక = వరుణదేవుఁడు, ఐలబిల = కుబేరుఁడు, ఆది = మున్నుఁగాఁగల, దేవాలితోడన్ = దేవతాసమూహముతోను, ఎదుటన్ = ఆ స్వారోచిషునిముందఱ, ప్రత్యక్షమయ్యెన్ = ప్రసన్నుఁడాయెను.

కౌస్తుభము రక్తవర్ణ మనుటకు.—

శ్లో. "కౌస్తుభాఖ్యమభూద్రత్నం పద్మరాగో మహోదధేః,
తస్మిన్ హరిః స్పృహాం చక్రే వక్షోలంకరణే మణౌ." ౘ. (భాగ.)

శ్లో. "జయంతి జగతాం మాతుః స్తనకుంకుమబిందవః,
ముకుందాశ్లేషసంక్రాంతకౌస్తుభశ్రీవిడంబినః." (వసంతతిలక.)

సీ. "కమలాప్త కమనీయ కౌస్తుభరత్నంబు గృహదీపకళిక సుశ్రీవహింప"

సీ. "కౌస్తుభరత్నంబు గాంచి బింబ మటంచు
మోహించిచేరిన ముద్దుచిలుక." (దశావతారచరిత్ర. ఆ-౭.)

తా. నీలమేఘవర్ణుఁడును, పద్మాక్షుఁడును, బంగారుచేలములం దాల్చువాఁడును, కౌస్తుభాలంకారుఁడును, బ్రహ్మరుద్రేంద్రయమవరుణకుబేరాది దేవబృందసేవితుండును నగు నాదినారాయణుండు స్వారోచిషునకుఁ బ్రసన్నుఁ డయ్యెను. అలం. ఉపమ. ఉదాత్తము.

క. ఈతెఱఁగునఁ దోఁచినహరి
కాతఁడు సాష్టాంగ మెరఁగి యంగము పులకా
న్వితంబుగ హర్షాశ్రువు
లేతేరఁగఁ జూచి భక్తి నిట్లని పొగడెన్. 103

టీ. అతఁడు = ఆస్వారోచిషుఁడు, ఈ తెఱఁగునన్ = ఈప్రకారముగా, తోఁచినహరికిన్ = ప్రసన్నుఁ డయిన నారాయణునకు, సాష్టాంగము=అష్టాంగములతోఁ గూడినట్లు సాఁగిలఁబడి, ఎరఁగి = నమస్కారము చేసి, అంగము = శరీరము, పులకాన్వితంబుగన్ = గగుర్పాటు నొందఁగా, హర్షాశ్రువులు = సంతోషబాష్పములు, ఏతేరఁగన్ = జనించఁగా, చూచి, భక్తిన్ = భక్తితో, ఇట్లని, పొగడెన్ = స్తోత్రముచేసెను.

తా. ఆస్వారోచిషుఁ డిట్టిధముగాఁ బ్రసన్నుఁ డయినహరికిఁ జాఁగిలఁబడి మ్రొక్కి శరీరము పులకరింప నానందబాష్పములు వెడలి భక్తితో నిట్లని స్తోత్రముచేసెను.

కవిరాజవిరాజితము——

జయజయ దానవదారణకారణశార్ఙ్గరథాంగగదాసిధరా
జయజయ చంద్రదినేంద్రశతాయుతసాంద్రశరీరమహఃప్రసరా
జయజయ తామరసోదరసోదరచారుపదోజ్ఝితగాంగఝరా
జయజయ కేశవ కేశినిషూదన శౌరి హరీ దురితాపహరా. 104

టీ. దానవ = దనుజులయొక్క, దారణ = భేదమునకు, కారణ = హేతువులైన, శార్ఙ్గ = సింగిణీవిల్లు, రథాంగ = చక్రము, గదా = గుదియ, అసి = కత్తి, ధరా = దాల్చినవాఁడా! జయజయ = జయింపుము - సమస్త విరోధులను జయించి సర్వదా జయశీలివై వెలుంగు మనుట. చంద్ర = చందురులయొక్క, దినేంద్ర=ఆదిత్యులయొక్క. శతాయుత = పదిలక్షలయొక్క, సాంద్ర విస్తారమయిన, శరీరమహః = శరీరకాంతివంటి శరీరకాంతియొక్క, ప్రసరా = వ్యాప్తిగలిగినవాఁడా! జయజయ, తామరసోదర = పద్మముల యొక్క లోపలితట్టునకు - తామరపూవులలోనిభాగ మెఱ్ఱగా నుండును గాన నట్టి యెఱుపునకు, సోదర = సమాన మయిన, చారు = మనోహరమయిన, పద=పాదములవలన, ఉజ్ఝిత = వదలఁబడిన, గాంగ = గంగానదీ సంబంధమయిన, ఝరా=ప్రవాహముకలవాఁడా! జయజయ, కేశవ = బ్రహ్మరుద్రులకు పుట్టుకచోటు గలవాఁడా-లేక మంచి శిరోజములు గలవాఁడా! కేశవపదమునకు "శోభనాః కేశాః యస్య సః" అను వ్యుత్పత్తిచే మంచి కేశములు గలవాఁ డని చెప్పఁదగును. లేదా "క ఇతి బ్రహ్మణో నామ ఈశోఽహం సర్వదేహినాం, ఆవాం తవాంగే సంభూతౌ తస్మాత్కేశవ నామవాన్." హరివంశే. "కశ్చ ఈశశ్చ తావస్మిన్ స్త ఇతి వా." అను వ్యుత్పత్తిచే బ్రహ్మరుద్రులకు జనకభూత మైనవాఁ డని చెప్పవచ్చును. కేశినిషూదన=కేశి యను రక్కసునిఁ జంపినవాఁడా! శౌరి=శూరవంశోద్భవుఁడా! హరీ = హరి

యను నామాంతరముగలవాఁడా! దురితాపహారా = వృజినము లణఁచి చేయువాఁడా! జయజయ.

తా. చక్రగదాఖడ్గశార్ఙ్గములు దాల్చి రక్కసులు జంపినవాఁడవును, అనేకసూర్యచంద్రులఁ బోలిన దేహప్రభ గలవాఁడవును, గంగకు జన్మస్థానమగు చరణపద్మములు గలవాఁడవును, బ్రహ్మరుద్రులకు జన్మస్థానమైనవాఁడవును, కేశి యను దానవుని వధించినవాఁడవును, శూరవంశోద్భవుఁడవును, పాపములను బోఁగొట్టువాఁడవు నైన గోవిందమూర్తీ! శత్రువుల సందడిని జయించి యెందఱియందును గొప్పవాఁడవై సంచరింపుము.
అలం - ఉపమ.

సీ. అవ్యయానంత విశ్వాత్మక విశ్వేశ
బ్రహ్మవు నీవ కపర్ది నీవ
యింద్రుండ నీవ వహ్నివి యనిలుఁడ నీవ
వరుణుండ నీవ భాస్కరుఁడ నీవ
యముఁడ నీవ వసూత్కరము నీవ రుద్రులు
నీవ యాదిత్యులు నీవ విశ్వు
లీవ మరుత్తులు నీవ మంత్రములు నోం
కృతి వషట్కృతి శ్రుతిస్మృతులు నీవ
తే. వేద్య మీవ యీవచ్చినవిబుధగణము
సర్వమును నీవ యెట్లన్న సర్వగతుఁడ
వగుట మఱి నీవు గానివాఁ డనఁగ నెవ్వఁ
డరయఁగను శేషభూతపదుస్త శేషి. 105

టీ. అవ్యయ = శుభాకారుఁడా, అనంత=అంతము లేనివాఁడా, విశ్వాత్మక=సకలస్వరూపుఁడ వైనవాఁడా, విశ్వేశ=సమస్తలోకములకు: ప్రభూ, బ్రహ్మవు=సృష్టికర్త యగు నలువమోముల వేలుపవు, నీవ=నీవే, కపర్ది=శంకర

కర్త యగుమహేశ్వరుఁడవు, ఈవ=నీవే, ఇంద్రుండవు, ఈవ=నీవే, వహ్నివి= ప్రత్యక్షదైవతమవు-అష్టదిక్పాలకులం దొక్కఁడవు నగు నగ్నిహోత్రుఁడవు, అనిలుఁడవు = దిక్పాలకులం దొక్కఁడును ప్రాణస్వరూపుఁడు నగువాయు రూపుఁడవు, ఈవ. వరుణుండవు = పశ్చిమదిక్పాలకుఁ డగు వరుణదేవుఁడవు, ఈవ. భాస్కరుఁడవు = ప్రభాకరుఁడవు-సమస్తలోకములకుఁ బ్రకాశమును బ్రసాదించు సూర్యభగవానుఁడవు, ఈవ. యముఁడవు = పాపుల శిక్షించుట యందు ధర్మము తొలఁగనివాఁడవు - దక్షిణదిక్కు పాలించువాఁడవు నగు యముఁడవు, ఈవ. వసూత్కరముల్ = వసువుల సమూహమును-అష్టవసువులును, ఈవ. రుద్రుల్=ఏకాదశరుద్రులును, ఈవ. ఆదిత్యులున్=ద్వాదశాదిత్యులును, ఈవ. విశ్వుల=పదునలుగురు విశ్వదేవతలు, ఈవ. మరుత్తులున్= నలువదితొమ్మిదిమంది వాయువులు ఈవ. మంత్రములు=గాయత్రి మొదలగు మంత్రములును, ఓంకృతి = ఓంకారమును, వషట్కృతి = యజ్ఞాదులయందలి వషట్కారమును శ్రుతి = వేదములును, స్మృతులున్ = ధర్మశాస్త్రములును, ఈవ. వేద్యము = తెలిసికొనఁదగిన ముఖ్యవస్తువును, ఈవ. ఈవచ్చిన వివిధ గణము = ఇక్కడికిప్పుడు వచ్చియున్న దేవతాసమూహము, సర్వమును=ఎల్లయును, ఈవ. ఎట్టన్నన్ = అది యెట్టన, సర్వగతుఁడవు=అంతట నిండియున్న వాఁడవు-సర్వభూతాంతర్యామివి, అగుటన్ = అగుటచేత, మతి = మతియును, ఆరయఁగను=ఆలోచింపఁగా, నీవు కానివాఁడు=నీవుగాకుండువాఁడు, అనఁగన్ = అనఁగా, ఎవ్వఁడు=ఎవ్వఁడున్నాఁడు, శేషభూతసమస్త=అప్రసక్తమయిన సర్వజీవములు గలవాఁడా - లోఁబడిన ప్రవృత్తులుగల సమస్త ప్రాణులు గలవాఁడా, శేషి=నిధేయ మగు సర్వలోకమునకును ముఖ్యమయిన వాఁడా-సర్వప్రపంచమునకు స్వామియైన వాఁడా యనుట.

మ. పరతత్త్వం బగునీకు మోడ్తుఁ గరముల్ పద్మాక్షకీర్తించెదన్
బుధసార్థస్థితి నొప్పు నిన్నుఁ గరుణాంభోధిన్ భవార్తున్ జ
డున్, శరణార్థిన్ ననుఁ గావఁగాఁ దగుఁ బ్రధానవ్యక్తకాలా

త్మ యీశ్వరభూతంబుల కీవె కర్తవును బ్రోవఁగ భర్తవుఁగ
హర్తవున్. 106

టీ. పద్మాక్ష=పద్మములవంటి నేత్రములు గలవాఁడా! పరతత్త్వంబు= పరబ్రహ్మము, అగునీకున్ అయి యొప్పారుచున్న నీకు, మోడ్పుఁగరముల్ = వందనము, పురుషార్థస్థితిన్ = నాలుగు పురుషార్థముల యందునికిచే - ధర్మార్థకామమోక్షము లను నాలుగువిధముల పురుషార్థముల యందునికిచేత, ఒప్పునిన్నున్ = అమరియున్న నిన్ను, కరుణాంభోధిన్ = దయాసముద్రుఁ డయినవానిని, కీర్తించెదన్ = పొగడెదను. భవార్తున్ = సంసారమువలన బాధితుఁడ నగువానిని, జడున్=మూఢుఁడ నగువానిని, శరణార్థిన్ = శరణు గోరినవానిని, ననున్, కావఁగాఁ దగున్ = రక్షింపఁదగును. ప్రధానవ్యక్త= సర్వశేషి యనఁ దెలియఁబడుచుండువాఁడా, కాలాత్మ = (భూతభవిష్యత్తు) కాలస్వరూపుఁడా, ఈశ్వర=సకలనియామకుఁడా, భూతంబులకున్ = జీవములకు, కర్తవున్ = సృష్టికర్తవును, ప్రోవన్ = రక్షించుటకు, భర్తవున్ = భారమును వహించినవాఁడవును, హర్తవున్ = నాశనము చేయువాఁడవును, ఈవ = నీవె.

తా. ఓనారాయణమూర్తీ! పరబ్రహ్మమువగు నీకు నమస్కరించెదను. ఎక్కువ భూతదయ గలవాఁడవును. నాల్గు పురుషార్థములను నెక్కొలుపు వాఁడవు నగునిన్ను స్తోత్రము చేసెద. సర్వశేషివై తగువాఁడవును కాల స్వరూపుఁడవును సర్వనియామకుఁడవు నైననీవు సర్వజీవముల సృష్టిస్థితి సంహారము లొనర్తువు గావున సంసారబద్ధుఁడనై యేమియుం నెఱుంగని వాఁడనై శరణు వేఁడిన నన్ను రక్షింపుము.

## దశావతారస్తవము

చ. విలయతమిస్రవేళ నతివేలమహాంబుధినూర్ధ్వలోకవా, సులు
నతులై కనుంగొనెడు మూఁడ్కులకోర్వహుతాశనక్రియా, కలి

తగతిఁ వెలుంగుఘనకాయవిజృంభణఁ జోటమీన వై, కల
యఁగఁ గ్రాలు నీ వెడఁదకన్నులు ప్రోచు మముఁగా మురాంతకా.

టీ. మురాంతకా = మురాసురుని జంపినహరీ, విలయతమిస్ర వేళన్ = ప్రళయకాలపు నిశాసమయమందు, అతివేల మహాంబుధిన్ = ఒడ్డును దాఁటి సమస్తప్రపంచమును వ్యాపించిన మహాసముద్రమునందు, ఊర్ధ్వలోక వాసులు=స్వర్గము మొదలుకొని పయిలోకములయం దున్నవారలు, నతులై = నమస్కరించుచున్నవారై, కనుంగొనెడు చూడ్కులకున్ = వీక్షించునట్టి వీక్షణములకు, ఔర్వహుతాశన = బడబానలముయొక్క, క్రియా = పని తోడ, కలిత = ఒప్పుచున్న, గతిన్ = ప్రకారముచేత, వెలుంగు = వెలుఁగుచున్న, ఘన= పెద్దదియయిన, కాయ = శరీరముయొక్క, విజృంభణన్ = శరీరస్ఫూర్తిచేత, చోటమీనవై = చోటచేఁపవై, కలయఁగన్ = సర్వత్ర క్రాలునీ వెడఁదకన్నులు= వెలుఁగుచున్న నీ పెద్దకన్నులు, మమున్, ప్రోచున్ = కాపాడునుగాక.

విలయతమిస్ర మావరించుటచే లోకమంతయుం జలమయమై యంధకార బంధురముగా నుండెను. అందున్న మీనము దేహాభివృద్ధి నొందిన కొలఁది కనులు మిగుల వృద్ధినొంది బడబాగ్నులవలెఁ దోఁచెను. విలయ తమిస్రముగా మీననేత్రములు కలయఁ బ్రకాశించెను. కనులు వెడఁదలు గాన కను వెలుఁగులు బడబాగ్నులవలెఁ దోఁచెను.

తా. మురాసురునిం జంపిన నారాయణమూర్తీ! ప్రళయకాలపు నిశయందు ప్రపంచమును ముంచివైచిన మహాసముద్రములోఁ బయిలోకములనుండి చూచుచు నతులు సల్పువారినేత్రములకు బడబానలమో యనఁ బ్రకాశించుచున్న పెద్దశరీరము గలచోటచేఁపవైన నీలోచనములు మముం గాపాడుఁగాక. అలం-రూపకము.

చ. చటులకృపీటసంస్థితరసాస్థలి వ్రీలక యుండ గార ముం
జ్ఫుటమునుబోలె శంఖమణిశుక్తికదంబము నుగ్గుగా విశం

కటచరమాంగమంథగిరిఘట్టనఁ జేసి ఘురట్టమై కృపా
పటిమజగంబుఁ బ్రోచునలప్రాక్కమఠంబు నినున్ భజించెదన్.

టీ. చటుల = కదలుచున్న, కృపీట = జలమునందు, సంస్థిత = ఉండు నట్టి, రసాస్థలి = ధరణీతలము, శిథిలతయాఁ౦దక = పగులకుండుటకై, గారవించ్చుటకునఁ బోలెక = సన్నపుగచ్చు చేయుటకో యనునట్లు, శంఖ = చిందములయొక్కయు, మణి = మణులయొక్కయు, శుక్తి = ముత్యపుఁ జిప్పలయొక్కయు, కదంబము = సమూదాయము, సగ్గుకాక = పొడి యగుటకు, వికంకట = విపులమయిన, చరమాంగ = వెన్ను చిప్పయొక్కయు, మంథగిరి = మందరాద్రియొక్కయు, ఘట్టనఁ జేసి = రాపిడివలన, ఘురట్టమై = తిరుగలియై కృపాపటిమన్ = దయాతిశయముచే, జగంబున్ = ప్రపంచమును, ప్రోచు నలప్రాక్కమఠంబున్ = రక్షించునట్టి శ్రేష్ఠమయిన ప్రాత కూర్మమును, నినున్, భజించెదన్ = సేవింతును.

సముద్రమథన సమయమున మందరగిరి మునిఁగిపోవ శ్రీవిష్ణువు ఆదికూర్మరూపమును ధరించి శైలమును వీఁపుపై వహించె నను భాగవతకథ నిట ననుసంధించునది. నీరు కదలుట మందరగిరి రొంపి తొలఁగక సున్నమువలెఁ జేయుచుండుటచేత నీటితాకిడిచే బ్రహ్మాండభాండము పగిలి నీరు యువిచ్చకుండుటకైన గారపూయుట ప్రసిద్ధము. కూర్మము మూపుపై తిరగటి పైఁగల్లువలె మందరగిరి తిరుగవలసియున్నది గానఁ దదనుకూలముగను కూర్మము మూఁపు వికంకటమని చెప్పఁబడెను. అలంకారము. ఉత్ప్రేక్ష.

పాత్రములు పగులువారి నీరింకకుండుటకై గారపూయుఁ బ్రక్రమము ఈ పద్యమునందును, పంచమ ఆ. 38 ప. నగచ్చు చేయువిధమును జెప్పఁబడెను.

తా. జలముపైఁ దేలియున్న ధరాతలము విరిగిపోకుండుటకై సున్నపు గచ్చు చేయుటకేమో యనునట్లు తన వెన్నుచిప్ప యాడుగురాయి యయి మందరాద్రి పైనుండుశిలయుఁ గాఁగాఁ దాను తిరుగలియై శంఖములయొక్కయు,

సరి రాత్రించరభీతికై త్రిభువనాస్థానీయవీథిన్ విక
స్వరశోణస్రగలంకృతక్రకచభాస్వత్తోరణస్తంభతన్. 110

టీ. ఓ నృకేసరి = ఓ నృసింహమూర్తీ! ఎద్ది = ఏభుజద్వంద్వము, నభోంతరసీమన్ = గగనమధ్యప్రదేశమందు, దితిజ=హిరణ్యకశిపునియొక్క, ఆంత్ర = ప్రేవులతోడ, సక్త = కలిసిన, నఖసంతానంబుగోన్ = గోళ్ల సముదాయముతో, రాత్రించరభీతికై = రక్కసులవలని భియమునకై, త్రిభువనాస్థానీయవీథిన్ = స్వర్గముయొక్క కొలువుకూటముయొక్క దారియందు, వికస్వర = వికసించిన, శోణ = రక్తవర్ణముగల, స్రక్ = పుష్పమాలికలచేత, అలంకృత = భూషింపఁబడిన, క్రకచ = అంపములచేత, భాస్వత్ = వెలుంగుచున్న, తోరణస్తంభతన్ = గోపురద్వారమునందలి రాట లగుటను, పూనెన్=పూనెనో, అట్టి నీదుభుజయుగ్మంబు=అట్టి నీదోర్యుగము, మమున్, కరుణించున్ = దయఁ జూచును.

హిరణ్యాక్షుఁడు స్వర్గము నేలుచుండ సభామధ్యమున నృసింహమూర్తిచేఁ జంపఁబడె నను పురాణకథ ఇట ననుసంధించునది, ఇందు హిరణ్యకశిపుని ప్రేవులు ఎఱ్ఱనిపూలదండలుగను గోళ్లు అంపములుగను భుజములు తోరణస్తంభములుగను వర్ణింపఁబడెను.

తా. ఓనృసింహమూర్తీ! నీవు హస్తనఖములచేత హిరణ్యకశిపుని పొట్టం గల ప్రేవులు వ్రేలాడఁగా చేతు లెత్తి స్వర్గసభాద్వారదేశంబున నిలిచి యున్నకతి నీ హస్తములు దానవులకు భయము గలిగించుటకై రక్త పుష్పమాలికలచే నలంకారము చేయఁబడిన అంపములుగట్టి నిలిపిన గోపురద్వార పురాటలఁబోలె నుండె, నట్టి నీహస్తద్వయము మమ్ముం గాపాడుంగాక! అలం. నిదర్శనము.

చ. దనుజకులేంద్రదత్తకరతామరసస్థితదానధారచే
ననిమిషదైన్యదుఃఖితమహామునిమండలదృశ్యకశ్యపాం
గనముఖాంబువుల్ గడిగి కంజభవాండము మోవ లీలమైఁ
బెనిచినదంభవామను నుపేంద్రుని నిన్నుసమాశ్రయించెదన్

టీ. దనుజసురేంద్ర = రాక్షసపంక్తిశ్రేష్ఠునిచేత (బలిచక్రవర్తిచేత), దత్త = ఒసఁగఁబడిన, కరతామరస = కరపద్మములందు, స్థిత = ఉన్న, దానధారచేన్ = త్యాగజలధారలచేత, అనిమిష = సురలయొక్క, దైన్య = దీనత్వముచేత, దుఃఖిత = విచారమును బొందిన, మహామునిమండలదృశ్య = సప్తర్షిసముదాయమునందు వీక్షింపఁదగిన, కశ్యపాంగన = కశ్యపప్రజాపతి భార్యయగు నదితియొక్క, నయనాంబువుల్ = నేత్రజలములు, కడిగి, కంజభవాండము = బ్రహ్మాండము, మోవన్ = తగులునట్లు, లీలన్ = సులభముగా, మైన్ = శరీరమును, పెనిచినదంభవామనున్ = ఎదుగునట్లొనర్చిన కపటవామనుని, ఉపేంద్రునిన్ = ఇంద్రసోదరుఁడైనవానిని, నిన్నున్, సమాశ్రయించెదన్ = బాగుగా నాశ్రయించెదను.

మునిమండల దృశ్యకశ్యపాంగన యనుటచే దానధార లొక్కింతన సప్తర్షిమండలమువఱకుఁ బొంగి మాతృశోకము వారించె నని భావము. ఇటు లనుటచే పెరుఁగుటయొక్క వేగాతిశయము సూచితము. ఆముక్తమాల్యద యందు నిటులే పెరుఁగుటయందలి వేగాతిశయము "గ్రస్యూర్ణనన్నగయుంయువ్యాత్తన్మహోచ్ఛ్రాయు" యను వామనవర్ణనభాగముచే సూచింపఁబడినది. దంభవామనుఁడు గాననే కంజభవాండము నంటునటులఁ దనమేను లీలమై పెంపఁజాలెను.

తా. బలిచక్రవర్తిచేఁ బడసిన మూఁడడుగులు దానముగాఁ గొని బ్రహ్మాండమంతయుం నిండిన కపటవామనరూపుని నుపేంద్రుని నిన్ను నేను బాగుగ నాశ్రయించెదను. అలం. పర్యాయోక్తము.

చ. తన దఘసంతతిన్ గనలి తానె వధించినపాపముల్ చెడన్
మునిఁగొడునా రణోగ్రకిణముల్ మొనయంగ శమంతపంచక
మ్మునఁ బితృతర్పణచ్ఛలన మున్కలు వెట్టుభవన్మహాయుగం
బున కిదె వందనంబు భృగుపుంగవరూప విహంగవాహనా.

టీ. భృగుపుంగవరూప = భార్గవోత్తముని యాకారముగల, విహంగవాహనా = గరుడవాహనుఁడా, తనది = తనవలననైనది, అఘసంతతిన్ =

క. పెరుఁగు ప్రలంబునివీఁపునఁ
గరిపైఁ హరివోలె విశదకాంతి నిలిచి త
త్కరణం బారాటముగాఁ
బరిమార్చిననీదుబలిమిఁ బ్రణుతింతు హరీ. 114

టీ. హరీ = నారాయణుఁడా, పెరుఁగుప్రలంబునివీఁపునన్ = పొడవుగా నెదుగుచున్న ప్రలంబాసురునివెన్నునందు, కరిపైన్ = గజముమీఁద, హరివోలెన్ = సింగమురీతిని, విశదకాంతిన్ = స్వచ్ఛమగు ప్రకాశముతో, నిలిచి, తత్కరణంబు = వానిదేహము, ఆరాటము = సంతాపము చెందినది, కాన్ = కాఁగా, పరిమార్చిన నీదుబలిమిన్ = చంపిననీశక్తిని, ప్రణుతింతున్ = పొగడెదను.

శ్రీకృష్ణుఁడు బలరామాదులు భాండీరవటప్రాంతమునందు క్రీడించుతఱిఁ బ్రలంబుఁ డనుదానవుఁడు గోపకుమారులలో నొకఁడై కలిసియుండి క్రీడానియమము ప్రకారము బలరాముని తనపై నెక్కించుకొని యాకారము పెంచి నిజరూపముదాల్చి చంప నెంచ బలరాముఁడు వానిని ముష్టిహతిచేఁ జంపినకథ యిట ననుసంధేయము. ఈకథాంశము హరివంశమునందుఁ గలదు. సింగము తెల్లగనుండునుగాన నిటఁ దెల్లనివాఁ డగు బలరాముఁడు సింగముగను పృథుశరీరుఁడు నీలాంగుఁడు నగు ప్రలంబుఁడు కరిగను నుపమింపఁబడిరి.

తా. బలరామావతార మెత్తి ప్రలంబుఁ డనురాక్షసునిఁ జంపిన విష్ణుదేవుఁడా! నిన్నుస్తోత్ర మొనర్చెదను. అలం. ఉపమ.

తే. కొలుతుఁ దాదృగ్భవద్బాహుకులిశ యష్టి
నెద్ది గిరివోలెఁ గడుపులో వృద్ధిఁబొందఁ
బగిలి రాకాసి దేహంబు మొగపుముత్య
మయ్యె ముంగామురారిరంగై మురారి. 115

టీ. మురారి = మురాసురవిరోధివైన కృష్ణమూర్తీ, ఎద్ది = ఏహస్తము, కడుపులోన్ = కుక్షియందు, వృద్ధిఁబొందన్ = ఎదుగఁగా, రాకాసిదేహంబు

కేశియను రక్కసిదేహము, గిరివోలెన్ = పర్వతమువలెనే, పగిలి, ముంగాము శారిరంగై = ముంజేతికంకణములైరై, (పాముంగైమురారి) మొగపుముత్య మయ్యెన్ = ముఖప్రదేశమందలి ముత్తెము అయ్యెనో, తాదృక్ = అట్టి, భవత్ = నీయొక్క, బాహు=హస్త మను, కులిశయష్టిక్ = వజ్రాయుధమును, కొలుతున్ = సేవించెదను.

ఇందు బుద్ధావతార మభివర్ణితము.

తా. పర్వతమువంటి కేశి యనుదైత్యునినోట హస్తముఁ బెట్టి కుక్షిలో బాగుగాఁ జొనిపి పెద్దది చేసి వానిపొట్ట చీల్చి మృతినొందించితివి. ఆ ప్రకారము వానికుక్షిలో వృద్ధిఁబొంది వానిపొట్టఁ జించినవజ్రాయుధముం బోలిన నీహస్తమును నేను సేవించెదను. అలం. రూపకము.

క. కృతయుగ మేతేర నలం
కృతికై కాశ్మీరపంక మిడి యలుకు క్రియన్
క్షితియెల్ల మ్లేచ్ఛరక్త
ప్లుతముగఁ గావించురౌతుఁ బొగడెద నిన్నున్. 116

టీ. కృతయుగము, ఏతేఁన్ = రాఁగా, అలంకృతికై = పుడమి యొక్క యలంకారమునకై, శుభోదయసూచనమునకు సంతోషము దెలుపు నటుల భూమియంగణము నలంకరించుకొఱకు, కాశ్మీరపంకము = కుంకుమ పువ్వుఁ జేర్చిన పలుచనిగంధజలము, ఇడి = పెట్టి, అలుకు క్రియన్ = అలుకు విధమున, క్షితియెల్లన్ = పుడమియంతయుం, మ్లేచ్ఛరక్తప్లుతముగన్ = నీచ జాతిజనులయొక్క రక్తముచేఁ దడిసినది యగునట్లు, కావించురౌతున్ = చేయునట్టి యశ్వమునెక్కి పోరొనర్చుబంటునయిన, నిన్నున్, పొగడెదన్ = కొనియాడెదను.

భగవంతుఁడు కల్క్యవతారమున మ్లేచ్ఛశాసనము గావించ దొర కొనును. మ్లేచ్ఛులన: చాతుర్వర్ణ్యములకుఁ గలవ్యవస్థలో నేదియుఁ లేని ఆర్యా వర్తమున కావలి ప్రదేశమున నున్న యొకయనాగరకజాతి. మ్లేచ్ఛదేశమును

మనుశాస్త్రము లిట్లుఁ జెప్పుచున్నవి—"చాతుర్వర్ణ్యవ్యవస్థానం యస్మిన్ దేశే న విద్యతే, మ్లేచ్ఛదేశః స విజ్ఞేయః ఆర్యావర్తస్తతః పరమ్." అముక్తమాల్యదాదులందు కీకటజాతి చెప్పఁబడెను. "దేశభేదే చ కీకటః." అమ. మ్లేచ్ఛులన ననార్యు లని గ్రాహ్యము.

తా. ప్రళయమందును వెన్నుఁడను మత్స్యావతారుఁడవై కుంభసంభవుఁ డొసఁగిన వేదంబులఁ బ్రోచినట్టియు, ప్రకాశమునఁ దుష్టులగు మ్లేచ్ఛుల నెల్లఁ జంపి భూమిని పవిత్రముచేయఁ దగువాఁ డగుయశ్వపురాతనుఁడో హరీ! నిన్ను స్తోత్రము చేసెదను. అలం. ఉపమ.

వ. అని ప్రస్తుతించినఁ బ్రసన్నుండయి పాంచజన్యధరుండు వాత్సల్యంబున, వత్సా! వరంబు వేఁడుము, అనుటయును బ్రసాదం బని స్వారోచిషుం డిట్లనియె. 117

టీ. అని, ప్రస్తుతించినన్=స్తోత్రముసేయఁగా, పాంచజన్యధరుండు=పాంచజన్య మను శంఖమును దాల్చిన విష్ణుమూర్తి, ప్రసన్నుండై=సాక్షాత్కరించినవాఁడై, వాత్సల్యంబునన్ = ప్రీతితో, వత్సా = కుమారా, వరంబు వేఁడుము = నీకుఁ గావలసిన వరము గోరుము. అనుటయున్, ప్రసాదంబు=మీదయ, అని = ఇటు లని, స్వారోచిషుండు = స్వారోచిషుఁడను స్వారోచిషమనువు, ఇట్లనియెన్ = ఈ విధముగాఁ బలికెను.

క. దేవ భవద్దాస్యసుఖం
బే వేఁడెద దయఁ దగుదునే సాలోక్యం
బీవే యితరము లొల్లన్
నావుడు నాతనికిఁ బద్మనాభుం డనియెన్. 118

టీ. దేవ = ఓదేవా, భవద్దాస్యసుఖంబు = నీ దాస్యమువలని సుఖము, ఏన్ = నేను, వేఁడెదన్, దయన్ = నీదయచే, తగుదునేన్ = తగిన వాఁడనగుదునేని, సాలోక్యంబు=నీసమీపవర్తనము - నీలోకమున నీ చేరువనే

యందునదృష్టము, ఈవే = ఈనామముద్రా, ఇతరములు = ఇంతకన్న వేఱు కోరికలు, ఒల్లన్ = కోరను, నాపుశుక్ = అనఁగా, ఆతనికిన్ = ఆ స్వారోచిషమనువు, పద్మనాభుండు=హరి, అనియెన్ = ఇట్లు చెప్పెను.

తా. స్వామీ! నీ సేవవలనిసుఖము నేను గాంక్షించెదను. నీవయుతు నేను బాత్రుఁడ నగుచు నేసి నీ సమీపమున సంచరించువృత్తి నిమ్ము. నాకింత కన్న వేఱుకోరికలు లేవనఁగా నాస్వారోచిషునకు హరి యిట్లనియె.

క. సాలోక్యముఁ దుది నిచ్చెద
వేలు మిల ద్వితీయమనువ వీవై నయధ
ర్మాలోలబుద్ధిఁ దిరముగ
వేలుపులకుఁ దపసులకును విధికిఁ బ్రియముగాన్. 119

టీ. సాలోక్యము = నాసమానలోకత్వమును, తుదిన్=చివర, ఇచ్చెదన్. ఈవు = నీవు, ద్వితీయమనువవై = రెండవమనువవై, నయ = నీతి యందును, ధర్మ = ధర్మమునందును, ఆలోల = ప్రియమయిన, బుద్ధిన్=చిత్తముతోఁ తిరముగన్ = స్థిమితముగా, వేలుపులకున్ = సురలకును, తపసులకున్ = మునీశ్వరులకును, విధికిన్ = విధాతకును, ప్రియముగాన్ = సంతోషముగా, ఇలన్ = ప్రదమిని, ఏలుము=కాపాడుము.

తా. నీవు రెండవమనువవై నీతిని ధర్మమును వృద్ధిపఱచి చక్కఁగాఁ బుడమిం పాలింపుము. పిమ్మట నీకు సాలోక్యపదవి నిచ్చెదను.

చ. అని మహిమన్ మనుత్వమున నాతనిఁ బట్టముగట్టి పద్మలో
చనుఁడు విరించి శర్వముఖసర్వసుపర్వులతో నదృశ్యుఁడై
చనిరయె నిజాలయంబునకు శాస్త్రవినిశ్చయయుక్తిదండపా
లనముల నవ్విభుండు ప్రజలన్ బ్రజలట్లరసెన్ గృపామతిన్.

టీ. అని=ఇటులఁ బలికి, పద్మలోచనుఁడు=విష్ణుమూర్తి, మహిమన్ = మహత్త్వముతో, మనుత్వమునకున్ = మనువుయొక్కపదమునకు, ఆతనిన్ =

ఆ స్వారోచిషుని, పట్టముగట్టి = పట్టాభిషిక్తు నొనరించి, విరించి=విధాత, శర్వ = శంకరుఁడు, ముఖ = మున్నుగాఁగల, సర్వ = సకలమయిన, సుపర్వలోక = సురలతోడను, అదృశ్యుఁడై = మాయమయి, నిజాలయంబునకున్ = వైకుంఠమునకు, చనియెన్. అవ్విభుఁడును = ఆ స్వారోచిషమనువును, శాస్త్రవినిశ్చయయుక్తిన్ = శాస్త్రప్రకారము, దండపాలనములన్ = దుష్టశిక్షణ శిష్టరక్షణములచేతను, ప్రజలన్ = మనుజులను, ప్రజలన్ = కన బిడ్డలవలెనే. ("పుత్రస్సూనురపత్యం చ తుక్తోకం చాత్మజః ప్రజా" ధనంజయనిఘంటువు.) కృపామతిన్ = కరుణతోఁ గూడినచిత్తముతో, అవనిన్ = పాలించెను.

తా. అని స్వారోచిషుని మనుపదంబునకుఁ బట్టాభిషిక్తుఁ గావించి సర్వసురలతో హరి యంతర్ధానము కాఁగా స్వారోచిషుఁడును మనుత్వముం బూని శాస్త్రపద్ధతి ననుసరించి, దుష్టులను శిక్షించుచు శిష్టులను రక్షించుచు మనుజులయందుఁ దయగలవాఁడై ధరణిం బాలించెను.

సీ. వానలు సరవితో వర్షించె సస్యముల్
  వేళ్ళఁ గొల్చుగ బిట్టవీఁగి పండె
నారోగ్యపుత్రపౌత్రైశ్వర్యవంతులై
  బ్రదికిరి నూఱేండ్లుఁ బంచజనులు
పూవుఁబోఁడులు పతిదేవత లైరగ్ని
  భయతస్కరవ్యాధిభయము లడఁగె
ఫలపయఃకుసుమాదిబహుపదార్థంబులు
  రసగంధసామగ్రి నెంక మెసఁగె
తే. నీత్యుపద్రవమృత్యురాహిత్యయుక్తి
  ధరఁ బ్రజావృద్ధి తామరతంప మయ్యె

న్యాయపథమున స్వారోచిషాఖ్యమనువు
శ్రీలఁ బెంపొంది పాలించు కాలమునను. 121

టీ. స్వారోచిషాఖ్యమనువు = స్వారోచిషుఁడను నామముగల రెండవమనువు, శ్రీలన్ = సిరులచేత, పెంపొంది = వృద్ధిఁబొంది, న్యాయపథమునన్ = న్యాయమార్గముచేత, పాలించు కాలమునన్ = పరిపాలించు సమయమందు, ధరన్ = పుడమియందు, వానలు, సరవితోన్ = క్రమప్రకారము, వర్షించెన్ = కురిసెను, సస్యములు, చేళ్లన్ = చేళ్లయందుఁగూడ, కోల్చుగన్ = ధాన్యము గలవిగా, విఱ్ఱవీఁగి = మిక్కిలి పొడవుగా నెదిగి, పండెన్ = ఫలించెను. "కోలుచు" అన ధాన్యమనుటకు—సీ. "వాన, కారు కాలంబునఁ గల్గనేరియుఁ గోల్చుఁ గావింపనేర్చునేకలవిధమున." పంచ. జనులు = మనుజులు, ఆరోగ్య = వ్యాధిలేమియు, పుత్ర = కుమారులు, పౌత్ర = మనుమలు, ఐశ్వర్యవంతులై = భాగ్యము కలవారై, నూఱేండ్లును = నూఱు వత్సరములును, బ్రదికిరి. పూవుఁబోఁడులు = సుందరులు, పతిదేవతలైరి = పతివ్రతలుగాఁ జరించిరి. అగ్నిభయ = వహ్నివలని భీతియు, తస్కర = చోరుల వలనివియు, వ్యాధి = వ్యాధులవలనివియు నయిన, భయములు, అడఁగెన్. ఫల = ఫలములు, పయః = క్షీరములు, కుసుమ = పుష్పములు, ఆది = మున్నగాఁ గల, బహువిధపదార్థములు అనేకవస్తువులు, రస = షడ్రసములయొక్కయు, తీపి పగరు లోనగు గాఁటురుచులయొక్క యనుట. గంధ = సౌరభములయొక్కయు, సామగ్రిన్ = సంపూర్ణతచేత, ఎసక మెసఁగెన్ = మిగుల వృద్ధినొందెను. ఈతి = అతివృష్టిమున్నగు, ఉపద్రవ = బాధలును, మృత్యు = అకాలమరణములును, రాహిత్య = లేకపోవుటతోడి, యుక్తిన్ = కలయికచేత, ప్రజావృద్ధి = ప్రజలయొక్క యభివృద్ధి, తామరతంపము = తామరయల్లుకొనినట్లు, (పా—తామరతంపర.) అల్లుకొనినది, అయ్యెన్ = ఆయెను.

ఈతిబాధలు ఆఱు. అవి—

శ్లో "అతివృష్టి రనావృష్టి ర్మూషకాః శలభాశ్శుకాః,

అత్యాసన్నాశ్చ రాజానః షడేతా ఈతయః స్మృతాః."

ఇఁకఁ బ్రశస్తి యను నిర్వహణసంధ్యంగము "స్వదేశాదిశాన్తిస్తు ప్రశస్తిరభిధీయతే" అను నాలంకారికనిబంధనానుసారముగ శ్రవ్యప్రబంధ రీతి ననుకూలముగఁ జెప్పఁబడెను. ఇటులె మనుచరిత్రమునందును—సీ. "ఆ రాజువిమలవిఖ్యాతి" ఆ. 6. ప. 99 యందుఁ జెప్పఁబడుట యారయఁదగినది.

తా. స్వారోచిషమనువు పుడమిం బాలించునప్పుడు సమయమునకు వర్షములు కురియుచుండెను. పంటలు బాగుగాఁ బండెను. ప్రజలు సంతానవంతులై భాగ్యసంపదలచే నూరేండ్లు బ్రదుకుచుండిరి. అగ్నివలనను చోరులవలనను భయము లేకుండెను. వ్యాధు లడంగెను. పండ్లు పాలు సౌరభద్రవ్యములు పుష్పములు సమృద్ధిగా నుండెను. ఈతిబాధలు అకాలమరణములును లేక తామర కొలనుకొనినరీతిని చుట్టరికములచే నలముకొని మనుజులు వృద్ధి నొందిరి.

క. కోరిక నీస్వారోచిషు
చారిత్రము వినిన వ్రాయఁ జదివిన ధనధా
న్యారోగ్యపుత్రవంతులు
నై రూఢిగఁ గంద్రు పిదప నమరత్వంబున్. 122

టీ. ఈ స్వారోచిషుచారిత్రమున్ = ఈ స్వారోచిషమనువుయొక్క కథను, కోరికన్ = వాంఛతో, వినినన్, వ్రాయన్ = వ్రాసినను, చదివినన్, ధన=ధనము, ధాన్య = ధాన్యము (కొలుచు), ఆరోగ్య = రోగములేమియు, పుత్రవంతులును ఐ = కుమారులుం గలవారై, పిదపన్ = పిమ్మట, రూఢిగన్ = సత్యముగా, అమరత్వంబున్ = దేవత్వమును, కంద్రు = పొందెదరు.

తా. ఈ స్వారోచిషుని చరిత్రమును గోరికతో వినినను వ్రాసినను జదివినను ధనధాన్యారోగ్యములు కలిగి పుత్రవంతులై పిదప నిశ్చయముగా దేవత్వముం గాంచెదరు.

తే. అనిమృకండుతనూభవుఁ డనుఁగుశిష్యుఁ
డైన క్రోష్టికి వినిపించినట్టియాక

థాసుధాధార నించిరి దయదలిర్ప
జైమినిశ్రుతిపుటముల శకునివరులు. 123

టీ. అని, మృకండుతనూభవుఁడు = మార్కండేయుఁడు, అనుగుశిష్యుఁడు = ప్రియశిష్యుఁడు, ఐన క్రోష్టికిన్ = అయినట్టి క్రోష్టి యను నాతనికి, వినిపించినట్టి = చెప్పినట్టి, ఈకథాసుధాధారన్ = అమృతధారంబోలె సంతోషమును గలిగించు నీ కథను, శకునివరులు = పక్షిశ్రేష్ఠులు, దయదలిర్పన్ = దయ యొప్పుచుండఁగా, జైమిని శ్రుతిపుటములన్ = జైమినిమునీశ్వరుని శ్రుతిగోళములయందును, నించిరి = నిండించిరి.

తా. పూర్వము మార్కండేయుఁడు ప్రియశిష్యుఁడైన క్రోష్టియను మునికిఁ జెప్పిన యీ పుణ్యచరిత్రమును పక్షులు జైమినికిఁ జెప్పినవి.

శా. వ్యాయామస్థిరసంధిబంధ కటకాధ్యక్షానుగక్షోణిభృ
త్కాయగ్రావభిదావిధాభిదురదోఃఖడ్గాగ్ర యుగ్రాచల
జ్యాయఃకీర్తిభరప్రపంచ వరపంచారామరామామణీ
గేయామేయజయాంక పంకజదృగంగీకారధీరాకృతీ. 124

టీ. వ్యాయామ = సాముపలన, స్థిర = నిలుకడనొందిన, సంధిబంధ = కీళ్లయొక్క చేరికగలవాఁడా, కటక = కటక మను పురముయొక్క, అధ్యక్ష = అధ్యక్షుఁ డయిన గజపతిరాజును, అనుగ = అనుసరించి తిరుగువారైన, క్షోణిభృత్ = నృపాలురయొక్క, కాయ = శరీరములనెడి, గ్రావ = పర్వతములయొక్క, భిదా = భేదనాకారమైన, విధా = వ్యాపారమందు, భిదుర = వజ్రాయుధమైన, దోఃఖడ్గాగ్ర = చేతికత్తి మొనగలవాఁడా, గజపతియొక్క యంగరక్షక బలము నంతయుఁ జెండాడినవాఁడా యనుట. ఉగ్రాచల = కైలాసపర్వతముకంటెను, జ్యాయః = మిక్కిలి శ్రేష్ఠమైన, కీర్తిభర = ఎక్కువ కీర్తితోఁ గూడిన, ప్రపంచ = జగత్తుగలవాఁడా, లోకమునం దంతటను వ్యాప్తినొందిన నిర్మల మగు కీర్తిగలవాఁడా యనుట. వర = ఉత్తమమయిన, పంచారామ = అమరారామ, కొమరారామ, భీమారామ, క్షీరారామ, దాక్షా

రాముని లను సైన్య దారానుగులతోఁ గూడిన దేశమునందలి, రామామణీ = సుందరీమణులచేత, గేయ = పొగడఁబడిన, అమేయ = హద్దులేని, జయాంక = జయ చిహ్నములు గలవాఁడా, పంచారామపరిష్కృత మగుదేశము నాక్రమించుకొని యచట యున్న మిన్నలచేఁ బొగడికఁ గొన్నవాఁడా యనుట. పంకజ దృక్ = పద్మదళమువంటి నేత్రములు గల సుందరులయొక్క, అంగీకార = అనుమతిగల, ధీర = స్వతంత్రమైన, అకృతీ=రూపముగవాఁడా! గంధవతీజన సమ్మోహనకరమైన సుందరాకారము గలవాఁడా శ్రీకృష్ణదేవరాయా యని సంబోధనము.

తా. అంగమురొక్క యవనాశములన్నియుం ద్రుఘపమునట్లు సేయు చేసినట్టివాఁడవును, గజపతిరాజుతోఁ గూడియున్న విరోధినృపాలు శరీరము లనెడి పర్వతములను గొట్ట వజ్రాయుధ మగు కత్తిరి కరంబున ధరించినవాఁడవును, రజతాద్రింబోలెఁ బ్రకాశించు యశస్సు ప్రపంచమునం దంతటను నలమికొనఁగాఁ బ్రవర్తించువాఁడవును, పంచారామదేశంబును జయించి వశ పఱుచుకొని యా దేశ సుందరులచేఁ బొగడఁబడిన వాఁడవును, రమణీమణుల కానందమయిన సౌందర్యము గలవాఁడవు నయిన కృష్ణదేవరాయా! అలం-రూపకము.

క. కాంతాలతాంతశర యే
కాంతికభక్తిప్రతోషితాంభోధిసుతా
కాంతా ప్రతాపరవిశశి
కాంతాయితవిమతనృపతికాంతాహృదయా. 125

టీ. కాంతా=సుందరీమణులకు, లతాంతశర=మదనుఁడా, ఏకాంతిక = నిరభిమానమగు, భక్తి = భక్తిచేత, ప్రతోషిత = మిక్కిలి సంతోషింపఁ జేయఁబడిన, అంభోధిసుతాకాంతా=లక్ష్మీనాథుఁడగు విష్ణుమూర్తిగలవాఁడా! ప్రతాప = కాంతియనెడి, రవి = భాస్కరునిచేత, శశికాంతాయిత = చంద్రకాంత రత్నములవలె నగుచున్న, విమతనృపతి = విరోధినృపాలుర యొక్క, కాంతా=సుందరులయొక్క, హృదయ = చిత్తములుగలవాఁడా.

తా. రమణీజనులను భోగము గలిగించుటయందు మన్మథుఁడవును, విష్ణుమూర్తి నాశ్రయించు విప్రవరులను మించి సేవకుఁడవును, చంద్రకాంత మణులను గాంతిహీనముగాఁ జేయు కీర్తి సూర్యునివిధమున విరోధిరాజుల భార్యలయొక్క మనోవికాసము నుడిగించు ప్రతాపముగల కృష్ణదేవరాయా. అలంకారము.

వనమయూరము—

రాజపరమేశ ఫణిరాజబల ఫుల్లాం
భోజముఖ భూపముఖభూపవిపులాంసో
త్తేజితధరాభరణదీక్షితభుజా ని
ర్వ్యాజభయదాజివిజితారినృపరాజీ. 126

టీ. రాజపరమేశ = రాజపరమేశ్వరుఁ డను బిరుద చిహ్నములుగలవాఁడా. ఫణిరాజబల = ఆదిశేషునిశౌర్యము గలవాఁడా, ఫుల్లాంభోజముఖ=వికసించిన పద్మమువంటి మోముగలవాఁడా, భోజముఖ=భోజరాజు మున్నగు, భూప=నృపాలురయొక్క, విపుల=విస్తృతములైన, అంస=భుజముల చేత, ఉత్తేజిత=మెఱుఁగిడఁ బడిన, ధరా=పుడమిని, భరణ = భరించుటయందు, దీక్షిత=ప్రతమునుబూనిన, భుజా=బాహువులుగలవాఁడా. నిర్వ్యాజ=హేతువు లేని, భయద=భీతినొసఁగునట్టి, ఆజి = పోరులయందు, విజిత = గెలువఁబడిన, అరినృప=విరోధినృపాలురయొక్క, రాజీ = సమూహము కలవాఁడా!

తా. రాజపరమేశ్వర బిరుద చిహ్నము గలవాఁడవును, ఆదిశేషునివంటి బలము గలవాఁడవును, వికసించిన పద్మమువలె నాహ్లాదకర మగు నిగానగు మోముగలవాఁడవును, భోజరాజు మున్నగు రాజులచేఁ బాలింపఁబడినజగతీమండలముఁ బాలించువాఁడవును, భయము గలుగఁజేయు యుద్ధముల విరోధులను గెలిచి వాసిఁ గాంచినవాఁడవు నైన కృష్ణదేవరాయా!

గద్యము. ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజారాధనసమానసేందిందిర నందవరపురవం

శోత్తంస శఠకోపతాపసప్రసాదసమాసాదిత చతుర్విధకవితామతల్లికాల్లసాని చొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్య ప్రణీతం బయినస్వారోచిషమనుసంభవం బనుమహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము.

టీ. శ్రీచ...ప్రణీతంబు - శ్రీమత్ = విద్యాసంపద గల, ఆంధ్రకవితా పితామహ = ఆంధ్రకవిత్వమునకు బ్రహ్మగానుండును, సర్వతోముఖ = అంతట వ్యాప్తి కల, అంక = బిరుదుగలిగినట్టియును, పంకజాక్ష = విష్ణుని యొక్క, పాదాంబుజ = పాదపద్మములందు, అధీన = వశమైన, మానసేందిందిర = మనస్సనెడు తుమ్మెదగలట్టియును, నందవరపురవంశోత్తంస = నందవరమనెడి యూరివారి వంశమున (నందవరీకకులమున) శ్రేష్ఠుఁడగు నట్టియును. శఠకోప తాపస = శఠకోపయతియొక్క, ప్రసాద = కృపచే, సమాసాదిత = పొందఁబడిన చతుర్విధ = నాలుగువిధములగు (బంధ, చిత్ర, గర్భ, ఆశు కవనములు.) కవితామతల్లిక = శ్రేష్ఠకవిత్వముగలట్టియును, అల్లసాని చొక్కయామాత్య పుత్త్ర = అల్లసాని చొక్కయమంత్రికిఁ గుమారుఁడగు నట్టియును, పెద్ద నార్య = పెదనార్యునిచే, ప్రణీతంబు = రచియింపఁ బడినది, మహాప్రబంధంబునందున్ = మహాకావ్యమున, షష్ఠాశ్వాసము.

ఇది శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనా సమాసాదితాఖండ సాహితీ ధురీణుండు నాత్రేయగోత్రపవిత్రుండు వావిళ్లవంశపయోరాశిరాకాసుధా కరుండు నగు రామస్వామిశాస్త్రి చేత ననేకపూర్వవ్యాఖ్యాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచింపఁబడిన రుచిసమాఖ్యానం బగు ప్రతిపదార్థరూపం బగు వ్యాఖ్యానంబునందు షష్ఠాశ్వాసము.

---

చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1951.

| గద్యపద్యములు. | పుట. | గద్యపద్యములు. | పుట. |
|---|---|---|---|
| క. అతనికి యదు తుర్వసు | 22 | తే. అనిన నేమిచేసెం | 153 |
| మ. అతిసౌందర్య | 629 | తే. అనినఁ బ్రవరుండు | 138 |
| ఉ. అత్తఱిఁ బట్టణంబు | 523 | క. అనినఁ బరదేశి | 73 |
| క. అత్తఱి గంధర్వవిభుం | 314 | చ. అనినఁ బ్రసన్నుఁడై | 482 |
| ఉ. అత్తఱి వేసికాండ్రు | 373 | మ. అనినన్ విప్రవరుండు | 75 |
| క. అత్తరి మునిపపు | 609 | వ. అనిన విని యమ్మ | 77 |
| తే. అత్తెఱంగున | 611 | వ. అనిన విని శైబిని | 577 |
| వ. అత్తఱిం దత్తఱంబున | 387 | వ. అనిన విని తరువాతి | 459 |
| శా. అతులక్షాంతి | 577 | మ. అనినం గన్నులు | 479 |
| క. అడిగాకేనిటు | 309 | మ. అనినం జిత్తము | 313 |
| వ. అది యట్లుండె | 67 | తే. అని నిజోదంత | 495 |
| తే అనఁగ నేపట్టివాఁడ | 472 | క. అని పలుక | 655 |
| తే. అనఘ మందా | 598 | వ. అని పలికి పాన్పు | 207 |
| వ. అనంతరంబ | 324 | వ. అని పలుకు నమ్మ | 639 |
| వ. అనంతరంబ | 254 | వ. అని పలికి యక్కులకాంత | 228 |
| క. అన విని వచ్చి | 238 | వ. అని పలికి యక్కలికి | 222 |
| లయగ్రా. అన్నగముపై | 493 | క. అని పొగడుచు | 261 |
| ఆ. అన్నగాగ్ర మెక్కి | 298 | వ. అని ప్రస్తుతించినన్ | 680 |
| ఆ. అన్యసతులయందు | 656 | మ. స్ర. అని బాహాస్ఫోట | 433 |
| మ. అని చింతించుచు | 119 | చ. అని మహిమన్ | 681 |
| క. అని తన కథ నెఱిఁగిం | 122 | తే. అని మృకండుఁడు | 684 |
| క. అని తలఁచి యవ్విలాసిని | 247 | మ. అనిమేషస్థితి | 115 |
| క. అని తెలిపి తిరుగు | 443 | క. అని యాతనిపై | 436 |
| వ. అనిన నక్కుహనా | 145 | క. అని యాసగలుగ | 289 |
| వ. అనిన నర్మగర్భంబు | 123 | క. అని రొప్పదేన | 11 |
| వ. అని నత్తెఱవ | 139 | క. అని రొదఁబడ | 212 |
| క. అనినఁ దలంపున | 408 | వ. అని రహస్యంబుగా | 631 |

| గద్యపద్యములు. | పుట. |
|---|---|
| తే. అని వరూథిని | 316 |
| వ. అని విసర్జించి | 168 |
| వ. అని వితర్కించుచు | 305 |
| వ. అని సంస్తుతించిన | 156 |
| తే. అనుచుఁ గ్రమ్మఱ | 95 |
| తే. అనుచు నిందించి | 225 |
| తే. అనుచుఁ బగచాటి | 626 |
| మ. అనుచుం జందన వంక | 516 |
| తే. అనుచుఁ దన్నొడ | 143 |
| శా. అనుటయుఁ బ్రవరుం | 132 |
| చ. అనుటయు మాట | 146 |
| క. అనుటయు రస | 76 |
| క. అనుటయు శుచిరై | 428 |
| వ. అనుటయుం దరువాతి | 317 |
| క. అనుటయు మృగయా | 343 |
| క. అను వెడ | 448 |
| చ. అనువగు సుళ్ళ | 305 |
| క. అన్నన గను | 298 |
| చ. అపరిమితానురాగ | 256 |
| తే. అపుడు గంధర్వపతి మహి | 465 |
| ఉ. అప్పుడు తూర్యముల్ | 549 |
| తే. అపుడు మెడగోయ | 627 |
| ఆ. అపుడు విస్మితాత్ముఁడై | 468 |
| ఉ. అబ్బురపాటు | 109 |
| సీ. అభ్రమండలి | 485 |
| చ. అభిరతిఁ గృష్ణరాయఁడు | 20 |
| వ. అభ్యుదయ పరంపగా | 47 |

| గద్యపద్యములు. | పుట. |
|---|---|
| తే. అమలమణిమయ | 107 |
| క. అమ్మేటివిద్య | 598 |
| మ. అరవిందాక్షులు | 635 |
| సీ. అర్ధచంద్రుని తేట | 248 |
| చ. అలకనిజీవలో | 610 |
| మ. అలకాత్రిప్రభు | 34 |
| చ. అలరుల బంతి | 530 |
| క. అల్లదె కంటె | 334 |
| చ. అలికులవేణి యొక్కతె | 530 |
| వ. అవధరింపుము | 163 |
| వ. అవధరింపు | 583 |
| వ. అవధరింపుము జైమిని | 83 |
| వ. అవధరింపుము జైమిని | 322 |
| వ. అవధరింపుము శకుం | 465 |
| సీ. అవనతాంగుష్ఠాగ్ర | 574 |
| మ. అవనీశ త్రిదశేంద్ర | 552 |
| సీ. అవ్యయానంత | 668 |
| క. అవి యూతని | 221 |
| క. అవిరళవితరణ | 45 |
| తే. అసురవరుఁడైన | 497 |
| **ఆ** | |
| ఉ. ఆ కమలాక్షి | 273 |
| క. ఆ కమలనాభాసురుఁడు | 292 |
| శా. ఆకూలంబవనీశ | 435 |
| క. ఆ కొలఁకుగాముల | 400 |
| క. ఆ గంధర్వకుమారుఁడు | 295 |
| శా. ఆ దివ్యాపథరాజిచే | 596 |

| గద్యపద్యములు. | పుట. |
|---|---|
| తే. ఆ నృసింహప్రభుండు | 31 |
| ఉ. ఆ పురిఁ బాయకుండు | 50 |
| శా. ఆ భూదేవకుమారు | 163 |
| క. ఆ నందడి | 76 |
| క. ఆ మొఱ వేమఱు | 403 |
| క. ఆ యీశ్వర | 27 |
| క. ఆ ...ర్వేదము | 493 |
| ఉ. ఆ రజనీశబింబ | 595 |
| ఉ. ఆరయ గట్టి రోఁతలకు | 649 |
| క. ఆ రుజ లుడుక్వడ | 426 |
| శా. ఆరూఢస్థితిఁ జంద్రికా | 193 |
| తే. ఆ వరూధిని మణి | 295 |
| క. ఆ విపినాంతరస్థాన | 403 |
| క. ఆ విధము ననంతరంబ | 32 |
| శా. ఆ వేళం బొడగాంచి | 620 |
| తే. ఆ శరావళి నమ్మను | 445 |
| ఆశువ్రజహుత | 559 |
| శా. ఆ శూలం బవనీశ | 221 |
| ఆ సమయంబున | 179 |
| ఆ సమయంబున | 296 |
| ఉ. ఆ సమయంబునం | 382 |
| క. ఆ సమయంబున | 447 |
| ఆ సమయంబున | 502 |
| ఆ సమయంబునం | 603 |
| ఆ సమయంబున | 632 |
| ఉ. ఆ సమయంబునం | 617 |
| తే. ఆ సుధాధాము | 21 |

| గద్యపద్యములు. | పుట. |
|---|---|
| శా. ఆహా ధన్యుఁడ నైతి | 622 |
| ఇ | |
| తే. ఇంక నొక్కటి వినుము | 286 |
| సీ. ఇచ్చెద నీ కస్త్ర | 427 |
| తే. ఇట గృహద్వార | 544 |
| క. ఇటు లవ్వరూథిని | 250 |
| వ. ఇట్లు తననిరూప | 116 |
| వ. ఇట్లరిగి యమ్మహా | 359 |
| వ. ఇట్లా ఖేచరఖేల | 391 |
| తే. ఇట్లు చనుదెంచు | 59 |
| వ. ఇట్లు తలపడి | 448 |
| వ. ఇట్లు తిరిగి యొక్కొక్క | 443 |
| అ. ఇతని వచన | 417 |
| వ. ఇంతయు మిటికంటె | 286 |
| ఉ. ఇంతలుకన్నులుండ | 122 |
| వ. ఇత్తెఱంగున | 535 |
| సీ. ఇందీవరంబుల | 13 |
| ఉ. ఇందునిభాస్య వాఁడనగ | 124 |
| 1-వ క. ఇది శ్రీమదాంధ్ర | 80 |
| 2-వ క. ఇది శ్రీమదాంధ్ర | 161 |
| 3-వ క. ఇది శ్రీమదాంధ్ర | 319 |
| 4-వ క. ఇది శ్రీమదాంధ్ర | 463 |
| 5-వ క. ఇది శ్రీమదాంధ్ర | 580 |
| 6-వ క. ఇది శ్రీమదాంధ్ర | 687 |
| ఉ. ఇనుఁడస్తాద్రికిఁ బోవ | 233 |
| క. ఇరుమూఁడురుచుల | 477 |
| సీ. ఇది కంఠపాశంబు | 354 |

| గద్యపద్యములు. | పుట. |
|---|---|
| వ. ఇవ్విధంబున | 483 |
| **ఈ** | |
| క. ఈకరణి దూఱి | 649 |
| క. ఈ గతి నత్తఱిఁ జెల | 504 |
| క. ఈ తెఱఁగునఁ దోఁచిన | 666 |
| క. ఈ కొలఁది లీ మహీశు | 612 |
| శా. ఈ సాంగత్యము | 144 |
| శా. ఈ మర్యాదను | 285 |
| క. ఈ యుపకారమునకు | 492 |
| క. ఈ రీతి గొంతకాలం | 615 |
| క. ఈ విధమున నయ్యిరువురు | 299 |
| క. ఈవిధమున నుద్యా | 633 |
| క. ఈవిధమున నభ్యాగత | 57 |
| క. ఈవిధమున నతి | 150 |
| **ఉ** | |
| సీ. ఉదయాచలేంద్ర | 11 |
| క. ఉడుగక తలపడుఁ | 113 |
| చ. ఉడుపతిబాలికిన్ | 211 |
| తే. ఉపమానము గరిమిడి | 342 |
| సీ. ఉరగప్రాకార | 250 |
| శా. ఉర్వీశాగ్రిక మామ | 559 |
| చ. ఉరుతరవిగ్రహా | 673 |
| సీ. ఉరుదరీకుహర | 173 |
| మ. ఉషఃసంధ్యాతప | 236 |
| ఉ. ఉల్లమునందు | 3 |
| క. ఉల్లలదల కాజల | 85 |
| **ఊ** | |
| ఉ. ఊసరవెల్లి చందమున | 416 |
| తే. ఊరు పాడైన | 487 |
| **ఎ** | |
| ఉ. ఎంత తపంబు సేసి | 168 |
| క. ఎందుండి యెందు | 60 |
| శా. ఎందే డెందము | 142 |
| మ. ప్ర ఎకరాలన్ | 40 |
| క. ఎక్కడి యపశకునపద | 96 |
| ఉ. ఎక్కడి యూరు | 129 |
| ఉ. ఎక్కడివాఁడో | 116 |
| సీ. ఎపుడుమహాంతలు | 375 |
| ఉ. ఎన్నిభవంబులం | 136 |
| ఉ. ఎవ్వఁడు మీఁదెఱుంగక | 312 |
| ఉ. ఎవ్వతె నీవు భీక | 121 |
| తే. ఎవ్వఁడేఁ బాదలేప | 306 |
| క. ఎవ్వరు చూచిన | 619 |
| **ఏ** | |
| ఉ. ఏకాగ్రత నవ్విప్రులు | 632 |
| శా. ఏగంధర్వుఁడు | 245 |
| సీ. ఏ నవ్విధంబున | 618 |
| ఉ. ఏ నిఁక నిల్లు సేరుటకు | 128 |
| క. ఏయెడ నెడ | 411 |
| శా. ఏ యే దేశములన్ | 65 |
| ఉ. ఏల దురంత వేదన | 242 |
| ఉ. ఏలర యాచలం బుడిగి | 277 |
| క. ఏవంవిధ గుణ | 44 |

| గద్యపద్యములు. | పుట. |
|---|---|
| సీ. ఏ విహంగముగన్న | 179 |
| **ఐ** | |
| క. ఐనంగానిమ్ము | 283 |
| **ఒ** | |
| తే. ఒండొకండదైన | 424 |
| మ. ఒక నేత్రాంబుజ | 532 |
| చ. ఒక పెనుఁబాప | 216 |
| తే. ఒక్కఁడ దడుగొత్తి | 381 |
| క. ఒక్కటె భయశోకంబుల | 405 |
| ఆ. ఒక్క రోజుకుతేఁడు | 332 |
| ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖు | 246 |
| క. ఒడ లబ్బ నిక్క | 386 |
| **ఓ** | |
| ఉ. ఓ చతురాస్యవంశ | 66 |
| క. ఓ చెల్లవిరహిణీభవ | 213 |
| ఉ. ఓయి దయావిహీనమతి | 422 |
| శా. ఓ రాజన్యమహేంద్ర | 407 |
| ఉ. ఓ సరసీరుహాక్షి | 242 |
| ఉ. ఓసి దురాత్మురాల | 418 |
| **క** | |
| శా. కంటే బ్రాహ్మణుఁ | 474 |
| సీ. కందాలిశై రాయఁ | 335 |
| తే. కంపతోడు గీడ్చిన | 386 |
| చ. కటకరవంబు | 551 |
| క. కట్టెఁడితనమున | 279 |
| ఉ. కట్టెనీలిదిండ్లు | 356 |

| గద్యపద్యములు. | పుట. |
|---|---|
| క. కట్టియుఁజేకొని | 342 |
| శా. కట్టెన్ మాంగళసూ | 557 |
| క. కడు నవ్వించుచు | 563 |
| మ. కదిసెన్ లగ్నమటంచు | 522 |
| క. కని తత్తటస్థలంబు | 637 |
| మ. కని నార్వ్వినిసదంబు | 654 |
| క. కని సతులరు | 646 |
| క. కనుఁగొని యంది | 103 |
| ఆ. కప్పవెట్టివెన్ను | 341 |
| ఉ. కమ్మని కుందనంబు | 166 |
| చ. కరకరిగూటఁగట్టి | 237 |
| క. కరకాబిటపట | 330 |
| క. కరుణాకర | 46 |
| మ. కరుణించుక్ మము | 673 |
| మ. కలఁ దుల్లోక | 459 |
| మ. కలయుఁగూర్చి | 533 |
| సీ. కలగుచెల్లువ | 500 |
| తే. కలయు జగమున | 195 |
| సీ. కలశపాథోరాశి | 19 |
| క. కలిమి మెఱయఁగ | 566 |
| **కా** | |
| ఉ. కాంచి కలక్వణత్కనక | 272 |
| క. కాంచి తదీయ | 105 |
| ఉ. కాంచినఁ బొంగి | 505 |
| వ. కాంచి యంతరంగంబునఁ | 84 |
| శా. కాంచెం బుత్త్రు | 662 |
| శా. కాంచెన్ భూవిభు | 64[illegible] |

| గద్యపద్యములు. | పుట. |
|---|---|
| క. కాంతాలోకదంబ | 543 |
| క. కాంతాలతాంతశర | 686 |
| తే. కాయమాకాలగ్రహో | 475 |
| క. కావున దాసీనికరము | 642 |
| ఉ. కావున నెన్నఁడుం | 311 |
| వ. కావున మార్కండేయ | 18 |
| క. కావున వారలఁజూడ | 310 |
| ఉ. కావున వీరిగుండు | 639 |
| **కీ** | |
| ఉ. కీచకనోజ్ఞాంబి | 527 |
| **కు** | |
| క. కుంకె పటురాంబు | 178 |
| క. కుంభరశతాంగ | 508 |
| క. కుంభసమువంటి | 127 |
| ఉత్సా. కుశదు కాశ కరు | 79 |
| క. కుటిలకృతసాంధ్య | 652 |
| సీ. కుశధారాహతి | 101 |
| క. కుశలతయు వ్రతముల | 137 |
| **కూ** | |
| ఉ. కూరిమిమంత్రితోడ | 565 |
| ఉ. కూరాదసేధదంత | 35 |
| **కృ** | |
| క. కృతయుంగ | 679 |
| **కె** | |
| సీ. కెలకులనున్న తలగెటి | 63 |

| గద్యపద్యములు. | పుట. |
|---|---|
| **కే** | |
| శా. కేదారేశు భజించితిగా | 67 |
| **కై** | |
| ఉ. కైదువు నున్న | 439 |
| **కొ** | |
| క. కొట్టువడి | 421 |
| సీ. కొనసాగి | 279 |
| ఆ. కొమ్మకన్నుఁగవకు | 257 |
| చ. కొలకొలఁగూయు | 240 |
| తే. కొలుతుఁదాదృగ్భవ | 678 |
| క. కొలుతుగా మద్గురు | 6 |
| తే. క్రొవ్వి వడగొండ | 380 |
| **కో** | |
| క. కోరిక నీ త్వారోచిన | 684 |
| **గ** | |
| సీ. గంగాతరంగిణీ | 624 |
| శా. గంగాస్వచ్ఛతరంగ | 77 |
| పృథ్వి. గజాశాంతికి | 434 |
| చ గదువ్రన కొత్తఁ జెంగలం | 521 |
| మ. గవిలో వెయ్యాలి కాఁగి | 379 |
| మ. స్ర. గళరక్తక్రోద | 429 |
| సీ. గళితశృంఖలమైన | 446 |
| **గా** | |
| క. గాండీవము నీచేతిది | 221 |
| **గు** | |
| స్ర. గ్రుద్దుగా గోత్రాచలం బుల్ | 327 |

| గద్యపద్యములు. | పుట. |
| --- | --- |
| **నీ** | |
| చ. నీచనుదోయి | 287 |
| ఆ. నీడఁగదవఁబోలు | 439 |
| సీ. నీలమేఘముగు | 664 |
| తే. నీవు ససివింతు | 474 |
| వ. నీ కిట్లు చెప్పి యిట్లు | 291 |
| శా. నీవై శిష్యప్రము | 625 |
| **ను** | |
| చ. నును జిగురాకు | 260 |
| **నృ** | |
| క. నృప యీ క్రోడము | 655 |
| **నె** | |
| సీ. నెత్తమ్ము లేఁగొంద | 414 |
| క. నెల పడఁతియు నెఱి | 372 |
| **నే** | |
| రగడ. నేర్పుమై నల్లయస | 262 |
| **నో** | |
| ఉ. నోములు నోఁచినమ్మలు | 205 |
| **ప** | |
| క. పంకజముఖి కప్పుడు | 114 |
| క. పంకజముఖి విరహుల | 259 |
| సీ. పక్కపక్కున నంఘ్రి | 436 |
| సీ. పచ్చనిమావురుమంజి | 350 |
| క. పతి పతిపై నిడు | 556 |
| మ. పరతత్త్వంబగు | 669 |
| మ. పరమంబైన రహస్యమా | 73 |
| చ. పరవశదైన్య మాడుకొను | 528 |
| క. పరికించుచు | 89 |
| సీ. పరిణమించిరి ధరామర | 563 |
| క. పరితాప మింక | 594 |
| క. పరుల యపరాధ | 424 |
| క. పలుచు నొక కడితి | 378 |
| చ. పలుకులు నేర్పువేళఁ | 235 |
| పంచచా. పలాసిడాసి | 432 |
| చ. పలుకులు వేయుం | 644 |
| చ. పలుచనివా కెలి | 406 |
| మ. పలుచంబొట్టుఁ | 300 |
| చ. పలువురయుఁడు | 640 |
| మ. పవమానష్టపమాన | 253 |
| చ. పసిధారాపతనంబు | 677 |
| సీ. పసిఁడితోరము తోడి | 271 |
| క. పసుపుల నలుఁగిడి | 519 |
| సీ. పసుపునిగ్గులుదేఱు | 92 |
| చ. ప్రభలు నభోవిటంకమున | 546 |
| **పా** | |
| శా. ప్రాంచద్భూషణ | 148 |
| సీ. పాండురప్రభ | 583 |
| ఉ. పాటన సేయమిఁ గుడులు | 229 |
| క. పాటలసుగంధి | 301 |
| క. పాటితకరిదంతద్యుతి | 276 |
| ఉ. పాటున కింతు లోర్తురె | 149 |
| క. పాము కడు పుడిసి | 423 |
| ఆ. పారుఁ దనంగ | 599 |

| గద్యపద్యములు. | పుట. |
|---|---|
| **యా** | |
| ఉ. యావనమందు | 52 |
| **ర** | |
| క. రక్కసుఁడవై వెసఁబడి | 486 |
| క. రమణునికడ | 585 |
| మాలిని. రవిరుచిఁ జంద్రసరేణు | 270 |
| సీ. రసిబింబపటన | 181 |
| **రా** | |
| వనమయూ. రాజదరమేశ | 687 |
| ఆ. రాజుచూడ్కి కధుడు | 553 |
| తే. రాజు తేజస్వియై | 194 |
| క. రారమ్మనుట | 243 |
| శా. రారాపిల్లభుజాంగ | 412 |
| శా. రా వైరాగ్యము | 278 |
| **లీ** | |
| ఉ. లీలఁబలింపఁ డొక్క | 387 |
| **వ** | |
| క. వంచనయొంటిఁగిన | 305 |
| తే. వండ నలయదు | 55 |
| క. వందురి వగలన్ | 629 |
| క. వడిఁగాచితాఁచి | 310 |
| సీ. వదనప్రభూత | 117 |
| మ. వనజాక్షోపమ | 9 |
| సీ. వరణాతరంగిణీ | 53 |
| మ. వరణాద్వీప | 47 |
| ఉత్సాహ. వర్ణనీయకీర్తివైభవా | 318 |

| గద్యపద్యములు. | పుట. |
|---|---|
| తే. వలను పక్కల | 338 |
| చ. వలపుల పల్లవుం | 525 |
| క. వలఁబొటిన వానిని | 383 |
| సీ. వల్లీమతల్లి లావణ్య | 658 |
| క. వసుధేశ మనక్కు దుస్సర | 624 |
| **వా** | |
| ఉ. వాడిన మోమునదమ్మి | 269 |
| క. వాతాపివలన | 217 |
| సీ. వానలు నరపితో | 682 |
| క. వానికిఁబురూరవుండు | 21 |
| ఆ. వాని చక్కఁదనము | 51 |
| ఉ. వానిది భాగ్యవైభవము | 61 |
| తే. వానివంశంబు | 22 |
| శా. వాలారుంగొనగోళ్ల | 234 |
| శా. వ్యాయామస్థిరసంధి | 685 |
| ఆ. వ్యాసరచిత | 9 |
| **వి** | |
| మ. వికసిల్లం బ్రజ | 496 |
| వ. విడియించి యనంతరంబ | 518 |
| క. విడువక తలవై | 220 |
| క. వితరణఖని | 24 |
| క. విధియంతమునఁ ఖనదు | 547 |
| క. విను మదియుఁగాక | 630 |
| చ. విలయకృశానుకీల | 91 |
| చ. విలయ తమిస్ర జాల | 670 |
| సీ. వినమానములుంగాఁగ | 409 |

